MURARY

ANARGHARAGHAVAM

'CHUDAMANI' Telugu Commentary

B. Ramabrahmam

School of Literature

TELUGU UNIVERSITY, RAJAHMUNDRY CAMPUS

BOMMURU - 533 124

Copies : 1000

Price : 80/-

Publication No : 128

For Copies :

Director

PUBLICATIONS DIVISION

Telugu University

PUBLIC GARDENS, HYDERABAD - 500 004.

June 1992

మురారిభట్టు చేది మండలం మాహిష్మతీ నగరంలో నివసించేవాడనీ, క్రీ.శ. 875-925 ప్రాంతంవాడనీ విమర్శకులు భావిస్తున్నారు. ఆయన అద్వితీయ రచన "అనర్ఘరాఘవమ్". సంస్కృత రూపక సాహిత్యంలో ఇదొక అనర్ఘరత్నం. ప్రౌఢపండితులకు నికషోపలం. సంస్కృత కవులనే కాదు తెలుగు కవులనుకూడా చాలామందిని ప్రభావితుల్ని చేసిన కృతి ఇది.

క్రీ.శ. 17వ శతాబ్దిలో ప్రాగటూరు రాజధానిగా అలంపూరు సీమను పరిపాలించిన రాజకవి బిజ్జుల తిమ్మభూపాలుడు - కృష్ణకవి సహాయంతో మొట్టమొదటిసారిగా ఈ అనర్ఘరాఘవాన్ని తెలుగులోకి ప్రబంధంగా సంత రించాడు. దాన్ని 1977లో అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి కేశవపంతుల నరసింహశాస్త్రిగారి పరిష్కరణంతో ప్రచురించింది.

మురారిరచనకు సంస్కృతంలో చాలా వ్యాఖ్యానాలు లభిస్తున్నాయి. తెలుగులోమాత్రం ఇంతవరకూ దీనికి సమగ్ర వ్యాఖ్యానం వెలువడలేదు. తెలుగు విశ్వవిద్యాలయం ఈ లోటు తీరుస్తున్నది.

ప్రముఖ కవిపండితులు, తెలుగు విశ్వవిద్యాలయ సాహిత్యపీఠం ఆచార్యులు బేతవోలు రామబ్రహ్మంగారు ఉపలబ్ధసంస్కృతవ్యాఖ్యానాలన్నీ పరిశీలించి సమగ్ర సుందరంగా ఈ వ్యాఖ్యానాన్ని రూపొందించారు.

భట్టనారాయణుడి వేణీసంహార నాటకానికి లోగడ వీరే ప్రప్రథ మంగా తెలుగు వ్యాఖ్యానం రచించారు. దాన్ని తెలుగు విశ్వవిద్యాలయమే ప్రచురించింది. ఆ అనుభవ పరిపాకంతో ఈ వ్యాఖ్యానానికి మరింత ప్రామాణ్యాన్ని సమకూర్చారు. ఆచార్య రామబ్రహ్మంగారికి నా హార్దికాభి నందనలు. యథాపూర్వంగా ఈ ప్రచురణకూడా అందరి ఆదరాభిమానాలూ చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

హైదరాబాదు
12-5-1992

మీ
సి. నారాయణరెడ్డి

# విషయసూచిక



భూమిక సమకూర్చిన ఉపాధ్యక్షులు శ్రీ సి. నారాయణరెడ్డిగారికి విషయసేకరణలో సలహాలిచ్చిన పెద్దలు శ్రీ ఇ. సాయిబాబాగారికి రూపకల్పనలో సహకరించిన ఓ. యస్. డి. శ్రీ జి. రామకృష్ణారావుగారికి కృతజ్ఞతలు.

— వ్యాఖ్యాత

మురారి

# అనర్ఘరాఘవమ్

"చూడామణి" తెలుగు వ్యాఖ్య

# పీఠిక

సమస్త సాహిత్య ప్రక్రియల్లోను దుఃఖార్తులకు, తాపార్తులకు, శ్రమార్తులకు తాపసులకు-అంటే సమాజంలో సర్వజనులకు హృదయవిశ్రాంతిని కలుగజేసే నాట్య ప్రక్రియ సర్వోత్కృష్టమైంది[1] ఇది భిన్నరుచులైన వారికి అందరికి ఏకసమారాధనం. చాక్షుషక్రతువు.[2] దశవిధ నాట్యప్రక్రియల్లోను నాటకం సర్వరూపకాలకు ప్రకృతి. సమగ్రమైన నాట్యప్రయోగం. ఇది కథావస్తుప్రధానం. దీనిలోని రసవత్తరమైన కథాసంవిధానాన్ని, దాన్ని నాట్యరంగంపై ప్రయోగించిన తీరునుబట్టి ఇది సాహిత్య ప్రక్రియలలో కవి ప్రతిభకు పార్యన్తిక పరీక్షానికషం అని లాక్షణికుల అభిప్రాయం.[3] నాటకీయకథ పురాణేతిహాసప్రసిద్ధం కావాలని, ధీరోదాత్తుడైన నాయకుడుండాలని వీర శృంగారాల్లో ఒకటి ప్రధానరసంగా ఉండాలని సాధారణ సిద్ధాంతం. దీనిని అనుసరించిన వారు, ఉల్లంఘించినవారు ఉన్నారు. ఉల్లంఘించినా కృతకృత్యులైన వారూ ఉన్నారు.

## రామాయణాధార నాటకాలు - 1

రామాయణ భారతాలు అనాదిగా భారతీయ సాహిత్యానికి మూల స్రోతస్సులు. వీటిని ఆధారంగా చేసికొని చాలమంది నాటకకర్తలు నాటకాలను రచించారు. ఇతిహాసమంటే 'చరిత్ర' అనే సామాన్యాభిప్రాయంతో చారిత్రిక పురాణాన్ని ఆధారంగా చేసికొని కూడా నాటకాలు రచింపబడ్డాయి.[4] లాక్షణికుల నియమాలను త్రోసిపుచ్చి స్వతంత్రించిన వాళ్ళు నాటకకర్తలలో ఎక్కువమంది కనిపిస్తున్నారు. ఈ స్వతంత్రత ఎంతవరకు వచ్చిందంటే, రసప్రసిద్ధమైన రామాయణాది కథాంశాలలో కథాపరివర్తనం చేయరాదనే నియమాన్ని[5] కూడా త్రోసిపుచ్చి విశృంఖలంగా కథా సంవిధానాన్ని మార్చిన వారు కూడా ఉన్నారు.[6] రామాయణ కథాధారాలైన నాటకాలలో విశేష ప్రాముఖ్యాన్ని పొందిన నాటకం "అనర్ఘరాఘవం".

---

1. దుఃఖార్తానాం శ్రమార్తానాం తాపార్తానాం తపస్వినాం. విశ్రాన్తిజననం లోకే నాట్య మేతద్భవిష్యతి ॥ [నాట్యశాస్త్రం]
2. దేవానామిదమామనన్తి మునయః కాన్తం క్రతుం చాక్షుషమ్ [కాళిదాసు]
3. "నాటకాన్తం హి సాహిత్యమ్" అని అభియుక్తసూక్తి.
4. ఉదయనకథాప్రధాననాటకాలు, ముద్రారాక్షసాదులు ఇలాంటివే.
5. సన్తి సిద్ధరసప్రఖ్యా యే చ రామాయణాదయః ।
   కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛా రసవిరోధినీ ॥ [ధ్వన్యాలోకం]
6. భవభూతి, రాజశేఖరాదులు.

రామాయణం కథలోని పూర్వార్ధాన్నో, ఉత్తరార్ధాన్నో లేదా ఏ కొంతభాగాన్నో తీసికొని నాటకరచనం చేసినవారే తప్ప, మొత్తం ఒకే నాటకంగా అనువర్తించినవారు లేరు. భాసుడు ప్రతిమ - అభిషేకం అనే నాటకాల్లో రామాయణ కథను అనువర్తించి ఆద్యుడయ్యాడు. ఉత్తర కథను ఈయన విడిచిపెట్టాడు రఘువంశంలో రామునిథను వర్ణించడం వల్లనేమో కాళిదాసు నాటకంగా రామాయణ కథను అనువర్తించలేదు. అయితే రామాయణ కథ నంతటినీ తీసికొని రెండు నాటకాలుగా నిర్మించిన ఘనత భవభూతికే దక్కుతుంది. ఈయన పూర్వరామాయణ గాథను మహావీరచరిత నాటకం గాను, ఉత్తరరామాయణ గాథను, "ఉత్తరరామచరితం" గాను నిర్మించాడు. "బాల రామాయణ" కర్త అయిన రాజశేఖరుడు సీతాకల్యాణానంతర ఘట్టాన్ని రావణవధ వరకు తీసికొని "బాలరామాయణ" నాటకాన్ని రచించాడు. "ఆశ్చర్య చూడామణి" కర్త అయిన శక్తిభద్రుడు అరణ్యవాసం నుండి యుద్ధాన్తంవరకు ఉన్న సన్నివేశాలను నాటకంగా కూర్చాడు. ఇది చక్కటి ప్రదర్శన యోగ్యతగల నాటకం. "ప్రసన్న రాఘవ" కర్త - జయదేవుడు సీతాకల్యాణ ఘట్టంతో ప్రారంభించి యుద్ధాన్త సన్ని వేశాలనే పరిగ్రహించాడు. అద్భుతదర్పణమనే నాటకాన్ని మహాదేవుడనే కవి లంకా సన్నివేశ ప్రధానంగా రచించాడు. హనుమన్నాటకం అనే ఒక నాటకం ఉన్నప్పటికీ అది నాటకం అనడంకంటే చంపూప్రబంధం అనటమే ఉచితం. దీన్నిబట్టి పర్యవసించిం దేమిటంటే, సంపూర్ణంగా రామాయణాన్ని నాటకాలుగా అనువర్తించిన ఘనత భవభూ తికి దక్కితే, భవభూతి నాటకంలోని లోటుపాటుల్ని దిద్దుతూ పూర్వరామాయణ కథను భవభూతికంటే సమగ్రంగా నాట్యరంగంపై అనువర్తించిన ఘనత మురారికే దక్కింది. తరువాతివారికి మురారి ఆదర్శం అయ్యాడు. "అనర్ఘ రాఘవం" సంస్కృత సారస్వతపాథోనిధి మథనంవల్ల ఆవిర్భవించిన అనర్ఘరత్నమే.

## మురారి జన్మ నివాసాదికం - 2

"బాలవాల్మీకి" అనే బిరుదు కల మురారి వర్ధమాన తంతుమతుల పుత్రుడని నాటకంవల్లనే తెలుస్తున్నది.[1] ఈతడు మౌద్గల్య గోత్రుడు. కాశ్మీరదేశంలో ఈ నాటకం చాలా ప్రచారంలో ఉన్నది కనుక ఈ కవి కాశ్మీరదేశీయుడై ఉండవచ్చునని

1. వర్ధమాన తనూజన్మనః తంతుమతీనందనస్య - ప్రస్తావన.

నిర్ణయసాగర్ ప్రతిని సంపాదించిన పండిత శ్రీదుర్గాప్రసాదుగారి మాటనుబట్టి ఊహింపవచ్చు.[1] ఇక్కడ ఇంకో కారణంకూడా ఉంది. కాశ్మీరకులైన మంఖ - రత్నాకరులు తమ కావ్యాల్లో మురారి ప్రశంసచేశారు.[2]

ఇంకోవాదం - ఈతడు చేదిమండలానికి అలంకారమైన కలచురి నరేంద్రుని రాజధాని అయిన మాహిష్మతీ నగరాన్ని వర్ణించడంవల్ల మురారి ఆతని ఆస్థానంలో ఉండిఉంటాడు అని. ఈవిధంగా అతడు నర్మదాతీరవాసి అని. ఈరీతినే అనుసరించి సప్తగోదావరీ ప్రశంసవల్ల ఆంధ్రప్రాంతవాసి అని కూడా విమర్శకులు భావిస్తున్నారు. ఈ వాదాన్ని కీ॥ శే॥ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం రెండో సంపుటంలో వ్రాసిన వ్యాసంలో ప్రతిపాదించారు. పై వాదాలతోపాటు ఈ వాదాన్నిగూడా ఉట్టంకించి కీ॥ శే॥ శ్రీమాన్ ఈయుణ్ణి వీరరాఘవాచార్యులవారు (మా గురువర్యులు) తమ ఉపోద్ఘాతంలో.[3] శ్రీకొమర్రాజు లక్ష్మణరావుగారి వాదాన్నే బలపరచారు. ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. సప్తమాంకంలో ఇలా వర్ణించిన ఘట్టాలు చాలా ఉన్నాయి కనుక, కవి ఆయాప్రాంతాలకు చెందిన వాడని ఎవరు భావించినా కాదనడానికి లేదు. ఇలాగే ఈతడు తద్ధితప్రియత్వాన్ని చూపించడాన్ని బట్టి దాక్షిణాత్యుడు అనవచ్చును కదా అంటే. ఉత్తర భారతంలో మాత్రమే వివాహాది శుభసమయాల్లో (విశేషించి ఒరిస్సా బెంగాల్ రాష్ట్రాలలో) వినిపించే "ఉలూలధ్వని" ని కవి వర్ణించడాన్ని బట్టి ఈతడు ఔత్తరాహుడనవచ్చును కదా ? అనే సందేహానికి కూడా తావున్నది. అనర్ఘరాఘవవ్యాఖ్యాత-దక్షిణ దేశంలో స్త్రీలు వివాహాల్లో ఈ ధ్వని చేస్తారని చెప్పాడు.[4] బహుశః మహారాష్ట్ర దేశంలో కావచ్చును. ఏమైనా ఇవేవీ కవికి సంబంధించిన పుట్టుకను స్పష్టపరచేవిగా లేవు. కాళిదాసాదులలాగే ఈతని విషయంలోనూ సందిగ్ధత యథావస్థితమే.

---

1. అస్య నాటకస్య పఠన పాఠనాదిషు కాశ్మీరేషు ప్రచురః ప్రచారః పు. 2. ని. సా. ప్రతి 1937.

2. కీత్ - సాంస్క్రిట్ డ్రామా. పు 225-6

3. శ్రీ సత్యవోలు కామేశ్వరరావు గారి ఆంధ్రానువాదానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో పు. 2—9.

4. దక్షిణదేశే వివాహాద్యవసరే స్త్రీభిః ఉలూలధ్వనిః క్రియత ఇత్యాచారః ( పు. 172 "వైదేహీకరబంధ" ఇత్యాదిశ్లోకవ్యాఖ్యానం - రుచిపతి)

ఈతడు "కలచురి" ప్రభువుల ప్రస్తావం చేశాడు. క్రీ॥ శ॥ 850 ప్రాంతాన వారు చేదిరాజ్య పాలనం చేసినట్లు చరిత్రకారులు చెప్పుతున్నారు కనుక మురారి 850 కి ముందువాడు కాదని స్పష్టం. 855 - 84 ప్రాంతంలో కాశ్మీరాన్ని ఏలిన అవంతివర్మ ఆస్థానంలో ఉన్న రత్నాకర కవిచే హరవిజయ మహాకావ్యంలో మురారి నామం నిర్దేశింపబడింది గనుక రత్నాకరునికంటే మురారి ముందువాడని కొందరి అభిప్రాయం. అయితే రత్నాకరకవి శ్లోకంలోని విషయం మురారి నాటకానికి వర్తించదు కనుక[1], మురారి రత్నాకరకవికంటే ముందువాడు కాదని మరికొందరి అభిప్రాయం. ఇంచుమించుగా ఎవ్వరూ దృష్టిపెట్టని విషయాలు కూడా 1, 2 మురారి కాలాన్ని నిర్ణయించడానికి తోడ్పడవచ్చు. మురారి తన నాటకంలోని కొన్నిసందర్భాల్లో "శృంగారాద్వైతవాదీ"[2] అని, "జ్ఞానకర్మభ్యాం మోక్షస్వర్గౌ"[3] అని, "బ్రహ్మణో్యతిర్వివర్తస్య"[4]. ఇత్యాదిగా చేసిన శబ్దప్రయోగాలు క్రీ॥ శ॥ 750 ప్రాంతంలోనివారైన శ్రీమచ్ఛంకర భగవత్పాదుల అద్వైత – వివర్తవాదాన్ని, "జ్ఞానాన్మోక్షః" అనే సిద్ధాన్తాన్ని స్ఫురింపజేస్తున్నాయి. ఇలాగే ఏడవ అంకంలో శ్రీరామచంద్రుని శోకాన్ని ప్రశమింపజేయడానికి లక్ష్మణుడు - "కేన పునరేష రసో రసాన్తరేణ తిరస్క్రియతే" అని అంటాడు. ఒక రసం-వేరొక రసంచేత తిరస్కరింపబడటం అనే సిద్ధాన్తవిషయం ఆనందవర్ధనుని ధ్వన్యాలోకంలోనే ప్రసిద్ధం. దీన్నే తరువాతివారు రసవిరోధపరిహార ప్రకారాల్లో నిరూపించారు. ఇక్కడ మురారి వచనం ధన్యాలోకకారుని అభిప్రాయాన్నే పరామర్శిస్తున్నది. దీన్నిబట్టి ఈతడు ఆనందవర్ధనునికంటే తరువాతివాడు. అనేది స్పష్టం. ఆనందవర్ధనుడు క్రీ॥ శ॥ 850 - 900 ప్రాంతాలవాడు. ఇక కావ్యమీమాంసాకారుడైన రాజశేఖరుడు (875 - 925 మధ్యవాడు) తన కావ్యమీమాంసలో "యదిందోరన్వేతి" (అనర్ఘ. 1–58 శ్లో.) అనే శ్లోకాన్ని ఉదాహరించాడు. దీన్నిబట్టి మురారి రాజశేఖరునికంటే పూర్వుడు. అనగా 850 – 900 మధ్యలోనివాడని చెప్పవచ్చును

---

1. కీ॥ శే॥ ఈయుణ్ణి వీరరాఘవాచార్యులవారి - అనర్ఘరాఘవ నాటకోపోద్ఘాతం లోని 11 – 12 పుటలలో ఈ విషయం స్పష్టపరుపబడింది,
2. అనర్ఘ. 7 – శ్లో. 62
3. అనర్ఘ. 3 – శ్లో. 9
4. అనర్ఘ. 1 – శ్లో. 50

# మురారి కవితాప్రశంస - 3

మురారి అపారమైన పరిశ్రమచేసి వ్యుత్పత్త్యభ్యాసాలవల్ల ప్రతిభావంతుడై కావ్యనిర్మాణం చేసినట్లు ఈ క్రింది శ్లోకం స్పష్టపరుస్తుంది.

దేవీం వాచముపాసతే హి బహవః సారం తు సారస్వతం
జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః ।
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీరతామ్
ఆపాతాళనిమగ్నపీవరతనుః జానాతి మంథాచలః ॥

సరస్వతి నుపాసించినవారు చాలామంది ఉండవచ్చును. కాని, సారస్వత సారాన్ని గురుకులక్లేశాలు అనుభవించిన మురారితప్ప ఇతరులు ఎరుగరు. సముద్రం పైనుండి ఎందరో వానరులు దూకి ఉండవచ్చు. కాని దానిలోతు 'మందర' పర్వతానికే సదా తెలుసును. ఈ శ్లోకం వెనుక కావ్యనిర్మాణానికి కారణం ఏమిటి అనే నిగూఢ సాహిత్య శాస్త్రవిషయం ఇమిడిఉంది. ఆలంకారికులలో రెండురకాల వాదాలు కావ్య కారణం విషయంలో ఉన్నాయి. 1. కొందరు కవిత్వం పుట్టటానికి దేవతామహా పురుషాద్యనుగ్రహంవల్ల కల్గిన జన్మాంతరీయం లేదా ఏతజ్జన్మీయమైన అదృష్టము. దానివల్ల పుట్టిన "అపూర్వ ప్రతిభ" కారణం అని అంటారు.[1] ఇటువంటి అపూర్వ ప్రతిభ ఎందరికో ఉండదు, ఇటువంటివారినే మహాకవులంటారు. ఇటువంటివారు ఇద్దరో ముగ్గురో, ఐదారుగురో ఉంటారని ఆనందవర్ధనుడు అంటాడు.[2] అయితే ఇలాంటి ప్రతిభ లేనివారు ఇక కావ్యనిర్మాణం చేయలేరా? అంటే నిరాశపడక్కర లేదని మరికొందరు - కఠోరపరిశ్రమ - అభ్యాసం ఉంటే కావ్యం నిర్మించవచ్చునని అంటారు.[3] ఈ రెండురకాల వాదాలు ఒకటి "అదృష్టం" మీద ఆధారపడినదైతే, రెండవది - "పురుషప్రయత్నం"పై ఆధారపడినవాదం. మురారి తాను రెండవకోవకు చెందినవాడినని స్పష్టపరుస్తున్నాడు. మొదటిరకం కవిత్వం - అయాచితం అప్రయత్న లభ్యం అయిన ధనం అయితే, రెండవది చెమటోడ్చి సంపాదించుకున్న ధనం. మొదటి దాన్ని సంపాదించే అర్హత కలవారు అరుదైతే రెండోదాన్ని సంపాదించడానికి శ్రమపడే ప్రతివాడూ అర్హుడే. మొదటిది నిరాశావాదానికి (పెసిమిస్టిక్ వ్యూ); రెండవది

---

1. కావ్యం తు జాయతే కస్యచిత్ ప్రతిభావతః (భామహః)
2. ద్విత్రాః పంచషా వా మహాకవయః (ఆనంద)
3. న విద్యతే యద్యపి పూర్వవాసనాగుణానుబంధి ప్రతిభానమద్భుతమ్ (దండి)

ఆశావాదానికి (ఆప్టిమిస్టిక్‌వ్యూ) నిదర్శనం. మురారి నాటకం ఆద్యంతం – మురారి చేసిన కఠోరశాస్త్ర పరిశ్రమను "శ్రమసౌందర్యాన్ని" సాక్షాత్కరింపజేస్తుంది. కనుక కొందరికి[1]. (ఈ పరిశ్రమను అర్థంచేసుకోలేని "విల్సన్" పండితునివంటివారికి) మురారి కవిత్వం "తిక్క"గా కనిపించితే అది వారి సంస్కారానికే నిదర్శనం తప్ప. మురారి కవిత్వంలోని దోషంమాత్రం కాదు, అందువల్లే —

యే శబ్దశాస్త్రనిష్ణాతా: యే శీలితనిఘంటవః ।
తేషామేవాధికారోఽస్తి మురారికృతనాటకే ॥

అన్న ప్రశంసనుబట్టి వ్యాకరణశాస్త్రంలోను, నిఘంటువులలోను సామాన్య పరిచయమైనా లేనివారు మురారి నాటకాన్ని ప్రశంసించలేరు. మురారి కూడా స్వయంగా ఇలా చెప్పుకున్నాడు —

"న శబ్దబ్రహ్మోత్థం పరిమళమనాఘ్రాయ చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు ॥"

శబ్దబ్రహ్మ పరిమళాన్ని ఆస్వాదించకుండా కవుల గంభీరవాక్కులలో గుణదోషాలను ఎవ్వడూ ఎన్నకూడదని అభిప్రాయం. ఇటువంటివారినే శ్రీహర్షుడు కూడా మందలిస్తాడు —

"శ్రద్ధారాద్ధగురుశ్లథీకృతదృఢగ్రంధి: సమాసాదయత్వేనం" అని-అంటే శ్రద్ధగా ఇటువంటి శాస్త్రవైదుష్య సంపన్నులైన కావ్యాలలోని రహస్యాలను గురువువద్ద తెలిసికోవాలేతప్ప తమకు అర్థం కాలేదుకదా అని "పాషాణపాక ప్రభువుల"ని నిందించరాదని తాత్పర్యం. "మురారి పద చింతాచేత్తదా మాఘే మతిం కురు" అని "మాఘుర్త్యైరఘువాం మురారివచసామాస్వాది యైః స్వాదిమా" అని[2], సుకవిహిత మురారి బోధముద్రః' అని[3], 'హృదయా-కలితాశేష శబ్దశాసన సంవిదః । మురారేరిహ శబ్దార్థతత్త్వం కో వేద తద్వద॥' అని[4], ఇలా అనేకులు సంస్కృత కవి పండితులు ఇలాగే ఆంధ్రప్రబంధ

---

1. ఈ విషయంలో మా గురువర్యులు శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీర రాఘవాచార్యుల వారి ఉపోద్ఘాతం చూడండి.
2. రఘువీర చరితంలో - సుకుమారకవి.
3. కమలినీకలహంస నాటికలో - రాజచూడామణిదీక్షితులు.
4. అనర్ఘరాఘవ వ్యాఖ్యలో - హరిహరపండితుడు.

కర్తలు[1] కూడా, మురారి పదశయ్యను, పాండిత్యాన్ని కొనియాడారు. కథాసంవిధాన, కల్పనాచాతుర్యాలలో ఈతడు భవభూతిని అతిశయించాడనేది కూడా విద్వాంసులలో ప్రసిద్ధమే[2].

## అనర్ఘరాఘవ నిర్వచనం - 4

మాయురాజు రచించిన "ఉదాత్తరాఘవం" అనే పేరును ఆలంబనంగా చేసికొని నాటకకర్త "అనర్ఘరాఘవం" అనే పేరు పెట్టి ఉండవచ్చును. ఉదాత్తరాఘవం దశరూపకావలోకనాదులలో ఉదాహరింపబడిందే తప్ప పూర్తిగా దొరకటం లేదు. మురారి తరువాతివారు ఈ నామకరణ శైలిని అనుసరించారు. ప్రసన్నరాఘవం, ఉల్లాఘరాఘవం ఉన్మత్తరాఘవం మొదలైనవి కొన్ని. అనర్ఘమంటే అమూల్యమైనది, పూజనీయమైనది అని అర్థం. అనర్ఘః రాఘవః యస్మిన్ తత్ అనర్ఘరాఘవమ్ పూజనీయుడగు రాఘవుని గురించి ప్రాముఖ్యమిచ్చిన నాటకం కనుక అనర్ఘరాఘవం అని నాటక వ్యాఖ్యాత రుచిపతి మిశ్రుని వివరణ. 'అభిజ్ఞాన శాకుంతలం, మృచ్ఛకటికం, ముద్రారాక్షసం మొదలైన రూపకాల్లాగా కథలోని ప్రధాన సన్నివేశాన్ని దృష్టిలో పెట్టుకొని కాక, కవి మొత్తం రామపాత్రను, రామాయణంలో దానికి గల ప్రాధాన్యాన్ని ప్రతిపాదించేవిధంగా సూటిగా నామకరణం చేశాడు. అందువల్ల రాఘవుని ఉదాత్త చరిత ప్రతిపాదనమే ఈ నాటక రచన లక్ష్యమని నాటకనామం స్పష్టం చేస్తున్నది. నాటకంలో ఎంచుకున్న ప్రతి సన్నివేశమూ రాఘవుని అనర్ఘతను చాటేదిగా ఉండటంచేత నాటకానికి 'అనర్ఘరాఘవం' అనే పేరు అన్వర్థం.

'మునీంద్రసంవాదం' అనే ప్రథమాంకంలో విశ్వామిత్రుని యాగ సంరక్షణం ద్వారా ధర్మ ప్రతిష్ఠాపనకి శ్రీకారం చేయించి రామచంద్రుని అనర్ఘతను ఆవిష్కరించాడు కవి. దశరథునిచేత స్వయంగా - 'అనర్ఘతా రఘుకులే కల్పాంతమస్మిలతు' అని చెప్పించి రఘువంశ చరితపు అనర్ఘతను చాటాడు కవి. విశేషించి రామభద్రుని విష్ణ్వవతారంగా లోకానికి నిర్ద్వంద్వంగా ప్రకటించడం ద్వారా రాముని అనర్ఘతను

---

1. యామినీ పూర్ణతిలకావిలాసంలో - సరసకవి; నరసభూపాలీయంలో రామరాజభూషణుడు, అయ్యలరాజు నారాయణకవి - హంసవింశతిలోను ఈ కవిని ప్రశంసించారు.
2. మురారిపదచింతాయాం భవభూతేస్తు కా కథా - ఇత్యాదులు.

నిష్కర్షించాడు[1]. 'కౌమారవిక్రమం' అనే పేరుగల ద్వితీయాంకంలో తాటకాదివధను నిర్వహించగల సామర్థ్యం, సీతాకరగ్రహణానికి కావలసిన ఓజఃపటిమ, శ్రీరామ చంద్రునికి ఉన్నాయనే విశ్వాసాన్ని ముందే ప్రకటించడంతో[2] పాటు, తనకప్పగించిన బాధ్యతను నిర్దుష్టంగా నిర్వహించి తన సామర్థ్యాన్ని నిరూపించుకున్న రాముణ్ణి ప్రశంసిస్తూ[3] విశ్వామిత్రుడు ఆతని మహత్త్వాన్ని చాటడం అనర్ఘత్వనిదర్శనమే. 'పినాకభంగం' అనే పేరుగల మూడవ అంకంలో ధనుర్భంజనం ద్వారా సీతా పరిగ్రహణం చేసే సందర్భంలోకూడా విశ్వామిత్ర వచనాలద్వారా సాశీర్వాద ఫలపూర్వరంగా విశ్వామిత్రుని కృతకృత్యతను ఆవిష్కరించడం ద్వారా రాముని అప్రతిహత పరాక్రమునిగా నిరూపించి మళ్లీ కవి ఆతని అనర్ఘతను ఉద్ఘోషించాడు[4]. అంతేకాక ప్రతిస్పర్ధియైన రావణాసురుణ్ణికూడా ప్రశంసించగల హృదయ విశాలత రామునికుందని నిరూపించడం ద్వారా కూడా ఆతని స్వభావౌదాత్త్యాన్ని సుప్రకటం చేశాడు కవి[5]. ఇక నాల్గవ అంకానికి దశరథ విప్రలంభం అనేపేరు పెట్టినప్పటికీ, శూర్పణఖా మాల్యవంతుల సంభాషణల ద్వారా ప్రకటమైన జాంబవదాది ప్రయత్న వృత్తాంతం ద్వారా రామవనవాసానికి కావలసిన పూర్వరంగాన్ని సజ్జీకరించడమేకాక, భార్గవ శ్రీరామ సంవాదకల్పనం ద్వారా రామునిలోని వైష్ణవతేజస్సును ఆవిష్కరించి, రావణాది నిగ్రహణయోగ్యత రామునిలో మాత్రమే ఉందని జామదగ్న్య వచనాలద్వారా సూచించి[6] కవి మరోసారి రామపాత్రలోని అనర్ఘతను చాటాడు. ఇక్కడ జామదగ్న్యుడు స్వయంగా రాముని ఉక్తివైదగ్ధ్యాన్ని ప్రశంసించడం కూడా రామపాత్రకు విశిష్టతను చేకూర్చింది[7]. ఈ అంకంలో జామ

---

1. వశిష్ఠోక్తైర్మంత్రైః.......; త్వం శాస్తా; స్మృతవాన్ ఋచో దశతయీః (1 అం - శ్లో 52. 53); బ్రహ్మజ్యోతిర్వివర్తస్య (50)
2. నిర్వృత్తో బహు తావదధ్వరభుజాం (అం 2 - శ్లో 39)
3. నిశాచరాణాం తమసాం నిహన్తా; ప్రకృష్టకర్త్రభిప్రాయ (అం 2 - శ్లో 84, 86)
4. దోర్లీలాదళితేందుశేఖరధను; (అం 3 - శ్లో 57)
5. స్యాతాం నామ కపీంద్రహైహయపతీ (అం 3 - శ్లో 39)
6. యద్ధామస్మాభిరిహ ప్రకోపితస్తదద్య దృష్ట్వా తవ ధామ వైష్ణవం (అం 4 - 59)
7. అహో మధురాత్మనో౽స్య రాజన్యపోతస్య వీరప్రహతాయాః పద్ధతేః అస్ఖలితమ్ ఉక్తివైదగ్ధ్యమ్ (పు. 206, అం - 4)

దిగ్విజయనిపట్ల శ్రీరామచంద్రుని ప్రవృత్తిలోని ఉదాత్తతకూడా అతని అనర్ఘతకు ప్రత్యక్ష నిదర్శనం. సుగ్రీవాభిషేకమనే పంచమాంకంలో వాలిహనన – సుగ్రీవాభిషేచనాలద్వారా రామ పరాక్రమాన్ని చాటి నాటకనామాన్ని కవి అన్వర్థం చేశాడు. వాలి స్వయంగా రామవధార్తుడైనప్పు శ్రీరామచంద్రుని మధుర గంభీరాకృతిని ప్రశంసించడం కూడా రాముని అనర్ఘతకు నిరూపకమే[1]. దశగ్రీవనిగ్రహం అనే ఆరో అంకంలోను దశకంధరుణ్ణి వధించిన రాముణ్ణి గంధర్వముఖంగా ఉపశ్లోకించడంచేతను. రామునిధీరోదాత్త స్వభావాన్ని ఆవిష్కరించడంచేతను అనర్ఘతే నిదర్శింపబడింది[2]. ఇక చివరి అంకమైన 'నాయకానందం'లో శ్రీరామచంద్రుని. జైత్రయాత్రాప్రత్యాగమనాన్ని నిరూపించడమే కాక స్వయంగా రామచంద్రుని ముఖంనుండే తత్కృతకృత్యతను ఆవిష్కరించి నాటక నామాన్ని సార్థకంచేశాడు మురారి[3]. ఈ విధంగా నాటకంలోని ప్రతిసన్నివేశమూ శ్రీరాముని అనర్ఘతను ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఆవిష్కరిస్తోంది కనుక ఈ నాటకం "అనర్ఘరాఘవమే" అనడంలో సందేహం లేదు.

## కథా వైశిష్ట్యం - 5

మురారి తన నాటకాన్ని రామాయణ కథను ఆధారంగా చేసికొని వ్రాసినప్పటికీ, దాన్ని నాట్య రంగంపై అనువర్తింపజేయడంలో కొంత స్వతంత్రతను, విచక్షణతను చూపించాడు ముఖ్యంగా భవభూతి రచించిన మహావీరచరితాన్ని అనుసరించినప్పటికీ, అది అంధానుకరణం కాదని ముందు ముందు పీఠికలో స్పష్టం కాగలదు. ప్రధానంగా రామాయణకథనే ఎందుకు ఎన్నుకోవలసివచ్చింది? అన్న ప్రశ్నకు సమాధానంగా ఉదాత్త గుణ విశిష్టుడైన రాముని వంటి నాయకుడు ఎక్కడ దొరుకుతాడు? అందువల్ల పూర్వ కవులచే రామకథ ఉపనిబద్ధమే కదా అని దాన్ని విడవడానికి వీలులేదంటాడు[4]. పైగా తనవాక్కులు "వాల్మీకి" వాగమృత కూపసమీపాన గల "నిపాన" ములేనని అంటాడు[5].

---

1. ఏకో వేషపరిగ్రహః (అం 5 - శ్లో - 39)
2. పౌలస్త్యన్యస్తశక్తివ్రణ (అం 6 - శ్లో 84)
3. ఏతైః కాని కియంతి రాక్షసవధూవక్త్రస్య [అం 7 – శ్లో. 2]
   లంకేయం రఘువంశ విక్రమకథావిజప్రరోహస్థలీ [శ్లో. 4]
   తాతాజ్ఞామధిమౌళి [7 - 150]
4. యది క్షుణ్ణం పూర్వైరితి జహాతి [1 – 9]
5. తత్తాదృగుజ్జ్వల కకుత్స్థకులప్రశస్తి [1 – 12]

ఇలా అనడంలో తాను కొంత నాటకీయతకోసం స్వతంత్రించినా వాల్మీకిని మాత్రం విడవడం లేదని వ్యంగ్యంగా సూచిస్తున్నాడు. ఎలాగంటే ఒక బావిప్రక్కన అదే బావి నీటితో నిండిన తొట్టి ఉన్నప్పుడు. బావినీటికి ఉన్నరుచే తొట్టినీటికీ ఉంటుందితప్ప. బావినీటికంటే భిన్నలక్షణాలు తొట్టినీటిలో ఉండవుకదా। బావిలోనుండి సాక్షాత్తుగా తోడుకొని త్రాగలేనివారికి తొట్టిలోని నీరే ఆధారంకదా। అలాగే రామాయణ రహస్యాన్నే తాను నాటకం ద్వారా సర్వజనసుగ్రాహ్యంగా ఆవిష్కరిస్తున్నానని మురారి అభిప్రాయం. నిజానికి. రాక్షసరాజైన రావణుడు ముల్లోకాలను తపింపజేయడం అతనిని సంహరించడానికి సాక్షాత్తు గరుడధ్వజుడు రఘుకులంలో ఆవిర్భవించటం, ఆ చరితాన్ని ఆవిష్కరించడానికి వాల్మీకి వాక్కులు అయత్నసిద్ధాలై స్వయంప్రకాశాలు కావడం ఇదంతా రామాయణ కథోపజీవులైన ప్రబంధకర్తల పుణ్యపరిపాకం అంటాడు మురారి [1] "సకలకవిసార్థ సాధారణీఖల్వియం వాల్మీకీయా సుభాషితనీవీ" అని ప్రశంసించుతాడు. ఈ సందర్భంలో "మద్వర్గ్యా" [1-8] ఇత్యాదికం శ్రీహర్షుని "శ్రీహర్షోనిపుణః కవి;" అనే వచనాన్ని స్ఫురింపజేస్తుంది. అంతేకాక నాటకంగా మలచటానికి కావలసిన యోగ్యత. నిసర్గరసపుష్టి వీరాద్భుతారంభ గంభీరమూ, ఉదాత్తమూ అయి జగదానందకందమైన రామకథలో ఉందని ఉద్ఘోషిస్తాడు.[2]

## మహావీరచరితం, - అనర్ఘ రాఘవమ్ - 6

మురారి తన నాటకాన్ని. భవభూతి మహావీరచరితం ఆధారంగా చేసికొని రచించాడని అందరూ అంగీకరించిన విషయమే. అయినప్పటికీ మహావీరచరితంకంటే సన్నివేశగ్రథనంలోను, పాత్రపోషణంలోను అనర్ఘరాఘవం నిర్దుష్టం. అంతేకాదు. కథాసమగ్రతలోను రసపరిపోషణంలోను కూడా మహావీరచరితాన్ని అతిశయించింది. వాస్తవానికి ఉత్తరరామచరితంలో చూపిన రసపరిపక్వతను భవభూతి మహావీరచరితంలో చూపలేకపోయాడని, పూర్వరామాయణేతి వృత్తానికి అనావశ్యకాలు[3], అనుచితాలు[4]. అయిన కల్పనలతో భవభూతి న్యూనతనే కల్పించాడని అట్టిలోపాలేవీ లేకుండా

1. అపికథమసౌ రక్షోరాజః [1 - 7]
2 తస్మైమ్మవీరాద్భుతారంభ [1 - 6]
3. విశ్వామిత్రుని ఆశ్రమంలోనే శివధనుర్భంగాదులు కల్పించడం.
4. పరశురామ పాత్రకు, రామౌదాత్త్యానికి. వాలిపాత్రకు తగిన న్యాయం చేకూర్చలేకపోవడం.

మురారి చాల జాగరూకత వహించాడని మనం రెండు నాటకాలలోని సన్నివేశాలను తులనాత్మకంగా పరిశీలిస్తే స్పష్టమవుతుంది.

మచ్చుకు ఒకటిరెండు సన్నివేశాలను పరిశీలించుదాం.

1. మహావీరచరితంలోని ప్రథమాంక కథలోనే భవభూతి అనిదంపూర్వమైన కల్పనను చొప్పించాడు. విశ్వామిత్ర యాగరక్షణకు రామలక్ష్మణులు రాగా, అక్కడికే సీతోర్మిళలతో కలిసి విశ్వామిత్ర దర్శనానికి వచ్చిన కుశధ్వజుడు, రామలక్ష్మణుల పరాక్రమాన్ని స్వయంగా చూచి సీతోర్మిళలు రామలక్ష్మణులకు సరియైన వధువులని నిర్ణయించుకుంటాడు. సీతోర్మిళలకు కూడా రామలక్ష్మణుల పరాక్రమాన్ని స్వయంగా చూడటంవల్ల ప్రీతి కలుగుతుంది. శివధనుస్సుగురించి అయోనిజయైన సీత గురించి రామునకు ముందే తెలుసును. అయినా విశ్వామిత్రుని అడిగి స్పష్టపరచుకొంటాడు. సీతోర్మిళలు చూస్తుండగానే రాముడు తాటకాది సంహారం చేస్తాడు. అక్కడికే సంకల్పమాత్రంచేత రప్పించబడిన శివధనుస్సు ఖండించి సీతాపరిగ్రహణ యోగ్యతను సంపాదిస్తాడు. ఇదంతా ప్రథమాంకంలోనే కవి కల్పించాడు. ఈ కల్పన సీతోర్మిళలకు రామలక్ష్మణుల పరాక్రమాన్ని ప్రత్యక్షంగా చూపించడానికే తప్ప వేరే ప్రయోజనంలేదు. అయితే అభిలాషిక శృంగారాన్ని పోషించడానికి ఈ కల్పనం అందామంటే, ప్రత్యక్షంగా చూడకపోయినా పరాక్రమగుణాలు విన్నందువల్లకూడా ప్రీతికలుగవచ్చును. ఆ విధంగా అభిలాషిక శృంగారాన్ని పోషించవచ్చును. కనుక మురారి ఈ కల్పనాన్ని విడిచి ఈ కథనంతటినీ రెండు అంకాలలో వితతం చేశాడు. ఈ రెండు అంకాలలో రామాయణ బాలకాండ కథను చక్కగా నాటకానుకూలంగా మలచాడు. రామలక్ష్మణులు విశ్వామిత్రునితోపాటు సిద్ధాశ్రమానికి వెళ్లడానికి ముందు జరిగిన వృత్తాంతాన్ని భవభూతి పూర్తిగా విడిచిపెట్టగా మురారి దాన్ని పరిగ్రహించి దశరథ, విశ్వామిత్ర పాత్రలకు రామపాత్రకు ఉదాత్తతను గంభీరతను ఇనుమడింపజేశాడు. శ్రీరామపాత్ర పరిచయం కూడా రామాయణాన్ని అతిక్రమించకుండా ఉదాత్తశైలిలో సాగింది. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను యాగరక్షణానికై యాచించడం నిమిత్తం రావడానికిముందే దశరథ వామదేవుల ప్రవేశాన్ని కల్పించి వారిద్దరి సంభాషణలద్వారా దశరథునకు వశిష్ఠుని పట్లగల ఆదరాతిశయాన్ని[1]. వశిష్ఠ వచనంపట్ల దశరథునకుగల అనతిలంఘనీయతా

1. ఉన్ముద్రయతి హి [1 - 19]; కౌశికస్వీకృతస్యాపి [1 - 21]
తస్యాజ్ఞయైవ [1 - 16]

బుద్ధిని1, ఆవిష్కరించి విశ్వామిత్రుడు వచ్చినపనిని సానుకూలం చేయించాడు కవి. విశ్వామిత్ర ప్రవేశం జరిగిన తరువాత జరిగిన సంభాషణం రామావతారలక్ష్యాన్ని2. పాఠకులకు స్పష్టపరచడమేగాక విశ్వామిత్ర పాత్రపట్ల ఆదరభావం3, ఏర్పడటానికి తోడ్పడుతుంది. దశరథుణ్ణి కీర్తిస్తూ విశ్వామిత్రుడు పలికిన పలుకులు దశరథుని గొప్పతనాన్ని ఆవిష్కరించేవిగా ఉదాత్తంగా ఉన్నాయి.4 ఇదే అంకంలో రామపాత్రను ప్రవేశపెట్టి, రామునిచే విశ్వామిత్రుని ఉపశ్లోకింపచేసిన తీరు ఆ పాత్రయొక్క విజ్ఞతను5. చాటుతోంది. ఈ విధంగా ప్రథమాంక కథాసన్నివేశ నిర్మాణంలోనే కవి ఒక ఉదాత్తవాతావరణాన్ని సృజించి తాను భవభూతికి అంధానుకర్త కాదని నిరూపించుకున్నాడు.

2. ఇలాగే రెండవ అంకంలోని సన్నివేశాలు కూడా మురారి స్వతంత్రంగా రామాయణాతిక్రమణం లేకుండా కల్పించినవే. ఇక్కడకూడా భవభూతిని అనుకరించిన ఛాయలు లేవు. ఇక్కడ కవి తన వర్ణనాప్రీతిని బాగా ఆవిష్కరించి నాటకానికి ప్రబంధతను సంపాదించి "మురారేః తృతీయః పంథాః" అనే విద్వదుక్తిని అన్వర్థం చేశాడు6. ఇక్కడ కవి రామాయణ కథకంటే కొంత భేదాన్ని 1 - 2 సన్నివేశాలలో చూపించాడు. ముఖ్యంగా రాయిగా పడివున్న అహల్య మనుష్యత్వాన్ని పొందిందనేది, లోకవ్యవహారానుసరణమో [లేదా] పౌరాణిక కథానుసరణమో తప్ప రామాయణానుసరణం కాదు. ఈ సన్నివేశాన్ని చమత్కారంగా శునఃశేఫ - పశుమేఢ్ర పాత్రల ద్వారా హాస్యరసప్రధానంగా చిత్రించాడు. ఇది ఈతని స్వతంత్రకల్పనే. అయితే

1. పూరయితుమర్థికామాన్ [1 - 43]
2. వశిష్ఠోక్తైర్మంత్రైః [1 - 52]; త్వం తాస్తాః స్మృతవాన్ బుధో [1 - 5[illegible]]
3. యః క్షత్రదేహం [1 - 22]; ఏతస్మై సమరాంగణ [1 - 30] త్రాసోత్కంప [1 - 32]
4. చిరాదక్ష్ణోర్జాడ్యం [1 - 72]; దత్తేంద్రాభయ [1 - 27]; త్రైలోక్యాభయ [1-28] త్వయ్యర్ధాసనభాజి [1 - 29]; నిర్ముక్తశేషధవలైః [1 - 35] దృష్టః సాక్షాత్.
5. సురాధీశక్రోధాత్ [1 - 4].
6. సాధారణంగా దృశ్య ప్రక్రియ, శ్రవ్య ప్రక్రియ రెండు ప్రసిద్ధమార్గాలు కాగా దృశ్యంలో శ్రవ్యప్రక్రియను చొప్పించి మూడవ మార్గాన్ని ఏర్పరచిన ఘనత మురారిదే.

పాత్రల పేరులను ఎన్నుకోవడంలో కూడా హాస్యాన్ని అందించాలనే కవి భావించడం కొంత అనౌచిత్యస్ఫూర్తికి కారణం అయినా గుర్తించకతప్పదు. ఈ పాత్రలతో కల్పించిన విష్కంభకం ద్వారా రాక్షససంహారానికి కావలసిన శస్త్రాస్త్ర విద్యలను రాముడు సంపాదించాడనే విషయాన్ని కవి ప్రతిపాదించాడు. తరువాత రామలక్ష్మణులు తాటకావధ చేయడం మొదలైన వృత్తాంతాలు యథారామాయణంగానే సాగాయి. ఈ అంకంలో కవి కల్పనాపై చిత్ర – వర్ణనాముఖంగా బాగా అవిష్కరింపబడింది. తపోవనాదివర్ణనలు కన్నులకు కట్టినట్లు ఆశ్రమసంప్రదాయాన్ని. వాతావరణాన్ని ఆవిష్కరించాయనేది సత్యం. ఈ అంకం రామపరాక్రమ దర్శనానికి ప్రత్యక్ష నిదర్శనం.

3. మూడో అంకంలోని జనక - శతానంద విశ్వామిత్రుల సంభాషణలు సరసంగాను చతురోక్తిగర్భితంగాను కవి నిర్వహించాడు. ఈ మూడో అంకం, మిథిలలో శివధనుర్భంగానికి సీతాకల్యాణానికి ఉద్దేశింపబడింది. ఈ అంకంలో ముందు విష్కంభకం ద్వారా. విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో మిథిలానగర ప్రవేశం చేశాడని సీతా పరిణయానికి రావణుడు తన పురోహితుని పంపి. యాచించాడని, శివధనుర్భంజనం పణంగా ప్రతిజ్ఞాతమైందని, రావణపురోహితాగమనం విని సీత దుర్మనాయమాన అయిందని కవి సూచించాడు. ఈవిధంగా సీతారాముల అనురాగాన్ని వ్యంగ్యంగా సూచించినాడేతప్ప మురారి. భవభూతిలాగా విశ్వామిత్రాశ్రమంలోనే ప్రథమ సమాగమ కల్పనం రామాయణ విరుద్ధంగా చేయలేదు. మహావీరచరితంలోని "సర్వమాయ" పాత్రకు ప్రతిగా, మురారి మిథిలలో విశ్వామిత్ర శతానందాదులతోపాటు "శౌష్కల" పాత్రకు ప్రవేశం కల్పించాడు. విశ్వామిత్రాశ్రమంలోనే సర్వమాయుడు శివధనుర్భంజనాన్ని చూడగా, అనర్ఘరాఘవంలోని "శౌష్కలుడు" మిథిలలోనే జనకవిశ్వామిత్రాది సమక్షంలో శతానందునితో వాగ్వాదంచేసి. శతానందాది ప్రోత్సాహంతో ధనుర్గృహంలో రాముడు శైవధనుర్భంజనం చేయడాన్ని తెలిసికొని, రాముడే సీతాకరపరిగ్రహణం చేస్తాడనే నిశ్చయాన్ని గుర్తించి నిరాశతో తిరిగి వెళ్ళిపోవడంతో తృతీయాంకం ముగుస్తుంది. ఈఅంకం మొత్తం రామాయణాతిక్రమణం లేకుండా (శౌష్కలపాత్ర ప్రవేశం తప్ప) ఉదాత్తమనోహరంగా మురారి నిర్వహించాడు.

4. ఇక నాల్గవ అంకంలో శూర్పణఖా-మాల్యవంతుల ప్రవేశాన్ని కవి కల్పించి తద్ద్వారా విష్కంభకాన్ని ప్రయోగించి సీతారామ కల్యాణ వృత్తాంతంతో పాటు[1],

---

1. యుద్ధోత్సవాంతరయే (4 – 11): దోస్స్తంభద్వయదర్ప (4 – 13)

శివధనుర్భంగ కుపితుడైన జామదగ్న్యుని ప్రవేశాన్ని కూడా రచించాడు[1].

ఇక్కడ గుర్తించవలసిన విశేషం ఒకటి ఉంది. శూర్పణఖా మాల్యవంతుల ప్రవేశాన్ని మురారి తన నాటకంలో భవభూతి ననుసరించి చేసినప్పటికీ, భవభూతి కల్పనలో ఉన్న క్లిష్టతను దృష్టిలో పెట్టుకొని కొంతమార్పుచేశాడు. మహావీరచరితంలో మాల్యవంతుడు – శూర్పణఖ మాట్లాడుకొన్న మాటలను బట్టి సీతాకల్యాణాన్ని[2] స్వయంగా ఇంద్రాదుల వందిత్వాన్ని పొందడం సహించలేక రామునినుండి సీతను వేరుచేయడానికి మార్గం ఏమిటా అని అన్వేషిస్తూ - పూర్వం దశరథుని నుండి రెండు వరాలు పొందిన కైకేయి, తన పరిచారిక అయిన మంథరను మిథిలకు వార్తనందించడానికి పంపిందని, ఆ మంథరాశరీరంలో ప్రవేశించి "ఇలా" చేయవలసింది అని మాల్యవంతుడు శూర్పణఖను రహస్యంగా ప్రేరిస్తాడు[3]. ఇక్కడ ఏమిచేయుమనిచెప్పాడో స్పష్టంగా తెలియదు. అసలు కైకేయి ఏ వార్తను మంథర ద్వారా మిథిలకు పంపిందో కూడా తెలియదు. కైకేయికి దశరథు డిస్తానన్న వరాలలో ఒకటి భరతునికి రాజ్యం, రెండవది రామవనవాసం అయి ఉండాలి. అప్పుడు రాముడు సీతతో అడవికి రావాలి. అక్కడ రాముణ్ణి మోసగించి సీతను అపహరింపవచ్చుని[4], ఆవిధంగా సీతావిరహితుడై నిర్వీర్యుడైన రాముణ్ణి సులభంగా నిగ్రహింపవచ్చని మాల్యవంతుని అభిప్రాయం అతని మాటలలో వ్యక్తం అవుతుంది[5]. ఇక్కడ ఒక సందేహం కలుగుతుంది; కైకేయి మంథరను తాను కోరదలచిన వరాలు కోరడానికే పంపిందా? అలా అయితే ఇంక శూర్పణఖ దాని శరీరంలో ప్రవేశించవలసిన అవసరం ఏముంది? ఇతరకారణాలచేత అయితే ఆ కారణాలు ఏమిటి? ఇక్కడ ఈ సన్నివేశకల్పనంలోని ఔచిత్యం ఏమిటో స్పష్టంగా తెలియటంలేదు. మురారి ఈసన్నివేశాన్ని వేరే విధంగా కల్పించాడు. "వాలి సుగ్రీవుణ్ణి నిష్కారణంగా దండించి వెళ్ళగొట్టాడు. అతని దౌష్ట్యాన్ని తీవ్రంగా నిరసించి జాంబవంతుడు, హనుమంతుడు మున్నగువారు ఎలాగైనా వాలిని వధించే ఉపాయం చూడాలని ఆలోచించి, కేవలం శ్రీరామచంద్రుని వల్లనే అది సాధ్యమౌతుం

1. భుజార్గలితనర్మదా (4 – 15); రాజన్యరుధిరాంభోధి (4 - 17)
2. మునిరపిగురుర్దివ్యాస్త్రాణాం (4 – 14)
3. యా సా రాజ్ఞా దశరథేన........శరీరమావిశ్య ఏవమేవం కర్తవ్యమ్ (పు. 118)
4. తతోఽనేన యోగాచారన్యాయేన........ఛద్మనా అతిసంధాతుమ్ (పు. 120)
5. హృతజానిరరాతిభిస్సలజ్జో (మహావీర. 4 - 5)

దని నిశ్చయించి అందుకోసం ఒక ప్రణాళికని విస్తరించారు. యాజ్ఞవల్క్యాశ్రమానికి వచ్చిన హనుమంతుడు మిథిలాసమీప ప్రాంతాల్లో నిదాఘతాపాన్ని తట్టుకోలేక మూర్ఛపోయిన మంథరను చూచి జాంబవంతునితో ఈ విషయం చెప్తాడు. ఆమె శరీరంలో సిద్ధతాపసియైన శబరిని ప్రవేశింపచేసి కైకేయి పక్షాన రెండువరాలు కోరించి భార్యతో పాటుగ రాముడు వనవాసానికి వచ్చేటట్లు చేయాలి"-అని. ఈ జాంబవంతుని ప్రయత్నం కారణంగా సీతతోపాటు అడవికి వచ్చిన రాముణ్ణి వధించి సీతాపహరణం చేయాలని మాల్యవంతుడు శూర్పణఖతో మంతనాలు జరుపుతాడు 1.

మహావీర చరితంలోను, దాన్ని అనుసరించిన అనర్ఘరాఘవంలోను రాముడు అరణ్యవాసానికి వెళ్లడంలో కైకేయీ పాత్ర ఏమీ లేదని చెప్పడం ప్రధానతాత్పర్యం. అందుకే భవభూతి — మురారిలు క్రొత్తకల్పనలు చేశారు. భవభూతి కల్పనకంటె. దాన్నే అనుసరించిన మురారి కల్పనం చేసిన మార్పులూ సందర్భసముచితంగాను అసందిగ్ధంగాను ఉన్నాయి. భవభూతి నాటకంలో మంథర మిథిలకు ఎందుకు పంపబడిందో స్పష్టపరుపబడలేదు. మురారి దాన్నిమార్చి — మంథర మేనమామ యింటివద్ద ఉన్న భరతుని వార్తను తెలిసికోవడానికి వెళ్తూ మార్గమధ్యంలో మిథిలాసమీపానికి వచ్చిందని కవి స్పష్టపరిచాడు2.

ఇది ఇదే అంకంలో మురారి జామదగ్న్య పాత్రను ప్రవేశపెట్టి కొంత భవభూతిని అనుసరించినా అనవసరంగా ఆ పాత్రను సాగదీయకుండా ఈ అంకంలోనే ఆ పాత్రను ముగించాడు. అలాకాక భవభూతి రెండవ అంకం చివర ప్రవేశపెట్టిన జామదగ్న్య పాత్రను నాల్గవఅంకంలో ఇంచుమించు చివరిదాకా అనవసరంగా సుదీర్ఘంగా పొడిగించాడు. ఈ కారణంగా జామదగ్న్య పాత్రకు తగినన్యాయం జరుగలేదనే చెప్పాలి. మీదు మిక్కిలి ప్రారంభంలో రామునివల్ల పరితుష్టచిత్తుడై పరమసాత్త్వికమూర్తిగా కనుపించిన జామదగ్న్యుడు రానురాను చివరకు ఉద్ధతమూర్తిగానే ప్రేక్షకుల దృష్టిలో మిగిలిపోయాడు. మహావీరచరితంలోని మూడవ అంకంలో శతానందునిచేత పరశురాముణ్ణి తిట్టించినతీరు అనుచితంగాను సహృదయోద్వేజకంగాను ఉంది. కవి ఎక్కడా జామదగ్న్యుని అవతారపురుషునిగా గుర్తించినట్లు కనబడదు. మురారి అలాకాక సంద

1. అస్తి సవసో వినాం మంత్రీ జాంబవాన్.... తదమునా జాంబవత్ప్రయోగేణ వలతా..... రామస్య మరణం కలత్రాపహరణమ్ (అనర్ఘ. అం. 4. పు. 387, 340)

2. అయోధ్యాతః కైకేయ్యా భరతవార్తాహారిణాయ. ప్రేషితా మంథరా (పు. 348)

ర్థోచితంగా జామదగ్న్య పాత్రను ఉద్ధతంగా నిరూపించినప్పటికీ, జామదగ్న్యుని మహావిష్ణ్వవతారంగా స్పష్టపరచి ఆ పాత్రకుగల ఔన్నత్యాన్ని సురక్షితం చేశాడు[1]. జామదగ్న్యుని ఔద్ధత్యానికిగల కారణాన్నికూడా అతనిద్వారానే చెప్పించి,[2] కవి ఆ పాత్రకు న్యాయంచేశాడు. శ్రీరామచంద్రుని వైష్ణవతేజోదర్శనమే జామదగ్న్యుని ఔద్ధత్యానికి నిమిత్తమని ఉద్ఘోషించాడు కవి. అయితే భవభూతి ఈ పాత్రను చిత్రించిన తీరును కొంతవరకు మురారికూడా అనుకరించాడు. కనుక, జనకాదులతో జామదగ్న్యుడు వివాదంచేసిన సందర్భంలోని పరస్పరదూషణపరాలైన సంభాషణలు "విదేహప్రసవ పాంసుల" "క్షత్రియాయాః పుత్ర" 'బాంధకినేయ' 'గౌతమగోత్రపాంసన' ఇత్యాది నిందావచనాలతో నిండి ప్రేక్షకులకు (పాఠకులకు కూడా) కొంత ఉద్వేగాన్ని కలిగించకమానవు. అయినా భవభూతి రాముణ్ణి భీరువునిగా నిరూపించి ఆ పాత్రకుగల ఉదాత్తతకు భంగం కలిగించగా. మురారి ముందునుండి చివరిదాకా ఒకేవిధమైన వినయసంపత్తిని చూపించి ఉదాత్తతను కాపాడాడు. భవభూతి-ముఖ్యంగా పరశురామసన్నిధికి రాముడు రావడానికియత్నించినప్పుడు అడుగడుగునా సీత అడ్డుకోవడం, జామదగ్న్యునితో వివాదంచేస్తూనే మధ్యలో అకస్మాత్తుగా రామపాత్రను నిష్క్రమింపజేయటం ద్వారా ఆ పాత్రకుగల ఉదాత్తతకు భంగంకలిగించాడు[3], మురారి అలాకాక రామజామదగ్న్యుల ప్రత్యక్ష యుద్ధసన్నద్ధతను కల్పించి రాముడు జయించినట్లు నేపథ్యపాత్రద్వారా సూచించాడు. ముఖ్యంగా మహావీరచరితంలోని జామదగ్న్యుడు రావణప్రేరణతో రాముని వద్దకురాగా[4], మురారి రామాయణాన్నే అనుసరించి కేవలం శివధనుర్భంగ శ్రవణం చేతనే వచ్చి రామునితో వివాదపడినట్లు యుద్ధానికి సిద్ధమైనట్లు వర్ణించాడు. వాస్తవానికి జామదగ్న్య పరాభవానికి భవభూతి ఇచ్చిన ప్రాధాన్యాన్ని, మురారి ఈయలేదని ఈ రెండు నాటకాలలోని ఈ క్రిందివాక్యాలు పరిశీలిస్తే స్పష్టం అవుతుంది.

---

1. త్రిలోకీ నిర్మాణస్థితినిధన బంధోర్మురభిదో
   భవాన్ షష్ఠీ మూర్తిర్భృగుకులమధిష్ఠాయ రమతే. (4 – 63)

2. యదర్థమస్మాభిరిహ ప్రకోపితః తదద్య దృష్ట్వా తవ ధామ వైష్ణవమ్. (4 - 59)

3. దీన్ని ఆలంకారికులు తమ గ్రంథాలలో విమర్శించారు. చూ. దశరూపకం.

4. మిథిలాప్రస్థాపనాయ జామదగ్న్యముత్తేజయితుం మహేంద్రద్వీపమేవ గచ్ఛామః (మహావీర. 2–14 శ్లో. గద్య). పరశురామోత్తేజనం కర్తవ్యమ్ (అదే. పు–52)

"తదయం జామదగ్న్య విజయోత్సవః ప్రసజ్యతామభిషేకోత్సవేన (మహావీర) ఇక్కడ తృతీయా ప్రయోగించే అభిషేకం అప్రధానమై జామదగ్న్య పరాజయమే ప్రధానమైంది. ఇది అనర్ఘరాఘవంలో "ప్రసజ్యతామయమపి వైదేహీ వివాహమహోత్సవో జామదగ్న్య విజయోత్సవేన" (అనర్ఘ. అం 4) ఈ వాక్యవిన్యాసంలోని భేదాన్ని గమనిస్తే భవభూతి - మురారుల దృష్టిలోగల తారతమ్యం స్పష్టమౌతుంది. అయితే రామవనగమనానికి తగిన సందర్భం కల్పించడంలో మురారి భవభూతిననుసరించి మిథిలనే స్థానంగా ఎంచుకున్నాడు. అయితే మిథిలలోనే మంథరాప్రవేశ సన్నివేశాన్ని కల్పించవలసిన అవసరం ఏమిటి? అనేది ప్రశ్న. కేవలం కల్పనకోసమే కల్పన అన్నట్లు - దీనికి ప్రత్యేకలక్ష్యం ఏమీ ఉన్నట్లు కనబడదు. ఇక మిథిలా సన్నివేశం అంతా భవభూతి కల్పనాప్రధానంగానే నడిపించాడు. ఇలా కల్పించడంవల్ల కొంత నాటకీయతను సంపాదించగలిగినప్పటికీ, తాను రామాయణ కథను నాటకంగా మలుస్తున్నాననే విషయాన్ని మరచి స్వకపోలకల్పితాలైన సన్నివేశాలతో ఈ అంకాన్ని గుప్పించడం మురారికి అంతగా రుచించక కాబోలు. పాక్షికంగా భవభూతిని అనుసరించినా కల్పనలో కొంత సంయమనాన్ని పాటించాడు. భవభూతి కల్పనం నాల్గవ అంకంలో ఇలా ఉంది. మంథరారూపంలో శూర్పణఖ ప్రవేశించి, కైకేయి పంపిందనిచెప్పి పత్రం ఇస్తుంది. దాన్ని ముందుగా రామలక్ష్మణులు తీసికొంటారు. రాముడు తాను కోరిందే జరిగిందని ఆనందిస్తాడు. దీనికికారణం పూర్వం జామదగ్న్యుడు మునిజన రక్షణకోసం వనానికి వెళ్లవలసిందని రాముని ప్రేరేపించడమే।[1]. రాముడు కూడా జామదగ్న్య ప్రేరితుడై ఏ వ్యాజంతో దండకకు వెళ్లాలి? అని ఆలోచిస్తుండగా; మంథరరాక రామునికి ఆనందం కలిగించడంలో ఆశ్చర్యం ఏముంది? ఇంతలో యుధాజిత్తు — "ప్రజలు, రాముని రాజుగా చూడదలచారనే" విషయాన్ని దశరథునకు వినిపించగా, మిథిలలోనే రామాభిషేకానికి సన్నాహాలుచేసి. కోరినవారికి కోరినదల్లా ఇవ్వాలని ఆదేశిస్తాడు దశరథుడు. ఈ సందర్భంలో రాముడు ప్రవేశించి కైకేయీ వరపత్రాన్ని లక్ష్మణుని ద్వారా చదివి వినిపించి, ఆ వరాలు ఇవ్వమని కోరుతాడు. ఈ సందర్భంలో భరతుడు రామపాదుకలను పరిగ్రహించి, వాటి శాసనాన్ని శిరసావహించి

---

1. పుణ్యానాం ఋషయస్తేషు సరితామ్ (మహావీర. చ. అం. 4 శ్లో. 38)

2. అపినామ కేనచిదుపాయేన దండకారణ్యం ప్రతిష్ఠేయం (మహా. పు. 149)

నందిగ్రామంలో జటాధారినై ఉండి పరిపాలన చేస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. రామపాదుకల్ని విడిచిపుచ్చి, వృద్ధుల్ని ఉపసాంత్వన పరచడానికి రామప్రేరితుడై యుధాజిత్తు వెనుదిరిగి మరలతాడు. మొత్తంమీద ఈ సన్నివేశంలో కవి ఏ రసాన్ని పోషించాడు అనేది ప్రేక్షకులకు అంతు బట్టని విషయం. ఇంతటి కల్పనాన్ని ప్రేక్షకులు భరించడం కష్టం. కనుక మురారి దీన్ని కుదించివేశాడు. ఇక మురారి నాటకంలో రామప్రవాసానికి మిథిలలోనే సన్నివేశం కల్పించబడినప్పటికి చాలా సంగ్రహంగా జనక – దశరథుల ప్రసంగంలో రామపట్టాభిషేకసంకల్పాన్ని సూచించి, అదే సందర్భంలో కైకేయి పంపిన పత్రాన్ని వినిపించడంద్వారా రామవనగమన నిశ్చయాన్ని ప్రకటించి రామ పాత్రను నిష్క్రమింపచేశాడు. అసందర్భాలు అనావశ్యకాలు అయిన పాదుకాపరిగ్రహ ణాదుల్ని కవి ఇక్కడ కల్పించకపోవడంవల్ల కొంత క్లిష్టత రంగసమ్మర్దత తప్పింది.

4. ఇక ఐదవ అంకంలో ముఖ్యంగా అరణ్యవాస వృత్తాన్ని కవి లెస్సగా నాట్యరంగంపై అనువర్తించాడు. విశేషం ఏమంటే శ్రమణాజాంబవంతుల పాత్ర లను ప్రవేశపెట్టి రాముడు వనగమనప్రయత్నంలో గుహుని వద్దకు రావడం, గంగను దాటడం, జటాదుల పరిగ్రహించడం. భరతుడుకూడా అన్నను నివర్తింపజేయటానికి చిత్రకూటానికి రావడం, పాదుకా పరిగ్రహణం, విరాధవధ, కాకవృత్తాన్తం, సుతీక్ష్ణాది మునులను రాముడు సంభావించడం, శూర్పణఖా పరాభవం, ఖరదూషణాదివధ, రామ రావణులవైరం తప్పదని నిశ్చయించడం మొదలైన విషయాలను వారి సంభాషణల ద్వారా కవి చెప్పించాడు. ఈ ప్రక్రియవల్ల మూలరామాయణానుసరణమే మురారి సమ్మతమని స్పష్టపరుపబడింది. నిషాదచక్రవర్తియైన గుహునిద్వారా రామసుగ్రీవులకు స్నేహం కలిపి వాలివధకు బాటలు వేయాలని వారు నిశ్చయించుకుంటారు. జాంబవత్ప్రే రణచే శ్రమణ గుహుని రప్పించుతుంది. ఈ సందర్భంలోనే రావణప్రవేశాన్ని కవి పరోక్షంగా కల్పించాడు. లక్ష్మణుడు రావణునితో చేసిన సంవాదాన్ని జాంబవంతుడు వింటాడు. ఇంతలో జటాయువు ప్రవేశించి— "తాను రావణున్ని అరణ్యంలో చూచి నట్లు" చెప్పి వానివల్ల రామభద్రునికి ఎట్టిబాధా కలుగకుండా చూడాలని నిశ్చయించి త్వరగా పంచవటీ ప్రాంతానికి వెళ్లిపోయాడు. జటాయువు పాత్రద్వారానే రావణుడు సీతను అపహరించినట్లు చెప్పించి రావణునిపై జటాయువు యుద్ధానికి సన్నద్ధుడైనట్లు కవి నిరూపించాడు. ఇంతవరకు విష్కంభం కాగా దానితరువాత సీతావిరహానము ప్రగుప్న

డైన రాముని ప్రవేశపెట్టి రామవిరహాన్ని లెస్సగా నిరూపించాడు కవి. ఇక్కడ ఈ విధంగా రామవిరహావిహ్వలతను నిరూపించడం ద్వారా కొంతవరకు భవభూతి రచితమైన ఉత్తరరామచరిత సన్నివేశాలను కవి అనుసరించాడనిపిస్తుంది. "మయి రసతయా శోకో భావః చిరేణ విపచ్యతే" అని రామునిచే చెప్పించడంద్వారా తాను భవభూతి నిరూపితమైన కరుణరసాన్నే ఇక్కడ నిరూపించదలచినట్లు కవి స్పష్టపరచాడు. ఇక్కడ ఒకవిషయం మనం గుర్తించాలి. భవభూతి - మురారి ఈ ఇరువురి దృష్టిలోను కరుణరసం అంటే ఉత్కట విరహావ్యథాపరిపాక రూపమైన విప్రలంభమే తప్ప వేరుకాదు. ఇది మహావీరచరితంలో రావణాదులు శ్రమణ సహాయసిరాలు కాగా, ఇక్కడ ఆ స్థానాన్ని గుహుడు స్వీకరించాడు. భవభూతి, మురారి సూచించినట్లు అరణ్యకాండ విశేషాలన్నింటినీ సూచించలేదు. జటాయు మరణం, సీతాపహరణ ఖిన్నులైన రామలక్ష్మణులు కబంధప్రాణబద్ధురాలైన శ్రమణను విడిపించి సుగ్రీవుని లేఖను గ్రహించడం శ్రమణాసాహాయ్యంతో ఆయాయా ప్రదేశాలుచూస్తూ ఋష్యమూకపర్వతం చేరి వాలితో సంవాదించటం మొదలైన అంశాలను భవభూతి మహావీరచరిత పంచమాంకంలో వర్ణించగా, మురారి కొంత ఛాయామాత్రంగా పంచమాంకంలో వర్ణించినా ప్రధానంగా రామాయణాన్నే అనుసరించాడు. పంపాసరోవర ప్రాంతంలో రాముడు సీతావిరహాకాతరుడవ్వటం కిష్కింధాకాండలోని సన్నివేశాన్ని గుర్తుచేస్తుంది. కరుణ లేదా విరహ విప్రలంభశృంగారం పోషించడంలో ఈ అంశం మురారికి బాగా ఉపకరించింది.

ఇక వాలిపాత్ర విషయంలో భవభూతి చాలా అన్యాయం చేశాడు రావణప్రేరితుడై వచ్చిన వాలికి వాస్తవానికి రామునితో యుద్ధం చేయడం ఇష్టం ఉండదు. ఈ పాత్రలో అనావశ్యకమైన సౌజన్యాతిశయాన్ని చొప్పించి కవి వాలిని మహావీరునిగా గాక భీరువుగా పర్యవసింపజేశాడని ముఖ్యంగా మహావీరచరితంలోని ఆరవ అంకకథ స్పష్టంచేస్తుంది. సుదీర్ఘాలైన స్వగతాలు సంభాషణలు ప్రేక్షకుల సహనాన్ని పరీక్షిస్తాయి. మురారి ఈ పాత్రవిషయంలో చాలా జాగ్రత్తపడ్డాడు.

ఇక్కడ జాంబవత్సుమంత్ర ప్రేరితుడై రావణవార్తనుబట్టి రామునిపై యుద్ధానికి వచ్చినా, వాలి తన పరాక్రమాన్ని ఔద్ధత్యాన్ని విడవక రామునిచేతిలో ప్రత్యక్ష యుద్ధంలోనే సంహరింపబడటం ఈ పాత్ర చిత్రణంలోని విశేషం. వాలికి లక్ష్మణునికీ జరిగిన సంభాషణలు చాలా చమత్కారపూర్ణాలుగా సాగాయి. ఇక్కడ లక్ష్మణుడు,

వాలిపట్ల పక్షపాతాన్ని ప్రదర్శించడ, వాలిమరణానికి ఖిన్నుడవటం అతని కారిపక్ష పాతదృష్టికి నిదర్శనం. ఇది మురారి కల్పితమే. సుదీర్ఘ సంభాషణలు ఎంతమాత్రం లేక ఈ సన్నివేశం దర్శనీయంగానే మురారి చిత్రించాడు.

ఇక 6, 7 అంకాలలోని కథాసన్నివేశాలు భవభూతి అనుకరణం లేకుండా మురారి కల్పించినవే. 6వ అంకం రామరావణ యుద్ధసన్నివేశ నిరూపణాప్రధానం కాగా, ఇది ప్రధానంగా కథాకథనశైలితోనే నడిచింది. 7వ అంకంలో రావణవధానంతరం సీతాసమాగతుడైన రాముడు లక్ష్మణ - విభీషణాదులతో తిరిగివస్తూ ఆయా ప్రదేశాలు వర్ణించడం - వశిష్ఠాదులచే ప్రత్యుత్థానపురస్సరంగా రాముడు పట్టాభిషిక్తుడవడంతో నాటకం ముగుస్తుంది. ఇక్కడకూడా కవి తన కల్పనాచాతుర్యాన్ని బాగా విజృంభింపజేశాడు.

మొత్తంమీద అనర్ఘరాఘవం, మహావీరచరితాన్ని పరిశీలించినమీదట దానిలోని లోటుపాట్లు సవరించి తన అసాధారణమైన కల్పనాచాతుర్యాన్ని జోడించి, మురారి రచించిన అనర్ఘనాటకరత్నమేతప్ప, భవభూతికి అంధానుకరణం కాదనేది స్పష్టం. రామాయణాధారాలైన కథలలో మార్పులు విశృంఖలంగా చేయరాదని ఆనందవర్ధనుడు పేర్కొనడం బహుశ ఇటువంటి కల్పనలను పరిశీలించడంచేతనే కావచ్చు.

## మురారి కల్పనావైచిత్ర్యం - 6

ఏ కవిత్వానికైనా కల్పనే జీవం. కల్పనం అనేది ఊహాప్రధానంగా ఉంటుంది. అతిశయగర్భితంగా ఉంటుంది. అందుకే మన ప్రాచీనాలంకారికులు స్వభావోక్తికంటే - అతిశయగర్భితమైన ఉత్ప్రేక్షకు ప్రాధాన్యం ఇచ్చారు. భామహుడు దీన్నే ఉక్తివక్రతగా భావించాడు. ఏ అలంకారమైనా ఉక్తివక్రత లేకపోతే అసలు అలంకారమే కాదనే అతని వాదనను మురారి బాగా ఆదర్శంగా తీసికొన్నట్లు కనబడుతుంది. సేతుబంధకర్త అయిన ప్రవరసేనుని తరువాత ఇంతటి ఉక్తివైచిత్ర్యాన్ని, కల్పనాశిల్పాన్ని చూపిన వారు నాటకకర్తలలో లేరంటే అది సత్యదూరంకాదు. వివిధాలంకార గుంఫనలలో మురారి చూపిన కల్పనాచాతురి సహృదయ హృదయావర్జకం. కావ్యాల్లో నాటకీయతను చూపించడంలో సిద్ధహస్తులు చాలామంది ఉండవచ్చు. కాని నాటకాల్లో కల్పనా

చాతురిని చూపించి వర్ణనలకు ప్రాధాన్యం ఇచ్చి ప్రబంధతను కల్పించినవారు మురారి లాంటివారు బహుశః ఒకరిద్దరుంటారేమో. కొన్ని శ్లోకాలు పరిశీలించుదాం.

"ప్రతత్యగ్రగవ్యలిప్తైః" (అం. 2 - 10) అనే సూర్యోదయ వర్ణనాపరమైన శ్లోకంలోని ఈ క్రింవిభావం చమత్కారబంధురం. సూర్యకిరణాలు తూర్పు దిక్కును అలముకొని వింతశోభల్ని ఇస్తున్నాయి. అవి పద్మరాగకాంతుల్ని, నవప్రవాళకాంతుల్ని పుణికిపుచ్చుకున్నట్లు ఎర్రగా ఉన్నాయి. ఈ సూర్యకాంతులు సూర్యకాంతమణిజ్వాలలచే నీరాజితాలు. ఈ దశలో అంతవరకు నల్లటి చిమ్మచీకట్లలో కప్పబడి ఉండి మెల్లగా తన కుబుసాన్ని విడిచి ఈ జగత్తు శుభ్రంగా ప్రకాశిస్తున్నదట. ఇక్కడ నిర్మోక శబ్ద ప్రయోగం వల్ల — చుట్టలు చుట్టుకొని పడుకొన్న నల్లనిపాము, కుబుసం విడిచిన తరువాత, మత్తువదలి స్వచ్ఛంగా కదులుతుండానే వినూత్న చైతన్యంతో ప్రకాశిస్తున్నట్లు — ఈ జగత్తు కూడా సూర్య కిరణ స్పర్శచే తమోగుణాన్ని విడచి సత్త్వ సమృద్ధమై జాగృతం అవుతున్నదని వ్యంగ్యం. 'నిర్మోకమున్ముంచతి' అనటం చేత జగత్తుకు నిర్మోకం ఉండదు కనుక — నిర్మోకాన్ని విడుస్తున్నదా అన్నట్లు ఉన్నదనే సంభావనామూలమై అతిశయగర్భితమైన ఉత్ప్రేక్ష స్ఫురిస్తున్నది.

ఇంకొక శ్లోకం —

'కిం ను ధ్వాంతపయోధిరేష' (అం. 2-75) ఈ శ్లోకంలో కవి చక్కగా అలముకొన్న చీకటిలో, అప్పుడే ప్రకాశించిన కిరణాల వల్ల ఏర్పడుతున్న స్వచ్ఛతను చమత్కారంగా వర్ణిస్తున్నాడు. చీకటి దట్టంగా వ్యాపించి ఉన్నది. దానిలోనే చంద్ర కిరణాలు కూడా అలముకొని ఉన్నాయి. దీన్ని చూస్తే ఇండిఃగంధంచే స్వచ్ఛంగా చేయబడిన జలం గల సముద్రమా అన్నట్టు తమస్సముదాయం. దాని అడుగున పేరుకున్న నల్లని పంకమా అన్నట్లు నీడలు భాసిస్తున్నాయట. అంతేకాదు చంద్రుడు తన కిరణాలనే కత్తెరలతో ఆకాశాన్ని ముక్కలు ముక్కలుగా కత్తిరించి పడవేస్తే పడిన ఆకాశపు ముక్కల్లాగా నీడలు కనిపిస్తున్నాయట. ఇంకో శ్లోకంలో (దళవితతిచ్ఛృతాం - 2 - 76) దట్టంగా ఆకులతో కూడిన చెట్టుక్రింద ఆకులమధ్యలో ప్రసరించిన కిరణాల వల్ల భూమి తిలతండుల సమ్మిశ్రితం అయిందట. దీన్ని బట్టే కాబోలు మనుచరిత్ర కర్త 'పుడమి తిలతండుల న్యాయమున వెలుంగు' అన్నాడు

సూర్య కిరణ ప్రసారం వర్ణిస్తూ, ఇక మధ్య మధ్య నల్లనల్లగా ఉన్న నీడల భాగాలు మాత్రం, మదించిన చకోరాలు వెన్నెలను తిన్నంత తిని ముక్కులతో అటూఇటూ చిమ్మి పారవేసినట్లు కనబడుతున్నాయట. ఒక్క ఉత్ప్రేక్షలోనే కాదు రూపకాలు గుప్పించడంలో కూడా కవి కల్పన అనల్పంగా గోచరిస్తుంది. ఒకప్పుడు "అత్రినేత్ర దూషిక" అనిపించిన చంద్రుడు కవిదృష్టిలో నేత్రాలకు మధుపర్కసత్రంగాను, సముద్రానికి మేదోవృద్ధికరుడుగాను, శృంగారానికి రసాయనంగాను, దేవతల అమృత గృహాధిపతిగాను, మహేశ్వరుని వేషానికి అమరిన రత్నాంకురంగాను, పాలసముద్రపు ముత్తెముగాను కనిపిస్తాడు1. అంతేకాదు చంద్రవంక, ముల్లోకాల నేత్రాలకు అమృతస్థాలి, సమస్తలోక కామాగ్నికి చెందిన అంగారకణం, దిక్కులను తెరవడానికి ఉపయోగించే తాళం, వీరులలో మదనుణ్ణి ప్రథముడుగా గుర్తిస్తూ గీసిన గీత2. అంతేకాదు - పద్మాలకు ప్రాణాయామోపదేష్ట, యౌవనోన్మాద లీలాగోష్ఠులలో పీఠమర్దుడు, ముల్లోకాలలోని సుందరీమణుల నేత్రాలకు ప్రాతరాశం, కాముణ్ణి బ్రతికించడానికి ఆయుష్టోమం చేస్తున్న హోత, శృంగారాద్వైతవాది అని చంద్రుణ్ణి వర్ణిస్తాడు కవి3.

ఇక స్వభావోక్తులలోను కవి సిద్ధహస్తుడే. ఆశ్రమవర్ణనలో కొంతవరకు భాసుణ్ణి కొంతవరకు కాళిదాసును స్ఫూర్తిగా కవి తీసికొన్నాడనిపిస్తుంది. స్వభావోక్తిలో రసాన్ని జోడించి వర్ణించడంకూడా ఈతని ప్రత్యేకత. ఒకచోట బలికి ఉపయోగింపవలసిన తండులాలను మృగాలు తినిపోతూ ఉంటే చూస్తున్న తాపసగృహిణులు ఖేదంతో తమ చేతులలోని దండాలతో వాటిని అదిలించబోతే, అవి నిర్భయంగా ఆ దండాలనే వాసన చూస్తున్నాయట. ఆ సన్నివేశాన్ని చూచి మునులు నవ్వుతున్నారట4. దైనందిన కృత్యాలలోనిమగ్నులైన తాపసులనుమృగాలను, వాటికి ఘాసముష్టులు అందిస్తున్నముని బాలకులు వారువేసిన శ్యామాక ధాన్యపు గింజలను ముక్కున కరచుకొనిపోతున్న చీమల బారులు, మొక్కల ఆలవాలాలు అందులో సుడులు తిరుగుతూ అగిలగి ప్రవహిస్తున్న నీటి జాలులు, ఈ విధంగా - సుందరమైన ఆశ్రమ వాతావరణం వర్ణించడంలో ఉక్తి వైచిత్ర్యగర్భితమైన స్వభావ సమున్మీలనం స్పష్టంగా గోచరిస్తుంది

1. నేత్రాణాం మధుపర్కసత్రమ్ (7-67)
2. పీయూషాశ్రపణం (7-83)
3. ప్రాణాయామోపదేష్టా (7-62)
4. బాలేయతండుల విలోప (2-20)

తాపసులు తపస్సులుచేసి చిక్కిపోయి నరాలు పైకి కనిపిస్తూంటే వారినిచూచి కవి — శరీరాన్నంతా నరాలతో పూరించి మిగిలిన శిరంబును జడలుగా ధరించిన మునుల శిరస్సులతో తపస్సులు గహనంగా ఉన్నాయని అనటంలో చమత్కారం ఉంది.

కేవలం వస్తు ప్రధానంగా ఉండే వాక్యాలలో కూడా ఏదో ఉక్తివైచిత్ర్యం చూపించడం మురారికి సహజం. 3వ అంకంలో - "విద్యాశ్చతుర్దశ" అనే శ్లోకంలో - బ్రహ్మ తన నాల్గుముఖాలలోను పదునాల్గు విద్యలు ఇముడ్చుకోలేక తన మనుమడైన రావణునికి పదితలలు పది విద్యలు అనుగ్రహించాడని. అయినా ఇంకా నీవు జడుడివి ఎట్లా అయ్యావు అని మాల్యవంతు డనే మాటలలో ఉక్తివైచిత్ర్యం స్పష్టం. ఇలాగే ఆరవ అంకంలోని "స్వ మాత్కృత్య" (6-46) అనే శ్లోకంలో - రావణుడు తన పది తలలు అగ్నిలో ప్రేల్చి హోమం చేస్తున్నప్పుడు. ఆ శిరస్సుల ముఖాలపై ఉన్న త్రివళులు పేలి చెదిరిపోగా స్పష్టంగా విధి లిఖితమై కనిపిస్తున్న రామాయణాన్ని ఎరిగిఉండి కూడా అస్ఖలిత చిత్తంతో బ్రహ్మకు ప్రీతిని కలుగజేసిన మహావీరునిపట్ల ఎవరు వైరం చూపుతారు? అని అంటూనే వ్యంగ్యంగా రావణుని మూర్ఖతను ఎత్తిచూపుతాడు రాముడు. ప్రథమాంకంలోని "విష్టా వేధస్యథా" అనే శ్లోకంలో రాముణ్ణి కన్నదీ పెంచినదీ సీవే అయినా వాని ప్రయోజనం. సీకుకాదు. మాకే అన్న సత్యాన్ని దృష్టాంతపురస్సరంగా ఉక్తివైచిత్ర్యంలో కవి విశ్వామిత్రునిచే చెప్పిస్తాడు. 7వ అంకంలోని రామ - విభీషణ సంభాషణం కూడా చమత్కారపూర్ణంగా సాగింది. మైనాకపర్వతాన్ని చూసి రాముడు నవ్వుతూ (క్రౌంచం విముచ్య 7-28) "తన కొడుకును క్రౌంచపర్వతాన్ని, తండ్రైన హిమవంతుణ్ణి విడిచిపెట్టి ఎక్కడో సముద్రంలో రెక్కలు కాపాడుకుంటూ బ్రతకడంలో ఏ పరమార్థం ఉంది? అని పరిహసించడంలో - తనవారికి కాని తన బ్రతుకు వ్యర్థమనే భావాన్ని కవి లెస్సగా వ్యక్తపరచాడు.

## మురారి శాస్త్ర వైదుష్యం - 7

మురారి శ్రౌతస్మార్త సంప్రదాయాలతోపాటు బహువిధ శాస్త్రపాండిత్యం విస్ఫుటంగా ప్రదర్శించాడు. కొన్ని శాస్త్రసాంప్రదాయాలను చమత్కారంగా శ్లోకాలతోను, సంభాషణలతోను ఆవిష్కరించాడు. 1. రెండవ అంకంలోని 'పవైశ్యతే పశుబంధ

వేది' [2 – 17] అనే శ్లోకంలో ఋషుల ధర్మాచరణాన్ని వర్ణిస్తూ ఆపస్తంబసూత్ర విధానాన్ని సూచిస్తాడు కవి. 2. పలుమారులు బ్రహ్మణ్యోతిర్వివర్తం" అనే పదాన్ని ప్రయోగించటం - ఈతనికి వేదాన్త వాదాలలోని వివర్తవాదంపట్ల ప్రీతిని సూచిస్తున్నది. "శృంగారాద్వైతవాదీ" అని చంద్రుణ్ని గురించి చేసిన రూపకంలో అద్వైతవాదసంస్కారం స్పష్టమౌతున్నది. "అవిద్యాబీజ విధ్వంసాత్" [2 – 34] అనే శ్లోకంలో అవిద్యాబీజమైన పాపం నశించడంవల్ల తన అంతశ్చక్షుస్సుతో విశ్వామిత్రుడు భూతభవిష్యత్తులను వర్తమానంలా దర్శిస్తున్నాడని, ఆయన బ్రహ్మజ్ఞానసంపన్నుడవడంచేత లౌకికకర్మకలాపంతో సంబంధం లేనివాడైనప్పటికి కేవలం క్రీడగా యజ్ఞాది నిర్వహణం చేస్తున్నాడని. (ప్రజ్ఞాతబ్రహ్మతత్త్వోఽపి - 2 – 35) చెప్పటం ద్వారా బ్రహ్మజ్ఞానం కలవానికి కర్మాచరణం అనావశ్యకమైనప్పటికీ "యావద్దేహపాతం కర్మ సమాచరేత్" అన్న ఆర్షసంప్రదాయాన్ని బట్టి కర్మాచరణం అపరిహార్యమని సూచించాడు. ఒకవైపు తమస్సుతోటి, వేరొకవైపు తేజస్సుతోటి కూడిన యీ బ్రహ్మాండసృష్టి "అనిర్వచనీయమ్" (తేజోమయం - 2 – 50) అని "అనిర్వచనీయ" వాదాన్ని స్పృశిస్తాడు. అలాగే "మునీన్ కౌశికవైదేహాన్" (3 - 9) అనే శ్లోకంలో "జ్ఞానంచేత మోక్షం, కర్మచేత స్వర్గం" పొందబడతాయనే వేదాన్తదర్శన రహస్యాన్ని ఉపమాముఖంగా కవి ఆవిష్కరిస్తాడు. 3. "యజూంషి తైత్తిరీయాణి" (3-13) అనే శ్లోకంలో యజుర్వేదీయ తైత్తిరీయశాఖావిర్భావాన్ని ఆవిష్కరిస్తాడు. ఈ కవికి చిన్నచిన్న ఉపమానాలలో సహితం వైదికసంప్రదాయాలను ఆవిష్కరించడంలో ప్రీతి ఎక్కువ. మురారి అథర్వవేదాన్ని చాలాచోట్ల ప్రస్తావించడాన్నిబట్టి ఆ వేదానికి ఆ కాలంలోగల ప్రాచుర్యం, ఆ వేదంతో మురారికి గల పరిచయం స్పష్టమౌతుంది. "పార్శ్వే త్రయీణామ్ (3 – 35) అనే శ్లోకంలో జనకశతానంద విశ్వామిత్రుల సన్నిధిలో ఉన్న రామలక్ష్మణద్వంద్వం ఋగ్యజుస్సామల సన్నిధిలో ఉన్న విధి — మంత్రస్వరూపం గల అథర్వణవేదంలా ఉన్నదంటాడు. రాముడు ఆథర్వణవిధి రూపంతో పోల్చబడటంచేత శాన్తస్వరూపుడని, లక్ష్మణుడు మంత్రరూపంతో పోల్చబడటంవల్ల సాక్షాత్తుగా ఆభిచారికక్రియా సంబంధమైన ఉగ్రత్వం మూర్తీభవించిన వాడని కవి తాత్పర్యం స్పష్టపడుతోంది. ఇలాగే జనకుణ్ణి ప్రశంసిస్తూ విశ్వామిత్రుడు పల్కిన - "అద్య ప్రదక్షిణశిఖావలయః కృశానుః" (3 – 11) అనే శ్లోకంలో "ఈనాడు ప్రదక్షిణజ్వాలావేష్టితుడైన అగ్ని మా జనపదాల్లో వేల్చబడిన ఆహుతులను స్వీకరిస్తున్నాడు. నీ తేజస్సు

స్ఫురిస్తూ ఉండగా అంగీరసుడైన శతానందుడు శాన్తి — పౌష్టిక క్రియల్లో నేతిని అగ్నిలో ఉంచడానికి ఉద్యుక్తుడై ఉన్న "ప్రయుక్త"ను శిథిలం చేస్తున్నాడని అంటాడు. ఇక్కడ అథర్వణవేద ప్రసిద్ధమైన శాన్తి — పౌష్టికక్రియల ప్రస్తావం కవి చేసాడు. కొంత భవభూత్యనుకరణం ఉన్నదనేది కూడా సత్యం।

4. ఇలాగే న్యాయశాస్త్ర సంప్రదాయాలను, అలంకారశాస్త్ర సంప్రదాయాలను కవి పరామర్శిస్తాడు. ఐదవ అంకంలోని వైతథ్యసంభాషణం ద్వారా రావణునిచే — "వైశేషికవటస్థ పండితః జగద్విజయాయమానః పర్యటామి. క్వాసౌ రామః తేన సహ వివదిష్యే" అని ప్రారంభించి "ఛలోపచారయుక్తిజ్ఞః సర్వేషాం విద్రావణః ఖల్వహమ్ ఇతి రామస్య వ్యాహృతమన్యథానుసంధాయవాక్ఛలేన ప్రత్యవతిష్ఠమానః నిగృహీతోఽపి" అనే వాక్యంవరకు న్యాయదర్శన ప్రతిపాదితమైన వాదప్రక్రియలను ఛల — నిగ్రహస్థానాదులను స్పృశించాడు.

5. ఇది మురారి రచననుబట్టి ఇతడు రసవాదాలలో, అనుకార్యనిష్ఠం రసమనే వాదాన్ని ఆశ్రయించినట్లు కనబడుతుంది. 'మయి రసతయా శోకో భావః చిరేణ విపచ్యతే' అనే శ్లోకంలో రామునిలో అవిరళశ్వాస — ముఖశోష — స్వరభేద — అవయవపతానవ — విపత్తికాది అనుభావసాత్త్వికభావాలను, జాడ్యాది సంచారిభావాలను వర్ణించి తన్మూలంగా శోకభావం కరుణరసంగా పరిణమించుతున్నదని చెప్పడాన్నిబట్టి రసం అనుకార్యనిష్ఠమనే స్పష్టపరుపబడింది. ఇలాగే పూర్వం "పుణ్యలక్ష్మీకయో" (3 - 34) అనే శ్లోకంలో రామాదులలోని వీరరసానికి వారి మౌంజీబంధనాదివ్యక్తమైన శాన్తరసం ఉపకారకమైందని చెప్పడంద్వారా వీరశాన్తరసాలు రెండు రామలక్ష్మణులలో ఆవిర్భవించాయని చెప్పి పై వాదాన్ని సమర్థిస్తాడు. అందుకే అనర్ఘరాఘవ వ్యాఖ్యాతల్లో ఒకడైన శ్రీరామానందాశ్రమముని, తన "ఇష్టార్థకల్పవల్లీ" వ్యాఖ్యలో "అథవా ముఖ్యయా వృత్త్యా రామాదావనుకార్యే. తద్రూపతానుసంధానాన్నర్తకేఽపి వీరరసః ప్రతీయత ఇతి భట్టలోల్లటాది మతమనుస్మృత్యోక్తమ్ ఇదమేవ కవిరుత్తరత్ర వక్ష్యతి- "మయి రసతయా" ఇతి" అని వ్యాఖ్యానించాడు. ఏదైనా ఒకరసం అతిభూమిని పొందిందని భావించినప్పుడు దాన్ని రసాంతరంచే తిరోధానం చేయటం అనేది ఆనందవర్ధనాది గ్రంథసిద్ధ

1. పుణ్యోఽపి భీమకర్మా.........బిభ్రతివాథర్వణో నిగమః ॥ [మహా. 2 - 24]
బ్రహ్మద్విషో హ్యేష నిహన్తి సర్వాన్ అథర్వణస్తీవ్ర ఇవాభిచారః [మహా. 1-62]

మైన విషయం దీన్ని కవి_పంచమాంకంలో_"కేన పునరేష రసో రసాంతరేణ తిరస్క్రియతే" అనే వచనం ద్వారా - కరుణరసం రౌద్రంచేత తిరస్కరింపబడవచ్చునని కబంధవృత్తాన్త ప్రస్తావంద్వారా సూచించాడు. ఇక్కడ - "రౌద్రవీరభయైః శాంత్యా కరుణస్తు ప్రశామ్యతి" అనే శాస్త్రకారవచనం ప్రమాణం. ఇలాగే సప్తమాంకంలోని "ప్రాణాయామోపదేష్టా" [7 - 62] ఇత్యాది శ్లోకంలో "శృంగారాద్వైతవాదీ" అనే పదంచేత రసాంతరోద్దీపకమవటంచేత శృంగారం ఒక్కటే రసం అనే వాదాన్ని మురారి వ్యక్తపరుస్తున్నాడు. బహుశః ఈ శ్లోకమే భోజునికి శృంగారప్రకాశ గ్రంథంలో శృంగారం ఒక్కటే రసం అనే వాదాన్ని ప్రతిపాదించడానికి స్ఫూర్తినిచ్చి ఉండవచ్చు[1]. ఇలాగే సందర్భోచితంగా కైశికి. అరభటి[2]. మున్నగు శబ్దాలను కూడా కవి వాడాడు. అంతేకాదు 7వ అంకంలోని "బిభ్రతీం కైశికీం"[3]. ఇత్యాది శ్లోకంలో కైశికీవృత్తితో కూడిన రీతిని [వైదర్భీరీతిని] మహారాష్ట్రదేశంలోని కవులు ఆశ్రయిస్తారని చెప్పాడు.

## వ్యాకరణశాస్త్రాభినివేశం - పదవాక్యప్రయోగవైచిత్రి-9

"న శబ్దబ్రహ్మోత్థం పరిమలమనాఘ్రాయ చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు ॥" (7 - 151)

అని అనడాన్నిబట్టి ఈతని రచన వ్యాకరణశుద్ధమై ప్రయోగవైచిత్ర్య బంధురంగా ఉంటుందనేది ఎల్లరూ అంగీకరించేదే. నిఘంటువులలో మాత్రమే లభించేవి, శబ్దస్వరూపంచేతనే కొంత విచిత్రాలకు ఆస్పదమైనవీ, అయిన పదాలను, "హఠాత్తుగా పఠించేవారికి" కొంతవిలంబంగానే అర్థస్ఫూర్తినిచ్చే వాక్యవిన్యాసాలను కవి ధారాళంగా ప్రయోగించాడు. "నైషధం విద్వదౌషధమ్, అన్నట్లు "మురారేః పదచిన్తాచేత్ తదా

---

1. శృంగారవీరకరుణాద్భుత హాస్యరౌద్ర బీభత్సవత్సల భయానకశాన్తనామ్నః ।
ఆమ్నాసిషుర్దశరసాన్ సుధియో. వయంతు శృంగారమేవ రసనాద్రసమామనామః ॥
[శృంగారప్రకాశము]

2 తత్కాలారభటీ విజృంభణ.... [7 - 102 గద్య ]

3. బిభ్రతీం కైశికీం వృత్తిం సారభోద్గారిణీం గిరః । దూరాధ్వానోఽపి కవయో యస్య రీతి ముపాసతే ॥ [7 - 102]

మాఘే మేఘే గతం వయః" అనేది అనర్ఘరాఘవానికి విద్వల్లోకంలో ఉన్న ప్రయోగవైచిత్ర్య పురస్కృతమైన వైశిష్ట్యాన్ని తెలియజేస్తున్నది.

"యే శబ్దశాస్త్రనిష్ణాతాః యే శిక్షితనిఘంటవః ।
తేషామేవాధికారోఽస్తి మురారికృతనాటకే ॥

అన్న సూక్తి అక్షరసత్యం. కవికి చక్కని చిక్కని వ్యాకరణశాస్త్ర ప్రవేశం ఉన్నదని తెలియజేసే పదవాక్యప్రయోగాలు చాలా ఉన్నాయి. మచ్చుకు ఒకటి ప్రథమాంకంలోని "కిచ్చిత్ కాంతారభాజాం [1 – 25] అనే శ్లోకంలోని 3వ పాదంలో "కర్తుం వా కచ్చిదంతర్వసతి వసుమతీదక్షిణః సప్తతంతుః" అనేవాక్యంలో "కర్తుమ్" అనే తుమున్నంత శబ్దప్రతిపాద్యమైన క్రియలలో "కర్మ" కారకంగా అన్వయింప వలసింది 'సప్తతంతు' శబ్దవాచ్యమైన యాగం కనుక దానికి 'కర్మణి ద్వితీయా' అని ద్వితీయ రావాలి. కాని. "వసతి" అనే ప్రధానక్రియనుబట్టి దానిలో కర్తగా యజ్ఞం అన్వయించి 'అభిహితే తు కర్తరి ప్రథమా' అనే నియమాన్నిబట్టి ప్రథమావిభక్తిని పొందింది. ఇక్కడి "కర్తుం" "వసతి" అనే రెండు క్రియలతోటి "సప్తతంతు" అనే శబ్దానికి అన్వయం ఉన్నప్పటికీ, ప్రధానక్రియాన్వయమే అభ్యర్హితమనే వ్యాకరణ సంప్రదాయాన్ని కవి ఇక్కడ పాటించాడు. దీన్నే "యదేవోక్తం విశేష్యేణ తిఙా వాయది వా కృతా। విశేషణక్రియా సర్వమప్యుక్తం తద్వదేవహి ॥ అని శాస్త్రకారులు చెప్పారు. "సమూలఘాతమఘ్నంత" "జీవగ్రాహంగృహ్ణన్తి" ఇత్యాది ప్రయోగాల్లోను. "అష్టౌ కాణీ చకార" "వైరిణస్య స్మరణం ఇత్యాది కారక ప్రయోగాల్లోను. చమూషతి, పిపర్తు, ఉల్లలయతి, జంబాలపిండాయతే ప్రాయశ్చిత్తయాంచక్రే, అద్యాపిపట్, ఇత్యాది క్రియాపదప్రయోగాల్లోను, మురారి చాలాచిట్ట, కర్ణేజపాః, భోగినః, లేలిహానః, ఇత్యాది కృత్ ప్రయోగాల్లోను, వాక్యప్రయోగాల్లోనూ — "బిలుగు" కనబడుతుంది.

ఈ క్రింది మురారి వాక్యాలు దీన్ని స్పష్టపరుస్తాయి.

1. మమహి, గురువచన తృష్ణామంకురీకరోతి శ్రోత్రవృత్తిః ఇంద్రియాంతరానుసారిణో హృదయమహోగణస్య. [1 — 16 గద్య.]

2. అద్యఖలు దిలీపకుల కుశలకర్మ కల్పలతానామంకురగ్రంథిభిరుదీర్యంతే కిసలయాని. [1 – 24 గద్య.]

3. యదియం త్వదుపస్థాన సులభసంభావనాతిప్రసంగ సంగీతన ప్ర్రీకి మే చిత్త వృత్తిః నియోగానుగ్రహాయ స్పృహయతి. [1 - 33 గద్య.]

4. కస్య — తలినీ తాదృశీ జిహ్వా - యస్త్వామపి బ్రువాణమధరోత్తరేణ లభి సంధత్తే. [అం. 1 - పు. 51]

5. కథముదయగిరి కాశ్మీరకుంకుమకేదారస్య ప్రభాత సంధ్యాలతాయాః ప్రథమ స్తబకః గభస్తిమాలీ హస్తహస్తికయా కుతూహలినీభిః దిగంగనాభిః వారుణీం యావదుపనీతః [2 - 43 గద్య.]

6. నహి మిహిరమరీచి నిచయపచేలిమస్య తుహినకరబింబసంవాదాత్ అపరోఽపి కశ్చిత్ అగదంకారః కైరవాకరస్య. [3 - 57 గద్య.]

ఇలా ఎన్నివాక్యాలైనా ఉదాహరింపవచ్చు. మొత్తంమీద ఈతని రచనాశైలిలో శాస్త్రపాండితి శ్రౌత — స్మార్తసంప్రదాయవాసన స్పష్టంగా గోచరిస్తుంది. ఇక సాహిత్య వ్యాకరణశాస్త్రసంప్రదాయాల్ని స్ఫురింపజేసే ఈ క్రింది వాక్యాలు చూడండి. 1. ఆరో అంకంలో శుకుడు_'దాశరథివిజయాయ సన్నహ్యతే దేవః' అని అంటాడు. ఇక్కడ "దాశరథి విజయాయ" అనే సమస్తపదంలో దాశరథేః విజయః" అని షష్ఠీవిభక్తి ఉంది. ఇది కర్త్రర్థంలోనా లేక కర్మార్థంలోనా అని సందేహం. కనుక రామకర్తృక విజయంకూడా కావచ్చు. కనుక ఈ మాటల్లోని అమంగళాన్ని శంకించి. మాల్యవం తుడు _ "కథం దాశరథివిజయాయేతి అవిశిష్టోపప్రత్తిక కర్తృకర్మకారకార్థవిషయం వయస్యవచనమ్" అని శంకను వెలిబుచ్చుతాడు. ఇలాగే — మాల్యవంతుడు - స్వస్తి. విజయేతాం రామలక్ష్మణౌ_కుంభకర్ణమేఘనాదౌ" అని అన్నప్పుడు, ఇక్కడ విజయం రామలక్ష్మణ కర్తృకమా ? కుంభకర్ణమేఘనాద కర్తృకమా ? అని సందేహించి శుకుడు - శాన్తంపాపమ్ ! కథమవిశిష్టకర్తృకర్మభావముభయత్ర ద్వివచనం ప్రయుక్తమార్యేణ అని అంటాడు.

వ్యాకరణశాస్త్రమాత్రప్రసిద్ధాలైన ఆదేశ : 1, స్థానివద్భావ : ఆకృతిగణ : సాధక తమం, జనికర్తు : ప్రకృతితా2. ప్రకృష్ట కర్త్రభిప్రాయ క్రియాఫలవత : 3, ఇత్యాది

1. తపోభిరస్య బ్రాహ్మణాదేశోఽపి స్థానివద్భావేన క్షత్రకార్యంన జహాతి (4 అం)
2. యదిందోరన్వేతి.......... జయతి జనికర్తు : ప్రకృతితా (1 - 58)
3. ప్రకృష్టకర్త్రభిప్రాయ క్రియాఫలవతో విధిన్ .... .... ....(2 - 88)

ప్రయోగాలు నానార్థపరంగా వాడుతాడు. శబ్దప్రయోగంలో కొంత వక్రతను ఈ కవి తప్పక ప్రదర్శిస్తాడు. ప్రసిద్ధ ప్రయోగాలను కాక, బుద్ధికి ఆలోచనను కలిగించే ప్రయోగాలనే చేస్తాడు. గరుడధ్వజుడు అనటానికి బదులు "శకున్తరాజకేతుః" అంటాడు. ఆత్మజ్ఞాన సుఖావస్థితి అనే అర్థంలో "ప్రత్యగ్జ్యోతి: ప్రబోధసుఖాసికా" అని ప్రయోగిస్తాడు. శివధనుస్సుభంజన ప్రతిభటుడు అనడానికి– "కాత్యాయనీకాముక కార్ముక కారోపణ ప్రణయ ప్రవీణ:" అని అంటాడు. ఇలాగే "అపదక్షీణషాడ్గుణ్య మంత్రీ": "చతుర్ముఖీరంతశృంగాటక విహారిణీమ్": "కర్ణోపకంఠ పలితంకరిణీ "తారామైత్రకమ్" 'అహిభయోపజాపజర్జరదమ్' ని: శారతారం" "దులిచటుషి" "ఏకలోష్ఠవధ:" "జయ పరాజయాలనుబట్టి అనటానికి "అన్వయవ్యతిరేకాభ్యాం" అని. "ప్రహసనవిభీషికామ్" అని. కత్తితో ఆత్మహననం చేసికొంటాననే అభిప్రాయాన్ని వ్యక్తపరచడానికి– "అసౌ మాషితస్య ఆత్మన: ప్రక్షాళనాయ. ప్రాప్తం శస్త్రధారా తీర్థమ్" అని అంటాడు. "మరణించావు" అని అనటానికి "పర్యవసితోఽసి" అని అంటాడు.

అప్రసిద్ధ ప్రయోగాల్లో ఇతడు నితాంతాభినివిష్టుడు అనేది త్రికాలాబాధసత్యం. రేణుకేయ:, త్రైశంకవమ్, శాతమన్యవం, భానవీయం, రాహవీయం, వైష్ణవీయం, వాప్పతేపం, పారస్త్రైణేయ:, బంధుమతేయ:, వైబుధ సైంధవీ ఇత్యాదులు కోకొల్లలు. ఇంతేకాక నిఘంటువులు వెతికితేనే కాని దొరకని– 'ఆశుశుక్షణి:' (అగ్ని): "కమితా" (కాముకుడు) "ప్రణాయ్య:" (ముముక్షువు) 'అశ్వీనం' (అశ్వంచే ఒకరోజులో వెళ్ల దగినది) "తర్కు:" (కుందెము) "పౌరోగవః" (పాకశాలాధిపతి) "ప్రధి:" (అంచు) "శృంగాటకం" (చతుష్పథం) "ఉల్లాఘన:" (రోగమును బోగొట్టువాడు) "జాంగలిక:" (విషవైద్యుడు, రాక్షసుడు) "ద్వైరాజ్యం" (ప్రతిపక్షత) "క్రతులిహ:" (దేవతలు) "స్వాజన్యం" (సమాన కులంలో పుట్టడం) "ఖర్జూలతా" (దురద) "నయ:" (అభినయం) "చరమ:" (జ్యేష్ఠుడు అనే అర్థంలో) ఇలాంటి ప్రయోగాలు చాలా ఉన్నాయి.

---

ఒకో అంకంలోని "కాణిదకార చరమో రఘురాజపుత్ర:" అనే వాక్యంలో చరమ పదం రామునికి ఎలా అన్వయిస్తుందని శంకించి– "చరమో జ్యేష్ఠ కనిష్ఠయో:" అని విశ్వప్రకాశ నిఘంటు ప్రమాణాన్ని వ్యాఖ్యాతలు చూపారు.

## మురారి శైలి - 9

మురారి "శయ్య" అనేది ఆంధ్రకవులకు చాలా ప్రసిద్ధమైన విషయం. ఈతని కవిత్వధార ప్రౌఢంగా కనిపించినా, వాస్తవానికి పాత్రౌచిత్యం, సందర్భశుద్ధి ఈతని శైలికి నియామకాలు. ఆనందవర్ధనాదుల నిర్వచనాన్నిబట్టి చూస్తే మాధుర్యౌజః ప్రసాదాలు మూడు ఈతని రచనలో కలబోసుకుని ఉన్నాయి. ఈ మూడు గుణాలను ఆశ్రయించే ఈతని "శైలి" కనపడుతుంది. దీర్ఘ సమాసాలు ఉన్నంత మాత్రంచేత[1], లేదా సమాసాలు లేకపోవటంచేత[2] ఓజోగుణం ఉన్నది—లేదు అనే నిర్ణయం చేయటం కుదరదు. చంద్రవర్ణనం చేసినప్పుడు దీర్ఘ సమాసాలున్నా[3] ప్రసాదగుణమే తప్ప ఓజోగుణం కాదు.

వందారు వృందారకవృందబందీమందారమాలామకరందబిందూన్ ।
మందోదరీయం చరణారవిందరేణూత్కరైః కర్కశతామనైషీత్ ॥

(6-82) ఇలా లలిత శబ్దగ్రథనంతో ప్రసాదగుణాన్ని మురారి బాగా ఆశ్రయించినట్లు కనబడుతుంది. ఇలాగే 5వ అంకంలో "కుముదవనవిలాసయత్రాగ్రదంభోరుహా" "మహిషవిషాణవ్యస్తపాషాణపీఠ" (5-20) ఇత్యాది శ్లోకాల్లో ప్రసాదగుణాన్నే కవి పోషించాడు. "ఇయమవిరలశ్వాసా" అనే శ్లోకంలో విప్రలంభ శృంగారం లేదా కరుణ పోషింపబడింది కనుక కైశికీవృత్తి ప్రధానమైన 'మాధుర్య'గుణం చిత్తద్రుతికారణం. లేదా ప్రసాదగుణమేనని చెప్పవచ్చును. 'రే కాకుత్స్థాః కథం వః..........క్రోధాదుత్క్రాంతగర్భామిషరుధిరవసా విస్రగంధిః కుఠారః' (4-25) అనే శ్లోకంలో రౌద్ర-బీభత్సరస ప్రధానమై దీప్తిజనకంగా ఉన్న రచన ఆరభటీ వృత్తినాశ్రయించి ఓజోగుణానికి సరైన నిదర్శనంగా ఉంది.

ఇలాగే మురారి తన నాటకంలో రససముచితమైన శైలిని ఆశ్రయించి ప్రసాదగుణ ప్రచురంగా రచన సాగించాడని చెప్పడం సముచితం.

---

1. మదచపల చకోరచంచుకోటీకవలన తుచ్ఛమివ (2-76): ప్రత్యుద్వ్రజత్పురుహూతపత్తనవధూదత్తార్ధ దర్భాంకురక్షీబోత్సంగకురంగమ్ (2-72)
2. యేన స్వాం వినిహత్య మాతరమపి (4-52):
3. దలిత కుసుమ కోశోదంచదూష్మోపచారక్షణశమితచకోరీ చంద్రికా పానజాడ్యా (7-69)

## అనర్ఘనాటకంలో రసం - 10

మురారి ప్రారంభంలోనే తననాటకంలోని కథాంశ ఎలాంటిదో స్వయంగా నిర్దేశించాడు. "పతత్పత్రిపాదాగతేన కలహంసకులనాదేన్న కుశలపేన రౌద్ర - బీభత్స - భయానకాద్భుతరసభూయిష్ఠం కిమపి ప్రబంధమభినయతా నిత్యం కిలాయముద్వేజితో లోకః" అని --

'తస్మై వీరాద్భుతారంభ గంభీరోదాత్తవస్తవే ।

జగదానందకందాయ సందర్భాయ త్వరామహే' అని చెప్పడంచేత, తన నాటకంలో రౌద్ర — బీభత్స — భయానకాదిరసాలకంటే వీరాద్భుతరసాలకు ప్రాధాన్యం ఉంటుందని స్పష్టంచేశాడు. కనుక ఈ నాటకంలో వీరరసం ప్రధానం కాగా ఇతర రసాలు ఇంచుమించుగా అన్నీ అంగాలుగా వర్ణింపబడ్డాయని చెప్పవచ్చును. ప్రత్యక్షంగా సీతారాముల పూర్వానురాగ దర్శనాదులను కల్పించకుండా - 1వ అంకంలోని విష్కంభకం ద్వారా సీతాస్వభావవర్ణనాలచేత, రావణపురోహితాగమనంచేత సీతదుర్మనాయమాన అని చెప్పడమేకాక, ఆమె రామలక్ష్మణాభ్యాగమనాన్ని విని యౌవనోచితంగా ప్రతిస్పందించుచున్నదని వ్యక్తపరచడం ద్వారా-అభిలాషిక శృంగారానికి కవి బీజం వేశాడు. ఇలాగే 2వ అంకంలోనే సీతను గురించిన ప్రస్తావనను విశ్వామిత్రుడు నవ్వుతూ పల్కిన మాటలకు, రాముని అనుకూలప్రతిస్పందనను చూచి, లక్ష్మణుడు - 'ఆర్యా యామమయోనిజన్మని రాజకన్యకాయామపి' అని పరిహసించడం - ఇత్యాది సన్నివేశంచే రామనిష్ఠమైన ప్రీతికి బీజాలువేసి-అభిలాషిక శృంగారాన్నే పోషించాడు. 5వ అంకంలో దీన్నే విప్రలంభమూలమైన కరుణంగా మలచాడు కవి. చివరకు సీతపాత్రను ప్రవేశపెట్టి సంభోగశృంగారానికి ప్రాణంపోశాడు. ఇక మిగిలినచోట అన్ని సందర్భాలలోను వీరరసం ప్రాధాన్యాన్ని వహించింది. 1, 2 చోట్ల రౌద్ర - బీభత్స - హాస్యరసాలు, ఆశ్రమవర్ణనంలో శాంతంకూడా కవి స్పృశించాడు. మొత్తంమీద ఈ నాటకం వీరరసప్రధానమైనదని కవి తాత్పర్యం - పాఠకుల అనుభవం. శివధనుర్భంగం, జామదగ్న్యవిజయం, రావణవధ మున్నగు ఘట్టాలలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఇదే పోషింపబడింది.

సంస్కృతరూపక సాహిత్యంలో ఇంతటి ప్రాశస్త్యాన్ని సంతరించుకున్న ఈ నాటకానికి సంస్కృతంలో పలువ్యాఖ్యలు ఉన్నాయి. వీటిలో రుచిపత్యుపాధ్యాయుడు

వ్రాసిన వ్యాఖ్య ప్రాచీనమైంది. శ్రీ రామానంద విరచితమైన "ఇష్టార్థ కల్పవల్లి"; శ్రీ విష్ణుభట్ట విరచితమైన "పంచికా" వ్యాఖ్య; శ్రీ హరిహరదీక్షిత విరచితమైన టీకతో అనర్ఘరాఘవం మైసూరులో ప్రకాశితమైంది. ఇలాగే సంస్కృతంలో దీనికి వ్యాఖ్యలు ఉన్నా, వ్యాఖ్యాసాపేక్షమైన ఈ నాటకానికి తెలుగులో అనువాదం ప్రబంధీకృతి ఉన్నప్పటికీ, వ్యాఖ్య లేదు. శ్లోకాలలోని జిలుగు అందాలు ప్రయోగ వైచిత్ర్యాలు వ్యాఖ్య లేనిదే సంస్కృత పరిచయం తగుమాత్రంగానో లేదా అసలు లేనివారికో – అందవు. అందునా "తెలుగు" మాధ్యమంగా ఈ నాటకాన్ని అవగాహన చేసికోవడానికి తెలుగులో వ్యాఖ్య అత్యవసరమై ఉండగా ఆ లోటును– తెలుగు విశ్వవిద్యాలయసాహిత్య పీఠాచార్యులు, మిత్రులు బేతవోలు రామబ్రహ్మంగారు తీర్చారు.

ఇలాగే సంస్కృత సాహిత్యంలోని అనర్ఘరత్నాలను తమ వ్యాఖ్యలద్వారా, అనువాదాల ద్వారా తెలుగు పాఠకులకు అందించడానికి భగవానుడు వీరికి సర్వ విధావకాశాలను కలిగించాలని, ఇటువంటివారి పై దుష్యాన్ని తెలుగు పాఠకలోకం గ్రంథ ప్రకాశకలోకం తప్పక వినియోగించుకోవాలని, వినియోగించుకుంటారని ఆశిస్తూ, అనర్ఘ రాఘవనాటకంపై ఉపోద్ఘాతరూపంగా నాల్గుమాటలు వ్రాసే అవకాశాన్ని అనుకోకుండగ కలుగజేసిన రామబ్రహ్మంగారికి కృతజ్ఞతాభివందనములతో సెలవు__

ఆంధ్రగీర్వాణవిద్యాపీఠం
ఎన్. వి. జె. వి. సంస్కృత కళాశాల
కొవ్వూరు. ప॥ గో॥ జిల్లా.

భవదీయుడు,
సముద్రాల రంగరామానుజాచార్యులు
12-5-92



# నేపథ్యము

దేవీం వాచముపాసతే హి బహవస్సారం తు సారస్వతం
జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః ।
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీరతా
మాపాతాళనిమగ్నపీవరతనుర్జానాతి మంథాచలః ॥

మురారి పేరు చెప్పగనే సాహితీపరులకు వెంటనే ఈ శ్లోకము స్ఫురించును. గురుకులక్లిష్టుడగు పండితకవి మురారి. ఈతని రచనము అనర్ఘరాఘవ మొక్కటే మరికొన్ని యున్నవి కాని ఇప్పుడు లభించుటలేదు అనుటకు కొన్నిప్రతులలో కన్పించు చున్న గ్రంథాంతగద్య "భట్టమురారేః - కృతిషు — అనర్ఘరాఘవం నామ నాటకం సమాప్తమ్" — అనునది అవకాశమిచ్చుచున్నది. కానీ మరియొకటి ఇంతవరకును దొరుకలేదు. ఈ ఒకేఒక్క దృశ్యకావ్యముతో మురారి సంస్కృత సాహిత్యక్షేత్ర మున ప్రౌఢకవిగా స్థిరపడినాడు. ఇంతకును పై శ్లోకము అనర్ఘరాఘవప్రతులు కొన్నింట లేనేలేదు. కొన్నింటమాత్రము ప్రక్షిప్తపాఠముగా అథస్సూచికలో నున్నది.

'మురారేస్తు తృతీయః పంథాః' అనునది మరియొక సుప్రసిద్ధవాక్యము. మురారి రచన విలక్షణముగా నుండుననుటకు పండితులు ఈ సూక్తి నుపయోగింతురు. శ్రీమద్రామాయణ కల్పవృక్షమున విశ్వనాథవారు 'ప్రశస్తవాగ్విలక్షణుడు మురారిభట్టు' అనిరి. భావనయందును అభివ్యక్తియందును మురారికి ఒక విలక్షణత్వము ఉన్నది. ఈతనిది అటు కాళిదాసాదులకుగానీ, ఇటు భవభూతి హర్షాదులకుగానీ చేరువకాని ఒక విలక్షణమైన గొంతు. దీనిని సూచించుటకే "తృతీయః పంథాః" అనుట. కానీ ఈ మాటను ప్రకాశవ్యాఖ్యా రచయిత శ్రీరామచంద్రమిశ్రులు అంగీకరించుటలేదు. మీమాంస కులలో సుప్రసిద్ధుడు ఒక మురారి ఉన్నాడట. భట్టమతమునకును ప్రభాకరగురుమతము నకును భిన్నముగా అతడు ఒక క్రొత్త సిద్ధాంతమును ప్రతిపాదించెనట. దానినే మురారేస్తు తృతీయః పంథాః అనుచున్నారట. కావున ఈ సూక్తిలోని మురారి సాహితీమురారి కాదనియు మీమాంసామురారి అనియు శ్రీరామచంద్రమిశ్రులవారి అభిప్రాయము. దీనినే పలువురు పెద్దలు అంగీకరించిరి.

రామకథను దృశ్యకావ్యముగా మలచినవారిలో భవభూతి అగ్రగణ్యుడు. కావున ఈ మురారిని భవభూతితో పోల్చి కొందరు తమ అంచనాలను ప్రకటించిరి, కానీ ఇవి

యన్నియు పై రెండు పేరులలోని శైవవైష్ణవ రూపార్థములపై ఆధారపడి సాగినవే తప్ప సాహితీపరామర్శతో నిష్పాక్షికముగా చేసినవికావు. నిర్వాణమును వాంఛించు నేను భవభూతిని అనాదరించి మురారి పదచింతనకు మనసు తార్చుచున్నాను అని ఒకరు—

భవభూతిమనాదృత్య నిర్వాణమతినా మయా ।
మురారిపదచింతాయామిదమాధీయతే మనః ॥

మురారి పదచింతనయందు మనసు కుదిరినచో ఇక భవభూతిమాట ఏల। భవభూతిని పరిత్యజించి మురారిని అంగీకరింపుమని ఇంకొకరు. [పదశబ్దశ్లేష గుర్తింపదగినది.]

మురారిపదచింతాయాం భవభూతేస్తు కా కథా ।
భవభూతిం పరిత్యజ్య మురారిమురరీకురు ॥

మరియొక పండితుడు మాఘశబ్దమును సభంగశ్లేషతో జోడించి మా + అఘే— అను విరుపుతో మరింత ముందునకు పోయెను—

మురారిపదచింతాచేత్తదా మాఘే మతిం కురు ।
మురారి పదచింతాచేత్తదా మాఽఘే మతిం కురు ॥

సంస్కృత సాహిత్యమున - రామాయణమును రఘువంశముగా సంతరించిన కాళిదాసు మార్గమొకటి, మహావీరచరితముగా రూపొందించిన భవభూతి మార్గమొకటి, కాగా ఈ రెండింటికిని భిన్నముగా విలక్షణముగా మురారిది మూడవమార్గ మనుట సత్యము. ఇది కలగలుపు కావచ్చును.

రామపాత్రలో తనకాలము వారికి కళంకములుగా కన్పించిన సంఘటనలను అనల్పకల్పనా చాతుర్యముతో అన్యథాకరించి రామపాత్రను సముదాత్తసుందరముగా చూపుటయే ప్రధానలక్ష్యముగా మురారి ఈ నాటకమునందు ఇతివృత్తమును అల్లినట్లున్నది. "అనర్ఘరాఘవము" అని పేరు పెట్టుటలోని అంతర్యము ఇదే కావచ్చును.

ఈ కవి కాలాదులను గూర్చి స్పష్టముగా ఏమియు తెలియుటలేదనుట స్పష్టము. కాళిదాసాదులవలెనే ఈతడును తన్నుగూర్చి తానేమియు చెప్పికొనలేదు. తంతుమతీ వర్ధమానుల పుత్రుడనియు మౌద్గల్యగోత్రుడనియు మాత్రము ప్రస్తావనవలన తెలియుచున్నది.

ఈతడు భవభూతికి తరువాతివాడనుట నిస్సందేహము. హరవిజయ కర్తయగు రత్నాకరుడు మురారి ప్రస్తావన చేసియున్నాడు. అంకోత్థనాటక ఇవోత్తమ నాయకస్య నాశం కవిర్వ్యధిత యస్య మురారిరిత్థమ్ – అని. కావున మురారి ఈ రత్నాకరునికి పూర్వుడనుట నిశ్చయము. ఈ రత్నాకరుడు అనంతవర్మకు ఆస్థానకవి. అనంతవర్మ కాలము క్రీ॥ శ॥ 855-884 అని చారిత్రకుల నిర్ణయము అనగా మురారి క్రీ॥ శ॥ 855 సం॥కు ముందువాడగుట తథ్యము.

సప్తమాంకములో ఈతడు చేదిమండలము నేలిన కలచురివంశీయుల రాజధానిగా మాహిష్మతిని వర్ణించియున్నాడు [7 - 115]. ఈ కలచురివంశీయులు క్రీ॥శ॥ తొమ్మిదవ శతాబ్ది మధ్యభాగమున మాహిష్మతిని విడిచి త్రిపురికో రత్నపురికో తమ నివాసములను తరలించినట్లు చరిత్ర చెప్పుచున్నది.

ఈ కలచురి వంశీయులలో అనంగహర్షుడు సుప్రసిద్ధుడు. ఉదాత్తరాఘవమను నాటకమును ఈతడు రచించెను. కుట్టనీమతమను గ్రంథమున ఈ అనంగహర్షుని ప్రస్తావన యున్నది.

ఈయీ ఆధారములనుబట్టియు ఆలోచనలనుబట్టియు మురారి క్రీ॥ శ॥ 8-9 శతాబ్దముల నడిమికాలమువాడై ఉండునని శ్రీరామచంద్రమిశ్రులు స్థూలారుంధతీ న్యాయముగా ఒక నిర్ణయము చేసిరి.

అనర్ఘరాఘవమునకు సంస్కృతమున పదికిపైగా వ్యాఖ్యానము లున్నవట. వానిలో రుచిపతి [నిర్ణయసాగర - 1937] శ్రీరామచంద్రమిశ్రుల [చౌఖాంబ-1960] వ్యాఖ్యలు సుప్రసిద్ధములు. ఇవికాక తెలుగు లిపిలో మూడువ్యాఖ్యలతో మహీశూరపురాధీశ్వరుల ప్రచురణ [1905] మరియొకటి ఉన్నది. శ్రీరామానందాశ్రమముని రచించిన ఇష్టార్థకల్పవల్లి, శ్రీవిష్ణుభట్టు రచించిన పంచిక. శ్రీహరిహరదీక్షితులు రచించిన అనామిక. ఈ మూడింటిలో ఇష్టార్థకల్పవల్లి సమగ్రముగా విస్తృతముగా సాగినవ్యాఖ్య. వ్యాకరణాంశములను ససూత్రముగా వివరించుట కల్పవల్లి-పంచికల ప్రత్యేకత. నిఘంటువులు అందరును చూపిరి. కాగా రుచిపతి శ్రీరామచంద్రమిశ్రుల గ్రంథములలో పాఠాంతరములు అథస్సూచికలుగా ఉన్నవి. తక్కినవారు వ్యాఖ్యతో కలిపి నడిపించిరి. మొత్తముమీద ఈ అయిదు వ్యాఖ్యానములకును "చూడామణి" పూర్తిగా ఋణపడియున్నది. కృతజ్ఞతాపూర్వకముగా ఆ పండితప్రకాండులకు మనసులోనే మ్రొక్కుచున్నాను.

# కథాసారము

అర్థుల కోరికలను తీర్చుట నీ వంశాచారము సుమా! గుర్తుంచుకొనుమని వసిష్ఠుడు పంపిన సందేశమును వామదేవుడు దశరథునికి వినిపించును. వీరు పరస్పరము సంభాషించుకొనుచుండగా విశ్వామిత్రుడు ప్రవేశించి యజ్ఞరక్షకై రామలక్ష్మణులను అర్థించును. కృశాశ్వసుతునివలన తనకు లభించిన అస్త్రవిద్యను రామునికుపదేశించుట మరొక ప్రయోజనముగా ఆశచూపును. ఎట్టకేలకు దశరథుడు వామదేవుని అనుమతితో వసిష్ఠసందేశ స్మరణముతో విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులను పంపుటకు అంగీకరించును. వారు బయలుదేరుటతో ప్రథమాంకము ముగియును.

ద్వితీయాంకము విశ్వామిత్రుని శిష్యులు శునఃశేఫపశుమేఢ్రుల సంభాషణతో ప్రారంభమగును. రాముడు అహల్యకు శాపవిమోచనము గావించెను. విశ్వామిత్రుని నుంచి బలాతిబలలతోపాటు సకలాస్త్రమంత్రములను గ్రహించెను. యజ్ఞవాటికకు కావలి తిరుగుచుండెను.

వాలి రావణాసురునితో సంధి చేసికొనుట జాంబవంతునికి నచ్చదు. అందులకై హనుమత్సుగ్రీవులతో కలిసి తాను ఋష్యమూకమునకు తరలిపోయెను. ఇది అదనుగా రావణుడు ఆక్రమింపనెంచి ఖరదూషణ త్రిశిరాదులతో కూడిన మహాసైన్యమును కిష్కింధాప్రాంతమునకు పంపెను. అందులో తాటకాదులు విశ్వామిత్ర ప్రభృతులను హింసించుచున్నారు. ఇది విష్కంభమున సూచింపబడిన కథ.

విశ్వామిత్రుని ప్రేరణతో రాముడు తాటకను సంహరించెను. సుబాహువు మరణించెను, మారీచుడు పరాస్తుడయ్యెను. కౌశికుడు సంతోషించెను. అంతలో జనకుని యజ్ఞప్రస్తావన వచ్చినది. శివధనుస్సునుగురించి హలముఖోదితయగు సీతను గురించి అప్పటికే వినియున్నరాముడు కుతూహలము ప్రకటించెను. విశ్వామిత్రునితో రామలక్ష్మణులు మిథిలకు ప్రయాణమగుట ద్వితీయాంకము.

జనకుని కొలువుకూటము తృతీయాంకము. విశ్వామిత్రునికి స్వాగతసత్కారములు, రామలక్ష్మణుల పరిచయము, విశ్వామిత్రశతానందుల పరస్పరప్రశంసలు, శివధనుస్సును పణముగాపెట్టిన నియమమును శిథిలపరచుకొన్ననేతప్ప సీతకు వివాహము చేయలేనేమోయని జనకుడు విచారము వెలిబుచ్చును. విశ్వామిత్రుడు నవ్వి శివధనుస్సును రామునికి చూపుమనును. జనకుడు శివధనుస్సు కథను ఉపన్యసించును.

# V

అంతలో రావణపురోహితుడు శౌష్కలుడు ప్రవేశించి సీతను రావణునికిచ్చి వివాహము చేయుమని అభ్యర్థించును. జనకుడు జవాబు చెప్పడు. శివధనుస్సును ఎక్కుపెట్టుట అను పణమును శతానందుడు వివరించును. వీరి సంభాషణము జరుగుచుండగా జనకకౌశికశతానందుల అనుమతితో రాముడు లక్ష్మణసహితుడై ధనుశ్శాలకు వచ్చును. ధనుర్భంగధ్వని నేపథ్యములో మారుమ్రోగును. శౌష్కలుడు అశక్తదుర్జనత్వమును ప్రదర్శించుచు మాల్యవంతునికి విషయమంతయు వివరింతునని వెడలును. ఇది తృతీయాంకము.

మాల్యవంతుడు శూర్పణఖ సంభాషణతో చతుర్థాంకము ప్రారంభమగును. సీతాకల్యాణమైనది. దశరథాదులు అయోధ్యకు ప్రయాణము కానున్నారు. కైక భరతునివార్త తెలిసికొనిరమ్మని మంథరను మిథిలకే పంపినది. కాని ఆమె మార్గమధ్యమున (గ్రీష్మతాపమునకు) వడదెబ్బతిని చెట్టునీడను మూర్ఛపోయినది. ఈ విషయమును హనుమంతుడు చూచివచ్చి జాంబవంతునికి తెలియజేసెను.

ఏదో ఒక ఉపాయముతో రామచంద్రుని ఋష్యమూకమునకు రప్పించవలెననియు సుగ్రీవునితో సఖ్యమునుగూర్చి రామునిచే వాలిని సంహరింపజేయవలెననియు కిష్కింధకు సుగ్రీవుని రాజును చేయవలెననియు జాంబవంతుని ఆలోచన. దీనికై ఒక శబరయోగినిని (శబరి) నియోగించి మంథరాశరీరములోనికి ప్రవేశపెట్టి [పరకాయ ప్రవేశము] మిథిలకు పంపెను.

ఇది అంతయు మాల్యవంతుడు శూర్పణఖకు వివరించి చెప్పెను.

కావున ఓ శూర్పణఖా! జాంబవంతుని ప్రణాళికప్రకారము క్రొత్తగా అడవుల పాలైన రాముని వంచించి సీతను అపహరించుట మనకు సులభము. ఇట్లుమాత్రమే రావణుని ప్రణాళికను అమలుపరచగలము. దశరథుని సన్నిధిలో మన మాయలుపారవు. అతడు ఇంద్రునికి సహాయముగా నిల్చి అనేకపర్యాయములు రాక్షసులతో యుద్ధములు చేసెను. సమస్త రాక్షసమాయలను పరాస్తము చేయగల సమర్థుడు.

ఈ మాల్యవంతుని ఆలోచనకు శూర్పణఖ సంబరపడి అంతవరకేల శివధనుర్భంగముతో కోపించిన పరశురాముడు దాశరథిపై విరుచుకొనిపడుచున్నాడట చూతము అని శుభవార్త నందించుటతో విష్కంభము ముగిసినది.

# VI

పరశురామ దాశరథుల సుదీర్ఘ సంభాషణ వీరరసపరిపోషకముగా సాగెను. చిట్ట కడపట పరశురాముడు ఓడిపోయి వైష్ణవతేజము లేదా క్షాత్రతేజము జయించినది. జనక దశరథులు సంతోషపడిరి. పరశురాముని జయించిన శుభసందర్భముననే రామునికి పట్టాభిషేకము చేయుదునని దశరథుడనుచున్నంతలో మంథర తెచ్చిన లేఖతో లక్ష్మ ణుడు ప్రవేశించును. అది కైక లేఖ. అందు వరముల ప్రస్తావన భరతపట్టాభిషేకము రామవనవాసము నున్నవని జనకుడు చదివి వినిపించెను. జనకదశరథులు మూర్ఛపోవుట లక్ష్మణుడు కటకటపడుట ఆయినతరువాత రాముడు సపత్నితల్లి ఆజ్ఞను శిరసావహించి వనవాసమునకు బయలుదేరును. ఇది చతుర్థాంకము.

మిథిలనుండి తిరిగివచ్చిన శబరి మంథరాశరీరమును విడిచి, స్వశరీరమును ప్రవేశించి జాంబవంతునికి జరిగినకథ అంతయు చెప్పును. సీతారామలక్ష్మణులు వనవా సమునకు వచ్చుట. గుహుండు గంగదాటించుట, చిత్రకూటమును చేరుట, భరతుడు వచ్చి దశరథమరణవార్తను తెల్పి పాదుకలతో ఏగుట, జనస్థానప్రవేశము విరాధవధ, కాకాసురవధ, శూర్పణఖ ముక్కుచెవులను సౌమిత్రి కోయుట - ఇదంతయు శబరి వలన విన్న జాంబవంతుడు రామునికి రావణునితో వైరము తప్పదని క్లేశపడి గుహుని తనవద్దకు పంపుమని శబరికి చెప్పును.

అంతట పరివ్రాజక వేషమున రావణుడు పంచవటికి వచ్చుట, సీతాపహరణము జటాయు మరణము, రామలక్ష్మణుల దుఃఖము నేపథ్యసంభాషణలతో జరిగిపోవును. గుహునితో కలహించిన కబంధుని లక్ష్మణుడు సంహరించి వచ్చుచు మార్గమధ్యమున దుందుభికంకాళకూటమును కాలితో ఎగురదన్నును. ఇరువురును రాముని సమీపింతురు.

సీతను రావణుడు అపహరించుకొని పోవుచుండగా హనుమంతుడెగిరి పట్టుకొనె ననియు, సీత ఉత్తరీయము చిన్నిముక్క చేజిక్కినదనియు దానిని సుగ్రీవుడు నీ కిమ్మనెనిదిగో అని గుహుండు సీతాదేవి ఉత్తరీయపు ముక్కను రామునికి ఇచ్చును. సుగ్రీవునిపై రామలక్ష్మణులకు గురికుదుర్చును. వాలివధకు ప్రతిజ్ఞజరుగును. ఇదియెల్ల జాంబవంతుని ప్రణాళికయే.

దుందుభి కంకాళకూటము నెవడురా తన్నెనని అరచుచు వాలి ప్రవేశించును. రామలక్ష్మణులను చూచును. "రామలక్ష్మణులు దండకలో ప్రవేశించి నా అనుచరు లను హింసించుచున్నారు కావున నా మిత్రుడవగు నీవు వారిని మట్టుపెట్టు" మని రావ

బుడు తనకు పంపిన సందేశమును వాలి తలచుకొనును, మీ ఇరువురిలో రాముడెవరని ప్రశ్నించును. తనకుతానుగా రామునితో తలపడును. ప్రత్యక్షయుద్ధమున రామబాణము సప్తతాళములను వాలి ప్రాణములను హరించి తూణీరమును చేరుకొనును. రామ సుగ్రీవుల సఖ్యము సుగ్రీవపట్టాభిషేకముతో పంచమాంకము ముగియును.

హనుమద్దౌత్యము విభీషణ నిష్క్రమణములు మాల్యవత్సారణుల సంభాషణలతో సూచింపబడుట షష్ఠాంకప్రారంభము. అంగదునిపై భేదోపాయము నుపయోగించుట. అది ఫలించకపోవుట. సేతుబంధనములు సూచింపబడినవి. శుకుడు ప్రవేశించి కపిసేన లంకలో ప్రవేశించినదనియు, యుద్ధమారంభమైనదనియు ప్రహస్త ధూమ్రాక్ష మహోదరాదులు సేనాపతులు మడిసిరనియు వార్తనందించును.

కుంభకర్ణుని దేహము నేలకు ఒరిగిపోవుచున్నదని నేపథ్యమునుండి వినిపించును. ఇంద్రజిత్తు లక్ష్మణుని బాణమునకు నిహతుడయ్యెనని మరొకవైపునుండి వినబడును. రావణుడు యుద్ధసన్నద్ధు డగుచున్నాడు.

మాల్యవంతుడు పాపప్రక్షాళనమునకు శస్త్రధారాతీర్థమే ఉచితమని రణరంగమునకు పోవును. ఇది విష్కంభము.

రత్నచూడ - హేమాంగములు ఇరువురు విద్యాధరులు ప్రవేశింతురు. రావణుడు రణరంగమునకు తరలివచ్చుట మొదలుగా రామరావణయుద్ధమును వర్ణించి చెప్పుదురు. ఇది ఏబది శ్లోకములు సాగినది. రావణవధతో ఆరవ అంకము సమాప్తము.

అగ్నిపరీక్ష అయినది. పుష్పకారూఢుడై రాముడు సీతాలక్ష్మణ సుగ్రీవవిభీషణాదులతో అయోధ్యకు బయలుదేరెను. ఆకాశమునుండి కాంతరణరంగమును వర్ణించుట ఆయా ప్రదేశములను సంఘటనలను వివరించుటలతో ప్రారంభించి సముద్రము, సేతువు, కైలాసము, సుమేరువు, చంద్రుడు, అగస్త్యుడు, తామ్రపర్ణి, కుండినము, సప్తగోదావరీభీమేశ్వరుడు, కాంచీపురము, ఉజ్జయిని, మాహిష్మతి, జాహ్నవి, వారణాసి ప్రయాగ, అయోధ్య – పట్టణలతో సాగిసాగి శ్రీరామపట్టాభిషేకముతో నాటకము సమాప్తమగును. రాముడు భరతవాక్యము పల్కును.

—0—

# కృతజ్ఞతలు

ఈ వ్యాఖ్యానమును సాహిత్యపీఠమున వైయక్తిక ప్రణాళికగా రచించుటకు అనుమతించి, ముద్రింపించిన తెలుగువిశ్వవిద్యాలయమువారికి, ఉపాధ్యక్షులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి, అప్పటి రిజిస్ట్రార్ డా॥ ఎన్. శివరామమూర్తిగారికి, ఇప్పటి రిజిస్ట్రార్ డా॥ బి. రామకృష్ణారెడ్డిగారికి ప్రత్యేకముగా కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను. ముచ్చటగా ముఖచిత్రము నందించిన శ్రీ బాలిగారికి వందనములు. సమగ్ర సుందరమైన పీఠిక సమకూర్చిన మిత్రులు డా॥ సముద్రాల రంగరామానుజాచార్యులు గారికి సాధువాదములు.

దీని రచనలో అటనట కలిగిన సంశయములను శిష్యవాత్సల్యముతో తీర్చిన పెద్దలు సర్వశ్రీ పేరి సూర్యనారాయణశాస్త్రి, మల్లంపల్లి శరభయ్య, విశ్వనాథ గోపాలకృష్ణ, చెరువు సత్యనారాయణశాస్త్రి — వీరికి కృతజ్ఞుడను. అలస్యమైనను అందముగా ముద్రించిన శ్రీ రత్నా ప్రింటర్స్ అధినేత, మిత్రులు శ్రీ కె. ఎస్. ఆర్. మూర్తిగారికి, వారి సిబ్బందికి, ఇంటికి ప్రూఫులందించిన వారి చిరంజీవులకు, సహకరించిన సహవ్రతులకు, సహోద్యోగులకు డా॥ జి. యస్. భాస్కర్‌గారికి డా॥ టి. గౌరీశంకర్‌గారికి శ్రీ ఆర్. వీరభద్రరావుగారికి ప్రొఫెసర్ ఆర్. తిరుమలరావుగారికి నా శుభాకాంక్షలు. వ్రాయనిచ్చిన నా అర్ధాంగి సర్వలక్ష్మిని, మమ్ము పట్టించుకోవేమని అలగని మా చిరంజీవులు శర్మిల రఘువీరులను ఆ సీతారాములు దయచూతురుగాక ।

వాల్మీకి గిరి సంభూతా రామసాగరగామినీ ।
శ్రీమద్రామాయణీ గంగా పునాతి భువనత్రయమ్ ॥
కవీందుం నౌమి వాల్మీకిం యస్య రామాయణీం కథామ్ ।
చంద్రికామివ చిన్వన్తి చకోరా ఇవ సాధవః ॥



# అనర్ఘరాఘవమ్

## ప్రథమోఽఙ్కః

నిష్ప్రత్యూహ ముపాస్మహే భగవతః కౌమోదకీ లక్ష్మణః
కోకప్రీతి చకోరపారణ పటుజ్యోతిష్మతీ లోచనే ।

---

అన్వయము :- యాభ్యామ్, అర్ధవిబోధ ముగ్ధమధురశ్రీః, అర్ధనిద్రాయితః నాభీపల్వల పుండరీక ముకులః కంబోః సపత్నీకృతః: కోకప్రీతి చకోర పారణ పటు జ్యోతిష్మతీ: భగవతః కౌమోదకీ లక్ష్మణః లోచనే: నిష్ప్రత్యూహమ్ ఉపాస్మహే.

అర్థము :- యాభ్యామ్=ఏ నేత్రములచేత, అర్ధవిబోధ=సగము వికసించుటతోనైన, ముగ్ధమధురశ్రీః=అతి మనోహరశోభ కలదిగను, అర్ధనిద్రాయితః=సగము ముకుళించినదిగను చేయబడిన, నాభీపల్వల పుండరీకముకుళః - నాభీపల్వల=లోతయిన నాభియందలి (పల్వలము=చిన్నిసరస్సు, వేశంతః పల్వలం చాల్పసరః - అమర), పుండరీక ముకుళః=తెలిదమ్మిమొగ్గ, కంబోః=శంఖమునకు, సపత్నీకృతః=సాటిగావింపబడినదో; కోక....జ్యోతిష్మతీ-కోక=చక్రవాకములకు, ప్రీతి=ఆనందమును గూర్చుటకును, చకోర=వెన్నెల పులుగులకు, పారణ=త్రాగుటకును (ఉపవాసానంతర భోజనము), పటు=సమర్థమైన-ఉపయోగపడునట్టి, జ్యోతిష్మతీ=కాంతికలిగినవియు; కౌమోదకీలక్ష్మణః = కౌమోదకమను గద చిహ్నముగా కలవాడైన, భగవతః = శ్రీమహావిష్ణువుయొక్క, లోచనే=నేత్రము (ద్వయము) లను, నిష్ప్రత్యూహమ్=నిర్విఘ్నత కొఱకు, ఉపాస్మహే=ఆరాధింతుము.

తాత్పర్యము :- కావ్యరచన నిర్విఘ్నముగా కొనసాగుటకై కవి యిందు శ్రీమహావిష్ణుని నేత్రములను ధ్యానించుచున్నాడు. సూర్యచంద్రులు విష్ణుమూర్తికి నేత్రములనుట ప్రసిద్ధము. నాభికమల మున్నదనియు ప్రసిద్ధి. ఈ నేత్రములలో ఒకటి (సూర్యుడు) చక్రవాకములకు ప్రీతిని కల్గించును. చీకటి తొలగుటతో అవి జంట గూడుననుట. మరియొకటి (చంద్రుడు) చకోరములకు విందులు చేయును. చకోరము

యాభ్యామర్ధ విబోధముగ్ధ మధురశ్రీ రర్ధనిద్రాయితో
నాభీపల్వల పుండరీక ముకులః కంబోః స్సపత్నీకృతః॥ 1

---

లున్నవనియు అవి వెన్నెలను త్రాగుననియు కవి సమయము. ఇట్లు విష్ణుమూర్తి నేత్రములు కోకప్రీతికి చకోరపారణకు సమర్థములగు కాంతి కలవి. నాభి కమలము సూర్యకాంతికి వికసింపబోయి, చంద్రకాంతికి ముకుళింపబోయి- ఇట్లు సగము విరిసినశోభ. సగము ముడిచినశోభ - శంఖముతో సామ్యమును పొందినది. దీనికిని కారణము ఆ నేత్రములే. కౌమోదకీ గదాధరుని ఇటువంటి నేత్రములను ఉపాసింతుము.

విశేషములు :- దేవ ద్విజనృపాదీనా మాశీర్వాద సమన్వితా। అష్టభిర్వా ద్వాదశభిః, పదైః సమ్యఙ్నియోజితా। నాందీ కర్తవ్యాతియత్నేన। బుధైర్విఘ్నోపశాంతయే॥ అని ప్రాచీనుల నియమము. ఇది ప్రార్థనారూపమగు నాంది. పదశబ్దము పాదశబ్ద పర్యాయమని కొందరు. అట్లగుటచే నిందు రెండు శ్లోకములుగా అష్టపదగా నాంది కూర్పబడినది. పదపరిగణన విషయమున ఆలంకారికులలో నెన్నెని అభిప్రాయ భేదములు కలవు. ఆశీర్నమస్క్రియారూపః శ్లోకః కావ్యముఖోదితః। నాందీతి కథ్యతే తస్యాం పదాది నియమోఽపి వా। మాంగల్య శంఖ చక్రాబ్జ కోకకైరవశంసినీ యత్రాష్టభి ర్ద్వాదశభి రష్టాదశభిరేవ వా। ద్వావింశత్యా పదైర్వాపి సా నాందీ పరికీర్త్యతే- అని కోహలుడు.

నాందీశ్లోకము చంద్రనామాంకితము కావలెననియు నొక నియమము. చంద్రనామాంకితా ప్రేయో మంగళార్థ పదోజ్జ్వలా. చకోరపారణ పటు జ్యోతిష్మతీ అన్న చోట ఆర్థికముగా చంద్రుడు స్ఫురించుచున్నాడని వ్యాఖ్యాతల సమన్వయము.

అర్థతశ్శబ్దతో వాపి మనాక్కావ్యార్థ సూచనమ్- సూచ్యార్థ సూచనము నాందికొక ప్రత్యేకత. నిర్గతః ప్రత్యూహః రావణాదిర్యస్య సః (తొలగింపబడిన రాక్షస రావణరూప విఘ్నము కలవాడు) అను విగ్రహముతో నిది రామపాత్రను సూచించుచున్నది రావణవధయు సూచితము. కౌ పృథివ్యాం (కుః=భూమి) మోదకీ హర్ష హేతుః అను విగ్రహముతో ఇంద్రజిద్వధ (ప్రపంచమునకు ఆనందదాయకము) సూచింపబడుచున్నది. కోక పదము విభీషణునకు చకోరపదము సుగ్రీవునకు ప్రతీకలని కొందరు. అర్ధవిబోధ - అర్ధనిద్రలు రాక్షస రావణ సేనాస్థితులకు అభివ్యంజకములు. లక్ష్మణః అన్నది స్పష్టము. కోకప్రీతిత్యాది సమాసముచే రాముని భక్తాభీష్ట ప్రదాతృ

అపిచ—

విరమతి మహాకల్పే నాభీపద్మైక నికేతన
త్రిభువన పురశ్శిల్పీ యస్య ప్రతిక్షణమాత్మభూః ।

---

త్వము వర్ణించితము. భగవత్పదము రామబోధకము. కౌమోదకీ పదములతో రామ రాజ్యము భూపుత్రి స్ఫురణ. సూర్యవంశ్యుడయిన భర్త, సోదరుడైన చంద్రుడు కల్గినది సీత. జనకుడు చంద్రవంశ్యుడనియు. అర్ధనిద్రాయిత పదమును కొందరు కుంభకర్ణ సూచకమనిరి. పుండరీకమనగా తెల్లని పద్మము. అది అమృతమునకు ప్రతీక. రావణునికి పొట్టలో అమృతభాండమున్నదని ఐతిహ్యము. నాభీపల్వలేత్యాది సమాసమున ఇది స్ఫురించుచున్నదని రామానందయోగి ఇష్టార్థ కల్పవల్లి.

సమాసములు :- ప్రత్యూహస్య అభావః - నిష్ప్రత్యూహమ్ - తస్మై. అవ్యయం విభక్తి ....ఇత్యాది సూత్రముచే అవ్యయీభావ సమాసము. చతుర్థికి నావ్యయీభావా దతోఽమ్త్వ పంచమ్యాః అనుదానిచే అమ్ భావము. కౌమోదకీ లక్ష్మ (చిహ్నం) యస్య సః. లక్ష్మ అస్యాస్తీతి లక్ష్మణః – లోమాది పామాది పిచ్ఛాదిభ్య శ్శనేలచః. కోకానాం ప్రీతిః. చకోరాణాం పారణా. కోకప్రీతిశ్చ చకోర పారణాచ - సర్వో ద్వంద్వో విభాషైకవద్భవతి. న నపుంసకమ్. హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య- కోకప్రీతి చకోరపారణే - పటునీ చ తే జ్యోతిష్మతీ చ. పటునీ జ్యోతిషీ యయోః తే (న కర్మధారయాన్మత్వర్థీయః అను నియమము అనిత్యము. సర్వధనీ సర్వకేశీ అని భాష్యకార ప్రయోగములు) జ్యోతిష్మతి - జ్యోతిష్మతీ - జ్యోతిష్మంతి. అర్ధే విబోధః. ముగ్ధాచ సా మధురాచ. అర్ధవిబోధేన ముగ్ధమధురా శ్రీర్యస్య సః. అర్ధే నిద్రాయితః. నాభీ పల్వలమివ. నాభ్యేవ పల్వలమ్. పుండరీకస్య ముకుళః. నాభీ పల్వలస్య పుండరీకముకుళః. (పల్వలే స్థితః) అసపత్న స్సపత్నః సంపద్యమానః కృతః- సపత్నీకృతః. ప్రతిపక్ష ప్రతిద్వంద్వి ప్రత్యనీక విరోధినః । తస్య చానుకరోతీతి శబ్దాస్సాదృశ్య వాచకాః॥ అని దండి.

సంధులు :- మధురశ్రీః + అర్ధ – రేఫాదేశవిసర్గ. నిద్రాయితః + నాభీ– ఉత్వాదేశవిసర్గ. కంటోః + సపత్నీ–సాదేశవిసర్గ.

క్రియ :- ఆసజ్ ఉపవేశనే. ఆత్మనే. లట్. ఉత్తమ. ఉప + ఆస. ఉపాసే - ఉపాస్వహే - ఉపాస్మహే.

కి మధికరణం కీదృక్కస్య వ్యవస్థితిరిత్యసా
వుదరమవిశద్ద్రష్టుం తస్మై జగన్నిధయే నమః॥ 2

---

ఛందస్సు :- శార్దూల విక్రీడితము. మ-స-జ-స-త-త-గ (1-12)

| మ | స | జ | స | త | త | గ |
|---|---|---|---|---|---|---|
| UUU | IIU | IUI | IIU | UUI | UUI | |
| నాభీప | ల్వలపుం | డరీక | ముకులః | కంబోస్స | పత్నీకృ | తః |

అలంకారము :- సూచ్యార్థసూచన శబ్దార్థోభయ శక్తిమూలధ్వని. నాభీ పల్వల అనుచో రూపకము. కంబోస్సపత్నీకృతః అనుటలో ఉపమాలంకారము.

అపిచ=మరియు

విరమతీతి :- మహాకల్పే విరమతి (సతి) నాభీపద్మైక నికేతనః త్రిభువన పురశ్శిల్పీ అసౌ ఆత్మభూః, కస్య కిమ్ అధికరణమ్, తస్య, వ్యవస్థితిః కీదృక్ ఇతి ప్రతిక్షణమ్ ద్రష్టుమ్, యస్య ఉదరమ్ అవిశత్ తస్మై జగన్నిధయే నమః.

అర్థము :- మహాకల్పే=మహాప్రళయము, విరమతి సతి=ముగియగా లేక ఉపసంహృతముకాగా, నూతన సృష్టికి సంకల్పింపబోవుచు, నాభీపద్మైక నికేతనః = నాభియే ప్రవేశమార్గమైన గృహము కలవాడును, త్రిభువన = ముల్లోకము లనునట్టి, పురః=నగరమునకు, శిల్పి=నిర్మాతయునైన, అసౌ=సుప్రసిద్ధుడగు, ఆత్మభూః = బ్రహ్మ; కస్య=ఏవస్తువునకు, కిమ్ అధికరణమ్=ఏది ఆధారము, తస్య=దేనియొక్క, వ్యవస్థితిః = ఆకారాదికము, కీదృక్ = ఎటువంటిది, ఇతి = మున్నగునది అంతయు, ప్రతిక్షణమ్=(పునస్సృష్టిలో)ఎప్పటికప్పుడు, ద్రష్టుమ్=చూచితెలిసికొనుటకు, యస్య= ఎవనియొక్క (ఏ విష్ణుమూర్తియొక్క) ఉదరమ్=గర్భమును - త్రిజగదావాసభూమి- అవిశత్=ప్రవేశించెనో, తస్మై=అ, జగన్నిధయే = త్రిజగన్నిలయుని కొఱకు, నమః=నమస్కారము- విష్ణుమూర్తికి నమస్కారమనుట, త్రిభువన పునశ్శిల్పీ అని పాఠాంతరము. ముల్లోకములను మరల నిర్మింప బూనుకొన్నవాడని యర్థము.

తాత్పర్యము :- ప్రళయాంతమున బ్రహ్మ పునస్సృష్టి చేయవలెను. అదియు యథాపూర్వముగా, ధాతా యథాపూర్వమకల్పయత్. విష్ణుమూర్తి బొజ్జలో ముల్లోకములను సూక్ష్మరూపమున నుండును. వానినిచూచి బ్రహ్మ స్థూలజగత్తులను

(నాంద్యంతే)

సూత్రధారః :- అలమతి విస్తరేణ. భో భోః లవణోదవేలా వనావళీ తమాల తరు కందలస్య త్రిభువన మౌళిమండన మహా నీలమణేః కమలాకుచ కలశ కేళికస్తూరికా పత్రాంకురస్య భగవతః పురుషోత్తమస్య యాత్రాయా ముపస్థానీయాః సభాసదః !

---

సృష్టించుటకై మాటిమాటికి విరించి హరి గర్భములోనికి రాకపోకలు గావించుచున్నాడు. పద్మాసనుడీతడు. పద్మనాభు డాతడు. నాళముతో నాభీద్వారమునుండి కుక్షి గృహప్రవేశము. అట్టి జగన్నిధికి శ్రీమహావిష్ణువునకు నమస్కారము.

విశేషములు :- ఇదియు నాందీశ్లోకమే కావున భావి కథాసూచన యుండును. రావణప్రళయము ఉపశమించిన పిదప రాముడు లంకా సౌంద్యమును జూడ పురప్రవేశము చేయుట ఇందు సూచింపబడినదని రుచిపతి శ్రీరామచంద్ర మిశ్రులు పేర్కొనిరి. రావణ వధానంతరము రాము డయోధ్యాపురమును ప్రవేశించుటయు గావచ్చును. రెండు శ్లోకములలోను హనుమంతుని సూచన హరిహర దీక్షితీయము.

సమాసములు:- మహాంశ్చాసౌ కల్పశ్చ. నాళిరేవ పంథా- ఋకూర్పథ్ధూః పథామానసే. నాభీపథః ఏవ ఏకమద్వితీయం నికేతనం యస్యసః. త్రయాణాం భువనానాం సమాహారః- త్రిభువనమ్- పాత్రాది పాఠమువలన జీప్ లేదు. సుప్సుపా అని కర్మధారయమైనను చెప్పవచ్చును. త్రిభువనమేవ పూః - తస్య. పూః స్త్రీ పురీనగర్యౌ అని అమరము. క్షణే క్షణే- ప్రతిక్షణమ్. వీప్సార్థమున అవ్యయీభావము. ఆత్మని భవః. జగతాం నిధిః- తస్మై.

సంధులు :- పథ + ఏక - వృద్ధి. నికేతనః + త్రి - సాదేశ విసర్గసంధి. వ్యవస్థితిః + ఇతి- రేఫాదేశ విసర్గ. ఇతి + అసౌ = యణాదేశ. అసౌ + ఉదరమ్ = అయవాదేశ. జగత్ + నిధిః=అనునాసికాదేశ.

క్రియ :- విశ ప్రవేశనే. పరస్మై. లఙ్. ప్రథమ

అవిశత్ - అవిశతామ్ - అవిశన్.

కుతశ్చిద్ద్వీపాదాగతేన కలహాకందలనామ్నా కుశీలవేన రౌద్ర బీభత్స భయానకాద్భుత రసభూయిష్ఠం కమపి ప్రబంధ మభినయతా నిత్యం కిలాయముద్వేజితో లోకః. తత్కాస్య

---

ఛందస్సు :- హరిణీవృత్తము. నసమరసలాగః షడ్వేదైః హయైః హరిణీ మతా.

| న | స | మ | ర | స | లగ |
|---|---|---|---|---|---|
| ।।। | ।।ౘ | ౘౘౘ | ౘ।ౘ | ।।ౘ | ।ౘ |
| విరమ | తిమహో | కల్పేనా | ధీప థై | కని తే | తనః |

(నాంద్యంతే=నాంది ముగిసిన పిదప)

అలమితి :- అతివిస్తరేణ = విస్తృతితో, అలమ్ = చాలు. అతివిస్తృతి ఇక చాలనుట. లవణోద=లవణ సముద్రముయొక్క. వేలా=చెలియలి కట్టపై నున్న. వనావళీ=వనసమూహమందలి. తమాలతరు=తాపింఛ వృక్షముయొక్క. కందలస్య= కాండమువంటి వాడును - ఎల్లప్పుడు ఆ వనభూములందు విహరించువాడనుట; త్రిభువన=ముల్లోకములయొక్క. మౌళి=శిరోఽగ్రభాగమునకు. మండన=అలంకారమైన. మహానీలమణిః = గొప్ప ఇంద్రనీలమణి వంటివాడును - త్రిజగదారాధ్యుడనుట; కమలా=లక్ష్మీదేవియొక్క. కుచకలశ=కలశములవంటి కుచములయందు. కేళి=విలాసార్థము రచింపబడిన. కస్తూరికా=కస్తూరితోనైన. పత్రాంకురస్య = మకరికాపత్రపు మొలకవంటివాడును- ఎల్లప్పుడు ఆమె కుచకలశములతో వినోదించువాడనుట; భగవతః=భగవంతుడునైన. పురుషోత్తమస్య = శ్రీకృష్ణునియొక్క. యాత్రాయామ్ = ఉత్సవమునందు (యాత్రాస్యాద్యాపనాయాం చ గతౌ దేవార్చనోత్సవే - ఇతి ధరణిః. యాత్రాతు యాపనోపాయే గతౌ దేవార్చనోత్సవే ఇతి విశ్వః) (ప్రబోధన ద్వాదశినాటి ఉత్సవమని ఇష్టార్థ కల్పవల్లి) ఉపస్థానీయాః = ఉపస్థితులైన లేక సమావిష్టులైన. భోభోః సభాసదః=ఓ సభ్యులారా! (సభా సదస్సభాస్తారాస్సభాస్సామాజికాశ్చతే - అని అమరము) కుతశ్చిత్=ఏదోఒక, ద్వీపాత్=(సింహళ) ద్వీపమునుండి, ఆగతేన = వచ్చినవాడును, కలహాకందళనామ్నా = కలహాకందళుడను పేరుగలవాడును, రౌద్ర బీభత్స భయానకాద్భుత రసభూయిష్ఠమ్ = రౌద్రాది నానారస బహుళముగా, కమపి= ఏదేనొక, ప్రబంధమ్=రూపకమును, అభినయతా=ప్రదర్శించుచున్నవాడు నైన, కుశీలవేన=ఆ నటునిచే. అయమ్=ఈ. లోకః=జనము. నిత్యమ్ = నిచ్చలును. ఉద్వేజితః

చిదభిమత రసభావభాజః ప్రేక్షణకస్య ప్రయోగానుజ్ఞయా నాట్యవేదోపాధ్యాయ బహురూపాంతేవాసీ మధ్యదేశీయః సుచరితో నామ భరతపుత్రోఽహ మనుగృహ్యే.

యతః —

ప్రీతిర్నామ సదస్యానాం ప్రియా రంగోపజీవినః ।
జిత్వా తదపహర్తారమేష ప్రత్యాహరామి తామ్॥ 3

---

కిల = ఆరాటపెట్టబడు చున్నదిగదా ! తత్ = అందుచే, అభిమత = ఇష్టములగు, రసభావ భాజః = రసభావములకు నిలయమయిన, కస్యచిత్ = ఒకానొక, ప్రేక్షణకస్య = రూపక విశేషముయొక్క, ప్రయోగానుజ్ఞయా = ప్రయోగానుమతితో - ప్రేక్షణక ప్రయోగము నకు అనుమతిఇచ్చి అనుట, నాట్యవేదోపాధ్యాయ = నాట్యాచార్యుడైన, బహురూప = బహురూపుడను పేరుగలవానియొక్క, అంతేవాసీ = శిష్యుడును, మధ్యదేశీయః = మధ్యదేశ (భరతఖండ) సముద్భవుడును, సుచరితోనామ = సుచరితుడను పేరుగల వాడును, భరతపుత్రః = నటుడునైన, అహమ్ = ఈ నేను, అనుగృహ్యే = అనుగ్ర హింపబడుదునుగాక ! అనుమతిఇచ్చి అనుగ్రహింపుడనుట, యతః = ఎందువల్లననగా-

ప్రీతిరితి :- సదస్యానాం ప్రీతిః నామ రంగోపజీవినః ప్రియా, తదప హర్తారం జిత్వా ఏషః తామ్ ప్రత్యాహరామి.

అర్థము :- సదస్యానామ్ = సభ్యులయొక్క, ప్రీతిఃనామ = ఆనందమనగా, రంగోపజీవినః = నటునికి, ప్రియా = ప్రియురాలు, భార్యవంటిదనుట, తదపహర్తారమ్ = దానిని అపహరించిన ఆ కలహకందళుని, జిత్వా = జయించి, ఏషః = ఇదే, తామ్ = ప్రీతి అనునట్టి ఆ ప్రియురాలిని, ప్రత్యాహరామి = కొనితెత్తును.

విశేషములు :- ద్వీపాంతరాగతుడు, కలహకందళుడు, ఉద్వేగకరుడు అను పదములతో రావణుడు సూచింపబడగా ఇందు సీతాపహరణము సీతా పునరాహర ణముల స్ఫురణ ఉన్నది. మధ్యదేశీయుడు, బహురూపాంతేవాసి, సుచరితుడు భరత పుత్రుడు అను పదములు రాఘవ సూచకములు.

సమాసములు :- రంగేణ ఉపజీవితుం శీలమస్యేతి రంగోపజీవీ- తస్య. సదసి సాధవః- తత్రసాధుః- యత్ప్రత్యయము- సదస్యాః - తేషామ్. తస్యాః అప హర్తా - తమ్.

---

సంధులు :- ప్రీతిః + నామ - రేఫాదేశవిసర్గ. రంగ + ఉప - గుణ. ఏషః + ప్రత్యాహరామి- తదేతద్విసర్గలోప. ప్రతి + ఆహరామి- యణాదేశ.

క్రియ :- హృఞ్ హరణే, పరస్మై. లట్, ఉత్తమ
హరామి - హరావః - హరామః

ఛందస్సు :- అనుష్టుప్పు. వక్త్రం నాద్యాన్నసౌ స్యాతామబ్ధేర్యోఽనుష్టుభి ఖ్యాతమ్. పాదమునకు ఎనిమిది అక్షరములు. (1) తొలిఅక్షరము గురువుకాని లఘువుకాని కావచ్చును. (2) అటుపైని నస(ర)లు తప్ప తక్కిన ఏదేనొక గణముండును. (3) నాల్గవ అక్షరముపైని యగణ ముండవలెను. (4) ఎనిమిదవ అక్షరము గురులఘువులలో నేదేని కావచ్చును. ఇవి అనుష్టుప్పునకు సాధారణ నియమములు. సమపాదములలో తొలి అక్షరమునకు తరువాత రగణముకూడ పరిహార్యమే యనియు సంప్రదాయము. దీనిని "వక్త్రము" అందురు. ఇందు మరికొన్ని భేదములున్నవి. యుజోర్జేన సరిద్భర్తుః పథ్యావక్త్రమ్ ప్రకీర్తితమ్. రెండు_నాలుగు పాదములలో నాల్గవ అక్షరము తరువాత యగణమునకు బదులు జగణమున్నచో అది పథ్యావక్త్రము. ఓజయోర్జేన వారిధే స్తదేవ విపరీతాది_ ఒకటి_మూడు పాదములలో నాల్గవ అక్షరము తరువాత యగణమునకు బదులు జగణమున్నచో అది విపరీత పథ్యావక్త్రము. రెండు నాల్గు పాదములలో యగణమే ఉండును, చపలా వక్త్రమయుజోర్నకారశ్చేత్ పయోరాశేః_ ఒకటి_మూడు పాదములలో నాల్గవ అక్షరము తరువాత నగణమున్నచో చపలావక్త్రము. యస్యా లస్సప్తమో యుగ్మే సా యుగ్మవిపులా మతా - ద్వితీయ చతుర్థపాదములలో ఏడవ అక్షరము లఘువయినచో అది యుగ్మవిపుల. అనగా నాల్గవ అక్షరము తరువాత నభజత లున్నచో అది యుగ్మ విపుల. (నాల్గు పాదములలోను ఏడవ అక్షరము లఘువున్నప్పుడే అది యుగ్మవిపుల అని మతాంతరము) నాల్గవ అక్షరము తరువాత భగణము ఉన్నచో భ విపుల యనియు, రగణమున్నచో ర విపుల యనియు, నగణమున్నచో న విపులయనియు నిర్దేర్పడును.

| గు | త | య | గ ల | మ | జ | గ |
|---|---|---|---|---|---|---|
| ∪ | ∪∪ I | I ∪ ∪ | ∪ - I | ∪ ∪ ∪ | I∪I | ∪ |
| ప్రీ | తిర్నామ | సదస్యా | నాం-ప్రి | యారంగో | పజీవి | నః। |

(ఆకాశే కర్ణం దత్త్వా) కిం బ్రూథ ? "వైదేశికో భవా నసమగ్రపాత్రః కథమీదృశే కర్మణి ప్రగల్భతే" ఇతి। (విహస్య, సప్రశ్రయమంజలిం బద్ధ్వా) హంతభోః। కిమేవ ముదీర్యతే. భవద్విధానా మారాధనీ వృత్తిరేవ మే పాత్రాణి సమగ్రయిష్యతి. యతః-

యాంతి న్యాయప్రవృత్తస్య తిర్యంచో౽పి సహాయతామ్।
అపంథానం తు గచ్ఛంతం సోదరో౽పి విముంచతి॥ 4

---

| గు | భ | య | గు | గు | మ | జ | గు |
|---|---|---|---|---|---|---|---|
| ᑌ | ᑌ । । | । ᑌ ᑌ | ᑌ - | ᑌ | ᑌ ᑌ ᑌ | । ᑌ । | ᑌ |
| జి | శ్వాతద | పహార్తా | రమ్ - | ఏ | షప్రత్యా | హరామి | తామ్॥ |

రెండు - నాలుగు పాదములలో నాల్గవ అక్షరము తరువాత జగణముండుటచే నిది పథ్యావక్త్రము. ప్రథమ తృతీయ పాదములలో చతుర్థాక్షరము తరువాత యగణమున్నది.

కిమితి :- (ఆకాశే=ఆకాశమునందు. కర్ణం దత్త్వా=చెవియుంచి- ఏదో వినుట నభినయించి అనుట) కిమ్ బ్రూథ=ఏమనుచున్నారు। వైదేశికః=పరదేశివైన, భవాన్=నీవు. అసమగ్రపాత్రః = సమగ్రమగు నటీనటబృందము లేనివాడవై. ఈదృశే=ఇటువంటి, కర్మణి=ఘనకార్యమునందు. కథమ్ ప్రగల్భతే=ఎట్లు విజృంభింతువు (ఏల పూనుకొన్నావు). ఇతి=అనియా ।. (విహస్య=నవ్వి, సప్రశ్రయమ్=సవినయముగా. అంజలిమ్ బద్ధ్వా=నమస్కరించి) హంతభోః=అయ్యయ్యో ।. కిమ్ ఏవమ్ ఉదీర్యతే=ఏమిట్లు పలుకబడుచున్నది। ఏల ఇట్లు భావించుచున్నారనుట. భవద్విధానామ్=మీవంటి వారియొక్క. ఆరాధనీ వృత్తిః ఏవ=ప్రోత్సాహమే లేక మీవంటి విజ్ఞులను సేవించు ప్రవృత్తియే (సంకల్పమే). మే=నాకు. పాత్రాణి=నటీనటులను, సమగ్రయిష్యతి=లోటులేకుండ సమకూర్చును. యతః=ఏలయనగా-

యాంతీతి :- న్యాయ ప్రవృత్తస్య తిర్యంచః అపి సహాయతామ్ యాంతి; అపంథానమ్ గచ్ఛంతమ్ తు సోదరః అపి విముంచతి.

అర్థము :- న్యాయ ప్రవృత్తస్య = నీతిమార్గమున ప్రవర్తించువానికి, తిర్యంచః అపి=పశుపక్ష్యాదులు కూడ, సహాయతామ్=ఉపకార తత్పరతను, యాంతి=

(పునరాకాశే కర్ణం దత్త్వా) కిం బ్రూథ ః "తర్హి ప్రహితేయ మస్మాభిః పత్రికా" ఇతి ।

(ప్రవిశ్య నటః పత్రికాం దదాతి. సూత్రధారో గృహీత్వా వాచయతి)

"యత్ర సర్వపురుషార్థ రహస్య నిష్యందిని—

---

పొందుచున్నవి. వానర జటాయురాదులును సహాకరించుట కలదని. అపంథానమ్=అపమార్గమును. (అధర్మ) గచ్ఛంతమ్=పొందువానిని. సోదరః అపి = సహోదరుడు కూడ, విముంచతి=విడిచిపెట్టును. (రావణుని విభీషణుడు విడుచుట). అపంథాస్త్వపథం తుల్యే - అని అమరము. (సమానముదరం యస్య సోదరః)

సంధులు :- తిర్యంచః + అపి - ఉత్వాదేశవిసర్గ. తిర్యంచో + అపి - పూర్వరూపసంధి. సోదరః + అపి - సోదరోఽపి ఇట్టిదే.

క్రియలు :- యా ప్రాపణే. పరస్మై. లట్. ప్రథమ

యాతి - యాతః - యాన్తి

ముచ్లు ఞ్ మోక్షణే. పరస్మై. లట్. ప్రథమ. వి-ఉపసర్గ.

ముంచతి - ముంచతః - ముంచన్తి.

ఛందస్సు :- పథ్యావక్త్రము. (చూ. ప్రథమాంకము శ్లో. 8)

కిమితి :- [పునః=మరల. ఆకాశే కర్ణం దత్త్వా=బయలాలకించి] కిమ్ బ్రూథ=అ( ! ఏమనుచున్నారు ! తర్హి=అట్లయినచో, అస్మాభిః=మాచేత, ఇయమ్=ఇదే. పత్రికా=ఆజ్ఞాపత్రిక, ప్రహితా=పంపబడినది - ఇదే అనుజ్ఞ ఇచ్చితిమనుట. ఇతి=అనియా !

(నటః=ఒకానొక నటుడు, ప్రవిశ్య=రంగప్రవేశముచేసి, పత్రికామ్=లేఖను, దదాతి=ఇచ్చును, సూత్రధారః=సూత్రధారుడు, గృహీత్వా=స్వీకరించి, వాచయతి=చదువును.)

యత్రేతి :- సర్వ=చతుర్విధములైన, పురుషార్థ=పురుషార్థములయొక్క, రహస్య=నిగూఢసారమును, నిష్యందిని = స్రవించునదైన, యత్ర = ఏ దృశ్య

చేతశ్శుక్తికయా నిపీయ శతశః శాస్త్రామృతాని క్రమా
ద్వాంతైరక్షరమూర్తిభిః సుకవినా ముక్తాఫలైర్గుంఫితాః ।
ఉన్మీలత్కమనీయ నాయకగుణ గ్రామోపసంవల్గన
ప్రౌఢాహంకృతయో లుఠంతి సుహృదాం కంఠేషు హారస్రజః॥ 5

---

కావ్యమునందు - [చెప్పబోవు లక్షణములుండునో అట్టి నాటకమును ప్రయోగించుటకు అనుమతించితిమి అని అన్వయము]

చేతఇతి :- చేతశ్శుక్తికయా క్రమాత్ శాస్త్రామృతాని శతశః నిపీయ వాంతైః అక్షరమూర్తిభిః ముక్తాఫలైః సుకవినా గుంఫితాః, ఉన్మీలత్కమనీయ నాయక గుణ గ్రామోపసంవల్గనప్రౌఢాహంకృతయః హారస్రజః సుహృదామ్ కంఠేషు లుఠన్తి.

అర్థము :- చేతశ్శుక్తికయా = అంతరంగమనునట్టి ముత్తెపు చిప్పతో, క్రమాత్ = కాలక్రమమున, శాస్త్రామృతాని = ఆయా శాస్త్ర విషయములనునట్టి అమృతములను [తొలకరి వానచినుకులను] శతశః = పలుమార్లు లేక నూర్లకొలది [అధికముగా వివిధములననుట] నిపీయ = స్వీకరించి, వాంతైః = అవిష్కరింపబడినవియు, అక్షరమూర్తిభిః = అక్షరాకారములో నున్నవియు నైన [క్షరముకాని దోషములేని రూపము కలవియు], ముక్తాఫలైః = ముత్తెములతో, సుకవినా = మహాకవిచే, గుంఫితాః = కూర్చబడినవియును, ఉన్మీలత్ = వర్ధిల్లుచున్న, కమనీయ = అందమైన, నాయక = నాయకునియొక్క, గుణ = సద్గుణముల [కులీనతాదులు] గ్రామ = సమూహముయొక్క, ఉపసంవల్గన = కలయికతోనైన, ప్రౌఢ = ప్రౌఢబంధరూపమైన, అహంకృతయః = అతిశయము కలవియును, [తళతళలాడుచున్న అందమైన నాయక మణియొక్కయు, గుణగ్రామ = పేటలయొక్కయు, ఉపసంవల్గన = కదలికలతోనైన అతిశయము కలవి అని ముత్యాలదండల పక్షమున] హారస్రజః = అందమైన మాలికలు [హారముల పేర్లు] సుహృదామ్ = సుహృదయులయొక్క, కంఠేషు = గళసీమల యందు, లుఠన్తి = విలసిల్లుచున్నవి. సహృదయులు కంఠపాఠముచేసి పాడుకొందురనుట. [శార్దూలము]

సమాసములు :- చేతః ఏవ శుక్తికా - తయా. శాస్త్రాణి ఏవ అమృతాని. అక్షరం మూర్తిః యేషాం తే - తైః. ఉన్మీలంశ్చ సః కమనీయశ్చ. ఉన్మీలత్కమనీయశ్చాసౌ నాయకశ్చ. ఉన్మీలత్కమనీయ నాయకస్య గుణాః. గుణానాం గ్రామః. గ్రామస్య ఉపసంవల్గనమ్. ప్రౌఢాచసా అహంకృతిశ్చ. ఉన్మీలత్కమనీయ....సంవల్గనేన ప్రౌఢాహంకృతిః యాసాం తాః. హారాశ్చతాః స్రజశ్చ - హారాణాం స్రజోవా. ఉపసంవర్ణన అనియు ప్రౌఢాలంకృతయః అనియు పాఠాంతరము లున్నవి. అర్థము సులభము.

సంధులు :- చేతః + శుక్తికయా. శతశః + శాస్త్రామృతాని. మూర్తిభిః + సుకవినా - శషసాదేశ సంధులు. శాస్త్ర + అమృతాని - ప్రౌఢ + అహంకృతి - సవర్ణదీర్ఘ. వాంతైః + అక్షర. ఫలైః + గుంభిత - రేఫాదేశవిసర్గ. గ్రామ + ఉప - గుణసంధి. అహంకృతయః + లుఠన్తి - ఉత్వాదేశ విసర్గసంధి.

క్రియ :- లుఠసంశ్లేషణే. పరస్మై. లట్. ప్రథమ
లుఠతి - లుఠతః - లుఠన్తి

అలంకారము :- వాంత పదమునకు క్రక్కుట అని యర్థము. పెద జల్లుట ఇత్యాదిగా అర్థము చెప్పునెడల దోషములేదు. నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయ మతిసుందరమన్యత్ర గ్రామ్యకక్ష్యం విగాహతే అని కావ్యప్రకాశము. పరంపరితి శ్లిష్టరూపక మిందలంకారము. చేతశ్శుక్తి. శాస్త్రామృత అనుచో అనుభయ తాద్రూప్యరూపకము. చేతస్సునందు శుక్తిత్వము శాస్త్రమునం దమృతత్వము నారోపింపబడి ప్రకృతమునందు న్యూనత్వాధికత్వము లేమియు ప్రకటింపబడలేదు. అక్షర మూర్తిభిః ముక్తాఫలైః అనుచో నట్టిదే వ్యస్తరూపకము. అక్షర మూర్తిభిః అను పదమున శ్లేషయున్నది. నాయకుడనునట్టి నాయకమణియనియు. గుణములనునట్టి గుణములు (పేరులు) అనియు అన్వయము. ఇది శ్లిష్టరూపకము. హారస్రజః అనుచో శ్లేష. విషయ్యభేదతాద్రూప్య రంజనం విషయస్య యత్ రూపకం తత్త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః.

తస్మై ఇతి :- వీరాద్భుతారంభ గంభీరోదాత్త వస్తవే జగదానందకందాయ తస్మై సందర్భాయ త్వరామహే ।

తస్మై వీరాద్భుతారంభ గంభీరోదాత్తవస్తవే।
జగదానందకందాయ సందర్భాయ త్వరామహే॥ 6

---

అర్థము :- వీరాద్భుత=వీరాద్భుత రసములయొక్క- (తాటకవధ ధనుర్భంగము) ఆరంభ=ప్రారంభముతో, గంభీర=గభీరమును, ఉదాత్త=సర్వహృద్యమునైన, వస్తవే=కథతో కూడినదియు, జగత్=లోకమునకు, ఆనందకందాయ = హర్షహేతువునైన, తస్మై=ఆ, సందర్భాయ=రచనకొఱకు (నాటకమునకై) త్వరామహే=త్వరపడుచున్నాము - చూడవలెనని ఉత్సుకతతో ఉన్నామనుట, (కందస్తు సూరణే సస్యమూలే జలధరేఽపిచ - విశ్వము).

సమాసములు :- వీరశ్చాద్భుతశ్చ. వీరాద్భుతయో రారంభః. గంభీరంచ తదుదాత్తం చ. వీరాద్భుతారింభేన గంభీరోదాత్తమ్. వీరాద్భుతారంభ గంభీరోదాత్తం వస్తు యస్మిన్ - తస్మై. ఆనందస్య కందః - జగతః ఆనందకందః - జగదానంద కందశ్చ అసౌ సందర్భశ్చ - తస్మై.

సంధులు :- వీర + అద్భుత + ఆరంభ - సవర్ణదీర్ఘ. గంభీర + ఉదాత్త- గుణ.

క్రియ :- (జి) త్వరాఙ్ సంభ్రమే - ఆత్మనే. లట్ - ఉత్తమ
త్వరే - త్వరావహే - త్వరామహే.

ఛందస్సు :- పథ్యావక్త్రము. [చూ. ప్రథమ - 3)

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| గ | య | య | ల | గ | మ | జ | గ |
| U | \| UU | \| UU | \| | U | UUU | \|U\| | U |
| త | స్మైవీరా | ద్భుతారం | భ- | గం | భీరోదా | త్తవస్త | వే |
| ల | య | య | ల | గ | త | జ | గ |
| \| | \| UU | \| UU | \| | U | UU\| | \|U\| | U |
| జ | గదానం | దకందా | య- | సం | దర్భాయ | త్వరామ | హే |

ఇతీతి :- ఇతి=అని. శ్లోకంలోని విషయమును ముగించుట.

ఇతి —

(విమృశ్య సహర్షస్మితమ్) మారిష, రామాయణమితి శృణోషి తత్ర భవతః కవిత్వావతార ప్రథమ తీర్థస్య వల్మీకజన్మనో మునేః సరస్వతీ నిర్యాసో యశశ్శరీరమిక్ష్వాకూణామ్.

నటః :– అథకిమ్.

---

మారిషేతి :– (విమృశ్య = ఆలోచించి, సహర్షస్మితమ్ = ఆనందముతో చిరునవ్వుతో) మారిష=ఓ మారిష! సహనటునికి సంబోధన. (ఉత్కృష్టో విద్యయా భావః కించిదూనస్తు మారిషః) రామాయణమితి = రామాయణమని [ఒక కావ్యమున్నది] శృణోషి=విందువుగదా! [తెలియునుగదా!] తత్రభవతః=మాన్యుడును, కవిత్వ=కవనముయొక్క, అవతార=ఆవిర్భావమునకు, ప్రథమ తీర్థస్య = మొదటి [మజిలీ] గురుడును, [తీర్థం శాస్త్రాధ్వర క్షేత్రోపాయోపాధ్యాయ మంత్రిషు – వైజయంతి], వల్మీకజన్మనః=పుట్టనుండి పుట్టినవాడునైన, మునేః=వాల్మీకిమహర్షి యొక్క, సరస్వతీనిర్యాసః=వాక్ప్రసారము అది, ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకు వంశస్థుల యొక్క, యశశ్శరీరమ్=కీర్తికి ఆకృతి.

అథకిమ్ = అవును. [అంగీకృతౌ స్యాదథకిమ్ – అమరము]

సూత్రధారః :- తత్ప్రతిబద్ధ ప్రబంధానుబంధినీ పరిషదాజ్ఞా.

నటః :- (విహస్య) అహో. సకల కవిసార్థ సాధారణీ ఖల్వియం వాల్మీకీయా సుభాషితనీవీ.

సూత్రధారః :- మారిష. కిముచ్యతే.

అపి కథమసౌ రక్షోరాజ స్తతాప జగత్త్రయీ
మపి కథమభూదిక్ష్వాకూణాం కులే గరుడధ్వజః ।

---

తదితి :- తత్=ఆ వాల్మీకిచే. ప్రతిబద్ధ=రచింపబడిన. ప్రబంధ=కావ్యమునకు. అనుబంధినీ=అనుబంధించినది. పరిషదాజ్ఞా=ఈ సభవారు పంపిన ఆజ్ఞ.

అహోఇతి :- [విహస్య=నవ్వి] అహో ! వాల్మీకీయా=వాల్మీకి విరచితమైన. ఇయమ్=ఈ. సుభాషితనీవీ=సూక్తి నిధి. సకలకవి=సమస్త కవులయొక్క [అన్ని భాషలవారు ననుట] సార్థ=సమూహమునకు. సాధారణీఖలు=ఉమ్మడిసొమ్ము కదా ! నీవియనగా ఆపణమనియు నర్థము. కవులకు సుభాషితములు దొరకుచోటని. [నీవీ పరిపణే గ్రంథౌ స్త్రీణాం జఘనవాససః - విశ్వము. నీవీ పరిపణం మూలధనమ్ - అమరము].

మారిషేతి :- మారిషుడా ! కిముచ్యతే=ఏమి చెప్పుమందువు !

అపిఇతి :- అపి అసౌ రక్షోరాజః జగత్త్రయీం కథం తతాప ? అపి ఇక్ష్వాకూణాం కులే గరుడధ్వజః కథమ్ అభూత్ ? అపి ఋషౌ దైవ్యో వాచః స్వతః కథం ప్రచకాశిరే ? అయం సర్వః ప్రబంధకర్తారం సుచరిత పరీపాకః.

అర్థము :- అపి అనునది వాక్యారంభమునందున్నచో ప్రశ్నార్థకము. అపి స్సంభావనాప్రశ్న శంకాగర్హా సముచ్చయే - అని విశ్వనిఘంటువు. అసౌ=ప్రసిద్ధుడైన. రక్షోరాజః=రావణుడు. జగత్త్రయీమ్=ముల్లోకములను. కథం తతాప=ఎట్లు పీడించెను ? ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకులయొక్క. కులే = వంశమునందు. గరుడధ్వజః = శ్రీమన్నారాయణుడు. కథమ్=ఎట్లు. అభూత్=జన్మించెను ? ఋషౌ=వాల్మీకిముని యందు. దైవ్యః=దైవసంబంధములగు. వాచః=సంస్కృతవాక్కులు. [మా నిషాదే

అపి కథమృషా దైవ్యో వాచః స్వతః ప్రచకాశిరే
సుచరితపరీపాకస్సర్వః ప్రబంధకృతా మయమ్॥ 7

---

త్యాదికము] స్వతః=తమంతతాముగా. కథమ్=ఎట్లు. ప్రచకాశిరే=ప్రకాశించినవి? అయమ్=ఇది. సర్వః=అంతయు. ప్రబంధకృతామ్=అనంతర కవులయొక్క. సుచరిత పరీపాకః=పున్నెముల పంట.

సమాసములు :- రక్షసాం రాజా - రాజాహస్సఖిభ్యష్టచ్ - రక్షోరాజః. జగతాం త్రయీ - తామ్. గరుడః ధ్వజ ఇవ యస్య సః. సుచరితస్య సుచరితానాం వా పరీపాకః. ప్రబంధం కరోతీతి - తేషామ్.

సంధులు :- రక్షస్ + రాజః. దైవ్యః + వాచః - ఉత్వాదేశవిసర్గ. రాజః + తతాప - సాదేశవిసర్గ.

క్రియలు :- తప సంతాపే. పరస్మై. లిట్. ప్రథమ.
తతాప - తేపతుః - తేపుః.
భూ సత్తాయామ్. పరస్మై. లుజ్ - ప్రథమ.
అభూత్ - అభూతామ్ - అభూవన్.
కాశృజ్ దీప్తౌ. ఆత్మనే - లిట్. ప్రథమ.
చకాశే - చకాశాతే - చకాశిరే

ఛందస్సు :- హరిణీవృత్తము - రసయుగహయైః న్సౌ మ్రౌ స్లౌ గో యదా హరిణీ తదా.

| న | స | మ | ర | స | లగ |
|---|---|---|---|---|---|
| ।।। | ।।ఌ | ఌఌఌ | ఌ।ఌ | ।।ఌ | ।ఌ |
| సుచరి | తపరీ | పాకస్స | ర్వఃప్రబం | ధకృతా | మయమ్ |

తత్ర తావన్నిరూపయామి. రూపక మభిరూప మీదృశమ్. (ముహూర్త మివ స్థిత్వా. స్మరణమభినీయ. సోల్లాసమ్) అస్తి మౌద్గల్య గోత్ర సంభవస్య మహాకవేర్భట్టశ్రీవర్ధమానతనూజన్మన స్తంతుమతీ నందనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవం నామ నాటకమ్. తత్ప్రయుంజానాః సామాజికానుపాస్మహే. (విచింత్య సహర్షమ్) అహో! రమణీయా ఖల్వియం సామగ్రీ పరిషదారాధనస్య. యతః—

---

తత్రేతి :- తత్ర = శ్రీమద్రామాయణ విషయమునందు. ఈదృశమ్ = ఇట్టిది. అభిరూపమ్=సదస్యులు కోరిన లక్షణములకు అనురూపమైన. రూపకమ్ = దృశ్యకావ్యమును. తావత్ నిరూపయామి=నిర్ధారింతును - తప్పక నిర్ధారింతునని. తావత్ అనునది కొంతవరకు వాక్యాలంకారార్థము. (ముహూర్తమ్ ఇవ స్థిత్వా=క్షణకాలము వలె ఆగి, స్మరణమ్=ఆలోచించుటను. అభినీయ=నటించి సోల్లాసమ్=ఉల్లాసముగా) మౌద్గల్యగోత్ర సంభవస్య = మౌద్గల్య గోత్రమునందు జన్మించినవాడును. భట్టశ్రీ వర్ధమాన=భట్టశ్రీ వర్ధమానునియొక్క. తనూజన్మనః=పుత్రుడును. తంతుమతీనంద నస్య=తంతుమతీదేవి కుమారుడును. మహాకవేః=మహాకవియునయిన. మురారేః= మురారియొక్క. కృతిః=కావ్యము. అభినవమ్ = నూతనమైనది, అనర్ఘరాఘవమ్ నామ=అనర్ఘరాఘవమను పేరుగలది. నాటకమ్ = ఒక నాటకము. అస్తి=ఉన్నది. తత్=దానిని. ప్రయుంజానాః=ప్రదర్శించినవారమై. సామాజికాన్=ఈ సదస్యులను. ఉపాస్మహే=ఆరాధింతము. (విచింత్య=బాగుగా ఆలోచించి. సహర్షమ్=ఆనందముతో) అహో=ఓహో! పరిషత్ ఆరాధనస్య=సభను ఆరాధించుటకు. ఇయమ్=ఈ (చెప్ప బోవు) సామగ్రీ=సాధనసంపత్తి. రమణీయా ఖలు = మనోహరముగదా!

మదితి :- మద్వర్గ్యాః రసపాఠగీతిగతిషు ప్రత్యేకమ్ ఉత్కర్షిణః. కవేః మౌద్గల్యస్య గిరాం వ్యూతయః గభీరమధురోద్గారాః. కావ్యార్థబీజం రఘుపతిః వీరో దాత్తగుణోత్తరః. చరితస్తోత్రాయ దివ్యాః గిరః యస్య ఫలితిస్మ (సః) మునిః వాల్మీకిః.

(3)

మద్వర్గ్యా రసపాఠగీతి గతిషు ప్రత్యేకముత్కర్షిణో
మౌద్గల్యస్య కవేర్గభీర మధురోద్గారా గిరాం వ్యూతయః ।
వీరోదాత్త గుణోత్తరో రఘుపతిః కావ్యార్థబీజంముని
ర్వాల్మీకిః ఫలతిస్మ యస్య చరితస్తోత్రాయ దివ్యా గిరః॥ 8

---

అర్థము :- మద్వర్గ్యాః=మా బృందమునందలి నటులు, రస = రసము, పాఠ=వాచికము, గీతి=గానము, గతిషు=ఆంగికములయందు - రసోచితమగు వాచిక గానాభినయములందని కాని, ప్రత్యేకమ్=ప్రత్యేకముగా, ఉత్కర్షిణః=అతిశయించు వారు - ఉత్కర్ష కలవారు. కవేః = అనర్ఘరాఘవ రచయితయైన, మౌద్గల్యస్య = మౌద్గల్య గోత్రికుడైన మురారియొక్క, గిరామ్ వ్యూతయః=వాక్కుల సమూహములు (రాశిః వ్యూతిః ద్రియౌ తుల్యే) గభీర మధురోద్గారాః = గంభీరములును అమృత నిష్యందులును - తీపియూటలూరునవి (శబ్దములు గభీరములు శ్రుతిపేయములు, అర్థములు గభీరములు మనోహరములు అని) కావ్యార్థబీజమ్ = కావ్యపరమార్థమునకు హేతువు, వీర=వీరులయొక్క, ఉదాత్త=గొప్పవయిన, గుణ = గుణములతో, ఉత్తరః = అగ్రగణ్యుడైన, (ధీరోదాత్త గుణోత్తరః అని సులభ పాఠాంతరము), రఘుపతిః = శ్రీరాముడు. చరిత = ఇతివృత్తముయొక్క, స్తోత్రాయ = వర్ణనకు, దివ్యాః = దివ్యములైన, గిరః = వాక్కులు - సంస్కృతవాక్కు లనుట, యస్య = ఎవనికి, ఫలతిస్మ = ఫలించినవో, (సః = అటువంటివాడైన) మునిః = మహర్షియైన, వాల్మీకిః = ప్రాచేతసుడు - కవి. ఇంతకన్న సదస్యారాధనకు సామగ్రి ఏముండు ననుట. శార్దూలము.

**సమాసములు :-** రసస్య పాఠః. రసపాఠస్య గీతిః. రసపాఠ గీతేః గతిః - తాసు. గభీరః మధురః ఉద్గారః (స్రవః) యాసు తాః. ఉదాత్తాశ్చతే గుణాశ్చ వీరాణా ముదాత్తగుణాః. వీరోదాత్తగుణైః ఉత్తరః. ఉదాత్తాః గుణాః యస్య సః. వీరశ్చాసౌ ఉదాత్తగుణశ్చ. వీరోదాత్తగుణేషు ఉత్తరః. కావ్యస్య అర్థః. కావ్యార్థస్య బీజమ్. చరితస్య స్తోత్రం - తస్మై.

**సంధులు :-** వర్గ్యాః + రస, ఉద్గారాః + గిరామ్ - విసర్గలోప. ఉత్కర్షిణః + మౌద్గల్య, ఉత్తరః + రఘు - ఉత్వాదేశ విసర్గ. కవేః + గభీర, మునిః + వాల్మీకిః = రేఫాదేశవిసర్గ. దివ్యాః + గిరః - విసర్గలోపసంధి.

అయం తు ప్రాచేతసీయం కథావస్తు బహుభిః ప్రణీతమపి ప్రయుంజానో నాపరాధ్యతి శ్రోత్రియపుత్రః. పశ్య—

యది క్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్య చరితం
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతి కః ।
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్ బ్రహ్మాణః కథముపకరిష్యన్తి కవయః॥ 9

---

క్రియ :- స్మ చేర్చుటతో వర్తమానకాలిక క్రియ భూతకాలిక మగును. ఫలతి - ఫలతః - ఫలన్తి. ఫలనిష్పత్తౌ. పరస్మై. లట్. ప్రథమ.

అయమితి :- ప్రాచేతసీయమ్ = వాల్మీకీయమయిన. కథావస్తు = ఇతి వృత్తము. బహుభిః = చాలమంది పూర్వకవులచేత. ప్రణీతమ్ అపి = కావ్యరూపమున అనువర్తింపబడినదానినే. ప్రయుంజానః = ప్రయోగించుచున్నవాడే అయినప్పటికిని అయమ్ = కః. శ్రోత్రియపుత్రః = శ్రోత్రియుని కొడుకు మురారి. న అపరాధ్యతి = అపరాధమేమియు చేయుటలేదు - పునరుక్తి దోషాదికము లేదనుట. పశ్య = చూడు - (వినుమనుట)

యదీతి :- పూర్వైః క్షుణ్ణమ్ ఇతి రామస్య చరితం యది జహాతి, జగతి ఏతావద్భిః గుణైః అన్యః కః పునః జయతి. తత్తద్గుణ గరిమగంభీర మధురస్ఫురద్వాగ్బ్రహ్మాణః కవయః స్వమ్ ఆత్మానమ్ కథమ్ ఉపకరిష్యన్తి.

అర్థము :- పూర్వైః = పూర్వకవులచే. క్షుణ్ణమ్ఇతి = మిక్కిలిగా వినియోగింపబడినదిగదా అని. రామస్య = రాముని యొక్క. చరితమ్ = చరిత్రను (ఇతి వృత్తము). యది జహాతి = విడుచుచేని. జగతి = ప్రపంచమునందు. ఏతావద్భిః = ఇంతలేసి. గుణైః = సద్గుణములతో. అన్యః = మరొకడు. కః = ఎవడు. పునః = మరల. జయతి = జన్మించును : తత్తత్ = ఆయా. గుణ = గుణములయొక్క. గరిమ = గొప్పదనముతో. గంభీర = గభీరమును. మధుర = మధురమునై. స్ఫురత్ = ప్రకాశించు. వాగ్బ్రహ్మాణః = వాగ్రూపమగు బ్రహ్మకలవారైన. కవయః = ఈ కవులు

ఉపక్రమమాణశ్చ స కవిః స్వనిర్భాస శబ్దబ్రహ్మాణ మాచార్యం ప్రాచేతసం గిరం చ దేవతామేవ ముపశ్లోకితవాన్ –

తమృషిం మనుష్యలోక ప్రవేశ విశ్రామశాఖినం వాచామ్।
సురలోకాదవతార ప్రాంతరఖేదచ్ఛిదం వందే॥ 10

---

(రామకథను విడిచినచో) స్వమ్ ఆత్మానమ్=తమ్ముతాము. కథమ్=ఎట్లు. ఉపకరిష్యన్తి=ఉద్ధరించు కొందరు; తమకు తామే మేలుచేసికొనలేని వారవుదురనుట.

సమాసములు :– తత్తద్గుణానాం గరిమా. తత్తద్గుణగరిమా గంభీరమధురమ్ (గంభీరంచ తత్ మధురంచ) తత్త....మధురంచ తత్ స్ఫురచ్చ. వాగేవ బ్రహ్మ. తత్త—స్ఫురత్ వాగ్బ్రహ్మ యేషాం తే.

సంధులు :– పూర్వైః+ఇతి. గుణైః+ఏతావద్భిః+జగతి=రేఫాదేశ విసర్గసంధులు. అన్యః+జయతి – ఉత్వాదేశ విసర్గ.

క్రియ :– ఓహాక్ త్యాగే. పరస్మై. లట్. ప్రథమ

జహాతి – జహితః। జహితః – జహతి

డుకృఞ్ కరణే. పరస్మై. లృట్. ప్రథమ

కరిష్యతి – కరిష్యతః – కరిష్యన్తి

ఛందస్సు :– శిఖరిణి. రసైరుద్రైశ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ

| య | మ | న | స | భ | లగ |
|---|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I I | I U |
| యదిక్ష | ణంపూర్వై | రితిజ | హాతిరా | మస్యచ | రితమ్ |

ఉపేతి :– సః=అ. కవిఃచ=మురారియును. ఉపక్రమమాణః=రచన కుద్యుక్తుడై. స్వనిర్భాస=స్వయంప్రకాశమైన. శబ్దబ్రహ్మాణమ్=శబ్దబ్రహ్మ కలవాడును, ఆచార్యమ్=సకల కవికుల గురువునైన. ప్రాచేతసమ్=వాల్మీకిని. చ=మరియు, గిరమ్ దేవతామ్=వాగ్దేవిని. ఏవమ్=ఇట్లు; ఉపశ్లోకితవాన్=స్తుతించెను.

తమితి :– వాచామ్. మనుష్యలోక ప్రవేశ విశ్రామశాఖినమ్. సురలోకాత్ అవతారప్రాంతరఖేదచ్ఛిదమ్ ఋషిం తం వందే.

అర్థము :- వాచామ్=వాక్కులకు (కవితలకు) మనుష్యలోక ప్రవేశ= మానవలోక ప్రవేశమునకు, విశ్రామశాఖినమ్=విశ్రాంతి వృక్షమైనవాడును, ప్రవేశింపబోవుచు ఆ వృక్షమున క్షణకాలము విశ్రమించెనట. సురలోకాత్=బ్రహ్మలోకమునుండి లేక దేవలోకమునుండి, అవతార=భూమికి దిగునట్టియెడ, ప్రాంతర= (నిరాలంబము సుదూరమునగు) మధ్యమార్గమునందైన, ఖేద=గ్లానిని, ఛిదమ్ = పోగొట్టువాడును, ఋషిమ్=మునియునైన, తమ్=ఆ వాల్మీకిని, వందే=నమస్కరింతును. (ప్రాంతరం దూరశూన్యోఽధ్వా - అమరము)

సమాసములు :- మనుష్యాణాం లోకః, మనుష్యలోకే ప్రవేశః. విశ్రామాయ శాఖీ (విశ్రామార్థమ్). మనుష్యలోక ప్రవేశే విశ్రామశాఖీ ఇవ - తమ్. ప్రాంతరే ఖేదః. అవతారే ప్రాంతరఖేదః, అవతారప్రాంతర ఖేదం ఛినత్తీతి - తమ్.

సంధులు :- ఖేద + ఛిత్ - తుగాగమసంధి.

క్రియ :- వదిజ్ అభివాదనస్తుత్యోః. ఆత్మనే. లట్ ఉత్తమ. వందే - వందావహే - వందామహే.

ఛందస్సు :- ఆర్యావృత్తము. "లక్ష్మైతత్సప్తగణా గోపేతా భవతి నేహ విషమే జః। షష్ఠోఽయం నలఘూ వా ప్రథమేఽర్ధే నియతమార్యాయాః॥ షష్ఠే ద్వితీయలాత్పరకే న్లే ముఖలాచ్చ సయతిపదనియమః। చరమేఽర్ధే పంచమకే తస్మాదిహ భవతి షష్ఠో లః॥ [1] ఒకటి - రెండు పాదములు పూర్వార్ధమనియు, మూడు - నాలుగు పాదములు ఉత్తరార్ధమనియు వ్యవహారము. [2] చతుర్మాత్రాగణములు ఏడుండి ఆపైని గురువుండుట పూర్వోత్తరార్ధములకు సామాన్య లక్షణము. [3] విషమస్థానమున (బేసిగణముగా) జగణము ఉండరాదు. 1 - 3 - 5 - 7 స్థానములలో జగణము పరిహార్యము. [4] ఆరవస్థానమున జగణముగాని (అయమ్) నలముగాని ఉండవలెను. [5] ఉత్తరార్ధమున ఆరవ గణముగా ఒక్క లఘువుమాత్రమే ఉండును. [6] ఎనిమిదవ గణముగా పూర్వోత్తరార్ధములు రెండింట గురువుండును. [7] పూర్వార్ధమున ఆరవగణములో (నల - జ) తొలి లఘువు తరువాత యతి. [8] ఏడవ గణ

ధాతుశ్చతుర్ముఖీ కంఠ శృంగాటక విహారిణీం।
నిత్య ప్రగల్భ వాచాలా ముపతిష్ఠే సరస్వతీమ్ ॥ 11

ముగా నలమున్నచో ఆరవగణము ముగిసినపిదప యతి. [గి] ఉత్తరార్ధమున (అయిదవ గణముగా నలమున్నచో) నాల్గవగణము తరువాత యతి.

1. తమృషిం మనుష్య లోక

2. ప్రవేశ విశ్రా మ - శాభి నంవా చామ్

3. సురలో కాదవ తార

4. ప్రాంతర - ఖేద చ్ఛి దంవం దే

ధాతురితి :- ధాతుః = బ్రహ్మయొక్క. చతుర్ముఖీ = నాలుగుమోముల యొక్క. కంఠ=గళప్రదేశమనునట్టి. శృంగాటక=(నాలుగువీధుల) కూడలియందు. విహారిణీమ్=విహరించునదియు. నిత్య=ఎల్లప్పుడు. ప్రగల్భ = అతిశయించునదియు. వాచాలామ్=(వాగుడు) నోరు కలదియునైన. సరస్వతీమ్=భారతిని. ఉపతిష్ఠే=పూజింతును. (శృంగాటకం భవేద్వారికంటకే చ చతుష్పథే - మేదిని)

నటః :- (సహర్షమ్) భావ, తత్ప్రస్తూయతామ్. అస్య హి మౌద్గల్యానాం బ్రహ్మర్షీణామన్వయమూర్ధన్యస్య మురారినామధేయస్య బాలవాల్మీకే ర్వాఙ్మయమ్ అమృతబిందునిష్యంది కందలయతి కౌతుకం మే.

---

సమాసములు :- చతుర్ణాం ముఖానాం సమాహారః - చతుర్ముఖ్యాః కంఠః. చతుర్ముఖీ కంఠః ఏవ శృంగాటకమ్. చతుర్ముఖీకంఠ శృంగాటకే విహారశీల మనస్కః - తామ్. నిత్యం ప్రగల్భా - నిత్యప్రగల్భా చ సా వాచాలా చ - తామ్. వాచాల శబ్దము (అలవాటుచే బహుభాషిణి) ఉత్పత్తిస్థిరము. కావున కొందరు వాచా శబ్దమునుండి లాతి గృహ్ణాతి అను అర్థముతో "వాచాల" తయారుచేసి స్త్రీ ప్రత్యయముతో సమన్వయించిరి. (స్యాజ్జల్పాకస్తు వాచాలః). ఇందు సరస్వతి పణ్యాంగనగా సంభావింప బడినదనియు వాచాలత్వము తదుచితమే అనియు మరికొందరు.

సంధులు :- ధాతుః + చతుర్ముఖీ - శషసాదేశ విసర్గసంధి.

క్రియ :- స్థా గతినివృత్తౌ. 'ఉప' అనునది ఉపసర్గ. దేవపూజేత్యాది సూత్రముచే ఆత్మనే పదత్వము. లట్. ఉత్తమ.

ఉపతిష్ఠే - ఉపతిష్ఠావహే - ఉపతిష్ఠామహే

ఛందస్సు :- ఆర్యావృత్తము [చూ. ప్రథమ—10]

భావేతి :- (సహర్షమ్=సంబరముతో) పండితా ! తత్=అదే. ప్రస్తూయతామ్=ప్రారంభింపబడుగాక ! ప్రారంభించుమనుట. మౌద్గల్యానామ్=మౌద్గల్యగోత్రజులైన, బ్రహ్మర్షీణామ్=బ్రహ్మర్షులయొక్క. అన్వయ = వంశమునందు, మూర్ధన్యస్య=అగ్రగణ్యుడును, బాలవాల్మీకేః=బాలవాల్మీకి అను బిరుదుకలవాడునైన, అస్య=ఈ, మురారి నామధేయస్య=మురారియొక్క. వాఙ్మయమ్ = కవిత్వము. అమృతబిందు=సుధాశీకరములను, నిష్యంది=చిమ్ముచు. మే = నాకు, కౌతుకమ్ = ఉత్సుకతను. కందలయతి=మొలిపించుచున్నది.

మారిషేతి :- మారిషా ! భవతః=నీయొక్క. ఈదృశమ్=ఇటువంటి, ఏతత్=ఈ, కుతూహలమ్=కౌతుకము, స్థానే ఏవ=ఉచితమే. తథాహి=అంతేకదా -

సూత్రధారః :- మారిష. స్థానే భగవతః కుతూహల మీదృశమే వైతత్.

తథాహి—

తత్తాదృగుజ్జ్వల కకుత్ స్థకులప్రశస్తి
సౌరభ్య నిర్భరగభీర మనోహరాణి ।
వాల్మీకి వాగమృతకూప నిపాన లక్ష్మీ
మేతాని బిభ్రతి మురారికవేర్వచాంసి ॥ 12

---

తత్తాదృగితి :- తత్తాదృగుజ్జ్వల ... మనోహరాణి, మురారికవేః ఏతాని వచాంసి వాల్మీకి వాగమృతకూప నిపానలక్ష్మీమ్ బిభ్రతి.

అర్థము :- తత్తాదృక్=అటువంటి సుప్రసిద్ధమైన, ఉజ్జ్వల=ప్రకాశించునట్టి, కకుత్స్థకుల = ఇక్ష్వాకు వంశముయొక్క, ప్రశస్తి = ప్రశంసారూపమైన, సౌరభ్య=సుగంధముతో, నిర్భర=నిండినవియు, గభీర=గంభీరములును, మనోహరాణి = మనస్సును దోచుకొనునవియునైన, మురారికవేః = కవి మురారియొక్క, ఏతాని=ఈ, వచాంసి=వాక్కులు, వాల్మీకి=ప్రాచేతసునియొక్క, వాక్=కవిత్వమనునట్టి, అమృత=సుధలతోనిండిన, కూప=నూతికి, నిపాన=(గట్టునకు దగ్గరలోనున్న) తొట్టియొక్క, లక్ష్మీమ్=శోభను, బిభ్రతి=వహించుచున్నవి. (ఆహావస్తునిపానం స్యాదుపకూపజలాశయే - అమరము)

సమాసములు :- కకుత్స్థస్య కులమ్. ఉజ్జ్వలం చతత్ కకుత్స్థకులమ్ చ. తత్తాదృక్చ తత్ ఉజ్జ్వల కకుత్స్థకులం చ. తస్య ప్రశస్తిః ప్రశస్తేః సౌరభ్యమ్. సౌరభ్యేన నిర్భరమ్. గంభీరంచ తత్ మనోహరంచ, తత్తాదృ .... నిర్భరమ్చ తత్ గంభీర మనోహరంచ - తాని. సౌరభ్యేన నిర్భరాణి చ తాని గంభీరమనోహరాణి అని బహువచనమందేని. వాల్మీకేః వాగేవామృతమ్. అమృతస్య కూపః. కూపస్య నిపానమ్. నిపానస్య లక్ష్మీమ్ —

సంధులు :- మనస్ + హర - ఉత్వాదేశవిసర్గ. కవేః + వచాంసి - రేఫాదేశవిసర్గ.

అపిచ—

దేవీం వాచముపాసతే హి బహవస్సారం తు సారస్వతం
జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః।
అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కిం త్వస్య గంభీరతా
మాపాతాళ నిమగ్న పీవరతనుర్జానాతి మంథాచలః ॥ 13-అ

---

క్రియ :- డుభృఞ్ ధారణపోషణయోః, పరస్మై. లట్. ప్రథమ.
బిభర్తి - బిభృతః - బిభ్రతి.

ఛందస్సు :- వసంత తిలక. ఉక్తా వసంతతిలకా తభజాజగౌగః.

| | | | | | |
|---|---|---|---|---|---|
| UUI | UII | IUI | IUI | UU | (తభజజగగ) |
| పితాని | బిభ్రతి | మురారి | కవేర్వ | చాంసి | |
| త | భ | జ | జ | గగ | |

అపిచ = మరియు

దేవీమితి :- వాచం దేవీం బహవః ఉపాసతే హి. తు సారస్వతం సారం గురుకులక్లిష్టః కవిః అసౌ మురారిః జానీతే. అబ్ధిః వానరభటైః లంఘితః ఏవ. కింతు అస్య గంభీరతామ్ ఆపాతాళనిమగ్నపీవరతనుః మంథాచలః జానాతి.

అర్థము :- వాచమ్=వాగ్రూపమైన, దేవీమ్ = సరస్వతిని, బహవః = చాలమంది, ఉపాసతే హి = ఉపాసించుచున్నారుగదా। తు=కాని, సారమ్=సారభూతమైన లేక శ్రేష్ఠమైన, సారస్వతమ్=కావ్యపురాణాది సారస్వతమును, గురుకులక్లిష్టః= గురుకులావాస క్లేశమును అనుభవించినవాడైన - తగిన శిక్షణను పొందినవాడనుట, కవిః=కవియగు, అసౌ=ఈ, మురారిః=మురారి, జానీతే=ఎఱుగును, అబ్ధిః=సముద్రము, వానరభటైః=కపిసైనికులతో, లంఘితః ఏవ=దాటబడినదే, కింతు=కాని, అస్య=ఆ సముద్రముయొక్క, గంభీరతామ్=లోతును (గాంభీర్యమును), ఆ పాతాళ= పాతాళలోకము వరకును, నిమగ్న=మునిగిన, పీవరతనుః=బలిష్ఠమగు శరీరముగల, మంథాచలః=మంథానాద్రి - కవ్వపుగొండ - జానీతే=ఎఱుంగును, సముద్రపులోతు మంథాద్రికి తెలిసినట్లు సారస్వత గాంభీర్యము మురారికి తెలియుననుట.

(నేపథ్యే గీయతే)

దినకరకిరణోత్కరః ప్రియాకరః కోఽపి జీవలోకస్య ।
కమలముకులాంకపాళీగత మధుకర కర్షణవిదగ్ధః ॥ 13

---

సమాసములు :- గురోః కులమ్. గురుకులే క్లిష్టః. ఆసమంతాత్ పాతాళమ్. ఆపాతాళమ్ నిమగ్నా. పీవరా చ సా తనుశ్చ. ఆపాతాళనిమగ్నా పీవరతనుర్యస్య సః. వానరాశ్చతే భటాశ్చ - వానరేషు భటాః.

సంధులు :- బహవః + సారమ్ - సాదేశవిసర్గ. క్లిష్టః + మురారిః - ఉత్వాదేశవిసర్గ. అబ్ధిః + లంఘిత. తనుః + జానాతి - రేఫాదేశవిసర్గ. లంఘితః + ఏవ - విసర్గలోప. తు + అస్య - యణాదేశ.

క్రియ :- ఆసజ్ ఉపవేశనే, ఆత్మనే, లట్, ప్రథమ
ఉప + ఆస్తే - ఆసాతే - ఆసతే.
జ్ఞా అవబోధనే, పరస్మై, లట్, ప్రథమ
జానాతి - జానీతః - జానన్తి (జ్ఞాజనోర్జః)
ఆత్మనే :- జానీతే - జానాతే - జానతే

అలంకారము :- భిన్నధర్మములున్న ప్రకృతాప్రకృత వాక్యములు బింబ ప్రతిబింబభావముతో నుండుట నిది దృష్టాంతము. సముద్రపులోతు మంథాద్రికి తెలిసినట్లు సారస్వతపు లోతు మురారికి తెలియుననుట ఫలితార్థము. శార్దూల విక్రీడితము ఛందస్సు.

విశేషము :- నిర్ణయసాగర చౌఖాంబ మైసూరుప్రతులలో నీ శ్లోకము లేదు. మొదటి రెండు ప్రతులవారును ఈ శ్లోకము కొన్నింట కనబడుచున్నదని అధస్సూచికలలో తెల్పిరి. తత్తాదృక్కు ముందున్నదట.

(నేపథ్యే=తెరవెనుక. గీయతే=పాట విన్పించును)

దినకరేతి :- జీవలోకస్య, ప్రియాకరః, కమలముకుల .... విదగ్ధః, కః అపి దినకర కిరణోత్కరః (జయతి)

(దిణఅరకిరణుక్కేరో పిఅ అరో కో వి జీఅ లోఅస్స।
కమలమఉలంకవాలీగఅ మహుఅర కడ్ఢణవిఅడ్ఢో ॥)

---

అర్థము :- జీవలోకస్య=చరాచర జగత్తునకు లేక ప్రాణికోటికి. ప్రియాకరః=హితము గూర్చునదియు. కమలముకుళ = మొగ్గవలె ముడుచుకొన్న పద్మము యొక్క - (ఒకసారి వికసించి ముడుచుకొన్నది. కేవలము మొగ్గయయినచో అందు అళులుండవు) అంకపాళీ=ఒడిని. గత=పొందిన - ఒడిలోనున్నయనుట. మధుకర=తుమ్మెదను. కర్షణ=బహిర్గతము చేయుటయందు. విదగ్ధః=నైపుణ్యము కలదియునైన. కోఽపి=అనిర్వచనీయమగు. దినకరకిరణోత్కరః = సూర్యకిరణ సమూహము. జయతి = జయించుగాక-అని క్రియ అధ్యాహార్యము. [అంకపాళీ పరిరంభః ఇతి మేదినీ. విదగ్ధశ్చతురే ఖిగ్గే నాగరే కుశలేఽపిచ - విశ్వం.]

సమాసములు :- దినం కరోతీతి. దినకరస్య కిరణాః దినకర కిరణానాముత్కరః. జీవానాం లోకః తస్య. కమలస్య ముకుళః. కమలముకుళస్య అంకపాళీం గతః. అంకపాళీగతశ్చాసౌ మధుకరశ్చ తస్య కర్షణమ్. కర్షణే విదగ్ధః. ప్రియాకరః - సుఖప్రియాదానులోమ్యే అనుదానిచే డాచ్.

విశేషములు:- నేపథ్యము నందిట్లు పాడుటను ధ్రువాగీత మందురు. పాత్రపరిచయము సభ్యరంజనము రసానుసంధానము దీని సామాన్యలక్షణములు. (ప్రథయతి పాత్రవిశేషాన్ సామాజికమనాంసి రంజయతి అనుసందధాతి చ రసాన్నాట్యవిశేషే ధ్రువాగీతః) ఇది ప్రావేశికి, పరిక్రమణిక, ఉపస్థితిక, ఉత్థాపిని, నిష్క్రామణిక అని అయిదు విధములు. వీనిలో - ఇతివృత్తార్థ సంబంధ రసభావ ప్రకాశకం పాత్రప్రవేశే యద్గానం తత్ప్రావేశిక ముచ్యతే - కథాప్రారంభ సన్నివేశముతో సంబంధము కలిగి ప్రధానరసభావములను స్పృశించునది పాత్రప్రవేశ సమయమున గానము చేయబడునదియునగు శ్లోకము ప్రావేశికి.

దశరథుని అంకపాళినుండి రఘురాముని తీసికొని పోవుటకు విశ్వామిత్రుడు ప్రవేశించుట ఇందలి ఇతివృత్త సూచన. అది జీవలోక ప్రీతికారకమనుట. విశ్వామిత్రుడు గాయత్రీద్రష్ట. తేజస్వి. దినకరకిరణోత్కరః అనుటలో విశ్వామిత్రుడు. ప్రజాగరః అంకపాళీకృత అని పాఠాంతరము లున్నవి. ప్రజాగరః =

సూత్రధారః :- (ఆకర్ణ్య) కథముపక్రాన్తమేవ నర్తకైః, యదియం దశరథోత్సంగాద్రామభద్రాకర్షిణో విశ్వామిత్రస్య ప్రావేశికీ ధ్రువా. (పురోఽవలోక్య ససంభ్రమమ్) అయే. కథమత్రైవ తత్రభవతః కమలయోనిజన్మనో మునేరాయతనాత్ప్రతినివృత్తేన ఋత్విజా వామదేవేన కిమపి తద్వాచికమభిధీయమానో మహారాజో దశరథస్తిష్ఠతి. తదేహి. న ద్వయోస్తృతీయేన భవితవ్యమిత్యావామప్యనంతరకరణీయాయ సజ్జీభవావః। (ఇతి నిష్క్రాంతౌ)

—: ప్రస్తావనా :—

---

జాగరింపజేయువాడు. లేదా అగర మనగా అమృతము ప్రజలకు అమృతప్రాయుడనియు. కమల ముకుళమే అంకపాళిగా చేసికొన్న మధుకరమని సమన్వయము.

ఛందస్సు:- ఆర్య. (చూ. ప్రథమ-10). ప్రాకృతమున ఇదియే గాథ.

కథమితి :- (ఆకర్ణ్య = నేపథ్యగానమును విని) కథమ్ = ఎట్లూ। నర్తకైః = నటులచే. ఉపక్రాంతమేవ=ప్రారంభింపబడినదే। ఇయమ్ = ఈ విని పించినది. దశరథోత్సంగాత్ = దశరథుని ఒడినుండి. రామభద్ర + ఆకర్షిణః = రాముని గొనిపోవునట్టి. విశ్వామిత్రస్య = విశ్వామిత్రునికి. ప్రావేశికీ ధ్రువా=ప్రవేశ సూచకమగు ధ్రువ. (పురః = ముందునకు. అవలోక్య = చూచి. ససంభ్రమమ్ = సంభ్రమముతో) అయే = అరే। కథమ్ = (ఆశ్చర్యము।) ఎట్లూ। తత్రభవతః = గౌరవింపదగినవాడును. కమలయోని జన్మనః = బ్రహ్మపుత్రుడునైన. మునేః = వసిష్ఠునియొక్క. ఆయతనాత్ =గృహమునుండి [ఆశ్రమమునియు] ప్రతినివృత్తేన = తిరిగివచ్చినవాడును. ఋత్విజా = ఋత్విక్కునైన. వామదేవేన= వామదేవునితో. కిమపి = ఏదో. తద్వాచికమ్ = వసిష్ఠసందేశమును. అభిధీయమానః= చెప్పబడుచున్నవాడై. మహారాజః = మహారాజగు. దశరథః=దశరథుడు. అత్రైవ= ఇదిగో ఇచ్చటనే. తిష్ఠతి = కూర్చున్నాడు. వామదేవుడు దశరథునికి వసిష్ఠసందేశమును వినిపించుచున్నాడనుట. తత్ = అందుచే. ఏహి=పోదము రమ్ము. ద్వయోః= ఇరువురినడుమ. తృతీయేన = మూడవ వ్యక్తిచే. న భవితవ్యమ్ = ఉండదగదు - మూడవవాడు ఉండరాదనుట - ఇతి = కావున. ఆవామపి = మనముకూడ. అనం

(తతః ప్రవిశతి యథోపదిష్టో దశరథో వామదేవశ్చ)

దశరథః :- అహో, బహుధా శ్రుతమపి భగవతో వసిష్ఠస్యానుశాసనం నవం నవమివ ప్రమోదయతి మామ్.

వామదేవః :-

మధుకైటభ దానవేంద్ర మేదః ప్లవవిస్రా విషమైవ మేదినీయమ్ ।
అధివాస్య యది స్వకైర్యశోభిశ్చిరమేనాముపభుంజతే నరేంద్రాః ॥14

---

తదనన్తరణీయాయ = తరువాతిపనికి. సన్నద్ధానామ్ = సన్నద్ధుల మప్పుడము. [ఇతి = అని. నిష్క్రాన్తౌ = నిష్క్రమించిరి].

—: ఇతి ప్రస్తావన :—

[తతః = అటు పిమ్మట. యథోపదిష్టః = ఉక్తరీతిగా, దశరథః = దశరథుడు. చ = మరియు, వామదేవః = వామదేవుడు. ప్రవిశతి = ప్రవేశించును]

అహో ఇతి :- అహో = ఆశ్చర్యము ! బహుధా = పలుమారులు. శ్రుతమపి = విన్నదే అయినప్పటికిని, భగవతః = జ్ఞానియైన, వసిష్ఠస్య = వసిష్ఠునియొక్క. అనుశాసనమ్ = ఆజ్ఞ, నవమ్ నవమ్ ఇవ=నిత్యనూతనముగా, మామ్= నన్ను, ప్రమోదయతి = [ఎప్పటికప్పుడు] ఆనందపరచును.

మధ్వితి :- మధు—విస్రా ఇయమ్ మేదినీ విషమావ. నరేంద్రాః స్వకైః యశోభిః ఏనామ్ చిరమ్ అధివాస్య యది ఉపభుంజతే.

అర్థము :- మధుకైటభ = మధుకైటభులనునట్టి, దానవేంద్ర = మహారాక్షసులయొక్క, మేదః ప్లవ = క్రొవ్వుచేరులతో, విస్రా = దుర్గంధితమైన, ఇయమ్ = ఈ, మేదినీ = భూమి, విషమా ఏవ = భోగ్యార్హ కాదనుట నిజమే, నరేంద్రాః=మహారాజులు, స్వకైః = తమవైన, యశోభిః = కీర్తులతో, ఏనామ్ = ఈ భూమిని, చిరమ్ = చాలకాలము, అధివాస్య యది = సుగంధితము చేయుదురేని, ఉపభుంజతే=భోగ్యార్హ యగును - నివాసయోగ్యయగు ననుట.

దశరథః :- (సవిమర్శ స్మితమ్) సఖే వామదేవ.

తస్యాజ్ఞయైవ పరిపాలయతః ప్రజాం మే
కర్ణోపకంఠ పలితంకరణీ జరేయమ్ ।
యద్గర్భరూపమివ మామనుశాస్తి సర్వ
మద్యాపి తన్మయి గురుర్గురుపక్షపాతః॥ 15

---

సమాసములు :- మధుశ్చ కైటభశ్చ. దానవానామింద్రః. మధుకైటభౌ చతౌ దానవేంద్రౌ. మేదసః ప్లవః. మధుకైటభదానవేంద్రయోః మేదః ప్లవః - ప్లవస్య విస్రం యస్యాఃసా. [విస్రం స్యాదామగంధియత్-అమర] నరేషు ఇంద్రః=నరాణా మింద్రో వా - తే

సంధులు :- విషమా + ఏవ – వృద్ధి. నర + ఇంద్రాః = గుణసంధి స్వైః + యశస్ – రేఫాదేశ విసర్గ. యశస్ + భిస్ – ఉత్వాదేశవిసర్గ. యశోభిః + చిరమ్ - శాదేశ.

క్రియ :-భుజ పాలనాభ్యవహారయోః [భుజోఽనవనే - అని]. ఆత్మనే
లట్ ప్రథమ. భుజ్జే - భుఞ్జాతే - భుఞ్జతే

సఖేఇతి :- సఖేవామదేవ=మిత్రమా, వామదేవా। [ఋషే అని పాఠాంతరము]

తస్యేతి :- తస్య ఆజ్ఞయాఏవ ప్రజాం పరిపాలయతః మే కర్ణోప కంఠ పలితంకరణీ ఇయమ్ జరా [ఉపస్థితా], అద్యాపి. మామ్ గర్భరూపమ్ ఇవ, సర్వమ్, అనుశాస్తి. తత్ మయి గురుపక్షపాతః గురుః,

అర్థము :- తస్య=ఆ వసిష్ఠునియొక్క, ఆజ్ఞయా ఏవ=ఆజ్ఞతోనే, ప్రజామ్= ప్రజను, పరిపాలయతః=పాలించుచున్నవాడనైన, మే=నాకు, కర్ణోపకంఠ=చెవుల దగ్గర, పలితంకరణీ=(జుత్తును) తెల్లబరచుచున్నదై, ఇయమ్=ఈ, జరా=ముసలి తనము, ఉపస్థితా=వచ్చినది - వృద్ధుడనైతి ననుట. అద్యాపి=ఇప్పటికిని, మామ్= నన్ను, గర్భరూపమ్ ఇవ=బాలకునివలె, సర్వమ్=అన్నింట, అనుశాస్తి=ఆజ్ఞాపించును. తత్=అందుచేతనే. మయి=నాపట్ల, గురుపక్షపాతః=వసిష్ఠులవారి అభిమానము, గురుః=గొప్పది. అధికమనుట. (బాలకే తరుణేఽపి స్యాద్గర్భరూపః - విశ్వ)

వామదేవః :- మహారాజ, కిముచ్యతే. సమానవృత్తేరపి క్వచిదేవ కస్యచి
త్తారామైత్రకమ్. తథాహి - స తత్రభవాన్ -

---

సమాసములు :-కణ్ఠయోః ఉపకంఠః, అపలితం పలితం కరోతి తచ్ఛీల మస్యాః - పలితంకరణీ. కణ్ఠోపకంఠే పలితం కరణీ. గురోః పక్షపాతః.

సంధులు :- తస్య + అజ్ఞా. అద్య + అపి - సవర్ణదీర్ఘ. అజ్ఞయా + ఏవ - వృద్ధి. కణ్ఠ + ఉపకంఠ. జరా + ఇయమ్ - గుణ. తత్ + మయి - అనునాసికాదేశ. గురుః + గురు - రేఫాదేశ విసర్గ.

క్రియ :- శాసు అనుశిష్టౌ. లట్. పరస్మై. ప్రథమ
శాస్తి - శిష్టః - శాసతి

ఛందస్సు :- వసంత తిలక - ఉక్తా వసంతతిలకా తభజాజగౌగః

| త | భ | జ | జ | గగ |
|---|---|---|---|---|
| ౼౼। | ౼।। | ।౼। | ।౼। | ౼౼ |
| తస్యాజ్ఞ | యైవవ | రిపాల | యతఃప్ర | జాంమే |

మహేతి :- మహారాజా । కిముచ్యతే=ఏమి చెప్పను । సమానవృత్తేః అపి=అందరిపట్ల సమానముగా నుండువానికైనను. కస్యచిత్=ఒక్కొక్కని పట్ల క్వచిత్ ఏవ=ఒక్కొక్కప్పుడు మాత్రమే. తారామైత్రకమ్=చక్షుఃప్రీతి యుండును. వసిష్ఠులకు నీపట్ల అట్టిదున్నదనుట. [తారామైత్రకమ్ అనునది స్వజనమువలె అఖండ శబ్దమనియు సహజమైత్రీపరమనియు కొందరు పెద్దలు చెప్పుచున్నారు. తార అను పద మునకు కనీనిక. నక్షత్రము. వాలిభార్య అని మూడర్థములు. (అక్షిపుత్ర్యాం చ నక్షత్రే తారా స్త్రీ వాలియోషితి). తారామైత్రికి నక్షత్రానుకూల్యము, చక్షుఃప్రీతి అను నర్థములు శ్లేషించుదినవి. సుగ్రీవునితో కాపురము చేయుచున్నను తార మనసు వాలిదే యన్నట్లును ఇచట అర్థమును సమన్వయించుట ఇష్టార్థకల్పవల్లిలో కన్పించుచున్నది.] తథాహి=అది ఉచితమేకదా ।. తత్రభవాన్=గౌరవార్హుడైన, సః=ఆ వసిష్ఠుడు.

సాధారణఇతి :- రఘూణాం సాధారణః గురుః భవన్ అపి [సః] తే విశేషదృష్టిః. ఇందుః కమ్ న ఆమోదయతి । పునః అస్య కుముదం సర్వస్వమ్.

సాధారణో రఘూణాం గురుర్భవన్నపి విశేషదృష్టి స్తే ।
నామోదయతి కమిందుః కుముదం పునరస్య సర్వస్వమ్॥ 16

దశరథః :- వామదేవ, మమ హి గురువచన శ్రవణ తృష్ణామంకుశీకరోతి శ్రోత్రవృత్తి రింద్రియాంతరానుసారిణో హృదయ మహా గజస్య, తన్న కించిదపరమవశిష్యతే.

---

అర్థము :- రఘూణామ్=రఘువంశ ప్రభువులకు, సాధారణః=సర్వసాధారణుడైన, గురుః=గురువు, భవన్ అపి=అయియుండియును - అందరికిని తానే గురువైనప్పటికిని. సః=ఆ వసిష్ఠుడు, తే=నీపట్ల, విశేషదృష్టిః=ఆదరాతిశయము కలవాడు- ప్రత్యేకదృష్టి కలవాడనుట. ఇందుః=చంద్రుడు, కమ్=ఎవనిని, న ఆమోదయతి= ఆనందింపజేయడు ! పునః=కానీ, అస్య=ఆ చంద్రునికి, కుముదమ్=కలువయే, సర్వస్వమ్=సమస్తమును - అదే నిధి వంటిది, దానిపైనే ప్రత్యేకాదరమనుట.

సంధులు :- సాధారణః+రఘు - ఉత్వాదేశ విసర్గ. గురుః+భవన్ రేఫాదేశ విసర్గ. భవన్+అపి=అనునాసిక ద్విత్వసంధి. దృష్టిః+తే=సాదేశవిసర్గ. న+ఆమోదయతి=సవర్ణదీర్ఘ.

ఛందస్సు :- ఆర్యావృత్తము. (చూ. ప్రథమ - 10)

క్రియ :- ముద సంసర్గే (ణిచ్). పరస్మై. లట్. ప్రథమ. (అట్).
ఆమోదయతి - ఆమోదయతః - ఆమోదయన్తి

అలంకారము :- ప్రతివస్తూపమ. వాక్యయోరేకసామాన్యే ప్రతివస్తూపమామతా. ఉపమానోపమేయవాక్యములలో ఆదరాతిశయము సమానధర్మము. అది భిన్న పదములతో నిర్దేశింపబడినది.

వామదేవేతి :- వామదేవా ! మమ=నాయొక్క, శ్రోత్రవృత్తిః=శ్రవణ వ్యాపారము (కర్త). ఇంద్రియాంతర+అనుసారిణః = ఇతరేంద్రియములవెంట పరుగిడుచున్న. హృదయ=అంతరంగమనునట్టి. మహాగజస్య=మదపుటేనుగునకు. గురువచన=వసిష్ఠుల ఆజ్ఞను, శ్రవణ=వినవలెననునట్టి. తృష్ణామ్=కోరికను. అంకుశీకరోతి=అంకుశముగా నుపయోగించుచున్నది. ఈ కోరికనే అంకుశముగా ఉపయోగించి

వామదేవః :- మహారాజ, నిశ్శేషమభిహితమ్. ఇమాం తు సర్వసందేశ సంగ్రహకారికాం కారికామతిప్రయత్నేన భగవాన్ భవన్త మనుస్మారయతి.

దశరథః :- (సాదరమ్) అవహితోఽస్మి. కిమాజ్ఞాపయన్తి గురవః ?

వామదేవః :- హుతమిష్టం చ తప్తం చ ధర్మశ్చాయం కులస్య తే ।
గృహాత్ప్రతినివర్తన్తే పూర్ణకామా యదర్థినః ॥ 17

---

శ్రవణవ్యాపారము హృదయగతమును నియమించుచున్నదనుట. తత్ = అందుచే, అపరమ్ = మరియొకటి, కించిత్ = కొంచెముకూడ, న + అవశిష్యతే = లేదు. వసిష్ఠుల మాట వినుటకన్న మరియొకపని లేనే లేదనుట.

మహారాజేతి :- దశరథమహారాజా ! నిశ్శేషమ్ = పూర్తిగా, అభిహితమ్ = చెప్పబడినది. చెప్పవలసినదంతయు చెప్పితిననుట. లేదా - చెప్పవలసినదానిని ఇదిగో పూర్తిగా చెప్పిరిట్లు వసిష్ఠులనియు. సర్వసందేశ = సమస్త సందేశములయొక్క, సంగ్రహకారికామ్ = సంకలనరూపమైయున్న, ఇమామ్ = ఈ, కారికామ్ = శ్లోకమును, భగవాన్ = వసిష్ఠులవారు, అతిప్రయత్నేన = మిక్కిలి పూనికతో, భవన్తమ్ = నిన్ను, అనుస్మారయతి = గుర్తుచేయుచున్నారు - నీకు జ్ఞాపకము చేయుచున్నారనుట.

అవహిత ఇతి :- (సాదరమ్ - ఆదరముతో) అవహితః అస్మి = సావధానుడనైతిని. గురవః = కులగురువులు వసిష్ఠులు, కిమ్ ఆజ్ఞాపయన్తి = ఏమి ఆజ్ఞాపించుచున్నారు ?

హుతమితి :- అర్థినః పూర్ణకామాః తే గృహాత్ ప్రతినివర్తన్తే (ఇతి) యత్ అయమ్ (ఏవ) తే కులస్య హుతమ్ ఇష్టమ్ చ తప్తం ధర్మః చ.

అర్థము - అర్థినః = యాచకులు, పూర్ణకామాః = తీరినకోరికలు గలవారై తే = నీయొక్క, గృహాత్ = భవనమునుండి, ప్రతినివర్తన్తే యత్ = తిరిగివెడలుచున్నారనుట యేదికలదో, అయమ్ ఏవ = ఇదియే, తే = నీయొక్క, కులస్య = వంశమునకు హుతమ్ = వైశ్వదేవాదికమగు హోమము, ఇష్టమ్ చ = అగ్నిష్టోమాదిక యాగమును,

దశరథః :- (సహర్షమ్) సుష్ఠు. శిరసి కృతమాచార్యవచనమ్. కించ-

అస్మద్గోత్ర మహత్తరః క్రతుభుజామద్యాయ మాద్యో రవి
ర్యజ్వానో వయమద్య తే భగవతీ భూరద్య రాజన్వతీ ।
అద్య స్వం బహుమన్యతే సహచరై రస్మాభిరాఖండలో
యేనైతావదరుంధతీపతిరపి స్వేనానుగృహ్ణాతి నః॥ 18

---

తప్తమ్ చ = చాంద్రాయణాదికమగు తపస్సును, ధర్మః చ = ప్రజాపాలనాదికమగు ధర్మమును. అర్థులను సంతోషపెట్టుటయే నీకు సమస్తము ననుట.

సమాసము :- పూర్ణః కామః యస్య సః - తే.

సంధులు :- ధర్మః + చ = శాదేశ విసర్గ, చ + అయమ్ - సవర్ణదీర్ఘ. కామాః + యత్ = విసర్గలోప.

క్రియ :- వృతు (జీర్) వర్తనే. ఆత్మనే, లట్. ప్రథమ. (ని - ఉపసర్గ)

వర్తతే - వర్తేతే - వర్తన్తే

ఛందస్సు :- పథ్యా వక్త్రము. (చూ. ప్రథమ - 3)

సుష్ఠుఇతి :- (సహర్షమ్ = సంతోషముతో) సుష్ఠు = సాధు సాధు. ఆచార్య వచనమ్ = వసిష్ఠుల మాట, శిరసికృతమ్ = అంగీకృతము, కించ = మరియు -

అస్మదితి :- క్రతుభుజామ్ ఆద్యః అయమ్ రవిః అద్య అస్మద్గోత్ర మహత్తరః. తే వయమ్ అద్య యజ్వానః, భగవతీ భూః అద్య రాజన్వతీ, ఆఖండలః సహచరైః అస్మాభిః స్వమ్ అద్య బహుమన్యతే, యేన. అరుంధతీపతిః ఏతావత్ నః స్వేన అనుగృహ్ణాతి.

అర్థము :- క్రతుభుజామ్ = హవిర్భోక్తలలో, (దేవతలలో) ఆద్యః = మొదటివాడైన, అయమ్ = ఈ, రవిః = సూర్యుడు, అద్య = ఇప్పుడు, అస్మద్గోత్ర మహత్తరః = మా వంశమునకు మూలపురుషుడైనాడు - సూర్యుడు మా వంశమునకు మూలపురుషుడన్నది ఇప్పటికి సార్థకమైనదనుట; తే = ఆ (ప్రసిద్ధులమైన) వయమ్ = మేము, అద్య = ఈనాడు, యజ్వానః = యజ్ఞము చేసినవారమైతిమి, మా యజ్ఞములు

వామదేవః :- రాజర్షే, సహజానుభావ గంభీరమహిమానో యూయమేవ
తాదృశాయ యశసే. వయం తు కేవలముపదేష్టారః.

---

నేటికి సఫలములైనవనుట. భగవతీ=పవిత్రురాలైన భూః = భూదేవి. అద్య= నేడు. రాజన్వతీ=మంచి రాజు కలదయ్యెను. ఆఖండలః = దేవేంద్రుడు. సహచరైః= స్నేహితులమైన. అస్మాభిః=మాచేత - మేము సహచరులుగా నుండుటచే, స్వమ్=తనను తాను. అద్య=నేడు. బహుమన్యతే=ధన్యుడుగా భావించును. యేన=ఇదియంతయు ఎందువల్లననగా. అరుంధతీపతిః అపి=వసిష్ఠుడుకూడ. ఏతావత్=(ఇప్పటికి) ఇట్లు. నః= మమ్ము. స్వేన = తనకు తానుగా. అనుగృహ్ణాతి = అనుగ్రహించుచున్నాడు. (సురాజ్ఞి దేశే రాజన్వాన్ - అమరము)

సమాసములు :- మమ గోత్రమ్ - అస్మద్గోత్రే మహత్తరః. క్రతుం భునక్తీతి - క్రతుభుక్ - తేషామ్. అరుంధత్యాః పతిః.

సంధులు :- అద్య + అయమ్. స్వేన + అను - సవర్ణదీర్ఘ. ఆద్యః + రవిః. యజ్వానః + వయం. ఆఖండలః + యేన - ఉత్వాదేశ విసర్గ. రవిః + యజ్వా. భూః + అద్య. సహచరైః + అస్మాభిః + అఖండలః. పతిః + అపి - రేఫాదేశ విసర్గ సంధులు. యేన + ఏతావత్ - వృద్ధి.

క్రియ :- గ్రహ్ ఉపాదానే, పరస్మై. లట్, ప్రథమ.(అనూపసర్గకము)
గృహ్ణాతి - గృహ్ణీతః - గృహ్ణన్తి.

ఛందస్సు :- శార్దూల విక్రీడితము - మసజసతతగ.

రాజర్షే ఇతి :- ఓ రాజర్షీ ! సహజానుభావ = సహజప్రభావముతో నేర్పడిన. గంభీర మహిమానః = అగాధమగు మహత్త్వము కలవారైన, యూయమ్ ఏవ = మీరే, తాదృశాయ=వసిష్ఠుల అనుగ్రహమును బొందుటవంటి, యశసే=కీర్తికై అర్హులనుట. వయమ్ తు = మేమైతే, కేవలమ్ ఉపదేష్టారః=ఉపదేశకులము మాత్రమే.

ఉన్మద్రయతీతి :- అశరన్నిశా నిశాత విస్తుషోఽపి తుషారకిరణః కుముదాకరమ్ ఉన్మద్రయతి హి. పునః సః భగవాన్ వసిష్ఠః ద్వితీయపరమేష్ఠి కిముచ్యతే ?

ఉన్ముద్రయతి హి కుముదాకర
మశరన్నిశానిశాత నిస్తుషోఽపి తుషారకిరణః ।
స పునః కిముచ్యతే భగవాన్
ద్వితీయపరమేష్ఠీ వసిష్ఠః॥ (కుముదాకరము) 19

అర్థము :- అశరన్నిశానిశాతనిస్తుషః అపి - అ + శరన్నిశా = శారద రాత్రిచేనైన, నిశాత = వాడిదనము, నిస్తుషః = నిరాపరణత్వములు లేనివాడైనఅపి ను. (మొత్తమునకు నఞ్‌తో సమాసము). తుషారకిరణః = చంద్రుడు. (శరదృతు సహకారము లేకపోయినను) కుముదాకరమ్=కలువల సమూహమును (కొలనును). ఉన్ముద్రయతి హి = వికసింపజేయును గదా ।. పునః=మరి. సః=ఆ. భగవాన్ =మహానుభావుడగు. వసిష్ఠః = వసిష్ఠుడు. ద్వితీయపరమేష్ఠీ=మరొకబ్రహ్మ. కిమ్ ఉచ్యతే=ఇక చెప్పెడిదేమి ।

విశేషములు :- అనుకూల వాతావరణము లేకపోయినను చంద్రుడు కలువలను వికసింపజేయును. అట్టియెడ ద్వితీయపరమేష్ఠియగు వసిష్ఠుని శక్తికి అడ్డంకి యేముండును ! కుముదాకరమును వికసింప జేయగలడనుట. కు అనగా భూమి. దాని మోదము కుముత్. దానికి ఆకరుడు - కుముదాకరుడు=దశరథుడు. శరత్తుఅనగా సంవత్సరము. సంవత్సరములపాటు నిశలయందును మేల్కొనని ధ్యానమున నిమగ్నుడు - అశరన్నిశానిశాతనిస్తుషః. నిస్తుషుడనగా కల్మషరహితుడు. (ధాన్యత్వచి తుషః పుమాన్ అమరము) ఇట్లు వసిష్ఠునికి అన్వయము.

సమాసములు :- శరదః నిశా - శరన్నిశయా నిశాతశ్చాసౌ నిస్తుషశ్చ, న శరన్నిశా నిశాత నిస్తుషః. తుషారాంచితాః కిరణాః యస్య సః (మధ్యమ పదలోపి బహువ్రీహి) ద్వితీయశ్చాసౌ పరమేష్ఠీ చ.

సంధులు ;- ఉత్ + ముద్రయతి. శరత్ + నిశా - అనునాసికాదేశ. కుముద + ఆకర - సవర్ణదీర్ఘ. నిస్తుషః + అపి - ఉత్వాదేశవిసర్గ - నిస్తుషో + అపి- పూర్వరూప.

అపిచ—

ఇదం వో యాజ్యానాముదితముదితం యత్కులమభూ
ద్యదిష్టం వా కుర్వన్నకృత సగరః పూర్తముదధిమ్ ।
అసౌ పూర్వేషాం తే సుచరితపతాకా యదమర
స్రవన్తీ కృత్స్నోఽయం త్రిభువనగురోస్తస్య విభవః॥ 20

---

క్రియ :- [1] నామధాతువు. లట్. ప్రథమ.
ముద్రయతి - ముద్రయతః - ముద్రయన్తి
[2] వచ పరిభాషణే. కర్మణి. ఆత్మనే. లట్. ప్రథమ
ఉచ్యతే - ఉచ్యేతే - ఉచ్యన్తే

ఛందస్సు :- కుముదాకరవృత్తము. [ముద్రాలంకారము] ఏకాదశభిర్ద్వాదశభిః క్రమాదుభౌ పాదౌ, తత్కుముదాకర వృత్తం చరమౌ తు దశాక్షరౌ యస్య. మొదటిపాదమున పదునొకండు, రెండవపాదమున పదునెన్మిది. మూడు నాలుగు పాదములలో పదేసి అక్షరములుండును.

అపిచ = మరియు

ఇదమితి :- యాజ్యానామ్ వః ఇదం కులమ్ ఉదితముదితం యత్ అభూత్. వా ఇష్టం కుర్వన్ సగరః ఉదధిం పూర్తమ్ యత్ అకృత. అసౌ అమరస్రవన్తీ తే పూర్వేషాం సుచరిత పతాకా యత్. అయం కృత్స్నః త్రిభువనగురోః తస్య విభవః.

అర్థము :- యాజ్యానామ్=యజ్ఞకర్తలైన. వః=మీ పూర్వీకులయొక్క. ఇదమ్=ఈ. కులమ్=వంశము. ఉదితముదితమ్ = సంభవించిన సంతోషములు కలది. యత్ అభూత్=అయ్యెననగా. వా=మరియు. ఇష్టమ్=యజ్ఞమును. కుర్వన్=చేయుచు. సగరః=సగరచక్రవర్తి. ఉదధిమ్=సముద్రమును. పూర్తమ్=త్రవ్వబడినదిగా. యత్ అకృత=చేసెననగా [త్రవ్వెననగా]. అసౌ=ఈ. అమరస్రవన్తీ=గంగానది. తే = నీ యొక్క. పూర్వేషామ్=పూర్వీకులయొక్క. సుచరిత పతాకా యత్=కీర్తిపతాక అయ్యెననగా [యత్ అభూత్]. అయమ్ = ఈ. కృత్స్నమ్ = సమస్తమును. త్రిభువన గురోః = ముల్లోకములకును గురువైన. తస్య = ఆ వసిష్ఠునియొక్క. విభవః = ప్రభావమే. [పూర్తం త్రిషు పూరితే స్యాత్ క్లీబం ఖాతాదికం మతమ్ – మేదినీ]

కించ—

కౌశికస్వీకృతస్యాపి యదాజ్ఞాతిక్రమాదభూత్ ।
త్రిశంకోరుపభోగాయ న ద్యౌరపి న భూరపి॥ 21

---

సమాసములు :- ఉదితం చ తన్ముదితం చ. ఉదితం ముదితం యస్య తత్. సుచరితస్య పతాకా. అసురాణాం ప్రవ స్తీ. త్రయాణాం భువనానాం సమాహారః- త్రిభువనస్య గురుః - తస్య.

సంధులు :- వః + యాజ్యానాం - ఉత్వాదేశవిసర్గ. కుర్వన్ + అకృత - అనునాసికద్విత్వ. కృతస్సః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - కృతోఽ + అయమ్ = పూర్వరూప. గురోః + తస్య - సాదేశవిసర్గసంధి.

క్రియలు :- [1] భూ సత్తాయామ్, లఙ్, పరస్మై, ప్రథమ
అభూత్ - అభూతామ్ - అభూవన్.
[2] డు కృఞ్ కరణే, ఆత్మనే, లుఙ్, ప్రథమ.
అకృత - అకృషాతామ్ - అకృషత

ఛందస్సు :- శిఖరిణి. రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగ శ్శిఖరిణీ.

| య | మ | న | స | భ | లగ |
|---|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I I | I U |
| ఇదంవో | యాజ్యానా | ముదిత | ముదితం | యత్కుల | మభూత్ |

కించ = మరియు

కౌశికేతి :- యదాజ్ఞాతిక్రమాత్, కౌశిక స్వీకృతస్యాపి త్రిశంకోః ఉప భోగాయ ద్యౌః అపి న అభూత్, భూరపి న అభూత్. [పథ్యావక్త్రము ఛందస్సు. చూ. ప్రథమ - 3]

అర్థము :- యత్ = ఏ వసిష్ఠునియొక్క, అజ్ఞాతిక్రమాత్ = ఆజ్ఞోల్లంఘ నమువలన, కౌశిక స్వీకృతస్య + అపి = విశ్వామిత్రునిచే ఆదరింపబడిన వాడైనప్పటి కిని, త్రిశంకోః=త్రిశంకునకు [మీ వంశములోనివాడే అనుట]. ఉపభోగాయ=నివాస మునకై. ద్యౌఃఅపి=స్వర్గముకానీ, భూఃఅపి = భూలోకముగానీ, న అభూత్ = రాక

ప్రతీహారః :- జయతు జయతు దేవః. భగవాన్ కౌశికో ద్వారమధ్యాస్తే.

దశరథః :- (ససంభ్రమమ్) కిం కౌశికః ।

వామదేవః :- అహం తముపేత్య శ్రౌతేన విధినా పురస్కృత్య ప్రవేశయామి తపోనిధిమ్. (ఇతి ప్రతీహారేణ సహ నిష్క్రాంతః)

---

పోయెనో. సః వసిష్ఠః = అంతటివాడు వసిష్ఠుడని అన్వయము. త్రిశంకు స్వర్గము ప్రసిద్ధము.

సమాసములు :- కౌశికేన స్వీకృతః - తస్య. యస్య ఆజ్ఞాయా అతిక్రమః - తస్మాత్.

సంధులు :- స్వీకృతస్య + అపి. ఆజ్ఞా + అతిక్రమాత్ - సవర్ణదీర్ఘ. త్రిశంకోః + ఉపభోగాయ. ద్యౌః + అపి. భూః + అపి - రేఫాదేశ విసర్గ.

విశేషము :- నాసూచితస్య పాత్రస్య ప్రవేశో నిర్గమోఽపి వా. పాత్రప్రవేశము నిర్గమనము సూచింపబడవలెనని నియమము. కౌశికపాత్ర ప్రవేశమిచట సూచింపబడినది. అతని కోరికను మన్నించుట ధర్మమని పూర్వరంగమును సిద్ధము చేయుటగా వామదేవకృత వసిష్ఠ ప్రశంస సార్థకము.

జయత్వితి :- దేవః = మహారాజా, జయతు జయతు = జయించుగాక జయించుగాక ! భగవాన్ = మహానుభావుడైన, కౌశికః = విశ్వామిత్రుడు. ద్వారమ్ అధ్యాస్తే = గుమ్మములో నున్నాడు.

కిమితి :- (ససంభ్రమమ్=సంభ్రమముతో) కిమ్కౌశికః=విశ్వామిత్రుడా!

అహమితి :- అహమ్ = నేను, తమ్ = ఆ, తపోనిధిమ్ = తపస్విని, ఉపేత్య = సమీపించి, శ్రౌతేన = శ్రుతి సమ్మతమైన, విధినా = అర్ఘ్యపాద్యాదిక క్రియతో. పురస్కృత్య = సమ్మానించి, ప్రవేశయామి = ఇటకు కొనితెత్తును. (ఇతి = అని. ప్రతీహారేణ సహ = ద్వారపాలకునితోపాటు. నిష్క్రాంతః = నిష్క్రమించెను.)

దశరథః ;- (సహర్షమ్)

యః క్షత్రదేహం పరితక్ష్య టంకై స్తపోమయై ర్బ్రాహ్మణముచ్చకార।
పరోరజోభిః స్వగుణై రగాధః స గాధిపుత్రోఽపి గృహానుపైతి॥ 22

---

య ఇతి :- (సహర్షమ్ = సంతోషముతో) యః తపోమయైః టంకైః క్షత్రదేహమ్ పరితక్ష్య బ్రాహ్మణమ్ ఉచ్చకార. యః పరోరజోభిః స్వగుణైః అగాధః. సః గాధిపుత్రః అపి. గృహాన్ ఉపైతి.

అర్థము :- యః = ఏ మహానుభావుడు. తపోమయైః = తపోరూపములైన. టంకైః = శాణములతో (ఉలి పగుల్చు సాధనము - టంకః పాషాణ దారణః – అమరము). క్షత్రదేహమ్ = క్షత్రియవంశజాతమగు తన శరీరమును. పరితక్ష్య = ఒలిచి - కృశింపజేసి. బ్రాహ్మణమ్ = బ్రాహ్మణజాతి శరీరముగా. ఉచ్చకార = రూపొందించుకొనెనో, యః = ఏ మహిమాన్వితుడు, పరోరజోభిః = రజోగుణమునకు అవలిపైన - ఇది తమోగుణమునకు నుపలక్షణము. స్వగుణైః= తన గుణములతో. అగాధః = గంభీరమైనవాడో - లోతయినవాడో, సః=అటువంటి. గాధిపుత్రః అపి=గాధితనూజుడైన విశ్వామిత్రుడు కూడ. గృహాన్ = మా గృహములను (మావంటివారిని) ఉపైతి = సమీపించుచున్నాడు. తానే ఇటకు వచ్చుట విశేషమని. (రజసః పరైః = రాజదంతాదిషుపరమ్)

సంధులు :- టంకైః + తప - సాదేశవిసర్గ. తపః + మయ (ట్) రజస్ + భిస్ - ఉత్వాదేశవిసర్గ. గుణైః + అగాధః – రేఫాదేశవిసర్గ. సః + గాధి – విసర్గలోప. పుత్రః + అపి - ఉత్వాదేశ విసర్గ - పుత్రో + అపి పూర్వరూప. ఉప + ఏతి - వృద్ధి.

ఛందస్సు :- ఉపజాతి. ఇంద్రవజ్రోపేంద్రవజ్రల కలగలుపు.

త త జ గగ
UU। UU। ।U। UU
యఃక్షత్ర దేహంప రితక్ష్య టంకైః (ఇంద్రవజ్ర)

జ త జ గగ
।U। UU। ।U। UU
తపోమ యైర్బ్రాహ్మ ణముచ్చ కార (ఉపేంద్రవజ్ర)

(తతః ప్రవిశతి వామదేవోపదిశ్యమానవర్త్మా విశ్వామిత్రః)

విశ్వామిత్రః :- సఖే వామదేవ. త్వమధునైవ వసిష్ఠాశ్రమాదాగతోఽసి. కచ్చిత్కుశలీ తావదరుంధతీనామ్నా పతివ్రతామయేన జ్యోతిషా సహచరితధర్మా తత్రభవాన్ మైత్రావరుణిః ?

వామదేవః :- విశేషేణ పునరద్య యాజ్యకులముపతిష్ఠమానే చిరంతన ప్రణయిని కౌశికే.

విశ్వామిత్రః :- సఖే వామదేవ, చిరేణ దశరథో ద్రష్టవ్య ఇతి సర్వమనోరథానాముపరి వర్తామహే.

---

(తతః = అంతట. వామదేవ = వామదేవునిచే. ఉపదిశ్యమాన = చూపింపబడుచున్న. వర్త్మ = మార్గము కలవాడై. విశ్వామిత్రుడు. ప్రవిశతి = ప్రవేశించును.)

సఖేఇతి :- సఖే = మిత్రమా ! వామదేవా ! త్వమ్ = నీవు. అధునా ఏవ = ఇటీవలనే. వసిష్ఠాశ్రమాత్ = వసిష్ఠుని ఆశ్రమమునుండి. ఆగతః అసి = వచ్చితివిగదా ! అరుంధతీనామ్నా = అరుంధతి అనుపేరుతో. పతివ్రతామయేన = పాతివ్రత్య రూపమైన. జ్యోతిషా = తేజఃపుంజముతో. సహచరితధర్మా = సహచరించు ధర్మముకలవాడును - (అరుంధతి సహధర్మచారిణిగా కలవాడనుట). తత్రభవాన్ = గౌరవార్హుడునైన. మైత్రావరుణిః = మిత్రావరుణుల బిడ్డ వసిష్ఠుడు. కుశలీ కచ్చిత్ = కుశలమేనా !

విశేషేణేతి :- చిరంతన ప్రణయిని = చిరకాలముగా ఆప్తుడైన. కౌశికే = విశ్వామిత్రుడు. యాజ్యకులమ్ = ఇక్ష్వాకు వంశమును గూర్చి. ఉపతిష్ఠమానే = రాగా. అద్య = ఈనాడు. విశేషేణ పునః = విశేషముగా కుశలి. తన యజమానులను నీవు చూడవచ్చుట. వసిష్ఠునికి మరింత ఆనందదాయకమనుట. (ప్రియసుహృది కౌశికే = ఇష్టుడును మిత్రుడునైన విశ్వామిత్రుడు - అని పాఠాంతరము).

సఖేఇతి :- మిత్రమా ! వామదేవా ! చిరేణ = వెంటనే. దశరథః =

వామదేవః :- (సవినయమ్) భగవన్కౌశికనందన. ధన్యః ఖల్వయం రాజా సావిత్రో యమేవమనురుధ్యంతే భవంతోఽపి.

విశ్వామిత్రః :- సఖే, ధన్య ఏవాయమ్।

నమన్నృపతిమండలీముకుటచంద్రికాదుర్దిన
స్ఫురచ్చరణ పల్లవ ప్రతిపదోక్తదోస్సంపదా।

---

దశరథుడు, ద్రష్టవ్యః = చూడవలసినవాడు — వెంటనే మహారాజును నేను చూడవలెననుట. ఇతి = అందుచే, సర్వమనోరథానామ్ = అన్ని కోరికలకును, ఉపరి = పైగా, వర్తామహే = నడుచుచున్నాము. వసిష్ఠుని సందర్శింపవలెనని మనసు పీకుచున్నను దశరథ సందర్శనము అత్యవసరమై ముందుగా కావింపబడుచున్నదనుట.

భగవన్నితి :- (సవినయమ్ = వినయముగా) భగవన్ = మహాత్మా! కుశికనందన = కౌశికా! సావిత్రః = సూర్యవంశ సంభవుడైన, అయమ్ = ఈ, రాజా = దశరథుడు, ధన్యః ఖలు = చరితార్థుడుగదా! భవంతః అపి = మీవంటి వారుకూడ, యమ్ = ఎవనిని, ఏవమ్ = ఇట్లు, అనురుధ్యంతే = సమ్మానించుచున్నారో — స రాజా ధన్యః ఖలు అని అన్వయము.

ధన్యఇతి :- సఖుడా! అయమ్ = ఈ దశరథుడు, ధన్యః ఏవ = నిజముగా ధన్యుడే.

నమదితి :- నమత్....సంపదా అనేన తురగమేధ....దంతురా మేదినీ సనృజేతరామ్,

అర్థము :- నమత్ = మ్రొక్కుచున్న, నృపతిమండలీ = రాజసమూహము యొక్క, ముకుట = కిరీటములచేనైన, చంద్రికా = కాంతులతో, దుర్దిన = పూర్తిగా కప్పివేయబడి, స్ఫురత్ = ఒప్పుచున్న, చరణపల్లవ = చిగురుటాకులవంటి పాదములచే, ప్రతిపదోక్త=అడుగడుగునను ప్రకటింపబడిన - కంఠోక్తిగా ప్రకటింపబడిన, దోస్సంపదా=భుజపరాక్రమము కలవాడైన, అనేన = ఈ దశరథునిచే. తురగమేధ=అశ్వమేధయజ్ఞమునందు, ముక్త=విడువబడి, భ్రమత్=నిరాతంకముగా సంచరించు, తురంగ=యాగాశ్వముయొక్క, ఖురచంద్రక = డెక్కల యర్ధచంద్రాకారపు గుర్తులయొక్క, ప్రకర = సమూహముచే, దంతురా = ఎత్తుపల్లములు కలదిగా —

అనేన ససృజేతరాం తురగమేధముక్తభ్రమ
త్తురంగఖుర చంద్రక ప్రకర దంతురా మేదినీ॥ 23

(పురోఽవలోక్య సహర్షమ్)

---

డెక్కల గుర్తులతో వ్యాప్తమైనదిగా. మేదినీ = భూమి. ససృజేతరామ్ = మిక్కిలి కావింపబడినది. భూభాగమంతటను. గుర్తులు దట్టముగా పడిన వనుట. (మేఘాచ్ఛిన్నేఽహ్ని దుర్దినమ్ - అమరము).

సమాసములు :- నృపతీనాం మండలీ - నమస్తీ చ సా నృపతిమండలీ చ - నమన్నృపతిమండల్యాః ముకుటాః - ముకుటానాం చంద్రికాః - చంద్రికాభిః దుర్దినమ్ - చరణౌ పల్లవావివ — దుర్దినే స్ఫురంతౌ చరణపల్లవౌ - చరణపల్లవాభ్యాం ప్రతిపదమ్ ఉక్తా — దోష్ణోః సంపత్. ప్రతిపదోక్తా దోస్సంపత్ యస్య సః - తేన. తురగమేధే ముక్తః - భ్రమంశ్చాసౌ తురంగశ్చ - ముక్తశ్చాసౌ భ్రమత్తురంగశ్చ - తురంగస్య ఖురాః. ఖురాణాం చంద్రకాః - అథవా ఖురశబ్దోఽత్ర లక్షణయా చిహ్నే— ఖురాః చంద్రకా ఇవ - చంద్రకాణాం ప్రకరః—ప్రకరేణ దంతురా.

సంధులు :- నమత్ + నృపతి — అనునాసికాదేశ. స్ఫురత్ + చరణ — శ్చుత్వ. దోః + సంపదా - సాదేశవిసర్గ.

క్రియ :- సృజ్ (శ్యన్) విసర్గే. ఆత్మనే. లిట్. ప్రథమ.

ససృజే — ససృజాతే - ససృజిరే. (తిఙంతాత్తర ప్రత్యయే కిమేత్తిఙ వ్యయేత్యాదినా ఆమ్ప్రత్యయః. అనేన మహతీ కర్మసంపత్తిస్సూచితా - ఇష్టార్థ కల్పవల్లీ.)

ఛందస్సు :- పృథ్వి — జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః.

| జ | స | జ | స | య | లగ |
|---|---|---|---|---|---|
| । ౦ । | । । ౦ | । ౦ । | । । ౦ | । ౦ ౦ | । ౦ |
| తురంగ | ఖురచం | ద్రకప్ర | కరదం | తురామే | దినీ - 1_8 |

(పురః = ముందునకు. అవలోక్య = చూచి. సహర్షమ్ = ఆనందముతో)

చిరాదక్ష్ణోర్జాడ్యం శమయతి సమస్తాసురవధూ
కచాకృష్టిక్రీడా ప్రసభ సుభగంభావుకభుజః ।
త్రిలోకీ జంఘాలోజ్జ్వల సహజతేజా మనుకుల
ప్రసూతి స్సుత్రామ్ణో విజయసహకృత్వా దశరథః॥ 24

---

చిరాదితి :- సమస్తాసురవధూ....భుజః. త్రిలోకీ....తేజాః. సుత్రామ్ణః విజయసహకృత్వా. మనుకుల ప్రసూతిః, దశరథః. చిరాత్ అక్ష్ణోః జాడ్యం శమయతి.

**అర్థము** :- సమస్త = సమస్తమైన. అసురవధూ = రాక్షసాంగనల యొక్క. కచ = సిగలను. ఆకృష్టి = పట్టి యీడ్చుటయనునట్టి. క్రీడా=ఆటయందు. ప్రసభ = బలాత్కారముతో. సుభగంభావుక = ఆనందించునట్టి. భుజః = బాహువులు కలవాడును. రాక్షసులను జంపి వారి స్త్రీలను జుట్టుపట్టి యీడ్చెననుట. త్రిలోకీ = ముల్లోకములకును. జంఘాల = వేగముగా వ్యాపించునట్టి. ఉజ్జ్వల = ప్రకాశించునట్టి సహజ = జన్మసిద్ధమైనట్టి. తేజాః = ప్రతాపము కలవాడును. సుత్రామ్ణః = దేవేంద్రునికి. విజయ = యుద్ధవిజయములందు. సహకృత్వా = సహకారకుడును. మనుకుల = మనువంశమునందు. ప్రసూతిః = జన్మించినవాడునైన. దశరథః = దశరథుడు. చిరాత్ = చాలకాలము తరువాత. అక్ష్ణోః = నా కన్నుల యొక్క. జాడ్యమ్ = జడిమను. శమయతి = తొలగించుచున్నాడు. దశరథుని చూచుటతో నా నేత్రములు ఆనందముతో విప్పారుచున్నవనుట.

**సమాసములు** :- అసురాణాం వధ్వః - సమస్తాశ్చ తా అసురవధ్వః- వధూనాం కచాః - కచానా మాకృష్టిః - ఆకృష్టిరేవ క్రీడా - ప్రసభేణ సుభగం భావుకౌ - క్రీడాయాం ప్రసభసుభగంభావుకౌ భుజౌయస్యసః. అసుభగస్సుభగో భవన్- సుభగంభావుకః - (భువఃఖిష్ణుచ్ ఖుకఞావిత్యాదినా ఖుకఞ్). త్రయాణాం లోకానాం సమాహారః - త్రిలోక్యాః జంఘాలమ్ - త్రిలోకీ జంఘాలంచ తదుజ్జ్వలంచ తత్ సహజంచ - త్రిలోకీ....సహజం తేజో యస్య సః. మనోఃకులమ్ - కులే ప్రసూతిర్యస్య సః (వ్యధికరణ బహువ్రీహి) విజయే సహకృతవాన్. (భూతాధికారే సహేచేతి కృఞః (వన్) క్వనిప్. హ్రస్వస్య కృతి పితి తుగితి తుగాగమః).

సఖే, వామదేవ, ఇయమనేన పీయూషతుషార శీకరాసార వర్షిణీ సుజనసంవాదకౌతుకమేఘలేఖా పౌరస్త్యేనేవ మరుతా లోకనాథేన సహస్రశిఖరీక్రియతే.

వామదేవః :- భగవన్, అద్య ఖలు దిలీపకుల కుశల కర్మ కల్పలతానామ్
అంకురగ్రంథిభిరుదీర్యంతే కిసలయాని. యదత్రభవానపి
త్రిభువనసనాతనగురురేవమస్మై నరేంద్రాయ స్పృహయతి.

---

సంధులు :- అష్టః + ఆద్యమ్ - రేఫాదేశవిసర్గ. సమస్త + అసుర. రిపు + అభిసృష్టి - సవర్ణదీర్ఘ. ఉత్ + జ్వల - శ్చుత్వసంధి. సహజతేజాః + మనుకుల- విసర్గలోప. సుత్రామ్ణః + విజయ - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- శము ఉపశమే (ణిచ్) పరస్మై. లట్. ప్రథమ.

శమయతి - శమయతః - శమయన్తి

ఛందస్సు :- శిఖరిణి. (చూ. ప్రథమ-11) రసై రుద్రైశ్ఛిన్నాయమనసభలాగః శిఖరిణీ. య-మ-న-స-భ-లగ. 1-6.

ఇయమితి :- మిత్రమా ! వామదేవా ! పీయూష = అమృతమనునట్టి, తుషార = మంచుయొక్క, శీకర = బిందువులయొక్క-మంచుబిందువుల. ఆసార = ధారాపాతమును, వర్షిణీ = కురియునట్టి, ఇయమ్ = ఈ, సుజనసంవాద = సజ్జన సంభాషణరూపమైన, మేఘలేఖా = మేఘశ్రేణి. అనేన = ఈ, లోకనాథేన = ప్రభువగు దశరథునిచే. పౌరస్త్యేన = తూర్పుదిశకు సంబంధించిన, మరుతా = వాయువుతో. సహస్రశిఖరీ క్రియతే ఇవ = వేయికొనలు కలదిగా చేయబడుచున్నట్లు (వర్తతే = ఉన్నది) ఇంద్ర దశరథుల పరస్పర సంభాషణ కౌతుకము మేఘలేఖ. అది అమృత వర్షిణి. తూర్పుదిక్కునకు అధిపతియైన ఇంద్రుడు వర్షాధిదేవతయు. ఈ మేఘలేఖ నాతడు సహస్రశిఖముగా కురిపించు చున్నాడనుట. దశరథునితో నిచ్చలును సంభాషించుటకు దేవేంద్రుడు ముచ్చటపడునని తాత్పర్యము.

భగవన్నితి :- భగవన్ = మహాత్మా ! దిలీపకుల = దిలీపవంశముయొక్క. (వారుచేసిన) కుశలకర్మ = సత్కార్యములనునట్టి, కల్పలతానామ్ = కల్పవల్లికలకు,

(ఇతి పరిక్రామతః)

దశరథః :- (సహర్షం ససంభ్రమమాసనాదుత్థాయోపసృత్య చ) భగవన్, కుశికనందన, ఐక్ష్వాకః పంక్తిరథోఽయ మభివాదయతే.

విశ్వామిత్రః - స్వస్తి భవతే సపరివారాయ.

(ఇతి సర్వే యథోచితముపవిశన్తి)

దశరథః :- (సప్రశ్రయమ్) భగవన్విశ్వామిత్ర.

---

అంకురగ్రంథిభిః = గణుపులనుండి. కిసలయాని = చిగురాకులు. అద్య = ఈనాడు. ఉదీర్యంతే ఖలు = బయల్వడుచున్నవి సుమా! ఆ కల్పలతలు నేడు చిగుర్చుచున్న వనుట. యత్ = ఎందువల్లననగా. త్రిభువన = ముల్లోకములకును. సనాతన గురుః = చాలకాలముగా గురుడవైన. అత్రభవాన్ అపి – నీవుకూడ. అస్మై = ఈ. నరేంద్రాయ = దశరథునికై. స్పృహయతి = ముచ్చటపడుచున్నావు.

(ఇతి = అని. పరిక్రామతః = ముందుకు నడుతురు)

భగవన్నితి :- (సహర్షమ్ = సంతోషముతో. ససంభ్రమమ్ = సంభ్రమముతో. ఆసనాత్ = తన పీఠమునుండి. ఉత్థాయ = లేచి. చ = మరియు. ఉపసృత్య = సమీపించి. భగవన్ = మహాత్మా. కుశికనందన=విశ్వామిత్రా! ఐక్ష్వాకః = ఇక్ష్వాకువంశ ప్రభవుడైన. (దాండినాయనేత్యాది నిపాత) పంక్తిరథః = దశరథుడు. అయమ్ = వీడే (ఇడిగో) అభివాదయతే = నమస్కరించుచున్నాడు.

స్వస్తీతి :- సపరివారాయ = పరివార సహితుడవైన. భవతే = నీకొరకు. స్వస్తి = శుభము – నీకు నీ పరివారమునకు శుభమనుట.

(ఇతి=అని. సర్వే=అందరును. యథోచితమ్=తగురీతిని. ఉపవిశన్తి=కూర్చుందురు)

భగవన్నితి :- (సప్రశ్రయమ్ = సవినయముగా) భగవన్=మహాత్మా! విశ్వామిత్ర = విశ్వామిత్రుడా!

కచ్చిత్కాంతారభాజాం భవతి పరిభవః కోఽపి శౌవాపదో వా
ప్రత్యూహేన క్రతూనాం న ఖలు మఖభుజో భుంజతే వా హవీంషి ।
కర్తుం వా కచ్చిదంతర్వసతి వసుమతీ దక్షిణస్సప్తతంతు
ర్యత్సంప్రాప్తోఽసి కిం వా రఘుకులతపసామీదృశోఽయం వివర్తః ॥ 25

---

కచ్చిదితి :- కాంతారభాజాం కః అపి శౌవాపదః పరిభవః కచ్చిద్భవతి వా. క్రతూనాం హవీంషి ప్రత్యూహేన మఖభుజః కచ్చిన్న భుంజతే వా. వసుమతీదక్షిణః సప్తతంతుః కర్తుమ్ అంతః కచ్చిద్వసతి వా. రఘుకుల తపసామ్ అయమ్ వివర్తః కిమ్ వా. యత్, సంప్రాప్తః అపి.

అర్థము :- కాంతారభాజామ్ = అరణ్యవాసులైన మీకు, కః అపి = ఏదేని. శౌవాపదః = వ్యాఘ్రసంబంధమైన (క్రూరమృగములకు ఉపలక్షకము). పరిభవః = అంతరాయము (తిరస్కారము). కచ్చిత్ భవతి వా = జరుగుచున్నదా ! (అట్టి పీడ లేదుకదా యనుట) క్రతూనామ్ = మీరుచేయు యజ్ఞముల యొక్క. హవీంషి = హవిస్సులను. ప్రత్యూహేన = రాక్షసాదులచేనైన ఆతంకముతో. మఖభుజః = దేవతలు. కచ్చిత్ న భుంజతే వా = స్వీకరించుటలేదా ! రాక్షస సంహారముచేసి యజ్ఞసంరక్షణము చేయుదుననుట. వసుమతీదక్షిణః = భూమి దక్షిణగా కల. సప్తతంతుః = యజ్ఞవిశేషము. కర్తుమ్ = చేయుటకు. అంతః = నీ మనస్సు (లో) కచ్చిత్ వసతి వా = ఉన్నదా ? అట్టి యజ్ఞమేదేని చేయగోరి భూమికై వచ్చితివా యని. రఘుకుల = రఘువంశముయొక్క. తపసామ్ = అనేక తపస్సులకు. అయమ్ = ఇది. వివర్తః కిమ్ వా = పరిణామమా ! తపస్సుల ఫలము నీ రాక అనుట. యత్ = ఎందువల్లననగా. సంప్రాప్తః = ఇచటకు వచ్చినవాడవు. అపి = అయ్యితివి కదా ! (సప్తతంతుర్మఖః క్రతుః - అమరము).

సమాసములు :- కాంతారం భజంతి = కాంతారభాక్ - తేషామ్. శునః పదమివ పదం యేషాంతే శ్వాపదాః (వ్యాఘ్రములు) - శ్వాపదస్య అయమ్ - శౌవాపదః. మఖం భుంక్తే ఇతి - మఖభుక్ - తే. వసుమతీ దక్షిణా ఇవ యస్మిన్ సః - వసుమతీదక్షిణః. రఘూణాం కులమ్ - రఘుకులస్య తపాంసి - తేషామ్.

విశ్వామిత్రః :- (విహస్య)

జనయతి త్వయి వీర దిశాం పతీనపి గృహాంగణమాత్రకుటుంబినః ।
రిపురితి శ్రుతిరేవ న వాస్తవీ ప్రతిభయోన్నతిరస్తు కుతస్తు నః॥ 26

---

విశేషము :- శ్రోత్రియుడు మన యింటికి వచ్చినచో పితృదేవతలు సంతోషింతురని - నందంతి పితరస్తస్య నృత్యంతి ప్రపితామహాః పితామహాశ్చ గాయంతి శ్రోత్రియే గృహమాగతే.

సంధులు :- కః + అపి, ప్రాప్తః + అపి - ఉత్వాదేశవిసర్గ - కో + అపి, ప్రాప్తో + అపి - పూర్వరూప. శౌవాపదః + వా, భుజః + భుంజతే. ఉత్వాదేశవిసర్గ. తంతుః + యతి - రేఫాదేశవిసర్గ, ఈదృశః + అయమ్-ఈదృశో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై. లట్, ప్రథమ
భవతి - భవతః - భవన్తి
భుజ పాలనాభ్యవహారయోః, (భుజోఽనవనే) ఆత్మనే, లట్ ప్రథమ
భుంక్తే — భుంజాతే — భుంజతే
వస నివాసే, పరస్మై. లట్. ప్రథమ
వసతి - వసతః - వసన్తి
అసభువి - పరస్మై. లట్, మధ్యమ
అసి - స్థః - స్థ

ఛందస్సు :- స్రగ్ధర. మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్ (1-7-7)

| మ | ర | భ | న | య | య | య |
|---|---|---|---|---|---|---|
| U U U | U I U | U I I | I I I | I U U | I U U | I U U |
| కచ్చిత్కాం | తారథా | జాంభవ | తిపరి | భవఃకో | పిశౌవా | పదోవా |

జనయతీతి :- (విహస్య = నవ్వి) వీర. త్వయి దిశాం పతీనపి గృహాంగణమాత్ర కుటుంబినః జనయతి (సతి) రిపురితి శ్రుతిరేవ న వాస్తవీ. నః ప్రతిభయోన్నతిః కుతః తు అస్తు।

అపిచ—

దత్తేంద్రాభయ విభ్రమాద్భుతభుజాసంభార గంభీరయా
త్వద్వృత్త్యా శిథిలీకృతస్త్రిభువనత్రాణాయ నారాయణః।
అంతస్తోషతుషార సౌరభమయ శ్వాసానిలాపూరణ
ప్రాణోత్తుంగభుజంగతల్పమధునా భద్రేణ నిద్రాయతే॥ 27

---

అర్థము :- వీర = మహావీరుడా। త్వయి = నీవు. దిశామ్‌పతీన్ అపి= దిక్పాలకులనుకూడ, గృహాంగణమాత్ర = నీ ముంగిటిలోనే, కుటుంబినః = కాపుర ముండు వారిగా. జనయతి (సతి) = చేయుచుండగా. రిపుఃఇతి = శత్రువు అనునట్టి శ్రుతిఃఏవ = వినికిడియే-శబ్దమే. న వాస్తవీ = అసత్యము. తు = మరింక, నః= మాకు. ప్రతిభయోన్నతిః = శత్రుభయాధిక్యము. కుతః అస్తు=ఎట్లుండును ; ఉండనే ఉండదనుట.

సమాసములు :- గృహస్య అంగణమ్ - గృహాంగణమేవ - గృహాం గణమాత్రే కుటుంబినః. ప్రతిభయస్య ఉన్నతిః.

సంధులు :- గృహ + అంగణ — సవర్ణదీర్ఘ. రిపుః + ఇతి. శ్రుతిః + ఏవ. ఉన్నతిః + అస్తు - రేఫాదేశవిసర్గ. కుతః + తు — సాదేశవిసర్గ.

అపిచ :- మరియు.

దత్తేతి :- దత్త = ఈయబడిన. ఇంద్ర=వాసవుని కొఱకైన. అభయ = అభయమనునట్టి — దేవేంద్రునికి అభయమిచ్చుట యనునట్టి. విభ్రమ = విలాసము కలదై. అద్భుత = ఆశ్చర్యజనకమైన. భుజా = బాహువులయొక్క. సంభార = సామర్థ్యముకలదై. గంభీరయా = అగాధమైన. త్వత్ = నీయొక్క. వృత్త్యా = ప్రవర్తనతో. నారాయణః = విష్ణుమూర్తి. త్రిభువన = ముల్లోకముల యొక్క త్రాణాయ = రక్షణమువల్ల. శిథిలీకృతః = మినహాయింపబడినవాడై — రక్షణభారము వదలిపోవుటతో తెరిపినిపడి అనుట. అధునా = ఇప్పుడు. అంతస్తోష = లోపలి ఆనం దముతో. తుషార = చల్లనైనవియు. సౌరభమయ = సుగంధముతో కూడినవియు

(7)

దశరథః ;- (సవ్రైలక్షస్మితమ్) భగవన్విశ్వామిత్ర, అభ్యమిత్రీణస్య తత్రభవతః సునాసీరస్య నాసీరపూరకేణ పదాతిపరమాణునా

---

నైన, శ్వాసానిల = ఊర్పుగాలులతో, ఆపూరణ = పుష్టినొందిన, ప్రాణ = ప్రాణ వాయువుకలదై. ఉత్తుంగ = ఎత్తయిన, భుజంగతల్పమ్ = నాగపర్యంకమును - ఆదిశేషుడు శ్రీహరి ఊర్పుగాలులతో బూరటిల్లెననుట. భద్రేణ = సుఖముగా, నిద్రాయతే = నిద్రించుచున్నాడు — నాగపర్యంకమునందు నిద్రించు చున్నాడనుట.
(ఛందస్సు—శార్దూలము)

సమాసములు :- ఇంద్రాయ అభియమ్ - దత్తమింద్రాభయం యేన సః- దత్తేంద్రా భయశ్చాసౌ విభ్రమశ్చ, దత్తేంద్రా భయవిభ్రమేణ అద్భుతః. భుజయోః సంభారః - భుజాసంభారః. దత్తేంద్రాభయ విభ్రమాద్భుతశ్చాసౌ భుజాసంభారశ్చ. తేన గంభీరా—తయా. తవ వృత్తిః—తయా. త్రిభువనస్య త్రాణాయ. అంతః ప్రదేశే తోషః. తుషారాశ్చ తే సౌరభమయాః - అంతస్తోషేణ తుషార సౌరభమయాః - తే చ శ్వాసానిలాశ్చ .... అనిలైః ఆపూరణం యేషాం తే ప్రాణాః, ప్రాణైః ఉత్తుంగం చ తత్ భుజంగతల్పం చ — (భుజంగ ఏవ తల్పమ్)

విశేషము :- దత్తేంద్రాభయ దక్షిణాద్భుతభుజా సంభార గంభీరయా అని పాఠాంతరము. అభయమనునట్టి దక్షిణతో అద్భుతమైన భుజా సంభారమని అన్వయము. లేదా కుడిచేయి అని కాని.

సంధులు :- దత+ఇంద్ర, ప్రాణ+ఉత్తుంగ—గుణసంధి. ఇంద్ర+అభయ, విభ్రమ+అద్భుత. శ్వాస + అనిల + ఆపూరణ - సవర్ణదీర్ఘ సంధులు. కృతః + త్రిభువన, అంతః + తోష — సాదేశవిసర్గ.

క్రియ :- నిద్రాయతే - నిద్రావ నివ ఆచరతి — లోహితాదిత్వాత్ క్యష్, నిద్రాశబ్దో వృత్తివిషయయే నిద్రావతివర్తత ఇతికైయటః. ఆత్మనే, లట్, ప్రథమ - నిద్రాయతే - నిద్రాయేతే - నిద్రాయంతే.

భగవన్నితి :- (సవ్రైలక్షస్మితమ్) - సిగ్గుతో కూడిన చిరునవ్వుతో) భగవన్ = మహాత్మా! విశ్వామిత్ర = విశ్వామిత్రుడా! అభ్యమిత్రీణస్య = శత్రువులపైకి దాడివెడలుచున్నవాడును (యో గచ్ఛత్యలం విద్విషతః ప్రతి

మయాపి కదాచిదుద్ధృతం ధనుర్యస్మాత్కలోఽయ మలీకలోక ప్రవాదో భవంతమప్యాప్యాయయతి.

విశ్వామిత్రః :- (సోత్సాహస్మితమ్) సఖే,

త్రైలోక్యాభయలగ్నకేన భవతా వీరేణ విస్మారిత
స్తజ్జీమూతమహాస్త్రమండనధనుః పాండిత్యమాఖండలః ।

---

సోఽభ్యమిత్రోఽభ్యమిత్రీయోఽభ్యమిత్రీణః — అమరము, అభ్యమిత్రాచ్ఛ చ). తత్రభవతః = గౌరవింపదగినవాడునైన సునాసీరస్య = దేవేంద్రునికి. నాసీర పూరకేణ = సేనాగ్రభాగమున నిలిచినవాడును (నాసీరోఽగ్రగంతరి). పదాతి పరమాణునా = కాల్బలమునందు ఒక రేణువువంటివాడునైన. మయా అపి = నాచేతగూడ. కదాచిత్ = ఒకప్పుడు. ధనుః = విల్లు. ఉద్ధృతమ్ = ఎక్కుపెట్టబడినది - ఇంద్ర సేనలో ఒకడనై ఒకానొకప్పుడు ధనుస్సును ఎక్కుపెట్టితి ననుట. తస్మాత్కః = అది కారణముగా కలదైన. అయమ్ = ఈ. అలీకలోకప్రవాదః = మిథ్యాప్రచారము - దేవేంద్రునంతటివానికి నేనేదో గొప్పసహాయము చేసితిననియు. మే మిరువురము నెచ్చెలికాండ్ర మనియు - భవంతమ్ అపి = నిన్నుగూడ. ఆప్యాయయతి = సంతోషపెట్టుచున్నది.

సఖేఇతి :- (సోత్సాహస్మితమ్ = ఉత్సాహముతో కూడిన చిఱునవ్వుతో) సఖే = మిత్రమా ।

త్రైలోక్యేతి :- త్రైలోక్యాభయలగ్నకేన వీరేణ భవతా ఆఖండలః, తజ్జీమూత మహాస్త్రమండనధనుః పాండిత్యమ్, విస్మారితః: కించ, అజస్రమఖార్పితేన హవిషా సంఫుల్లమాంసోల్లసత్సర్వాంగీణవలీకలృప్త నయనవ్యూహః కథమ్ వర్తతే.

అర్థము :- త్రైలోక్య = ముల్లోకములకును, అభయ = రక్షణము కల్పించుటయందు. లగ్నకేన = నిమగ్నుడవును, (స్యుర్లగ్నకాః ప్రతిభువః — అమరము) రక్షణప్రదాతవనుట. వీరేణ = మహావీరుడవునైన. భవతా = నీచేత. ఆఖండలః = దేవేంద్రుడు. తత్ = ఆ (మాత్రపు) జీమూత = మేఘములకు.

కించాజస్రమఖార్పితేన హవిషా సంపుల్ల మాంసోల్లస
త్సర్వాంగీణ వలీ విలుప్తనయనవ్యూహః కథం వర్తతే॥ 28

ముహూర్త = స్వల్పకాలము. మండన = అలంకారమై తగు. ధనుఃపాండిత్యమ్= విలువిద్యను. విస్మారితః = మరపింపజేయబడినాడు — మేఘములకు అలంకార ప్రాయముగా నుండునది ఇంద్రధనుస్సు. ధనుస్సును ప్రయోగింపవలసిన అవసరము లేకుండజేసి ఇంద్రుడా విద్యను మరచిపోవునట్లు నీవు చేసితివనుట. కిమ్చ = మరియు. అజస్ర = ఎల్లప్పుడును. మఖ = యజ్ఞములయందు. అర్పితేన = సమర్పింపబడిన. హవిషా = హవిస్సుతో - నీవు నిరంతరము యజ్ఞములు చేయుచు హవిస్సులు సమర్పించుటచేత. సంపుల్ల = వృద్ధిచెందిన, మాంస = మాంసముతో. ఉల్లసత్ = అతిశయించి ప్రేలుచున్నదియు. సర్వాంగీణ = సర్వాంగవ్యాప్తములునైన వళీ = స్థూలత్వముచేనైన ముడతలతో. విలుప్త = కప్పివేయబడిన. నయన వ్యూహః = నేత్రసహస్రము కలవాడై, ఆ ఇంద్రుడు— కథమ్ వర్తతే=ఎట్లున్నాడో, లావెక్కి అయాసపడుచుండునమట - కన్నుగానకున్నాడనియు. (శార్దూలము)

సమాసములు :- త్రయో లోకాః — స్వార్థే ష్యఞ్ — త్రైలోక్యస్య అభయమ్—త్రైలోక్యాభయే లగ్నకః — తేన. జీమూతానాం ముహూర్తమండనం చ తద్ధనుశ్చ—ధనుషః పాండిత్యమ్—తచ్చజీమూత.... పాండిత్యమ్ — తత్. మఖేషు అర్పితమ్ - అజస్రం మఖార్పితమ్ - తేన. సంపుల్లం చ తత్ మాంసం చ - సంపుల్ల మాంసేన ఉల్లసంత్యః - సర్వాంగీణాశ్చతా వళ్యశ్చ - ఉల్లసంత్యశ్చ తా స్సర్వాంగీణ వళ్యశ్చ - నయనానాం వ్యూహః - వళీభిః విలుప్తః — వళీవిలుప్తః నయనవ్యూహః యస్య సః.

సంధులు :- త్రైలోక్య + అభయ. చ + అజస్రమఖ + అర్పితేన. సర్వ + అంగీణ - సవర్ణదీర్ఘ. విస్మారితః + తత్ - సాదేశవిసర్గ. తత్ + జీమూత—శ్చుత్వసంధి. మాంస + ఉల్లసత్ - గుణసంధి. ఉత్ + లసత్ - లాదేశసంధి.

క్రియ :- వృతువర్తనే, ఆత్మనే. లట్, ప్రథమ. వర్తతే - వర్తేతే - వర్తన్తే.

వామదేవః :- మహారాజ, భూకాశ్యప, యథాహ భగవాన్ కౌశికః.
స్వయమనేకధా సుధర్మాయామధ్యక్షీకృత మహ మపి
బ్రవీమి —

త్వయ్యర్ధాసనభాజి కిన్నరగణోద్గీతై ర్భవద్విక్రమై
రంతస్సంభృత మత్సరోఽపి భగవానాకారగుప్తౌ కృతీ ।

---

మహారాజేతి :- మహారాజా ! (భూకశ్యపా ! — భూకశ్యపుడను మాట దశరథునికి నామాంతరమని రుచిపతి వ్యాఖ్య) కశ్యపుని కుమారుడు — కాశ్యపుడు = దేవేంద్రుడు. భూకాశ్యప = భూలోకదేవేంద్రా ! భగవాన్ = మహాత్ముడగు. కౌశికః = విశ్వామిత్రుడు. యథా ఆహ = పలికినట్లే - ఆ మాట సత్యమనుట. స్వయమ్ = నాయంతటనేనుగా. అనేకధా = బహు విధము లుగా. సుధర్మాయామ్ = ఇంద్రసభ సుధర్మయందు అధ్యక్షీకృతమ్ = ప్రత్యక్ష ముగా చూచినవిషయమును. అహమపి=నేనుకూడ — ఈ సందర్భమున, బ్రవీమి= పల్కుచున్నాను

త్వయీతి :- త్వయి అర్ధాసనభాజి. కిన్నరగణోద్గీతైః భవద్విక్రమైః, అంతస్సంభృతమత్సరః. భగవాన్, ఆకారగుప్తౌ కృతీ; ఉస్మిలత్...బాష్పైః విలోచనైః ఆఖండలః ఆనందమ్ ఏవ అభినయతి.

అర్థము :- త్వయి = నీవు. అర్ధాసనభాజి = (సుధర్మలో) అర్ధసింహా సనమున ప్రకాశించుచుండగా, కిన్నరగణ = కిన్నరు లను దేవతల సమూహముచే, ఉద్గీతైః = గొంతెత్తి కొనియాడబడుచున్న. భవత్ = నీయొక్క, విక్రమైః = పరాక్రమ కథా విశేషములతో. అంతస్సంభృత = హృదయములో పొడసూపిన, మత్సరః = అసూయకలవాడై. భగవాన్ = దేవేంద్రుడు, ఆకారగుప్తౌ = ఆకార గోపనమునందు - ఈర్ష్యాభావము పైకి కన్పించకుండ కాపాడుకొనుటయందు- కృతీ= కృతకృత్యుడై. ఉస్మిలత్ = వికసించుచున్న. భవదీయ = నీయొక్క, దక్షిణభుజా= కుడిభుజము నందలి, రోమాంచ = పులకలచే, విద్ధ = గ్రుచ్చబడి - పులకాంకు రములు పొడుచుకొని యనుట, ఉత్సరత్ = ఉబుకుచున్న. బాష్పైః = కన్నీరు

ఉన్మీలద్భవదీయ దక్షిణ భుజారోమాంచ విద్ధోచ్చర
ద్బాష్పైరేవ విలోచనై రభినయత్యానంద మాఖండలః॥ 29

దశరథః :- (సస్మితమ్) వామదేవ, త్వమపి భగవంతం గాధినందన మను ప్రవిష్టోఽసి.

ఏతస్మై సమరాంగణప్రణయినే తిష్ఠేత కః ప్రజ్వల
ద్దంభోళి ద్యుతిమండలోద్భటభుజ స్తంభాయ జంభారయే।

---

కలవైన, విలోచనైః = నేత్రములతో, ఆఖండలః = దేవేంద్రుడు, ఆనందమ్ ఏవ = ఆనందమునే, అభినయతి = నటించుచున్నాడు. (శార్దూలము)

సమాసములు :- అర్ధాసనే భాజత ఇత్యర్ధాసనభాక్ - తస్మిన్, కిన్నరాణాం గణః — గణేన ఉద్గీతః — తైః, భవతః విక్రమః - తైః. అంతః సంభృతః యస్య మత్సరః సః. ఆకారస్య గుప్తిః - తస్యామ్.

సంధులు :- త్వయి + అర్ధ, అభినయతి + ఆనందమ్ - యణాదేశ. అర్ధ + ఆసన - సవర్ణదీర్ఘ. గణ + ఉద్గీత, విద్ధ + ఉచ్చరత్—గుణసంధి. గీతైః + భవత్, విక్రమైః + అంతః, బాష్పైః + ఏవ, విలోచనైః + అభినయతి - రేఫాదేశ విసర్గ. అంతః + సంభృత — సాదేశవిసర్గ. మత్సరః + అపి - ఉత్వాదేశవిసర్గ. మత్సరో + అపి — పూర్వరూప. ఉత్ + చరత్ - శ్చుత్వసంధి.

క్రియ :- ణీఞ్ ప్రాపణే. పరస్మై. లట్. ప్రథమ.

నయతి - నయతః — నయన్తి

వామదేవేతి :- (సస్మితమ్ = చిరునవ్వుతో) వామదేవా! త్వమ్ అపి = నీవుకూడ, భగవంతమ్ = మహానుభావుడైన, గాధినందనమ్ = విశ్వామిత్రుని పశ్చాత్ మును, అనుప్రవిష్టః = ప్రవేశించినవాడవు. అసి = అయ్యితివా!

ఏతస్మై ఇతి :- సమరాంగణప్రణయినే, ప్రజ్వలద్దంభోళిద్యుతి మండలోద్భట భుజస్తంభాయ, ఏతస్మై, జంభారయే కః తిష్ఠేత! ఏషః నిర్యద్భిః రోష దహనజ్యోతిః స్ఫులింగైః ఇవ రజ్యద్భిః స్వైః రోమకూపైః, అపి ఆగ్నేయమ్ అస్త్రమ్ ద్విషామ్ సమతనోత్.

విశ్వామిత్రః :-(సగౌరవం దశరథబాహుమాస్పృశన్) రాజర్షే. వసిష్ఠశిష్య!

సంవృత్తోఽయం యది తవ భుజచ్ఛాయయా సంప్రతీంద్రో
నిర్విఘ్నశ్రీరియ మభినవా కీదృశీ తే ప్రశస్తిః।
ఇక్ష్వాకూణాం లిఖితపఠితా స్వర్వధూగండపీఠ
క్రీడాపత్త్రప్రకరమకరీపాలపాల్యం హి వృత్తిః॥ 31

---

రాజర్షేఇతి :- (సగౌరవమ్ = గౌరవముతో. దశరథబాహుమ్ = దశరథుని బుజమును. ఆస్పృశన్ = స్పృశించుచు) రాజర్షే = రాజర్షీ. వసిష్ఠశిష్య = వసిష్ఠుని శిష్యుడా!

సంవృత్తఇతి :- తవ భుజచ్ఛాయయా సంప్రతి అయమ్ ఇంద్రః నిర్విఘ్నశ్రీః సంవృత్తః యది, ఇయం ప్రశస్తిః తే కీదృశీ అభినవా! స్వర్వధూగండపీఠక్రీడా పత్త్రప్రకరమకరీ పాలపాల్యం వృత్తిః ఇక్ష్వాకూణాం లిఖితపఠితా హి.

అర్థము :- తవ = నీయొక్క. భుజచ్ఛాయయా = బాహువుల నీడతో నీ బలపరాక్రమములు సంరక్షణగా అనుట. సంప్రతి = ఇప్పుడు. అయమ్ = (ప్రసక్తుడైన) ఈ. ఇంద్రః = వాసవుడు. నిర్విఘ్నశ్రీః = బాధలులేని సిరికలవాడు- తన సిరికి రాక్షసాది కృతమగు పీడలేనివాడనుట. సంవృత్తః యది = అయినాడన్నచో ఇయమ్ = ఈ. ప్రశస్తిః = యశస్సు-కీర్తి. తే = నీకు. కీదృశీ అభినవా = ఎట్లు క్రొత్తది! క్రొత్తది కానేకా దనుట, స్వర్వధూ = అమరకాంతల యొక్క. గండపీఠ = విశాలమగు చెక్కిళుల యందలి. క్రీడాపత్త్రప్రకర = మకరికా పత్త్రములయొక్క సమూహము నందలి, మకరీ = మొసళులయొక్క. పాలపాల్యమ్ = సంరక్షణమనువట్టి. వృత్తిః = వ్యాపారము. ఇక్ష్వాకూణామ్ = రఘువంశీయులకు. లిఖితపఠితా హి = అభ్యస్త విద్యకదా!

విశేషములు :- రంగులతో (మొసళులను) చెక్కిళులపై లిఖించుకొనుట మగనాండ్రకు ఒక విలాసము. ఇవే మకరికాపత్త్రములు. దానిని సంరక్షించుట యనగా వారి భర్తలను కాపాడుటయని యర్థము. పర్యాయోక్తం హి గమ్యస్య వచో భంగ్యంతరాశ్రయమ్ నమస్తస్మై కృతా యేన ముధా రాహువధూకుచౌ. పర్యాయోక్తి

త్రాసోత్కంపత్రిదశపరిషన్మౌళి మాణిక్యమాలా
బాలాదిత్యప్రకర కిరణస్మేర పాదారవిందే।
ప్రాచీమేతాం భువనరచనామన్యథా నిర్మిమాణే
కార్పణ్యోక్తీస్త్వయి రచితవానంతరాయం మహేంద్రః॥ 32

---

పౌరాణికాః = పురాణప్రవాచకులు — త్రిశంకు వృత్తాంతమును బాగుగా నెరిగిన పౌరాణికు లనుట. ఏవమ్ = ఇట్లు. కథయన్తికిల = చెప్పుచున్నారనుమా ।

త్రాసేతి :- త్రాసోత్కంప....పాదారవిందే. ఏతాం ప్రాచీం భువన రచనామ్ అన్యథా నిర్మిమాణే (సతి) త్వయి మహేంద్రః కార్పణ్యోక్తీః అంత రాయమ్ రచితవాన్.

అర్థము:- త్రాస = భయముతో, ఉత్కంప = గడగడ లాడుచున్న. త్రిదశపరిషత్ = దేవతాసమూహముయొక్క, మౌళి = కిరీటములందలి, మాణిక్య మాలా = మాణిక్యములవరుస యనునట్టి, బాలాదిత్యప్రకర = బాలసూర్యబింబముల యొక్క, కిరణ = కాంతులతో, స్మేర = వికాసము నొందిన, పాదారవిందే = పాదపద్మములు కలవాడవై. ఏతామ్ = ఈ. ప్రాచీమ్ = పురాతనమైన. భువన రచనామ్ = లోకసృష్టిని, అన్యథా = మరొకవిధముగా, నిర్మిమాణే (సతి) = నిర్మింప బూనుకొనగా, త్వయి = నీపట్ల, మహేంద్రః = దేవేంద్రుడు. కార్పణ్యోక్తీః = దీనాలాపములను, అంతరాయమ్ = విఘ్నముగా, రచితవాన్ = కల్పించెను. ఇంద్రుడువచ్చి బ్రతిమాలుకొనెను కావున ఆగితివి కాని లేకున్న మరొక సృష్టిని నీవు చేసియే యుందువనుట.

సమాసములు :- త్రాసేన ఉత్కంపా — త్రిదశానాం పరిషత్—త్రాసోత్కం పా చ సా త్రిదశపరిషచ్చ — పరిషదః మౌళయః — మాణిక్యానాం మాలా — మౌళిషు విద్యమానా మాణిక్యమాలా — బాలాదిత్యానాం ప్రకరః — మాణిక్యమాలైవ బాలాదిత్య ప్రకరః — తస్య కిరణాః — కిరణైః స్మేరమ్ — పాదమరవిందమివ — కిరణస్మేరమ్ — పాదారవిందం యస్య సః—తస్మిన్. భువనస్య రచనా — తామ్. మహాంశ్చాసౌ ఇంద్రశ్చ.

సంధులు :- త్రాస + ఉత్కంప. మహా + ఇంద్రః — కార్పణ్య + ఉక్తీః — గుణసంధి. పరిషత్ + మౌళి — అనునాసికాదేశ. బాల + ఆదిత్య. పాద + అరవింద — సవర్ణదీర్ఘ. ఉక్తీః + త్వయి — సాదేశవిసర్గ.

(విహస్య)

జవాదారాద్ధుం త్వాముపనమతి వర్గో దివిషదా
ముపవ్యస్త్రో మన్దై రజని రథహంసైః కమలభూః ।
నియచ్ఛామో జిహ్వాం న తవ చరితేభ్యః కిముత తే
సుధా సధ్రీచీనామతిపతతి వాచా మవసరః॥ 33

---

ఛందస్సు :- మందాక్రాంత. మభనతతగగ. (1—4—6)

అలంకారము :- మాణిక్యములతే బాలాదిత్యప్రతిరమనియు, కాంతులే కిరణములనియు అనుకొనుటచే తాద్రూప్యరూపకము. విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యద్రూపకం తత్ త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః ॥

(పద్యాన్వయః)

జవాదితి :- త్వామ్ ఆరాద్ధుమ్ దివిషదాం వర్గే జవాత్ ఉపనమతి (సతి). కమలభూః మన్దైః రథహంసైః అపవ్యస్తః అజని. తవ చరితేభ్యః జిహ్వాం న నియచ్ఛామః. కిముత సుధా సధ్రీచీనాం తే వాచామ్ అవసరః అతిపతతి.

అర్థము :- త్వామ్=నిన్ను. ఆరాద్ధుమ్=బతిమాలుకొనుటకు. దివిషదాం వర్గే=దేవతల సమూహము, జవాత్=వేగముగా, ఉపనమతి=సమీపించుచుండగా, కమలభూః=బ్రహ్మ, మన్దైః=మెల్లగా నడుచునట్టి, రథహంసైః=తన రథవాహనము లగు హంసలచే, అపవ్యస్తః=వెనుకబడినవాడు - వేగముగా నడుపుచున్నవే యని ప్రేరేపించినవాడుగా. అజని=అయ్యెను. తవ=నీయొక్క. చరితేభ్యః=నీ పురాణ గాథలనుండి. జిహ్వాం=నాల్కను. న నియచ్ఛామః=నిలువరించలేము – ఇంకను వర్ణించవలెనని యున్నది. కిముత=కాని. సుధా సధ్రీచీనామ్=అమృతము వర్షించునవైన - అమృతతో సమములైన. తే=నీయొక్క. వాచామ్=వాక్కులకు, అవసరః=సమయము. అతిపతతి=అతిక్రమించును. నామాటలతోనే సరిపోయినచో నీవాగమృతమును గ్రోలుటకు సమయముండదని నా జిహ్వను నిలువరించుకొనుచున్నాననుట. (కిముతాతిశయే ప్రశ్నే వికల్పే ప్రయుజ్యతే — విశ్వః)

(అంజలిం బద్ధ్వా) భగవన్. ప్రసీద తావత్. ఉత్తరోత్తరేషాం మహోత్స వానాం కదాచిదపి న తృప్యంతి పుంసాం హృదయాని. యదియం త్వదుప స్థాన సులభ సంభావనాతిప్రసంగ సంగీతన ర్తకీ మే చిత్తవృత్తిర్ని యోగాను గ్రహాయ స్పృహయతి. అపిచ—

---

సమాసములు :- రథస్య హంసః — తైః. సుధయా సహ అంచంతి ఇతి సుధాసధ్రీచ్యః - తాసామ్. సహస్య సధ్రిః అనుదానిచే అంచతి పరత్వమున సధ్రి ఆదే శము - అంచతేస్త్రూపసంఖ్యానమ్ అని జీప్ - సధ్రీచీ.

సంధులు :- అపవ్యస్తః + మందైః. నియచ్ఛామః + జిహ్వామ్ - ఉత్వా దేశవిసర్గ. మందైః + అజని - రేఫాదేశ విసర్గ.

క్రియ :- జనీజ్ ప్రాదుర్భావే. ఆత్మనే. లజ్. ప్రథమ

అజని — అజనిషాతామ్ — అజనిషత

యమ ఉపరమే - పరస్మై. లట్. ఉత్తమ. (ని.ఉపసర్గ)

యచ్ఛామి — యచ్ఛావః — యచ్ఛామః

పత్లృగతౌ - పరస్మై. లట్. ప్రథమ

పతతి - పతతః - పతన్తి

ఛందస్సు :- శిఖరిణి — రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలాగశ్శిఖరిణీ.

భగవన్నితి :- భగవన్ = మహాత్మా! తావత్ప్రసీద = అనుగ్ర హించుము. (తావత్ వాక్యాలంకారము కొఱకు). ఉత్తరోత్తరేషామ్ = ముసు ముందు రాబోవునట్టి - ఒకదానికంటె నొకటి గొప్పవియైన. మహోత్సవానామ్ = భద్రములకు. పుంసామ్ = వ్యక్తులయొక్క. హృదయాని = అంతరంగములు. కదా చిదపి = ఎప్పుడును. న తృప్యంతి = సంతృప్తి చెందవు. త్వత్ = నీయొక్క. ఉపస్థాన = రాకతో. సులభ = ప్రాప్తించిన. సంభావనా = గౌరవము యొక్క. అతిప్రసంగ = అతిశయము అనునట్టి. సంగీత = గానమునకు - లేదా ఆదరాతిశయ మును సంకీర్తించుటకు. నర్తకీ = ఆటకత్తెయయిన. మే = నాయొక్క. చిత్తవృత్తిః = మనఃప్రవృత్తి. నియోగ + అనుగ్రహాయ = ఆజ్ఞారూపమైన నీ అనుగ్రహముకొఱకు.

విశ్వామిత్రః :- (విహస్య) ఐందుమతేయ, కిమన్యన్నియోజ్యమ్ ।

నిర్ముక్తశేషధవలైరచలేంద్రమంథ
సంక్షుబ్ధ దుగ్ధమయ సాగర గర్భగౌరైః ।
రాజన్నిదం బహుళపక్షదశన్మృగాంక
చ్ఛేదోజ్జ్వలైస్తవ యశోభి రశోభి విశ్వమ్॥ 35

---

సంధులు :- ఏతాభిః + తవ - సాదేశవిసర్గ. కౌతుక + ఉక్తిభిః - గుణ. ఉక్తిభిః + అపి. మూర్తేః + ఇవ. నిష్ఠిః + అనర్ఘతా - రేఫాదేశ విసర్గ. త్వష్టస్య + అమర. వేద + అక్షరైః. కల్ప + అంతమ్ - సవర్ణదీర్ఘ. దినకృతః + అవచ్ఛేద - ఉత్వాదేశవిసర్గ. దినకృతో + అవచ్ఛేద - పూర్వరూప. స్మః + వయమ్ - ఉత్వాదేశ విసర్గసంధి. యది + అపి + ఆజ్ఞా—యణాదేశ. ఉత్ + మీలతు - అనునాసికాదేశ.

క్రియ :- (1) అసభువి. పరస్మై. లట్. ఉత్తమ (2) విధిలిఙ్ ఉత్తమ
(1) అస్మి - స్వః - స్మః (2) స్యామ్ - స్యావ - స్యామ
(3) మీల నిమేషణే. పరస్మై. లోట్. ప్రథమ.
మీలతు / మీలతాత్ - మీలతామ్ - మీలన్తు.
మైసూరు త్రివ్యాఖ్యాప్రతిలో ఈ శ్లోకములేదు.

ఐందుమతేయ ఇతి:- (విహస్య = నవ్వి) ఐందుమతేయ = ఇందుమతీ తనయా । నియోజ్యమ్ = ఆజ్ఞాపింపదగినది. అన్యత్ = మరియొకటి. కిమ్= ఏమున్నది ।

నిర్ముక్తేతి:- రాజన్ । నిర్ముక్తశేషధవలైః. అచలేంద్ర మంథ సంక్షుబ్ధదుగ్ధమయసాగరగర్భగౌరైః, బహుళపక్ష దశన్మృగాంకచ్ఛేదోజ్జ్వలైః తవ యశోభిః ఇదం విశ్వమ్ అశోభి.

అర్థము :- రాజన్=దశరథమహారాజా ! నిర్ముక్త = కుబుసము విడిచిన. శేష=ఆదిశేషునివలె. ధవలైః=తెల్లనివియు, అచలేంద్ర=మంథానాద్రిచేత. మంథ= మథింపబడుటతో. సంక్షుబ్ధ=కలచివేయబడిన. దుగ్ధమయసాగర=క్షీరాబ్ధియొక్క. గర్భ=

అర్థము :- చకోరప్రణయినీ = చకోరాంగనలయొక్క, రసజ్ఞా = నాల్కయొక్క, పాండిత్య = (రుచిగ్రహణ) నైపుణ్యమును. చిదుర = మోసగించునదై. శశిధామ = వెన్నెలయనునట్టి, భ్రమ = భ్రాంతిని. భరాన్ = కల్గింపజాలినవైన. యశఃస్తోమాన్ = యశస్సమూహములను. ఉచ్చైః = ఇంకను అధికముగ. ఉపచిను = వృద్ధి పొందింపుము. అపి = మరియు. త్వత్తేజోభిః = నీ ప్రతాపములచేత. తమసి = చీకటి, శమితే = నశించిపోగా, అసౌ = ఈ, అంబరమణిః = సూర్యుడు. దిశామ్ = దిక్కులకు. యాత్రామైత్రీమ్ = రాకపోకలతోనైన స్నేహమును, దిక్కులతోగల అనుబంధమునసనుట నభసి = గగనమునందు, రక్షతు = కాపాడుకొను గాక ; (శిఖరిణీ వృత్తము) భ్రమకరాన్ - పాఠాంతరము.

విశేషములు :- చకోరములను భ్రమపెట్టుట యనక చకోరాంగనలను భ్రమపెట్టుటయనుటలో విశేషార్థమున్నదని ఇష్టార్థకల్పవల్లి. స్త్రీణాం ద్విగుణ ఆహారో బుద్ధిశ్చాపి చతుర్గుణః అని పూర్వోక్తి. తెలివిగల చకోరాంగనలనే భ్రమపెట్టెననగా యశస్సు ధావళ్యము మరింత స్పష్టము. అంబరమణిః అనుమాటయు సార్థకము. సూర్యుడు నిర్వహింపవలసిన పనిని దశరథుని తేజస్సే నిర్వహించుటచే ఆకాశమున చుట్టపుచూపుగా యాతాయాతములు చేయుచు సూర్యుడు అలంకారప్రాయుడైనాడు - అంబరే మణిరివ. దీనిని పరికరాంకుర మనవచ్చును. సాభిప్రాయే విశేష్యే తు భవేత్ పరికరాంకురః.

సమాసములు :- యశసాం స్తోమాః - తాన్. చకోరస్య ప్రణయినీ - ప్రణయిన్యాః రసజ్ఞాయాః పాండిత్యమ్ — పాండిత్యస్య చిదురాః. శశినః ధామ - శశిధామ్నః శశిధామ - ఇతి వా భ్రమః - భ్రమస్య భరాః — చిదురాశ్చ తే....భరాశ్చ — తాన్. తవ తేజాంసి - తైః. యాత్రా రూపా మైత్రీ — తామ్. అంబరస్య మణిః.

సంధులు :- ఉచ్చైః + ఉప = రేఫాదేశవిసర్గ. పాండిత్య + చిదుర - తుగాగమసంధి. తేజోభిః + తమసి - సాదేశవిసర్గ.

క్రియ :- చిఞ్ చయనే. పరస్మై. లోట్. మధ్యమ
చిను / చినుతాత్ - చినుతమ్ - చినుత
రక్షపాలనే. పరస్మై. లోట్. ప్రథమ
రక్షతు / రక్షతాత్ - రక్షతామ్ - రక్షన్తు.

కింతు కతిపయరాత్రమాయుధసధ్రీచా రామభద్రేణ సన్నిహిత వైతాన ప్రతానామస్మాక మాశ్రమపదం సనాథీకరిష్యతే. అపిచ —

మధ్యేకృత్య ఘనం ధినోతి జలధిః స్వైరంబుభిర్మేదినీం
హంతి స్వైః కిరణైస్తమిస్రమరుణం కృత్వాంతరాళే రవిః।
త్వం రామాంతరితశ్చ పాలయ నిజైరేవ ప్రతాపైః ప్రజా
[illegible] పరోపకారసుహృదామేష స్వభావో హి వః॥ 37

---

కింత్వితి :- కింతు = కాని — నీ కీర్తికొఱకు కాకున్నను నా కొఱకుగా ఒకటి అర్థించుచున్నాననుట. సన్నిహిత = ఆసన్నమైన (అవలంబింపబోవుచున్న) వైతానప్రతానామ్ = యజ్ఞసంబంధమగు వ్రతవిశేషము కలవారమైన. అస్మాకమ్ = మా యొక్క. ఆశ్రమపదమ్ = ఆశ్రమప్రదేశము. ఆయుధసధ్రీచా = ఆయుధాంచితుడైన. రామభద్రేణ = రామభద్రునిచే. కతిపయరాత్రమ్ = కొన్నిరాత్రుల పర్యంతము. సనాథీకరిష్యతే = సనాథము గావింపబడును. రక్షకుడుగా నుండుననుట. ([illegible]) వైతానిక్రతానామనియు పాఠాంతరము. అపిచ = మఱియు.

మధ్యేకృత్యేతి :- జలధిః ఘనం మధ్యేకృత్య స్వైః అంబుభిః మేదినీం ధినోతి. రవిః అరుణమ్ అంతరాళే కృత్వా స్వైః కిరణైః తమిస్రం హంతి. త్వం చ రామాంతరితః నిజైః ప్రతాపైః ఏవ ప్రజాం పాలయ. పరోపకారసుహృదాం [illegible] స్వభావః హి.

అర్థము :- జలధిః = సముద్రుడు. ఘనమ్ = మేఘమును. మధ్యేకృత్య = ద్వారముగా చేసికొని. స్వైః = తనవైన. అంబుభిః = జలములతో. మేదినీమ్ = భూమిని. ధినోతి = ఆనందింపజేయుచున్నాడు. రవిః = సూర్యుడు. అరుణమ్ = అనూరుని. అంతరాళే = మధ్యభాగమున. కృత్వా = ఉంచుకొని. స్వైః = తనవైన. కిరణైః = కిరణములతో. తమిస్రమ్ = చీకటిని. హంతి = పోగొట్టుచున్నాడు. త్వం చ = నీవును. రామాంతరితః = రాముని మధ్యస్థునిగా నుంచుకొన్నవాడవై. నిజైః = స్వకీయములైన. ప్రతాపైః ఏవ = పరాక్రమములతోనే

ప్రజామ్ = ప్రజను. పాలయ = పాలింపుము. పరోపకార సుహృదామ్ = పరులకు ఉపకారము చేయవలెనను మంచి మనస్సుకలవారికి. (పరోపకారము స్నేహితుడుగా కలవారికి) వః = మీకు. ఈదృక్ = ఇటువంటి – ఎవరినో ఒకరిని అడ్డుగా పెట్టుకొని ఉపకారములు చేయుట అనునది, కః అపి = ఒకానొక అనిర్వచనీయమగు. స్వభావః హి = నైజముకదా।

విశేషములు :– స్వయముగా ఉపకారము చేయగల్గియు ఎవరినో ఒకరిని మిషగా నుంచుకొనుట మీవంటి మహాత్ములకు స్వభావసిద్ధము. రాముడు లేకున్నను ప్రజాపాలనము నీవే చేయగలవనుట. రాముడు వచ్చి నా యజ్ఞమును రక్షించుట నీవు వచ్చి రక్షించుటే అనియు. శార్దూల విక్రీడితము.

సమాసములు :– మధ్యే కృత్వా – మధ్యేపదే నివచనే చ – అని గతి సంజ్ఞ రాగా కుగతిప్రాదయః అని సమసించి క్త్వాకు ల్యబాదేశము. రామేణ అంతరితః. పరస్మై ఉపకారః – పరోపకారః సుహృత్ యేషాం తే – పరోపకారసుహృదః – తేషామ్.

సంధులు :– స్వైః + అంబుభిః + మేదినీమ్. నిజైః + ఏవ – రేఫాదేశ విసర్గ. కిరణైః + తమిస్రమ్, అంతరితః + చ – శషసాదేశ విసర్గసంధి. కృత్వా + అంతరాళే. రామ + అంతరితః – సవర్ణ దీర్ఘ. కః + అపి – ఉత్వాదేశవిసర్గ. కో + అపి – పూర్వరూప. పర + ఉపకార – గుణసంధి. స్వభావః + హి – ఉత్వాదేశ విసర్గ. ఏషః + స్వభావః – తదేతద్విసర్గలోపసంధి.

క్రియ :– ధివి ప్రీణనే (ధిన్వికృణ్వోర్వ్యరచ) పరస్మై. లట్. ప్రథమ.

ధినోతి – ధినుతః – ధిన్వన్తి

హన హింసా గత్యోః. పరస్మై. లట్. ప్రథమ

హన్తి – హతః – ఘ్నన్తి

పాలరక్షణే (ణిచ్) పరస్మై. లోట్. మధ్యమ

పాలయ / పాలయతాత్ – పాలయతమ్ – పాలయత.

అలంకారము :– సామాన్యముతో విశేషమును సమర్థించుటచే అర్థాంతరన్యాసము. ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః.

కించ—

దృష్టస్సాక్షాదసురవిజయీ నాకినాం చక్రవర్తీ
మాత్స్యో న్యాయః కథయతి యథా వారుణీ దండనీతిః ।
పాతాలేంద్రాదహిభయమథాస్త్యేవ నిత్యానుషక్తం
తన్నః పుణ్యైరజని భవతా వీర రాజన్వతీ భూః ॥ 38

---

కించ = మరియు

దృష్ట ఇతి :- అసురవిజయీ నాకినాం చక్రవర్తీ సాక్షాత్ దృష్టః. వారుణీ దండనీతిః యథా (ఇతి) మాత్స్యః న్యాయః కథయతి. అథ పాతాలేంద్రాత్ అహిభయమ్ నిత్యానుషక్తమ్ అస్తి ఏవ, తత్ నః పుణ్యైః వీర ! భవతా భూః రాజన్వతీ అజని.

అర్థము :- అసురవిజయీ = రాక్షసులను జయించువాడైన, నాకినామ్ = దేవతలయొక్క, చక్రవర్తీ = అధిపతి, సాక్షాత్ = ప్రత్యక్షముగా, దృష్టః = సందర్శింపబడినాడు. ఇంద్రుడెంతటి ఐశ్వర్యశాలియో శాంతిభద్రత లెట్లుండునో ఎంతటి గొప్ప పరిపాలకుడో ప్రత్యక్షముగా ఎరుగుదుమనుట. వారుణీ = వరుణుని కిసంబంధించిన. దండనీతిః = పరిపాలనా విధానము (శిక్షాస్మృతి). యథా (ఇతి) = ఎట్లుండునో, మాత్స్యః = మత్స్యసంబంధమగు, న్యాయః = న్యాయము, కథయతి = చెప్పుచున్నది. చిన్నచేపను పెద్దచేప తినుట మాత్స్య న్యాయము. వరుణలోకమున స్థితి అట్టిది అనుట. అథ = అటుపైని. పాతాలేంద్రాత్ = పాతాళాధిపుడైన వాసుకివల్ల, అహిభయమ్ = సర్పభీతి, నిత్యానుషక్తమ్ = ఎల్లప్పుడును వెంబడించి, అస్తిఏవ = ఉండనే ఉన్నది. పాతాళలోకమున సర్పభయముండుటచే నివాసయోగ్యము కాదనుట. తత్ = అందుచే, నః = మాయొక్క, పుణ్యైః = సుకృతములచే, వీర = దశరథ మహావీరా ! భవతా = నీచే, భూః = ఈ భూలోకము, రాజన్వతీ = మంచి రాజు కలదిగా, అజని = అయ్యెను. నీవు పరిపాలించుచుండుటచే భూలోకము రాజన్వతి అయ్యెననియు, వాసయోగ్య మయ్యెననియు, అది మా పుణ్యవిశేషమనియు తాత్పర్యము. ఇంద్ర వారుణ పాతాళములకన్న భూలోకము నీ ఏలుబడిలో వాసయోగ్యముగా నున్నదనుట. (శార్దూలము)

దశరథః :- (సవిషాదమాత్మగతమ్) కథమిద మస్మాకం సకలలోక శోక శంకూద్ధరణ శీల శీతలేభ్యః కౌశికప్రసాదేభ్యో రామభద్ర ప్రవాస వైమనస్య ముత్పత్స్యతే. దృష్టం వా నిశ్శేషానంద నిష్యందినీనామపీందుకర కందలీనాం కమలవనీమీలనం కలంక స్థానమ్. (విహస్య) కా గతిః ! (ప్రకాశమ్)

---

సమాసములు :- అసురాణాం విజయీ. అసురస్య విజయః - అసుర విజయః అస్త్యస్యేతి - అసురవిజయీ - కథాచిత్తుగా రాక్షసులచే జయింపబడిన వాడనుట. దండస్య దండాయ వా నీతిః, పాతాళస్య ఇంద్రః - తస్మాత్. అహేః భయమ్ నిత్యమ్ అనుషక్తమ్.

సంధులు :- మాత్స్యః + న్యాయః - ఉత్త్వాదేశవిసర్గ. పాతాళ + ఇంద్రాత్- గుణసంధి. అథ + అస్తి, నిత్య + అనుషక్తమ్ - సవర్ణదీర్ఘ. అస్తి + ఏవ - యణాదేశ, తత్ + నః - అనునాసికాదేశ, పుత్రైః + అజని - రేఫాదేశవిసర్గ.

క్రియ :- కథ వాక్యప్రబంధే (ణిచ్) లట్, పరస్మై. ప్రథమ

కథయతి - కథయతః - కథయన్తి.

అసభువి, పరస్మై. లట్, ప్రథమ

అస్తి - స్తః - సన్తి

జనీజ్ ప్రాదుర్భావే ఆత్మనే, లుఙ్, ప్రథమ

(దీపజనేతి /వా /చిణ్)

అజని/అజనిష్ట - అజనిషాతామ్ - అజనిషత

కథమితి :- (సవిషాదమ్ = విషాదముగా, ఆత్మగతమ్=తనలో) సకల లోక=సమస్త ప్రపంచమునకును, శోక=దుఃఖమనునట్టి, శంకు=మేకును, ఉద్ధరణశీల= తొలగించు నైజము కలవై, శీతలేభ్యః=చల్లనివైన, కౌశికప్రసాదేభ్యః=విశ్వామిత్రుని ఈ అనుగ్రహములవలన, రామభద్రప్రవాసవైమనస్యమ్=రామభద్రుని అడవికి (యాగ రక్షణార్థము) పంపునట్టి దుఃఖము, అస్మాకమ్=మాకు, ఇదమ్=ఇదే, ఉత్పత్స్యతే= కల్గబోవుచున్నది, కథమ్=ఎట్లు ! నిశ్శేష=అందరికిని పరిపూర్ణముగా, ఆనంద= ఆనందమును, నిష్యందినీనామ్=పంచిపెట్టునవైన, ఇందుకర కందళీనామ్=చంద్రకిరణ

విశ్వామిత్రః :- (సస్మితమ్) రాజర్షే, మమకారో హి రాజపుత్రేషు రాజ్ఞా ముపలాలన క్లేశాయ కేవలమ్. ఉపయోగస్తు ప్రజానామ్. యథైతత్.

కష్టా వేధవ్యథా కష్టో నిత్యముద్వహనక్లమః ।
శ్రవణానామలంకారః కపోలస్య తు కుండలమ్॥ 40

దశరథః :- భగవన్, పరమనుగృహీతా వయమేవం తత్రభవతా సంభావ్య మానాః. కింపునరకృతాస్త్రః క్షీరకంఠో వత్సోఽయమితి ముగ్ధోఽస్మి.

---

రాజర్షేఇతి :- (సస్మితమ్ = చిరునవ్వుతో) రాజర్షే = రాజర్షీ । (రాజువై ఋషివంటివాడా । - సాభిప్రాయ సంబోధన) రాజపుత్రేషు = రాకుమారులయందు (స్వకీయ సంతానమునందు) రాజ్ఞామ్ = రాజులకు, మమకారః=మమకారము (వాత్స ల్యము) కేవలమ్ ఉపలాలన క్లేశాయ = పెంపకములోని శ్రమకొఱకు మాత్రమే. తండ్రులైన రాజులకు మిగులునది ఆ క్లేశము మాత్రమే అనుట. ఉపయోగః తు = రాకుమారులవలని ఉపయోగము, ప్రజానామ్ = ప్రజలకే. ఏతత్ = ఇది, యథా = ఎట్లనగా—

కష్టేతి :- కష్టా వేధవ్యథా, నిత్యమ్ ఉద్వహనక్లమః కష్టః శ్రవణానామ్, తు, కుండలం కపోలస్య అలంకారః । (నిత్యం చ వహన-)

అర్థము :- కష్టా = భరింపరానిదగు. వేధవ్యథా = గ్రుచ్చుట యందలి బాధయు, నిత్యమ్ = ఎల్లప్పుడును, ఉద్వహనక్లమః = మోయుట అనునట్టి శ్రమయు, శ్రవణానామ్ = చెవులకు, తు=కాగా, కుండలమ్ = కుండలము, కపోలస్య=చెక్కిలికి. అలంకారః=భూషణము. శ్రమ చెవులది సొగసు చెక్కిలిది అనుట.

సమాసములు :- వేధజనితా వ్యథా. ఉద్వహనే క్లమః,

సంధులు :- కష్టః + నిత్యమ్ - ఉత్వాదేశ విసర్గసంధి,

ఛందస్సు :- అనుష్టుప్పు (చూ. ప్రథమ. శ్లో-8)

భగవన్నితి :- భగవన్ = మహాత్మా । ఏవమ్ = ఇట్లు, తత్రభవతా= తమచేత, సంభావ్యమానాః = ఆదరింపబడుచున్నవారమై, వయమ్ = మేము, పరమ్

విశ్వామిత్రః :- అలం చ తే రామభద్రేఽపి బాలోఽయమిత్యళీక సంభావనయా. దివస్పృథివ్యోస్తిమిరతిరస్కారిణీం తరణి రణుతరోఽపి తేజసా తిరస్కరోతి.

దశరథః :- (సస్మితమ్) భగవన్ కుశిక వంశకేతో, కస్య తలినీ తాదృశీ జిహ్వా యా త్వామపి బ్రువాణ మధరోత్తరేణానుసంధత్తే. (అపవార్య) వామదేవ, ఏవమత్రభవాన్ కౌశికో బ్రవీతి.

---

మహానుభావుడగు. కృశాశ్వమ్ = కృశాశ్వమహర్షిని. సహస్రం వత్సరాన్ = వేయి సంవత్సరాలు (లను). ఉపాసీనః = సేవించినవాడవై. దివ్యాస్త్ర = అమోఘములగు అస్త్రములయొక్క. మంత్ర = మంత్రరూపమగు. ఉపనిషత్ = రహస్యమును (విజ్ఞానమును) అధ్యగీష్ఠాః = అధ్యయనము చేసితివి (అని) శంకే = భావించుచుంటిని. వానిని నీవు నేర్చుకొనుట మాకు నేర్పుటకే అనుట.

అలమితి :- రామభద్రే అపి = రామభద్రుని విషయము నందును. అయమ్ = ఇతడు. బాలః = పసివాడు. ఇతి = అని. అళీక సంభావనయా = మిథ్యాభావనతో. తే = నీకును. అలమ్ = చాలును. అట్టి ఆలోచన వ్యర్థమనుట. దివస్పృథివ్యోః = భూమ్యాకాశముల మధ్యభాగమునందలి. తిమిరతిరస్కారిణీమ్ = చీకటి అనునట్టి అడ్డుతెరను. అణుతరః అపి = అణుప్రమాణములో నున్నవాడైనను. తరణిః = సూర్యుడు. తేజసా = తన తేజస్సుతో. తిరస్కరోతి = తొలగించును. (ద్యావాపృథివ్యోరంతరాలే అని పాఠాంతర మున్నది. దివసశ్చ పృథివ్యామ్ అను సూత్రముచే దివసాదేశము — దివస్పృథివ్యోః. (ప్రతిసీరా యవనికా స్యాత్తిరస్కరిణీ చ సా — అని అమరము.)

భగవన్నితి :- (సస్మితమ్ = చిరునవ్వుతో) భగవన్ = మహాత్మా ! కుశికవంశకేతో = కుశిక వంశమునకు పతాకవంటివాడా! బ్రువాణమ్ = మాటలాడుచున్న. త్వామ్ అపి = నిన్నుకూడ. అధరోత్తరేణ = ప్రత్యుత్తరముతో. యా (జిహ్వా) = ఏ నాలుక, అనుసంధత్తే = సమాధాన పరచునో (సంతృప్తి పరచునో). తాదృశీ = అటువంటి. తలినీ = సమర్థమైన (స్వచ్ఛమైన). జిహ్వా=నాల్క. కస్య= ఎవనికున్నది. ఎప్పుడును నీకు సంభాషణలో సాటిరా దనుట. (తలినం విరళే స్తోకే

అపిచ—

జగతీభారఖిన్నానాం విశ్రామో భవతామయమ్।
యద్యథాకామసంపత్తి ప్రీతార్థిముఖదర్శనమ్॥ 42

కించ విశేషేణ

---

అపిచ :- మరియు.

జగతీతి :- యథాకామ.... దర్శనమ్ యత్ అయమ్ జగతీభారఖిన్నానాం భవతామ్ విశ్రామః.

అర్థము :- యథాకామ = కోరినంతగా లభించిన. సంపత్తి = సంపదతో. ప్రీత = సంతుష్టులైన. అర్థి = యాచకులయొక్క. ముఖ = మొగముల. దర్శనమ్ = సందర్శనము. యత్ = ఏది కలదో. అయమ్ = ఇది. జగతీభార = ప్రజాపాలన భారముతో. ఖిన్నానామ్ = అలిసిపోయిన. భవతామ్ = మీరు (మీవంటి వారికి). విశ్రామః = వినోదస్థానము గదా!. యాచకుల ఆనందమే మీ ఆనందమనుట.

సమాసములు :- జగత్యాః భారః — భారేణ ఖిన్నాః - తేషామ్. కామమనతిక్రమ్య — యథాకామం లబ్ధా సంపత్తిః - సంపత్త్యా ప్రీతాః - ప్రీతాశ్చ తే అర్థినశ్చ - అర్థినాం ముఖాని - ముఖానాం దర్శనమ్.

సంధులు :- విశ్రామః + భవతామ్ — ఉత్వాదేశవిసర్గ. ప్రీత + అర్థి = సవర్ణదీర్ఘ.

ఛందస్సు :- రెండు-నాలుగు పాదములలో నాల్గవ అక్షరము తరువాత జగణమున్నది. కావున ఇది పథ్యావక్త్రమను అనుష్టుప్పు. (చూ. ప్రథమ-శ్లో. 3)

కిమితి :- కించ = మరియు. విశేషేణ = విశేషముగా - మరియొక విశేషమున్నదనుట.

పూరయితుమితి :- అర్థికామాన్ పూరయితుం సందిశతా తే గోత్రగురుణా మైత్రావరుణేన సమాధిదృష్టః అయమేవ అర్థః సందిష్టః.

పూరయితు మర్థికామాన్ మైత్రావరుణేన గోత్రగురుణా తే।
సందిశతా సందిష్టః సమాధిదృష్టోఽయమేవార్థః॥ 43

దశరథః :- వామదేవ, ఏవమేతత్ —

ధ్యానమయదృష్టిపాతప్రముషితకాలాధ్వ విప్రకర్షేషు।
విషయేషు నైష్ఠికానాం సర్వపథీనా మతిః క్రమతే॥ 44

---

అర్థము :- అర్థి = యాచకులయొక్క. కామాన్ = కోరికలను. పూరయితుమ్ = తీర్చుటకు. సందిశతా = సందేశము పంపినవాడగు. తే = నీయొక్క. గోత్రగురుణా = కులగురువైన. మైత్రావరుణేన = వసిష్ఠునిచే. సమాధిదృష్టః = తపస్సమాధిలో (ఏకాగ్రస్థితిలో) అవలోకింపబడినదై. అయమ్ ఏవ = ఇదే. అర్థః = విషయము - విశ్వామిత్రుడు అడిగిన ఈ అంశమే. సందిష్టః = సందేశముగా పంపబడినది. హూతమిష్టం చ తప్తం చ (1-17) అను కారికలో వసిష్ఠుల ఆంతర్యమిదే అనుట.

సమాసములు :- అర్థినః కామాః - తాన్. గోత్రస్య గురుః - తేన. సమాధౌ దృష్టః.

సంధులు :- దృష్టః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - దృష్టో + అయమ్ - పూర్వరూప. ఏవ + అర్థః - సవర్ణదీర్ఘ.

ఛందస్సు :- ఆర్యావృత్తము (చూ. ప్రథమ. శ్లో-10)

వామదేవేతి :- వామదేవ ! ఏవమ్ ఏతత్ = అప్పను అట్టిదే.

ధ్యానేతి :- ధ్యానమయ....విప్రకర్షేషు విషయేషు నైష్ఠికానాం సర్వపథీనా మతిః క్రమతే.

అర్థము :- ధ్యానమయ = ధ్యానరూపమైన (ధ్యానసిద్ధమైన) దృష్టి పాత = దృష్టిప్రసారముచే. ప్రముషిత = తొలగింపబడిన. కాలాధ్వవిప్రకర్షేషు - కాల = కాలసంబంధములును. అధ్వ = దేశ సంబంధములునగు. విప్రకర్షము = దూరములు కలవైన. విషయేషు = అంశములయందు - (కాలదేశ సంబంధములగు దూరములు తొలగింపబడిన అంశములందు - దూరము దగ్గర. భూతము వర్తమానము

(విమృశ్య)

క్రియాణాం రక్షాయై దశరథముపస్థాయ విముఖే
మునౌ విశ్వామిత్రే భగవతి గతే సంప్రతి గృహాన్ ।
తపోలేశక్లేశాదుపశమిత విఘ్నప్రతిభయే
ప్రవృత్తే యష్టుం వా రఘుకుల కథైవాస్తమయతే॥ 45

భావి మొదలైన అవధులు తపోమయ దృష్టికి అంతరాయములు కావు అనుట.) నైష్ఠికానామ్ = తపస్వులయొక్క, సర్వపథీనా = సర్వమార్గ సంచారిణియగు. మతిః = బుద్ధి, క్రమతే = ప్రవర్తించును. తపస్వుల దృష్టికి సమస్తము గోచరించుననుట.

సమాసములు:- ధ్యానస్య వికారః — దృష్టేః పాతః - ధ్యానమయశ్చ అసౌ దృష్టిపాతశ్చ - దృష్టిపాతేన ప్రముషితాః — కాలశ్చాసౌ అధ్వా చ - కాలాధ్వనోః విప్రకర్షాః - దృష్టిపాత ప్రముషితాః కాలాధ్వ విప్రకర్షాః యేషు తే — ధ్యానమయ.... విప్రకర్షాః — తేషు (విషయేషు). సర్వపథీనా — తత్సర్వాదేరిత్యాదినా ఖః.

క్రియ :- క్రము పాదవిక్షేపే (వృత్తిసర్గతాయనేషు క్రమః — ఆత్మనేపదత్వము). లట్. ప్రథమ.

క్రమతే — క్రమేతే — క్రమన్తే.

ఛందస్సు :- ఆర్యావృత్తము (చూ. ప్రథమ. శ్లో. 10)

(విమృశ్య = ఆలోచించి)

క్రియాణామితి :- క్రియాణాం రక్షాయై దశరథమ్ ఉపస్థాయ విముఖే భగవతి మునౌ విశ్వామిత్రే సంప్రతి గృహాన్ గతే. తపోలేశక్లేశాత్ ఉపశమిత విఘ్న ప్రతిభయే. వా, యష్టుం ప్రవృత్తే. రఘుకులకథైవ అస్తమ్ అయతే.

అర్థము :- క్రియాణామ్ = యాగక్రియలయొక్క, రక్షాయై=సంరక్షణ కొరకు, దశరథమ్ = ఇక్ష్వాకువంశపు రాజునైన నన్ను దశరథుని, ఉపస్థాయ =అర్థియై సమీపించి, విముఖే = నిష్ఫలుడై, భగవతి = మహాత్ముడును, మునౌ = తపస్వియు నైన, విశ్వామిత్రే = కౌశికుడు, సంప్రతి = ఇప్పుడు, గృహాన్ =ఆశ్రమపర్ణశాలలను గతే = పొందగా. తపోలేశ = స్వల్పపరిమాణము(లో) తపస్సుయొక్క, క్లేశాత్ = వ్యయమువలన, ఉపశమిత = చల్లార్చబడిన, విఘ్నభయేన = రాక్షసవిఘ్నరూపమగు

(మునింప్రతి) జగద్గురో, గాధినందన !

త్వం చేద్దీక్షిష్యమాణో మే రామభద్రం ప్రతీక్షసే।
తన్నః పతివ్రతావృత్తమియం చరతు మేదినీ॥ 46

---

భయము కలవాడై - అట్టి భయమును ఉపశమింపజేసినవాడై అనుట. వా = మరియు, యష్టుమ్ = యజ్ఞము సాగించుటకు, ప్రవృత్తే = పూనుకొన్నవాడుకాగా – అప్పుడు– రఘుకుల = రఘువంశము యొక్క. కథా + ఏవ = దానవైభవ గాథయే. అస్తమ్ అయతే = అస్తమించును. (శిఖరిణీ వృత్తము)

సమాసములు :- తపసాం లేశః – తపోలేశస్య క్లేశః – తస్మాత్. విఘ్నానాం ప్రతిభయమ్ – ఉపశమితం విఘ్న ప్రతిభయం యస్య సః – తస్మిన్. రఘూణాం (రఘోః) కులమ్ - రఘుకులస్య కథా.

సంధులు :- కథా + ఏవ - వృద్ధి. ఏవ + అస్తమ్ – సవర్ణదీర్ఘ.

క్రియ :- అయఙ్ గతౌ. ఆత్మనే. లట్. ప్రథమ
అయతే – అయేతే – అయన్తే

జగదితి :– (మునిం ప్రతి = విశ్వామిత్రుని ఉద్దేశించి) జగద్గురో=జగత్తునకు గురువా !. గాధినందన = గాధేయా !

త్వామితి :– దీక్షిష్యమాణః త్వమ్ మే రామభద్రం ప్రతీక్షసే చేత్ తత్ నః ఇయం మేదినీ పతివ్రతా వృత్తం చరతు.

అర్థము :- దీక్షిష్యమాణః = యాగదీక్షను స్వీకరింపనున్న. త్వమ్ = నీవు. మే = నాయొక్క. రామభద్రమ్ = రాముని. ప్రతీక్షసే చేత్ = కోరి కొంపోదువేని, తత్ = అప్పుడు, (అందువలన) నః = మాయొక్క. ఇయమ్ = ఈ. మేదినీ= భూమి [రాజ్యగమి]. పతివ్రతావృత్తిమ్ = పతివ్రతల ఆచారమును. చరతు = ఆశ్రయించునుగాక ! భర్త ఊరిలో లేనప్పుడు పతివ్రతలు మలినాంబరధారిణులై నిరలంకారలై యుందురట. రాముడు తిరిగి వచ్చునంతవరకు మా రాజ్యము నిరలంకారము నిరుత్సవముగా నుండుననుట. రాముడే కాబోవు మహారాజనియు, త్వరగా తిరిగి పంపుమనియు వ్యంగ్యములు. (పత్యావృత్తిము. చూ. ప్రథమ. శ్లో. 3)

(నేపథ్యాభిముఖః) కః కోఽత్ర భోః.

(ప్రవిశ్య)

దౌవారికః :- కిమాజ్ఞాపయతి దేవః.

దశరథః :- ఆహూయతాం రామభద్రః.

వామదేవః :- లక్ష్మణశ్చ.

దశరథః :- (సస్మితమ్) ఋషే, పృథక్ప్రయత్నాపేక్షీ నాయమర్థః. న ఖలు ప్రకాశమంతరేణ తుహినభానురుజ్జిహీతే.

(దౌవారికో నిష్క్రాంతః తతః ప్రవిశతో రామలక్ష్మణౌ)

---

క్రియ :- ఈక్ష్ దర్శనే, ఆత్మనే, లట్, మధ్యమ

ఈక్షసే - ఈక్షేథే - ఈక్షధ్వే

చర గతి భక్షణయోః, పరస్మై. లోట్, ప్రథమ

చరతు/చరతాత్ - చరతామ్ - చరన్తు

[నేపథ్యాభిముఖః = తెరవైపు తిరిగినవాడై] కఃకోఽత్రభోః=ఎవరిక్కడ ?

(ప్రవిశ్య = దౌవారికుడు ప్రవేశించి)

కిమితి :- దేవః = మహారాజు, కిమ్ ఆజ్ఞాపయతి = ఏమి ఆజ్ఞాపించు చున్నారు - ఏమి ఆజ్ఞ అనుట.

ఆహూయతామితి :- రామభద్రః = రామభద్రుడు, ఆహూయతామ్ = పిలువబడుగాక ! పిలువుమనుట,

లక్ష్మణశ్చ = లక్ష్మణుడును. [పిలువబడుగాక అని]

ఋషే ఇతి :- [సస్మితమ్ = చిఱునవ్వుతో] ఋషీ ! అయమ్ అర్థః = ఈ నీవన్నది, పృథక్ ప్రయత్నాపేక్షీ = ప్రత్యేక ప్రయత్నమును కోరునది [వేరుగా చెప్పవలసినది], న = కాదు, ప్రకాశమ్ అంతరేణ = కాంతి లేకుండగా, తుహినభానుః = చంద్రుడు, న ఉజ్జిహీతే ఖలు = ఉదయించదుగదా ! చంద్రుడు-వెన్నెల వలె రామలక్ష్మణులు అవిభాజ్యులనుట. [దౌవారికః = ద్వారపాలకుడు, నిష్క్రాంతః= నిష్క్రమించును తతః = ఆ పిమ్మట, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ప్రవిశతః = ప్రవేశింతురు.]

రామః :- (సహర్షమ్)

సురాధీశక్రోధా జ్జగదపరథా కర్తుమపరే
పురాణబ్రహ్మాణో భువనపితరః సప్త చ కృతాః।
ధృతాస్తుష్టేనామీ బహిరపి చ వైశ్వానరపథాత్
కథా పౌరాణీ యచ్చరితమితిహ స్మ ప్రథయతి॥ 47

---

సురాధీశేతి :- సురాధీశక్రోధాత్ జగత్ అపరథా కర్తుం అపరే పురాణబ్రహ్మాణః భువనపితరః సప్త కృతాః. అపిచ తుష్టేన అమీ వైశ్వానరపథాత్. బహిః ధృతాః. పౌరాణీ కథా యత్ చరితమ్ ఇతిహ ప్రథయతి స్మ.

అర్థము :- (సహర్షమ్ = సంతోషముతో) సురాధీశ = దేవేంద్రునిపట్ల. క్రోధాత్ = కోపముతో. జగత్ = ప్రపంచమును. అపరథా = మరొక విధముగా. కర్తుమ్=చేయుటకై. అపరే=మరికొందరు. పురాణబ్రహ్మాణః = పురాతన ఋషీశ్వరులను. భువనములను నిర్మాతలునగు అత్రిమరీచి ప్రభృతులు. సప్త = ఏడుగురు. కృతాః = సృష్టింపబడిరి. అసలైన అత్రిమరీచి ప్రభృతులకు ప్రతిగా సప్తర్షులు మరికొందరు సృష్టింపబడిరనుట. అపిచ = మరియు. తుష్టేన = బ్రహ్మేంద్రాదుల ప్రార్థనతో సంతుష్టుడైన విశ్వామిత్రునిచే. అమీ = ఆ క్రొత్తఋషులు ఏడుగురును. వైశ్వానరపథాత్ = వైశ్వానరమార్గమునుండి. బహిః = వెలుపల. ధృతాః = నిక్షేపింపబడిరి. పౌరాణీ = ఆ పురాణసంబంధమగు. కథా = గాధ. యచ్చరితమ్ = ఎవనియొక్క చరిత్రము. ఇతిహ = ఐతిహ్యముగా. ప్రథయతి స్మ = చాటునో ఆ విశ్వామిత్రుని మనము సేవింపవలెనని ముందరి వాక్యములోనికి అన్వయము.

విశేషములు :- త్రిశంకు మహారాజును స్వర్గములోనికి రానీలేదని అలిగి విశ్వామిత్రుడు క్రొత్తసృష్టికి పూనుకొనెను. ముందుగా నక్షత్రమండలమును సప్తర్షులను సృష్టించెను. సృజన్ దక్షిణమార్గస్థాన్ సప్తర్షీ నపరాన్పునః నక్షత్రమాలామ పరామసృజత్ క్రోధమూర్ఛితః - రామాయణము. అంతట దేవేంద్రాదులు ప్రార్థింపగా కోపము విడిచి సృష్టి విరమించెను ఇది రామాయణగాధ. ఆ నూతన సప్తర్షులు నక్షత్రమండలముగా ఆకాశమున నుండిపోయిరి. నక్షత్రమార్గములో ఐరావతాది నామములతో మూడు వీథులున్నవనియు అందు దక్షిణవీథికి వైశ్వానరమను పేరనియు,

కథం సోఽపి భగవాన్ విశ్వామిత్రః స్వయమస్మాభిరుపచరిష్యతే. (ఇతి పరిక్రామన్ పురోఽపలోక్య హర్షాతిశయం రూపయన్) నూనం వినయనమ్రయోస్తాతవామదేవయో స్తృతీయః ప్రశాంతపావనీయాకృతిః స భగవాన్ విశ్వామిత్రో భవిష్యతి.

---

దానికి వెలుపలనున్న ప్రదేశమును పితృయాణ మందురనియు వాయుపురాణము చెప్పు చున్నది– స్థానం జారజవం మధ్యం తథైరావత ముత్తమమ్ వైశ్వానరం దక్షిణతో నిర్దిష్టమిహ తత్త్వతః॥, అభ్రవీధి, మృగవీధి, వైశ్వానరవీధి– అని దక్షిణవీథీత్రయ మున్నది. ఆర్షభి. గోవీధి, జారజవవీధి – అని మధ్యవీథీత్రయము. ఐరావతవీధి, నాగవీధి, గజవీధి – అని ఉత్తరవీథీత్రయము. "ఉత్తరం యదగస్త్యస్య అజవీథ్యాశ్చ దక్షిణం పితృయాణస్సవై పంథా వైశ్వానర పథాద్బహిః తత్రాసతే మహాత్మానో మునయో యేఽగ్నిహోత్రిణః.... ఇత్యాదిగా వాయుపురాణము మరిన్ని వివరములు నిచ్చినది. ప్రతియుగమునందును బ్రహ్మ వీరిని పునఃస్థాపించుచుండునట. వైశ్వానర మనగా అగ్ని. వైశ్వానరపథాత్ బహిః అను మాటకు హవిర్దాన మార్గమునకు వెలుపలగా అనియు కొందరు అర్థము చెప్పిరి. "కథా పౌరాణీయం చరితమితి యస్య ప్రథయతి"– అని పాఠాంతరము. ఇయం కథా యస్య పౌరాణీయం చరితమితి కథ యతి – అని అన్వయము సులభము.

సమాసములు :- సురాణామధీశః - సురాధీశే క్రోధః - తస్మాత్. పురాణాశ్చతే బ్రహ్మణశ్చ. భువనానాం పితరః

సంధులు :- సుర + అధి + ఈశ, తుష్టేన + అమీ - సవర్ణదీర్ఘ సంధులు. యత్ + చరితమ్, క్రోధాత్ + జగత్ - శ్చుత్వసంధి. బ్రహ్మణః + భువన-ఉత్వాదేశవిసర్గ. ధృతాః + తుష్టేన - సాదేశవిసర్గ బహిః + అపి- రేఫాదేశవిసర్గ.

క్రియ :- ప్రథ అఖ్యానే. పరస్మై. లట్. ప్రథమ (ణిచ్) ఘటాదిః. ప్రథయతి - ప్రథయతః - ప్రథయన్తి (లట్ స్మే - ఇతి భూతే లట్)

ఛందస్సు :- శిఖరిణీ. రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలాగశ్శిఖరిణీ.

కథమితి :- సః అపి = అంతటి వాడయినప్పటికిని. భగవాన్ = మహాత్ముడగు. విశ్వామిత్రః = కౌశికుడు స్వయమ్ = తనంతతానుగా. అస్మాభిః=

లక్ష్మణః :- (సాశ్చర్య స్మితమ్) ఆర్య.

అయమయమీదృశప్రశమవిశ్వసనీయతను
ర్భువన భయంకరీః కథమధత్త రుషోఽపి మునిః ।

---

మనచేత. ఉపచరిష్యతే - కథమ్ = సేవింపబడునా! అంతటి మహానుభావునికి మన సేవలు అవసరమగుట భాగ్యవిశేష మనుట. (ఇతి = అని. పరిక్రామన్ = నడుచుచు. పురః అవలోక్య = ముందునకుచూచి. హర్షాతిశయమ్ = ఆనందాతిరేకమును. రూపయన్ = ప్రదర్శించుచు). వినయవినమ్రయోః = వినయముతో వినమ్రులైన. తాతవామదేవయోః = దశరథవామదేవులకు. తృతీయః=మూడవవాడును. ప్రశాంత= ప్రశాంతితోకూడినదియు. పావనీయ = పవిత్రీకరణ సమర్థమునగు. ఆకృతిః = రూపముకలవాడునైన. సః = ఆ. భగవాన్ = మహానుభావుడు (ఆ మూడవ వ్యక్తి అనుట). నూనమ్=తప్పక. విశ్వామిత్రః = కౌశికుడే. భవిష్యతి = అయియుండును.

ఆర్యేతి :- (సాశ్చర్యస్మితమ్ = ఆశ్చర్యముతో చిఱునవ్వుతో) ఆర్య= మాన్యుడా ! అగ్రజా ! (సంబోధన నియమములను అనుబంధములో చూచునది).

అయమితి :- ఈదృశ ప్రశమ విశ్వసనీయతనుః అయమ్ అయమ్ మునిః భువన భయంకరీః రుషః అపి కథమ్ అధత్త. వా ఇదమేవస్థితమ్ - మృదు మనోజ్ఞతుషారతమాః మహౌషధయః తమసి సతి జ్వలన్తి.

అర్థము :- ఈదృశ = ఇటువంటి. ప్రశమ = ప్రశాంతితోకూడినదియు. విశ్వసనీయ = విశ్వసింపదగినదియునైన. తనుః = రూపముగల. అయమ్ అయమ్= ఈ కన్పించుచున్న (అత్యంత సన్నిహితముగానున్న - భృశార్థమున ద్విరుక్తి). మునిః = విశ్వామిత్రుడు. భువన భయంకరీః = ముల్లోకములను గడగడలాడించునట్టి. రుషః అపి = కోపములను కూడ - (కోపముతోచేయు ప్రతిసృజనాదికములగు క్రియలను కూడ) - కథమ్ = ఎట్లు. అధత్త = చేసెను ! వా = కాదన్నచో. ఇదమ్ ఏవ = ఇదే - ఈ చెప్పబోవు మాటయే. స్థితమ్ = శాశ్వత సత్యము - మృదు = సుకుమారమైనవియు. మనోజ్ఞ = అందమైనవియు. తుషారతమాః = మిక్కిలి చల్లనైనవియునగు. మహౌషధయః = గొప్ప ఓషధీలతలు. తమసి సతి = చీకటి వ్యాపించ

స్థితమిదమేవ వా మృదుమనోజ్ఞతుషారతమా
స్తమసి సతి జ్వలన్తి సహసైవ మహౌషధయః॥ 48

---

గనే. సహసైవ=హఠాత్తుగా, జ్వలన్తి = మండుచుండును. అవమానపరచు చీకటిని చూచి మండిపడుట వీని లక్షణమనుట. మనోజ్ఞతమాకృతయః – పాఠాంతరము.

సమాసములు :- ప్రశమా చ సా విశ్వసనీయా చ - ఈదృశా చ సా ప్రశమ విశ్వసనీయా – ఈదృశ ప్రశమ విశ్వసనీయా తనుర్యస్యసః. భువనానాం భయం కరీ – తాః. మృద్వ్యశ్చ తా మనోజ్ఞాశ్చ – మృదుమనోజ్ఞాశ్చ తా తుషారతమాశ్చ. మహాంత్యశ్చ తా ఓషధయశ్చ.

సంధులు :- తనుః + భువన – రేఫాదేశవిసర్గ. రుషః + అపి – ఉత్వాదేశవిసర్గ – రుషో + అపి – పూర్వరూప. తుషారతమాః + తమసి – సాదేశవిసర్గ. సహసా + ఏవ, మహా + ఓషధయః - వృద్ధి సంధులు.

క్రియ : డుధాఞ్ ధారణపోషణయోః ఆత్మనే. లఙ్. ప్రథమ.

అధత్త - అదధాతామ్ - అదధత

జ్వల దీప్తౌ. పరస్మై. లట్. ప్రథమ

జ్వలతి - జ్వలతః - జ్వలన్తి.

ఛందస్సు :- ఇది నర్కుటవృత్తము. 'నజభజజలగ' గణములతో ఏడు, పది అక్షరముల పిదప యతి. హయదశభిర్నజౌ భజజలా గురు నర్కుటకమ్. అదే గణములతో ఏడు, ఆరు, నాలుగు స్థానములపై యతులున్నచో కోకిలకము. హయఋతు సాగరైర్యతియుతం యది కోకిలకమ్. 10-7, 8-5-4 యతి స్థానముల తోను కోకిలకమే. ప్రస్తుత వృత్తమున నాల్గవ పాదమున యతి ఎనిమిదికి పైని కన్పించుచున్నది.

| న | జ | భ | జ | జ | లగ |
|---|---|---|---|---|---|
| I I I | I U I | U I I | I U I | I U I | I U |
| అయమ | యమీదృ | శప్రశ | మవిశ్వ | సనీయ | తనుః |

రామః :- వత్స లక్ష్మణ, ఏవం దురవగాహ గంభీరాశ్చిత్రీయన్తే మహాన్తః.

అపిచ—

ప్రతవిహతికరీభిరప్సరోభిః సహ జగదస్య నిగృహ్ణతో గృణన్తి ।
నమదమరశిరః కిరీటరోచి ర్ముకుళిత రోషతమాంసి చేష్టితాని॥ 49

---

వత్సేతి :- వత్స = తమ్ముడా !, లక్ష్మణ = సౌమిత్రీ !, మహాంతః = మహాత్ములు, దురవగాహ = పొందు శక్యముగాని, గంభీరాః=లోతుగలవారై, ఏవమ్= ఇట్లు, చిత్రీయంతే = లోకమును ఆశ్చర్యపఱతురు.

అపిచ = మరియు -

ప్రతేతి :- ప్రతవిహతికరీభిః అప్సరోభిః సహ జగత్ నిగృహ్ణతః అస్య చేష్టితాని నమదమరశిరః కిరీటరోచి ర్ముకుళిత రోషతమాంసి గృణన్తి.

అర్థము :- ప్రత = తపోనియమమునకు, విహతి కరీభిః = విఘ్నమును కల్పించువారైన, అప్సరోభిః సహ = అప్సరసలతో సహ, జగత్ = ప్రపంచమును, నిగృహ్ణతః = నాశనము చేయబూనుకొన్న, అస్య = ఈ విశ్వామిత్రుని యొక్క, చేష్టితాని = చరితములను, నమత్ = నమస్కరించుచున్న, అమర = దేవతలయొక్క, శిరః = శిరస్సులయందలి, కిరీట = మకుటములయొక్క, రోచిః = కాంతులతో, ముకుళిత = చల్లార్చబడిన, రోష = కోపమనునట్టి, తమాంసి = చీకటులు కలవిగా, గృణన్తి = పెద్దలు చెప్పుచున్నారు. విశ్వామిత్రుని కోపమనునట్టి చీకటిని దేవతల కిరీట మణికాంతులు పోగొట్టిన వనుట దేవతల నమస్కృతులతో మునీశ్వరుడు శాంతించెనని భావము.

సమాసములు :- ప్రతస్య విహతిః - ప్రతవిహతిం కుర్వన్తి యాః - తాభిః. నమన్తశ్చ తే అమరాశ్చ - నమదమరాణాం శిరాంసి - శిరస్సు విద్యమానాః (శిరసాం వా) కిరీటాః - కిరీటానాం రోచింషి - రోచిర్భిః ముకుళితమ్ - రోషః ఏవ తమః - ముకుళితం రోషతమః యేషు - తాని.

సంధులు :- కరీభిః + అప్సరోభిః, రోచిః + ముకుళిత - రేఫాదేశ విసర్గ. నిగృహ్ణతః + గృణన్తి — సత్వాదేశవిసర్గ.

వామదేవః :- (సహర్షం దృష్ట్వా) కథమాగతో రామభద్రః. (మునింప్రతి) భగవన్.

బ్రహ్మజ్యోతిర్వివర్తస్య చతుర్ధా దేహయోగినః ।
ఋష్యశృంగచరోరంశః ప్రథమోఽయం మహాభుజః॥ 50

---

క్రియ :- గౄ శబ్దే (క్ర్యా - సేట్. శితి - ప్వాదీనాంహ్రస్వః) పరస్మై. లట్. ప్రథమ. గృణాతి - గృణీతః - గృణన్తి. గృణాసి - గృణీథః - గృణీథ. గృణామి - గృణీవః - గృణీమః.

ఛందస్సు :- పుష్పితాగ్రా వృత్తము. అయుజి నయుగరేఫతో యకారో యుజిచ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | న | న | ర | య | |
| | I I I | I I I | U I U | I U U | |
| | బ్రహ్మజ్ | హ్మజో | తిర్వి | వర్తస్య | |
| 2. | న | జ | జ | ర | గ |
| | I I I | I U I | I U I | U I U | U |
| | స్యచతు | ర్ధాదే | హయో | గినః | |
| 3. | న | న | ర | య | |
| | I I I | I I I | U I U | I U U | |
| | ఋష్యశృం | గచరో | రంశః | ప్రథమో | |
| 4. | న | జ | జ | ర | గ |
| | I I I | I U I | I U I | U I U | U |
| | ఽయంమ | హాభు | జః | | |

బేసి పాదములలో న-న-ర-య. సరిపాదములలో న-జ-జ-ర-గ.

కథమితి :- (సహర్షం = సంతోషముతో. దృష్ట్వా = చూచి) కథమ్ = ఎట్లూ ! రామభద్రః = రాముడు. ఆగతః = వచ్చినవాడు - రానే వచ్చెననుట (మునిం ప్రతి = ముని నుద్దేశించి) భగవన్ = మహాత్మా !

బ్రహ్మేతి :- బ్రహ్మజ్యోతిర్వివర్తస్య = వైదిక తేజస్సు యొక్క పరిణామరూపమై. చతుర్ధా = నాలుగు (విధములు) గా. దేహయోగినః = శరీరము

విశ్వామిత్రః :- (సహర్ష సంభ్రమమ్ విలోక్య) వామదేవ, కిముచ్యత అరణ్యకేషు కిమపి ప్రకృష్టతమం బ్రాహ్మణ్య మృష్య శృంగస్య. న కేవలమమునా వత్సేన బ్రహర్షిర్విభాండకః పుత్రవతాం ధురమారోపితః, దశరథోఽపి.

---

దాల్చినదైన. ఋష్యశృంగచరోః = ఋష్యశృంగుడు నిర్వహించిన పుత్రకామేష్టి యందలి హవ్యపాయసాన్నము యొక్క, ప్రథమః = మొదటిదైన, అంశః=భాగము, అయమ్ = ఈ, మహాభుజః = ఆజానుదృఢబాహువగు రామభద్రుడు. తపఃఫలమైన పాయసాన్నముయొక్క తొలిపాలు రూపుదాల్చి రాముడయ్యెననుట. (అథ చరుః పుమాన్ హవ్యాన్నభాండయోః)

సమాసములు :- బ్రహ్మ ఏవ (బ్రహ్మణః వా) జ్యోతిః – బ్రహ్మ జ్యోతిషః వివర్తః – తస్య. దేహస్య యోగః అస్యాస్తీతి – దేహయోగీ – తస్య. ఋష్యశృంగస్య చరుః – తస్య. మహాన్తౌ భుజౌ యస్య సః

సంధులు :- జ్యోతిస్ + వివర్త - రేఫాదేశవిసర్గ. ప్రథమః + అయమ్- ఉత్వాదేశవిసర్గ – ప్రథమో + అయమ్ – పూర్వరూపసంధి.

ఛందస్సు :- పథ్యావక్త్రము (చూ ప్రథమ – శ్లో. 8)

వామదేవేతి :- (సహర్ష సంభ్రమమ్=ఆనందాశ్చర్యములతో, విలోక్య= చూచి) వామదేవా ! అరణ్యకేషు = వనవాసులైన మునులయందు, ఋష్యశృంగస్య= ఋష్యశృంగునియొక్క, బ్రాహ్మణ్యమ్ = తపస్సు, కిమపి = ఏదో, ప్రకృష్టతమమ్ = సర్వోత్కృష్టము. కిముచ్యతే = ఏమి చెప్పబడును ! అది నాకును మాటలకందని గొప్ప తపస్సు అనుట. అమునా = ఈ ప్రసిద్ధుడయిన వత్సేన = పుత్రుడు-ఋష్య శృంగునితో. బ్రహ్మర్షిః = బ్రహ్మర్షియగు, విభాండకః న కేవలమ్=విభాండకుడు మాత్రమే కాదు, దశరథః అపి = దశరథుడుకూడ, పుత్రవతామ్ = పుత్రవంతుల యొక్క, ధురమ్ = అగ్రభాగమును, ఆరోపితః = పొందింపబడినాడు. ఋష్యశృంగుని జన్మవలన విభాండక మహర్షి పుత్రవంతుడను సత్కీర్తి పొందినాడు. అట్లే అతని తప శ్శక్తివలన పుత్రకామేష్టి సఫలమై దశరథుడు పుత్రవంతుడైనా డనుట.

దశరథః :- భగవన్, ఏవమైతత్.

యే మైత్రావరుణిం పురోహితవతో వంశే మనోర్జజ్ఞిరే
తాస్తా వైనయికీః క్రియా విదధిరే యేషాం చ యుష్మాదృశః।
తేషామంచలమేష తే దశరథః సంప్రత్యమీ యే పున
ర్జాతా స్తే ధ్రువమృష్యశృంగ తపసామైశ్వర్యమిక్ష్వాకవః॥ 51

---

భగవన్నితి :- భగవన్ = మహాత్మా ! ఏవమ్ ఏతత్ = ఇది సత్యమే.

యే ఇతి :- మైత్రావరుణిం పురోహితవతః మనోః వంశే యే జజ్ఞిరే, యేషాం యుష్మాదృశః, తాస్తాః వైనయికీః క్రియాః విదధిరే తేషామ్ అంచలమ్ ఏష తే దశరథః. పునః యే సంప్రతి జాతాః అమీ తే ఇక్ష్వాకవః ధ్రువమ్ ఋష్య శృంగస్య, తపసామ్ ఐశ్వర్యమ్. (శార్దూల విక్రీడితము)

అర్థము :- మైత్రావరుణిమ్ = వసిష్ఠుని, పురోహితవతః = పురోభాగము నందు ఉంచుకొన్నవారై (ఆతడు కులగురువుగా) మనోః=మనువుయొక్క, వంశే= వంశమునందు, యే = ఎవరు, జజ్ఞిరే = జన్మించిరో. యేషామ్ = ఏరాజులకు. యుష్మాదృశః = మీవంటి మహానుభావులు, తాఃతాః = ఆయా, వైనయికీః=వినయ ప్రయోజకములైన, క్రియాః = సంస్కార విశేషములను. విదధిరే = నిర్వహించిరో. తేషామ్ = ఆ రాజులకు, అంచలమ్ = చివరికొన. ఏషః = ఇతడే. తే = నీయొక్క (నీవాడనుట). దశరథః = దశరథుడు – నీ అనుగ్రహమునకు పాత్రుడ నైన నేనే ఆ రాజపరంపరలో చివరివాడ ననుట. పునః = మరి, యే = ఎవరు, సంప్రతి = ప్రస్తుతము జాతాః = జన్మించిరో, అమీ = ఈ, తే = ఆ. ఇక్ష్వాకవః= రాఘవులు – నా సంతానమగు ఈ రామాదులు, ధ్రువమ్ = నిశ్చయముగా. ఋష్య శృంగస్య = ఋష్యశృంగుని యొక్క. తపసామ్ = తపస్సులయొక్క. ఐశ్వ ర్యమ్ = సంపద (ఫలము).

విశేషములు :- పురోహితయతో అని పాఠాంతరము. పురోహిత శబ్దమునకు ణిచ్ చేసి శతృప్రత్యయము – పురో హితయతీతి పురోహితయన్–తస్య. పురః + ధా + క్తవతు – దధాతేర్హి రితి హిరాదేశః - పురోహితవత్ – తస్య. వినయః ప్రయోజనమాసా మితి – వైనయిక్యః – ప్రయోజనమితి ఠక్. టిడ్ఢాణఞితి జీప్ - తాః.

(రామలక్ష్మణావుపసర్పతః)

దశరథః :- వత్సౌ. భగవానేష నిశ్శేషభువనమహనీయో మహామునిః కౌశికః. ప్రణమ్యతామ్.

రామలక్ష్మణౌ :- (ఉపసృత్య) భగవన్విశ్వామిత్ర. సావిత్రౌ రామలక్ష్మణౌ పభివాదయేతే.

---

సంధులు :- పురోహితవతః + వంశే – ఉత్వాదేశవిసర్గ. మనోః + జజ్ఞిరే – రేఫాదేశవిసర్గ. తాః + తాః, జాతాః + తే – సాదేశవిసర్గ. తాః + వైనయికీః. క్రియాః + విదధిరే – విసర్గలోపసంధి. ఏషః + తే – తదేతద్విసర్గలోప.

క్రియ :- జనీ్ ప్రాదుర్భావే. ఆత్మనే లిట్. ప్రథమ
జజ్ఞే – జజ్ఞాతే – జజ్ఞిరే.

(రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఉపసర్పతః = సమీపింతురు)

వత్సావితి :- వత్సౌ = కుమారులారా ! భగవాన్ = మహాత్ముడగు. ఏషః = ఇతడు. నిశ్శేష = సమస్తములగు, భువన = లోకములకును, మహనీయః = పూజనీయుడు. మహామునిః = మహర్షి, కౌశికః = విశ్వామిత్రుడు. ప్రణమ్యతామ్= నమస్కరింపబడుగాక ! నమస్కరింపుడు అనుట.

భగవన్నితి :- (ఉపసృత్య = సమీపించి) భగవన్ = మహాత్మా. విశ్వామిత్ర = కౌశికా ! సావిత్రౌ = సూర్యవంశ ప్రభవులైన, రామలక్ష్మణౌ=రామ లక్ష్మణులు. అభివాదయేతే = నమస్కరించుచున్నారు – ఇదే మేము మ్రొక్కుచుంటి మనుట.

వత్సావితి :- వత్సౌ = నాయనలారా ! ఆయుష్మంతౌ = దీర్ఘాయుష్మంతు లరు. భూయాస్తామ్ = అగుదురు గాక ! (ఇతి = అని, భుజాభ్యామ్ = బాహువు లతో, గృహీత్వా = ఇరువురిని చెరియొకి వైపునకు తీసికొని. సరోమాంచమ్ = పుల కితుడై, సబహుమానమ్ = గౌరవముతో, రామమ్ = రామభద్రుని. నిర్వర్ణ్య = పరి శీలనగా చూచి, ఆత్మగతమ్ = తనలో)

విశ్వామిత్రః :- వత్సౌ, ఆయుష్మంతౌ భూయాస్తామ్. (ఇతి భుజాభ్యాం గృహీత్వా సరోమాంచం రామం నిర్వర్ణ్య చ సబహుమానమ్. ఆత్మగతమ్)

వసిష్ఠోక్తైర్మంత్రైర్దధతి జగతామాభ్యుదయికీం
ధురం సంప్రత్యేతే దినకరకులీనాః క్షితిభుజః ।
గృహే యేషాం రామాదిభిరపి కళాభిశ్చతసృభిః
స్వయం దేవో లక్ష్మీస్తనకలశవారీగజపతిః ॥ 52

---

వసిష్ఠేతి :- ఏతే దినకరకులీనాః క్షితిభుజః వసిష్ఠోక్తైః మంత్రైః జగతామ్ ఆభ్యుదయికీం ధురం దధతి. యేషాం గృహే, దేవః లక్ష్మీస్తనకలశ వారీ గజపతిః అపి స్వయం రామాదిభిః చతసృభిః కళాభిః (జాతః). శిఖరిణీవృత్తము.

అర్థము :- ఏతే = ఈ, దినకరకులీనాః = సూర్యవంశ సంభవులైన, క్షితిభుజః = దశరథాది మహారాజులు, వసిష్ఠోక్తైః = వసిష్ఠునిచే ఉపదేశింపబడిన, మంత్రైః = (సూక్తైః అని పాఠాంతరము నీతి వచనములతో) మంచి ఆలోచనలతో (మంత్రములతో) జగతామ్ = లోకములకు (ప్రజలకు). ఆభ్యుదయికీమ్ = శుభప్రదమైన, ధురమ్ = రాజపాలన భారమును, దధతి = వహించుచున్నారు — ఇంతవరకును ఈ వంశపు రాజులు అందరును జగన్మంగళకరముగా పరిపాలించిరనుట. అది కారణముగా — యేషామ్ = ఈ రాజులయొక్క, గృహే = వంశమునందు, దేవః = దేవుడైన, లక్ష్మీ....గజపతిః అపి, లక్ష్మీ = శ్రీదేవియొక్క, స్తన కలశ = కుచకుంభములనునట్టి, వారీ = ఆలానమునకు (బద్ధుడైన) (వారీ తు గజబంధనీ - అమరము) గజపతిః అపి = గజరాజయిన విష్ణుమూర్తి కూడ, స్వయమ్ = తనకు తానుగా, రామాదిభిః = రామ భరత లక్ష్మణ శత్రుఘ్న రూపమగు, చతసృభిః=నాలుగైన, కళాభిః= కళలతో (స్వాంశలతో) జాతః=జన్మించెను. విష్ణుమూర్తియే పాయసరూపమున ఆవిర్భవించెననియు దానిని దశరథుడు నాల్గుగా విభజించి కౌసల్యాదులకు పంచెననియు రామాయణము, సగభాగము [1/2] రాముడు, తక్కిన దానిలో సగము [1/4] లక్ష్మణుడు. తక్కిన దానిలో చెరిసగము [1/8 + 1/8] భరత శత్రుఘ్నులు.

అపిచ—

త్వం త్రాతః స్మృతవానృచో దశతయీ స్త్వత్ప్రీతయే యజ్వభిః
స్వాహాకారముపాహితం హవిరిహ త్రేతాగ్నిరాచామతి ।

---

సమాసములు :- వసిష్ఠేన ఉక్తాః — ఉక్తైః. దినం కరోతీతి — దినకరస్య కులమ్—కులే భవాః (కులాత్ ఖః) స్తనావేవ కలశౌ — స్తనకలశావేవ వారీ - వార్యాం గజపతిః — గజానాం పతిః.

సంధులు :- ఉక్తైః + మంత్రైః + దధతి—రేఫాదేశవిసర్గ. సంప్రతి + ఏతే - యణాదేశ. రామ + అది—సవర్ణదీర్ఘ. అదిభిః + అపి - రేఫాదేశవిసర్గ. కళాభిః + చతస్సృభిః — శాదేశవిసర్గసంధి. దేవః + లక్ష్మి — ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః. పరస్మై. లట్. ప్రథమ
దధాతి - ధత్తః - దధతి.

అలంకారము :- స్తనకలశములన్నచో రూపకము. స్తనకలశములనునట్టి వారి అన్నచో మరియొక రూపకము. ఇట్టిదానిని రూపక రూపకమనియు నందురు. విష్ణువునందు గజపతిత్వ మారోపింపబడినది. సాధ్యవసాయము. స్తనయుతురవారీ విజయతే అని పాఠాంతరము.

అపిచ = మరియు

త్వమితి :- త్వం త్రాతః దశతయీః ఋచః స్మృతవాన్. యజ్వభిః త్వత్ప్రీతయే స్వాహాకారమ్ ఇహ ఉపాహితం హవిః త్రేతాగ్నిః ఆచామతి. క్షీరోదజలే శయం త్వాం ప్రతిదినం హృష్టమ్ అవాలోకయన్. ఉద్వృత్తాః దశకంధరప్రభృతయః త్వయా నిగ్రహీతాః.

అర్థము :- త్వమ్ = నీవు. త్రాతః = అయ్యా, దశతయీః = పది మండలములుగానున్న. ఋచః = ఋక్కులను. స్మృతవాన్=ప్రకాశింపజేసితివి. సోమకాసురుని చంపి వేదములను తిరిగి ప్రకాశింపజేసితివనుట. యజ్వభిః=యాజకుల చేత. త్వత్ = నీయొక్క. ప్రీతయే = సంతోషమునకై. స్వాహాకారమ్ = స్వాహాశబ్దోచ్చారణపూర్వకముగా (స్వాహాకారం యస్మిన్ కర్మణి భవతి తత్తథా).

త్వాం క్షీరోదజలేశయం క్రతులిహః పృథ్వీమవాతీతర
న్నుద్వృత్తా దశకంధరప్రభృతయో నిగ్రాహితారస్త్వయా॥ 53

---

ఇహ = భూలోకమునందు. ఉపాహితమ్ = సమర్పింపబడిన. హవిః = హవిస్సును - పురోడాశాదికమును. త్రేతాగ్నిః = ఆహవనీయవహ్ని - గార్హపత్యాహవనీయ దక్షిణ భేదములతో నున్న అగ్నిత్రయము, ఆచామతి = స్వీకరించును. క్షీరోదజలేశయమ్ = క్షీరసముద్రమున శయనించియున్న. త్వామ్ = నిన్ను. క్రతులిహః = (హవిర్భోక్త లగు) దేవతలు. పృథ్వీమ్ = భూమినిగూర్చి (భూమికి) అవాతీతరన్ = అవతరింప జేసిరి. ప్రార్థించి అవతరింపజేసిరనుట. ఉద్వృత్తాః = ఉద్ధతులగు. దశకంధరప్రభృతయః = రావణుడు మొదలగువారు. త్వయా = నీచేత. నిగ్రాహితారః = సంహరింపబడవలసియుండిరి. (శార్దూలము).

సమాసములు :- దశసంఖ్యాతాః అవయవాః అసామితి దశతయ్యః - సంఖ్యాయా అవయవే తయప్ - టిడ్ఢాణఞితిఙీప్ - తాః. త్రేతాగ్ని అనునది కరికలభము వంటిది. త్రేత = అగ్ని. క్షీరోదస్యజలమ్ — జలే శేతే - అధికరణే శేతేః (అచ్)- జలే + శయః - శయవాస వాసిష్వకాలాత్ — అలుక్ - జలేశయః - తమ్. దశ సంఖ్యాకాః కంధరాః యస్య సః - దశకంధరః.

సంధులు :- తాః + తాః, దశతయీః + త్వత్. నిగ్రాహితారః + త్వయా - సాదేశవిసర్గ. ఋచః + దశ. ప్రభృతయః + నిగ్రా - ఉత్వాదేశవిసర్గ. హవిః + ఇహ. అగ్నిః + ఆచామతి - రేఫాదేశవిసర్గ. త్రేత + అగ్ని - సవర్ణ దీర్ఘ. అవాతీతరన్ + ఉద్వృత్తాః - అనునాసికద్విత్వ. ఉద్వృత్తాః + దశ - విసర్గ లోపసంధి.

క్రియ :- చము అదనే (ష్ఠివుక్లము చమాం శితీతి దీర్ఘః)
పరస్మై లట్. ప్రథమ
ఆచామతి - ఆచామతః - ఆచామన్తి (అ)
తౄ ప్లవన తరణయోః పరస్మై. లఙ్. ప్రథమ (అవ)
అవాతీతరత్ - అవాతీతరతామ్ - అవాతీతరన్
గ్రహ ఆదానే (ణిచ్) కర్మణి లుట్. ప్రథమ (ని)
గ్రాహితా - గ్రాహితారౌ - గ్రాహితారః.

వామదేవః :- (సస్మితమ్) వత్సౌ, అయ మత్రభవాన్ భవంతౌ నేతు మాగతః.

రామలక్ష్మణౌ :- యదభిరుచితం భవతే తాతాయ చ.

(దశరథస్తౌ సస్నేహమాదాయ భగవన్ కౌశిక ఇత్యర్ధోక్త్యా మన్యూత్పీడనిగృహ్యమానకంఠో వామదేవస్య ముఖమీక్షతే)

వామదేవః :- ఇమౌ తౌ రామలక్ష్మణౌ. (ఇత్యర్పయతి) (విశ్వామిత్రః సాదరం గృహ్ణాతి. నేపథ్యే శంఖధ్వనిః. వామదేవో నిమిత్త మనుమోదమానో దశరథ ముల్లాసయతి. పునర్నేపథ్యే—)

---

వత్సావితి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) వత్సౌ = నాయనలారా ! అత్రభవాన్ = పూజనీయుడైన. అయమ్ = ఈ విశ్వామిత్రుడు. భవంతౌ = మిమ్మిరువురిని. నేతుమ్ = కొనిపోవుటకు. ఆగతః = వచ్చినాడు.

యదితి :- భవతే = మీకును (కొఱకు) చ = మరియు. తాతాయ = తండ్రి కొఱకును. అభిరుచితమ్ యది = అంగీకారమైనచో — ఇష్టమైనచో.

(దశరథః = దశరథుడు. తౌ = రామలక్ష్మణులను. సస్నేహమ్ = ప్రీతితో. ఆదాయ = దగ్గరకు తీసికొని. భగవన్ = మహాత్మా ! కౌశిక = విశ్వామిత్రా ! — ఇతి = అని. అర్ధోక్త్యా = సగములోనే ఆగి. మన్యూత్పీడ = ఉద్రేకముతో. నిగృహ్యమాణకంఠః = పూడుకొనిపోయిన గొంతు కలవాడై. వామదేవస్య = వామదేవుని యొక్క. ముఖమ్ = మోమును. ఈక్షతే = చూచును)

ఇమావితి :- ఇమౌ = ఇదిగో. తౌ = ఆ. రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు. (ఇతి = అని. అర్పయతి = విశ్వామిత్రునికి అర్పించును.)

(విశ్వామిత్రః = విశ్వామిత్రుడు. సాదరమ్ = ఆదరముతో. గృహ్ణాతి = స్వీకరించును.)

(నేపథ్యే = తెరయందు. శంఖధ్వనిః = శంఖారావము)

(వామదేవః = వామదేవుడు. నిమిత్తమ్ = శుభశకునమును. అనుమోదమానః = అనుమోదించుచు. దశరథమ్ = దశరథుని. ఉల్లాసయతి = ఆనందింపజేయును. పునః = మరల. నేపథ్యే = తెరలో —)

(పునర్నేపథ్యే)

వైతాళికః :- సుఖాయ మాధ్యందినీ సంధ్యా భవతు దేవస్య. సంప్రతి హి -

కిరతి మిహిరే విష్వద్రీచః కరానతివామనీ
స్థలకమఠవద్దేహచ్ఛాయా జనస్య విచేష్టతే ।
గజపతిముఖోద్గీర్ణైరాప్యైరపి త్రసరేణుభిః
శిశిరమధురామేణాః కచ్ఛస్థలీమధిశేరతే॥ 54

---

సుఖాయేతి :— మాధ్యందినీ = మధ్యాహ్నకాలికమగు. సంధ్యా = సంధ్యాసమయము. దేవస్య = మహారాజునకు. సుఖాయ = సుఖమునకై. భవతు = అగుగాక; సుఖప్రదమగుగాక అనుట. సంప్రతి హి= ఇప్పుడేమో।

కిరతీతి :- మిహిరే విష్వద్రీచః కరాన్ కిరతి (సతి) జనస్య దేహచ్ఛాయా అతివామనీ స్థలకమఠవత్ విచేష్టతే. గజపతి ముఖోద్గీర్ణైః ఆప్యైః త్రసరేణుభిః అపి శిశిరమధురామ్ కచ్ఛస్థలీమ్ ఏణాః అధిశేరతే.

అర్థము :- మిహిరే = సూర్యుడు. విష్వద్రీచః = అన్నివైపులకును ప్రసరించునట్టి. కరాన్ = కిరణములను. కిరతి = వెదజల్లుచుండగా. జనస్య = ప్రజ యొక్క. దేహచ్ఛాయా = ఒడలినీడ. అతివామనీ = మిక్కిలికుఱుచదై. స్థలకమఠ వత్ = నేలమీద తాబేలువలె. విచేష్టతే = కదలుచున్నది (ముడుచుకొని యున్నది). ఏణాః అపి=హరిణాంగనలును. గజపతి=మదగజములయొక్క. ముఖ = తుండముల నుండి. ఉద్గీర్ణైః = చిమ్మబడినవైన. ఆప్యైః = జలమయమగు. త్రసరేణుభిః = తుంపురులతో. శిశిరమధురామ్ = చల్లనై ఆహ్లాదకరమైన. కచ్ఛస్థలీమ్ = చెమ్మగిల్లిన ప్రదేశమును - ఒడ్డును అనికాని ఇసుకతిన్నెపై అనికాని. అధిశేరతే = అధిష్ఠించి నిద్రించుచున్నవి. (మిహిరారుణ పూషణః, దేవానంచతి దేవద్ర్యఙ్విష్వ ఙ్విష్వ గంచతి – అమరము) శిశిరమసృణామ్ అని పాఠాంతరము - శీతలమై స్నిగ్ధమైన స్థలమునని అర్థము. (చిక్కణం మసృణం స్నిగ్ధమ్ - అమరము)

సమాసములు :- వామనస్య ఇయమ్ - వామనీ - వామనీమతిక్రాంతా - అతివామనీ (ఛాయా) అత్యాదయః క్రాంతాద్యర్థే ద్వితీయయా. స్థలే కమఠః—స్థలకమఠ

అపి చేదానీం పటీరతరుకోటరకుటీర మధ్యాసీనాః —
ప్రత్యక్షర స్రుతసుధారస నిర్విషాభి
రాశీర్భి రభ్యధికభూషితభోగభాజః ।

స్యైవ— తేనతుల్యమితి వతిప్రత్యయః. దేహస్య ఛాయా, గజానాం పతిః - గజపతీనాం ముఖేభ్యః ఉద్గీర్ణాః - తైః. ఆప్యైః = అమ్మయైః, "అప్యం చ" అని చాంద్రి వ్యాకరణ నిపాత. అప్సు(రం) యోగ్యాః - అప్యాః - తైః = వేసవియగుటచే పొంద దగిన శీకరములనుట. ఏకాచో నిత్యమని పాణినీయములో మయడంతమనియు. ...రా చ సా మదిరా చ (మస్పృణా చ) — తామ్.

సంధులు :- ముఖ + ఉత్ — గుణసంధి. ఉద్గీర్ణైః ఆప్యైః + అపి = రేఫాదేశవిసర్గ.

క్రియ :- చేష్టిఙ్ చేష్టాయామాత్మనే. లట్. ప్రథమ (వి)
చేష్టతే — చేష్టేతే — చేష్టంతే
శీఙ్ స్వప్నే. ఆత్మనే. లట్. ప్రథమ (అధి)
శేతే — శయాతే — శేరతే

ఛందస్సు :- హరిణీవృత్తము. నసమరసలాగః షడ్వేదైః హయైః హరిణీ మతా. [1—6—4]

| న | స | మ | ర | స | లగ |
|---|---|---|---|---|---|
| ।।। | ।।U | UUU | U।U | ।।U | ।U |
| ...ర | మస్పృణా | మేణాక | చ్ఛస్థరి | మదిశే | రతే |

అపిచేతి :- అపిచ = మరియు, ఇదానీమ్ = ఇప్పుడు, పటీరతరు = చందన వృక్షముయొక్క. కోటర = తొఱ్ఱ అనునట్టి, కుటీరమ్ = నివాసస్థానమును, అధ్యాసీనాః = ఆశ్రయించిన - ఉరగకన్యలని శ్లోకములోని కన్వయము.

ప్రత్యక్షరేతి :- ప్రత్యక్షర....నిర్విషాభిః ఆశీర్భిః అభ్యధికభూషిత భోగ భాజః, వంటుక విసివచ్చితరోమహర్ష స్వేదోర్మయః ఉరగేంద్రకన్యాః తవ గుణాన్ గాయన్తి.

పశుమేఢ్రః :- ఆర్య. శోభనం మన్త్రయసి. అన్యదపి కిమపి ప్రష్టుకామోఽస్మి. (అజ్జ. సోహణం మంతేసి. అణ్ణం వి కిం వి పుచ్ఛిదుకామో హ్మి.)

శునశ్శేఫః :- కిం తత్.

పశుమేఢ్రః :- సర్వథా నిగూఢమపి వానరాణాం షాడ్గుణ్యం కథమార్యేణ ప్రతిపన్నమ్. (సవ్వధా ణిగూఢం వి వాణరాణం ఛగ్గుణఅం కధం అజ్జేణ పడివణ్ణమ్.)

శునశ్శేఫః :- సఖే. సర్వమేత దయోధ్యాయాత్రాయాం సమాధిమయేన చక్షుషా సాక్షాత్కృత త్రిభువన వృత్తాంతస్య తాత

---

కింత్వితి :- కింతు = మరియు, దీక్షిష్యమాణాః = యజ్ఞదీక్షను చేకొను వారు, న ప్రవర్తన్తే ఇతి = కోపింపరని. రక్షితారమ్ = రక్షకుడైన, క్షత్రియమ్ = రాజకుమారుని, ఉపాదదతే = గురువుగారు ఆశ్రయించుచున్నారు – తీసికొనివచ్చిరనుట.

ఆర్యేతి :- ఆర్యః శోభనమ్ = చెప్పగా, మంత్రయసే = పల్కుచున్నావు. చెప్పదలచితివనుట. కిమపి = ఏదో, అన్యదపి = మరొకటి కూడ, ప్రష్టుకామః అస్మి = అడుగగోరుచుంటిని – అడుగవలెననుకొనుచున్నాననుట.

కిమ్ తత్ = ఏమది ?

సర్వథేతి :- సర్వథా = అన్నివిధములుగను, నిగూఢమ్ అపి = గుప్తమైనదయినను, వానరాణామ్ = వానరులయొక్క, షాడ్గుణ్యమ్ = మంత్రాంగము, ఆర్యేణ = నీచేత కథమ్ ప్రతిపన్నమ్ = ఎట్లు పొందబడినది – మంత్రసమాలోచనము రహస్యము గదా నీ కెట్లు తెలిసినదనుట.

సఖేతి :- సఖే = మిత్రమా ! అయోధ్యాయాత్రాయామ్ = అయోధ్యకు ప్రయాణము చేయు సమయమందు, సమాధిమయేన చక్షుషా = తపో దృష్టితో, సాక్షాత్కృత = దర్శించిన, భువన వృత్తాంతస్య = ప్రపంచగాధ కలవాడైన, తాత విశ్వామిత్రస్య = గురు విశ్వామిత్రుని యొక్క, ముఖాత్ = నోటి నుండి, ఏతత్ సర్వమ్ = ఈ వానరమంత్రాంగాది సమస్త విషయమును, అశ్రౌషమ్ = వినియుంటిని.

విశ్వామిత్రస్య ముఖాదశ్రౌషమ్. (సర్వతోఽవలోక్య)
అయే, ప్రాభాతికీ భువనస్య లక్ష్మీః. తథా హి—

ప్రత్యగ్రజ్వలితైః పతంగమణిభిర్నీరాజితా భానవః
సావిత్రాః కురువిందకందళరుచః ప్రాచీమలంకుర్వతే ।
ప్రౌఢధ్వాంతకరాళితస్య వపుషశ్ఛాయాచ్ఛలేన క్షణా
దప్రక్షాళిత నిర్మలం జగదహో నిర్మోకమున్ముంచతి॥ 10

---

విశ్వామిత్రులు దివ్యదృష్టితోచూచి చెప్పగా వింటిననుట. (సర్వతః = అన్నివైపులకును. అవలోక్య = చూచి) అయే = అహో ၊ భువనస్య = లోకముయొక్క. ప్రాభాతికీ లక్ష్మీః = ప్రభాత శోభ। ప్రొద్దుపొడుపుటంద మాశ్చర్యజనకముగా నున్నదనుట. తథాహి = అట్లేకదా ।—

ప్రత్యగ్రేతి :- ప్రత్యగ్రజ్వలితైః పతంగమణిభిః నీరాజితాః సావిత్రాః భానవః కురువింద కందళరుచః ప్రాచీమ్ అలంకుర్వతే అహో, అప్రక్షాళిత నిర్మలం జగత్ ప్రౌఢధ్వాంత కరాళితస్య వపుషః ఛాయాచ్ఛలేన నిర్మోకమ్ క్షణాత్ ఉన్ముంచతి.

అర్థము :- ప్రత్యగ్రజ్వలితైః = క్రొత్తగా ఉద్దీప్తములైన. పతంగ మణిభిః = సూర్యకాంత మణులతో. నీరాజితాః = ఉత్తేజితములై — సూర్యకాంతములు నీరాజనము పట్టగా. కురువింద కందళరుచః = పగడపు మొలకల వెలుగులు కలవై. సావిత్రాః = సూర్య సంబంధులగు. భానవః = కిరణములు, ప్రాచీమ్ = తూర్పు దిక్కును. అలంకుర్వతే = భూషించుచున్నవి. అహో = ఆశ్చర్యము; అప్రక్షాళిత = ప్రక్షాళితము కాకపోయినప్పటికిని. నిర్మలమ్ = నిర్మలినముగానున్న (ప్రసన్నముగానున్న) జగత్ = ఈ ప్రపంచము. ప్రౌఢ = దట్టమైన. ధ్వాంత = చీకటితో. కరాళితస్య = అచ్ఛాదితమైన (పులుమబడిన). వపుషః = శరీరముయొక్క నిర్మోకమ్ = కంచుకమును. ఛాయాచ్ఛలేన = (తొలగిపోవుచున్న) నీడ అను వంకతో (మిషతో) క్షణాత్ = క్షణకాలములో, ఉన్ముంచతి = విడుచుచున్నది. (కందళం స్యాత్పల్లవే చ నవాంకురే — విశ్వః. కురువిందః పద్మరాగః—ధరణిః పతంగః శలభే శాలిప్రభేదే విహగే రవౌ — మేదినీ) శార్దూలవిక్రీడితము.

అపిచ —

---

విశేషములు :- అప్రకాశిత నిర్మలం నిర్మోకమ్ అని కొందరును, ఛాయాచ్ఛలేన ప్రౌఢధ్వాంతలే కరాళితస్య వపుషః నిర్మోకమ్ అనికొందరును అన్వయించిరి. ఛాయామిషతో లోకము నిర్మోకము విడిచినట్లు నిర్మలముగా నున్నదనుట.

సమాసములు :- ప్రత్యగ్రం జ్వలితాః — తైః కురువిందస్య కందలమ్ కురువింద కందళస్య రుచయః ఇవ రుచయః యేషాం తే ప్రౌఢం చ తత్ ధ్వాంతం చ— ప్రౌఢధ్వాంతేన కరాళితమ్ - తస్య. అప్రకాశితం సన్నిర్మలమ్.

సంధులు :- ప్రతి + అగ్ర - యణాదేశ. మణిభిః + సిరాజితాః — రేఫా దేశ విసర్గ సంధి. సిరాజితాః + ఖనవః - విసర్గలోప. వపుషః + ఛాయా — శాదేశ విసర్గ. ఛాయా + ఛలేన — తుగాగమ సంధి. ఉత్ + ముంచతి - అనునాసికాదేశ సంధి.

క్రియ :- డుకృఞ్ కరణే, ఆత్మనే. లట్ ప్రథమ

అలంకురుతే - అలంకుర్వాతే - అలంకుర్వతే

ముచ్లృ మోక్షణే. పరస్మై. లట్. ప్రథమ (ఉత్)

ముంచతి — ముంచతః — ముంచన్తి

అలంకారము :- పూర్వార్థమునందు పతంగమణిభిర్నిరాజితాః అనుచో హేతూత్ప్రేక్షయు, కురువింద కందళరుచః అనుచో రూపకము నున్నవి. ఉత్తరార్ధము నందు ఛాయాచ్ఛలముతో నిర్మోకమును విడుచుట కైతవాపహ్నుతి. కైతవాపహ్నుతి ర్వ్యక్తౌ వ్యాజాద్యైర్నిహ్నుతేః పదైః నిర్యాంతి స్మరనారాచాః కాంతాదృక్పాతకైతవాత్. అప్రకాశిత నిర్మలమ్ అనుచోట నిర్మలత్వము ప్రకాశితమను కారణములేకున్నను సంభవించుటచే విభావన అనవచ్చును, విభావనా వినాపి స్యాత్ కారణం కార్య జన్మ చేత్ అప్యలాక్షారసాసిక్తం రక్తం త్వచ్చరణ ద్వయమ్.

అపిచ = మరియు

పీత్వేతి :- కమలకుడ్మల కుక్షికోశాః దోషాతనీం తిమిరవృష్టిం భృశం పీత్వా అథ స్ఫుటంతః నిర్యన్మధుప్రతతి కదంబ మిషాత్ కారణగుణాన్ విభ్రంతి ఇవ మౌక్తికాని వమన్తి.

పీత్వా భృశం కమలకుడ్మల శుక్తికోశా
దోషాతనీం తిమిరవృష్టిమథ స్ఫుటన్తః ।
నిర్యన్మధువ్రతకదంబమిషాద్వమంతి
బిభ్రంతి కారణగుణానివ మౌక్తికాని॥ 11

అర్థము :- కమలకుడ్మల=తామరమొగ్గలనునట్టి శుక్తికోశాః=ముత్తెపు చిప్పలు (కర్త). దోషాతనీమ్ = రాత్రిసమయ సంజాతమగు. తిమిరవృష్టిమ్ = చీకటి అను వానచినుకులను. భృశమ్ = అధికముగా. పీత్వా = త్రాగి. అథ = అటుపై నిప్పుడు. స్ఫుటంతః = వికసించుచున్నవై. నిర్యత్ = బయల్వెడలుచున్న. మధువ్రత కదంబమిషాత్ = తుమ్మెదలగుంపు అను వంకతో. కారణగుణాన్ = కారణమునందలి (చీకటి) లక్షణములను (నల్లదనము). బిభ్రంతి ఇవ = ధరించుచున్నవన్నట్లున్న. మౌక్తికాని = ముత్తెములను. వమన్తి = వెలిగ్రక్కుచున్నవి. (కుడ్మలో ముకులే ఽస్త్రియామ్ - అమరము. దోషా రాత్రౌ భుజేఽపి చ-విశ్వః) నీలముక్తాఫలముల వలె తుమ్మెదలు వెల్వడుచున్నవనుట.

విశేషములు :- కారణ గుణములు కార్యమునందు సంక్రమించునని న్యాయము. కారణగుణా హి కార్యే గుణమారభంతే. తిమిర వృష్టిపానము కారణము. మధువ్రతరూపమున ముత్తెములను వెల్వరించుట కార్యము. కావున నీలముక్తాఫలము లైనవి. బిభ్రత్ - అనుదానికి వా నపుంసకస్యేత్యాది సూత్రముచే వికల్పముగా నుమ్. బిభ్రన్తి. దోషా శబ్దమునకు (అవ్యయము) సాయంచిరేత్యాది సూత్రముచే ట్యుప్రత్యయము తుడాగమము టిడ్ఢాణఞ్ అని ఙీప్ - దోషాతనీ. నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది గౌణ వృత్తివ్యపాశ్రయ మతిసుందర మన్యత్ర గ్రామ్య కక్ష్యాం విగాహతే - దండి.

సమాసములు :- కమలానాం కుడ్మలాః - కమల కుడ్మలా ఏవ శుక్తి కోశాః. నిర్యంతశ్చ తే మధువ్రతాశ్చ - నిర్యన్మధువ్రతానాం కదంబః - కదంబస్య మిషాత్.

సంధులు :- కోశాః + దోషా - విసర్గలోప. నిర్యత్ + మధు - అను నాసికాదేశ.

క్రియ :- టువము ఉద్గిరణే. పరస్మై. లట్. ప్రథమ
వమతి - వమతః - వమన్తి

అపిచ —

వికసిత సంకుచిత పునర్వికస్వరేష్వంబుజేషు దుర్లక్ష్యాః ।
కలికాః కథయతి నూతనవికాసినీర్మధులిహామర్ఘః ॥ 12

---

అలంకారము :- రేపుల పద్మములందు శక్తికోశత్వము. తిమిరము నందు వృష్టిత్వము ఆరోపింపబడుట తాద్రూప్యరూపకము — అది అనుభయము. మధు వ్రత మిషతో పౌర్త్రికములు వెల్వడుచున్నవనుట కైతవాపహ్నుతి. దానికి కారణ గుణాన్ బిభ్రంతిప అని హేతు పుత్ప్రేక్షింపబడినది.

అపిచ = మరియు

వికసితేతి :- వికసిత = నిన్నటి ఉదయము వికసించినవై, సంకుచిత= నిన్నటి సాయంతనము ముడుచుకొన్నవై. పునర్వికస్వరేషు = ఇప్పుడు మరల విక సించుచున్న. అంబుజేషు = పద్మములయందు, దుర్లక్ష్యాః = గుర్తింపబడనివై, నూతన వికాసినీః = క్రొత్తగా ప్రప్రథమముగా వికసించుచున్న. కలికాః = తామర మొగ్గలను (కర్మ). మధులిహామ్ = తుమ్మెదల యొక్క. అర్ఘః = ఆదరాతిశయము (కర్త) (పూజాయాం మూల్యేఽపి భవేదర్ఘః కథాదరే - విశ్వః) కథయతి = చెప్పుచున్నది— గుర్తింపజేయుచున్నది. క్రొత్తగా వికసించు పద్మములయందు మకరంద మధికముగా నుండుటచే తుమ్మెదలు అధికముగా చేరును. అట్టి ఆదరము వలన క్రొత్త మొగ్గలు గుర్తింపబడుచున్నవనుట. (అర్యావృత్తము-మూ-ప్రథమ—10) మధులిహాం మోఘః అని పాఠాంతరము. ఓఘ మనగా సమూహము. అన్వయము మారదు.

సమాసములు :- వికసితాని చ తాని సంకుచితాని - వికసిత సంకుచితాని చ తాని పునర్వికస్వరాణి - తేషు. నూతనం వికాసశీల మస్త్యస్యా ఇతి - నూతన వికాసినీ—తాః. మధు లేఢి ఇతి - మధులిట్ — తేషామ్.

సంధులు :- వికస్వరేషు + అంబుజేషు—యణాదేశ సంధి. వికాసినీః + మధు - రేఫాదేశ విసర్గ సంధి.

క్రియ :— కథ వాక్య ప్రబంధే - (చురాది ణిచ్). పరస్మై. లట్. ప్రథమ
కథయతి - కథయతః - కథయన్తి

(ఆదిత్యమండలం నిర్వర్ణ్య)

కటుభిరపి కఠోరచక్రవాకోత్కర విరహజ్వర శాంతి శీతవీర్యైః।
తిమిరహతమయం మహోభిరంజన్ జయతి జగన్నయనౌఘ
ముష్ణభానుః॥ 13

---

(ఆదిత్య మండలమ్ = సూర్యబింబమును, నిర్వర్ణ్య = నిరూపించి)

కటుభిరితి :- కటుభిః అపి = తీక్ష్ణములే అయినప్పటికిని. కఠోర = భరింపరాని. చక్రవాకోత్కర = జక్కవ గుంపుల యొక్క. విరహ జ్వర = వియోగ తాపమును. శాంతి = ఉపశమింపజేయుటయందు (పోగొట్టుటయందు). శీతవీర్యైః = చల్లని శక్తి కలవైన. మహోభిః = కిరణములతో (మహః ఉత్సవ తేజసోః - విశ్వః) తిమిరహతమ్ = చీకటిచే బాధితమైన (తిమిరమను నేత్రరోగముతో కూడిన అనియు) జగన్నయనౌఘమ్ = ప్రజల నేత్ర సమూహమును. అంజన్ = అలంకరించుచు (ప్రకాశింప జేయుచు). అయమ్ = ఈ. ఉష్ణభానుః = సూర్యుడు. జయతి = వృద్ధి పొందుచున్నాడు. తిమిరభరమ్. తిమిరమయమ్ అని పాఠాంతరములున్నవి.

సమాసములు :- చక్రవాకానాముత్కరః — ఉత్కరస్య విరహజ్వరః — కఠోరశ్చాసౌ చక్రవాకోత్కర విరహ జ్వరః - జ్వరస్య శాంతిః - శాంతౌ శీతః వీర్యః యేషాం తైః. తిమిరేణ హతమ్. నయనానామోఘః - జగతః నయనౌఘః - తమ్. ఉష్ణాః భానవః యస్య సః.

సంధులు :- కటుభిః + అపి. మహోభిః + అంజన్ - రేఫాదేశవిసర్గ సంధులు. చక్రవాక + ఉత్కర - గుణసంధి. జగత్ + నయన - అనునాసికాదేశ. నయన + ఓఘ - వృద్ధి సంధి.

క్రియ :— జి జయే-ఉత్కర్షే చ. పరస్మై. లట్. ప్రథమ
జయతి - జయతః - జయన్తి

ఛందస్సు :- పుష్పితాగ్రా వృత్తము. అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.

అలంకారము :- తీక్ష్ణములే అయినను శీతవీర్యైః అనుటలో విరోధాభాస మున్నది. శీతవీర్య. తిమిరహత. అంజన్. నయనౌఘ పదములచే వైద్య

తదనుజానీహి మాం సమిదాహరణాయ.

పశుమేఢ్రః :- అహమపి క్షత్రియకుమారయోర్దర్శన ఉత్కంఠితోఽస్మి. తత్కథయ కుత్ర ప్రేక్షే. (అహం వి ఖత్తిఅకుమారాణం దంసణే ఉక్కంఠిదోమ్హి. తా కద్దేహి కహి పేక్ఖామి.)

శునశ్శేఫః :- (విహస్య) నన్వేతావేవ యజ్ఞవాటముత్తరేణ విహారభూమిషు క్రీడతః. తదుపేత్య నిశ్శంకమవలోకయ. (ఇతి నిష్క్రాంతౌ)

—॰ విష్కంభకః ॰—

---

విషయ మొకటి అప్రస్తుతముగా స్ఫురించుచున్నది. చక్షుష్యా పిప్పలీ శీతవీర్యా చ అని నేత్రరోగమునకు చికిత్స. కావున నిందు సమాసోక్తి. సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్. అయమైంద్రీముఖం పశ్య రక్తశ్చుంబతి చంద్రమాః.

తదితి :- తత్ = అందుచే (సూర్యోదయ మగుటచే). సమిదాహరణాయ సమిధలు తెచ్చుట కొఱకు. మామ్ = నన్ను. అనుజానీహి = అనుమతింపుము — పోనిమ్మనుట.

అహమితి :- అహమపి = నేనును. క్షత్రియకుమారయోః = రామ లక్ష్మణులయొక్క. దర్శనే = సందర్శనమునందు. ఉత్కంఠితః అస్మి = ఉత్సుకుడ నైయుంటిని. తత్ = అందుచే. కథయ = తెల్పుము. కుత్ర = ఎచ్చట. ప్రేక్షే = వారిని చూడగలను — వారెక్కడున్నారనుట.

నన్వితి :- (విహస్య = నవ్వి) ననుఇదిగోచూడు !. యజ్ఞవాటమ్ ఉత్తరేణ=యజ్ఞముజరుగు స్థలమునకు ఉత్తరముగానున్న (వాటో మార్గే వృత్తిస్థానే- విశ్వః. ఏనపా ద్వితీయా అని షష్ఠ్యర్థమున ద్వితీయ) విహారభూమిషు = క్రీడాస్థల ములయందు (విశ్వామిత్రుని ఆశ్రమము గురుకులమగుట ఛాత్రులకు క్రీడాస్థలము ఉండును) ఏతౌ = రామలక్ష్మణులు. క్రీడతః ఏవ=ఇదే క్రీడించుచున్నారు. విహరించు చున్నారనుట. తత్ = అందుచేత. ఉపేత్య = సమీపించి। నిశ్శంకమ్ = నిర్భయ ముగా — మునుపటి జంకు విడిచి అనుట. అవలోకయ = చూడుము. (ఇతి = అని. నిష్క్రాంతౌ = శునశ్శేఫ పశుమేఢ్రులు నిష్క్రమింతురు)

(తతః ప్రవిశతో రామలక్ష్మణౌ)

రామః :- అహో విచిత్రమిదమాయతనం సిద్ధాశ్రమపదం నామ భగవతో గాధినందనస్య.

తత్తాదృక్ తృణపూలకోపనయన క్లేశాచ్చిరద్వేషిభి
ర్మేధ్యా వత్సతరీ విహాస్య వటుభిః సోల్లుంఠమాలభ్యతే ।

---

విష్కంభకము :- వృత్తవర్తిష్యమాణ కథాసూచకమై బంధుత్వములేని మధ్యపాత్రలతో ప్రయోజితమైనచో అది శుద్ధ విష్కంభము. మధ్యమాధమపాత్రలతో నడిచినచో అది మిశ్రము. భరతుడు - వృత్తవర్తిష్యమాణానాం కథాంగానాం నివేదకః సంక్షేపోక్తిస్సవిష్కంభో మధ్యపాత్ర ప్రయోజితః. దతోఽపి స్వేచ్ఛయా ప్రాప్తః సంబంధో నోభయోరపి విష్కంభకస్స విజ్ఞేయః కథార్థస్యాపి సూచకః. విష్కంభకో ద్విధా జ్ఞేయః శుద్ధస్సంకీర్ణ ఏవ చ. శుద్ధో మధ్యమపాత్రేణ సంకీర్ణో మధ్యమాధమైః. సంస్కృతోక్త్యా చ శుద్ధః స్యాత్సంకీర్ణో నీచభాషయా. కావున ఇది మిశ్రవిష్కంభము. పాత్రల ప్రవేశము సూచనలేకుండ జరుగరాదని సంగీత కల్పతరు నియమము- అసూచితస్య పాత్రస్య ప్రవేశో నైవ యుజ్యతే తతో విష్కంభకేనాస్య సూచనం వచయే ద్బుధః. నన్వేతౌ అని రామలక్ష్మణ ప్రవేశము సూచింపబడినది.

(తతః = అంతట. రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు. ప్రవిశతః = ప్రవేశింతురు)

అహో ఇతి :- అహో! భగవతః = మహానుభావుడగు. గాధినందనస్య = విశ్వామిత్రునియొక్క. ఇదమ్ = ఈ. సిద్ధాశ్రమపదమ్ నామ = సిద్ధాశ్రమము అను పేరు గల. ఆయతనమ్ = ఆశ్రమము. విచిత్రమ్ = ఆశ్చర్య జనకము ।

తత్తాదృగితి :- తత్తాదృక్ తృణపూలకోపనయన క్లేశాత్ చిరద్వేషిభిః వటుభిః సోల్లుఠం విహాస్య మేధ్యా వత్సతరీ ఆలభ్యతే. అపి మధుపర్క పావక సురభిః ప్రాగ్వంశజన్మా ఏష అనిలః అతిథిభిః సోచ్ఛ్వసనాసాపుటైః ఆపీతః ప్రతమాభవతి.

అర్థము :- తత్తాదృక్ = అటువంటి (పెద్ద పెద్దవగు) తృణపూలక = గడ్డి మోపులను. ఉపనయన = తెచ్చుట యందలి. క్లేశాత్ = కష్టము వలన. చిరద్వేషిభిః = చాల కాలము నుండి ద్వేషించుచున్నవారైన. వటుభిః = విద్యార్థులతో

అప్యేష ప్రతియాతి పశ్యతిథిభిః సోచ్ఛ్వాసనాసాపుటై
రాపీతో మధుపర్కపాకసురభిః ప్రాగ్వంశజన్మానిలః॥ 14

---

(పశువులను సేవలు చేయుటకై ఎప్పుడు వదలునా అని ఎదురుచూచుచున్న శిష్యులనుట). సోల్లుంఠమ్ = ఎగతాళిగా. విహస్య = నవ్వి. మేధ్యా = పవిత్రమైన. వత్సతరీ = రెండు సంవత్సరముల వయస్సుగల పెయ్య కూడ. ఆలభ్యతే = చంపబడుచున్నది. (మహోక్షం వా వత్సతరీం వా శ్రోత్రియాయోపకల్పయేత్ అని స్మృతి) అపి = మరియు. మధుపర్కపాక = మధుపర్కమును వండుటచే. సురభిః = సుగంధితమైనదియు. ప్రాగ్వంశ జన్మా = హవిర్గేహము నుండి (పాకశాల) వెల్వడుచున్నదియునగు. ఏషః = ఈ. అనిలః = వాయువు. సోచ్ఛ్వాస = ఎగపీల్చుచున్న. నాసాపుటైః = ముక్కు పుటములతో. అతిథిభిః = అతిథులచే. ఆపీతః = పూర్తిగా ఆఘ్రాణింపబడినదై. ప్రతియాతి = దిక్కులకు పోవుచున్నది — వ్యాపించుచున్నదనుట. అతిథులు ఆ సుగంధ వాయువును పీల్చి వేయుచున్నారనుట. (శార్దూలము).

విశేషములు :- వత్సతరీ - ద్విహాయనీ గౌర్వత్సతరీ — అని వేదభాష్యమున చెప్పబడిన తీర్పు (పారిభాషికత్వము). వత్సోక్షాశ్వర్షభేభ్యస్తనుత్వే అను సూత్రముచే ష్టరచ్ ప్రత్యయము. షిద్గౌరాదిభ్యశ్చ అని జీప్ ప్రత్యయము. ఆలంభ పింఛ పశోః మారణాలంభపి అపి—అని అమరము. ప్రాగ్వంశః ప్రాగ్ఘవిర్గేహాత్ - అమరము. గంధవాహానిలాశుగాః. మేధ్యం పూతే మేధసే చ — ధరణి.

సమాసములు :- తత్తద్వ్యక్ చ తృణపూలకం చ - తృణ పూలకస్య ఉపనయనమ్—తః ఏతయోః ద్వంద్వః - తస్మాత్. సోచ్ఛ్వాసాశ్చ తే నాసాపుటాశ్చ - తైః.

సంధులు:- పూలక + ఉపనయనేన. స + ఉల్లుంఠమ్. స + ఉచ్ఛ్వాసమ్- గుణ సంధులు. ష్ఠరచ్ + చర - ఛత్వసంధి. ఉత్ + శ్వాసమ్ — ఛత్వ చాదేశ సంధులు. ద్విషిఃః + మేధ్యా. పుటైః + ఆపీతః — రేఫాదేశ విసర్గ. ఉత్ + లుంఠమ్ — లాదేశ సంధి. అపి + ఏషః. భవతి + అతిథిభిః — యణాదేశ. ఆపీతః + మధు — ఉత్వాదేశ విసర్గ. ఏషః + ప్రతను — తదేతద్విసర్గలోప సంధి.

లక్ష్మణః :- ఆర్య. కిలాత్రైవ

దేవః కౌస్తుభ కింజల్క-నీలోత్పల మసౌ హరిః ।
స్వయం కిమపి తత్తేపే తపః కపటవామనః॥ 15

---

క్రియ :- లభిజ్ శబ్దే అవస్రంసనే చ (కర్మణి) లట్. ప్రథమ. (ఆజ్ పూర్వో లభిర్వధార్థః) ఆలభ్యతే - ఆలభ్యేతే - ఆలభ్యన్తే.

ఆర్యేతి :- ఆర్యా। అత్రైవ కిల = ఈ సిద్ధాశ్రమము నందే కదా।

దేవ ఇతి :- కౌస్తుభ కింజల్క- నీలోత్పలమ్ అసౌ దేవః హరిః కపట వామనః (సన్) కిమపి తత్ తపః స్వయం తేపే.

అర్థము:- కౌస్తుభ = కౌస్తుభ మణి అనునట్టి. కింజల్క- = కేసరముతో కూడిన. నీలోత్పలమ్ = నల్లకలువవంటి వాడైన. అసౌ = ఈ. దేవః=పరమాత్మ యగు. హరిః = శ్రీకృష్ణుడు. కపట వామనః (సన్) = మాయావటుడై (బలిచక్రవర్తి కథ). కిమపి = అనిర్వచనీయమగు. తత్ = ఆ. తపః = తపస్సును. స్వయమ్ = తనకు తానుగా (మునీశ్వరులందరును వానిని గూర్చి తపస్సులు చేయుచుండగా శ్రీహరి తాను తపస్సు చేయుట స్వయమ్ కిమపి పదములలోని సూచన). తేపే = (తపస్సు) చేసెను.

సమాసములు:- కౌస్తుభః ఏవ కింజల్కః (కింజల్కః కేసరోఽస్త్రియామ్- అమరము) యస్య తత్ - కౌస్తుభ కింజల్కం చ తన్నీలోత్పల మివ. కపటశ్చాసౌ వామనశ్చ. (ఖర్వో హ్రస్వశ్చ వామనః - అమరము).

క్రియ :- తప సంతాపే (తపః తపః కర్మ కస్యైవేతి కర్మవద్భావాదాత్మనే పదమ్ - ఇష్టార్థకల్పవల్లి) ఆత్మనే. లిట్. ప్రథమ.

తేపే - తేపాతే - తేపిరే

ఛందస్సు :- పథ్యావక్త్రము (చూ. ప్రథమ - 8)

ఇత్థమితి :- ఏతత్ = ఈ. మహాతీర్థమ్=పుణ్యస్థలమును. అధ్యాసీనాః= అధివసించినవారైన (యదధ్యాసితం మహద్భిస్తద్ధి తీర్థం ప్రచక్షతే - స్మృతి. తీర్థం

ఇత్థమేతన్మహాతీర్థమధ్యాసీనా ద్విజాతయః ।
అకుతోభయసంచారాః షట్కర్మాణి ప్రయుంజతే॥ 16

(అన్యతశ్చ దృష్ట్వా) అర్థ । –
పశ్యైతే పశుబంధవేదివలయైరౌదుంబరీదంతురైః
నిత్యవ్యంజిత గృహ్యతంత్రవిధయో రమ్యా గృహస్థాశ్రమాః ।

---

శాస్త్రి పురే క్షేత్రే – విశ్వః). ద్విజాతయః = విప్రులు, అకుతోభయసంచారాః = నిర్భయమగు సంచారములవారై, ఇత్థమ్ = ఈ కన్పించు విధముగా, షట్కర్మాణి= షట్కర్మలను, ప్రయుంజతే = నిర్వహించుకొనుచున్నారు, (పథ్యావక్త్రము)

విశేషములు :- దానమధ్యాపనం పితృతర్పణాతిథిపూజనమ్ హోమో బలిశ్చ విప్రాణాం షట్కర్మాణి దినే దినే. మరికొందరు యజన – యాజన – అధ్యయన – అధ్యాపన – దాన – ప్రతిగ్రహములను షట్కర్మలనిరి.

సమాసములు :- మహచ్చ తత్తీర్థం చ - (అన్మహత ఇత్యాత్వమ్ - మహా) కుతోఽపి న విద్యతే భయ మిత్యకుతోభయమ్ - అకుతోభయేన సంచారో యేషాం తే. (మయూరవ్యంసకాది నిపాత) షట్చ తాని కర్మాణి చ.

సంధులు :- ఏతత్ + మహా - అనునాసికాదేశ. అధ్యాసీనాః + ద్విజాతయః – విసర్గలోపసంధి. అకుతః + భయ - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- యుజిర్ యోగే - ఆత్మనే (ప్రోపాభ్యాం యుజేః) లట్, ప్రథమ

ప్రయుఙ్క్తే – ప్రయుంజాతే – ప్రయుంజతే

(అన్యతశ్చ = మరొకవైపునకు దృష్ట్వా = చూచి) అర్థ ।

పశ్యేతి :- పశుబంధ వేది వలయైః ఔదుంబరీ దంతురైః నిత్యవ్యంజిత గృహ్య తంత్ర విధయః ఏతే గృహస్థాశ్రమాః రమ్యాః (సన్తి) పశ్య. యత్ర ప్రచలిత స్వారాజ్య సింహాసనాః అమీ గృహమేధినః వైతానేషు కృపీట యోనిషు పురోడాశం వషట్కుర్వతే (తాన్ గృహస్థాశ్రమాన్ పశ్య.)

అర్థము :- పశుబంధ = పశుబంధమను పేరుగల యాగ విశేషమునకై నిర్మింపబడిన, వేది వలయైః=వేదికామండలములతోను - వృత్తాకారములో నేర్పరుప

యత్రామీ గృహమేధినః ప్రచలితస్వారాజ్యసింహాసనా
వైతానేషు కృపీటయోనిషు పురోడాశం వషట్కుర్వతే॥ 17

బడిన యజ్ఞ వేదికలనుట (వేదిః పరిష్కృతా భూమిః — అమరము). ఔదుంబరీ దంతురైః = ఉదుంబర వృక్ష సంబంధులగు మేడి చెట్టు గొయ్యల వల్లనైన ఎత్తు పల్లములతోను — గుంపులుగా పడవేసిన మేడి చెట్టు శాఖలతోననిగాని. నిత్య = నిత్య కృత్యముగా జరుగునవని. వ్యంజిత = సూచింపబడిన. గృహ్య తంత్ర విధయః = గృహ్య సిద్ధాంతము ననుసరించి నిర్వహింపబడు శ్రౌత కర్మలు కలవై - (అచ్చట నిత్యమును గృహ్య తంత్ర విధులు జరుగుచున్నవని వేది వలయములతోను ఔదుంబరీ శాఖలతోను సూచింపబడుచున్న దనుట) - ఏతే = ఇవే. గృహాస్థాశ్రమాః = గృహ మేధుల ఆవాసములు. రమ్యాః = మనోజ్ఞములుగా. సన్తి = ఉన్నవి. పశ్య = చూడుము. యత్ర = ఏ గృహాస్థాశ్రమములయందు. ప్రచలిత = కదల్పబడిన. స్వారాజ్య సింహాసనాః = దేవలోక సింహాసనము కలవారై - దేవతల ఆధిపత్యము నకు బెదురు పుట్టించిన వారనుట. అమీ = ఈ. గృహ మేధినః = ధర్మపత్నీ సమే తులు. వైతానేషు = యజ్ఞ సంబంధులగు (వితానో యజ్ఞ విస్తారోల్లోచేషు క్రతు విస్తృతౌ విశ్వ) కృపీట యోనిషు = అగ్నుల యందు (కృపీట యోనిర్జ్వలనః — అమరము) అగ్నేరాపః అని శ్రుతి). పురోడాశమ్ = పురోడాశమును. వషట్కుర్వతే = హోమము చేయుచున్నారో (హుతం త్రిషు వషట్కృతే యుత్యమరః). తాన్ = ఆ. గృహస్థా శ్రమాన్ = గృహస్థాశ్రమములను. పశ్య = ఇదే చూడుము అని అన్వయము.

విశేషములు :- నాలుగు పిడికిళుల వరి పిండితో అశ్వశఫాకారముగా తయారుచేయబడినది పురోడాశము. చతురో ముష్టీన్నిర్వపతి. అశ్వశఫాకారః పురోడాశః అని శ్రుతి ప్రమాణము (రుచిపతి) పురః అగ్రే దాశ్యతే దీయతే ఇతి పురోడాశః - (దాశృదానే)- ఈ వ్యుత్పత్తితో నైనచో యతి భంగము వారింపబడునని ఇష్టార్థకల్పవల్లి [శార్దూలము] దంతురస్తూన్నతే దంతే తథోన్నత నతేఽపి చ - మేదినీ. మేధః ప్రజ్ఞా ధియాం మేధీతి విశ్వః.

సమాసములు :- పశుబంధస్య వేదిః — వేదీనాం వలయైః. ఔదుంబరీభి ర్దంతురాః - తైః. నిత్యం వ్యంజితాః గృహ్య తంత్ర విధిః యేషుతే. గృహస్థానామ్ ఆశ్రమాః, స్వారాజ్యస్య సింహాసనమ్ - ప్రచలితం స్వారాజ్య సింహాసనం యేభ్యస్తే.

కించ –

తపః కృశతరై రంగైః స్రష్టుమాకారితై రివ
సాయం ప్రాతరమీ పుణ్యమగ్నిహోత్రం ప్రయుంజతే॥ 19

(ఇతి పరిక్రమతః)

---

బిభ్రాణైః ఇవ = భరించుచున్నవో అన్నట్లున్న. శిరోభిః = శిరస్సులతో. సదః = ఈ ఋషి పరిషత్తు. గహనమ్ = చిట్టడవివలె దుష్ప్రవేశ్యము. (గహనమివ గహనమ్) తపో నియమముల వలన కృశించిన దేహములతో క్రిక్కిరిసి కూర్చుండి రనుట. పథ్యావక్త్రము.

సంధులు :- పూరయిత్వా + ఇవ - గుణ సంధి. సర్వ + అంగమ్ - సవర్ణదీర్ఘ సంధి. శిరోభిః + గహనమ్ – రేఫాదేశ విసర్గ.

అలంకారము :- జటలను శిరాతతులుగా సంభావించుట అసిద్ధ వస్తూత్ప్రేక్ష.

కించ = మరియు

తపఇతి :- తపః కృశతరైః=తపో నియమములచే మిక్కిలి కృశించినవియు, స్రష్టుమ్ = సృష్టించుటకై ముమ్మొదటగా. ఆకారితైః ఇవ = కల్పింప బడినవో అన్నట్లున్న. అంగైః = శరీరములతో. బ్రహ్మదేవుడు వీరి శరీరములకు కండపుష్టి నింకను కల్పింపలేదనియు రేఖా మాత్రముగా తొలి దశలో మిగిలినట్లున్నారనియు భావము. అమీ = ఈ ఋషులు. సాయం ప్రాతః = ఉభయ సంధ్యల యందును. పుణ్యమ్ = పవిత్రమైన. అగ్నిహోత్రమ్ = యాగ విశేషమును. ప్రయుంజతే = నిర్వహించుచున్నారు. ఓపిక లేకున్నను విధులను మానరనుట. (పథ్యా వక్త్రము).

సంధులు :- కృశతరైః + అంగైః, ఆకారితైః + ఇవ – రేఫాదేశ విసర్గ సంధులు.

క్రియ :– యుజిర్ యోగే. ఆత్మనే. లట్. ప్రథమ
ప్రయుజ్ఝి – ప్రయుంజాతే – ప్రయుంజతే

(ఇతి = ఇట్లు సంభాషించుకొనుచు. పరిక్రమతః – సంచరింతురు)

లక్ష్మణః :- (సహాసమ్) ఆర్య. రమణీయమితో వర్తతే.

బాలేయతండుల విలోప కదర్థితాభి
రేతాభిరగ్నిశరణేషు సధర్మిణీభిః।
తత్త్రాసహేతుమపి దండముదస్యమాన
మాఘ్రాతుమిచ్ఛతి మృగే మునయో హసన్తి॥ 20

---

ఆర్యేతి :- (సహాసమ్ = చిఱునవ్వుతో) ఆర్య। ఇతః = ఇటువైపున రమణీయమ్ = మరియొక అందమైన దృశ్యము. వర్తతే = కన్పించుచున్నది.

బాలేయేతి :- అగ్నిశరణేషు బాలేయ తండుల విలోపకదర్థితాభిః ఏతాభిః సధర్మిణీభిః ఉదస్యమానమ్ త్రాసహేతుమ్ తత్ దండమ్ అపి ఆఘ్రాతుమ్ ఇచ్ఛతి మృగే మునయః హసంతి. ఉత్త్రాస అనియు పాఠాంతరము.

అర్థము :- అగ్నిశరణేషు = అగ్నిహోత్రములుండు గృహముల యందు (శరణం గృహరక్షిత్రోః) బాలేయ = బలికొఱకు ఉద్దేశింపబడిన. తండుల= నీవార ధాన్యమును. విలోప = లేడి భక్షించుటచే (మిగల్చకుండుట). కదర్థితాభిః = బాధపడుచున్న. ఏతాభిః = ఈ. సధర్మిణీభిః = మునిపత్నులచేత (భార్యా చ సహధర్మిణీ). ఉదస్యమానమ్ = అదిలించుటకు పైకెత్తబడుచున్నదియు. (అసుక్షేపణే ధాతువు) త్రాసహేతుమ్ = భయహేతువునైన. తత్ దండమ్ అపి = ఆ కఱ్ఱను కూడ. ఆఘ్రాతుమ్ = మూర్కొనుటకు. మృగే = ఆ లేడి కూన. ఇచ్ఛతి (సతి) = ఇచ్ఛగించుచుండగా-తనను అదిలించుటకెత్తిన కఱ్ఱను మూచూచు లేడి పిల్లను అవలోకించి అనుట, మునయః = ఋషులు. హసంతి = నవ్వుచున్నారు.

విశేషములు :- బాలేయః - బలి శబ్దమునకు ఛదిరుపధి బలేర్ఢఞ్ అని ఢఞ్ ప్రత్యయము - (ఆయనేయీ.........). బాలేయోంగారవల్లర్యాం బాలే బలిహితే మతః - విశ్వ. వికటాకారవేషేణ వికృతాకారదర్శనాత్ వికృతైరపి వాక్యైశ్చ సాళ్ధా సోఽపి మహాత్మనామ్. మృగములకున్న విశ్వాసాతిశయము ఆశ్రమ ప్రశాంతత ఇందు సూచించుటయైనది.

సమాసములు :- బాలేయశ్చాసౌ తండులశ్చ - బాలేయ తండులానాం

రామః :- (పరిక్రామన్సకౌతుకానురాగమ్) వత్స. ఇతస్తావత్—

అర్ద్రప్రసూతి రియ మంగణయజ్ఞ వేది-
నేదిష్ఠమేవ హరిణీ తృణుతే తృణం చ।
వత్సీయతాపసకుమార కరోపనీత
నీవారనిర్వృత మపత్య మవేక్షతే చ॥ 21

---

విలోపః — విలోపేన కదర్థితాః — తాభిః. అగ్నీనాం శరణమ్ — తేషు. త్రాసస్య హేతుః — తత్.

సంధులు :- కదర్థితాభిః + ఏతాభిః + అగ్ని. సధర్మిణీభిః + ఉత్త్రాస రేఫాదేశ విసర్గ సంధులు.

క్రియ :- హసే హసనే. పరస్మై. లట్. ప్ర హసతి- హసతః -హసన్తి.

ఛందస్సు :- వసంత తిలక. ఉక్తా వసంత తిలకా తభజా జగౌగః.

వత్సేతి :- (పరిక్రామన్ = మరికొంత నడుచుచు. సకౌతుకానురాగమ్= ఉత్సుకతతో అనురాగముతో) వత్స = సోదరా। ఇతస్తావత్ = ఇటు వైపునేమో। —

ఆర్ద్రేతి :- ఆర్ద్రప్రసూతిః ఇయం హరిణీ అంగణయజ్ఞ వేదినేదిష్ఠమేవ తృణం తృణుతే. చ వత్సీయ తాపసకుమారకరోపనీత నీవార నిర్వృతమ్ అపత్యమ్ అవేక్షతే చ.

అర్థము -: ఆర్ద్రప్రసూతిః = పచ్చిబాలెంతరాలగు, ఇయమ్ = ఈ, హరిణీ = లేడి తల్లి, అంగణ యజ్ఞవేది = ఆశ్రమ ప్రాంగణమున నున్న యజ్ఞ వేదిక యొక్క. నేదిష్ఠమ్ ఏవ = మిక్కిలి సమీపముననందే. తృణమ్ = గడ్డిని. తృణుతే చ = ఎంగిలి పడుచున్నది. పసికందును విడిచి తన తిండికై దూరము పోవుట లేదని. (అంతికబాఢయోర్నేదసాధౌ సూత్రముచే అంతిక శబ్దమునకు నేదాదేశము — నేదిష్ఠమ్). చ = మరియు. వత్సీయ = పసికందులకు (అప్పుడే పుట్టిన లేడి కూనలకు) హిత మయినవియు. తాపసకుమార = ముని బాలకులయొక్క. కర = చేతులతో. ఉపనీత = తీసికొని రాబడినవియునైన. నీవార = నివ్వరి లేత గడ్డి పరకల కొన తుంపులచేత. నిర్వృతమ్=సంతృప్తి చెందిన. అపత్యమ్=తన బిడ్డను. అవేక్షతే చ= చూచుచున్నదియును. (వసంత తిలక) నేదిష్ఠ మంతికతమమ్ - అమరము.

అపిచ —

విష్వక్తపోధనకుమారసమర్ప్యమాణ
శ్యామాక తండుల హృతాం చ పిపీలికానామ్ ।
శ్రేణీభిరాశ్రమపథాః ప్రథమానచిత్ర
పత్త్రావళీవలయినో ముద.ముద్వహన్తి॥ 22

---

సమాసములు :- అర్ఘ్యప్రసూతిర్యస్యాః సా. అంగణే యజ్ఞవేదిః - వేదేః నేదిష్ఠమ్. వత్సాయ హితాః. (తస్మై హితమితి ఛః) తాపసానాం కుమారాః - కుమారాణాం కరాః - కరైః ఉపనీతాః - ఉపనీతాశ్చ తే నీవారాః - పత్రియాశ్చ తే తాపసకుమార కరోపనీత నీవారాశ్చ. తైః నిర్వృతమ్.

సంధులు :- ప్రసూతిః + ఇయమ్ - రేఫాదేశ విసర్గ. కర + ఉపనీత- గుణ సంధి.

క్రియ :- శృణుఞ్ః అదనే. ఆత్మనే. లట్. ప్రథమ
శృణుతే - శృణ్వాతే - శృణ్వతే
ఈక్షట్ దర్శనే. ఆత్మనే. లట్. ప్రథమ (అప)
ఈక్షతే - ఈక్షేతే - ఈక్షన్తే

అపిచ = మరియు

విష్వగితి :— విష్వక్ = అన్నివైపులయందును (సమంతతస్తు పరితః సర్వతో విష్వగిత్యపి - అమరము) తపోధన కుమార = మునిబాలకులచే. సమర్ప్యమాణ = పెడజల్లబడుచున్న. శ్యామాకతండుల హృతామ్ = శ్యామాకమను బియ్యపు రవ్వలను నోట గరచుకొని పోవుచున్న, పిపీలికానామ్ = నల్లచీమల యొక్క. శ్రేణీః=బారులతో. ఆశ్రమపథాః = ఆశ్రమ మార్గములు (వీధి గుమ్మములనుట). ప్రథమాన = సుప్రసిద్ధములగు. చిత్ర పత్త్రావళీవలయినః = ముగ్గులు కలవై. తెలిరవ్వలతో నల్లచీమల బారులు ముంగిట ముగ్గులవలె నున్నవనుట. ముదమ్ = ఆనందమును. ఉద్వహన్తి = కల్గించుచున్నవి. (వసంత తిలక).

లక్ష్మణః :- అహో ! పశూనామప్యపత్యవాత్సల్యమ్. అహో ! శిశూనామపి సత్కర్మతాచ్ఛీల్యమ్ ।

రామః :- (అన్యతోఽవలోక్య)

మునివినియోగవిలూన ప్రరూఢ మృదు శాద్వలాని బర్హీంషి ।
గోకర్ణతర్ణకోఽయం తర్ణోత్యుపకంఠ కచ్ఛేషు॥ 28

---

సమాసములు :- తప ఏవ ధనం యేషాం తే - తపోధనానాం కుమారాః - కుమారైః - సమర్ప్యమాణాః - విష్వక్ యథాభవతి తథా తపోధనకుమార సమర్ప్యమాణాశ్చ తే శ్యామాక తండులాశ్చ, తండులాన్ హరన్తీతి - తేషామ్. ఆశ్రమాణాం పంథా - (ఋక్పూరబ్ధూః పథామానక్షే - అః) తే. ప్రథమానా చ సా చిత్రపత్రావళీ చ - పత్రావళీనాం వలయాః సంతి అత్రేతి - వలయినః.

సంధులు :- శ్రేణీభిః + ఆశ్రమ - రేఫాదేశవిసర్గ. వలయినః + ముదమ్ - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- వహ్ ప్రాపణే. పరస్మై. లట్. ప్రథమ (ఉక్)
వహతి - వహతః - వహన్తి.

అహోఇతి :- అహో, పశూనామ్ అపి = పశువులకు సైతము, అపత్యవాత్సల్యమ్ = ఎంతటి పుత్రప్రేమ ! అహో ! శిశూనామ్ అపి = చిన్నపిల్లలకు గూడ, సత్కర్మతాచ్ఛీల్యమ్ = మంచిపనులు చేయుట స్వభావమై కన్పట్టుచున్నదే !

మునీతి :- (అన్యతః = మరియొక పైపునకు, అవలోక్య = చూచి) ముని = ఋషులయొక్క, వినియోగ = ఉపయోగార్థము, విలూన = త్రుంపబడినవై, ప్రరూఢ = మరల నెదిగినవై, మృదు = ఆ కారణముచే లేతలై, శాద్వలాని = హరితవర్ణముతో కూడినవైన. (శాద్వలః శాదహరితే - అమరము). బర్హీంషి = కుశలను, అయమ్ = ఈ, గోకర్ణ తర్ణకః = లేడికూన, (గోకర్ణోఽశ్వతరేఽపి స్యాన్మృగ సర్పవిశేషయోః - మేదినీ. తర్ణకో బాలక స్సమౌ - అమరము). ఉప కంఠ = గృహసమీపము నందలి. కచ్ఛేషు = జలప్రాయ ప్రదేశములందు (జల ప్రాయమనూపం స్యాత్పుంసి కచ్ఛస్తథా విధః - అమరము), తర్ణోతి = మేయుచున్నది. (అర్థ. చూ. ప్రథమ-10).

(ఇతి పరిక్రామతః)

లక్ష్మణః :- ఆర్య !

ఇయమేభిరాలవాలైః పదేపదే గ్రంథిలాసు కుల్యాసు ।
తీవ్రతమా జలవేణిః ప్రవహతి విశ్రమ్య విశ్రమ్య॥ 24

---

సమాసములు :- మునీనాం వినియోగః - వినియోగాయ విలూనాని - విలూనాని చ తాని ప్రరూఢాని - ప్రరూఢాని చ తాని మృదుశాద్వలాని. శాదోఽస్యాస్తీతి - శాద్వలమ్ - నడశాదాత్ డ్వలచ్. గోకర్ణస్య తర్ణకః, ఉపకంఠే విద్యమానాః కచ్ఛాః - తేషు.

సంధులు :- తర్ణకః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - తర్ణకో + అయమ్ — పూర్వరూపసంధి. తర్ణోతి + ఉపకంఠ - యణాదేశసంధి.

క్రియ :- తృణుఞ్ అదనే (తనాది-ఉభయగుణః) లట్, పరస్మై. ప్రథమ
తర్ణోతి - తర్ణుతః - తర్ణ్వన్తి.

(ఇతి = అని, పరిక్రామతః = మరికొంత ముందుకు నడుతురు).

ఇయమితి :- ఇయం తీవ్రతమా జలవేణిః ఏభిః ఆలవాలైః గ్రంథిలాసు కుల్యాసు పదే పదే విశ్రమ్య ప్రవహతి.

అర్థము :- ఇయమ్ = ఈ, తీవ్రతమా = అతివేగముగల, జలవేణిః = నదీప్రవాహము. [నద్యాదేరంతరే వేణిః కేశస్యాపి చ బంధనే - విశ్వః]. ఏభిః = ఈ కనిపించుచున్న, ఆలవాలైః = చెట్లపాదులతో, గ్రంథిలాసు = గణుపులుకలవైన. [గ్రంథిరస్యాఅస్తీతి గ్రంథిలా - సిధ్మాది త్వాత్ లచ్] కుల్యాసు = బోదెలలో. [కుల్యాస్యాత్ కృత్రిమానరిత్—అమరము]. పదే పదే = ప్రతి ఆలవాలము నొద్దను. విశ్రమ్య విశ్రమ్య=ఆగి ఆగి, ప్రవహతి = ప్రవహించుచున్నది. పాదులను నింపుచు తీతతో నెమ్మదిగా కదలుచున్న దనుట. [తీవ్రరయాజలవేణీ అని పాఠాంతరము]. ఆర్యావృత్తము. చూ. ప్రథమ-10.

క్రియ :- వహజ్ ప్రాపణే [ప్రాద్వహ ఇతి] పరస్మై. లట్. ప్రథమ
ప్రవహతి — ప్రవహతః - ప్రవహన్తి.

రామః :- వత్స, సాధు దృష్టమ్.

ఆలవాలవలయేషు భూరుహాం మాంసల స్తిమిత మంతరాంతరా ।
కేరళీచికురభంగిభంగురం సారణీషు పునరంబు దృశ్యతే॥ 25

---

వత్సేతి :- వత్స = అనుజా। సాధు దృష్టమ్ = లెస్సగా గమనించితివి.

ఆలవాలేతి :- అంతరాంతరా భూరుహామ్ ఆలవాలవలయేషు మాంసల స్తిమితమ్. పునః సారణీషు కేరళీచికురభంగి భంగురమ్ అంబు దృశ్యతే.

అర్థము :- అంతరాంతరా = నడుమ నడుమనున్న. భూరుహామ్ = చెట్లయొక్క. ఆలవాలవలయేషు = గుండ్రని పాదులయందు [ఆలవాలః స్థితో మూతే వృక్షస్య జలధారకే — అమరము]. మాంసల = నిండినదియు. స్తిమితమ్ = నిశ్చల మైనదియు. పునః = తిరిగి. సారణీషు = బోదెలయందు. (పాదులు నిండి తిరిగి బోదెలకు సాగుచున్న నీరు) కేరళీ = కేరళస్త్రీలయొక్క. చికురభంగి = ముంగురుల వలె. భంగురమ్ = కుటిలత్వము కలదియునై. అంబు = నీరు. దృశ్యతే = కనబడుచున్నది. కేరళస్త్రీల ముంగురులు మిక్కిలి కుటిలములుగా నుండునని కవి లోకప్రసిద్ధి. (స్వల్ప నద్యాం చ సారణీ - విశ్వః) మాంసలమ్, గ్రంథిలమ్ - సిధ్మాది గణపాఠముచే మత్వర్థమున లచ్ ప్రత్యయము.

సమాసములు :- ఆలవాలానాం వలయాః - తేషు. మాంసలం చ తత్ స్తిమితం చ. కేరళీనాం చికురభంగిః - భంగిరివ భంగురమ్. సారణీసరదంబు - అని పాఠాంతరము. సారణ్యాం సరచ్చ తదంబు చ = సారణియందు ప్రవహించుచున్న నీరు.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే, ఆత్మనే, లట్, ప్రథమ
దృశ్యతే - దృశ్యేతే - దృశ్యన్తే.

ఛందస్సు :- రథోద్ధతము — రాన్నరావిహ రథోద్ధతా లగౌ.

| ర | న | ర | లగ |
|---|---|---|---|
| U I U | I I I | U I U | I U |
| ఆలవా | లవల | యేషుభూ | రుహామ్ |

తదేహి. భగవతీం కౌశికీమాలోకయంతౌ ముహూర్తమాత్రమాత్మానం పునీవహే. (పరిక్రమ్యావలోక్య చ). క్వచిత్సాంక్రామికోఽపి విశేషో నైసర్గికమతిశేతే. తథా హి—

జడస్వచ్ఛస్వాదు ప్రకృతిరుపహూతేంద్రియగణో
గుణో యద్యప్యాసామయమయుతసిద్ధో విజయతే।
తథాప్యుత్కర్షాయ స్ఫురతి సరితా మాశ్రమసదా
మిదానీం వానీరద్రుమకుసుమజన్మా పరిమళః॥ 26

---

తదితి :— తత్ఏహి=ఇక రమ్ము. భగవతీమ్ = పవిత్రురాలైన, కౌశికీమ్=కౌశికినదిని. ఆలోకయంతౌ = చూచుచున్నవారమై. ముహూర్త మాత్రమ్ = కొంతసేపు. ఆత్మానమ్ = అంతరంగమును. పునీవహే = పావనముచేసికొందము. [పరిక్రమ్య = ముందుకు నడిచి. అవలోక్య చ =చూచి] క్వచిత్=ఒక్కొకప్పుడు. సాంక్రామికః అపి = సంక్రమించినదైనను. విశేషః = ఒకానొక గుణవిశేషము. నైసర్గికమ్ = సహజసిద్ధమును. అతిశేతే = అతిశయించును. తథాహి = అంతేకదా:

జడేతి :— ఆసామ్ జడస్వచ్ఛ స్వాదు ప్రకృతిః ఉపహూతేంద్రియ గణః అయుత సిద్ధః అయం గుణః యద్యపి విజయతే. తథాపి ఇదానీమ్ వానీరద్రుమ కుసుమ జన్మా పరిమళః ఆశ్రమసదామ్ సరితామ్ ఉత్కర్షాయ స్ఫురతి. [శిఖరిణీ వృత్తము]

అర్థము :— ఆసామ్ = ఈ జలవేణికలయొక్క. జడ = చల్లదనము [జడోమూర్ఖే హిమగ్రస్తే - విశ్వః]. స్వచ్ఛ = నిర్మలినత్వము. స్వాదు = మాధుర్యము అనునవి. ప్రకృతిః = సహజసిద్ధములుగాకలదియు. ఉపహూత = (అందుచేత) ఆకర్షింపబడిన. ఇంద్రియగణః=చూపఱుల జ్ఞానేంద్రియములుకలదియు, అయుతసిద్ధః= మరొక దానితో కలియుట వలన సిద్ధించినది కానిదియు — స్వాభావికమైనదియుననుట. అయిన. అయమ్ = ఈ. గుణః = గుణ విశేషము. యద్యపి = నిజమునకు. విజయతే = సర్వోత్కృష్టముగా విరాజిల్లుచున్నది. తథాపి = అయినప్పటికిని. ఇదానీమ్ = ఇప్పుడు. వానీరద్రుమ = పేతస వృక్షములయొక్క [ప్రబ్బలి చెట్లు - శీత

లక్ష్మణః :- ఆర్య. పురస్తా దనుకౌశికీతీర మాలోకయ.

తై ర్మేధాజననవ్రతప్రణయిభి ర్వ్యాశ్యైర్వటూనా మియం
సిక్తా నిత్యవసంతవిభ్రమవతీ రమ్యా పలాశావళీ ।

---

వానీరవంజులాః - అపూర్వము]. కుసుమ జన్మా = పుష్పముల నుండి ఉద్భవించిన. పరిమళః = సుగంధము [విమర్దోత్థే పరిమళో గంధమాత్రేఽపి దృశ్యతే - విశ్వః] ఆశ్రమ సదామ్ = ఆశ్రమ సమీపమునందున్న. సరితామ్ = నదులకు. ఉత్కర్షాయ = అతిశయము కొఱకు. స్ఫురతి = ప్రసరించుచున్నది. పైని పేర్కొన్న గుణ విశేష మునకు ఈ పరిమళము ప్రకర్షను కల్గించుచున్నదనుట. [శిశిరో జడ ఇత్యమరః]

సమాసములు :- జడా చ సా స్వచ్ఛా చ - జడస్వచ్ఛా చ సా స్వాదుశ్చ-జడస్వచ్ఛస్వాదుః ప్రకృతిః యస్య సః ఇంద్రియాణాం గణః—ఉపహూతాః ఇంద్రియ గణః యేన సః, యు మిశ్రణా మిశ్రణయోః- క్తః. యుతేన సిద్ధో న భవతీతి— అయుతసిద్ధః. వానీరాఖ్యాః ద్రుమాః - వానీరద్రుమాణాం కుసుమాని—కుసుమేభ్యః జన్మ యస్య సః.

సంధులు :- ప్రకృతిః + ఉపహూతాత - రేఫాదేశ విసర్గసంధి. ఉప హూత + ఇంద్రియ — గుణసంధి. గణః + గుణః + యది - ఉత్వాదేశవిసర్గ సంధి. యది + అపి + ఆసామ్. అపి + ఉత్కర్షాయ - యణాదేశసంధి. సిద్ధః + విజయతే — ఉత్వాదేశ విసర్గ.

క్రియ :- జి జయే అభిభవే చ. విపరాభ్యాం జే రిత్యాత్మనేపదమ్. లట్. ప్రథమ.

విజయతే — విజయేతే - విజయన్తే

స్ఫుర స్ఫురణే సంచరణే చ. పరస్మై. లట్. ప్రథమ.

స్ఫురతి - స్ఫురతః - స్ఫురన్తి.

ఆర్యేతి :- అగ్రజా, పురస్తాత్ = ముందు. అనుకౌశికీతీరమ్ = కౌశికీ నదీ ప్రాంతమును (సమీపమును) ఆలోకయ = చూడుము.

తై రితి :- మేధా జనన వ్రత ప్రణయిభిః తైః వటూనాం వ్యాశ్యైః సిక్తా ఇయం పలాశావళీ నిత్యవసంత విభ్రమవతీ రమ్యా (అస్తి). ఏతస్యాం హారిణారి పాణిజ వృతిశ్రేణి శ్రియః కోరకాః వనకరి క్రీడా కలాకర్షణాత్ తపోవనం గోపాయన్తి.

ఏతస్యాం హరిణారి పాటిజసృణిశ్రేణిశ్రియః కోరకా
గోపాయన్తి తపోవనం వనకరిక్రీడాకరాకర్షణాత్॥ 27

అర్థము :- మేధా = బుద్ధి విశేషమును (ధీర్ధారణవతీమేధా-అమరము) జనన = కల్గించునట్టి. వ్రత = ఒకానొక వ్రతమును. ప్రణయిభిః = అభిలషించు వారైన - ఉపనయనము నుండి నాల్గవ రోజున మోదుగుచెట్టు నొద్దచేయు వ్రతమును ఆచరించుచున్నవారనుట- తైః=ఆ. వటూనామ్=బ్రహ్మచారులయొక్క- (విద్యార్థులు). వ్యూహైః = సమూహములతో. సిక్తా = వ్రతావశిష్టమగు జలముతో తడుపబడినదై. (ఆ జలమును వృక్షమూలములలో పోయుదురనుట). ఇయమ్ = ఈ. పలాశావళీ = మోదుగు చెట్ల వరుస. నిత్య వసంత విభ్రమవతీ = ఎల్లప్పుడును వసంత శోభతో కూడినదై (వసంతే బ్రాహ్మణ ముపనయీత) రమ్యా (అస్తి) = మనోహరముగా నున్నది. ఏతస్యామ్ = ఈ వృక్షశ్రేణియందు. హరిణారి = సింహముయొక్క. పాటిజ = గోరులనునట్టి. సృణిశ్రేణి = అంకుశపు వరుసలయొక్క. శ్రియః = శోభతోకూడినవైన. కోరకాః = మోదుగు మొగ్గలు (అంకుశములవంటి సింహనఖముల వలె నున్నవనుట). వనకరి = అరణ్యగజములయొక్క. క్రీడా = విలాసార్థమైన. కరాకర్షణాత్ = తొండపు లాగుడులనుండి - క్రీడలో భాగముగా ఏనుగులు తొండము లతో ఆశ్రమ పర్ణశాలలను పడగొట్టుట నుండి. తపోవనమ్ = ఆశ్రమమును. గోపా యన్తి = రక్షించుచున్నవి. సింహనఖములవంటి మోదుగు మొగ్గలకు భయపడి అరణ్య గజములు ఆశ్రమ ప్రాంతములకు వచ్చుటలేదనుట. (శార్దూలవిక్రీడితము).

(వ్యూహస్తు బలవిన్యాసే సర్కలే బృందతర్కయోః - ధరణి. అంకుశో౽స్త్రీ సృణిః స్త్రియామ్ - అమరము. కళికా కోరకః పుమాన్ - అమరము)

సమాసములు:- మేధా జననాఖ్యం వ్రతమ్ - వ్రతస్య ప్రణయినః - తైః. వసంతస్య విభ్రమః-నిత్యం వసంతవిభ్రమః అస్యా అస్తీతి. పలాశానామావళీ హరిణానామరిః - హరిణారేః - పాటిజాః - సృణీనాం శ్రేణీ - పాటిజా ఏవ సృణి శ్రేణీ-శ్రేణ్యాః శ్రీరివ శ్రీః యేషాం తే - కోరకాః. వనస్య కరీ - కరేణ ఆకర్ష ణమ్ - క్రీడయా కరాకర్షణమ్ - వనకరిణాం క్రీడాకరాకర్షణమ్ - తస్మాత్.

సంధులు :- తైః + మేధా. ప్రణయిభిః + వ్యూహైః + వటూ

(నేపథ్యే)

రామభద్ర, కియచ్చిరమవలోకనేన కృతార్థీక్రియంతే తపోవన విహార భూమయః. సంప్రతి హి—

పరిణమయతి జ్యోతిర్వ్యాప్త్యా యజూంషి రుచాంపతిః
కిమపి శమినః సావిత్రాఖ్యం రహస్యముపాసతే।

---

నామ్ - రేఫాదేశ విసర్గసంధి. పలాశ + ఆవళీ, హారిణ + అరి, శర + ఆకర్షణాత్ సవర్ణదీర్ఘ సంధులు.

క్రియ :— గుపూ రక్షణే, పరస్మై, లట్, ప్రథమ

గోపాయతి — గోపాయతః — గోపాయన్తి

(నేపథ్యే = తెరలో) ప్రత్యుక్తికి అవకాశమును కల్పించుకొను పద్ధతు లయిందింటిలో నేపథ్య గ్రహణ మొకటి— ప్రశ్నో దూతశ్చ లేఖశ్చ నేపథ్యోక్తిస్తథైవ చ ఆకాశోక్తిశ్చ పంచైతే ప్రత్యుక్త్యవసరప్రదాః.

రామభద్రేతి :- రామభద్రా । తపోవన విహార భూమయః=తః ఆశ్రమ ప్రాంతములు. అవలోకనేన = నీవు దర్శించుటతో. కియత్ చిరమ్ = ఇంకను ఎంత సేపు. కృతార్థీక్రియంతే = చరితార్థములు గావింపబడును!. సంప్రతి హి=ఇప్పుడేమో–

పరిణమయతీతి:-రుచాం పతిః జ్యోతిర్వ్యాప్త్యా యజూంషి పరిణమయతి. శమినః సావిత్రాఖ్యం కిమపి రహస్యమ్ ఉపాసతే. అయం గురుః మాధ్యందినీం సవన క్రియామ్ అనుష్ఠాస్యన్ ఇహ మఖసన్నిధౌ భవంతం నేదీయాంసమ్ అపేక్షతే.

అర్థము :- రుచాం పతిః = వెలుగుఱేడు. జ్యోతిర్వ్యాప్త్యా = జ్యోతిః స్వరూపముతో. యజూంషి = యజుర్వేద మంత్రములను. పరిణమయతి = పరిణమింపజేయుచున్నాడు. సూర్యుడు వేదత్రయమూర్తి. (ఋఙ్మయః ప్రాతరాదిత్యో. మధ్యాహ్నే చ యజుర్మయః. సాయం సామమయశ్చేతి త్రయీమయ ఉదాహృతః) శమినః = నిగ్రహముకలవారైన ఋషులు (యమినః అని పాఠాంతరము). సావిత్రాఖ్యమ్ = సావిత్రము అను పేరుగల (సౌరాష్టాక్షరీ మంత్రము). కిమపి = ఏదో అనిర్వాచ్యమగు. రహస్యమ్ = తత్త్వమును (రహస్తత్త్వేరసే గుహ్యే). ఉపాసతే= ధ్యానించుచున్నారు. అయమ్ = ఈ. గురుః = విశ్వామిత్రుడు. మాధ్యందినీమ్=ప్రాత

గురురయమనుష్ఠాస్యన్మాధ్యందినీం సవనక్రియా
మిహ మఖవిధౌ నేదీయాంసం భవంతమపేక్షతే॥ 28

రామః :- (అశ్రుతమభినీయ సానురాగమ్)
వారాంస్త్రీనభిషుణ్వతే విదధతే వన్యైః శరీరస్థితీ
రైణేయ్యాం త్వచి సంవిశన్తి వసతే చాపి త్వచస్తారవీః।

---

తృతీయసవనముల మధ్యకాలమున నిర్వర్తింపబడునట్టి. సవనక్రియామ్ = యజ్ఞ విశేషమును లేక స్నానమును (సవనంత్వధ్వరే స్నానే - విశ్వః). అనుష్ఠాస్యన్ = అనుష్ఠింపబోవుచు. ఇహ = ఇప్పుడు. మఖవిధౌ = యజ్ఞ విధి యందు. భవంతమ్= నిన్ను. నేదీయాంసమ్ = సమీపస్థునిగా. అపేక్షతే = కోరుచున్నాడు. నీవు సమీపమున నుండుట ముని కోరిక యని.

సంధులు :- శ్రోత్రైః + వృత్యా. గురుః + అయమ్ - రేఫాదేశవిసర్గ సంధి. సావిత్ర + అఖ్యమ్ - సవర్ణదీర్ఘ.

క్రియ :- ణమ ప్రహ్వత్వే శబ్దేచ (ణిచ్). పరస్మై. లట్. ప్రథమ(పరి)
నమయతి — నమయతః — నమయన్తి
ఆసఙ్ ఉపవేశనే. ఆత్మనే. లట్. ప్రథమ (ఉప)
ఉపాస్తే — ఉపాసాతే — ఉపాసతే
ఈక్షఙ్ దర్శనే. ఆత్మనే. లట్. ప్రథమ (అవ)
ఈక్షతే — ఈక్షేతే — ఈక్షన్తే

ఛందస్సు :- హరిణి. నసమరసలాగః షడ్వేదైః హయైః హరిణీమతా. (అశ్రుతమ్ = వినబడమిని (అశ్రుతిమ్). అభినీయ = నటించి. సానురాగమ్ = మునిచర్యలను చూచుటతోనైన కౌతుకముతో).

వారానిత్రి :- త్రీన్ వారాన్ అభిషుణ్వతే, వన్యైః శరీరస్థితీః విదధతే. ఐణేయ్యాం త్వచి సంవిశన్తి, అపిచ తారవీః త్వచః వసతే, చార్మణో చక్షుషి యత్ న అభిపతతః తత్ ధామ పశ్యంతి. ధన్యానామ్ ఇయం విరజస్తమాః భగవతీ చర్యా ఆహ్లాదతే.

అర్థము :- త్రీన్ వారాన్ = ముమ్మారులు, అభిషుణ్వతే = స్నానము చేయుచుండిరి - త్రిషవణస్నాన మాచరించుచుండిరి. వన్యైః = అడవిలో దొరుకు

తత్పశ్యంతి చ ధామ నాభిపతతో యచ్చార్మణే చక్షుషి
ధన్యానాం విరజస్తమా భగవతీ చర్యేయమాహ్లాదతే॥ 29

---

కందమూలాదులతో శరీరస్థితిః = శరీరపోషణలను, విదధతే = నిర్వర్తించుకొను చున్నారు. ఐణేయ్యామ్ = ఏణీసంబంధమగు. త్వచి = చర్మమునందు – కృష్ణమృగ చర్మమనుట (కృష్ణాజినే జ్ఞానసిద్ధిరితి మంత్రశాస్త్రే అసనప్రకరణే). సంవిశన్తి = సమాసీనులగుచున్నారు. అపిచ = మరియు. తారవీః = తరువులకు సంబంధించిన, త్వచః = తోళులను, వసతే = కట్టుకొనుచున్నారు. చార్మణే చక్షుషి=చర్మచక్షువులు. యత్ = దేనిని. న + అభిపతతః = పొందలేవో. తత్ధామ = ఆ తేజస్సును – తత్పదార్థమును. పశ్యంతి = సాక్షాత్కరింప చేసికొనుచున్నారు. ధన్యానామ్ = మహాత్ములైన ఈ వానప్రస్థులయొక్క. ఇయమ్ = ఈ. విరజస్తమాః = రజ స్తమోగుణములులేని శుద్ధసాత్త్వికమై. భగవతీ=సర్వశ్లాఘ్యమైన - పవిత్రమైనఅనుట. చర్యా = ప్రవృత్తి, ఆహ్లాదతే = ఆనందము కల్గించుచున్నది. (శరీరస్య స్థితిః. విగతే రజస్తమసీ యస్యాస్సా) శార్దూలము.

విశేషములు :- చర్యా ఈర్యాపథస్థితిః అని అమరము. గురువునుండి శాస్త్రమును ఉపాసనతో గ్రహించుటకు ఈర్య అనిపేరు. దాని ఉపాయమును ఈర్యా పథమందురు. అధ్యయన పద్ధతికి చెందిన నియమనిష్ఠలని (చర్య) తాత్పర్యము. ఏణ్యాః వికారః – ఏణ్యా ఢఞ్ - టిడ్ఢాణఞ్ ఇత్యాది ఙీప్ – ఐణేయీ. ఇత్లే తరో ర్వికారః – తారవీ. చర్మణో వికారః – చార్మణమ్. ధన్యా వీతరజస్తమా భగవతీ చర్యేయమామోదతే అని పాఠాంతరము. ధన్యా అనునది చర్యకు విశేషణము.

సంధులు :-వారాన్ + త్రీన్ - శాంస్త్రాన్సంధి. స్థితిః + ఐణేయ్యామ్ – రేఫాదేశవిసర్గ. చ + అపి, న + అభిపతతః - సవర్ణదీర్ఘ. త్వచః + తారవీః – సాదేశవిసర్గ. పతతః + యత్ - ఉత్వాదేశవిసర్గ. యత్ + చార్మణే - శ్చుత్వం. విరజస్తమాః + భగవతీ - విసర్గలోప. చర్యా + ఇయమ్ - గుణసంధి.

క్రియలు :- షుఞ్ అభిషవే (శ్ను) ఆత్మనే. లట్. ప్రథమ (అభి)
సునుతే – సున్వాతే – సున్వతే
డుధాఞ్ ధారణపోషణయోః. ఆత్మనే. లట్. ప్రథమ (వి)
ధత్తే - దధాతే - దధతే

(నేపథ్యే పున స్తదేవ పఠ్యతే)

రామః :- (శ్రుత్వా ససంభ్రమమూర్ధ్వమవలోక్య చ) కథం గగనమధ్యమధ్యారూఢో నిదాఘ దీధితిః. వత్స, తదేహి. యజ్ఞవాటమధిష్ఠాయ క్రమేణ కృతాహ్నికస్య భగవతః కౌశికస్య ప్రత్యనంతరీ భవావః.

(ఇతి పరిక్రామతః)

---

పిశ ప్రవేశనే. పరస్మై. లట్. ప్రథమ (సమ్)
విశతి - విశతః - విశంతి
వసజ్ ఆచ్ఛాదనే (లుక్) ఆత్మనే. లట్. ప్రథమ
వస్తే - వసా - వసతే
దృశిర్ ప్రేక్షణే. పరస్మై. లట్. ప్రథమ
పశ్యతి - పశ్యతః - ప్రశ్యన్తి
పత్ల గతౌ. పరస్మై. లట్. ప్రథమ

పతతి - పతతః - పతంతి

(నేపథ్యే = తెరలో. పునః = మరల. తదేవ = పరిణమయతి అన్నదే. పఠ్యతే = పఠింపబడును.)

కథమితి :- (శ్రుత్వా = విని. ససంభ్రమమ్ = సంభ్రమముతో. ఊర్ధ్వమ్ అవలోక్య = పైకిచూచి) కథమ్ = ఎట్టూ। నిదాఘదీధితిః = వేడివెలుగు (సూర్యుడు) గగనమధ్యమ్ = ఆకాశమధ్యభాగమును. అధ్యారూఢః = అధిష్ఠించెను। వత్స = సోదరా। తత్ ఏహి = ఇక రమ్ము. యజ్ఞవాటమ్ = యాగశాలను. అధిష్ఠాయ = ఆశ్రయించి. క్రమేణ = నెమ్మదిగా (వరుసతో) కృతాహ్నికస్య = పగటిపూట చేయవలసిన విధులను నిర్వహించినవాడును. భగవతః = మహానుభావుడునైన. కౌశికస్య = విశ్వామిత్రునికి. పత్యనంతరీ భవావః = సన్నిహితుల మయ్యెదము - నెమ్మదిగా నిక వదిలి మునిసన్నిధికి చేరుకొందమనుట.

(ఇతి = అని. పరిక్రామతః = నడుతురు).

లక్ష్మణః :- (సర్వతో దృష్ట్వా) ఆర్య.

ఉద్దామద్యుమణి ద్యుతివ్యతికరప్రక్రీడదర్కోపల
జ్వాలాజాల జటాలజాంగల తటీనిష్కూజకోయష్టయః ।
భౌమోష్మ ప్లవమాన సూర్యకిరణక్రూరప్రకాశా దృశో
రావిష్కర్మ సమాపయన్తి దిగమూర్మధ్యాహ్నశూన్యా దిశః॥ 30

---

ఆర్యేతి :- (సర్వతః = అన్నివైపులకును. దృష్ట్వా = చూచి) ఆర్య = అగ్రజా ।

ఉద్దామేతి:- ఉద్దామ=ప్రబలమైన(ముదిరిన). ద్యుమణి=సూర్యునియొక్క ద్యుతి = కాంతియొక్క. వ్యతికర=సంబంధముతో (సమూహముతో). ప్రక్రీడత్ = జ్వలించుచున్న, అర్కోపల = సూర్యకాంతమణులయొక్క. జ్వాలాజాల = మంటలచే. జాంగలతటీ = నిర్జలప్రదేశములందు. నిష్కూజ=నదీ మణిగిన (కూజితములు మానిన) కోయష్టయః=టిట్టిభము లను జలపక్షులు కలవియు. భౌమ = భూమినుండి వెల్లెగయుచున్న. ఊష్మ = వేడిమిచేత. ప్లవమాన = పరావర్తనము చెందుచున్న. సూర్యకిరణ = సూర్యరశ్మితో. క్రూర = తీక్ష్ణమైన. ప్రకాశాః=వెలుగుకలవియు – సూర్యకిరణ పరావర్తనము వలన ఎండమావు లేర్పడి దిక్కులు దుర్నిరీక్ష్యములుగా నున్నవనుట. (క్రూరప్రకారాః అనియు పాఠాంతరము). మధ్యాహ్నశూన్యాః = మధ్యాహ్నమగుటచే ప్రాణిసంచారము బొత్తిగా లేనివియునైన. అమూః = ఈ. దిశః = దిక్కులు దృశోః = కన్నులయొక్క. ఆవిష్కర్మ = ఆవిష్కారమును. సమాపయన్తి = నిరోధించుచున్నవి. ధిక్ । ఎండ కన్నులు తెరచి చూచుటకు వీలు పడనీకున్నదని బాధ. (దృశోః ఆయుష్కర్మ = చూపులయొక్క గ్రహణశక్తినని తాత్పర్యము – పాఠాంతరము). ద్యుమణిస్తరణిర్మిత్రః – అమరము. జాంగలం నిర్జలస్థానమితి ధరణిః. స్వల్పోదక తృణోయస్తు ప్రవాతః ప్రచురాతపః దేశస్స జాంగలో జ్ఞేయః ఇతిచ.

సమాసములు :- ద్యుమణేః ద్యుతిః - ఉద్దామాశ్చ తాః ద్యుమణి ద్యుతయశ్చ - ద్యుతీనాం వ్యతికరః - వ్యతికరేణ ప్రక్రీడంతః - ప్రక్రీడంతశ్చతే అర్కోపలాశ్చ - అర్కోపలానాం జ్వాలాః - జ్వాలానాం జాలమ్ - జాలేవ జటాలా చ సా

అంతికతమా చేయం యజ్ఞభూమిః. తదేతదేవ న్యగ్రోధచ్ఛాయామండప మధ్యాసీనా ఋత్విజః ప్రత్యవేక్షామహే. గళితయౌవనే పునరహని భగవంతం ద్రక్ష్యామః.

రామః :- ఏవమస్తు. (ఇతి పరిక్రమ్య నాట్యేనోపవిశతః)

---

జాంగలతటీ చ. విష్కాజాశ్చతే కోయష్టయశ్చ - జాంగలతటీషు విష్కాజకోయష్టయః యాసు తా దిశః. భౌమం చ తదూష్మ చ - భౌమోష్మణా ప్లవమానాః - ప్లవమానాశ్చతే సూర్యకిరణాశ్చ - ప్రావరశ్చాసౌ ప్రకార [శ]శ్చ - సూర్యకిరణైః ప్రకార ప్రకాశ [ం]ః యాసాం తాః దిశః, మధ్యాహ్నే శూన్యాః. [శార్దూలవిక్రీడితము].

సంధులు:- భౌమ + ఊష్మ - గుణసంధి. ప్రకాశాః + దృశో, శూన్యాః + దిశః - విసర్గలోపసంధి. దృశో + అవిష్కర్త - రేఫాదేశవిసర్గ. అమూః + మధ్యాహ్నే - రేఫాదేశవిసర్గ.

క్రియ :- ఆప్ల అంధనే [జీవ్వా]. పరస్మై. లట్. ప్రథమ [సమ్]

అపయతి — అపయతః — అపయన్తి

అంతికేతి :- ఇయమ్ = ఇదే. యజ్ఞభూమిః = యాగశాల. అంతికతమా = మిక్కిలి చేరువలోనున్నది. తత్ = అందుచే. ఏతత్ ఏవ = ఇదే. న్యగ్రోధచ్ఛాయా = మఱ్ఱిచెట్టు నీడ అనునట్టి. మండపమ్ = మండపమును లేదా మఱ్ఱిచెట్టు నీడలోనున్న మండపమును. అధ్యాసీనాః = అధివసించినవారమై. ఋత్విజః=యాజ్ఞికులను. ప్రత్యవేక్షామహే = ఎదురుచూతము - వారి రాకకై నిరీక్షింతమనుట. అహని= పగలు. గళితయౌవనే = యౌవనమును కోల్పోగా - ఎండతీవ్రత తగ్గిన పిదపననుట. భగవంతమ్ = విశ్వామిత్రులవారిని. ద్రక్ష్యామః = దర్శించుదము. [ పునః - వాక్యాలంకారము].

ఏవమితి :- ఏవమ్ అస్తు = అట్లే అగుగాక ! [ ఇతి = అని. పరిక్రమ్య = రెండడుగులు వేసి. నాట్యేన ఉపవిశతః = కూర్చుండుటను అభినయింతురు ]

ఆర్యేతి :- [ పార్శ్వతః = ప్రక్కకు. అవలోక్య = చూచి ] ఆర్యాః

లక్ష్మణః :- (పార్శ్వతోఽవలోక్య) ఆర్య.

మధ్యేవ్యోమ క్రీడయిత్వా మయూఖాన్ భానోర్బింబే లంబమానే క్రమేణ।
స్వైరం స్వైరం మూలతః పాదపానాం పశ్య చ్ఛాయాః కశ్చి దాకర్షతీవ॥ 31

మధ్యేఇతి :- మధ్యేవ్యోమ = ఆకాశమధ్య భాగమునందు. మయూఖాన్ = కిరణములను. క్రీడయిత్వా = విహరింపజేసి. భానోః = సూర్యునియొక్క బింబే = మండలము - సూర్యబింబము. క్రమేణ = నెమ్మదిగా. లంబమానే=పశ్చిమమునకు దిగిపోవుచుండగా. స్వైరం స్వైరమ్ = మెల్లమెల్లగా. (స్వైరం స్వచ్ఛంద మందయోః - అమరము). పాదపానామ్ = వృక్షములయొక్క. మూలతః=మొదళ్ల నుండి. ఛాయాః = నీడలను. కశ్చిత్ = ఎవడో (కాలపురుషుడు) ఆకర్షతి ఇవ = వెనుకకు లాగుచున్నట్లున్నది; సూర్యోదయము నుండి పడమటికి పరుగులు తీసిన నీడలు ఇప్పుడు వృక్షమూలములకు చేరి తూర్పువైపునకు లాగబడుచున్నట్లున్నవనుట. పశ్య= చూడుము.

సమాసములు :- వ్యోమ్నః మధ్యమ్ - పారే మధ్యే షష్ఠ్యా వా అని అవ్యయీభావము. పాదైః పిబతీతి-పాదపః - తత్పురుషః. మూల - పంచమ్యాస్తసిల్ - మూలతః

సంధులు :- భానోః + బింబే - రేఫాదేశవిసర్గ. పశ్య + ఛాయాః- తుగాగమ. ఆకర్షతి + ఇవ = సవర్ణదీర్ఘ.

క్రియ :- కృష విలేఖనే. పరస్మై. లట్. ప్రథమ [అట్]

కర్షతి - కర్షతః - కర్షన్తి

అలంకారము :- ఛాయావ్యాపనమునకు ఏదో లాగుట కారణముగా ఉత్ప్రేక్షింపబడినది. అట్టిదేదియు సిద్ధముకాదు. అసిద్ధ హేతూత్ప్రేక్ష.

ఛందస్సు :- శాలినీ వృత్తము. శాలిన్యుక్తా మ్తౌ తగౌ గోఽబ్ధిలోకైః

U U U U U I U U I U U [మ-త-త-గగ]
మధ్యేవ్యో మక్రీడ యిత్వామ యూఖాన్.

రామః :- (సమంతాదవలోక్య) వత్స. మధ్యందిన మతిక్రాంతమితి కిమేత
ద్దినమప్యతిక్రాంత మేవ. తథా హి—

గగనశిఖర ముదయాద్రేరధిరూఢాః కష్టమర్కరథహరయః ।
అస్తమహీధరమధునా ఝుటితి సుఖేనావరోహంతి॥ 32

---

వత్సేతి :- (సమంతాత్ = అన్నివైపులకు. అవలోక్య = చూచి) అనుజా। మధ్యం దినమ్ = మధ్యాహ్నకాలము. అతిక్రాంతమ్ ఇతి = గడిచిపోయినదని. కిమ్ ఏతత్ = ఇదేమి. దినమపి = పగలు మొత్తమే. అతిక్రాంతమ్ ఏవ = గడిచి పోయినట్లున్నది । తథాహి = అంతే కదా ।. సాయం సమయము త్వరగా ఏర్పడుచున్న దనుట [ ఆర్యావృత్తము].

గగనేతి :- అర్కరథ హరయః ఉదయాద్రేః గగనశిఖరమ్ కష్టమ్ అధిరూఢాః అధునా అస్తమహీధరమ్ ఝుటితి సుఖేన అవరోహన్తి.

అర్థము :- అర్కరథ=సూర్యరథముయొక్క. హరయః=గుఱ్ఱములు. ఉదయాద్రేః = తూర్పుకొండనుండి. గగనశిఖరమ్ = ఆకాశమధ్య భాగమును (గగన శిఖామ్ అని పాఠాంతరము). కష్టమ్ అతి కష్టముమీద (నెమ్మదిగా) అధిరూఢాః = ఆరోహించినవై. అధునా = ఇప్పుడు. అస్తమహీధరమ్ = పడమటి కొండను (కు). ఝుటితి = త్వరత్వరగా. సుఖేన = కష్టరహితముగా. అవరోహన్తి = దిగుచున్నవి. ఎత్తున కెక్కుట కష్టమై దిగుట తేలికయై సూర్యాస్తమానము త్వరగా జరుగుచున్న దనుట.

సమాసములు :- గగనస్య శిఖరః తమ్. అర్కస్యరథః - రథస్యహరయః

సంధులు :- ఉదయ + అద్రి. సుఖేన + అవరోహంతి - సవర్ణదీర్ఘ సంధులు. అద్రేః + అధిరూఢాః - రేఫాదేశ విసర్గ. ఝుట్ + ఇతి - జశ్త్వసంధి.

క్రియ :- రుహబీజజన్మని ప్రాదుర్భావే చ. పరస్మై. లట్. ప్రథమ(అవ) రోహతి - రోహతః - రోహన్తి

లక్ష్మణః :- ఆర్య, నూనమద్య రక్షాంసి పరాపతిష్యంతి, యదయ మధ్వర వేదికా సన్నిధానం తే శునఃశేపముఖేన భగవానుపాధ్యాయః ప్రశాస్తి.

రామః :- (సరోషహుంకారమ్) వత్స, యద్యేవం స్యాత్ —

కల్పాంత కర్కశ కృతాంతభయంకరం మే
నిష్ప్రఘ్నతః క్రతువిఘాతకృతామమీషామ్ ।
నీరాక్షసాం వసుమతీమపి కర్తుమద్య
పుణ్యాహమంగళమిదం ధనురాదధాతు॥ 33

---

ఆర్యేతి :- ఆర్య = అగ్రజా! అధ్వర వేదికా = యజ్ఞభూమికి, సన్నిధానమ్ = సమీపమునందుండుటను, భగవాన్ ఉపాధ్యాయః = గురువగు విశ్వామిత్రుడు శునశ్శేపముఖేన = శునశ్శేపుని (వాక్కుల)తో, తే = నీకు, ప్రశాస్తి = ఆజ్ఞాపించుచున్నాడు. యత్ అయమ్ = అందుచేత — ఇట్లాజ్ఞాపించుట కారణముగా నేనూహించి చెప్పుచున్నాననుట — అద్య = ఈరోజు, నూనమ్ = తప్పక, రక్షాంసి = రాక్షసులు, పరాపతిష్యంతి = వచ్చిపడుచున్నారు.

వత్సేతి :- (సరోషహుంకారమ్=రోషముతో హుంకారముతో) సోదరా! యది ఏవమ్ స్యాత్ = అట్లే అగుచో —

కల్పేతి :- క్రతు విఘాతకృతామ్ అమీషామ్ నిష్ప్రఘ్నతః మే కల్పాంత కర్కశ కృతాంత భయంకరమ్ ఇదమ్ ధనుః వసుమతీమ్ అపి నీరాక్షసామ్ కర్తుమ్ పుణ్యాహమంగళమ్ అద్య ఆదధాతు.

అర్థము :- క్రతు = యజ్ఞమునకు, విఘాత కృతామ్ = విఘ్నమును కల్గించువారైన, అమీషామ్ = ఈ రాబోవు రాక్షసులను, నిష్ప్రఘ్నతః = పూర్తిగా సంహరింపనున్న, మే = నా యొక్క, కల్పాంత.......భయంకరమ్, కల్పాంత = ప్రళయ కాలమునందు, కర్కశ = అతికఠినుడైన, కృతాంత = యమునివలె, భయంకరమ్ = భీకరమగు, ఇదమ్ = ఈ, ధనుః = ధనుస్సు, వసుమతీమ్ అపి = మొత్తము భూగోళమునుగూడ, నీరాక్షసామ్ = రాక్షస రహితమునుగా, కర్తుమ్ = చేయుటకు, పుణ్యాహ మంగళమ్ = పుణ్యాహము అను ప్రారంభ పూజా విశేషమును

లక్ష్మణః :- (విహస్య) కథం రజనీచరచక్ర వినాశోత్కంఠావిసంస్థులమార్య
హృదయ మదీర్ఘదర్శినం భగవంతం కౌశికమపి సంభావయతి.

---

శుభకార్యారంభములలో పుణ్యాహముచేయుట ప్రసిద్ధము—అద్య = నేడు, ఆదధాతు = నిర్వహించుగాక ।

సమాసములు :- కల్పస్య అంతమ్ - కర్కశశ్చాసౌ కృతాంతశ్చ - కల్పాంతే కర్కశ కృతాంతః - కృతాంత ఇవ భయంకరమ్. క్రతూనాం విఘాతం కరోతీతి శేషమ్. నిర్గతాః రాక్షసాః యస్యాః సా — తామ్. పుణ్యం చ తదహశ్చ - పుణ్యాహని మంగళమ్ .

సంధులు :- కల్ప + అంత, కృత + అంత, పుణ్య + అహ — సవర్ణదీర్ఘ. నిర్ + రాక్షసా - ర్ధలోపదీర్ఘ సంధి. ధనుః + అదధాతు — రేఫాదేశ విసర్గ సంధి.

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః, పరస్మై, లోట్. ప్రథమ(ఆఙ్)
దధాతు/ధత్తాత్ - ధత్తామ్ — దధతు.

ఛందస్సు :- వసంత తిలక, ఉక్తా వసంతతిలకా తభజా జగౌ గః.

| పుణ్యాహ | మంగళ | మిదంధ | నురాద | ధాతు - తభజజగగ. |
|---|---|---|---|---|
| U U I | U I I | I U I | I U I | U U |

కథమితి :- (విహస్య = నవ్వి) కథమ్ = ఎట్లా । రజనీచర = రాక్షసులయొక్క, చక్ర = సమూహమును, వినాశ = నాశనము చేయుటలోని, ఉత్కంఠా = అభిలాషతో, విసంస్థులమ్ = వ్యగ్రమైన, ఆర్యహృదయమ్ = అన్నగారి అంతరంగము, (పవిత్రమగు డెందమనియు), భగవంతమ్ = మహానుభావుడగు కౌశికమ్ అపి = విశ్వామిత్రునంతటి వానినిగూడా, అదీర్ఘదర్శినమ్=ముందుచూపులేని అపండితునిగా (పారదర్శీ దీర్ఘదర్శీ ధీరః — అమరము), సంభావయతి = పరిగణించు చున్నది — రాక్షసులు వచ్చుటే జరిగినచో — యద్యేవంస్యాత్ — అని రాముడు సంభాషణ మారంభించుట. రాక్షసులు తప్పక వత్తురన్న విశ్వామిత్రుని అభిప్రాయమును శంకించుటగా లక్ష్మణుడు భావించి ఈ మాట పల్కెను. నీ అభిలాషాతిశయము కౌశికుని అపండితుని జేయుచున్నదనుట.

అవిద్యాబీజ విధ్వంసాదయమార్షేణ చక్షుషా ।
కాలౌ భూతభవిష్యంతౌ వర్తమాన మవీవిశత్॥ 34

రామః :- కిముచ్యతే. తత్రభవాన్విశ్వామిత్రః —

ప్రజ్ఞాతబ్రహ్మతత్త్వోఽపి స్వర్గీయైరేష ఖేలతి ।
గృహస్థ సమయాచారప్రక్రాంతైః సప్తతంతుభిః॥ 35

---

అవిద్యేతి :- అవిద్యా = అజ్ఞానముయొక్క. బీజ = మూలమును, విధ్వంసాత్ = నాశనము చేయుటవలన. అయమ్ = ఈ విశ్వామిత్రుడు. ఆర్షేణ = వేదవిజ్ఞానముతో నేర్పడినదైన (ఋషిర్వేదే మునౌ తత్త్వే - విశ్వః). చక్షుషా = ప్రజ్ఞాచక్షువుతో - దివ్యదృష్టితో ననుట. భూతభవిష్యంతౌ=భూతభవిష్యత్తులనునట్టి. కాలౌ = కాలములను, వర్తమానమ్ = వర్తమాన కాలమును. అవీవిశత్ = ప్రవేశింపజేసెను. వర్తమానమునందువలె భూతభవిష్యత్ కాలములందలి విషయములు దృగ్గోచరమగుననుట. (పథ్యావక్త్రము).

సమాసములు :- న విద్యా - అవిద్యా, అవిద్యాయాః బీజమ్ - బీజస్య విధ్వంసః - తస్మాత్. భూతశ్చ భవిష్యచ్చ.

క్రియ :- విశ ప్రవేశనే (తి) లుఙ్. పరస్మై - ప్రథమ
అవీవిశత్ - అవీవిశతామ్ - అవీవిశన్

కిమితి :- కిముచ్యతే = ఏమంటివి ; కౌశికుని ఆడిక్షు దర్శిగా సంభావించు చున్నాననుట సమంజసము కాదని. తత్రభవాన్ = గౌరవార్హుడగు. విశ్వామిత్రః = కౌశికుడు.

ప్రజ్ఞాతేతి :- ప్రజ్ఞాత = బాగుగా నెఱిగిన. బ్రహ్మతత్త్వః అపి = బ్రహ్మతత్త్వము కలవాడయినప్పటికిని - బ్రహ్మతత్త్వ మెరిగియును. ఏషః = ఈ విశ్వామిత్రుడు. స్వర్గీయైః = స్వర్గసంపాదకములైన. గృహస్థ = గృహస్థులకు, సమయ = నియమములగు. ఆచార=ఆచారములతో (విధానములతో) ప్రక్రాంతైః= ప్రారంభింపబడునవగు - గృహస్థాశ్రమమునందున్నవారు చేయునట్టి వనుట. సప్తతంతుభిః = యాగములతో (సప్తతంతుర్మఖః క్రతుః - అమరము). ఖేలతి =

అపిచ.—

ఆర్ద్రీకృతో వినయనమ్ర మహేంద్రమౌళి
మందారదామ మకరంద రసైరివాయమ్ ।
ప్రక్రాంతకుండలిత నూతనభూత సర్గ
స్త్రైశంకవం చరితమద్భుతమాతతాన॥ 36

---

క్రీడించుచున్నాడు. నిజమునకు తాను యాగములు చేయునవసరములేదు. కానీ లోక శ్రేయస్సునకై క్రీడావిలాసముగా చేయుచున్నాడనుట (పథ్యావక్త్రము).

సమాసములు :— ప్రజ్ఞాతం బ్రహ్మతత్త్వం యేన సః. స్వర్గాయ హితం తైః. గృహస్థానాం సమయాః — సమయేభ్యః ఆచారః — తైః ప్రక్రాంతాః - తైః.

సంధులు:- తత్త్వః + అపి - ఉత్వాదేశవిసర్గ - తత్త్వో + అపి - పూర్వరూప స్వర్గితైః + ఏషః - రేఫాదేశవిసర్గ. ఏషః + ఖేలతి - తదేత ద్విసర్గలోప.

క్రియ :- ఖేలృ చలనే, పరస్మై, లట్, ప్రథమ

ఖేలతి - ఖేలతః - ఖేలన్తి

అపిచ :— మఱియు.

ఆర్ద్రీకృతఇతి :- వినయ = వినయముతో. నమ్ర = వంగిన. మహేంద్ర = దేవేంద్రునియొక్క. మౌళి = శిరోఽలంకారమైన, మందారదామ = పారిజాతపుష్పమాలనుండి స్రవించిన. మకరందరసైః = మరందప్రవాహములతో. ఆర్ద్రీకృతః ఇవ = తడుపబడిన వానివలె - హృదయము మెత్తబడిఅనుట. అయమ్= ఈ విశ్వామిత్రుడు. ప్రక్రాంత = ప్రారంభింపబడియు. కుండలిత = కుండలీకరణములతో ఉపసంహరింపుకొనబడిన. నూతన = క్రొత్తదైన, భూతసర్గః = ప్రాణిసృష్టికలవాడై — బ్రహ్మకు ప్రతిద్వంద్విగా తాను గావించిన క్రొత్తసృష్టిని ఇంద్రాదుల ప్రార్థనలతో ఉపసంహరించుకొనెననుట — (కుండలీకరణములు అప్పటినుండియు అలవాటే) త్రైశంకవమ్ = త్రిశంకునియొక్క, చరితమ్ = ఇతివృత్తమును. అద్భుతమ్= ఆశ్చర్యజనకముగా. ఆతతాన = విస్తరింపజేసెను. (వసంతతిలక) కౌశికప్రవేశ సూచన.

లక్ష్మణః :- (పురోఽవలోక్య సహర్షమ్)

అభిరధ్వరచర్యాభిః శ్రౌతమర్థం కృతార్థయన్ ।
అయే కులపతిః సోఽయమిత ఏవాభివర్తతే॥ 37

---

సమాసములు :- వినయాత్ నమ్రః - నమ్రశ్చాసౌ మహేంద్రశ్చ - మహేంద్రస్య మౌళిః - మౌళేః మందారదామ - దామ్నః మకరందరసః - తైః. ప్రక్రాంతశ్చాసౌ కుండలితశ్చ - భూతానాం సర్గః - నూతనం భూతసర్గః - ప్రక్రాంత కుండలితః నూతన భూత సర్గః యేన సః. త్రిశంకోః ఇదమ్.

సంధులు :- కృతః + వినయ - ఉత్వాదేశ విసర్గ. మహా + ఇంద్ర- గుణసంధి. రసైః + ఇవ - రేఫాదేశవిసర్గ. ఇవ + అయమ్ - సవర్ణదీర్ఘ. సర్గః + త్రైశంకవమ్ = సాదేశవిసర్గ.

క్రియ :- తనుఞ్ విస్తారే. పరస్మై. లిట్. ప్రథమ (అట్)
తతాన - తేనతుః - తేనుః

అలంకారము:- మకరందరసములతో ఆర్ద్రీకృతుడగుట సర్గోపసంహారణ మునకు హేతువుగా సంభావింపబడినది. మహేంద్రుడు వచ్చి ప్రార్థించుట సిద్ధము. కావున నిది సిద్ధహేతూత్ప్రేక్ష. ఇవ అనునది ఉత్ప్రేక్షా సూచకము. శంకే మన్యే ధ్రువం నూనమ్......ఇవ శబ్దోఽపి తాదృశః.

అభిరితి :- (పురః అవలోక్య = ముందునకుచూచి. సహర్షమ్ = సంతోషముతో) అభిః = ఏ కన్పించుచున్న (స్వాభిః = తనయొక్క - అని పాఠాంతరము) అధ్వరచర్యాభిః = యజ్ఞానుష్ఠాన విధులతో. శ్రౌతమ్ = వేద సంబంధమగు. అర్థమ్ = అర్థమును - వేదార్థముననుట. కృతార్థయన్ = చరితార్థ మొనర్చుచు (స్థాపించుచు). అయే = ఓ రామభద్రా ! కులపతిః - విశ్వామిత్రుడు. సః అయమ్ = ఇతడే. ఇతః ఏవః = ఇటే. అభివర్తతే = వచ్చుచున్నాడు. (పథ్యావక్త్రము).

సంధులు :- అభిః + అధ్వర - రేఫాదేశవిసర్గ. సః + అయమ్ = ఉత్వాదేశ. సో + అయమ్ - పూర్వరూప. ఇతః + ఏవ - విసర్గలోప. ఏవ + అభి - సవర్ణదీర్ఘ.

(తతః ప్రవిశతి దీక్షితవేషో విశ్వామిత్రః)

రామః :- (నిర్వర్ణ్య సబహుమానమ్) వత్స లక్ష్మణ పశ్య —

కర్మణః క్రియమాణస్య వ్యంజనై రధికోజ్జ్వలామ్ ।
తప స్తేజోమయీం లక్ష్మీమద్య పుష్ణాతి నో గురుః॥ 38

---

క్రియ :- వృతుఙ్ వర్తనే. ఆత్మనే. లట్. ప్రథమ [అధ]
వర్తతే - వర్తేతే - వర్తన్తే

(తతః = అంతట, దీక్షితవేషః=దీక్షావస్త్రాలతో, విశ్వామిత్రుడు, ప్రవిశతి = ప్రవేశించును)

వత్సేతి :- (నిర్వర్ణ్య = పరిశీలనగా చూచి. సబహుమానమ్ = సగౌరవముగా) వత్స = సోదరా । లక్ష్మణ = సౌమిత్రీ । పశ్య = చూడుము—

కర్మణ ఇతి:- క్రియమాణస్య కర్మణః అద్య నః గురుః వ్యంజనైః అధికోజ్జ్వలామ్ తపస్తేజోమయీమ్ లక్ష్మీమ్ పుష్ణాతి.

అర్థము :- క్రియమాణస్య = వేదప్రతిపాదితమగు, కర్మణః = యాగకార్యకలాపమునకు, అద్య = నేడు, నః = మనయొక్క, గురుః = గురువుగారగు విశ్వామిత్రుడు, వ్యంజనైః= దీక్షావస్త్రాది చిహ్నములతో, అధికోజ్జ్వలామ్= మిక్కిలి ప్రకాశించినదై. తపస్తేజోమయీమ్ = తపఃకాంతి రూపమగు, లక్ష్మీమ్= శోభను, పుష్ణాతి = వృద్ధిపొందించుచున్నాడు. దీక్షావేషములో అధిక తేజోమయుడై ప్రకాశించుచున్నాడనుట. (పథ్యావక్త్రము)

సంధులు :- వ్యంజనైః + అధిక — రేఫాదేశవిసర్గ - అధిక + ఉజ్జ్వలామ్ - గుణసంధి. ఉత్ + జ్వలామ్ - శ్చుత్వసంధి. తపః + తేజో - సాదేశవిసర్గ. నః + గురుః = ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- పుష పుష్టౌ (క్ర్యా) పరస్మై. లట్. ప్రథమ
పుష్ణాతి - పుష్ణీతః - పుష్ణన్తి

హంతేతి:- (పరిక్రామన్ = ముందునకు నడుచుచు. సహర్షమ్ = సంతోషముతో) హంత = హాహ్మయ్య. ఆత్మానమ్=నన్ను నేను. కృతకృత్యప్రాయమ్=

విశ్వామిత్రః :- (పరిక్రామన్, సహర్షమ్) హంత కృతకృత్యప్రాయమాత్మానం పశ్యామః. యతః—

నిర్వృత్తో బహు తావదధ్వరభుజామాతర్పణోఽయం విధి
ర్దాయాదేన సమం సుకేతుదుహితా చాద్యైవ ఘానిష్యతే।
పాణౌకృత్య పునర్వృషధ్వజ ధనుర్భంగైకశుల్కాం వధూ
మైక్ష్వాకే సురకార్యదిక్షు చలతి స్వాస్థ్యం విధాతాస్మహే॥ 39

కృతకృత్యుడ నయినట్లే. పశ్యామః = భావించుచున్నాము (ను). యతః = ఎందువల్లననగా-

నిర్వృత్తఇతి :- అధ్వరభుజామ్ ఆతర్పణః అయమ్ విధిః తావత్ బహు నిర్వృత్తః. దాయాదేన సమమ్ సుకేతుదుహితా చ అద్య ఏవ ఘానిష్యతే. పునః వృషధ్వజధనుర్భంగైకశుల్కాం వధూం పాణౌకృత్య ఐక్ష్వాకే సురకార్యదిక్షు చలతి (సతి) స్వాస్థ్యమ్ విధాతాస్మహే.

అర్థము :- అధ్వరభుజామ్ = యాగభోక్తలగు దేవతలకు. ఆతర్పణః = తృప్తిహేతువగు. అయమ్ = ఈ. విధిః = యజ్ఞక్రియ. బహు = (ఇంచుమించు) చాలవఱకు. నిర్వృత్తః = నిర్వహింపబడినది - కించిదవశిష్టమై యున్నదనుట. దాయాదేన సమమ్ = పుత్రునితో (సుబాహుండు) సమముగా; (దాయాదస్తు భవేత్పుంసి సపిండే తనయేఽపిచ) సుకేతుదుహితా చ = తాటకయు. అద్యైవ = నేడే. ఘాని ష్యతే = చంపబడనున్నది. పునః = అటుపైని. వృషధ్వజ = పరమేశ్వరునియొక్క ధనుః = శరాసనమును. భంగ + ఏక = భంగపరచుటన్నదే. శుల్కామ్ = (కట్నముగా) పణముగా కల్గిన (శుల్కమ్ ఘట్టాదిదేయేస్యాత్పణే చ). వధూమ్ = పెండ్లికూతును (సీతను). పాణౌకృత్య = చెట్టపట్టి. ఐక్ష్వాకే = రఘురాముడు. సుర కార్యదిక్షు = దేవతల కార్యమును తీర్చుట కుద్దేశింపబడిన దక్షిణ దిశలయందు - దక్షిణదిక్ప్రదేశములయందనుట, చలతి (సతి) = సంచరించుచుండగా - వన వాసము చేయుచుండగాననుట. స్వాస్థ్యమ్ = సత్కర్మాచరణకు వలసిన చిత్తస్థైర్య మును. విధాతాస్మహే = పడయుదుము. (ధనుర్భంగైక మూల్యామ్ అని పాఠాంతరము). శార్దూలము.

(రామలక్ష్మణావుత్థాయోపసర్పతః)

విశ్వామిత్రః :- (రామమతిచిరం నిర్వర్ణ్య సస్నేహకౌతుకమ్)

ఏష వైహారికం వేషమాదధానో ధనుర్ధరః ।
తత్త్వమాంతరమస్మాకమమృతైరివ లింపతి॥ 40

---

సమాసములు :- సుకేతోః దుహితా. పాణౌకృత్య - నిత్యం హస్తే పాణావుపయమనే అని గతి సంజ్ఞ. కుగతిప్రాదయః అని సమాసము. ల్యబాదేశము. వృషధ్వజస్య ధనుః - ధనుషః భంగః - భంగః ఏవ ఏకం శుల్కం యస్యాస్తామ్. సురాణాం కార్యమ్ - సురకార్యార్థం దిశః - తాను. (శాకప్రియో పార్థివః—శాకపార్థివః అన్నట్లు మధ్యమపదలోపి సమాసము.)

సంధులు :- విశ్వామిత్రః + ఇహా - ఉత్వాదేశవిసర్గసంధి. తర్పణః + అయమ్—ఉత్వాదేశవిసర్గ — తర్పణో + అయమ్ — పూర్వరూప. విధిః + దాయాదేన ధనుః + భంగ — రేఫాదేశవిసర్గ. చ + అద్య — సవర్ణదీర్ఘ. అద్య + ఏవ — భంగ + ఏవ — వృద్ధి.

క్రియ :- హన హింసాగత్యోః. ఇతి కర్మణి ల్ృట్, ఆత్మనే. ప్రథమ

హనిష్యతే - హనిష్యేతే - హనిష్యంతే

డుధాఞ్ ధారణపోషణయోః, ఆత్మనే. లుట్. ఉత్తమ(వి)

ధాతాహే - ధాతాస్వహే - ధాతాస్మహే.

(రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఉత్థాయ = లేచి. ఉపసర్పతః = సమీపింతురు)

ఏషఇతి :- (రామమ్ = రాముని, అతిచిరమ్ = చాలసేపు. నిర్వర్ణ్య = పొగడికతో చూచి. సస్నేహకౌతుకమ్ = స్నిగ్ధత్వము కుతుకత్వములతో) ఏషః = ఈ రాముడు. వైహారికమ్ = విహారము ప్రయోజనముగాగల (విహారో భ్రమణే స్కంధే వేలాయాం సుగతాలయే విశ్వః). వేషమ్ = ఆకారమును. ఆదధానః = ధరించినవాడై ధనుర్ధరః = ధనుర్ధారియై. అస్మాకమ్ = మా యొక్క. అంతరమ్ తత్త్వమ్ = అంతరంగమును. అమృతైః ఇవ = సుధలతో వలె. లింపతి = పూయుచున్నాడు — హృదయమును అమృతముతో నింపుచున్నాడనుట. (పథ్యావక్త్రము)

ఉభౌ :- (ఉపసృత్య) భగవన్, దాశరథీ రామలక్ష్మణావభివాదయేతే.
విశ్వామిత్రః :- (ఆలింగ్య) వత్సౌ. కిమన్యదాశాస్మహే.

యువాభ్యామభినిర్వృత్త యోగక్షేమస్య వజ్రిణః ।
ఐశ్వర్యప్రక్రియామాత్రకృతార్థాః సన్తు హేతయః॥ 41

---

సంధులు :- ఏషః + పైహారికమ్–తదేతద్విసర్గలోప. దదనః + ధనుః–ఉత్వాదేశవిసర్గ. ధనుః + ధరః. అమ్భైః + ఇవ – రేఫాదేశవిసర్గ.

క్రియలు :- లిపఙ్ ఉపదేహే. లట్. పరస్మై. ప్రథమ (శేముచా దీనామ్–నుమ్)

లింపతి – లింపతః – లింపన్తి

భగవన్నితి :- (ఉపసృత్య = సమీపించి) భగవన్ = మహాత్మా। దాశరథీ = దశరథుని పుత్రులమగు, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులము. అభివాదయేతే = నమస్కరించుచున్నాము.

వత్సావితి :- (ఆలింగ్య = కౌగిలించుకొని) వత్సౌ = నాయనలారా।, అన్యత్ = మరియొకటి. కిమ్ = ఏమి, ఆశాస్మహే = ఆశించము। మీ దిక్పాలింగన ములకన్న మాకు అభిలషణీయము లేదనుట.

యువాభ్యామితి :- యువాభ్యామ్ = మీ ఇరువురిచేత. అభినిర్వృత్త = పూర్తిగా నిర్వహింపబడిన. యోగక్షేమస్య = యోగక్షేమములు కలవాడైన వజ్రిణః = దేవేంద్రునికి. హేతయః = వజ్రాయుధము మొదలగు సాధనములు, ఐశ్వర్యప్రక్రియా మాత్ర = ఐశ్వర్యప్రకారమాత్ర సూచకములై. కృతార్థాః = చరితార్థములు. సన్తు = అగుగాక। అతని ఆయుధములు పనిలేనివై అలంకారప్రాయములగుగాక అనుట. (వత్యావస్థము)

సమాసములు:- యోగశ్చ క్షేమశ్చ – అభినిర్వృత్తౌ యోగక్షేమౌ యస్య సః – తస్య. ఐశ్వర్యస్య ప్రక్రియా – అవధారణార్థే మాత్రమ్ – ఐశ్వర్య ప్రక్రియా మాత్రత్వేన కృతార్థాః.

క్రియ :- అస భువి. పరస్మై. లోట్. ప్రథమ

అస్తు/స్తాత్ – స్తామ్ – సన్తు.

(ఉభౌ తూష్ణీ మధోముఖౌ స్తః)

(విహస్య) వత్సౌ, సమంతాదుపశీలితోఽయం సన్నివేశః । కచ్చిదస్మదీయా స్తపోవనభూమయో రమయన్తి వాముపస్నేహయతి వా గార్హస్థ్య మృషీణామ్ ।

ఉభౌ :- (సప్రశ్రయమ్) భగవన్,

రమ్యమేతదరమ్యం వా కః పరిచ్ఛేత్తుమర్హతి ।
కిం తు ద్వయాతిగం చిత్తమద్య నౌ పశ్యతోఽరభూత్॥ 42

---

అలంకారము :- దేవేంద్రునికి స్వాస్థ్యమునుచేకూర్చి వజ్రాయుధమును అలంకారప్రాయ మొనర్చుడనుటతో సర్వరాక్షస సంహారము మీరే చేయుడనుట గమ్యమానమగుచున్నది - పర్యాయోక్తము. పర్యాయోక్తంతు గమ్యస్య వచో భంగ్యంతరాశ్రయమ్ ।

(ఉభౌ = ఇరువురును, తూష్ణీమ్ = మౌనముగా, అధోముఖౌ స్తః=తలలువంచి నిలిచిరి)

వత్సావితి :- (విహస్య = నవ్వి), వత్సౌ = నాయనలారా । అయమ్=ఈ, సన్నివేశః = ఆశ్రమము, సమంతాత్ = పూర్తిగా, కచ్చిదుపశీలితః = పరిశీలింపబడినదా । ఆశ్రమమంతయు చూచితిరా అనుట. అస్మదీయాః = మాకు చెందినవైన, తపోవనభూమయః = తపోవన ప్రదేశములు, వామ్ = మీ ఇరువురిని, రమయన్తి కచ్చిత్ = ఆనందింపచేయుచున్నవా । ఋషీణామ్ = ఇచ్చటనున్న మునులయొక్క, గార్హస్థ్యమ్ = గృహస్థాశ్రమధర్మము, ఉపస్నేహయతి వా = సంతోషపెట్టుచున్నదా।

రమ్యమితి :- (సప్రశ్రయమ్ = సవినయముగా), భగవన్=మహాత్మా! ఏతత్ = ఇది, రమ్యమ్వా = అందమైనదా, ఏతత్=ఇది, అరమ్యమ్ వా=అందముగా లేదా, పరిచ్ఛేత్తుమ్=నిశ్చయించుటకు కః=ఎవడు, అర్హతి=సమర్థుడగును-మా యిరువురిలో నెవడును ఇట్టి నిశ్చయమును ఇచ్చట దేని విషయమునను చేయలేడనుట. కిన్తు= కానీ, అద్య=నేడు, పశ్యతోః = ఈ తపోవనమును చూచుచున్నవారమగు, నౌ=మా ఇరువురియొక్క, చిత్తమ్ = అంతరంగము (మనస్సు), ద్వయాతిగమ్ = రజస్తమో గుణములను దాటిపోయినదిగా - కేవల సత్త్వగుణ సంపన్నముగా, అభూత్ = అయ్యెను. (షష్ఠ్యావస్త్రిము) (ద్వయమతిగచ్ఛతి - ద్వయాతిగమ్).

(ఇతి సర్వే యథోచితముపవిశన్తి)

విశ్వామిత్రః :- (సాకూతస్మితమ్) వత్సౌ.

ఇహవనేషు స కౌతుకవామనో మునిరతప్త తపాంసి పురాతనః।
తమివ వామవలోక్య తపస్వినో నయనమద్య మనాగుదమీమిలన్॥ 43

---

సంధులు :- ద్వయ + అతిగమ్ - సవర్ణదీర్ఘసంధి. పశ్యతోః + అభూత్ - రేఫాదేశవిసర్గ సంధి.

క్రియలు :- అర్హ పూజాయామ్, పరస్మై. లట్ ప్రథమ
అర్హతి - అర్హతః - అర్హన్తి
భూ సత్తాయామ్, పరస్మై. లుఙ్, ప్రథమ
అభూత్ - అభూతామ్ - అభూవన్

(ఇతి = అని. సర్వే = అందరును, యథోచితమ్ = తత్తదుచితముగా ఉపవిశన్తి = కూర్చుందురు.)

ఇహేతి :- (సాకూతస్మితమ్=సాభిప్రాయమగు చిఱునవ్వుతో) వత్సౌ = రామలక్ష్మణులారా। ఇహ = ఈ. వనేషు=ఆశ్రమభూములయందు, కౌతుకవామనః= క్రీడావినోదముగా వామనుడైన, కపటవామనుడనుట, సః = ఆ, పురాతనః = ప్రాచీనుడగు, మునిః = మహర్షి, తపాంసి అతప్త = తపస్సులను చేసెను. వామ్ = మీ ఇరువురిని, తమ్ ఇవ = వానినివలె, అవలోక్య = భావించి - మిమ్ము చూచి విష్ణుమూర్తి అనుకొని-రామాదులు నల్వురును కలిపి విష్ణ్వవతారమనుట, తపస్వినః = ఈ మునులు, అద్య = అప్పటికీనాడు, నయనమ్ = కన్నోయిని (జాత్యేక వచనము) మనాక్ = కొంచెముగా. ఉదమీమిలన్ = తెరిచిరి. ఇంకను పూర్తిగా ధ్యానమునుండి వీరు విడివడలేదనుట. (కించిదీషన్మనాగల్పమ్ - అమరము)

సమాసములు :- కౌతుకేన వామనః - కౌతుకజనకో వామనః-(మధ్యమపదలోపి) - కౌతుకం కపటేఽపి స్యాత్.

సంధులు :- సః + కౌతుక - ఏతత్తదోః సులోప సంధి. వామనః + మునిః - తపస్వినః+నయన - ఉత్వాదేశ విసర్గ. మునిః + అతప్త - రేఫాదేశవిసర్గ.

(ఉభౌ ముహూర్తమున్మనీభవతః)

(స్వగతమ్) అయే. కిమప్యుత్సాహవర్ధనాయ ప్రాగ్భవీయమనుస్మారిత మంతఃకరణ మనయోః. తదేతావదస్తు. అన్యతః ప్రక్షిపామి. (ప్రత్యగవలోక్య ప్రకాశం ససంభ్రమమ్) కథముదయగిరి కాశ్మీర కుంకుమకేదారస్య ప్రభాతసంధ్యాలతాయాః ప్రథమస్తబకో గభస్తిమాలీ హస్తాహస్తికయా కుతూహలినీభిర్దిగంగనాభిః వారుణీం యావదుపనీతః. (సనిర్వేదం చ)

---

క్రియ :- తప సంతాపే (కర్మవద్భావాదాత్మనేపదమ్), లుఙ్
(తపఙ్ ఐశ్వర్యే వా)

అతప్త - అతప్సాతామ్ - అతప్సత

మీల నిమేషణే. పరస్మై. లఙ్. ప్రథమ (ఉత్)

అమీమిలత్ - అమీమిలతామ్ - అమీమిలన్

ఛందస్సు :- ద్రుత విలంబితము. ద్రుతవిలంబితమాహ నభౌ భరౌ.

| న | భ | భ | ర |
|---|---|---|---|
| I I I | U I I | U I I | U I U |
| ఇహవ | నేషున | కౌతుక | వామనో |

(ఉభౌ = రాఘవులిరువురును. ముహూర్తమ్=క్షణకాలము. ఉన్మనీభవతః = (పూర్వ జన్మవృత్తాంత శ్రవణము వలన) ఔత్సుక్యవంతులయిరి లేక – కళవళపడిరి.)

అయేఇతి : (స్వగతమ్ = తనలో), అయే = అహో ! కిమపి=ఏదో. ఉత్సాహవర్ధనాయ = వీరి ఉత్సాహము పెంచుటకొఱకు. అనయోః = వీరికి ప్రాగ్భవీయమ్ = క్రిందటి జన్మకు సంబంధించిన. అంతఃకరణమ్ = సంస్కార విశేషము, అనుస్మారితమ్ = గుర్తు చేయబడినది. తత్ = అది ఏతావత్ అస్తు = ఇంతటనుండుగాక ! - ఇకచాలుననుట. అన్యతః=వేరొక అంశమునకు. ప్రక్షిపామి= మరలింతును. (ప్రత్యక్ = పశ్చిమమునకు–దిగ్దేశకాలే పూర్వాదౌ ప్రాగుదక్ప్రత్యగాదయః – అమరము–, అవలోక్య = చూచి. ససంభ్రమమ్ = సంభ్రమముతో. ప్రకాశమ్ = అందరికిని వినబడునట్లు) కథమ్ = ఎట్టూ ! ఉదయగిరి = తూర్పు కొండ అనునట్టి. కాశ్మీర కుంకుమ కేదారస్య = కాశ్మీరకుంకుమ పండునట్టి

యాతోఽస్తమేష చరమాచలచూడచుంబీ
పంకేరుహప్రకర జాగరణప్రదీపః ।
ఆః సర్వతః స్ఫురతు కైరవమాః పిబంతు
జ్యోత్స్నాకరంభ ముదరంభరయశ్చకోరాః ॥ 44

---

క్షేత్రముయొక్క- (కుంకుమము కాశ్మీరమునందు పండుననుట ప్రసిద్ధము - కాశ్మీర కుంకుమ మనగా మంచికుంకుమ అనియు). ప్రభాతసంధ్యాలతాయాః = తొలిసంజ తీగకు - తొలిసంజ అనునట్టి లత ఉదయగిరి అనునట్టి కుంకుమక్షేత్రమున ఉద్భవించిన దనుటచే ప్రభాతసంధ్య అనునట్టి కుంకుమవల్లికి అని తాత్పర్యము) - ప్రథమ స్తబకః = మొదటి పూలగుత్తి (వంటివాడు) అగు గభస్తిమాలీ = సూర్యుడు. కుతూహలినీభిః = కుతూహలముతో గూడినవారైన. దిగంగనాభిః = దిక్కాంతలచేత హస్తాహస్తికయా = చేయిచేయి కలిపి. వారుణీమ్ = పశ్చిమదిశనుగూర్చి యాపత్ ఉపనీతః = కొనిపోబడినాడు. (యాపత్తావచ్చ సాకల్యేఽవధౌ మానేఽవధారణే - అమరము). (హస్తాహస్తికయా అని పాఠాంతరము. మయూరవ్యంసకాది పాఠముచే సమాసము. మత్వర్థమున ఠన్ ప్రత్యయము హస్తేహస్తే-ఇచ్ఛ-ర్థ వ్యతిహారే. అన్యేభ్యోఽపి దృశ్యతే అని టీర్ఘము. న సామివచనే అను జ్ఞాపకముచే స్వార్థమున కన్ ప్రత్యయము) (ససిర్వేదం చ = వైరాగ్యజన్యమగు మనః ఖేదముతో).

యాతఇతి:- చరమాచల చూడచుంబీ పంకేరుహ ప్రకర జాగరణ ప్రదీపః ఏషః అస్తం యాతః. ఆః కైరవమ్ సర్వతః స్ఫురతు. ఆః, ఉదరంభరయః చకోరాః జ్యోత్స్నాకరంభమ్ పిబంతు.

అర్థము :- చరమాచల=అస్తాద్రియొక్క-. చూడ = శిఖరమును. చుంబీ= స్పృశించువాడును. పంకేరుహ ప్రకర= పద్మసమూహమును.జాగరణ=మేల్కొల్పునట్టి ప్రదీపః = దీపమువంటివాడును అయిన. ఏషః= ఈ సూర్యుడు. అస్తమ్ యాతః= అస్తమించెను. ఆః = అహో! (ఆః స్మరణేఽపాకరణే కోపసంతాపయోరపి - మేదినీ) కైరవమ్ = కలువ. సర్వతః = పరిపూర్ణముగా. స్ఫురతు = వికసించుగాక! ఆః ఉదరంభరయః = పొట్టకూటివగు (ఉభౌ త్వాత్మంభరిః కుక్షింభరిః స్వోదరపూరకే - అమరము). చకోరాః = వెన్నెల పిట్టలు. జ్యోత్స్నా = వెన్నెల అనునట్టి. కరంభమ్=

(సర్వతో౽వలోక్య)

అయమపి ఖరయోషిత్కర్ణకాషాయమీష
ద్విసృమరతిమిరోర్ణా ఛిన్నరోమాంతమర్చిః ।

---

మట్టిగతేటను (చిరంభో దధిసక్తిషః) పిబంతు = త్రాగుగాక! (సూర్యాస్తమయమున బాధతో కలిగినకోపము). లాతో ధిగేషః అని పాఠాంతరము. ధిక్ గర్హార్థకము. జ్యోత్స్నాం కషాయమధురామధునా చకోరాః అనియు పాఠము. కషాయమధురామ్ = చిక్కనైన తీయనైన. జ్యోత్స్నాం = వెన్నెలను, అధునా = ఇప్పుడు ఇంక, పిబంతు అని అన్వయము (వసంత తిలక) కొన్ని ప్రతులలో ఈ శ్లోకము లేదు.

సంధులు :- యాతః + అస్తమ్ - ఉత్వాదేశ పూర్వరూప, చరమ + అచల - సవర్ణదీర్ఘ. ఉదరంభరయః + చకోరాః - రాదేశవిసర్గ.

సమాసములు :- చరమాచలచూడచుంబీ — చరమాచలస్య చూడమ్ చుంబితుం శీలమస్య. పంకేరుహాణాం ప్రకరః - ప్రకరస్య జాగరణమ్ — జాగరణే ప్రదీప ఇవ ప్రదీపః. జ్యోత్స్నా రూపాః కిరణాః - తమ్. ఉదరం బిభర్తీతి — ఫలే గ్రహిరాత్మంభరిశ్చ — చకారాత్ కుక్షింభరిః ఉదరంభరిః.

క్రియ :- స్ఫుర స్ఫురణే సంచరణే చ. పరస్మై. లోట్. ప్రథమ
స్ఫురతు / స్ఫురతాత్ — స్ఫురతామ్ — స్ఫురన్తు
పా పానే పరస్మై. లోట్. ప్రథమ
పిబతు / పిబతాత్ - పిబతామ్ — పిబన్తు

[ సర్వతః = అన్నివైపులకును, అవలోక్య = చూచి ]

అయమపీతి :- అయమ్ = ఈ, భానుమాన్ అపి = సూర్యుడును, ఖరయోషిత్ = ఆడుగాడిదయొక్క. కర్ణ = చెవివలె. కాషాయమ్ = ఎఱ్ఱనైనదియు ఈషత్ = కొంచెము కొంచెముగా. విసృమర = వ్యాపించుచున్న. తిమిర = చీకటి అనునట్టి. ఊర్ణా = సాలిగూడు తంతువులచేత లేక మేషరోమములచేత.(ఊర్ణామేషాదిలోమ స్యాత్) ఛిన్నరోమాంతమ్=కప్పివేయబడుచున్న కొనలు కలదియునైన అర్చిః = వెలుగును - సూర్యకిరణముల కొనలకు చీకటి ముసురుచున్నదనుట, మదకల = మదించిన [భవేన్మదకలో మత్తే - అమరము] కలవింకీ = ఆడు పిచ్చుకలయొక్క

మదకలకలవింకీ కాకునాందీకరేభ్యః
క్షితిరుహశిఖరేభ్యో భానుమానుచ్చినోతి॥ 45

మంత్రసంస్కారసంపన్నా స్తన్వదౌదన్వతీరపః ।
ఏత త్త్రియామయం జ్యోతిరాదిత్యాఖ్యం నిమజ్జతి। 46

---

[చటకః కలవింకః – అమరము]. కాకు = కలకలారవములతో. నాందీకరేభ్యః = మంగళస్తోత్రములను సమకూర్చుచున్న. క్షితిరుహ = వృక్షములయొక్క. శిఖరేభ్యః= అగ్రభాగముల నుండి. ఉచ్చినోతి = ఉపసంహరించుకొనుచున్నాడు.

తాత్పర్యము :– అస్తమించుచున్న సూర్యుని కిరణములు గాడిదచెవివలె ఎఱుపులైనవి. తిమిరస్పర్శతో మేషరోమములవలె నైనవి. వృక్షాగ్రభాగములనుండి ఆకిరణములను ముడుచుకొనుచు దేశాంతరగతుడగుచున్న సూర్యునికి పక్షుల కిలకిలారవములు వందిమాగధస్తోత్రము లైనవి.

సమాసములు ;– ఖరస్య యోషిత్ – యోషితః కర్ణః – కర్ణ ఇవ కాషాయమ్. ఈషద్విస్పృమరం చ తత్తిమిరం చ – తిమిరమేవ ఊర్ణా – ఊర్ణయా జర్జరముపాంతం యస్య తత్. మదకలాశ్చ తాః కలవింక్యశ్చ–కలవింకీనామ్ కాకుః– కాకు (ః) రేవ నాందీ – నాందీం కరోతీతి – నాందీకరః – తేభ్యః. క్షితిరుహాణాం శిఖరాః – తేభ్యః.

సంధులు :– తిమిర + ఊర్ణా, జర్జర + ఉపాంతమ్ – గుణసంధులు శిఖరేభ్యః + భాను – ఉత్వాదేశవిసర్గ. ఉత్ + చినోతి – శ్చుత్వసంధి.

ఛందస్సు :– మాలిని, ననమయయ యుతేయం మాలినీ భోగిలోకైః.

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| క్షితిరు | హశిఖ | రేభ్యోభా | నుమాను | చ్చినోతి |

అపిచ ;– మరియు

మంత్రేతి :– ఔదన్వతీః=సముద్రసంబంధులగు. అపః = జలములను. మంత్ర = వేద మంత్రములచేనైన. సంస్కార = పవిత్రతతో. సంపన్నాః = సంపన్నములుగా. తన్వత్ = చేయుచు – అట్టి పవిత్రతను జలములకు ఒనగూర్చుచు.

రామః :- (సర్వతోఽవలోక్య) వత్స, లక్ష్మణ,

తాపనై రేవ తేజోభిః ప్లుష్టనిర్వాణమేచకాః।
దిశో జాతాః ప్రతీచీ తు సముదాచరతి క్రమాత్॥ 47

---

ఏతత్ = ఇదే, త్రయీ మయమ్ = వేదత్రయరూపమై, ఆదిత్యాఖ్యమ్=ఆదిత్యుడు అను పేరుగల్గిన, జ్యోతిః = తేజోమండలము, నిమజ్జతి = పశ్చిమ సముద్రమున మునుగుచున్నది. సూర్యుడు వేదమయుడనుట ప్రసిద్ధము. అతడు మునుగుటతో సముద్రోదకములకు మంత్ర పవిత్రత వచ్చుననుట. [ పథ్యావక్త్రము. చూ. ప్రథమ-6]

విశేషములు :- అశ్వత్థం సింధురాజం చ నిత్యం సేవేత న స్పృశేత్ మందవారే స్పృశే త్స్వోఽశ్వం సింధురాజం తు పర్వణి – అనుటనుబట్టి పర్వేతరకాలము నందు సముద్రోదకములు అపవిత్రములు. వానిని పవిత్రీకరించుటు వేదమయుడు మునుగుచున్నాడని కల్పన.

సమాసములు :- మంత్రైః సంస్కారః - సంస్కారేణ సంపన్నాః. ఉదన్వతః ఇమాః - ఔదన్వతీః. ఆదిత్య ఇత్యాఖ్యా యస్య తత్.

సంధులు :- సంపన్నాః + ఉదన్వత్ - సాదేశవిసర్గ. జ్యోతిః + ఆదిత్య రేఫాదేశవిసర్గ. ఆదిత్య + ఆఖ్యమ్ - సవర్ణదీర్ఘ.

క్రియ :- టు మస్జో శుద్ధౌ. పరస్మై. లట్. ప్రథమ [ని]

మజ్జతి – మజ్జతః – మజ్జన్తి

వత్సేతి :- [ సర్వతః = అన్నివైపులకును, అవలోక్య = చూచి ] వత్స = సోదరా! లక్ష్మణ = సౌమిత్రీ!

తాపనై రితి :- తాపనైః = (తపన) సూర్యసంబంధులైన, తేజోభిః= కిరణజ్వాలలతో, ప్లుష్టా=దగ్ధములై, నిర్వాణ = చల్లార్చుటతో, మేచకాః = (బొగ్గువలె) నల్లనివిగా, దిశః = దిక్కులు, జాతాః = అయ్యెనవి. ప్రతీచీ తు = పశ్చిమ దిక్కు మాత్రము. క్రమాత్ = మెల్లమెల్లగా - క్రమముగా, సముదాచరతి = వానిని అనుకరించుచున్నది. ఇదియును క్రమక్రమముగా నల్లబారుచున్నదనుట. సముదాచరస్తు

కించ—

కాంచిద్బిభ్రతి భూతిమాశ్రమభువో వైతానవైశ్వానర
జ్వాలోపప్లవమాన ధూమవలభీ విభ్రాంతదిగ్భిత్తయః।
శ్రూయన్తే వటవస్తృతీయ సవన స్వాధ్యాయదీర్ఘానపి
స్పర్ధాబంధమనోహరం ప్రతిముహుః స్వాన్ ద్రాఘయన్తః స్వరాన్॥48

---

శోభాయాం పూర్వరూపే భయేఽపి చ విశ్వాః. నిర్వాణమస్తంగమనే. కాలశ్యామల మేచకాః, ప్రుష్ట ప్లుష్టోషితా దగ్ధే - అమరము. [దగ్ధ నిర్వాణ అనియు పాఠాంతరము]

కాంచిదితి:- కించ = మరియు - వైతాన = యజ్ఞ సంబంధియగు, వైశ్వానర = అగ్నియొక్క, జ్వాలా = మంటలచేత, ఉపప్లవమాన = వృద్ధిపొందింప బడి పైకెగయుచున్న, ధూమ = పొగచేత అవరింపబడిన, వలభీ = చూరులవలన, విభ్రాంత = కదలుచున్న [భ్రమను కల్గించుచున్న] దిగ్భిత్తయః = దిక్కుడ్యములు కలవై. చూరులనుండి వచ్చుచున్న ధూమవలయములు కదలుటతో దిక్కుడ్యములు కదులుచున్న భ్రాంతి కల్గుచున్నదనుట. ఆశ్రమభువః = ఈ ఆశ్రమ ప్రదేశములు, కాంచిత్ = ఏదో ఒక అనిర్వచనీయమగు. భూతిమ్ = శోభావిశేషమును. బిభ్రతి = వహించుచున్నవి. తృతీయ సవన = సాయంకాల యజ్ఞముయొక్క. స్వాధ్యాయ = అధ్యయనమునందు. (తపస్సునందు) దీర్ఘాన్ అపి = సహజముగా దీర్ఘములుగనే ఉండునట్టి, స్వాన్ = తమయొక్క, స్వరాన్ = స్వరములను (ఉదాత్తాదులు). స్పర్ధా బంధమనోహరమ్ = పరస్పర జిగీషతో మనోహరమగునట్లు, ప్రతిముహుః = మాటి మాటికిని. ద్రాఘయన్తః = మరింత దీర్ఘములుగా నుచ్చరించుచు, వటవః = ఆశ్రమ విద్యార్థులు (మాణవకులు). శ్రూయన్తే =వినబడుచున్నారు, అట్లు పఠించుచున్నారనుట. (శార్దూలము)

తాత్పర్యము :- యాగాగ్నిధూమము చూరుల నుండి ఎగయుచున్నది, దాని కదలికతో దిక్కులే కదలుచున్న భ్రాంతి కల్గుచున్నది. వటువుల వేదాధ్యయనము వినిపించుచున్నది. సాయంకాలాధ్యయనము — తారంతు విద్యాత్సవనం తృతీయం శిరోగతం తచ్చ తథా — ప్రయోజ్యమ్ అను శిక్షా వచనమునుబట్టి దీర్ఘస్వరముగా నుండును. వటువులు ఒకరికొకరు పోటీపడి మరింత దీర్ఘములు తీయుచున్నారు.

విశ్వామిత్రః :- వత్స, రాఘవ.

ఉష్ణత్విడ్భిర్దివసమధునా సర్వతస్తాభిరేవ
స్వచ్ఛాయాభిర్నిచుళితమివ ప్రేక్ష్యతే విశ్వమేతత్।
పర్యన్తేషు జ్వలతి జలధౌ రత్నసానౌ చ మధ్యే
చిత్రాంగీయం రమయతి తమఃస్తోమలీలా ధరిత్రీ॥ 49

---

సమాసములు :- అస్తమస్య భువః. వైతానశ్చాసౌ వైశ్వానరశ్చ – వైశ్వానరస్య జ్వాలాః – జ్వాలాభిరుపప్లవమానశ్చాసౌ ధూమశ్చ – ధూమేనావృతాః వలభ్యః – వలభీభిః విభ్రాంతాః – విభ్రాంతాః – దిగ్విత్తయః యాసు తాః. తృతీయం చ తత్సవనం చ – సవనే స్వాధ్యాయః – స్వాధ్యాయే దీప్తాః – తాన్. స్పర్ధాయాః బంధః – స్పర్ధాబంధేన మనోహారం యథా భవతి తథా. ముహుర్ముహురితి – ప్రతి ముహుః (వీప్సార్థకావ్యయీభావము).

సంధులు :- ఉషః + వైతాన – ఉత్వాదేశ విసర్గ. జ్వాలా + ఉపప్లవ గుణ. వటవః + తృతీయ – సాదేశ విసర్గ.

క్రియ :- డుభృఞ్ ధారణపోషణయోః (జ్హు) లట్. పరస్మై. ప్రథమ

బిభర్తి – బిభృతః – బిభ్రతి

త్రైఙ్ త్రాసనే కర్మణి, ఆత్మనే. లట్. ప్రథమ

త్రాయతే – త్రాయేతే – త్రాయన్తే

వత్సేతి :- వత్స = నాయనా। రాఘవ = రామభద్రా।

ఉష్ణత్విడ్భిరితి :- దివసమ్ = పగటి సమయమునందు, ఉష్ణత్విడ్భిః = (సూర్యకాంతిచే) వెలుగొలగినవియు, తాభిః = అవేయగు, స్వచ్ఛాయాభిః ఏవ = తన నీడలతోనే. అధునా = సూర్యుడస్తమించిన ఈ సమయమునందు, ఏతత్ = ఈ, విశ్వమ్ = జగత్తు, సర్వతః = అన్నివైపులనుండి, నిచుళితమ్ ఇవ = కప్పివేయబడినట్లు, ప్రేక్ష్యతే = కన్పించుచున్నది. పర్యంతేషు = (భూగోళముయొక్క) అంచులయందు, జలధౌ = సముద్రము (జాత్యేకవచనము). జ్వలతి = ప్రకాశించుచుండగా మధ్యే = నడిమి భాగమునందు, రత్నసానౌ = మేరుపర్వతము. జ్వలతి = విరాజిల్లుచుండగా. తమఃస్తోమలీలా = దట్టముగా వ్యాపించుచున్న చీకటియొక్క విలాసముతో

లక్ష్మణః :- (సనిర్వేదమ్)

తేజోమయం తమోమయమన్యతరస్యాం తదేవ దిక్చక్రమ్।
కిమపి విచిత్రా ధాత్రా సృష్టిరియం భువనకోశస్య॥ 50

---

కూడిన. ఇయమ్ = ఈ. ధరిత్రీ = భూగోళము. చిత్రాంగీ = చీకటి వెలుగులతో చిత్రమైన రూపము కలదై. రమయతి = ఆనందింపచేయుచున్నది. (తమస్తోమనీలా అని పాఠాంతరము).

తాత్పర్యము :— సూర్యాస్తమయమగుటతో నీడలు చీకటులై వ్యాపించు చున్నవి. మేరు పర్వతాగ్రములపై సముద్రములపై ఇంకను వెలుగురేకలు కన్పించు చున్నవి. ఈ చీకటివెలుగులకలయికతో భూగోళము విచిత్రముగా మారినది.

ఛందస్సు :- మందాక్రాంత. మందాక్రాంతా జలధిషడగైః మ్భౌనతౌ తాద్గురూ చేత్ — మ భ న తత గ గ. (4—6—7)

| మ | భ | న | త | త | గగ |
|---|---|---|---|---|---|
| U U U | U I I | I I I | U U I | U U I | U U |
| చిత్రాంగీ | యంరమ | యతిత | మస్తోమ | లీలాధ | రిత్రీ |

తేజోమయమితి :— (సనిర్వేదమ్ = నిర్వేదముతో) దిక్చక్రమ్ = దిశా సమూహము. తదేవ = అదే. అన్యతరస్యామ్ = వికల్పముగా. తేజోమయమ్ = కాంతిమంతము. తమోమయమ్=అంధకారబంధురము అగును. ధాత్రా=బ్రహ్మచేనైన. భువనకోశస్య = బ్రహ్మాండముయొక్క. ఇయమ్ = ఈ. సృష్టిః = సృష్టి. కిమపి = ఏదో. విచిత్రా = ఆశ్చర్యజనకము । (ఆర్య).

తాత్పర్యము:- ఒకే దిశాచక్రము ఒకసారి తేజోమయము మరొకప్పుడు తమోమయమగుచున్నది. ఇది సృష్టిలోని వైచిత్రి కదా। ధాతుః సృష్టిః అనియు పాఠాంతరము). ఉభయప్రాప్తౌ కర్మణి అను సూత్రముచే కర్మకు షష్ఠి రాగా కర్తకు తృతీయ.

చూడేతి :- (సర్వతః=అన్నివైపులకును, అవలోక్య=చూచి) స్ఫురద్భిః= ప్రకాశించుచున్న. చూడారత్నైః = శిరోమణులతో - జాతిపాముల పడగలపై మణు లుండుననుట కవిలోక ప్రసిద్ధము - విషధరవివరాణి = పాముపుట్టల రంధ్రములు,

(సర్వతోఽవలోక్య)

చూడారత్నైః స్ఫురద్భిర్విషధరవివరాణ్యుజ్జ్వలాన్యుజ్జ్వలాని
ప్రేక్ష్యంతే చక్రవాకీమనసి నివిశతే సూర్యకాంతాత్కృశానుః।
కిం చామీ శల్యయంతస్తిమిరముభయతో నిర్భరాహస్తమిస్రా
సంఘట్టోత్పిష్టసంధ్యాకణ నికరపరిస్పర్ధినో భాన్తి దీపాః॥ 51

---

ఉజ్జ్వలాని ఉజ్జ్వలాని = ఒక్కొక్కటియు మహోజ్జ్వలములుగా. ప్రేక్ష్యంతే=కనబడు చున్నవి. సూర్యకాంతాత్ = సూర్యకాంతమణి (సమూహము) నుండి. కృశానుః = అగ్ని. చక్రవాకీ మనసి = ఆడు చక్రవాకముయొక్క మనస్సునందు. నివిశతే=ప్రవే శించుచున్నది - సూర్యాస్తమయమగుటతో మగచక్రవాకము కన్పింపక చక్రవాకికి విర హాగ్ని ప్రకోపించుచున్నదనుట. కించ = మరియు. అమీ = ఈ. దీపాః = దివ్వెలు. ఉభయతః = రెండువైపులనుండియు. తిమిరమ్ = అంధకారమును. శల్యయన్తః = తుత్తునియలు చేయుచున్నవై. నిర్భర = అధికమైన. అహస్తమిస్రా = పగలు రేయి- ఈ రెంటింటియొక్క. సంఘట్ట = ఒత్తిడితో (రాపిడితో). ఉత్పిష్ట = నలిపివేయబడిన. సంధ్యా = సంధ్యాసమయముయొక్క. కణనికర = చిద్రుపల గుంపుతో (తునియలైన సంజతో) పరిస్పర్ధినః = పోటీపడుచున్నవై. భాన్తి = అలరారుచున్నవి. (తమిస్రా తామసీ రాత్రిః)

తాత్పర్యము :- పాముపుట్టల రంధ్రములనుండి మణికాంతు లెగయు చున్నవి. చక్రవాకములకు విరహోద్దీప్తి కల్గుచున్నది. చీకటివెలుగుల రాపిడిలో తునియ లుగా దూసిందిన సంజవెలుగువలె దీపకాంతు లతిశయించుచున్నవి. (శల్కయంతః అని పాఠాంతరము. సంధ్యానల కిరణ కణస్పర్ధినః అనియు, రాపిడికిలోనైన సంధ్యాగ్ని యొక్క విస్ఫులింగములతో పోటీపడుచున్నవని అర్థము.)

సమాసములు :- ధరతీతి ధరః - విషస్య ధరః — విషధరశబ్దము వల్మీ కమున కులక్షకము - విషధరాణాం - వల్మీకానాం వివరాణి. చక్రవాక్యాః మనః — తస్మిన్. అహశ్చ తమిస్రా చ - అహస్తమిస్రయోః సంఘట్టః - నిర్భరశ్చాసౌ అహస్తమిస్రాసంఘట్టః — సంఘట్టేన ఉత్పిష్టః - సంధ్యాయాః కణనికరః — ఉత్పిష్ట శ్చాసౌ సంధ్యాకణ నికరశ్చ - నికరేణ పరిస్పర్ధినః.

రామః :– (విలోక్య)

విశ్వం చాక్షుషమస్తమస్తి హి తమఃకైవల్యమౌపాధిక
ప్రాచ్యాది వ్యవహార బీజవిరహాద్దిఙ్మాత్రమేవ స్థితమ్ ।
గృహ్యంతే భయహేతవః పటుభిరప్యక్షాంతకై ర్భాంతి చ
ధ్వాంతేనాతిఘనేన వస్తు వచసా జ్ఞాతః స్వరేణాముకః॥ 52

---

సంధులు :– స్ఫురద్భిః + విష – రేఫాదేశవిసర్గ. విషరాణి + ఉజ్జ్వలాని + ఉజ్జ్వలాని – యణాదేశ. చ + అమీ. నిర్భర + అహాస్తమిస్రా – సవర్ణదీర్ఘ. కల్యయంతః + తిమిరమ్ – సాదేశవిసర్గ. ఉభయతః + నిర్భర – ఉత్వాదేశ విసర్గ. సంఘట్ట + ఉత్క్షిప్త – గుణసంధి. స్ఫర్ధినః + భాన్తి – ఉత్వాదేశవిసర్గ.

క్రియ :– ఈక్షిట్ దర్శనే (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ (ప్ర)
ఈక్ష్యతే – ఈక్ష్యేతే – ఈక్ష్యన్తే
విశ ప్రవేశనే (నేర్విశః – అని ఆత్మనే). లట్. ప్రథమ
నివిశతే – నివిశేతే – నివిశన్తే
భాదీప్తౌ. లట్. పరస్మై. ప్రథమ
భాతి – భాతః – భాన్తి

ఛందస్సు :– స్రగ్ధర. మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిమునియతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్. మరభనయయయ (7–7–7)

| మ | ర | భ | న | య | య | య |
|---|---|---|---|---|---|---|
| UUU | UIU | UII | III | IUU | IUU | IUU |
| చూడార | త్నైఃస్ఫుర | ద్భిర్విష | ధరవి | వరాణ్యు | జ్జ్వలాన్యు | జ్జ్వలాని. |

విశ్వమితి :– (విలోక్య=చూచి) చాక్షుషమ్=దృష్టిగోచరమగు. విశ్వమ్= జగత్తు (సమస్త వస్తుజాతమును) అస్తమ్ = అస్తమించినది – వస్తువేదియును కన్పించుటలేదనుట. తమఃకైవల్యమ్ = అంధకార కేవలత్వము – కేవలము అంధకారము. అస్తి హి=మిగిలినదిసుమా !. ఔపాధిక = ఉపాధి సంబంధముగా (సూర్యునియొక్క– అస్తిత్వముతో ననుట) ప్రాచ్యాది = తూర్పు మున్నగురీతి నేర్పడిన. వ్యవహార=వాడుకకు, బీజ = హేతువైన సూర్యునియొక్క. విరహాత్ = రాహిత్యమువలన (రవి లేకపోవుటవలన) దిఙ్మాత్రమ్ ఏవ = అంతయును ఒకటే దిక్కుగా. స్థితమ్ =

కిం చ—

---

ఉన్నది. పటుభిః అపి = సమర్థములైనప్పటికిని. అక్షాంతరైః = కన్నులుగాక తక్కిన ఇంద్రియములతో. భయహేతవః = భయకారణములు (రజ్జుసర్పాది భ్రాంతులు) గృహ్యన్తే = స్వీకరింపబడుచున్నవి. అతిఘనేన = మిక్కిలి దట్టమైన. ధ్వాంతేన = చీకటిచే (ఆవరింపబడి). వస్తు = పదార్థము. వచసా=ఎవరోఒకరు చెప్పుటతో. భాతి= తెలియుచున్నది. స్వరేణ = కంఠస్వరమునుబట్టి. అముకః = వీడు వీడని. జ్ఞాతః = తెలియబడుచున్నాడు. (శార్దూలవిక్రీడితము).

తాత్పర్యము :- గాఢముగా వ్యాపించిన చీకటిలో కంటికేమియు కన్పించుటలేదు. సూర్యుడు లేకపోవుటతో తూర్పు పడమర ఇత్యాది విభాగము పోయినది. అంతయు నొకటే గాఢాంధకారము. త్రాడును చూచి సర్పమనుకొనుట మొదలైన భయములు బయలుదేరినవి. ఇచ్చట ఈ వస్తువున్నది- ఇది ఈ పదార్థము అని ఎవరో చెప్పుటతో తెలియుచున్నది. కంఠస్వరమునుబట్టి వ్యక్తులను గుర్తుపట్టుట జరుగుచున్నది.

సమాసములు ;- ప్రాచ్యాదిశబ్దేన ప్రాచ్యాది వ్యవహారశ్చ-వ్యవహారస్య బీజమ్ - బీజస్య విరహాత్. భయస్య హేతవః.

సంధులు :- ప్రాచ్య + ఆది. ధ్వాంతేన + అతిఘనేన. స్వరేణ + అముకః - సవర్ణదీర్ఘ సంధులు. దిక్ + మాత్రమ్ - అనునాసికాదేశ. పటుభిః + అపి - రేఫాదేశవిసర్గ. అక్షాంతరైః + భాతి - రేఫాదేశవిసర్గ. అపి + అక్ష - యణాదేశ.

క్రియ ;- అస భువి. పరస్మై. లట్. ప్రథమ

అస్తి - స్తః - సన్తి

గ్రహఁ ఉపాదానే కర్మణి. ఆత్మనే. లట్. ప్రథమ

గృహ్యతే - గృహ్యేతే - గృహ్యన్తే

భా దీప్తౌ. పరస్మై. లట్. ప్రథమ

భాతి - భాతః - భాన్తి

కించ = మరియు

ఘనతరతిమిరఘుణోత్కరజగ్ధానామివ పతన్తి కాష్ఠానామ్ ।
ఛిద్రైరమీభిరుడుభిః కిరణవ్యాజేన చూర్ణాని ॥ 53

(నేపథ్యే కలకలః)

(సర్వే ససంభ్రమమాకర్ణయన్తి. పునస్తత్రైవ)

---

ఘనతరేతి :- ఘనతర = దట్టముగా అలముకొన్న. తిమిర = చీకటి యనునట్టి ఘుణోత్కర = వాసములను తొలుచు పురుగుల గుంపుతో. జగ్ధానామ్ ఇవ= తొలిచివేయబడినవోయన్నట్లు. కాష్ఠానామ్ = దిక్కులు అనునట్టి దారు ఖండముల యొక్క (దిశస్తు కకుభః కాష్ఠాః - అమరము). అమీభిః = ఈ. ఉడుభిః = నక్షత్రములు అనునట్టి. ఛిద్రైః = రంధ్రముల నుండి. కిరణవ్యాజేన = వెలుగులు నెపముతో చూర్ణాని =నుసులు, పతన్తి = రాలుచున్నవి. (ఆర్యావృత్తము చూ ప్రథమ - 10)

తాత్పర్యము :- దిక్కులు అనునట్టి కాష్ఠములను చీకట్లు అనునట్టి పురుగులు తొలిచివేయగా నక్షత్రములు అనునట్టి రంధ్రములేర్పడి వెలుగులు అనునట్టి నుసి రాలుచున్నది.

సమాసములు :- ఘనతరం చ తత్తిమిరం చ - ఘుణానా ముత్కరః తిమిర మేవ ఘుణోత్కరః - ఉత్కరేణ జగ్ధాః తాసామ్.

అలంకారము :- తిమిరఘుణోత్కరము - రూపకము కాష్ఠములనునట్టి కాష్ఠములు - శ్లిష్టరూపకము. ఛిద్రైః ఉడుభిః — వ్యస్తరూపకము. కిరణవ్యాజేన చూర్ణాని - కైతవాపహ్నుతి — కైతవాపహ్నుతిర్వ్యక్తౌ వ్యాజాద్యైర్నిహ్నుతేః పదైః నిర్యాన్తి స్మరనారాచాః కాంతాదృక్పాత కైతవాత్.

క్రియ :- పత్ల గతౌ. పరస్మై. లట్. ప్రథమ

పతతి - పతతః - పతన్తి

( నేపథ్యే = తెరలో. కలకలః = కలకలము )

(సర్వే = అందరును. ససంభ్రమమ్ = సంభ్రమముతో. ఆకర్ణయన్తి = వింరుదు. పునః = మరల. తత్రైవ = తెరలోనే -)

నిర్మజ్జదితి :- నిర్మజ్జత్ = గుంటలుపడి లోపలకుపోవునట్లున్న. చక్షుః= కన్నులయొక్క. అంతర్=అంతర్భాగమున - గుంట కన్నులలో అనుట. భ్రమత్ =

నిర్మజ్జచ్చక్షురంతర్భ్రమదతికపిశక్రూరతారా నరాస్థి
గ్రంథిం దంతాంతరాళగ్రథితమవిరతం జిహ్వయా ఘట్టయన్తీ।
ధ్వాంతేఽపి వ్యాత్తవక్త్రజ్వలదనలశిఖాజర్జరే వ్యక్తకర్మా
నిర్మాన్తీ గృధ్రరౌద్రీం దివముపరి పరిక్రీడతే తాడకేయమ్॥ 54

---

కదలాడుచున్న. అతికపిశ = పింగళ వర్ణములోనున్న. క్రూర = భీకరములగు. తారా = కనుగ్రుడ్లు కలదియు; దంతాంతరాళ = దంతముల మధ్యభాగమున గ్రథితమ్ = కరుచుకొన్న. నరాస్థిగ్రంథిమ్ = మానవుని కీలుఎముకను - మోచేయి మోకాలు మున్నగు స్థలములయందలి ఎముక అనుట. అవిరతమ్ = మాటిమాటికిని. జిహ్వయా = నాలుకతో. ఘట్టయన్తీ = చప్పరించుచున్నదియు; వ్యాత్త = పెద్దగా తెరువబడిన. వక్త్ర = ముఖమునందు. జ్వలత్ = మండుచున్న. అనల శిఖా = అగ్ని జ్వాలలతో. జర్జరే = వోగొట్టబడిన (శిథిలముగావింపబడిన). ధ్వాంతే అపి = చీకటి యందును. వ్యక్త = స్పష్టపడుచున్న. కర్మా = పనులు కలదియు - దాని కదలికలు ఆ వెలుగులో కన్పించుచున్నవనుట; దివమ్ = ఆకాశమును. గృధ్రరౌద్రీమ్ = గ్రద్దలు ఎగురుచున్న రుద్రభూమిగా. నిర్మాన్తీ = చేయుచున్నదియునై. ఇయమ్ = ఇదే. తాడకా = తాడక. ఉపరి = ఆకాశమునందు. పరిక్రీడతే = స్వేచ్ఛగా సంచరించు చున్నది. (స్రగ్ధర)

తాత్పర్యము :— పింగళ వర్ణములో కనుగ్రుడ్లు భీకరముగా నున్నవి. మానవాస్థికలను నోటగరచి చప్పరించుచున్నది. దంతఘట్టనాదులతో నిప్పులు ఉమియు చున్నది. ఆ వెలుగులో కన్పించుచున్నది. ఆకాశమును రుద్రభూమిగా చేయుచున్నది. ఇదే తాడక వచ్చుచున్నది.

సమాసములు :- నిర్మజ్జచ్చ తచ్చక్షుశ్చ - చక్షుషోరంతర్భ్రమంతీ - అతి కపిశా చ సా క్రూరా చ సా తారా చ - భ్రమంతీ - అతికపిశక్రూరతారే యస్యాః సా. నరస్య అస్థ్నో గ్రంథిమ్. దంతానామంతరాళః - అంతరాళే గ్రథితమ్. వ్యాత్తం చ తద్వ క్త్రమ్ చ వక్త్రే జ్వలన్తీ చ సా అనలశిఖా (అనలస్య శిఖా). అనల శిఖయా జర్జరమ్ — తస్మిన్. వ్యక్తం కర్మ యస్యాః సా. గృధ్రైః రౌద్రీ — తామ్.

అపిచ —

త్రేతాగ్నికుండపూరం చ వర్షన్తో రుధిరచ్ఛటాః।
హింస్రాః సుబాహుమారీచమిశ్రా నః పరివృణ్వతే॥ 55

విశ్వామిత్రః :- (సాకూతమ్) కథం తాడకా ! వత్స, రామభద్ర,

---

సంధులు :- నిర్మజ్జత్ + చయః = శ్చుత్వ సంధి. చయః + అంతర్ రేఫాదేశవిసర్గ. నర + అస్థి. దంత + అంతరాళ - సవర్ణదీర్ఘ. ధ్వాంతే + అపి - పూర్వరూప.

క్రియ :- క్రీడృ విహారే (క్రీడోఽనుసంపరిభ్యశ్చ-ఆత్మనే) లట్. ప్రథమ

పరిక్రీడతే - పరిక్రీడేతే - పరిక్రీడన్తే

త్రేతాగ్నీతి :- అపి చ = మరియు — హింస్రాః = ఘాతుకులైన (శరారుః ఘాతుకో హింస్రః-అమరము). సుబాహు మారీచ మిశ్రాః = సుబాహుడు మారీచుడు ప్రధానులుగా కలిగిన రాక్షసులు. త్రేతాగ్నికుండపూరమ్ = త్రేతాగ్నులున్న కుండములకు నిండుగా - అవి నిండిపోవునట్లుగా. రుధిరచ్ఛటాః = రక్తధారలను. వర్షంతః=కురియుచున్నవారై. నః = మనలను. పరివృణ్వతే = చుట్టుముట్టుచున్నారు.

తాత్పర్యము :- మారీచ సుబాహుల నాయకత్వమున రాక్షస బృందము అగ్నికుండములలో రక్తధారలు గ్రుమ్మరించుచు ఆశ్రమమును చుట్టుముట్టుచున్నది. (పథ్యావక్త్రము).

సమాసములు :- త్రేతాగ్నీనాం కుండమ్ - తాని పూరయిత్వా. రుధిరస్య ఛటాః. సుబాహుశ్చ మారీచశ్చ—సుబాహుమారీచౌ మిశ్రౌ యేషాం తే — సుబాహుమారీచభ్యాం మిశ్రాః.

సంధులు :- త్రేత + అగ్ని - సవర్ణదీర్ఘ. వర్షంతః + రుధిర - ఉత్వాదేశవిసర్గ. రుధిర + ఛటాః - తుగాగమ. మిశ్రాః + నః - విసర్గలోప.

క్రియ :- వృఞ్ వరణే (క్న) ఆత్మనే. లట్. ప్రథమ

వృణుతే - వృణ్వాతే - వృణ్వతే

కథమితి:- (సాకూతమ్ = సాభిప్రాయముగా) కథమ్ = ఎట్లూ ! తాడకా = తాడకయా ! వత్స = నాయనా ! రామభద్ర = రామా !

విధానమానుశ్రవికం గృహేషు నః
ప్రతిస్కిరన్తీ కిమియం ప్రతీక్ష్యతే।
సుబాహుముఖ్యైః సమమాతతాయిభిః
గృహాణ చాపం నిగృహాణ తాడకామ్॥ 56

రామః :- (సఘృణాతిరేకమ్) భగవన్, స్త్రియమిమామ్.... ।
(పునర్నేపథ్యే)

---

విధానమితి :- నః = మాయొక్క. గృహేషు = ఆశ్రమ గృహముల యందలి. ఆనుశ్రవికమ్ = వేదసంబంధమైన (అనుశ్రవో వేదః). విధానమ్ = పద్ధతిని (కార్యకలాపము ననుట) ప్రతిస్కిరన్తీ = నాశనము చేయుచున్నదైన. ఇయమ్ = ఈ తాడక. కిమ్ ప్రతీక్ష్యతే = ఏల ఉపేక్షింపబడుచున్నది - ఇంకను చూచెదవేమి అనుట. చాపమ్ = ధనుస్సును. గృహాణ = సంధించుము. సుబాహుముఖ్యైః = సుబాహుప్రముఖులగు. ఆతతాయిభిః సమమ్ = ఈ ఆయుధధారులతో సహితముగా. (అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః క్షేత్రదారాపహారీ చ షడేతే ఆతతాయినః - స్మృతి). తాడకామ్ = ఈ తాడకను. నిగృహాణ = వధించుము.

తాత్పర్యము :- మా ఆశ్రమములో యజ్ఞవిధులను ధ్వంసము చేయుచున్న ఈ తాడకను ఉపేక్షించుచుంటివేమి! చాపము సంధింపుము. సుబాహు ప్రముఖ రాక్షసులతో సహా ఈ రాక్షసిని వధింపుము.

క్రియ :- ఈక్షజ్ దర్శనే, (కర్మణి) ఆత్మనే, లట్, ప్రథమ (ప్రతి)
ప్రతీక్ష్యతే - ప్రతీక్ష్యేతే - ప్రతీక్ష్యన్తే
గ్రహఞ్ ఉపాదానే. లోట్, పరస్మై. మధ్యమ
గృహాణ/గృహ్ణీతాత్ - గృహ్ణీతమ్ - గృహ్ణీత

ఛందస్సు :- వంశస్థవృత్తము, జతౌతు వంశస్థముదీరితం జరౌ. జతజర.

భగవన్నితి :- (సఘృణాతిరేకమ్ = అతిశయించిన దయతో) భగవన్ = మహాత్మా! స్త్రియమ్ = ఆడుదైన. ఇమామ్ = ఈ తాడకను....

(పునః = మరల. నేపథ్యే = తెరలో)

అబ్రహ్మణ్యమబ్రహ్మణ్యమ్. భోస్తాత విశ్వామిత్ర. పరిభూయా
మహే. ప్రహీయతామధిజ్యధన్వా దాశరథిః.

రామః :- (విహస్య. నేపథ్యావలోకితకేన) బాలర్షే శునఃశేఫ. ముహూర్తం
ధీరో భవ.

అలం క్లిశిత్వా గురుమల్పకోఽయం విధిస్త్వదాజ్ఞైవ గరీయసీ నః।
న కౌశికస్య త్వయి ధర్మపుత్రే పుత్రే మధుచ్ఛందసి వా విశేషః॥ 57

---

అబ్రహ్మణ్యమ్ అబ్రహ్మణ్యమ్ = అయ్యో। అయ్యయ్యో।. భోః తాత=ఓ తండ్రీ। విశ్వామిత్ర=కౌశికా। పరిభూయామహే=అవమానింపబడుచున్నాము।. అధిజ్యధన్వా = ఎక్కుపెట్టిన ధనుస్సు కలవాడైన. దాశరథిః = రామభద్రుడు (లక్ష్మణుడు) ప్రహీయతామ్ = పంపబడుగాక। రాముని పంపుమనుట.

బాలేతి ;- (విహస్య = నవ్వి. నేపథ్యావలోకితకేన = తెరపై చూచుచు) బాలర్షే = ఓ బాలముని। శునఃశేఫ = శునఃశేఫుడా। ముహూర్తమ్ = క్షణకాలము ధీరః భవ = ధైర్యవంతుడవగుము - ధైర్యము వహింపుమనుట.

అలమితి :- గురుమ్ = గురువైన విశ్వామిత్రుని. క్లిశిత్వా = ఆయాసపెట్టి, అలమ్ = చాలును. అయమ్ = ఈ. విధిః=తాడకాసంహారమను కార్యము, అల్పకః = చాల చిన్నది - ఈపాటిదానికి గురువుదాకా అవసరము లేదనుట. నః = మాకు, త్వదాజ్ఞా ఏవ = నీ ఆజ్ఞయే. గరీయసీ = గొప్పది - అదిచాలుననుట. ధర్మపుత్రే = ఆశ్రమ ధర్మములననుసరించి పుత్రుడవైన. త్వయి వా = నీ విషయమునందుగాని. పుత్రే = ఔరసపుత్రుడైన. మధుచ్ఛందసి వా = మధుచ్ఛందుడను వాని విషయమునందుగాని. కౌశికస్య = విశ్వామిత్రునికి. విశేషః న = భేదములేదు - ఇరువురును సమానులే అనుట.

తాత్పర్యము :- తాడకా సంహారమునకై గురువుగారిని శ్రమపెట్టవలసిన పనిలేదు. నీ ఆజ్ఞ మాకు చాలును. విశ్వామిత్రునికి శునఃశేఫుడని, మధుచ్ఛందుడని భేదభావము లేదు. సమానానురాగమే.

సంధులు :- అల్పకః + అయమ్ - ఉత్త్వాదేశవిసర్గ - అల్పకో + అయమ్ - పూర్వరూప. విధిః + త్వత్ - సాదేశవిసర్గ. ఆజ్ఞా + ఏవ - వృద్ధి.

విశ్వామిత్రః :- వత్స, కృతముత్తరోత్తరేణ. నన్వయం నేదీయానాశ్రమోపఘాతః.

లక్ష్మణః :— (సవ్యథమివ, స్వగతమ్)

మీమాంసతే కిమార్యోఽయం కౌశికేఽప్యనుశాసతి ।
వాచమేషామృషీణాం హి శాస్త్రమేవానువర్తతే॥ 58

---

ఛందస్సు:- ఉపేంద్రవజ్ర. ఉపేంద్రవజ్రా జతజాస్తతోగౌ. (జతజగగ)

| జ | త | జ | గగ |
|---|---|---|---|
| । ౧ । | ౧ ౧ । | । ౧ । | ౧ ౧ |
| అలంక్లి | శిత్వాగు | డుమల్ప | కోయమ్ |

వత్సేతి :- వత్స = నాయనా। రామభద్రా।, ఉత్తరోత్తరేణ = ఉక్తి ప్రత్యుక్తులతో (ప్రతివాక్యోత్తరే సమే - అమరము), కృతమ్ = చాలును. ఇక మాటలు చాలుననుట. నను అయమ్ = ఇదే. ఆశ్రమోపఘాతః = ఆశ్రమ వినాశము, నేదీయాన్ = సమీపమునందున్నది — ఆశ్రమ వినాశకము సమీపించుచున్నదనుట.

మీమాంసతే .. (సవ్యథమ్ ఇవ = వ్యథ చెందుట నభినయించుచు, స్వగతమ్ = తనలో) కౌశికే = విశ్వామిత్రుడు, అనుశాసతి (సతి) అపి = ఆజ్ఞాపించుచున్నప్పటికిని. అయమ్ = ఈ. ఆర్యః = అగ్రజుడు. మీమాంసతే, కిమ్ = (సంశయించుచున్నాడేమి) ఆలోచించుచున్నాడేమి। ఏషామ్ = ఈ. ఋషీణామ్ = మునీశ్వరులయొక్క. వాచమ్=మాటను, శాస్త్రమ్ ఏవ=ధర్మశాస్త్రమే. అనువర్తతే హి = అనుసరించును గదా। వీరి మాటయే శాస్త్రము గదా। అనుట. (ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేన వా శబ్దేన యేనాదిశ్యేత తచ్ఛాస్త్రమభిధీయతే.) పథ్యావక్త్రము.

తాత్పర్యము :- తాటకను సంహరింపుమని విశ్వామిత్రుడే ఆజ్ఞాపింపగా అగ్రజుడు సంశయించుచు మీనమేషములు లెక్కించుచున్నాడేల। ఋషుల వాక్కులు తమంత తాము ధర్మశాస్త్రములుకదా।

సంధులు :- ఆర్యః + అయమ్—ఉత్వాదేశవిసర్గ - ఆర్యో + అయమ్ కౌశికే + అపి — పూర్వరూప. అపి + అనుశాసతి — యణాదేశసంధి. ఏవ + అనువర్తతే — సవర్ణదీర్ఘ.

రామః :. (స్వగతమ్)

గుర్వాదేశాదేవ నిర్మీయమాణో నాధర్మాయ
స్త్రీవధోఽపి స్థితోఽయమ్।
అద్య స్థిత్వా శ్వో గమిష్యద్భిరల్పై
ర్లజ్జాస్మాభిర్మీలితాక్షైర్జితైవ॥ 59

క్రియ :- మానజ్ జిజ్ఞాసాయామ్. ఆత్మనే. లట్. ప్రథమ
మీమాంసతే - మీమాంసేతే - మీమాంసన్తే
వృతుఞ్ వర్తనే. ఆత్మనే. లట్. ప్రథమ
వర్తతే - వర్తేతే - వర్తన్తే

గుర్వితి :- (స్వగతమ్ = తనలో) గుర్వాదేశాత్ ఏవ = విశ్వామిత్రుని యొక్క ఆజ్ఞతోనే. నిర్మీయమాణః = అనుష్ఠింపబడుచున్న. అయమ్ = ఈ. స్త్రీ వధః = స్త్రీహననము. అధర్మాయ = అధర్మముకొఱకు (పాపముగా) న స్థితః = నిలువదు - పాపము రానేరదనుట. అద్య = నేడు. స్థిత్వా = ఇచ్చటనిలిచి. శ్వః = రేపు. గమిష్యద్భిః = వెడలిపోవువారమైన. అల్పైః = బాలురమైన, మీలితాక్షైః = కన్నులు మూసికొన్నవారమైన. అస్మాభిః = మాచేత. లజ్జా = సిగ్గు (స్త్రీ వధవల్లనైన సిగ్గు). జితా ఏవ = జయింపబడినట్లే।

తాత్పర్యము :- విశ్వామిత్రుడు ఆజ్ఞాపించుచున్నాడు కావున స్త్రీ వధను గావించినను పాప ముండదు. ఇక సిగ్గన్నచో నేడుండి రేపు వెడలిపోవుదుము. కన్నులు మూసికొన్నచో సరిపోవును పైగా మేము బాలురము.

సమాసములు :- గురోః ఆదేశః-తస్మాత్. మీలితే అక్షిణీ యేష తైః. న ధర్మః - తస్మై. స్త్రియః వధః.

సంధులు :- గురు + ఆదేశ - యణాదేశ. నిర్మీయమాణః + న. శ్వః + గమిష్యత్ - ఉత్వాదేశవిసర్గ. వధః + అపి స్థితః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ. పూర్వరూప సంధులు. లజ్జా + అస్మాభిః న + అధర్మాయ. మీలిత + అక్ష - సవర్ణదీర్ఘ. గమిష్యద్భిః + అల్పైః + లజ్జా. అస్మాభిః + మీలితాక్షైః + జితా - రేఫాదేశవిసర్గ. జితా + ఏవ = వృద్ధిసంధి.

రామః :— కిన్తు—

దీర్ఘం ప్రజాభిరతికౌతుకినీభిరాభి
రస్మిన్నకీర్తిపటహే మమ తాడ్యమానే।
జ్యోతిర్మయేన వపుషా జగదంతసాక్షీ
లజ్జిష్యతే కులగురుర్భగవాన్వసిష్ఠః॥ 60

---

ఛందస్సు :- శాలిని. శాలిన్యుక్తా మ్తౌ తగౌ గోఽబ్ధిలోకైః
మ త త గగ (మ-త-త-గగ.)

ఒఒఒ ఒఒ। ఒఒ। ఒఒ
గుర్వాదే శాదేవ నిర్మేయ మాపో

దీర్ఘమితి :- కిన్తు = కానీ - అతికౌతుకినీభిః = అత్యుత్సాహము కల వారయిన. ఆభిః = ఈ, ప్రజాభిః = జనులచేత. మమ = నా యొక్క. అస్మిన్=ఈ. అకీర్తిపటహే=అపకీర్తి ఢక్క (స్త్రీవధ రూపమగు అపకీర్తి అను ఢక్క). దీర్ఘమ్= చాలకాలమువఱకు. తాడ్యమానే(సతి) = మ్రోగింపబడుచుండగా. జ్యోతిర్మయేన = దివ్యజ్ఞానరూపమగు. వపుషా = శరీరముతో - తపోరూపముతోననుట. జగదంతసాక్షీ = సాగరపర్యంతమగు సర్వభూగోళమునకును సాక్షియై. కులగురుః = ఇక్ష్వాకు వంశ గురువును. భగవాన్ = మహాత్ముడునైన. వసిష్ఠః = వశిష్ఠుడు. లజ్జిష్యతే = సిగ్గు పడును (వసంత తిలక).

తాత్పర్యము :- రాముడు స్త్రీని వధించెనన్న అపకీర్తి పటహమును తరతరాలకు జనులు సుదీర్ఘముగా మ్రోగింతురు. తపోదృష్టితో జగత్తునంతను చూడ గల్గిన వసిష్ఠులు దీనిని గ్రహించి నా శిష్యునికి లోకోపకారమున నిట్టి అపకీర్తి వచ్చినది గదా అని సిగ్గుపడుదురు.

సమాసములు :- అకీర్తిరేవ పటహః - తస్మిన్. జగతోఽంతః. జగ దంతస్య సాక్షీ (సాక్షాద్ద్రష్టరి సంజ్ఞాయామ్ - ఇనిః). కులస్య గురుః.

సంధులు :- ప్రజాభిః + అతికౌతుకినీభిః + ఆభిః + అస్మిన్. గురుః + భగవాన్ - రేఫాదేశవిసర్గ సంధులు. అస్మిన్ + అకీర్తి - అనునాసికద్విత్వ.

(నేపథ్యే)

అలమిష్ట్వా మఖాన్ మూర్ఖాః ఖడ్గధారేయమస్తి నః ।
అదవీయానయం పన్థాః స్వర్లోకముపతిష్ఠతే॥

రామః :- (శ్రుత్వా సరోషం ససంభ్రమం చోత్థాయ సవినయమంజలిం బద్ధ్వా)
భగవన్ జగత్త్రియగురో. గాధినందన.

---

క్రియ :- ఓ లస్జీ వ్రీడాయాం. ఆత్మనే. లృట్. ప్రథమ.
లజ్జిష్యతే-లజ్జిష్యేతే - లజ్జిష్యన్తే
(నేపథ్యే=తెరలో)

అలమితి :- మూర్ఖాః = ఓ మూర్ఖులారా । మఖాన్ = యజ్ఞములను ఇష్ట్వా = చేసి. అలమ్ = చాలును. యాగములుచేయుట ఇక చాలించుడనుట. నః = మా యొక్క. ఇయమ్ = ఈ. ఖడ్గధారా = కత్తి అంచు. అస్తి = ఉన్నది. అయమ్= ఈ. పంథాః=(ఖడ్గధారా) మార్గము. అదవీయాన్=మిక్కిలి దగ్గర దారి. స్వర్లోకమ్ = స్వర్గలోకమును. ఉపతిష్ఠతే = ప్రాపించును.

తాత్పర్యము :- యజ్ఞయాగాది క్రతువులను చేయుట దానివలన అపూర్వము పుట్టుట అది స్వర్గఫలము నిచ్చుట- ఇది అంతయు శ్రమసాధ్యమైన వంకర దారి. యుద్ధముచేసి నా ఖడ్గధారతో మడిసి సులభముగా సరాసరి స్వర్గమునకు పొందు - అని నేపథ్యములో రాక్షసీవచనము (అనుష్టుప్పు).

రణరంగమున వీరమరణము పొందినవారు స్వర్గలోకము నలంకరింతురని - ద్వావిమౌపురుషౌ రాజన్ సూర్యమండలభేదినౌ పరివ్రాడ్యోగ యుక్తశ్చ యుద్ధే చాభిముఖో హతః.

క్రియ :- ష్ఠా గతినివృత్తౌ (ఉపాద్దేవపూజేత్యాదినా) ఆత్మనే. లట్. ప్రథమ
ఉపతిష్ఠతే - ఉపతిష్ఠేతే - ఉపతిష్ఠన్తే

భగవన్నితి:- (శ్రుత్వా=విని. ససంభ్రమమ్=సంభ్రమముతో. ఉత్థాయ= లేచి. సవినయమ్ = వినయముతో. అంజలిమ్ = నమస్కారమును. బద్ధ్వా=చేసి) భగవన్ = మహాత్మా । జగత్త్రియగురో = ముల్లోకములకు గురువా । గాధినందన= విశ్వామిత్రా ।

దశరథగృహే సంభూతం మామవాప్య ధనుర్ధరం
దినకరకులాస్కన్దీ కోఽయం కళంకనవాంకురః।
ఇతి న వనితామేతాం హన్తుం మనో విచికిత్సతే
యదధికరణం ధర్మస్థీయం తవైవ వచాంసి నః॥ 62

దశరథేతి :- దశరథ = దశరథునియొక్క. గృహే = ఇంటియందు (ధర్మపత్నియందు) సంభూతమ్ = జన్మించినవాడును, ధనుర్ధరమ్ = ధనుస్సును ఆలోపించినవాడునైన. మామ్ = నన్ను. అవాప్య = పొందియు. దినకరకుల = సూర్యవంశమును, అస్కందీ = ముట్టడించుచున్న. అయమ్ = ఈ. కళంక = అవమానకళంకముయొక్క. నవాంకురః = క్రొత్తమొలక. అవమాన నూతనావిర్భావము. కః = ఏమిది। (ఇది భరింపరానిదనుట). ఇతి=అని. ఏతామ్=ఈ. వనితామ్= స్త్రీని (తాటకను). హన్తుమ్ = సంహరించుటకు. మే=నాయొక్క. మనః = అంతరంగము. న విచికిత్సతే = సందేహించుటలేదు. (విచికిత్సాతు సంశయః - అమరము) యత్ = ఏలయనగా. నః = మాకు. తవ = నీయొక్క. వచాంసి ఏవ = పల్కులే. ధర్మస్థీయమ్ = ధర్మప్రవర్తకమగు. అధికరణమ్ = నిర్ణయస్థానము. (ధర్మస్థేయమ్ ధర్మశ్చాయమ్. ధర్మస్థానమ్. అని పాఠాంతరములు]-(ఇతి హి వనితామేనామ్ అనియు కొన్నింట) (స్థేయో వివాదవిషయ నిర్ణేతరి పురోహితే విశ్వః).

తాత్పర్యము :- నేను ధనుర్ధారినై యుండగా సూర్యవంశమునకు కళంకము రా వీలు లేదు. కావున స్త్రీవధయైనను చేయుటకు నా మనస్సు సంశయించుట లేదు. పైగా నీ వాక్కులే మాకు ప్రవర్తకమగు ధర్మశాస్త్రము.

సమాసములు :- దశరథస్య గృహః – తస్మిన్. ధరతీతి ధరః - ధనుషో ధరః – తమ్. దినకరస్య కులమ్ అవస్కందయితుం శీలమస్య. నవశ్చాయమంకురశ్చ కళంకస్య నవాంకురః.

సంధులు :- కుల + అస్కందీ, నవ + అంకురః – సవర్ణదీర్ఘ. కః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ – కో + అయమ్ - పూర్వరూప. మనః + విచికిత్సతే- ఉత్వాదేశవిసర్గ. తవ + ఏవ - వృద్ధిసంధి.

(ప్రణిపత్య నేపథ్యాభిముఖమ్) భో స్తపోధనాః, మా భైష్ట—

రజనిచరచమూరమూరపాస్యన్నయమహమాగత ఏవ రామచంద్రః।
కుశికసుతకుశాగ్రతోయబిందోరిదమనుకల్పమవేత కార్ముకం మే॥ 63

---

ఛందస్సు :- హరిణి. నసమరసలాగః షడ్వేదైః హయైర్హరిణీ. (6-4-7)

| న | స | మ | ర | స | లగ |
|---|---|---|---|---|---|
| I I I | I I U | U U U | U I U | I I U | I U |
| యుధధి | కరణం | ధర్మస్థి | యంతస్తై | వవచాం | సినః |

(ప్రణిపత్య = విశ్వామిత్రునికి నమస్కరించి, నేపథ్యాభిముఖమ్ = తెరవైపునకు తిరిగి) భోః తపోధనాః = ఓ మునీశ్వరులారా ! మా భైష్ట = భయపడకుడీ !

రజనీతి :- అమూః = మిమ్ము ముట్టడించుచున్న ఈ, రజనిచరచమూః = రాక్షససేనలను, అపాస్యన్ = పారద్రోలుచు. అయమ్ = ఇదే, రామచంద్రః = రామచంద్రుడను, అహమ్ = నేను, ఆగతః ఏవ = రానే వచ్చితిని. (అయమయమ్ అని సంభ్రమమున ద్విరుక్తిగా పాఠాంతరము). కుశిక సుత = విశ్వామిత్రునియొక్క, కుశాగ్ర = దర్భకొనయందలి, తోయబిందోః = శాపోదకబిందువునకు, అనుకల్పమ్ = తోబుట్టువుగా (ముఖ్యః స్యాత్ప్రథమః కల్పోఽనుకల్పస్తు తతోఽధమః అమరము). మే = నాయొక్క, ఇదమ్ = ఈ, కార్ముకమ్ = ధనుస్సును, అవేత = తెలిసికొనుడు. దానివలె నిదియును అమోఘమనుట.

తాత్పర్యము :- రాక్షససమూహముచే ముట్టుముట్టబడిన ఓ తపోధనులారా, భయపడకుడీ ! ఇదే రామచంద్రుడు వచ్చుచున్నాడు. నా ధనుస్సు విశ్వామిత్రుని శాపోదకబిందువునకు తోబుట్టువు.

సమాసములు :- రజనిచరాణాం చమూః. కుశికస్య సుతః. కుశస్య అగ్రమ్- అగ్రే-తోయబిందుః - కుశికసుతస్య కుశాగ్రతోయబిందుః - తస్య.

సంధులు :- చమూః + అమూః + అపాస్యన్. బిందోః + ఇదమ్— రేఫాదేశవిసర్గ. అపాస్యన్ + అయమ్ - అనునాసికద్విత్వ. ఆగతః + ఏవ - విసర్గలోప.

క్రియ :- ఇణ్ గతౌ (యే గత్యర్థకా స్తేబుద్ధ్యర్థకాః) లోట్.పరస్మై.మధ్యమ
ఇహి / ఇతాత్ - ఇతమ్ - ఇత

(ఇతి ధనురారోపయన్నిష్క్రాంతః)

లక్ష్మణః :- (సాశంకమాత్మగతమ్) దిష్ట్యా క్షాత్రేణ ధర్మేణ కౌమారమప్యహీనమార్యస్యాసీత్. (నేపథ్యాభిముఖమవలోక్య హర్షం నాటయన్ ప్రకాశమ్) భగవన్, కౌశిక, పశ్య పురస్తాదార్యే ధృతధనుషి —

వాయవ్యాస్త్ర వ్యతికరనిరాలంబనస్తాడకేయః
ప్రాప్తో జీవన్మరణమసుభిర్విప్రముక్తః సుబాహుః ।

---

ఛందస్సు :- పుష్పితాగ్ర. అయుజి నయుగరేఫతో యకారో, యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.

| న | న | ర | య |
|---|---|---|---|
| I I I | I I I | U I U | I U U |
| ఏజని | చరచ | మూారమూ | రపాస్యన్ |

| న | జ | జ | ర | గ |
|---|---|---|---|---|
| I I I | I U I | I U I | U I U | U |
| అయమ | యమాగ | తఏవ | రామచం | ద్రః |

దిష్ట్యేతి :- (సాశంకమ్ = ఆశంకతో, ఆత్మగతమ్ = తనలో) దిష్ట్యా = అదృష్టవశమున (దిష్ట్యేత్యానందనే మతమ్). క్షాత్రేణ=క్షత్రియోచితమైన, ధర్మేణ = ధర్మముతో, ఆర్యస్య = అగ్రజునియొక్క, కౌమారమ్ అపి = బాల్యము కూడ, అహీనమ్ ఆసీత్ = (అరహితము) సహితమయ్యెను. బాల్యము కూడ వీరోచితముగా నున్నదనుట.

భగవన్నితి :- (నేపథ్యాభిముఖమ్ = తెరవైపునకు, అవలోక్య = చూచి, హర్షమ్ = సంతోషమును, నాటయన్ = అభినయించుచు (ప్రకాశముగా) భగవన్ = మహాత్మా ! కౌశిక = విశ్వామిత్రా ! పశ్య = చూడుము ! పురస్తాత్ = ఎట్టయెదుట, ఆర్యే = మా అగ్రజుడు, ధృతధనుషి = ధనుస్సు ధరించియుండగా —

వాయవ్యేతి :- వాయవ్యాస్త్ర = వాయుదేవతాకమగు దివ్యాస్త్రముయొక్క వ్యతికర = సంపర్కమువలన (దెబ్బతో), నిరాలంబనః = నిరాధారుడై — ఎగురగొట్ట

కృత్తోన్మ్రక్తా భువి చ కరుణాశ్చర్య బీభత్సహాస
త్రాసక్రోధోత్తరళమృషిభిర్దృశ్యతే తాడకేయమ్। 64

బడినవాడై. తాటకేయః = మారీచుడు (తాడక కొడుకు). జీవన్ = జీవించియు. మరణమ్ = మరణావస్థను. ప్రాప్తః = పొందెను. ఎగరగొట్టబడుట పాటిపోవుటలు వీరులకు మరణముతో సమానము. సుబాహుః = రెండవవాడు సుబాహుడు. అసుభిః = ప్రాణములతో. విప్రముక్తః = వియుక్తుడయ్యెను - ప్రాణములు గోల్పోయెననుట. ఇయమ్ = ఇదే. తాడకా చ = తాటకయు. కృత్తా = నరికివేయబడినదై. ఉన్మృక్తా = నేలకొరిగినదై. కరుణా = ప్రీవధయన్న కరుణ. ఆశ్చర్య = మహారాక్షసి ఎట్లుకూలి పోయినదో అన్న ఆశ్చర్యము. బీభత్సః = తల తెగుట మున్నగువానివలన బీభత్సము. హాస = మమ్ము భయపెట్టితి విప్పుడేమయితివని హాసము. త్రాస = ఇకనేమి జరుగునోయన్న భయము. క్రోధ = తగినశాస్తి జరిగినదన్న క్రోధము - ఇట్టి వివిధ భావములతో. ఉత్తరళమ్ = కలలితమగునట్లు. ఋషిభిః = మునులతో. దృశ్యతే = చూడబడుచున్నది.

తాత్పర్యము :- వాయవ్యాస్త్రముతో మారీచు డెగురగొట్టబడెను. సుబాహుడు నిహతుడయ్యెను. తాటక నేలకొరిగెను. అది చూచిన మునులు కరుణాశ్చర్య బీభత్సాది పలు భావములకు లోనైరి.

సమాసములు :- వాయవ్యాస్త్ర స్య వ్యతికరః - వ్యతికరేణ నిరాలంబనః కరుణాశ్చర్య బీభత్స హాసత్రాస క్రోధైః ఉత్తరళమ్ యథా భవతి తథా.

సంధులు :- వాయవ్య + అస్త్ర. కరుణా + ఆశ్చర్య - సవర్ణదీర్ఘ. నిరాలంబనః + తాడకేయః - సాదేశవిసర్గ. ప్రాప్తః + జీవన్ - ఉత్వాదేశవిసర్గ. అసుభిః + విముక్తః. ఋషిభిః + దృశ్యతే - రేఫాదేశవిసర్గ. కృత్తా + ఉన్మృక్తా. క్రోధ + ఉత్తరళమ్. తాటకా + ఇయమ్ - గుణసంధి.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ
దృశ్యతే - దృశ్యేతే - దృశ్యన్తే

ఛందస్సు :- మందాక్రాంత. మభనతతగగ.

విశ్వామిత్రః :- (విలోక్య) వత్స. లక్ష్మణ. విస్మయేన ప్రమోదేన చ పరవన్తో వయం న వాచామధీశ్మహే. వక్తవ్యమేవ వా కిమస్తి. న ఖల్వియ మద్యతనీ వః ప్రతిష్ఠా.

దిక్కూలంకష కీర్తిధౌతవియతో నిర్వ్యాజవీర్యోద్ధతా
స్తే యూయం రఘవః ప్రసిద్ధమహసో యైః సోఽపి దేవాధిపః।
బిభ్రాణై రసురాధిరాజ విజయక్రీడానిదానం ధనుః
పౌలోమీకుచపత్రభంగరచనాచాతుర్యమధ్యాపితః॥ 65

వత్సేతి :- (విలోక్య = చూచి) వత్స = నాయనా ; లక్ష్మణ=సౌమిత్రీ; విస్మయేన = ఆశ్చర్యముతో, ప్రమోదేన = ఆనందముతో, పరవంతః=పరవశులమై, వయమ్ = మేము, వాచామ్ = వాక్కులకు, న అధీశ్మహే = కర్తలము కాకుంటిమి - నేనేమియు పలుకలేకుంటి ననుట. వక్తవ్యమ్ ఏవ వా=వక్తవ్యము మాత్రము, కిమ్ అస్తి = ఏమున్నది ; వః = మీయొక్క, ఇయమ్ = ఈ, ప్రతిష్ఠా = యశస్సు, అద్యతనీ న ఖలు = ఈనాటిది కాదుగదా ;

దిగితి :- అసురాధిరాజ = రాక్షసరాజును, విజయ=జయించుటఅనునట్టి, క్రీడా = కేళికి, నిదానమ్ = స్థానమైన, ధనుః = ధనుస్సును, బిభ్రాణైః = ధరించువారైన, యైః = ఏ రఘువంశ్యులచేత, సః = ఆ, దేవాధిపః అపి = దేవేంద్రుడు, పౌలోమీ = శచీదేవియొక్క, కుచ = వక్షఃస్థలమునందు, పత్రభంగ = మకరికాపత్రములను, రచనా = రచించుట యందలి, చాతుర్యమ్ = నేర్పును, అధ్యాపితః = అభ్యసించునట్లు చేయబడినాడో - ఇంద్రకార్యమును రాఘవులే నిర్వహించుటతో పూర్తి విశ్రాంతి దొరికి వాసవుడు శృంగార క్రీడాపరాయణుడైనాడనుట - తే = అటువంటి, యూయమ్ = మీరు, రఘవః = రఘువంశసంజాతులు, దిక్కూలంకష = దిశలను ఒరసికొనుచున్న, కీర్తి = యశస్సుతో, ధౌత=ప్రక్షాళితము గావింపబడిన, వియతః= ఆకాశము కలవారును, నిర్వ్యాజ=సహజసిద్ధమైన, వీర్య = పరాక్రమముతో, ఉద్ధతాః = అతిశయించువారును, ప్రసిద్ధ = ప్రఖ్యాతికెక్కిన, మహసః=తేజస్సుకలవారును. (శార్దూలము)

లక్ష్మణః :- భగవన్. పశ్య-

అద్య నైశాచరీం సేనామేనామున్మూలయన్నయమ్ ।
ఆధానం వీరధర్మస్య నిర్మాయ త్వాముపస్థితః॥ 66

---

తాత్పర్యము :- రఘువంశపు కీర్తి దిశదిశలకును వ్యాపించినది మీరు సహజసిద్ధమైన పరాక్రమము కలవారు. విఖ్యాతి కెక్కినవారు. దేవతలను రాక్షసుల బారినుండి కాపాడుటకై ధనుస్సు నెక్కుపెట్టినవారు. దేవేంద్రునికి శ్రమ తప్పించి సుఖలోలునిగా చేసినవారు. ఆతడిప్పుడు శచీ కుచకుంభములపై మకరికా పత్రములను లిఖించుటలో నేర్పు సంపాదించుకొనుచున్నాడు.

సమాసములు :- దిశాం కూలంకషా చ సా కీర్తిశ్చ. కీర్త్యా ధౌతం వియత్ యైస్తే. నిర్వ్యాజం చ తద్వీర్యం చ - నిర్వ్యాజవీర్యేణ ఉద్ధతాః రఘవః - తద్రాజస్య బహుషు తేనైవాస్త్రియామ్ అను సూత్రముచే అపత్యార్థక ప్రత్యయమునకు (అణ్) లోపము. అసురాధిరాజస్య విజయక్రీడా - క్రీడాయాః నిదానమ్. పౌలోమ్యాః కుచౌ - కుచయోః పత్రభంగరచనా - రచనాయాం చాతుర్యమ్. సర్వకూలాభ్రకరీషేషు కషః (ఖచ్) - కూలంకషా.

సంధులు :- వియతః + నిర్వ్యాజ. మహసః + యైః - ఉత్వాదేశవిసర్గ. వీర్య + ఉద్ధతాః - గుణసంధి. ఉద్ధతాః + తే - సాదేశవిసర్గ. సః + అపి - ఉత్వాదేశవిసర్గ. సో + అపి - పూర్వరూప. బిభ్రాణైః + అసుర - రేఫాదేశవిసర్గ. దేవ + అధిప. అసుర + అధి - సవర్ణదీర్ఘ.

అద్యేతి :- భగవన్ = మహాత్మా । పశ్య = చూడుము - అద్య = ఇప్పుడు. నైశాచరీమ్=రాక్షససంబంధమగు. ఏనామ్=ఈ. సేనామ్=సైన్యమును. ఉన్మూలయన్=నాశనము (చేయువాడై) చేసినవాడై, వీరధర్మస్య=వీరోచిత కృత్యమునకు. ఆధానమ్ = నిధానమును (నిలయస్థానమును). నిర్మాయ=తననుగా నిర్మించుకొని- వీరధర్మమునకు తాను నిధానమై. అయమ్ = ఇదే రామభద్రుడు. త్వామ్ = నిన్ను. ఉపస్థితః = సమీపించెను

తాత్పర్యము :- నీ ఆజ్ఞమేరకు సర్వరాక్షససైన్యమును సంహరించి వీర ధర్మమునకు తాను నిలయమై రఘువీరుడు నిన్ను సమీపించుచున్నాడు.

(ప్రవిశ్య) (సవైలక్ష్యస్మితమ్)

రామః :- పూషా వసిష్ఠః కుశికాత్మజోఽయం
త్రయ స్త ఏతే గురవో రఘూణామ్।
మహామునేరస్య గిరా కృతోఽపి
స్త్రైణో వధో మాం న సుఖాకరోతి॥ 67

(ఆశ్రమమవలోక్య)

ప్రత్యాసన్నతుషారదీధితికరక్లిశ్యత్తమోవల్లరీ
వల్యాభిర్మఖధూమవల్లిభిరమీ సమ్మీలితవ్యంజనాః।

---

సంధులు :- తల్ + మూలనమ్ - అనునాసికాదేశసంధి. ఉన్మూలయన్ + అయమ్ = అనునాసికద్విత్వం. (పథ్యావక్త్రము)

[ప్రవిశ్య = రాముడు ప్రవేశించి]

పూషేతి :- [సవైలక్ష్య స్మితమ్ = సిగ్గుతో చిరునవ్వుతో] పూషా = సూర్యుడు. వసిష్ఠః = వసిష్ఠుడు. అయమ్ = ఈ. కుశికాత్మజః = విశ్వామిత్రుడు. ఏతే = ఈ. త్రయః = ముగ్గురును. రఘూణామ్ = రఘువంశ్యులకు. గురవః = గురువులు. అస్య = ఈ. మహామునేః = మహర్షియొక్క. గిరా = మాటతో. కృతః అపి = చేయబడినదే అయినప్పటికిని. స్త్రైణః వధః = స్త్రీహత్య. మామ్ = నన్ను. న సుఖాకరోతి = ఆనందింపజేయుటలేదు.

తాత్పర్యము:- సూర్యుడు వసిష్ఠుడు విశ్వామిత్రుడు ఈ ముగ్గురును మాకు కులగురువులు. విశ్వామిత్రుని మాటపై స్త్రీ వధను గావించితినిగాని ఇది నాకు ఆనందదాయకము కాదు.

ప్రత్యాసన్నేతి :- [ఆశ్రమమ్ అవలోక్య = ఆశ్రమమును చూచి]. ప్రత్యాసన్న = సమీపస్థముగా కనిపించుచున్న. తుషారదీధితి = పూర్ణచంద్రబింబము యొక్క. కర = కిరణములచే. క్లిశ్యత్ = నశించిపోవుచున్న. తమోవల్లరీ = చీకటి తీగలచే. (లతలవంటి చీకటులచే). వల్యాభిః = వెలియబడుచున్నవియు. (కల్పాభిః అని పాఠాంతరము). మఖ = యజ్ఞసంబంధమగు. ధూమ = పొగ అనునట్టి. వల్లిభిః = తీగలతో. - యాగాగ్నిధూమలతలతో. సమ్మీలిత = కప్పివేయబడిన. వ్యంజనాః =

త్వచః సంచీవరయిష్యమాణ వటుకవ్యాధూత శుష్య_త్త్వచో
నిద్రాణాతిథయ_స్తపోధనగృహాః కుర్వ_న్తి నః కౌతుకమ్॥ 68

(పురత్రో౽వలోక్య)

ద్వారాదిచిహ్నములు కలవియు. త్వచః = రేపు. సంచీవరయిష్యమాణ = ధరింపబోవు చున్న. వటుక = బ్రహ్మచారులచేత. వ్యాధూత = దులుపబడి. శుష్యత్ = ఎండు చున్న. త్వచః = వల్కలములు కలవియు. నిద్రాణ = నిద్రించుచున్న అతిథయః = అతిథులు కలవియునైన. అమీ= ఈ. తపోధనగృహాః = ఆశ్రమగృహములు. నః = మాకు. కౌతుకమ్=ఆనందమును. కుర్వ_న్తి = కల్గించుచున్నవి. (వల్లి తు వ్రతతిర్లతా — అమరము) శార్దూలము.

తాత్పర్యము :— పరిపూర్ణుడగు చంద్రుడు సన్నిహితుడుగా భాసించు చున్నాడు. చీకటులు తొలగిపోయినను యాగాగ్ని ధూమలతలు వ్యాపించి ఆశ్రమ గృహముల ద్వారాది చిహ్నములు స్పష్టముగా కన్పించుటలేదు. వటువులు రేపు తాము ధరింపబోవు వల్కలములను దులిపి ఆరవేసికొనియున్నారు. అతిథులు అచ్చటచ్చట నిద్రించియున్నారు. ఇట్టి తపోగృహములు మాకు ఆనందము నిచ్చుచున్నవి.

సమాసములు :— ప్రత్యాసన్నశ్చాసౌ తుషారదీధితిశ్చ - దీధితేః కరాః - కరైః క్లిశ్యంత్యః తమోవల్లర్యః - వల్లరీభిః వల్యాః (స్త్రియాః) - తాభిః. మఖ ధూమ ఏవ వల్లి-తాభిః సమ్మీలితాని వ్యంజనాని యేషాం తే. సంచీవరయిష్యమాణాశ్చ తే వటుకాశ్చ - వటుకైః వ్యాధూతాశ్చ తాః శుష్యంత్యశ్చ - వ్యాధూతశుష్యంత్యః త్వచః యేషు తే. నిద్రాణాః అతిథిర్యత్ర-తే. తపోధనానాం గృహాః.

సంధులు :— ప్రతి + ఆసన్న. వి + ఆధూత — యణాదేశ సంధి. వల్యాభిః + మఖ. వల్లిభిః + అమీ — రేఫాదేశవిసర్గ. త్వచః + నిద్రాణ— ఉత్వాదేశవిసర్గ. అతిథయః + తపో — సాదేశ విసర్గ.

(పురతః = ముందుపైపునకు. అవలోక్య = చూచి)

స్ఫురతీతి :— మాద్యన్మాద్యత్ = మిక్కిలి ఆనందించుచున్న. చకోర = వెన్నెల పిట్టలయొక్క. విలోచనప్రకర = నేత్రసమూహమునుండి వెల్వడుచున్న.

స్ఫురతి పురతో హృద్యన్మాద్యచ్చకోరవిలోచన
ప్రకర కిరణ శ్రేణీ దత్త స్వహస్తఘనం మహః।
హృదయ లఘు మా భూః ప్రేయోదర్శన ప్రతిభూరయం
కువలయదృశామిందుర్నేత్రే సుధాభిరనక్తి నః॥ 69

---

కిరణశ్రేణీ = కాంతిరేఖలచేత. దత్త = అందింపబడిన. స్వహస్త = చేయూతతో. ఘనమ్ = అతిశయించినదైన. మహః = వెన్నెల. పురతః = అగ్రభాగమున. స్ఫురతి = ప్రకాశించుచున్నది. కువలయ దృశామ్ = కలువలవంటి కన్నులుగల స్త్రీల యొక్క. హృదయ = ఓ డెందమా! లఘు = బెగడొందినదానవు. మా భూః = కాకుమా! ప్రేయోదర్శన = ప్రియుని సందర్శనమునకు. ప్రతిభూః = మధ్యవర్తి యైన (లగ్నకుడు - ప్రతిభూర్లగ్నకః పుమాన్)—అయమ్ = ఈ. ఇందుః = చంద్రుడు నః = మా యొక్క. నేత్రే = కన్నులను, సుధాభిః = అమృతములతో. అనక్తి = తడుపుచున్నాడు.

తాత్పర్యము :- ఆనందముతో పరవశించిన చకోరముల నేత్రకాంతులతో వెన్నెల అతిశయించుచున్నది. విరహిణుల ఓ హృదయమా! భయపడకుము. నీ ప్రియుని దర్శనమునకు ఇతడే మధ్యవర్తి. నీ ప్రియునికి గూడ విరహార్తిని పెంచి నీ యొద్దకు రప్పించుననుట. ఈ చంద్రుడు మా నయనములకు అమృతాభిషేకము చేయుచున్నాడు. భావమిది రామ గాంభీర్యమునకు తగనిది కావున యీ శ్లోకమిది అధిక పాఠమని కొందరు భావించిరి.

విశేషములు :- హృదయ లఘిమా మాభూత్ప్రేయోదృశాం ప్రతిభూర యం కువలయదృశామిందుః — అని పాఠాంతరము. ప్రేయోదృశామ్ = ప్రియునిచూడ గోరుచున్న. కువలయ దృశామ్ = ప్రియురాండ్రకు. హృదయలఘిమా = గుండె దిగులు. మా భూత్ = కాకుండుగాక! హృదయలఘిమాగూ ప్రేయోదర్శనే అని మరియొక పాఠము. హృదయ లఘుత్వముయొక్క. ఆగూః = అంగీకారముతోనైన. ప్రేయః = ప్రియునియొక్క. దర్శనే = దర్శనమునందు - తన లఘుత్వమునంగీకరించి ప్రియునియొద్దకేగి సందర్శించుట యని. సంవిదాగూః ప్రతిజ్ఞానమ్ అని అమరము.

అపిచ —

ఉన్మీల న్తి మృణాలకోమలరుచో రాజీవసంవ ర్తికా
సంవ ర్తవ్రత వృ త్తయః కతిపయే పీయూషధామ్నః కరాః ।

---

సమాసములు :- మాద్యంతశ్చమాద్యంతశ్చ - మాద్యన్మాద్యంతశ్చ తే చకోరాశ్చ - చకోరాణాం విలోచనప్రకరాః - ప్రకరేషు కిరణశ్రేణయః - శ్రేణిభిః ద త్తమ్ - స్వహ స్తస్య ఘనమ్ - ద త్తం స్వహ స్తఘనమ్ యేన తత్. ద త్తేన స్వహ స్తేన ఘనమ్. ప్రేయసః దర్శనమ్ - ప్రేయోదర్శనస్య ప్రతిభూః. కువలయే ఇవ దృశౌ యాసాం తాః తాసామ్.

సంధులు :- పురతః + మాద్యత్ - ఉత్వాదేశవిసర్గ. మాద్యత్ + మాద్యత్ - అనునాసికాదేశ. మాద్యత్ + చకోర - శ్చుత్వసంధి. ప్రతిభూః + అయమ్. ఇందుః + నేత్రే. సుధాభిః + అన క్తి - రేఫాదేశవిసర్గ.

క్రియ :- స్ఫుర స్ఫురణే సంచరణే చ పరస్మై. లట్. ప్రథమ.

స్ఫురతి — స్ఫురతః - స్ఫుర న్తి

అ ఞ్జు వ్య క్తి మ్రక్షణకాంతి గతిషు. పరస్మై. లట్

(శ్నమ్) ప్రథమ

అన క్తి - అం క్తః - అంజ న్తి

ఛందస్సు :- హరిణీ. రసయుగ హయైర్నౌస్మ్రౌ - స్లౌ గౌ యదా హరిణీ తదా.

న స మ ర స (నసమరసలగ)

। । । । । ں ں ں ں ں । ں । । ں । ।
స్ఫురతి పురతో మాద్యన్మా ద్యచ్చకో రవిలో చన—లగ

అపిచ :- మరియు.

ఉన్మీల న్తీతి :- మృణాల = తామరతూడువలె, కోమల రుచః = మృదువైన ధవళకాంతులు కలవియు, రాజీవ = పద్మములయొక్క, సంవ ర్తికా = క్రొ త్తరేకలను, సంవ ర్త = (నాశనముచేయుట) ముకుళింపజేయుట అనునట్టి, వ్రత = నియమమే. వృ త్తయః=వృ త్తిగా కలవియును అయిన, పీయూషధామ్నః = చంద్రుని

అప్యస్యై గ్రిర్ధవళీభవత్సు గిరిషు క్షుబ్ధోఽయమున్మజ్జతా
విశ్వేనేవ తమోమయో నిధిరపామహ్నాయ ఫేనాయతే॥ 70

యొక్క. కరాః = కిరణములు. కతిపయే = కొన్ని. ఉన్మీలన్తి = వికసించుచున్నవి. ఉస్రైః = కిరణములతో. గిరిషు అపి = పర్వతములును. ధవళీభవత్సు = తెలుపెక్కుచుండగా. ఉన్మజ్జతా = మునిగిపోవుచున్న విశ్వేన = జగత్తుతో. క్షుబ్ధః ఇవ = మధింపబడినదో అన్నట్లు. తమోమయః = చీకటి అనునట్టి. అపాంనిధిః = సముద్రము. అహ్నాయ = హఠాత్తుగా. ఫేనాయతే = తెలినురుగులు గ్రక్కుచున్నది. (ద్రాక్ ఝటిత్యంజసాహ్నాయ — అమరము.) శార్దూల విక్రీడితము.

తాత్పర్యము :- పద్మదళములను ముకుళింపజేయుట అను వ్రతము పూనిన చంద్రకిరణములు మరికొన్ని వికసించుచున్నవి. పర్వతములు కూడా తెల్లబడి వెన్నెలలో మునిగిపోవుచున్న జగత్తుతో చీకటిసముద్రము సంక్షుబ్ధమైనదో అన్నట్లు తెలినురుగులు గ్రక్కుచున్నది.

సమాసములు :- మృణాలస్యేవ కోమలా అగ్రే యేషాం తే, రాజీవానాం సంవర్తికాః — సంవర్తికానాం సంవర్తః - సంవర్త ఏవ వ్రతమ్ — సంవర్త వ్రతమేవ వృత్తిర్యేషాం తే.

సంధులు :- ఉత్ + మీలన్తి — ఉత్ + మజ్జతా — అనునాసికాదేశసంధి. రుచః + రాజీవ - తమోమయః + నిధిః - ఉత్వాదేశవిసర్గ. అపి + ఉస్రైః — యణాదేశ. ఉస్రైః + ధవళ, నిధిః + అపామ్ - రేఫాదేశవిసర్గ. క్షుబ్ధః + అయమ్ — ఉత్వాదేశ విసర్గ. క్షుబ్ధో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- మీల నిమేషణే. పరస్మై. లట్. ప్రథమ (ఉత్)

మీలతి - మీలతః — మీలన్తి

ఫేన - ఫేనాద్బ అని క్యఙ్ - ఆత్మనే, లట్, ప్రథమ

ఫేనాయతే — ఫేనాయేతే — ఫేనాయన్తే

అలంకారము :- తమోమయః అపాంనిధిః అనుటలో వ్యస్తరూపకము. వెన్నెలను ఫేనాయతే అనుట ఉక్త వస్తూత్ప్రేక్ష.

(సనిర్వేదమ్)

ఇందుర్యద్యుదయాద్రిమూర్ధ్ని న భవత్యద్యాపి తన్మా స్మ భూ
న్నాసీరేఽపి తమస్సముచ్చయమమూరున్మూలయన్తి త్విషః।
అప్యక్ష్ణోర్ముదముద్గిరన్తి కుముదైరామోదయన్తే దిశః
సంప్రత్యూర్ధ్వమసౌ తు లాంఛనమభివ్యంక్తుం ప్రకాశిష్యతే॥ 71

---

ఇందురితి :- (సనిర్వేదమ్ = వైరాగ్యభావముతో) ఇందుః=చంద్రుడు. అద్యాపి = ఇప్పటికిని. ఉదయాద్రిమూర్ధ్ని = ఉదయపర్వతశిఖరమున. యది న భవతి = ఉదయించదేని. తత్ = ఇంత ఆ ఉదయించుట. మాస్మభూత్ = జరుగకుండుగాక। అమూః = ఈ వికసించిన. త్విషః = కాంతులే. నాసీరే అపి = మునుముందుగా (నాసీరోఽగ్రయానే స్యాదగ్రేఽపి — విశ్వః). తమస్సముచ్చయమ్ = చీకటి గుంపులను. ఉన్మూలయన్తి = పారద్రోలుచున్నవి. అక్ష్ణోః = నేత్రములకు. ముదమ్ అపి = ఆనందమును గూడ. ఉద్గిరన్తి = పంచిపెట్టుచున్నవి. కుముదైః = కలువలతో. దిశః = దిక్కులు. ఆమోదయన్తే = పరిమళింపజేయబడుచున్నవి. సంప్రతి తు = ఇంకనిపుడు. అసౌ = ఈ చంద్రుడు. లాంఛనమ్ = తనకళంకమును అభివ్యంక్తుమ్ = ప్రకటించుకొనుటకు. ఊర్ధ్వమ్ = ఆకాశోర్ధ్వభాగమున. ప్రకాశిష్యతే = ఉదయింపబోవుచున్నాడు. ఇప్పుడింక చంద్రుడుదయించుట - లాంఛన ప్రకటనమునకే యనుట (శార్దూలము)

తాత్పర్యము :- ఇప్పటివరకు చంద్రుడుదయించ లేదు. ఇక ఉదయింపక పోయినను ప్రమాదములేదు. ఏలయన చీకటిని తొలగించుట, కన్నులకు ఆనందమును కలిగించుట, కలువతావులను దశదిశలకు వ్యాపింపజేయుట అను కార్యములను చంద్రకిరణములే నెరవేర్చుచున్నవి. ఇప్పుడు చంద్రుడుదయించుట తన లాంఛనమును లోకమునకు చూపించుకొనుటకే.

సంధులు :- ఇందుః + యది. అమూః + ఉన్మూలయన్తి. అక్ష్ణోః + ముదమ్. కుముదైః + ఆమోదయన్తే — రేఫాదేశవిసర్గ. యది + ఉదయాయ. అపి + అక్ష్ణోః. భవతి + అద్య. సంప్రతి + ఊర్ధ్వమ్ — యణాదేశ సంధులు. ఉదయ + అద్రి. అద్య + అపి - సవర్ణదీర్ఘ. తత్ + మా. అభూత్ + నాసీరే. ఉత్ + మూలయన్తి — అనునాసికాదేశ. నాసీరే + అపి — పూర్వరూప.

(సహర్షమ్)

కాశ్మీరేణ దిహానమంబరతలం వామభ్రువామానన
ద్వైరాజ్యం విదధానమిందుదృషదాం విద్రానమంతశ్శిరాః ।
ప్రత్యుద్యత్పురుహూత పత్తన వధూదత్తార్ఘ్య దర్భాంకుర
కీలోత్సంగకురంగమైందవమిదం బింబం సముజ్జృంభతే॥ 72

---

క్రియ :- భూ సత్తాయామ్. పరస్మై. అక్. లట్. ప్రథమ
భవతి - భవతః - భవన్తి అభూత్ - అభూతామ్ - అభూవన్.
మూల (లిప్) రోపణే. పరస్మై. లట్. ప్రథమ (ఉత్)
ఉన్మూలయతి - ఉన్మూలయతః - ఉన్మూలయన్తి
గౄ నిగరణే (శః). పరస్మై. లట్. ప్రథమ (ఉత్)
ఉద్గిరతి - ఉద్గిరతః - ఉద్గిరన్తి
ముద(ఙ్) హర్షే (సంసర్గే) ణిచ్. ఆత్మనే.లట్. ప్రథమ(ఆఙ్)
ఆమోదయతే - ఆమోదయేతే - ఆమోదయన్తే
కాశృఙ్ దీప్తౌ. ఆత్మనే. లృట్. ప్రథమ (ప్ర)
ప్రకాశిష్యతే - ప్రకాశిష్యేతే - ప్రకాశిష్యన్తే.

కాశ్మీరేణేతి :- (సహర్షమ్ = ఆనందముగా) అంబరతలమ్ = ఆకాశమును, కాశ్మీరేణ = కుంకుమచే. దిహానమ్ = పూయుచున్నదియు: వామభ్రువామ్ = అందమైన కనుబొమలు కల్గిన స్త్రీలయొక్క. ఆనన = ముఖములతో. ద్వైరాజ్యమ్ = శత్రుత్వమును. విదధానమ్ = చేయుచున్నదియు: ఇందుదృషదామ్ = చంద్రకాంతమణులయొక్క. అంతః శిరాః = లోపలనున్న సిరలను (నాడులను). విద్రానమ్ = వగుల్చునదియు (స్రవింపజేయునదనుట): ప్రత్యుద్యత్ = ఎదురువచ్చుచున్న. పురుహూత పత్తనవధూ = అలకాపురి కాంతలచేత, దత్త = అందీయబడిన, అర్ఘ్య = విలువైన. దర్భాంకుర = దర్భాగ్రములచేత. కీల = బలిసిన. ఉత్సంగకురంగమ్ = లాంఛనమందలి లేడిపిల్ల కలదియునైన. ఇదమ్ = ఈ. ఐందవమ్ = చంద్రసంబంధియగు, బింబమ్ = మండలము. సముజ్జృంభతే = అతిశయించుచున్నది. (శార్దూలము).

తాత్పర్యము :- చంద్రుడు ఆకాశమున కుంకుమ కాంతులు వెదజల్లు చున్నాడు. అందగత్తెల ముఖములతో పోటీపడుచున్నాడు. చంద్రకాంతమణులను

ఏతాశ్చ—

పౌలోమీకుచకుంభకుంకుమరజః స్వాజన్యజన్మోద్ధతాః
శీతాంశోర్ద్యుతయః పురందరపురీ సీమ్నామువస్కుర్వతే ।
ఏతాభిర్లిహతీభిరంధతమసాన్యుద్గృహ్ణతీభిర్దిశః
క్షోణీమాస్తృణతీభిరంతరతమం వ్యోమేదమోజాయతే॥ 73

---

ద్రవింపజేయుచున్నాడు. అప్సరసలు అందించిన దర్భాంకురములను తిని చంద్రబింబము లోని హరిణము మదించుచున్నది.

సమాసములు :- అంబరస్య తలమ్. ఆననస్య వైరాజ్యమ్. ప్రత్యుద్యంత్యః తాః పురుహూతపత్తనవధ్వః - వధూభిర్దత్తః — అర్ఘ్యశ్చాసౌ - దర్భాంకురశ్చ దత్తశ్చాసౌ అర్ఘ్యదర్భాంకురశ్చ - అంకురైః క్షీబః —ఉత్సంగే విద్యమానః కురంగః— క్షీబః ఉత్సంగ కురంగః యస్మిన్ తత్.

సంధులు :- ప్రతి ఉద్యత్ – యణాదేశ. దత్త + అర్ఘ్య. దర్భ + అంకుర – సవర్ణదీర్ఘ. క్షీబ + ఉత్సంగ - గుణసంధి. ఉత్ + జృంభతే శ్చుత్వసంధి.

క్రియ :- జృభిఙ్ గాత్రవినామే. ఆత్మనే. లట్. ప్రథమ (నముత్)
జృంభతే — జృంభేతే — జృంభన్తే

పౌలోమీతి:— పౌలోమీ = శచీదేవియొక్క, కుచకుంభ = కుంభముల వంటి కుచములపైనుండు. కుంకుమరజః = కుంకుమ రేణువులయొక్క. స్వాజన్య = (సమాన) కులమునందు. జన్మ = పుట్టుటచే. ఉద్ధతాః = గర్వించినవియగు. శీతాంశోః = చంద్రునియొక్క. ద్యుతయః=కాంతులు. పురందపురీ సీమ్నామ్ = తూర్పు దిగ్భాగములకు — (పురందరుడు ప్రాగ్దిశాపాలకుడు) ఉపస్కుర్వతే = అలంకరణము చేయుచున్నవి. అంధతమసాని = గాఢాంధకారములను. లిహతీభిః = త్రాగివేయు చున్నవియు. దిశః = తూర్పుమొదలగు దిక్కులను. ఉద్గృహ్ణతీభిః = ప్రకటించుచున్న వియు, (దండ గ్రుచ్చుచున్నవియు) క్షోణీమ్ = భూమిని. ఆస్తృణతీభిః = ఆచ్ఛా దించుచున్నవియునగు. ఏతాభిః = ఈ చంద్రకాంతులతో. అంతరతమమ్ = మధ్య నున్న. ఇదమ్ = ఈ. వ్యోమ = ఆకాశము. ఓజాయతే = తేజస్వంతమగుచున్నది.

మథ్నంతి స్థలసీమ్ని శైలగహనోత్సంగేషు సంరుంధతే
జీవగ్రాహమివ క్వచిత్ క్వచిదపి చ్ఛాయాసు గృహ్ణంతి చ॥ 74

---

స్థలసీమ్ని = నేలపై పొలిమేరలయందు. తమః = చీకటిని. మథ్నంతి=విధ్వంసము చేయుచున్నవి. శైల = పర్వతముల యొక్కయు. గహన=అరణ్యములయొక్కయు. ఉత్సంగేషు=మధ్యప్రదేశములయందు, గిరి - వనదుర్గములయం దనుట. సంరుంధతే= (శత్రువైన చీకటిని) అడ్డగించుచున్నవి. క్వచిత్ క్వచిత్ = అచ్చటచ్చట. ఛాయాసు = నీడలయందు. జీవగ్రాహమ్ ఇవ గృహ్ణంతి = మన్నల పట్టుచున్నవి - చీకటులను సజీవముగా బంధించుచున్నవనుట - చెట్లనీడలు బందీలవలె నున్నవి. (శార్దూలము)

తాత్పర్యము :- చంద్రుడు అను రాజు రణరంగభూమికి రెండు క్రోశముల దూరమైనను రాలేదు. కానీ అతని భటులవంటి కిరణములు కుముదకులమునకు చాటుకారులై శత్రువులు అను చీకటుల అను నేలపొలిమేరలలోను, శైలవన దుర్గముల యందును పట్టి నాశనము చేయుచున్నవి. అచ్చటచ్చట నీడల రూపమున శత్రువులను సజీవముగా బంధించుచున్నవి.

విశేషములు :- సమూలాకృత జీవేషు హన్ కృఞ్ గ్రహః-ణముల్-జీవగ్రాహమ్. చాటుకారః - నృపాదేర్వర్ణనే చాటు రాలోకే చాటురిష్యతే - ధరణిః. గవ్యూతిః స్త్రీ క్రోశయుగమ్ - అమరము.

సంధులు :- న + ఏవ - వృద్ధి. ఏవ + అయమ్. అద్య + అపి- సవర్ణదీర్ఘ. గో + యూతిః - అవాదేశసంధి (వాంతో యిప్రత్యయే). తమః + తు-సాదేశవిసర్గ. గహన + ఉత్సంగ - గుణసంధి.

క్రియ :- అఞ్చు గతిపూజనయోః. పరస్మై. లట్. ప్రథమ (ఉత్)
అంచతి - అంచతః - అంచన్తి
మన్థ విలోడనే (శ్నా) ఉపాదానే. పరస్మై. లట్. ప్రథమ
మథ్నాతి - మథ్నీతః - మథ్నన్తి
రుధిర్ ఞ్ (శ్నమ్) ఆవరణే. ఆత్మనే. లట్. ప్రథమ
రున్ధే - రున్ధాతే - రున్ధతే.
గ్రహ్ ఞ్ (శ్నా) ఉపాదానే. పరస్మై. లట్. ప్రథమ
గృహ్ణాతి - గృహ్ణీతః - గృహ్ణన్తి

(జ్యోత్స్నాచ్ఛరితయం విహాస్య)

కిం ను ధ్వాంతపయోధిరేష కతకక్షోదైరివేందోః కరై
రత్యచ్ఛోఽజనియస్య పంకమఖిలం ఛాయాపదేశాదభూత్ ।
కిం వా తత్కరకర్తరీభిరభితో నిస్తక్షితా దుజ్జ్వలమ్
వ్యోమైవేదమితస్తతశ్చ పతితాశ్ఛాయాచ్ఛలేన త్వచః ॥ 75

---

(జ్యోత్స్నాచ్ఛరితయమ్ = వెన్నెలయొక్క సాంద్రతను. విహాస్య = చూచి)

కింన్వితి :- ఏషః = ఈ, ధ్వాంతపయోధిః = చీకటి సముద్రము, కతక క్షోదైః ఇవ = ఇండుప గింజ (గింజలు) పొడుముల వంటివైన, ఇందోః = చంద్రుని యొక్క, కరైః = కిరణములతో. అత్యచ్ఛః కిము = తేరుకొన్నదా ఏమి ! (తేరు కొన్నదికాదోలునను). అఖిలమ్ పంకమ్ = బురద యంతయును, ఛాయాపదేశాత్ = నీడలమిషమున. అధః అభూత్ = క్రిందికి చేరుకొన్నది. తత్ = చంద్రునియొక్క. కర = కిరణములనునట్టి. కర్తరీభిః = క (త్తు) త్తెరలతో. అభితః = అన్నివైపుల. నిస్తక్షితాత్ కిమ్ వా = చెక్కివేయబడునదే కాదోలు ఇదమ్ = ఈ, వ్యోమ = ఆకాశము ఉజ్జ్వలమ్ = మిక్కిలి ప్రకాశించుచున్నది. ఛాయాచ్ఛలేన = నీడలనునట్టి వంకతో. త్వచః = (చీకటి పెట్టు) పెరడులే, ఇతస్తతశ్చ = చెల్లాచెదురుగా. పతితాః = పడి నవి (శార్దూలము).

తాత్పర్యము:- ఇది చీకటి సముద్రము. ఇండుప గింజను అరగదీసి కల్పుటతో బురద నీరు తేరుకొన్నట్లు - చంద్రకిరణముల కలయికతో చీకటులు బురద వలె అడుగునకు చేరుచున్నవి. కిరణములనునట్టి కత్తులతో పెరడు చెక్కివేయబడి నట్లు ఆకాశము స్వచ్ఛముగా నున్నది. చెల్లాచెదురుగా పడిన ఆ పెరడులవలె నీడలు కన్పించుచున్నవి.

సమాసములు :- ధ్వాంతమేవ పయోధిః - కతకస్య క్షోదైః. కరాః ఏవ కర్తర్యః - తాభిః

సంధులు :- క్షోదైః + ఇవ, కరైః + అతి, కర్తరీభిః + అభితః రేఫాదేశవిసర్గ. ఇవ + ఇందోః, ఏవ + ఇదమ్ - గుణ. అతి + అచ్ఛః - యణా

(పరిక్రమ్య పార్శ్వతోఽవలోక్య)

దళవితతిభృతాం తలే తరూణామిహ తిలతండులితం మృగాంకరోచిః।
మదచపలచకోరచంచుకోటీ కబళన తుచ్ఛమివాంతరాంతరాభూత్॥ 76

---

దేశ. అచ్ఛః + అయమ్, అకితః + నిస్తుషజాత్ - ఉత్వాదేశ విసర్గ. అచ్ఛో + అయమ్ - పూర్వరూప. అధః + చ. ఇతః + తతః + చ. పతితాః + ఛాయా - శషసాదేశ విసర్గ. వ్యోమ + ఏవ - వృద్ధి. ఛాయా + ఫలేన - తుగాగమ.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై. లుఙ్, ప్రథమ
అభూత్ - అభూతామ్ - అభూవన్.

అలంకారము :- ధ్వాంతపయోధిః, తిరస్త్రిణీః అనుచోట్ల రూపకము. కలిత కోట్లైః ఇందోః కరైః - వ్యస్త రూపకము. నిస్తుషజాత్ అనునది హేతూత్ప్రేక్ష ఛాయాఫలేన త్వచః, ఛాయాపదేశాత్ పంకిమ్ అనుచోట్ల కైతవాపహ్నుతి. ఇట్లిందు అలంకార సంసృష్టి - తిలతండులవత్సంసృష్టిః.

(పరిక్రమ్య = ముందునకు నడిచి, పార్శ్వతః అవలోక్య = ప్రక్కకుచూచి)

దళేతి :- దళవితతిభృతామ్ = ఆకుల సమూహమును ధరించియున్న, తరూణామ్ = చెట్లయొక్క - పెద్దపెద్ద ఆకులు ఎక్కువగా నున్న చెట్లు - తలే = క్రింది భాగమున - నేలపై, ఇహ = ఇచ్చట. మృగాంకరోచిః = వెన్నెల, తిలతండులితమ్ = తిలతండులములు కలిపి ఆరబోసినట్లున్నది మదచపల=ఆనందముతో చలిపియైన, చకోర = వెన్నెల పిట్టలయొక్క, చంచుకోటీ = ముక్కుల అగ్రభాగములచేనైన, కబళన = కొరికివేయుటలతో. తుచ్ఛమ్ ఇవ = భుక్త పరిశిష్టమువలె, అంతరాంతరా = అచ్చటచ్చట, అభూత్ = అయ్యెను.

తాత్పర్యము :- ఆకుల సందులనుండి నేలకు జారిన వెన్నెల తిల తండుల న్యాయముగా నున్నది. పిడలుపడ్డచోటులు చకోరములు వెన్నెలను తినివేయగా నేర్పడ్డ వెత్తులవలె నుండెను.

సమాసములు :- దళానాం వితతిః - వితతిం బిభర్తీతి - తేషామ్. మదేన చపలాః—చపలాశ్చ తే చకోరాః - చకోరాణాం చంచుకోట్యః - కోటీభిః కబళనమ్ - కబళనేన తుచ్ఛమ్.

(విభావ్య చ)

త్రిభువన తమోలుంటాకీనామహో మిహిర త్విషా
మభివిధిరసౌ కోకశ్రేణీమనస్యవశిష్యతే।
క్షుధమపి తమః కోపాదంతః ప్రవిశ్య వినిఘ్నతః
శశధరకరానచ్ఛిన్నాగ్రాంశ్చరన్తి చకోరకాః॥ 77

---

అలంకారము :- ఉత్ప్రేక్ష. తిలతండులితమ్ అనుట ఉక్తవస్తూత్ప్రేక్ష అప్పటప్పట భుక్తపరిశిష్టమే యన్నట్లు వెన్నెల యున్నదనుటయునట్టిద.

ఛందస్సు :- పుష్పితాగ్రా వృత్తము. అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా

త్రిభువనేతి :-(విభావ్య చ = పరికించిచూచి) త్రిభువన = ముల్లోకముల యొక్క, తమః = చీకటిని, లుంటాకీనామ్ = పోగొట్టునవైన, మిహిరత్విషామ్ = సూర్యకాంతులకు, అసౌ = ఇది, అభివిధిః = అవధి అన్నట్లుగా, కోకశ్రేణీ = చక్రవాకములయొక్క, మనసి = హృదయమునందు అహో! అవశిష్యతే = మిగులుచున్నది - సూర్యకాంతులు విరహాగ్నిగా చక్రవాకముల గుండెలలోనికి ప్రవేశించినదనుట. కోపాత్ = కోపముతో, అంతః = లోనికి, ప్రవిశ్య = ప్రవేశించి, తమః= చీకటిని, క్షుధమ్ అపి = ఆకలిని, వినిఘ్నతః = పోగొట్టుచున్నవియు, అచ్ఛిన్నాగ్రాన్= తెగిపోని అగ్రభాగములు కలవియునైన, శశధరకరాన్ = చంద్రకిరణములను, చకోరకాః = వెన్నెల పిట్టలు, చరన్తి = భుజించుచున్నవి.

తాత్పర్యము:- ముల్లోకముల చీకటులను పారద్రోలునట్టి సూర్యకిరణములు చక్రవాకముల గుండెలలోనికి విరహాగ్నిగా ప్రవేశించుచున్నవి. చీకటిని - తమ ఆకటిని పోగొట్టునట్టి చంద్రకిరణములను చకోరములు భుజించుచున్నవి.

సమాసములు :- త్రయాణాం భువనానాం సమాహారః — త్రిభువనస్య తమః - తమసః-లుంటాక్యః - తాసామ్. మిహిరస్య త్విషః—తాసామ్, కోకానాం శ్రేణీ- శ్రేణ్యాః మనః — తస్మిన్. ధరతీతి ధరః - శశస్య ధరః - శశధరస్య కరాః-తాన్.

సంధులు :- అభివిధిః + అసౌ - రేఫాదేశవిసర్గ. మనసి + అవశిష్యతే యణాదేశ. అగ్రాన్ + చరన్తి - లాంస్త్రాస్సంధి.

అపి చేదానీమ్—

తథా పౌరస్త్యాయాం దిశి కుముదకేదార కలికా
కపాటఘ్నీమిందుః కిరణలహరీముల్లలయతి ।
సమంతాదున్మీలద్బహుళజలబిందు స్తబకినో
యథా పుంజాయన్తే ప్రతిగుడకమేణాంకమణయః॥ 78

---

క్రియ :- శిష అసర్వోపయోగే (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ
అవ శిష్యతే - అవశిష్యేతే - అవశిష్యన్తే
చర భక్షణే. పరస్మై. లట్. ప్రథమ
చరతి - చరతః - చరన్తి

ఛందస్సు :- హరిణీ నసమరసలాగః షడ్వేదైః హయైః హరిణీ మతా

| న | స | మ | ర | స | లగ |
|---|---|---|---|---|---|
| I I I | I I U | U U U | U I U | I I U | I U |
| త్రిభువ | నతమో | లుంటాకీ | నామహో | మిహిర | త్విషామ్ |

అపిచేతి :- అపిచ = మరియు, ఇదానీమ్ = ఇప్పుడు—

తథేతి :- పౌరస్త్యాయామ్ దిశి = ముందున్న దిక్కునందు (తూర్పున) ఇందుః = చంద్రుడు, కుముదకేదార = కలువల పొలమునందలి, కలికా = మొగ్గల యొక్క. కపాటఘ్నీమ్ = తలుపులను తెరిపించునదైన. కిరణలహరీమ్ = కాంతిజాలమును. తథా = అట్లు ఉల్లలయతి = ప్రసరింపజేయుచున్నాడు. ప్రతిగుడకమ్ = ప్రతి కుట్టిమమునందును (గుడకో గోళకే హస్తే సన్నాహేషు వికారయోః. గోళకో విధవా పుత్రే జారేఽప్యమణికే ఘటే - విశ్వః) ఏణాంకమణయః = చంద్రకాంతమణులు. సమంతాత్ = పరిపూర్ణముగా. ఉన్మీలత్ = భాసించుచున్నవై. బహుళ = అతిశయించిన, జలబిందుస్తబకినః = నీటి బిందువుల సమూహముకలవై. పుంజాయన్తే = పుంజీభవించుచున్నవి. బిందువులు స్రవించి ప్రవాహముగట్టుచున్నవనుట. (శిఖరిణీ వృత్తము)

(పరిక్రామన్నూర్ధ్వమవలోక్య)

తరుణతమాలకోమల మలీమసమేతదయం
కలయతి చన్ద్రమాః కిల కళంకమితి బ్రువతే।
తదనృతమేవ నిర్దయవిధుంతుద దంతపద
వ్రణవివరోపదర్శితమిదం హి విభాతి నభః॥ 79

---

తాత్పర్యము :- తూర్పు దిక్కున చంద్రకిరణములు కలువలను వికసింప జేయుచున్నవి. చంద్రకాంతమణులు స్రవించుచు నీటి బిందువులు క్రమక్రమముగా ప్రవాహములు కట్టుచున్నవి.

సమాసములు :- కుముదానాం కేదారః - కేదారే కళికాః - కళికానాం కవాటమ్ - కవాటం హంతీతి - తామ్. కిరణానాం లహరీ - తామ్ సమంతా దున్మీలంతశ్చ బహళాశ్చ తే జలబిందవః - బిందుభిః స్తబకితః. గుడికాం గుడికాం ప్రతి - ప్రతిగుడికమ్.

సంధులు:- ఉత్ + లలయతి - లాదేశసంధి ఉత్ + మిలత్- అనునాసికాదేశ. స్తబకితః + యథా - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- లల ఈప్సాయామ్ (చురాదిణిచ్) లట్. పరస్మై. ప్రథమ
లలయతి - లలయతః - లలయన్తి
పుంజవదాచరన్తి (కర్తుః క్యఙ్) ఆత్మనే. లట్. ప్రథమ
పుంజాయతే - పుంజాయేతే - పుంజాయన్తే

(పరిక్రామన్ = ముందునకు నడుచుచు. ఊర్ధ్వమ్ అవలోక్య = మిన్నుజూచి)

తరుణేతి :- తరుణతమాల = లేత కాటుక చెట్టు (తాపింఛము) అటువలె కోమల = సుకుమారమైన. మలీమసమ్ = నల్లదనమును. ఏతత్ = దీనిని. అయమ్ = ఈ. చంద్రమాః = చంద్రుడు. కలయతి = ధరించుచున్నాడు. (కలివలీ కామధేనూ) కళంకమ్ ఇతి = కళంకము అని. బ్రువతే కిల = చెప్పుచున్నారు గదా। తత్ = ఆ చెప్పుట. అనృతమ్ ఏవ = అసత్యమే. నిర్దయ = దయలేనివాడగు. విధుంతుద = రాహువుయొక్క. దంతపద = పలువరుసతో నేర్పడిన. వ్రణ = గాయములచేసైన.

కించ—

రుచిభిరభితష్టంకోత్కీర్ణైరివ త్రసరేణుభిః
యదుడుభిరపిచ్ఛేదైః స్థూలైరివ బ్రూయతే నభః ।

---

వివర = రంధ్రముల నుండి. ఉపదర్శితమ్ = కన్పించుచు. ఇదమ్ = ఇదే. నభః = ఆకాశము. విభాతి హి = ఒప్పుచున్నది సుమా ।

తాత్పర్యము :— కొటుకు చెట్టు లేత ఆకువలె కోమలమై చంద్రునిలో నల్లగానున్న ఆ మచ్చను కళంకమందురు. కానీ అది అసత్యము. గ్రహణమునాడు రాహువు కాటువేయగా ఏర్పడిన గాయముల నుండి వెనుకతట్టు ఆకాశము అట్లు కన్పించు చున్నది.

సమాసములు :- తరుణశ్చాసౌ తమాలశ్చ—తరుణ తమాలవత్ కోమలం చ తన్మలీమసం చ. నిర్దయశ్చాసౌ విధుంతుదశ్చ - విధుంతుదస్య దంతపదేన కృతః వ్రణవివరః - వివరేణ ఉపదర్శితమ్.

క్రియ :- బ్రూఞ్ వ్యక్తాయాం వాచి. ఆత్మనే. లట్. ప్రథమ.

బ్రూతే - బ్రువాతే - బ్రువతే
భా దీప్తౌ. పరస్మై. లట్. ప్రథమ (వి)
భాతి - భాతః - భాన్తి

అలంకారము :— కళంకత్వమునిషేధింపబడి వ్రణవివరోపదర్శితాకాశత్వమారోపింపబడినది. కావున ఇది శుద్ధాపహ్నుతి. శుద్ధాపహ్నుతి రన్యత్రారోపార్థో ధర్మనిహ్నవః.

ఛందస్సు :— కోకిలకము. హయయుతుసాగరై ర్యతియుతం యది కోకిలకమ్ — న జ భ జ జ లగ.

న జ భ జ జ లగ

III IUI UII IUI IUI IU
తరుణ తమాల కోమల మలీమ సమేత దయమ్

రుచిభిరితి :- కించ = మరియు - టంకోత్కీర్ణైః = ఉలిచే పెడజల్లబడిన వగు. త్రసరేణుభిః ఇవ = చిన్న అణువులతోవలె. రుచిభిః = కాంతులతోను. (త్రస రేణువుల వంటి కాంతులతో) స్థూలైః = కొంచెము పెద్దవియగు, ఛేదైః ఇవ =

ప్రకృతిమలినో భాస్వద్బింబోన్మృజాకృతకర్మణ
స్తదయమపి హి త్వష్టుః కుందే భవిష్యతి చంద్రమాః॥ 80

---

తునియలతోవలె. ఉడుభిః = నక్షత్రములతోను. అభితః = అన్నివైపుల. నభః = ఆకాశము. భ్రియతే = పూరింపబడుచున్నది. (తునియలవంటి నక్షత్రములతో). తత్= అందుచేత . అయమ్ = ఈ. ప్రకృతి మలినః = సహజముగా మలిన విశిష్టుడగు. చంద్రమాః = చంద్రుడు. భాస్వద్బింబ = సూర్యబింబముయొక్క. ఉన్మృజా = తరిణిపట్టుట యందు. కృతకర్మణః = నేర్పరియగు. త్వష్టుః = విశ్వకర్మయొక్క. కుందే = తరిణిపై. భవిష్యతి హి = తప్పక నిల్చును. సూర్య బింబమును చిత్రిక పట్టిన పిదప విశ్వకర్మ ఇప్పుడా చంద్రబింబమును తరిణి పట్టుచున్నాడనుట. (హరిణీ వృత్తము)

తాత్పర్యము :— విశ్వకర్మ చంద్రబింబము నందలి మాలిన్యమును పోగొట్టుటకై తరిణిపట్టుచున్నాడు. ఉలి యొరిపిడితో లేచిన ధూళివలె చంద్రకాంతి, చిఱు తునుకలవలె నక్షత్రములు నున్నవి. (వెన్నెల కాదు చంద్రధూళి అనియు. తారకలు కావు బొబిల్లి తునుకలనియు భావము) ఉత్ప్రేక్షాలంకారము.

సమాసములు :— టంకేన ఉత్కీర్ణాః — తైః. భాస్వతః బింబః — బింబస్య ఉన్మృజా - ఉన్మృజాయాం కృతకర్మా - తస్య.

సంధులు :— రుచిభిః + అభితః. ఉత్కీర్ణైః + ఇవ. త్రసరేణుభిః + యది, ఉడుభిః + అపి స్థూలైః + ఇవ — రేఫాదేశవిసర్గ. అభితః + టంక - షాదేశవిసర్గ. టంక + ఉత్కీర్ణ. బింబ + ఉన్మృజా — గుణసంధి. అపి + ఛేద్యైః — తుగాగమ. మలినః + భాస్వత్ - ఉత్వాదేశవిసర్గ. ఉత్ + మృజా — అనునాసికాదేశ కర్మణః + తత్ - సాదేశవిసర్గ.

క్రియ :— ధృఙ్ ధరణే (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ

ధ్రియతే — ధ్రియేతే — ధ్రియన్తే

భూ సత్తాయామ్. పరస్మై. లృట్. ప్రథమ

భవిష్యతి — భవిష్యతః — భవిష్యన్తి

లక్ష్మణః :- (సర్వతోఽవలోక్య)

భూయ స్తరాణి యదమూని తమస్వినీషు
జ్యోత్స్నీషు చ ప్రవిరళాని తతః ప్రతీమః ।
సంధ్యానలేన భృశమంబరమూషికాయా
మావర్తితై రుడుభిరేవ భృతోఽయమిందుః ॥ 81

(విహస్య చ) హంత, యథాధర్మ మేతత్—

---

భూయ స్తరాణీతి :- (సర్వతః=అన్నివైపులను. అవలోక్య=చూచి) తమస్వినీషు = చీకటిరాత్రులయందు. అమూని = ఈ నక్షత్రములు. భూయ స్తరాణి యత్ = అధికముగా నుండుటచేతను. జ్యోత్స్నీషు = వెన్నెల రాత్రుల యందు. ప్రవిరళాని = మిక్కిలి పలుచగా నుండుట చేతను. తతః = అందుచేత, (ఇట్లు భావించుచున్నాము) - సంధ్యానలేన = సంధ్యాగ్నితో, అంబరమూషికాయామ్ = ఆకాశమను మూసయందు (తైజసావర్తనీ మూషా - అమరము) భృశమ్ = మిక్కిలి. ఆవర్తితైః = కరిగింపబడిన, ఉడుభిః ఏవ = తారకలతోనే. అయమ్=ఈ, ఇందుః = చంద్రుడు. భృతః=(పూరింపబడెను) నింపబడెను - ఇతి=అని, ప్రతీమః= భావించుచున్నాము. (వసంతతిలక)

తాత్పర్యము :- చీకటిరేలు తారకలు అధికముగా కన్పించుటయు, వెన్నెల రేలు పల్చగా కనిపించుటయు చూడగా — తారకలను సంధ్యాగ్నితో ఆకాశము అను మూసలో కరిగించి చందమామను నింపిరని భావించుచున్నాము. ఉత్ప్రేక్ష.

సంధులు :- ఆవర్తితైః + ఉడుభిః + ఏవ — రేఫాదేశవిసర్గసంధులు. భృతః + అయమ్ — ఉత్వాదేశవిసర్గ — భృతో + అయమ్ — పూర్వరూప.

క్రియ :- ఇణ్ గతౌ. పరస్మై, లట్, ఉత్తమ (ప్రతి)
ఏమి — ఇవః — ఇమః

హన్తేతి :- (విహస్య చ = నవ్వి) హన్త=ఆహా!, (హంత హర్షేచ ఖేదే చ - అమరము). ఏతత్ = ఇది. యథాధర్మమ్ = ధర్మబద్ధముగానే ఉన్నది - (ధర్మమనతిక్రమ్య — యథాధర్మమ్)

యత్పీయూషమయూఖమాలిని తమఃస్తోమావలీఢాయుషాం
నేత్రాణామపమృత్యుహారిణి పురః సూర్యోఢ ఏవాతిథౌ।
అంభోజాని పరాంచి తన్నిజమఘం దత్త్వేవ తేభ్యస్తతో
గౌరాంగీవదనోపమాసుకృతమాదత్తే పతిర్యజ్వనామ్॥ 82

యదితి :- తమః స్తోమ = పెనుచీకటిచే. అవలీఢ=సమాప్తిపొందబడిన. ఆయుషామ్ = చైతన్యము కల్గిన. నేత్రాణామ్ = కన్నులకు. అపమృత్యు = అకాల మృత్యువును (చైతన్య రాహిత్యమును) హారిణి = పోగొట్టువాడు - కన్నులకు దర్శన శక్తిని అనుగ్రహించువాడై. పీయూషమయూఖమాలిని = అమృతకిరణుడు (కావుననే అపమృత్యుహారి) పురః=ఎట్టఎదుట. సూర్యోఢే ఏవ=సాయంసంధ్యయందే, అతిథౌ= అతిథియై రాగా, అంభోజాని = పద్మములు. పరాంచి = పరాఙ్ముఖములైనవి. తత్ = అందుచేత. నిజమ్ = తనదైన. అఘమ్ = పాపమును. దత్త్వా = పద్మములకు సంక్రమింపజేసి. తతః = అటుపైని. తేభ్యః = ఆ పద్మములనుండి. యజ్వనామ్ పతిః = ద్విజరాజు (బ్రాహ్మణులకు ప్రభువు). గౌరాంగీ = ఉత్తమ స్త్రీ[ల] యొక్క. వదన= ముఖముతో. ఉపమా = సమానత్వమనునట్టి. సుకృతమ్ = పుణ్యమును. ఆదత్తే = స్వీకరించుచున్నాడు.

తాత్పర్యము :- సూర్యాస్తమయము కాగా చంద్రుడు అతిథివలె ఉదయించెను. పద్మములు ముఖములను ముడుచుకొన్నవి. సాయంసంధ్యలో వచ్చిన అతిథిని గౌరవింపకపోవుట మహాపచారము. ఆ అతిథి తన పాపమును పద్మములకంటగట్టి పద్మముల సుకృతమును (వదనోపమానత్వము) తాను స్వీకరించెను. అతిథిని గౌరవింపకపోయినచో అతిథిపాపము గృహస్థునకును గృహస్థుని పుణ్యము ఆ అతిథికిని సంక్రమించునని ధర్మశాస్త్రము. సాయం సమయమునందిది ఎన్మిదిరెట్లు ఎక్కువయట- అతిథిర్యస్య భగ్నాశో గృహాత్ప్రతినివర్తతే స తస్య దుష్కృతం దత్త్వా పుణ్యమాదాయ గచ్ఛతి. అతిథౌ విముఖే ప్రోక్తం గతే యత్పాతకం నృణామ్ తదేవాష్టగుణం ప్రోక్తం సూర్యోఢే విముఖే గతే॥

సమాసములు :- పీయూషమయాః మయూఖాః - మయూఖానాం మాలా అస్య అస్తీతి - తస్మిన్. తమసః - స్తోమేన అవలీఢ మాయుర్యేషామ్ - తేషామ్.

విశ్వామిత్రః :- (సర్వతోఽవలోక్య, సస్మితమ్) అహహ. నామధేయ మాత్ర మాధుర్యాదపరమార్థదృశ్వానో విప్రలభ్యన్తే. తథా హి —

స్మేరా దిశః కుముదముద్బిదురం పిబన్తి
జ్యోత్స్నాకరంభ ముదరంభరయశ్చకోరాః ।
అః కీదృగత్రిమునిలోచనదూషికాయాం
పీయూషదీధితిరితి ప్రథితోఽనురాగః॥ 83

---

అపమృత్యుం హరతి తచ్ఛీలమస్య — హారీ — తస్మిన్. గౌరాంగ్యాః వదనమ్-వదనేన ఉపమా - ఉపమా ఏవ సుకృతమ్.

సంధులు :- సూర్యేథే + ఏవ - అయవాదేశ - సూర్యేథయ్ + ఏవ-యవ లోపసంధి. స్తోమ + అపలీఢ + ఆయుషామ్. ఏవ + అతిథా-సవర్ణదీర్ఘ. తత్ + నిజమ్-అనునాసికాదేశ. దత్త్వా + ఇవ, వదన + ఉపమా — గుణసంధి. తేభ్యః + తతః — సాదేశవిసర్గ. తతః + గౌర — ఉత్వాదేశవిసర్గ. పతిః + యజ్వనామ్ - రేఫాదేశవిసర్గ.

క్రియ :- డుదాఞ్ దానే. ఆత్మనే. లట్. ప్రథమ (బహు)

దత్తే-దదాతే-దదతే

అహహేతి :- (సర్వతః = అన్నివైపులకును, అవలోక్య = చూచి, సస్మితమ్ = చిఱునవ్వుతో) అహహా ! నామధేయమాత్ర మాధుర్యాత్ = నామధేయము నందు మాత్రమే ఉన్న మధురిమ వలన, అపరమార్థదృశ్వానః = పరమార్థమును గ్రహింపలేనివారు, విప్రలభ్యన్తే = మోసగింపబడుచున్నారు. తథాహి = అంతేకదా !-

స్మేరాఇతి :- దిశః = దిక్కులు, స్మేరాః = సహజముగనే వికాస శీలములు — కాంతిమంతములనుట. కుముదమ్ = కలువ, ఉద్బిదురమ్ = సహజముగనే వికసించునది. ఉదరంభరయః = పొట్టకూటివగు, చకోరాః = వెన్నెల పులుగులు, జ్యోత్స్నాకరంభమ్ = వెన్నెల యనునట్టి పెరుగువంటను, పిబన్తి=త్రాగుచున్నవి- ఇవియన్నియు చంద్రునితో పనిలేకుండ సహజముగనే జరుగునవనుట. అః=అహో !, అత్రిముని = అత్రిమహర్షియొక్క, లోచన దూషికాయామ్ = కంటిలో పుసివంటి వాడైన చంద్రునిపట్ల (దూషికానేత్ర యోర్మలమ్ — అమరము). పీయూష దీధితిః

(రామం చ దృష్ట్వా సహర్షస్మితమ్) కథమయం కుమారాంక విజయ ప్రత్యాగతోఽపి తాడకా నిగ్రహేణ హ్రీణీయమాణః సహసా నోప తిష్ఠతే వత్సః. (లక్ష్మణం ప్రతి) వత్స. సౌమిత్రే. అస్మాకమనేన వృత్తాంతేన ప్రదోషలక్ష్మీరియ మనూద్యతే. పశ్య —

---

ఇతి = అమృతకిరణుడు అని. ప్రథితః = ప్రసిద్ధికెక్కిన. అనురాగః = ప్రేమ. కీదృక్ = ఎట్టిది ;

తాత్పర్యము :- దిగ్వికాసమునకుగాని కుముద వికసనమునకుగాని చకోర పారణమునకుగాని చంద్రునితో పనిలేదు. అవి ప్రకృతి సిద్ధములు. కాగా అత్రి కంటి పుసివంటివాడైన ఈ చందమామకు అమృత కిరణుడని ప్రసిద్ధివచ్చుట ఇదెక్కడిది చెపుమా ;

విశేషములు :- ఉదరంభరయః- ఫలేగ్రహి రాత్మంభరిశ్చ అను సూత్ర ముచే ఆత్మంభరిః నిపతితము. చకారముతో కుక్షింభరిః ఉదరంభరిః ఇత్యాదులు గ్రాహ్యములు. అనుక్తసముచ్చయార్థశ్చకారః. కుక్షింభరిరుదరంభరిరిత్యాదావపి శిష్ట ప్రయోగాదవగంతవ్యః. (కరంభో దధిసక్తవః - అమరము) వసంతతిలకము.

సంధులు :- స్మేరాః + దిశః - విసర్గలోప. భరయః + చకోరాః - శాదేశవిసర్గ. దీధితిః + ఇతి - రేఫాదేశవిసర్గ. ప్రథితః + అనురాగః - ఉత్వాదేశ విసర్గ - ప్రథితో + అనురాగః - పూర్వరూపసంధి.

కథమితి :- (రామం = రాముని, దృష్ట్వా = చూచి, సహర్షస్మితమ్ = ఆనందముతో చిఱునవ్వుతో) కథమ్ = ఏట్లూ ; కుమారాంక = తొలియుద్ధమునందలి (కన్నెరలను), విజయ = జయముతో, ప్రత్యాగతః అపి = తిరిగివచ్చినవాడయ్యును, అయమ్ = ఈ, వత్సః = చిరంజీవి, తాడకానిగ్రహేన = తాటకను సంహరించుటతో (స్త్రీవధ), హ్రీణీయమానః = సిగ్గుపడుచున్నవాడై, న ఉపతిష్ఠతే = నన్ను సమీపిం చుటలేదు (లక్ష్మణం ప్రతి = సౌమిత్రితో) వత్స = బిడ్డా ; సౌమిత్రే = లక్ష్మణా ; అస్మాకమ్ = మనయొక్క, అనేన = ఈ, వృత్తాంతేన = కథతో, ఇయమ్ = ఈ ప్రదోషలక్ష్మీః = సాయంకాలశోభ, అనూద్యతే = సంవదించుచున్నది - మన కథ నీ సంధ్య అనువదించుచున్నదనుట, పశ్య = చూడుము-

నిశాచరాణాం తమసాం నిహన్తా పురోఽయముద్గచ్ఛతి రామచంద్రః।
అథోల్లసద్భిర్నయనై ర్మునీనామయం కుముద్వానజని ప్రదేశః॥ 84

రామః :- (విభావ్య)

మదయతి యదుత్పన్నో దుగ్ధాంబుధేరయమంబుధీ
న్నయతి నయనా దత్రేర్జాతో ముదం నయనాని చ।

---

నిశాచరాణామ్ :- నిశాచరాణామ్ = రాక్షసులకు (రాత్రి విజృంభించు నట్టి) తమసామ్ = చీకటులకు, నిహన్తా = సంహారకుడై, అయమ్ = ఇతడే, రామ చంద్రః = రాముడను చంద్రుడు, పురః = ఎట్టఎదుట, ఉద్గచ్ఛతి = ఉదయించు చున్నాడు. అథ = అంతట, ఉల్లసద్భిః = ఆనందపరవశములై వికసించుచున్న, మునీనామ్ = ఈ ఆశ్రమవాసులయొక్క, నయనైః = కన్నులతో, అయమ్ = ఈ, ప్రదేశః = ఆశ్రమప్రదేశము, కుముద్వాన్ = కలువలు కలదిగా (కలువల కొలనుగా) అజని = అయ్యెను.

తాత్పర్యము :- చీకట్లను పారద్రోలు చంద్రు డుదయించుచున్నాడు. అది రాక్షసులను పారద్రోలి వచ్చుచున్న శ్రీరామునికి అనుకరణము. కలువలు వికసించు చున్నవి. అది ముని నయనపద్మముల వికాసమునకు అనుసరణము. ఇట్లు ప్రకృతి మన పనిని అనువదించుచున్నది.

అలంకారము :- రామచంద్రుడనునట్టి రామచంద్రుడు—శ్లిష్టరూపకము నిశాచరులు — చీకటులు. నయనములు — కుముదములు — వ్యస్తరూపకము.

ఛందస్సు :- ఉపేంద్రవజ్ర. ఉపేంద్రవజ్రా జతజా స్తతోగౌ.

| జ | త | జ | గగ |
|---|---|---|---|
| । ꓴ । | ꓴ ꓴ । | । ꓴ । | ꓴ ꓴ |
| నిశాచ | రాణాంత | మసాంని | హన్తా |

క్రియ :- జనీ ప్రాదుర్భావే. ఆత్మనే. లుఙ్. ప్రథమ

అజని / అజనిష్ట — అజనిషాతామ్ — అజనిషత

మదయతీతి :- (విభావ్య = సాలోచనగా) దుగ్ధాంబుధేః = క్షీర సము ద్రమునుండి. యత్ ఉత్పన్నః = సంభవించినవాడగుటచేత, అయమ్ = ఈ, సోమః =

తదఖిల సురశ్రేణీసాధారణప్రణయా శచీ
సహచరచరుస్థాలీ సోమః సమంజసమీహతే॥ 85

చంద్రుడు. అంబుధీన్ = సముద్రములను. మదయతి = వెల్లివిరియించుచున్నాడు. (పుత్రధర్మమగుట సమంజసమే) అత్రేః=అత్రి మహర్షియొక్క. నయనాత్=నేత్రము నుండి. జాతః=పుట్టినవాడగుటచే. నయనాని = లోకులందరి కన్నులకును. ముదమ్ = ఆనందమును. నయతి = కూర్చుచున్నాడు—ఇదియు సహేతుకమే. అఖిల సురశ్రేణి = సకల దేవతా సమూహమునకును. సాధారణ = సమానమగు. ప్రణయా = కోరిక కలదియు – సకల దేవతలను కోరుకొనునదనుట. శచీసహచర = దేవేంద్రునికి. చరుస్థాలీ = హవ్యభాండమువంటిదియునై. సోమః = సోమలత. సమంజసమ్ ఈహతే = యుక్తముగనే ప్రవర్తించుచున్నది.

తాత్పర్యము :- సోమః సోమలతాయాం చ చంద్రే చ అని విశ్వ నిఘంటువు. దీనిపై కవి అల్లిన చమత్కారమిది. సోముడై క్షీరజలధికి పుట్టి సముద్రముల నానందింపజేయుట. అత్రి నేత్రమునుండి పుట్టి లోకుల కన్నులకు ఆనందముగూర్చుట వీనిలో విశేషములేదు. సోమలతయై సకల దేవతలకు ఆనందము గూర్చుచు (కళలు పంచుచు – సోమరసము నిచ్చుచు) ఇంద్రునికి ఆహారభాండమై ప్రశంసా పాత్రమగుట విశేషము.

సమాసములు :- అఖిలా చ సా సురశ్రేణీ చ – అఖిలసురశ్రేణ్యాం సాధారణః ప్రణయః యస్యాం సా, శచ్యాః సహచరః – సహచరస్య చరుస్థాలీ.

సంధులు :- ఉత్పన్నః + దుగ్ధ, జాతః + ముదమ్ – ఉత్వాదేశవిసర్గ, అంబుధేః + అయమ్, అత్రేః + జాతః – రేఫాదేశ విసర్గ.

క్రియ :- మద తృప్తి యోగే (ణిచ్), పరస్మై, లట్, ప్రథమ

మదయతి – మదయతః – మదయన్తి

ణీఞ్ ప్రాపణే, పరస్మై, లట్, ప్రథమ

నయతి – నయతః – నయన్తి

ఈహఙ్ చేష్టాయామ్, ఆత్మనే, లట్, ప్రథమ

ఈహతే – ఈహేతే – ఈహన్తే

(సలజ్జ ముపసృత్య) భగవన్, అభివాదయే—

విశ్వామిత్రః :- (సస్నేహబహుమానమాలింగ్య) వత్స, రఘునందన, ఇత్థమేవ—

ప్రకృష్ట కర్తృభిప్రాయక్రియాఫలవతో విధీన్ ।
ప్రయుంజానా స్త్వయా వీర పరిపాల్యామహే వయమ్॥ 86

---

అలంకారము :- సహేతుకముగా ఆనందమును కల్పించుచున్న సోముని కన్న నిర్హేతుకముగా సకలదేవతలకు సంతోషమును గూర్చుచున్న సోమలత యందు గుణాధిక్యము వర్ణింపబడుటచే నిది వ్యతిరేకము.

ఛందస్సు :- హరిణి, రసయుగహయైః న్సౌ మ్రౌ స్లౌ గో యదా హరిణీ తదా.

| III | IIU | UUU | UIU | IIU | IU |
|---|---|---|---|---|---|
| మదయ | తియదు | త్పన్నోద్దు | గ్ధాంబుధే | రయమం | బుధీ |
| న | స | మ | ర | స | లగ |

భగవన్నితి :- (సలజ్జమ్ = సిగ్గుపడుచు, ఉపసృత్య = సమీపించి) భగవన్ = మహాత్మా ! అభివాదయే = నమస్కరించుచున్నాను.

వత్సేతి :- (సస్నేహబహుమానమ్=మైత్రితో గౌరవముతో, ఆలింగ్య= కౌగిలించుకొని) వత్స = నాయనా ! రఘునందన = రామభద్రా ! ఇత్థమేవ = ఇట్లే—

ప్రకృష్టేతి :- ప్రకృష్ట=ఉత్తముడగు, కర్తృ = యజమానునియొక్క అభిప్రాయ = కోరికయే, క్రియాఫలవతః = యాగఫలముగా కలవియగు, విధీన్ = ఆయా విధులను (యజ్ఞవిధులను) ప్రయుంజానాః = నిర్వహించువారమైన, వయమ్= మేము (మావంటి మునులు), వీర = మహావీరుడా ! త్వయా = నీచేత, పరిపాల్యామహే = సంరక్షింపబడుచుందుముగాక ! (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- మహావీరా ! యజమానుల కోరికలను ఫలింపజేయు యజ్ఞములను నిర్వహించు మావంటివారిని నీవు ఇట్లే కాపాడుచుండుము.

సమాసములు :- ప్రకృష్టశ్చాసౌ కర్తా చ - కర్తుః అభిప్రాయమేవ క్రియాయాః ఫలమివ యేషాం తే - తాన్.

రామః :- (స్వగతమ్) శిరసా గృహీతమాచార్యవచనమ్.

విశ్వామిత్రః :- (సమరధూళిధూసరం రామస్య కపోలమున్మార్జయన్) యత్సత్య మమునా నక్తంచరవ్యతికరేణ ప్రియసుహృదా సీరధ్వజేన వితన్యమానే వైతానే కర్మణి కంపితమివ మే హృదయమ్.

రామః :- (సగౌరవమ్) భగవన్. క ఏష సీరధ్వజో నామ యమద్య తే త్రిభువనదుర్లభోఽయం ప్రియసుహృచ్ఛబ్దప్రయోగః కమపి మహిమానమారోపయతి.

---

సంధులు :- కర్తృ + అభిప్రాయ - యణాదేశ. ఫలవతః + విధీన్ - ఉత్వాదేశవిసర్గ. ప్రయుంజానాః + త్వయా - సాదేశ విసర్గ సంధి.

క్రియ :- పాల రక్షణే. (కర్మణి) ఆత్మనే. లట్ ఉత్తమ

పాల్యే - పాల్యావహే - పాల్యామహే

శిరసేతి:- (స్వగతమ్ = తనలో) ఆచార్య వచనమ్ = విశ్వామిత్రునిమాట శిరసా గృహీతమ్ = శిరసావహింపబడినది.

యదితి :- (సమరధూళి ధూసరమ్ = రణరంగమునందలి ధూళితో కూడిన రామస్య = రామునియొక్క. కపోలమ్ = చెక్కిలిని. ఉన్మార్జయన్ = నిమురుచు) ప్రియ సుహృదా = నా ప్రియమిత్రుడైన. సీరధ్వజేన = జనక మహారాజుచే. వితన్యమానే = నిర్వహింపబడుచున్న. వైతానే కర్మణి = యజ్ఞవిధిపట్ల. అనేన = ఈ. నక్తంచర వ్యతికరేణ = రాక్షసబాధచే (అథ వ్యతికరః పుంసి వ్యసన వ్యతిషంగయోః- అమరము). మే = నాయొక్క. హృదయమ్ = అంతరంగము. సత్యమ్ = నిక్కముగా. కంపితమివ = వణికిపోవుచున్నది - అతనికి ఏమి విఘ్నములు కల్గుచున్నవో యని బాధపడుచున్నాననుట.

భగవన్నితి :- (సగౌరవమ్ = గౌరవ భావముతో) భగవన్ = మహాత్మా అద్య = ఇప్పుడు. తే = నీయొక్క. అయమ్ = ఈ. త్రిభువనదుర్లభః = ముల్లోకములకును దుర్లభమగు. ప్రియసుహృత్ శబ్దప్రయోగః = "ప్రియ సుహృత్" అను పద

విశ్వామిత్రః :- వత్స, శృణోషి విదేహేషు మిథిలాం నామ నగరీమ్.

రామః :- యత్ర పవిత్రమాశ్చర్యద్వయం జనాః కథయన్తి. సకలరాజ దురాకర్షమైందుశేఖరం ధనుః లాంగలముఖోల్లిఖిత విశ్వంభరా ప్రసూతిరగర్భసంభవా మానుషీ.

విశ్వామిత్రః :- (విహస్య) అథకిమ్.

రామః :- (సకౌతుకమ్) తతః కిం తస్యామ్ ?

---

ప్రయోగము. యమ్ = ఎవనిని. కమపి మహిమానమ్ = ఏదో గొప్ప మహిమకల వానినిగా, ఆరోపయతి = నిరూపించుచున్నదో, ఏషః = ఈ. సీరధ్వజః = నీవు పేర్కొన్న సీరధ్వజుడు, కః = ఎవరు ? ప్రియమిత్రుడని నీవు వ్యవహరించుటచే నతడెవరో గొప్ప మహానుభావుడని తెలియుచున్నది. ముల్లోకములలో నింకెవరినిగాని నీవు ప్రియ సుహృత్ పదముతో వ్యవహరింపలే దనుట.

వత్సేతి :- వత్స = నాయనా !, విదేహేషు = విదేహ దేశములలో, మిథిలామ్ నామ నగరీమ్ = మిథిల అను పేరుగల పట్టణమును, శృణోషి = విందువు— వినియుందువు కదా అనుట.

యత్రేతి :- యత్ర = ఏ పట్టణమందు, పవిత్రమ్ = పావనమై, ఆశ్చర్య ద్వయమ్ = ఆశ్చర్యజనకములగు రెండు విషయములున్నవని, జనాః = ప్రజలు, కథయన్తి = చెప్పుకొనుచున్నారో ఆ మిథిలయే కదా అనుట. ప్రజలు చెప్పుకొను ఆశ్చర్య ద్వయమును వివరించుచున్నాడు — సకల రాజ = సమస్త రాజ సమూహముచేతను, దురాకర్షమ్ = ఎక్కుపెట్టుటకుగాని, ఐందుశేఖరమ్ ధనుః = పరమేశ్వరుని ధనుస్సు, లాంగలముఖ = నాగేటి కఱ్ఱుచేత, ఉల్లిఖిత = దున్నబడిన, విశ్వంభరా = భూమియొక్క ప్రసూతిః = బిడ్డయై, అగర్భ సంభవా = గర్భవాసము లేకుండా జన్మించిన, మానుషీ = మానవాంగన - అను ఈ రెండు పవిత్ర ఆశ్చర్యద్వయము ఉన్న మిథిలయే కదా అని అన్వయము.

అథేతి :- (విహస్య = నవ్వి) అథకిమ్ = అవును - ఆ మిథిలయే.

తతఇతి :- (సకౌతుకమ్ = కుతుకముతో) తతః = సరియే, తస్యామ్ = ఆ మిథిలా నగరమునందు కిమ్ = ఏమి విశేషమనుట.

విశ్వామిత్రః :-

అసౌ సీరధ్వజో రాజా యో దేవాద్ద్యుమణే రపి।
అధ్యైష్ట యాజ్ఞవల్క్యస్య ముఖేన బ్రహ్మసంహితామ్॥ 87

తస్య సన్న్యస్తశస్త్రస్య పురాణరాజర్షేర్జనక వంశజన్మనో
దీక్షావిలోపశంకా పర్యాకులయతి మామ్. తదేతమాయుష్మంతౌ,
విధిశేషమస్మదీయం సమాప్య సహైవ మిథిలాముపతిష్ఠామహే.

---

అసావితి :- యః = ఏ మహారాజు, దేవాత్ = ప్రత్యక్ష దైవమయిన, ద్యుమణేః అపి=సూర్యునినుండికూడ, యాజ్ఞవల్క్యస్య = యాజ్ఞవల్క్యునియొక్క, ముఖేన = ముఖముతో - అతని ముఖమున సూర్యునినుండి యనుట, బ్రహ్మ సంహితామ్ = తత్త్వబోధకమగు వేదభాగమును, అధ్యైష్ట = అధ్యయనముచేసెనో, అసౌ రాజా = ఆ మహారాజు, సీరధ్వజః = జనకుడు (పథ్యావక్త్రము).

తాత్పర్యము :- జనకమహారాజనగా సామాన్యుడుకాదు. యాజ్ఞవల్క్యుడు సూర్యునినుండి తాను నేర్చిన బ్రహ్మవిద్యను స్వయముగా జనకునికి ఉపదేశించెను. అంతటివాడు.

సంధులు :- సీరధ్వజః + రాజా - ఉత్వాదేశవిసర్గ. మణేః + అపి- రేఫాదేశవిసర్గ.

క్రియ :- ఇఙ్ అధ్యయనే, ఆత్మనే, లుఙ్, ప్రథమ (అధి)
ఐష్ట - ఐషాతామ్ - ఐషత

తస్యేతి :- సంన్యస్తశస్త్రస్య = ఆయుధములు విడిచిపెట్టిన వాడును, పురాణరాజర్షేః = చిరంతనుడగు రాజర్షియునగు, తస్య = ఆ, జనకవంశజన్మనః = జనకవంశ సంభవుడగు సీరధ్వజునికి, దీక్షావిలోపశంకా = దీక్షాలోపము జరుగునేమో అను సంశయము, మామ్ = నన్ను, పర్యాకులయతి = కలతపెట్టుచున్నది, తత్ = అందుచేత, ఆయుష్మంతౌ = చిరంజీవులారా! ఏతమ్ = రండు, అస్మదీయమ్ = మాకు సంబంధించినదగు, విధిశేషమ్ = కర్తవ్యము నందలి శేషమును, సమాప్య = ముగించుకొని, సహైవ = అందరము కలిసియే, మిథిలామ్ = మిథిలా నగరమును గూర్చి, ఉపతిష్ఠామహే = బయలుదేరుదము.

రామః :- (సహర్ష మపవార్య) వత్స, లక్ష్మణ, మమాపి తస్మిన్నతరుణ రోహిణీరమణ చూడామణి పాణిప్రణయిని శరాసనే చిరస్య కౌతుకమస్తి.

లక్ష్మణః :- (సపరిహాసమ్) ఆర్యాయామయోనిజన్మని రాజకన్యకాయామపి.

రామః :- (సరోషస్మితమ్) కథమన్యదేవ కిమపి ప్రహసనం సూత్రయతి భవాన్. (మునిం ప్రతి) భగవన్, ఇక్ష్వాకువంశగురో, యదభి రుచితం భవతే. (ఇతి పరిక్రమ్య నిష్క్రాన్తాస్సర్వే)

—: ఇతి కౌమారవిక్రమో నామ ద్వితీయోఽఙ్కః :—

---

వత్సేతి :- [సహర్షమ్ = సంతోషముతో, అపవార్య = విశ్వామిత్రునికి వినబడకుండ వారించి] వత్స, లక్ష్మణ = సోదరా ! సౌమిత్రీ ! [రహస్యం కథ్యతే ఽన్యస్య స్మృతం తదపవారితమ్ - భరతః]. అతరుణ = బాలుడైన, రోహిణీ రమణ = చంద్రుడు, చూడామణి = శిరోఽలంకారముగా కలవాడగు శివుని యొక్క, పాణి = హస్తమునందు, ప్రణయిని = లాలింపబడునట్టి, తస్మిన్ = ఆ, శరాసనే = ధనుస్సుపట్ల, చిరస్య = చాలకాలముగా, కౌతుకమ్ అస్తి = కౌతుకమున్నది — దానిని సందర్శింపవలెనని చాలకాలముగా కుతూహలపడుచున్నాననుట.

ఆర్యాయామితి :- (సపరిహాసమ్=పరిహాససూచకముగా) ఆర్యాయామ్ = గౌరవింపదగినదియు, అయోనిజన్మని = అగర్భసంభవయునగు, రాజకన్యకాయామ్ అపి = మిథిలా రాజకన్యకపట్లను — కౌతుకమస్తి అని అన్నగారిపై ఛలోక్తి

కథమితి :- (సరోషస్మితమ్ = చిఱుకోపముతో చిఱునవ్వుతో) కథమ్= ఎట్టూ ! భవాన్ = నీవు, అన్యత్ ఏవ = పూర్తిగా మరియొకడు, కిమపి = ఏదో, ప్రహ సనమ్ = ప్రహసనమును [శృంగార హాస్య బహుళం శాంతాద్భుత రసాన్వితం ద్వ్యంక మారభటీహీనం ప్రాహ ప్రహసనం మునిః.] సూత్రయతి = ఆరంభించుచున్నావు. [మునింప్రతి = విశ్వామిత్రుని ఉద్దేశించి] భగవన్ = మహాత్మా ! ఇక్ష్వాకు వంశగురో = ఇక్ష్వాకు వంశమునకు దేశికుడా ! భవతే = నీకు, యత్ అభిరుచితమ్ = ఏది అభీష్టమో అట్లే ! [ఇతి = అని, పరిక్రమ్య = కదలి, సర్వే = అందరును, నిష్క్రాంతాః = నిష్క్రమించిరి.]

—: ఇది కౌమారవిక్రమము ద్వితీయాంకము :—

# అనర్ఘరాఘవమ్

## తృతీయోఽఙ్కః

( తతః ప్రవిశతి కంచుకీ )

కంచుకీ :- (జరావైక్లబ్య విసంష్ఠులాని కతిచిత్పదాని దత్త్వా ఆత్మానంప్రతి సఖేదోపాలంభమ్)

గాత్రైర్గిరా చ వికలశ్చటుమీశ్వరాణాం
కుర్వన్నయం ప్రహసనస్య నటః కృతోఽస్మి ।
తత్త్వాం పునః పలితవర్ణక భాజమేనం
నాట్యేన కేన నటయిష్యతి దీర్ఘమాయుః ॥ 1

---

[ తతః = అంతట, కంచుకీ = కంచుకి, ప్రవిశతి = ప్రవేశించును ]

[ జరా = ముసలితనముచేనైన, వైక్లబ్య = గ్లానితో, విసంష్ఠులాని = వరుస తప్పుచున్న, కతిచిత్పదాని = కొన్ని అడుగులను, దత్త్వా = వేసి, ఆత్మానం ప్రతి = తన్ను గూర్చి, సఖేదోపాలంభమ్ = దుఃఖముతోగూడిన నిందతో ]

గాత్రైరితి :- గాత్రైః = శరీరావయవములతోను, చ = మరియు, గిరా = వాక్కుతోను, వికలః = రహితుడనై - వృద్ధాప్యముతో స్థితిదప్పి వణుకుచున్న శరీరముతోను, వాక్కుతోను అనుట, ఈశ్వరాణామ్ = ప్రభువులకు [ప్రేక్షకులకు] చటుమ్ = హితమును [చటుశ్చాటే పిచండే చ - మేదిని]. కుర్వన్ = చేయుచు, అయమ్ = ఇదే, ప్రహసనస్య = ప్రహసనమునకు, నటః = నటుడుగా - ఒక హాస్యపాత్రగా, కృతః అస్మి = చేయింపబడితిని, తత్ = అందుచేత, పలితవర్ణకభాజమ్ = నెరిసిన తెల్లదనమునకు పాత్రుడనైన, ఏనమ్ = ఈ, త్వామ్ = నిన్ను, దీర్ఘమ్ ఆయుః = ఈదీర్ఘమైన ఆయుర్దాయము, పునః = మరల, కేన = ఏ, నాట్యేన = నర్తనముతో [పాత్రధారణతో] నటయిష్యతి = స్పందింపజేయునో । [వసంతతిలక]

(పురో విలోక్య) అయే సీతాపాదమూలోపజీవినీ కలహంసికా.

(ప్రవిశ్య)

కలహంసికా :- ఆర్య. ప్రణమామి (అజ్జ. పణమామి)

---

తాత్పర్యము :- ముసలితనముతో వణుకుచున్న శరీరము గాత్రముకల వాడనై ప్రేక్షక ప్రభువులకు ఆనందము గూర్చుచు ప్రహసనమున ఒక నటుడనైతిని. ఈ వయస్సు ఇకముందు ఏయే పాత్రలలో నన్ను నటింపజేయునో గదా।

విశేషములు :- కంచుకికి ప్రత్యేక లక్షణములు కొన్నియున్నవి. తన వార్ధక్యమును నిందించుకొనుచు ఈ పాత్ర ప్రవేశించుట సంస్కృత నాటక సంప్రదాయము. అంతఃపురచరో వృద్ధో విప్రో గుణగణాన్వితః సర్వకార్యార్థకుశలః కంచుకీత్యభిధీయతే జరావైక్లబ్యయుక్తేన విశేద్గాత్రేణ కంచుకీ [భరతః]. అంతఃపురేత్వధికృతః స్యాదంతర్వంశకోజనః సౌవిదల్లాః కంచుకినః స్థాపత్యాః సౌవిదాశ్చ తే - అమరము.

సంధులు :- గాత్రైః + గిరా - రేఫాదేశవిసర్గ. వికలః + పటుమ్ - శాదేశ విసర్గ. కుర్వన్ + అయమ్ - అనునాసికద్విత్వ. కృతః + అస్మి - ఉత్వాదేశ - కృతో + అస్మి - పూర్వరూప.

క్రియ :— అస భువి. పరస్మై. లట్. ఉత్తమ

అస్మి - స్వః - స్మః

నట అవస్పందనే భాషార్థే చ [నృత్తౌ కింసనే చ] ణిచ్,

పరస్మై. లృట్. ప్రథమ.

నటయిష్యతి - నటయిష్యతః - నటయిష్యన్తి

అయేఇతి :- (పురః = ముందునకు, విలోక్య = చూచి) అయే = అహో, సీతాపాదమూలోపజీవినీ = సీతాదేవికి సమీపమునందుండు. కలహంసికా = కలహంసికయా ఇటు వచ్చుచున్నది। అని కావచ్చు.

( ప్రవిశ్య = కలహంసిక ప్రవేశించి )

ఆర్యేతి :- ఆర్య = అయ్యా। ప్రణమామి = నమస్కరించుచున్నాను.

కంచుకీ :- వత్సే. కల్యాణినీ భూయాః.

కలహంసికా :- ఆర్య. చిరేణ కుతో యూయమ్. (అజ్జ, చిరేణ కుదో తుమ్హే)

కంచుకీ :- (విమృశ్య) తత్కిం న కథ్యతే. వత్సే. విదితమేవ భవత్యాః.

యథా తత్తాదృగద్భుతం దారకద్వయమాదాయ భగవాన్ కౌశికో యజమానం మహారాజం సీరధ్వజముపస్థితః.

కలహంసికా :- అథకిమ్. ఆర్య. ప్రభవం నామధేయం చ తయోః శ్రోతు మస్తి మే కౌతూహలమ్. (అధఇం, అజ్జ, పహవం ణామ ధేఅం చ తాణం సుణిదుం అత్థి మే కౌదూహలమ్)

కంచుకీ :- వత్సే. కథయామి——

---

వత్సేతి :- వత్సే = అమ్మాయీ। కల్యాణినీ = శుభాన్వితవు, భూయాః = కమ్ము।

చిరేణేతి :- ఆర్యా। చిరేణ = చాలకాలమునకు. యూయమ్ = తమరు (వచ్చిరి) కుతః = ఏలకో।

తదితి :- (విమృశ్య = ఆలోచించి) తత్ కిమ్ న కథ్యతే = అది చెప్ప బడక పోవుటేల। తప్పక చెప్పెదననుట. వత్సే = అమ్మాయీ। భవత్యాః = నీకు, విదితమేవ = తెలిసియేయుండును — యథా = ఏది యనగా — తత్తాదృక్ = అటు వంటి, అద్భుతమ్ = ఆశ్చర్యజనకమగు, దారకద్వయమ్ = పుత్ర ద్వయమును, ఆదాయ = వెంటదీసికొని, భగవాన్ = మహాత్ముఁడగు, కౌశికః = విశ్వామిత్రుడు, యజమానమ్ = యజ్ఞముచేయుచున్న, మహారాజమ్ = మన మహారాజగు, సీరధ్వజమ్ = జనకుని, ఉపస్థితః = సమీపించెను — ఇది నీకు తెలిసియే యుండుననుట.

అథేతి ;- అథకిమ్ = అవును, ఆర్యా। తయోః = ఆ యిరువురి యొక్క ప్రభవమ్ = పుట్టుక, నామధేయమ్ = పేరు, శ్రోతుమ్ = వినుటకు, మే = నాకు, కౌతూహలమ్ అస్తి = కుతూహలముగా నున్నది.

త్రయఇతి ;- వత్సా। కథయామి = చెప్పుచున్నాను — త్రయస్త్రింశ త్కోటి = ముప్పదిమూడుకోటుల, త్రిదశమయ = దేవతల అంశలతో నేర్పడిన —

త్రయస్త్రింశత్కోటి త్రిదశమయమూర్తేర్భగవతః
సహస్రాంశోర్వంశే జయతి జగదీశో దశరథః।
యదస్త్రైరస్నిగ్ధైరసురయువతి శ్వాసపవన
ప్రకోపే సిద్ధే న స్పృశతి శతకోటిం శతమఖః॥ 2

సకలదేవతాత్మకమనుట - మూర్తేః = ఆకారముకలవాడై, భగవతః = ప్రత్యక్షదైవమయిన, సహస్రాంశోః = సూర్యునియొక్క, వంశే = వంశమునందు, జగదీశః = లోకనాయకుడై, దశరథః = దశరథుడు, జయతి = విరాజిల్లుచున్నాడు. యత్ = ఎవని యొక్క, అస్నిగ్ధైః = కఠోరములైన, అస్త్రైః = ఆయుధములతో, అసురయువతి = రాక్షసస్త్రీలకు, శ్వాసపవన = శ్వాసవాయువుయొక్క. ప్రకోపే = ప్రకోపము (అధిక్యము) సిద్ధే = సిద్ధించుచుండగా - భర్తృమరణముతో రాక్షసస్త్రీలు నిట్టూర్పుట దశరథాస్త్రములతోనే సిద్ధించుచుండగా. శతమఖః = దేవేంద్రుడు. శతకోటిమ్ = వజ్రాయుధమును, న స్పృశతి = తాకుటలేదు — తాకుట మానివేసెను.

తాత్పర్యము :- ముక్కోటి దేవతలకు అవతారరూపమై ప్రత్యక్షదైవముగా అర్చింపబడు సూర్యుని వంశమునందు జన్మించిన దశరథుడు వీరి జనకుడనుట. రాక్షస సంహారము నీతడే చేయుటతో ఇంద్రుడు వజ్రాయుధమును చేపట్టుట మానివేసెను. దశరథుని మహాబలసత్త్వము మహావీరత్వములు సూచింపబడినవి.

సమాసములు :- త్రిభిస్సహితా త్రింశత్-త్రయస్త్రింశత్ (సంఖ్యాయాముత్తరపదే త్రేస్త్రయః). త్రయస్త్రింశత్కోట్యశ్చ తే త్రిదశాశ్చ — తన్మయీ మూర్తిర్యస్య సః—తస్య. సహస్రసంఖ్యాకాః అంశవః యస్య సః — తస్య. జగతామీశః. అసురయువతీనాం శ్వాసపవనః — పవనస్య ప్రకోపః — తస్మిన్.

సంధులు :- మూర్తేః + భగవతః, అంశోః + వంశే. అస్త్రైః + అస్నిగ్ధైః + అసుర - రేఫాదేశవిసర్గ.

క్రియ :— జి జయే అభిభవే చ. పరస్మై. లట్. ప్రథమ.

జయతి - జయతః - జయన్తి

స్పృశ. సంస్పర్శనే. పరస్మై. లట్. ప్రథమ

స్పృశతి — స్పృశతః — స్పృశన్తి

ఇమౌ తస్య విశాంపత్యురాత్మజౌ రామలక్ష్మణౌ ।
యయోర్భరతశత్రుఘ్నౌ అనుజౌ ద్వంద్వచారిణౌ ॥ 3

కలహంసికా:- యథా స్మద్గృహే భర్తృదారికా సీతా ఊర్మిళా చ మాండవీ శ్రుతకీర్తిశ్చ. (విచింత్య హర్షం నిరూపయన్తీ) కథం మహాకులప్రసూతా ఏతేఽపి కుమారకాః. (ముహూర్తమివ స్థిత్వా దీర్ఘోష్ణం చ నిఃశ్వస్య) కుతోఽస్మాకమీదృశం భాగధేయమ్.

---

ఛందస్సు :- శిఖరిణి. రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ.

| య | మ | న | స | భ | లగ |
|---|---|---|---|---|---|
| త్రయస్త్రిం | శత్కోటి | త్రిదశ | మయమూ | ర్తేర్భగ | వతః |

ఇమావితి :- తస్య = ఆ, విశాంపత్యుః = ప్రజానాయకునికి (విశోవైశ్య మనుష్యయోః). ఇమౌ = ఈ ఇరువురును. ఆత్మజౌ = కుమారులైన. రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు. యయోః = ఏ ఇరువురికి. భరత శత్రుఘ్నౌ = భరత శత్రుఘ్నులు. ద్వంద్వచారిణౌ = సహచరులైన. అనుజౌ = సోదరులో ఆ రామలక్ష్మణులు వీరిరువురుననుట, (షష్ఠ్యావ్యక్తిము).

తాత్పర్యము :- ఆ దశరథునికి కుమారులు ఈ రామలక్ష్మణులు. వీరికి భరత శత్రుఘ్నులు క్రమముగా సోదరులు. (రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు) వంశము నామధేయము అను రెండంశములకును సమాధానమైనది.

సంధులు :- పత్యుః + ఆత్మజౌ, యయోః + భరత - రేఫాదేశవిసర్గ సంధి. శత్రుఘ్నౌ + అనుజౌ - అయవాదేశసంధి.

యథేతి ;- అస్మద్గృహే=మనరాజుగారి గృహమునందు. భర్తృదారికా= రాజపుత్రియగు. సీతా = జానకియు (రాజా భట్టారకో దేవః తత్సుతా భర్తృదారికా - అమరము). ఊర్మిళా = ఊర్మిళయు. చ = మరియు. మాండవీ = మాండవియు. శ్రుతకీర్తిః చ = శ్రుతకీర్తియు. యథా = ఎట్లు నల్గురుండిరో అట్లే దశరథ పుత్రులు నల్గురనుట. (విచింత్య = ఆలోచించి. హర్షమ్ = ఆనందమును నిరూపయన్తీ = అభినయించుచు) కథమ్ = ఎట్టూ ; ఏతే = ఈ, కుమారకాః అపి =

(జధా అహ్మ్మఘరే భట్టదారిఅ సీదా ఉమ్మిలా అ మండవీ సుదకిత్తీ అ. కధం మహాకులప్పసూదా ఏదేవి కుమారఅ. కుదో అహ్మాణం ఈరిసో భాఅధేఓ).

కంచుకీ :- భవతి, మా విషీద. సర్వం భవిష్యతి దేవబ్రాహ్మణానుగ్రహాత్.

కలహంసికా :- తదో తదో (తత స్తతః)

కంచుకీ :- తతశ్చ వృద్ధాంతఃపురాణామభ్యర్థనయా తౌ వికర్తనకులకుమారకౌ దృష్ట్వా నివర్తమానః పురోధసా గౌతమేనాహూయ రాజపుత్రీణాం సౌభాగ్యదేవతారాధనాయ సంవిహితోఽస్మి.

---

నవయౌవనులుకూడ. మహాకుల ప్రసూతాః = ఉత్తమవంశ సంజాతులన్నమాట ; (ముహూర్తమ్ ఇవ స్థిత్వా = క్షణమూగి. దీర్ఘముష్ణంచ నిఃశ్వస్య = వేడిగానిట్టూర్చి) అస్మాకమ్ = మాకు, ఈదృశమ్=ఇటువంటి [ఇంతటి]. భాగధేయమ్ = అదృష్టము, కుతః = ఎక్కడిది ; (అ నల్గురివలె ఈ నల్గురును అవివాహితులేనా - అని కాని)

భవతీతి:- భవతి = అమ్మా ; మా విషీద = చింతిల్లకుము ; దేవ = దేవతలయొక్కయు. బ్రాహ్మణ = విప్రులయొక్కయు. అనుగ్రహాత్=అనుగ్రహము వలన, సర్వమ్ = అంతయును, భవిష్యతి = జరుగును.

తతఇతి :- తత స్తతః = అటుపైని -

వృద్ధేతి :- తతః = అంతట, వృద్ధాంతఃపురాణామ్ = అంతఃపురము నందలి వృద్ధకాంతలయొక్క (మహారాజ్ఞి ప్రభృతులు) అభ్యర్థనయా = కోరికతో. తౌ = ఆ, వికర్తనకులకుమారకౌ = సూర్యవంశసంభవులను,దృష్ట్వా = చూచి, నివర్తమానఃఅహమ్ = తిరిగి వచ్చుచున్న నేను, పురోధసా = కులపురోహితుడగు, గౌతమేన = శతానందునిచే, ఆహూయ = పిలువబడి, రాజపుత్రీణామ్ = రాజకుమారికల యొక్క, సౌభాగ్యదేవతారాధనాయ = సౌభాగ్యదేవతారాధనకొఱకు [గౌరీపూజ కనుట] సంవిహితః అస్మి = ఆజ్ఞాపింపబడితిని.

కలహంసికా :- (సహర్షమ్) ఆర్య. సర్వజనమనీషితానుకూలమివ తత్రభవతః శతానందస్య వచనమ్ (అజ్జ. సవ్వజణమణీసిదాణుఊలం పిఅ తత్థభవదో సదాణందస్స వఅణమ్)

కంచుకీ :- వత్సే. ఏవమేతత్. న ఖల్వతథ్యమగంభీరమాంగిరసో(బ్రవీతి.

కలహంసికా :- తత్కిం మన్యధ్వే. శంకరశరాసనారోపణవ్యవసాయేన రాజర్షేర్జనకస్య ప్రతిజ్ఞాసాహసం నిర్వాహయిష్యతి రాఘవః. (తా కిం మణ్ణేధ సంకరసరాసణారోవణ వ్వవసాఏణ రాఏసిణో జణఅస్స పడిణ్ణాహసం ణివ్వాహేస్సది రాహవో)

కంచుకీ :- వత్సే. అస్మానపి తర్కోఽయం తరళీకరోతి. తథాహి—

---

ఆర్యేతి ;- [సహర్షమ్ = ఆనందముతో] తత్రభవతః = గౌరవింపదగిన వాడైన, శతానందస్య=శతానందునియొక్క, వచనమ్=ఆజ్ఞ, సర్వజన = మా అందరియొక్క, మనీషితా = ఆకాంక్షకు, అనుకూలమ్ ఇవ = అనుగుణముగా నున్నది.

ఏవమితి :- వత్సే = అమ్మాయీ ! ఏవమ్ ఏతత్ = అది అంతే ఆంగిరసః = శతానందుడు, అతథ్యమ్ = అసత్యము, అగంభీరమ్ = గంభీరముకానిది (లోతయిన అర్థము లేనిది), న బ్రవీతి ఖలు = పలుకడుగదా !

తదితి :- తత్ = అయినచో, కిమ్ మన్యధ్వే = మీరు ఏమనుకొనుచున్నారు ! శంకర శరాసన + ఆరోపణ = హరధనుస్సును ఎక్కుపెట్టుట యనునట్టి, వ్యవసాయేన = క్రియతో, రాజర్షేః = రాజర్షియగు, జనకస్య = జనకమహారాజుయొక్క ప్రతిజ్ఞాసాహసమ్ = ప్రతిజ్ఞారూపమగు సాహసమును, రాఘవః = రామచంద్రుడు, నిర్వాహయిష్యతి = నిర్వహించునా !

అస్మానితి :. వత్సే = అమ్మాయి ! అస్మాన్ అపి = మమ్ముకూడ, అయమ్ = ఈ, తర్కః = ఆలోచన, తరళీ కరోతి = వ్యాకుల పెట్టుచున్నది. తథాహి = అంతే కదా !

పూర్ణేఽపి కర్మణి హతేష్వపి రాక్షసేషు
విజ్ఞాయ మైథిలసుతామపి వీరశుల్కామ్ ।
బాలం పితుః ప్రియమముం రఘురాజపుత్ర
మేతావతీం భువమృషిః కథమానినాయ॥ 4

కలహంసికా :- (స్మరణమభినీయ. సవిషాదమ్) ఆర్య. ప్రవృత్తి విశేష లంభేన దుర్మనాయమానమాత్మానం పాంచాలికా కేళివ్యాపారేణ వినోదయన్తీం భర్తృదారికాం ప్రేక్ష్య ఉద్విగ్నయా

---

పూర్ణేఇతి :- కర్మణి = యాగము. పూర్ణే అపి = పరిపూర్ణముకాగా, రాక్షసేషు = యాగ విధ్వంసకులగు రాక్షసులు. హతేషు అపి = సంహరింపబడినవారు కాగా, మైథిల సుతామ్ = జానకీదేవిని, వీర్యశుల్కామ్ = శివధనురారోపణరూపమగు బలప్రదర్శనమే శుల్కముగా కలదానినిగా. విజ్ఞాయ అపి = ఎఱింగియు. ఋషిః = విశ్వామిత్రుడు, అముమ్ = ఈ. బాలమ్ = చిన్నవయసువాడును. పితుః = తండ్రి యగు దశరథునికి. ప్రియమ్ = గారాబు బిడ్డయునగు. రఘురాజపుత్రమ్ = రామచంద్రుని. ఏతావతీమ్ = ఇంతదూరముననున్న. భువమ్ = మిథిలా పట్టణమునుగూర్చి. కథమ్ ఆనినాయ = ఎట్లు కొనివచ్చెను । (వసంత తిలక).

తాత్పర్యము :- విశ్వామిత్రునికి యాగము పరిసమాప్తమయినది. రాక్షసులు సంహరింపబడిరి. జానకి వీర్యశుల్క యని ఋషికి తెలియును. అట్టియెడ రామచంద్రుని ఈ మిథిలా పట్టణమున కింత దూరము కొనివచ్చుటేల । తెలిసియు తీసికొని వచ్చెననగా శివధనురారోపణమునకు రాముడు సమర్థుడనియే కదా అనుట.

క్రియ :- ణీఞ్ ప్రాపణే. పరస్మై. లిట్. ప్రథమ (లట్)

నినాయ - నిన్యతుః - నిన్యుః

ఆర్యేతి :- (స్మరణమ్ = గుర్తువచ్చుటను. అభినీయ = నటించి. సవిషాదమ్ = ఖేదముతో) ఆర్యా । ప్రవృత్తి విశేషలంభేన = వార్తా విశేష శ్రవణముతో (వార్తా ప్రవృత్తిర్వృత్తాంతః). దుర్మనాయమానామ్ = నొచ్చుకొనిన. ఆత్మానమ్ = అంతరంగమును (తన్ను). పాంచాలికా కేళి వ్యాపారేణ = బొమ్మలాటతో. వినోదయన్తీమ్ = వినోదపరచుచున్నదగు, భర్తృదారికామ్ = రాకుమారిని. ప్రేక్ష్య = చూచి.

కారణం ప్రతిపత్తుమాగతయా ఆర్యస్య దర్శనేన మయా విస్మృతమేతేన పునస్తే రాక్షస నామగ్రహణేన స్మారితాస్మి. (అజ్జ. పఉత్తివిసేసలంభేణ దుమ్మణాయమాణమత్తాణం పచ్చాలిఅ కేలివావారేణ విణోదఅన్తీం భట్టదారిఅం పేక్ఖిఅ ఉవ్విగ్గాఏ కారణం పరివజ్జిదుం ఆగదాఏ అజ్జస్స దంసణేన మఏ విసుమరిదం ఇమిణా ఉణ దే రక్ఖసనామగ్గహణేన సుమరావిదహ్మి)

కంచుకీ :- (సవిషాదమ్) వత్సే. కీదృశీ సా ప్రవృత్తిః యా తవ భర్తృదారికా మపి దుర్మనాయయతి.

కలహంసికా :- శృణోతు ఆర్యః. యథా కిల సీతాదేవీం ప్రార్థయితుం దశగ్రీవ పురోహిత ఆగత ఇతి. (సుణాదు అజ్జో. జధా కిల సీదాదేవీం పత్థిదుం దసగ్గీవపురోహిదో ఆఅదో త్తి)

---

ఉద్విగ్నయా = ఖిన్నురాలనై. కారణమ్ = హేతువును. ప్రతిపత్తుమ్ = తెలిసి కొనుటకు. ఆగతయా = వచ్చినదాననగు. మయా = నాచేత. ఆర్యస్య = నీ యొక్క. దర్శనేన = దర్శనముతో, విస్మృతమ్ = మరువబడినది — నిన్ను చూచి ఆ విషయమును మరచితిననుట. పునః = మరల. తే = నీ యొక్క మాటలయందున్న. తేన = ఆ. రాక్షసనామగ్రహణేన = రాక్షస పద ప్రసక్తితో. స్మారితా అస్మి = గుర్తు చేయబడిన దాననైతిని.

కీదృశీతి :- [సవిషాదమ్ = ఖేదముతో] వత్సా! యా = ఏది. తవ = నీయొక్క. భర్తృదారికామ్ అపి = రాకుమారినికూడ. దుర్మనాయయతి = నొవ్వజేయుచున్నదో. సా = ఆ. ప్రవృత్తిః = వార్త. కీదృశీ = ఎట్టిది? [వినిపింపుమనుట].

శృణోత్వితి :- ఆర్యః = పూజ్యుడు. శృణోతు = వినుగాక! యథా = ఎట్లనగా. సీతాదేవీమ్ = జానకీదేవిని. ప్రార్థయితుమ్ = రావణునికి భార్యగా అడుగుటకై. దశగ్రీవపురోహితః = రావణపురోహితుడు. ఆగతః ఇతి = వచ్చినాడు అను నట్టి వార్త దుర్మనాయయతి అనుట.

కంచుకీ :- (తత్త్రావజ్ఞాం నాటయన్ సహర్షమ్) కథమేతావదపి కార్యం వత్సా జానకీ జానాతి. యదనేనోదంతేన దుర్మనీభూయతే. నూనమిదానీ మస్యాః కృతావతరణ మంగళాన్యంగకాని యౌవనస్య పంథానమీక్షన్తే.

కలహంసికా :- అర్య. ఏవమేతత్. అర్జకోఽసీతి శిథిలీకృతలజ్జా సంప్రత్యేవ అనుభూతం కిమపి నివేదయామి. (అజ్జ. ఏవం ణ్ణేదమ్. అజ్జ ఓసి త్తి సిఢిలీకిదలజ్జా సంపది జ్జేవ్వ అణుహూదం కింపి ణివేదేమి.) (సంస్కృతమాశ్రిత్య)

---

కథమితి :- [తత్ర = అవిషయముపట్ల. అవజ్ఞామ్ = తిరస్కారమును. నాటయన్ = నటించుచు. సహర్షమ్ = సంతోషముతో], కథమ్ = ఎట్లూ ! అనేన = ఈ. ఉదంతేన = రావణపురోహితాగమనాదికమగు వృత్తాంతముతో. యత్ దుర్మనీభూయతే = నొచ్చుకొనుచున్నదనగా. వత్సా = చిట్టితల్లి. జానకీ = సీత. కార్యమ్ = కర్తవ్యాకర్తవ్యజ్ఞానమును. ఏతావదపి = ఈ మాత్రముగానైనను. జానాతి = గ్రహింపగలిగినదన్నమాట. [ఆశ్చర్యమే !] నూనమ్ = నిజమే [తప్పక]. ఇదానీమ్ = ఇప్పుడు. అస్యాః = సీతాదేవికి. కృతావతరణ మంగళాని = ప్రప్రథమ యౌవనారంభమునందు ఆచారముగా చేయబడు మంగళ క్రియలతో కూడిన. అంగకాని = అవయవములు. యౌవనస్య = జవ్వనమునకు. పంథానమ్ = మార్గమును. ఈక్షన్తే = ఎదురు చూచుచున్నవి – సీతాదేవి శరీరము బాల్యమును విడిచి యౌవన లక్షణములను సంతరించుకొనుటకు అభిముఖముగా నున్నదనుట.

ఏవమితి :- అర్యా ! ఏవమ్ ఏతత్ = అవును. నీవన్నది నిజమే. అర్జకః అసి ఇతి = పితామహుండవుకదా అని. శిథిలీకృతలజ్జా = సిగ్గును సడలించినదాననై, సంప్రతి ఏవ = ఇప్పుడే (నీవు చెప్పించుటకు ముందనుట). అనుభూతమ్ = అనుభవమునకు వచ్చిన, (చూచిన) కిమపి = ఒకానొక విషయమును. నివేదయామి = విన్నవింతును. (సంస్కృతమ్ ఆశ్రిత్య = సంస్కృత భాషను ఆశ్రయించి) (సంస్కృతభాషాచారాః ప్రాయో నాట్యేషు నస్త్రియః శ్లాఘ్యాః క్వచిదపి తపః ప్రభావా ద్విదగ్ధతా బోధనాచ్చ శస్యన్తే॥—భరతుడు. వైదగ్ధ్యము ప్రదర్శించుటకు స్త్రీ పాత్ర అచ్చటచ్చట సంస్కృతము నాశ్రయించుట కలదు).

అనాకూతైరేవ ప్రియసహచరీణాం శిశుతయా
వచోభిః పాంచాలీమిథునమధునా సంగమయితుమ్ ।
ఉపాదత్తే నో వా విరమతి న వా కేవలమియం
కపోలౌ కల్యాణీ పులకముకులైర్దంతురయతి॥ 5

అనాకూతై రితి :- ప్రియసహచరీణామ్ = ఇష్టసఖులయొక్క, శిశుతయా = బాల్యావస్థచే (అది కారణముగా), అనాకూతైః ఏవ = అభిప్రాయ గర్భితములు కానట్టివే అయినను (నర్మగర్భితములు కానివనుట). వచోభిః = ఆ బాలికల మాటలతో, అధునా=ప్రస్తుతము, పాంచాలీ మిథునమ్ = పెండ్లికొడుకు పెండ్లికూతురు బొమ్మలను, సంగమయితుమ్ = కలుపుటకు, న వా ఉపాదత్తే = స్వీకరింపదు, న వా విరమతి = అట్లని విడువదు. కేవలమ్ = కేవలము, ఇయమ్ = ఈ, కల్యాణీ= సర్వాంగశోభనయగు సీతాదేవి, కపోలౌ = తన చెక్కిళులను, పులకముకులైః = పులకల మొగ్గలతో (మొగ్గతొడిగిన పులకలతో), దంతురయతి = నిమ్నోన్నతములు గావించుచున్నది. (శిఖరిణి)

తాత్పర్యము :- ఇష్టసఖులతోకలిసి బొమ్మలపెండ్లి చేసి ఆ యాలు మగలను కలుపుటకు సీత స్వీకరింపదు అట్లని విడిచిపెట్టదు. కపోలములు పులకింపగా అట్ల నిల్చును. (లజ్జాభావధ్వని).

సమాసములు :- న విద్యతే ఆకూతమ్ యత్ర — తైః. పులకాః ముకులానీవ — తైః. పాంచాల్యోః మిథునమ్.

సంధులు :- అనాకూతైః + ఏవ. ముకులైః + దంతురయతి — రేఫాదేశ విసర్గ. నః + వా - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుదాఞ్ దానే. లట్. ఆత్మనే. ప్రథమ (ఉప, ఆఙ్)
దత్తే - దదాతే — దదతే
రముట్ క్రీడాయాం, (వ్యాఙ్పరిభ్యో రమః) పరస్మై. లట్ ప్రథమ (వి)
విరమతి — విరమతః — విరమన్తి.
దంతుర — (తత్కరోతీతి ణిచ్) పరస్మై. లట్. ప్రథమ
దంతురయతి — దంతురయతః — దంతురయన్తి

కంచుకీ :- (సహర్షమ్) దిష్ట్యా చిరస్య జీవద్భిరస్మాభిర్యౌవనవతీ వత్సా జానకీ దృష్టా. (సస్మితమ్) తతస్తతః—

కలహంసికా :- తతశ్చ పునః పునరపి తాభిః ఋజుకాభిర్నిర్బధ్యమానా లజ్జితుమపి లజ్జతే. (తదో అ పుణో పుణో వి తాహిం ఉజ్జుఅహిం ణిబ్బన్ధిజ్జమాణా లజ్జిదుం వి లజ్జేది)

కంచుకీ :- (విహస్య) వత్సే. సంకీర్ణే వయసి ఖల్వియం వర్తతే. అత్ర హి—

మనోఽపి శంకమానాభిర్బాలాభిరుపజీవ్యతే ।
అషడక్షీణషాడ్గుణ్యమంత్రీ మకరకేతనః॥ 6

---

దిష్ట్యేతి :- (సహర్షమ్ = ఆనందముగా) దిష్ట్యా = అదృష్టవశమున, చిరస్య జీవద్భిః = పెద్ద కాలము జీవించుచున్నవారమైన, అస్మాభిః = మాచేత, వత్సా = బిడ్డయగు, జానకీ = సీత, యౌవనవతీ = యువ్వనిగా, దృష్టా = చూడబడినది — ఇంతకాలము బ్రతికియుంటిని కావున సీతను యువతిగా చూడగల్గితిననుట. (సస్మితమ్ = చిఱునవ్వుతో) తతః తతః = అటుపైని—

తతశ్చేతి :- తతః = అంతట, ఋజుకాభిః = అమాయికలయిన, తాభిః = ఆ బాలికలచేత, పునః పునః = మరల మరల, నిర్బధ్యమానా = నిర్బంధింపబడినదై, లజ్జితుమ్ అపి = సిగ్గుపడుటకుకూడ, లజ్జతే = సిగ్గుపడుచున్నది — అంతగా సిగ్గున తలమున్కలైనదనుట.

వత్సేఇతి :- (విహస్య = నవ్వి) వత్సే = అమ్మాయీ! ఇయమ్ = జానకి. సంకీర్ణే వయసి = బాల్య యౌవనముల నడుమ, వర్తతే ఖలు = ఉన్నది కదా! అత్ర హి = ఈ వయస్సునందు —

మనఇతి :- మనః అపి = తమ మనస్సును కూడ, శంకమానాభిః = శంకించువారైన, బాలాభిః = నవయౌవనలచేత, అషడక్షీణ = మూడవ వ్యక్తికి తెలియనీని, (అషడక్షీణో యస్తృతీయాద్యగోచరః — అమరము) షాడ్గుణ్య = రహస్య మంత్రాంగమునకు, మంత్రీ = సచివుడైన, మకరకేతనః = మన్మథుడు, ఉపజీవ్యతే = సేవింపబడుచున్నాడు. (మంత్రాంగమే మంత్రిగా అనికాని) పత్యావర్త్రము.

కలహంసికా :- (సలజ్జమ్) ఆర్య. రమణీయం మంత్రయసే. సర్వస్యాప్య
నుభవ సంవాదినీ తే వాక్. (అజ్జ. రమణీఅం మన్తేసి.
సవ్వస్స వి అణుహవసంవాదినీ దే వాఆ)

కంచుకీ :- కించ వత్సే.

తదాత్వప్రోన్మీలన్మ్రదిమ రమణీయాత్కఠినతాం
నిచిత్య ప్రత్యంగాదివ తరుణభావేన ఘటితౌ ।

---

తాత్పర్యము :- తమ మనస్సునకేని తెలియనీనియంతటి జాగరూకతతో బాలికలు మన్మథ వికారముల ననుభవింతురు.

సమాసములు :- న సన్తి షట్ అక్షిణి యత్ర — అషడక్షీణం చ తత్ షాడ్గుణ్యం చ — షాడ్గుణ్యస్య (షాడ్గుణ్యమేవ వా) మంత్రీ మకరః కేతనే యస్య సః

సంధులు :- మనః + అపి — ఉత్త్వాదేశ విసర్గ — మనో + అపి — పూర్వ రూప శంకమానాభిః + బాలాభిః + ఉపజీవ్యతే - రేఫాదేశవిసర్గసంధి.

క్రియ :- జీవ ప్రాణధారణే, కర్మణి, ఆత్మనే, లట్, ప్రథమ (ఉప)

జీవ్యతే — జీవ్యేతే — జీవ్యన్తే

ఆర్యేతి :- (సలజ్జమ్ = సిగ్గుతో) ఆర్య ! రమణీయమ్ = అందమైన విషయమును (అందముగా), మంత్రయసే = చెప్పుచున్నావు (ఉపదేశించుచున్నావు). తే = నీయొక్క. వాక్ = మాట, సర్వస్యాపి = ప్రతియొక్కనికిని, అనుభవసంవాదినీ= అనుభవానురూపము.

తదాత్వేతి :- వత్సే = అమ్మాయీ ! కించ = మరియు — తదాత్వ = యౌవనోదయకాలమునందు (తత్కాలస్తు తదాత్వం స్యాత్ - అమరము). ప్రోన్మీలత్ = వికసించుచున్న. మ్రదిమ = కోమలత్వముతో. రమణీయాత్ = మనోజ్ఞమైన. ప్రత్యంగాత్ = ప్రతి అవయవమునుండియు. కఠినతామ్ = కాఠిన్యమును. నిచిత్య = కొల్లగొట్టి. తరుణభావేన = యౌవనముచే. ఘటితౌ = సమకూర్పబడినవగు. స్తనౌ = కుచములను, సంబిభ్రాణాః = ధరించువారును - తక్కిన అంగముల నుండి కాఠిన్యమును కొల్లగొట్టి తెచ్చి యౌవనము స్తనములలో నిక్షేపించినదనుట — క్షణ = క్షణ

స్తనౌ సంబిభ్రాణాః క్షణవినయవైయాత్యమసృణ
స్మరోన్మేషాః కేషాముపరి న రసానాం యువతయః॥ 7

కలహంసికా :- (విహస్య) భవతు. తన్న కిమపి యుష్మాభిః శ్రుతమ్.
(భోదు. తాణ కింపి తుమ్హేహిం సుదమ్)

కంచుకీ :- వత్సే. న తావదర్థోఽయమద్యాపి రాజగోచరీభవతి. యది చ స్యాత్ కిమేతావతా.

---

కాలము. వినయ = సిగ్గుతో వినయము. వైయాత్య = క్షణకాలము చపలత్వములతో. మసృణ = మధురమగు. స్మరోన్మేషాః = మన్మథవికారములు కలవారును అయిన. యువతయః = జవ్వనులు. కేషామ్ = ఎవరికి. రసానామ్ ఉపరి న = అన్ని రసములకు పైనుండరు. మధుర భావములన్నింట ఇవి అగ్రగణ్యమనుట (శిఖరిణీవృత్తము).

తాత్పర్యము :- యౌవనారంభముతో సర్వాంగములకును సౌకుమార్యము వచ్చి ఆ కాఠిన్యము కుచములకు చేరును. ఇట్లు చేయునది జవ్వనము. క్షణకాలము సిగ్గు క్షణకాలము చాపల్యములతో మన్మథభావములను కుసుమింపజేయు యువతులు అందరికిని ఆకర్షణ స్థానములు.

సమాసములు :- తదాత్వే ప్రోన్మీలన్ - ప్రోన్మీలంశ్చ సః ప్రమదిమా చ - ప్రమదిమ్నా రమణీయమ్ - తస్మాత్. అంగాదంగాత్ - ప్రత్యంగాత్. వినయం వైయాత్యం చ-క్షణే వినయవైయాత్యే - వినయవైయాత్యాభ్యాం మసృణః- మసృణశ్చాసౌ మధురశ్చ - మధురః స్మరస్యోన్మేషః యాసాం తాః.

సంధులు :- ఉత్ + మీలత్ + ప్రమదిమ. - అనునాసికాదేశ ప్ర + ఉత్. స్మర + ఉన్మేషాః - గుణసంధి. ప్రతి + అంగాత్ - యణాదేశ.

భవత్వితి :- (విహస్య = నవ్వి) భవతు = అగుగాక । తత్ = ఇంతకును, కిమపి = ఏమియును. యుష్మాభిః = మీచేత. నశ్రుతమ్=శ్రుతముకాలేదు. నేనేమియు చెప్పలేదు మీరేదియు వినలేదనుట. రావణుని మంత్రివచ్చుట ఇత్యాదికము రహస్యమని.

వత్సేఇతి :- వత్సే = అమ్మాయీ । అయమ్ = ఈ, అర్థః = విషయము అద్యాపి = ఇప్పటికిని. న రాజగోచరీ భవతి = రాజునకు తెలియదు-తెలియనీయననుట.

కలహంసికా :- తదా హతాశో రావణో దేవీం పరిణయతే. (తదా హదా సో రావణో దేవీం పరిణేది.)

కంచుకీ :- (విహస్య) హస్తే కరిష్యతి జగత్త్రయజిత్వరోఽపి
కస్తాదృశో దుహితరం జనకేశ్వరస్య ।
ప్రాణాధికం విపులబాహుభృతామపీదం
త్రైయంబకం కిమపి కార్ముకమంతరాయః ॥ 8

---

(తెలియదందువా అని కాదుపు కావచ్చు) యది చ స్యాత్ = ఒకవేళ తెలిసినచో, కిమ్ ఏతావతా = ఏమిటింతకును ।

తదేతి :- తదా = అప్పుడు, హతాశః = నింద్యమగు కోరిక కలవాడైన, రావణః = దశగ్రీవుడు, దేవీమ్ = సీతను, పరిణయతే = వివాహమాడును.

హస్తేఇతి :- (విహస్య = నవ్వి). జగత్త్రయజిత్వరః అపి=ముల్లోకములను జయించినవాడే అయినప్పటికిని, తాదృశః = రావణునివంటివాడు, కః = ఎవడు, జనకేశ్వరస్య = జనకమహారాజుయొక్క, దుహితరమ్= పుత్రికను, హస్తేకరిష్యతి= వివాహమాడగలడు ? విపుల బాహుంభృతామ్ అపి=విపుల బాహుబలము కలవారికైనను, ప్రాణాధికమ్ = ప్రాణములమీదికి వచ్చునదైన (స్వశక్తికి మించిన దనుట) ఇదమ్ = ఈ, త్రైయంబకమ్ = ఈశ్వరసంబంధియగు, కార్ముకమ్ = ధనుస్సు, కిమపి = వాక్కులకందని, అంతరాయః = విఘ్నమై ఉన్నది. ఇది యుండగా అది జరుగదనుట (వసంతతిలక).

తాత్పర్యము :- ముల్లోకములను జయించిన మహావీరుడైనను జానకిని చెట్టపట్టలేడు. ఏలయనగా ఎంతటివానికైనను లొంగని శివధనుస్సు అంతరాయముగా నున్నది. పరం ప్రాణిధికో యోధో న తు ప్రాణాధికం ధనుః – అని పెద్దలమాట.

సమాసములు :- హస్తే కరిష్యతి – నిత్యం హస్తే పాణావుపయమనే. జగతాం త్రయః – జగత్త్రయస్య జిత్వరః (సృత్వరిత్వరీ... ర్భ్యశ్చ - అని క్వరప్). ప్రాణాదధికమ్. విపులౌ చ తౌ బాహూ చ – విపులబాహూ బిభ్రతీతి - తేషామ్. త్ర్యంబకస్యేదమ్ - తస్యేదమ్ అని అణ్ రాగాన యాజ్యాఖ్యామిత్యాదిచే ఐజాగమము.

నాపి దశకంధరాసురోధేన స్వయం ప్రతిజ్ఞాతమన్యథా కరిష్యతి మహాక్షత్రియో విదేహరాజః. తన్న కించిదేతత్.

కలహంసికా :- (విహస్య) ఏవం భవతు, ఆర్య, సంప్రతి కుత్ర తౌ రామలక్ష్మణౌ, (ఏవం భోదు, అజ్జ, సంపది కహిం తే రామలక్ఖణా)

కంచుకీ :- నన్వేతావేవ దేవతాగారవేదికాయామ్—

మునీన్ కౌశిక వైదేహ గౌతమానభిరాధ్యతః ।
భాకితౌ జ్ఞానకర్మభ్యాం మోక్షస్వర్గావివ స్వయమ్ ॥ 9

---

నేతి :- అపిచ = మరియు, మహాక్షత్రియః = ఉత్తమ క్షత్రియుడగు, విదేహరాజః = జనకమహారాజు, దశకంధరాసురోధేన = రావణుని నిర్బంధముతో, స్వయమ్ ప్రతిజ్ఞాతమ్= తన ప్రతిజ్ఞను (శివధనుస్సును ఎక్కు-పెట్టినవానికే సీత నిత్తునన్న ప్రతిజ్ఞను) న అన్యథా కరిష్యతి = మార్చలించడు. తత్ = అందుచేత, ఏతత్ న కించిత్ = నీవన్నది ఏ కొంచెమును జరుగదు — అసంభవమనుట.

ఏవమితి :- (విహస్య= నవ్వి) ఏవమ్ భవతు = అట్లే అగుగాక (జరుగకుండుగాక ; అనుట) ఆర్యా ; సంప్రతి = ఇప్పుడు, తౌ = ఆ, రామలక్ష్మణౌ=రామలక్ష్మణులు, కుత్ర = ఎక్కడ ?

నన్వితి :- నను ఏతౌ ఏవ = ఇదిగో, దేవతాగారవేదికాయామ్ = దేవతా గృహముయొక్క (పూజామందిరము) వేదికయందు—

మునీనితి :- జ్ఞానకర్మభ్యామ్ = జ్ఞానయోగము, కర్మయోగములవలన, స్వయమ్ = తమకుతాముగా, భాకితౌ = ప్రాప్తించిన, మోక్షస్వర్గౌ ఇవ = మోక్షము స్వర్గములవలె, రామలక్ష్మణులు, కౌశికవైదేహ గౌతమాన్ = విశ్వామిత్ర జనక మహారాజ శతానందులను అభిరాధ్యతః = ఇదే ఆరాధించుచున్నారు — సేవించుచున్నారనుట.

తాత్పర్యము :- రూపు దాల్చిన మోక్షస్వర్గములవలె రామలక్ష్మణులు విశ్వామిత్రాదులను అర్చించుచున్నారు. (పథ్యావక్త్రము).

తదేహి. మహచ్చిరమాగతానా మస్మాకమ్, కన్యాంతఃపురమేవ గచ్ఛామః.
(ఇతి నిష్క్రాంతౌ)

— విష్కంభకః —

(తతః ప్రవిశతి జనకో విశ్వామిత్రశతానందౌ రామలక్ష్మణౌ చ)

జనకః :- (సహర్షమ్) భగవన్ విశ్వామిత్ర,

లుంపన్నదృష్టజామాతృసంపదాం శుచమద్య నః।
త్వదాగమనజన్మాయమానందః సుదినాయతే ॥ 10

---

సమాసములు :- కౌశికశ్చ వైదేహశ్చ గౌతమశ్చ - తాన్. జ్ఞానం చ కర్మ చ - తాభ్యామ్. మోక్షశ్చ స్వర్గశ్చ.

క్రియ :- రాధో వృద్ధౌ (శ్యన్) పరస్మై, లట్, ప్రథమ. (అభి) రాధ్యతి - రాధ్యతః - రాధ్యన్తి (అభిరభాగే - అని కర్మప్రవచనీయ సంజ్ఞ)

తదిహి :- తత్ = అందుచేత, ఏహి = నడువుము. ఆగతానామ్ = ఇచ్చటికి వచ్చినవారమైన, అస్మాకమ్ = మనకు, మహత్ చిరమ్=చాలా సేపయినది. కన్యాంతః పురమ్ = కన్యాంతఃపురమునే, గచ్ఛామః = పోవుదము - చేరుకొందము. (ఇతి = అని, నిష్క్రాంతౌ = నిష్క్రమించిరి).

—: ఇది విష్కంభము :—

[తతః = అంతట, జనకః = జనకుడు, విశ్వామిత్ర శతానందౌ = కౌశికుడు, శతానందుడు, రామలక్ష్మణౌ = రాముడు, లక్ష్మణుడు. ప్రవిశతి = ప్రవేశించును - క్రియతో ప్రత్యేకాన్వయము].

భగవన్నితి :- [సహర్షమ్ = ఆనందముగా] భగవన్ = మహాత్మా! విశ్వామిత్ర = కౌశికా!

లుంపన్నితి :- అదృష్టజామాతృసంపదామ్ = అల్లుడు అను సంపదను పొందనివారమైన, నః = మా యొక్క. శుచమ్ = దుఃఖమును, అద్య = నేడు, లుంపన్ = తొలగింపుచు, త్వత్ = నీ యొక్క, ఆగమన జన్మా = రాకతో లభిం

అపిచ —

అద్య ప్రదక్షిణశిఖావలయః కృశాను
రశ్నాతి మే జనపదేషు వషట్కృతాని।
త్వత్తేజసి స్ఫురతి శాంతికపౌష్టికేషు
స్వాం చ స్రుచం శిథిలమాంగిరసో బిభర్తి ॥ 11

---

చినదగు, అయమ్ = ఈ. ఆనందః = సంతోషము. సుదినాయతే = ఈ రోజును సుదిన మొనర్చుచున్నది. [పథ్యావక్త్రము]

తాత్పర్యము :— ఇంతవరకును సీతకు తగిన వరుడు (నాకు అల్లుడు) దొరకలేదే అని కుములుచున్న నా బాధను తొలగించుచు నీ రాక నన్ను ఆనందింప జేయుచున్నది. నేడు సుదినము.

సమాసములు :- జామాతా ఏవ సంపత్ - న దృష్టా - అదృష్టా జామాతృసంపత్ యైః — తేషామ్. తవ ఆగమనమ్ - త్వదాగమనాత్ జన్మ యస్య సః.

క్రియ :- సుదిన - [సుదిన దుర్దిన నీహారేభ్యశ్చ - క్యఙ్] ఆత్మనే. లట్. ప్రథమ.

సుదినాయతే — సుదినాయేతే - సుదినాయన్తే.

అద్యేతి :- అపిచ = మరియు - అద్య = నీవు వచ్చిన ఈ శుభదినమునందు. మే = నా యొక్క. జనపదేషు = గ్రామములయందు [ఆశ్రమ ప్రదేశములందు] [దేశజనే జనపదః] కృశానుః = అగ్నిదేవుడు. ప్రదక్షిణ శిఖావలయః = దక్షిణ క్రమముగా తిరుగుచున్న జ్వాలామాలికలు కలవాడై. వషట్కృతాని = హోమము చేసిన ద్రవ్యములను. [అగ్నౌతు హుతం త్రిషు వషట్కృతమ్] అశ్నాతి = భుజించుచున్నాడు. త్వత్ = నీ యొక్క. తేజసి = తేజస్సు. స్ఫురతి = ప్రకాశించుచుండగా. అంగిరసః = శతానందుడు. శాంతికపౌష్టికేషు = శాంతికము పౌష్టికము అనునట్టి హోమ విశేషములయందు. స్వామ్ = తనయొక్క. స్రుచమ్ = స్రుక్కును [స్రువా హోమపాత్ర స్రుచః స్త్రియామ్] శిథిలమ్ = జారిపోయినదిగా - పనిలేని వస్తువుగా. బిభర్తి = వహించుచున్నాడు. [వసంతతిలక]

విశ్వామిత్రః :- సఖే సీరధ్వజ, చిరస్య శాంతః పుష్టశ్చ తవాయం జనపదః,
యత్ర త్వం బ్రహ్మమీమాంసా తత్త్వజ్ఞో దండధారకః ।
పురోధాశ్చైవ యస్యాసావంగిరఃప్రపితామహః ॥ 12

---

తాత్పర్యము :- నీ రాకతో ఆనందించిన అగ్నిదేవుడు మా ఆశ్రమ యాగ శాలలో ప్రదక్షిణ శిఖలతో విజృంభించి హోమముచేసిన ద్రవ్యములను భుజించు చున్నాడు. ప్రకాశించుచున్న నీ తేజస్సుతో శాంతిక పౌష్టికముల ఫలము సిద్ధించి శతానందుడు చేతిలో స్రువమును అలంకారముగా వహించుచున్నాడు. శాంతిని కోరి చేయు హోమమును శాంతికమనియు, పుష్టిని కోరి చేయుదానిని పౌష్టిక మనియు నందురు.

సమాసములు :- శిఖానాం వలయః - ప్రదక్షిణభూతః శిఖావలయః యస్య సః, తవ తేజః - తస్మిన్. శాంతికాశ్చ పౌష్టికాశ్చ - తేషు.

సంధులు :- కృశానుః + అశ్నాతి - రేఫాదేశవిసర్గ. అంగిరసః + బిభర్తి - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుభృఞ్ భరణే (ష్లు), పరస్మై. లట్. ప్రథమ
బిభర్తి — బిభృతః — బిభ్రతి
అశ భోజనే (శ్నా) పరస్మై. లట్ ప్రథమ
అశ్నాతి — అశ్నీతః — అశ్నన్తి.

సఖేఇతి :— సఖే = మిత్రమా ! సీరధ్వజ = జనకమహారాజా ! తవ = నీ యొక్క, అయమ్ = ఈ, జనపదః = (నివాసస్థానము) దేశము, చిరస్య = చాలకాలముగా, శాంతః = శాంతియుక్తము, చ = మరియు పుష్టః=పుష్టియుక్తము- నా ఆగమనము కారణము కాదనుట.

యత్రేతి:- యత్ర = ఏదేశమునందు, బ్రహ్మ మీమాంసా తత్త్వజ్ఞః= [భాట్టమతము] వేదాంతముయొక్క సారము నెరిగిన, త్వమ్ = నీవు, దండధారకః= పరిపాలకుడవో, యస్య=ఏ పరిపాలకునికి, అసౌ=ఈ, అంగిరః ప్రపితామహః ఏవ= అంగిరసుడు ప్రపితామహుడుగా కలిగిన శతానందుడే స్వయముగా, పురోధాః చ = పురోహితుడో [పురోధాస్తు పురోహితః - అమరము] - ఆ దేశమునందును ఆ పరి పాలకునకును శాంతి-పుష్టి అనునవి స్వయంసిద్ధము లనుట.

(స్మితం కృత్వా) జామాతురదర్శనజన్మా శోకః పునరస్మాకముపశమయితుమవశిష్యతే. కిం శోకహర్షౌ నామ లోకయాత్రేయం భవతః. తథాహి—

యజూంషి తైత్తిరీయాణి మూర్తాని వమతి స్మ యః ।
స యోగీ యాజ్ఞవల్క్యస్త్వాం వేదాంతానధ్యజీగపత్ ॥ 13

తాత్పర్యము :- భాట్ట మతసారము నెరిగిన నీవు పరిపాలకుడవుగా, అంగిరసుని మునిమనుమడగు శతానందుడు పురోహితుడుగా విరాజిల్లుచున్న దేశమునందు శాంతియు పుష్టియు స్థిరముగా స్వతస్సిద్ధముగా వర్ధిల్లును. మా రాకతో పనిలేదు.

సమాసములు :- బ్రహ్మమీమాంసాయాః తత్త్వం జానాతీతి. దండస్య ధారకః. అంగిరాః ప్రపితామహః యస్య సః.

సంధులు :- తత్త్వజ్ఞః + దండ - ఉత్త్వాదేశవిసర్గ. పురోధాః + చ - శాదేశవిసర్గ. చ + ఏవ - వృద్ధి సంధి. యస్య + అసౌ - వృద్ధి. అసౌ + అంగిరః - అయవాదేశ సంధి.

జామాతురితి :- (స్మితమ్ కృత్వా = చిన్నగా నవ్వి) పునః = మరింక, జామాతుః = అల్లునియొక్క, అదర్శన జన్మా = అనుపలబ్ధితో పొడమిన, శోకః = శోకము — అల్లుడు తగినవాడు లభించలేదే అనునట్టి దుఃఖము, ఉపశమయితుమ్ = పోగొట్టుటకు, అస్మాకమ్ = మాకు, అవశిష్యతే = పని మిగిలియున్నది — అది ఒక్కటి మాపై తొలగింపవలసియున్నదనుట. భవతః = నీకు, శోకహర్షౌ నామ = శోకము హర్షము అనునది — కిమ్ = ఏమిటి ? ఇయమ్ = ఇదియంతయు. భవతః = నీకు, లోకయాత్రా = వ్యవహార ప్రాప్తము — అంతేకాని బ్రహ్మవేత్తవయిన నీకు నిజమునకు శోకహర్షములుండవు. తథాహి = అంతే కదా ! —

యజూంషీతి :- యః = ఏ మునీశ్వరుడు, తైత్తిరీయాణి = తైత్తిరీయ శాఖకు చెందిన, యజూంషి = యజుర్వేద మంత్రములను, మూర్తాని = రూపవంతములుగా, వమతి స్మ = వెళ్ళగ్రక్కెనో, సః = ఆ. యోగీ = మహాయోగియైన, యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుడు, వేదాంతాన్ = ఉపనిషత్తులను, అధ్యజీగపత్ = నీకు నేర్పెను. (పథ్యావక్త్రము).

లక్ష్మణః - (జనాన్తికమ్) ఆర్య. అయమయం స రాజా వైదేహః. పవిత్ర మపరిమేయాశ్చర్యం యస్యావదానముపాధ్యాయాదనుశ్రూయతే.

---

తాత్పర్యము :- శాకల్యమునికి యాజ్ఞవల్క్యుడు శిష్యుడై యజుర్వేదమును నేర్చుకొనెను. గురుదక్షిణకు నిర్బంధింపగా శాకల్యుడు తాను నేర్పిన యజుర్వేదమునే తిరిగి ఇమ్మని కోరెను అప్పుడు యాజ్ఞవల్క్యుడు యజుర్వేద మంత్రములను వెళ్ళగ్రక్కెను. శాకల్యుడు తిత్తిరి పక్షిరూపమున దానిని భుజించెను. అప్పటి నుండి ఆ శాఖకు తైత్తిరీయ శాఖగా పేరు వచ్చినదనుట. అటు పిమ్మట యాజ్ఞవల్క్యుడు సూర్యు నుపాసించి యజుర్వేదమును నేర్చెనందురు. అట్టి యాజ్ఞవల్క్యుడు జనకునికి వేదము నేర్పెను. కావున వేదాంతియగు జనకునికి సుఖదుఃఖములు లోకయాత్రలో అభినయమనుట.

క్రియ :— టువము ఉద్గిరణే. పరస్మై, లట్, ప్రథమ
వమతి - వమతః - వమన్తి
ఇఙ్ అధ్యయనే. ణిచ్, లుఙ్-చఙ్ (ణౌచ సంశ్చఙోః. గాఙాదేశః) ప్రథమ. పరస్మై.
అధ్యజీగపత్ - అధ్యజీగపిష్టామ్ - అధ్యజీగపిషః

ఆర్యేతి :- (జనాన్తికమ్ = రామునికి ప్రేక్షకులకు మాత్రమే వినిపించునట్లు) ఆర్య ! సః = ఆ ప్రసిద్ధుడగు, రాజా = మహారాజు, వైదేహః = జనకుడు, అయమ్ అయమ్ = ఇతడే ఇతడే । (అన్యోన్యామంత్రణం యత్ స్యాజ్జనాన్తే తజ్జనాంతికమ్). పవిత్రమ్ = పావనమైనదియు. అపరిమేయాశ్చర్యమ్ = అంతులేని ఆశ్చర్యమును గొల్పునదియునైన, యస్య = ఏ రాజుయొక్క, అవదానమ్ = స్వచ్ఛవర్తన (అవదానం వృత్తకర్మ శుద్ధం కర్మ ప్రకీర్తితమ్ - విశ్వః). ఉపాధ్యాయాత్= విశ్వామిత్రునివలన. అనుశ్రూయతే = అప్పుడప్పుడు (నిత్యమును) వినబడినదో - గురుడు చెప్పగా వింటిమో ఆ మహారాజు ఇతడే సుమా అనుట.

వత్సేతి :- (సప్రమోదానురాగమ్ = ఆనందముతో, ప్రేమతో) వత్స = సోదరా। శతపథకథాధికారీ పురుషః = శతపథమను పేరుగల వేదభాగమునకు కథాపురుషుడును(దాని ప్రకాశకుడనుట). వాజసనేయః = యజుర్వేదమునందలి వాజసనేయ

రామః - (సప్రమోదానురాగమ్) వత్స. స ఏవాయం శతపథకథాధికారీ పురుషః ప్రణాయ్యాయాన్తేవాసినే యస్మై వాజసనేయో యాజ్ఞవల్క్యః సూక్తాని యజూంషి ప్రోవాచ.

విశ్వామిత్రః - [ముహూర్తం నిర్వర్ణ్య చ]

నిజాయ తస్మై గురవే యతీనాం జైత్రాయ విశ్రాణితగోసహస్రమ్।
తం గోసహస్రాధిపతేః ప్రశిష్యముపాస్మహే మైథిలమాతిథేయమ్॥14

---

కాధీయుడనగు. యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుడు. ప్రణాయ్యాయ = అభిలాషాశూన్యుడగు.(ముముక్షువనుట). యస్మై = ఏ, అంతేవాసినే = శిష్యునికై [ప్రణాయ్యోఽభిలాషాశూన్యః స్యాత్ - హలాయుధః], యజూంషి = యజుర్వేదమునకు చెందిన, సూక్తాని = మంత్రములను, ప్రోవాచ = ఉపదేశించెనో. సః = ఆ మహానుభావుడు, అయమ్ ఏవ=ఇతడే.

నిజాయేతి :- [ముహూర్తమ్ = క్షణకాలము, నిర్వర్ణ్య చ = చూచి] యతీనామ్ = యోగీశ్వరులకు. జైత్రాయ = విజేతయు - యతి ప్రవరుడనుట, నిజాయ = తన గురవే = గురువునైన. తస్మై = ఆ యాజ్ఞవల్క్యునికై. విశ్రాణితగోసహస్రమ్ = వేయి గోవులనిచ్చినవాడును. గో సహస్రాధిపతేః = సహస్ర కిరణునికి. ప్రశిష్యమ్ = శిష్యుని శిష్యుడు. ఆతిథేయమ్ = అతిథులపట్ల సాధువును - అతిథి సేవా తత్పరుడనుట - అయిన. తమ్ = ప్రసిద్ధుడగు, మైథిలమ్ = జనకమహారాజును, ఉపాస్మహే = సమీపించితిమి - ఉపాసింతుము. [గోశబ్దః పశుభూమ్యంశువాగ్దిగర్థః - శాశ్వతః. స్వర్గేషుపశువాగ్ వజ్రదిఙ్నేత్రఘృణిభూజలే లక్ష్యదృష్ట్యా స్త్రియాం పుంసి - అమరము].

తాత్పర్యము :- యోగీశ్వరుడైన తన గురువునకు వేయి గోవులను బహూకరించినవాడును సహస్ర కిరణునికి ప్రశిష్యుడైన అతిథి పూజా తత్పరుడగు జనక మహారాజును ఉపాసింతుము.

ఛందస్సు :- ఉపజాతి వృత్తము. అనంతరోదీరితలక్ష్మభాజౌ పాదౌ యదీయావుపజాతయస్తాః ఇంద్రవజ్ర ఉపేంద్రవజ్రల కలయికతో ఉపజాతి.

నిజాయ తస్మైగురవేయ తీనాం - ఉపేంద్రవజ్ర
జైత్రాయ విశ్రాణి తగోస హస్రమ్ - ఇంద్రవజ్ర

జనకః :- (సప్రశ్రయమ్) భగవన్, యదన్యత్కించిదభిదధాతి తత్ర ప్రభవిష్ణుర్భవాన్. తత్రభవతః సహస్రమయూఖాంతేవాసినో యోగీశ్వరా దధ్యయన మితి మహీయసీయమస్మాకం యశఃపతాకా.

విశ్వామిత్రః :- (విహస్య) భో మహాయోగిన్.

కిం యాజ్ఞవల్క్యో జనకః కిమేవం న వః స్వరూపం కవయోఽపి విద్యుః ।

ప్రవాహనిత్యానధికృత్య యుష్మాన్ సహస్రశాఖాః శ్రుతయః ప్రథన్తే॥ 15

---

క్రియ :- ఆసజ్ ఉపవేశనే [లుక్]. ఆత్మనే. లట్. ఉత్తమ. [ఉప]
ఉపాసే - ఉపాస్వహే - ఉపాస్మహే

భగవన్నితి :- భగవన్ = మహాత్మా ! అన్యత్ = యాజ్ఞవల్క్య శిష్యుడనుట కంటె అన్యముగా, కించిత్ = మరి కొంచము యత్ అభిదధాతి = ఏదేని చెప్పదపేని, తత్ర = ఆ విషయమునందు, భవాన్ = నీవు, ప్రభవిష్ణుః = సమర్థుడవు- అట్టి స్వేచ్ఛ నీకున్నదనుట. కానీ, తత్రభవతః = పూజ్యుడు, సహస్రమయూఖాం తేవాసినః = సూర్యశిష్యుడునగు, యోగీశ్వరాత్ = యాజ్ఞవల్క్య మహర్షి నుండి, అధ్యయనమ్ ఇతి = వేదాధ్యయనము [చేసితిని] అనునది. ఇయమ్ = ఇది. అస్మాకమ్ = మాకు, మహీయసీ = మహత్తరమైన, యశః పతాకా = కీర్తిపతాక.

కిమితి :- [విహస్య = నవ్వి] భో మహాయోగిన్ = ఓ మహాయోగీ ! యాజ్ఞవల్క్యః = యాజ్ఞవల్క్యుడు, కిమ్ = ఏమి, జనకః = జనకుడు, కిమ్ = ఏమి ఏవమ్ = ఇట్లు [యాజ్ఞవల్క్య తత్త్వము జనకతత్త్వము] వః = మీ ఇరువురియొక్క స్వరూపమ్ = అంతస్తత్త్వమును, కవయః అపి = కవులు [విద్వాంసులు] కూడ, న విద్యుః = ఎఱుగరు — వారును తెలిసికొనలేరనుట. ప్రవాహనిత్యాన్ = గురుశిష్య పరంపరలో చిరస్థాయిగా నిల్చునట్టి, యుష్మాన్ = మిమ్ము. అధికృత్య = అవలంబించి, శ్రుతయః = వేదములు. సహస్రశాఖాః = వేయిశాఖలుగా, ప్రథన్తే = విరాజిల్లుచున్నవి [ప్రసిద్ధి కెక్కుచున్నవి]. ఉపజాతి వృత్తము.

శతానందః :- భగవన్, కౌశిక, ఏవమీదృశాః ఖల్వమీ త్రిభువన మహనీయ మహిమానో మనీషిణః.

జనకః :- (సవైలక్ష్యస్మితమ్)

నిర్మాయ కార్మణమృచా మఘమర్షణీనా
మున్మార్జనీర్జగదఘాని తవాద్య వాచః।
శ్రోతుం చిరప్రణయి కౌతుకమస్తి చేతో
దుఃఖాకరోతి పునరేష మమార్థవాదః ॥ 16

తద్విరమ. (ఇతి శిరస్యంజలిం ఘటయతి).

---

క్రియ :- విదజ్ఞానే. అశీర్లిజ్, పరస్మైపద. ప్రథమ
విద్యాత్ - విద్యాతామ్ - విద్యుః
ప్రథజ్ ప్రఖ్యానే. ఆత్మనే. లట్. ప్రథమ
ప్రథతే - ప్రథేతే - ప్రథన్తే.

భగవన్నితి :- భగవన్ = మహాత్మా ; కౌశిక = విశ్వామిత్రా ; త్రిభువన = ముల్లోకములచేతను. మహనీయ = గౌరవింపబడునట్టి. మహిమానః = ప్రభావము కలవారైన. అమీ = వీరు, మనీషిణః = విద్వాంసులు. ఏవమ్ = ఇట్లు, ఈదృశాః ఖలు = ఇట్టివారేకదా ; మహానుభావుల వినయమిట్టిదే అనుట.

నిర్మాయేతి :- [సవైలక్ష్యస్మితమ్ = సిగ్గుతో చిరునవ్వుతో] - అఘమర్షణీనామ్ = పాపనాశకములైన. ఋచామ్ = ఋక్కులయొక్క. కార్మణమ్ = ఆచరణమువలన నేర్పడిన సంస్కార విశేషమును. నిర్మాయ = సిద్ధముచేసి లేక పొంది. జగత్ + అఘాని = లోకమునందలి పాపములను. ఉన్మార్జనీః = పోగొట్టునవైన. తవ = నీ యొక్క. వాచః = వాక్కులను. అద్య = ఈనాడు, శ్రోతుమ్ = వినుటకు. చిరప్రణయి కౌతుకమ్ = చాలకాలముగా ఉత్కంఠితమై. చేతః = నా మనస్సు. అస్తి = ఉన్నది. పునః = కాని, మమ = నాదైన, ఏషః = ఈ, అర్థవాదః = స్తుతి. దుఃఖాకరోతి = బాధించుచున్నది. [కార్మణం మంత్ర తంత్రాది యోజనే కర్మకేఽపి చ ధరణిః].

విశ్వామిత్రః :- (సస్మితమస్యాంజలిముద్ఘాటయన్) సఖే సీరధ్వజ, సంగ్రహి యతా మంజలిః. అమీ తూష్ణీంభూతాః స్మః. కాత్యాయినీ కాముకకార్ముకారోపణ పణప్రణయప్రవీణేన తు దుహితుః పత్యా సంప్రత్యపర్యుషిత ప్రతిజ్ఞో భూయాః.

లక్ష్మణః :- (అపవార్య) ఆర్య, పరస్పరేషాం పౌరుషోత్కర్ష ప్రశంసా రమణీయః పావనోఽయమమీషాం సమవాయః.

---

తాత్పర్యము :- ఋష్యంత్రాచరణము వలన లోకపాపములను ఉపశమింపజేయు నీ వాక్కులను వినవలెనని చాలకాలముగా ఉవ్విళ్ళూరుచున్నాను. ఈ నాటికి సిద్ధించినదికదా అనుకొనుచున్న నన్ను నీ ఈ స్తుతివాక్యములు కలవర పెట్టుచున్నవి. (వసంత తిలక)

సంధులు :- ఉన్మార్జనీః + జగత్ - రేఫాదేశవిసర్గ. తవ + అద్య. మమ + అర్థవాదః - సవర్ణదీర్ఘ. చేతః + దుఃఖః - ఉత్వాదేశవిసర్గ. ఏషః + మమ - తదేతద్విసర్గలోపసంధి.

తదితి :- తత్ = అందుచేత, విరమ = అర్థవాదములు విరమించుము. (ఇతి = అని, శిరసి = శిరస్సునందు, అంజలిమ్ = నమస్కారమును, ఘటయతి = చేర్చును.)

సఖేఇతి :- (సస్మితమ్ = చిరునవ్వుతో, అస్య = జనకునియొక్క, అంజలిమ్ = నమస్కారమును, ఉద్ఘాటయన్ = విడదీయుచు), సఖే = మిత్రమా ! సీరధ్వజ = జనకా ! అంజలిః=నమస్కారము, సంగ్రహియతామ్=ఉపసంహరింపబడుగాక ! అమీ = ఇదే మేము, తూష్ణీంభూతాః స్మః=మిన్నకుంటిమి-ఇక అట్లుమాట్లాడమనుట. కాత్యాయినీ కాముక = శివునియొక్క, కార్ముక = ధనుస్సును, ఆరోపణ = ఆరోపించుట అనునట్టి, పణ = శుల్కముపట్లగల, ప్రణయ = కోరికయందు, ప్రవీణేన = నేర్పరియైన, దుహితుః పత్యా = అల్లునితో, సంప్రతి = ప్రస్తుతము - త్వరలో, అపర్యుషిత ప్రతిజ్ఞః = నెరవేరిన ప్రతిజ్ఞ కలవాడవు, భూయాః = కమ్ము !

ఆర్యేతి :- (అపవార్య = రామునికి తప్ప తక్కినపాత్రలకు వినిపింపకుండునట్లు - రహస్యం కథ్యతేఽన్యస్య స్మృతం తదపవారితమ్ - భరతుడు)

రామః :- వత్స. యదాత్థ.

స్మరన్తి లోకార్థమమీ కిల శ్రుతీరితి ప్రతిష్ఠామధిగన్తుమీశ్మహే।
పరం యదేషాం పునరస్తి వైభవం తదేత ఏవ వ్యతివిద్రతే యది॥17

---

అర్థాః. పరస్పరేషామ్ = ఒండొరుల యొక్క. పౌరుష + ఉత్కర్ష = పురుషకారాధిక్యముయొక్క. ప్రశంసా = ప్రశస్తితో, రమణీయః = అందమైన, అయమ్ = ఈ, అమీషామ్ = వీరియొక్క. సమవాయః = సమూహము (కలయిక). పావనః = పరమపవిత్రము.

స్మరన్తీతి :- వత్స = అనుజా। యత్ + ఆత్థ = నీవన్నట్లే. (అహస్థః) అమీ = ఈ ఋషీశ్వరులు. లోకార్థమ్ = సమాజశ్రేయస్సుకొఱకు. శ్రుతీః = వేదములను. స్మరన్తికిల = స్మృతిరూపమున రక్షించుచున్నారు సుమా। ఇతి = ఈ ప్రకారమగు. ప్రతిష్ఠామ్ = వీరి ప్రసిద్ధిని. అధిగన్తుమ్ = తెలిసికొనుటకు, ఈశ్మహే = మనము చాలుదుము. పునః = కానీ, ఏషామ్ = వీరియొక్క, యత్ = ఏ, పరమ్ = సర్వోత్కృష్టమగు. వైభవమ్ అస్తి = జ్ఞానమున్నదో. (విదుత్వము) తత్ = దానిని. ఏతే ఏవ = వీరే, యది వ్యతివిద్రతే = పరస్పరము గుర్తింపగలరు - తెలిసికొనగలరు. మనము చాలమనుట.

తాత్పర్యము :- లోకక్షేమమునకై ఈ మహర్షులు వేదమంత్రములను స్మరింతురు. అందువల్ల వీరికి లభించిన కీర్తిప్రతిష్ఠలను మనము తెలిసికొనగలము. కానీ వీరి విద్యావైదుష్యములను వీరిలో వీరు పరస్పరము గుర్తింపగలరే తప్ప మనము గుర్తింపజాలము.

సంధులు :- లోక + అర్థ - సవర్ణదీర్ఘ. శ్రుతీః + ఇతి - రేఫాదేశ విసర్గ. ఏతే + ఏవ - అయవాదేశసంధి. ఏతయ్ + ఏవ - యవలోపసంధి.

క్రియ :- స్మృ చింతాయామాధ్యానే చ. పరస్మై, లట్. ప్రథమ

స్మరతి - స్మరతః - స్మరన్తి

విద జ్ఞానే (కర్తరి కర్మవ్యతీహారే - ఆత్మనే. వేత్తేర్విభాషా -రుట్) లట్. ప్రథమ

వ్యతివిత్తే - వ్యతివిదాతే - వ్యతివిద్రతే

జనకః :- (సహర్షమ్) భగవన్, పరమనుగృహీతోఽస్మి. యతః—

సమస్యా వా సామ్నాం బహిరబహిరంహః పరిమృజా
మృచాం వా సంవాదః కిమపి యజుషాం వా పరిపణః।
త్వదాశీర్వాదోఽయం బహువిషయసాక్షాత్కృతఫలో
వరం మే పత్న్యాయాః ప్రథయతి పురోవర్తినమివ॥ 18

---

భగవన్నితి :- (సహర్షమ్ = ఆనందముతో) భగవన్ = మహాత్మా! పరమ్ = మిక్కిలి. అనుగ్రహీతః = అనుగ్రహింపబడినవాడను, అస్మి = అయితిని యతః = ఎందువల్లననగా—

సమస్యేతి :- బహిః = వెలుపలనున్న. అబహిః = లోపలనున్న. అంహః = పాపములను, పరిమృజామ్ = తొలగించునవైన, సామ్నామ్ = సామవేద మంత్రములయొక్క. సమస్యా వా = సంగ్రహరూపమువలెను, (సమస్యా తు సమాసార్థా — అమరము). ఋచామ్ = ఋగ్వేద మంత్రములయొక్క, సంవాదః వా = సంభాషణమువలెను—సంభాషణ రూపసూత్రములవలెననుట, యజుషామ్ = యజుర్వేదమంత్రములయొక్క, కిమపి = అనిర్వాచ్యమగు పరిపణః వా = మూలధనము వలెను [నీవీ పరిపణో మూలధనమ్]. అయమ్ = ఈ, త్వత్ = నీయొక్క. ఆశీర్వాదః = దీవెన, బహువిషయ = పలుతావులందు. సాక్షాత్కృతఫలః = సాక్షాత్కరింపబడిన ఫలముకలదై —నీ ఆశీర్వాదము ఫలించుననుటకు ఇప్పటికెన్నో నిదర్శనములున్నవనుట — మే = నాయొక్క. పత్న్యాయాః = పుత్రికకు, వరమ్ = భర్తను, పురోవర్తినమ్ ఇవ = ఎట్టయెదుటనే ఉన్నట్లుగా. ప్రథయతి = తెలియజెప్పుచున్నది — సూచించుచున్నది [శిఖరిణీ వృత్తము]. [కథయతి—అని పాఠాంతరము].

తాత్పర్యము :- వేదత్రయమంత్రములవలె నీ ఆశీర్వచనములు అమోఘములు. ఇవి ఫలించి తీరుననుటకు ఎన్నో నిదర్శనము లున్నవి. నీ యీ దీవెన నాకు అల్లుడు ఎట్టయెదుటనే ఉన్నంతగా నమ్మిక కల్గించుచున్నది.

సమాసములు :- బహిశ్చాబహిశ్చ — బహిరబహిశ్చ తదంహశ్చ - అంహః పరిమృజతీతి - తేషామ్. తవ ఆశీర్వాదః. బహువిషయేషు సాక్షాత్కృతం ఫలం యస్య సః.

విశ్వామిత్రః :- (సాకూతస్మితమ్) సఖే సీరధ్వజ, ఏవమేతత్.

దవీయస్యో దూరాదపథమిహ చాముత్ర చ శుచాం
త్రివేదీవాక్యానామనతిచిరభగ్నా ఇవ ఖిలాః ।
శ్రుతిగ్రాహ్యం జ్యోతిః కిమపి బహిరంతర్మలముషో
మృజాయా మజ్జానః క్వ ను విపరియన్తి ద్విజగిరః॥ 19

---

సంధులు :- ఆశీర్వాదః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - ఆశీర్వాదో + అయమ్ - పూర్వరూప. సాఫల్యకృతఫలః + పరమ్ - ఉత్వాదేశవిసర్గసంధి.

క్రియ :- ప్రథ ప్రఖ్యానే [ణిచ్], పరస్మై. లట్. ప్రథమ
ప్రథయతి — ప్రథయతః - ప్రథయన్తి

దవీయస్య ఇతి :- (సాకూతస్మితమ్ = సాభిప్రాయమగు చిఱునవ్వుతో) సఖే = మిత్రమా ! సీరధ్వజ = జనకమహారాజా ! ఏవమేతత్ = నీవన్నది నిజమే - ఇహ చ = ఈ లోకమునందును. అముత్ర చ = పరలోకమునందును. శుచామ్ = దుఃఖములకు. దవీయస్యః = దూరతరముగా నుండునవియు. చ = మరియు. శుచామ్ = సర్వవిధదుఃఖములకును. దూరాత్ = మిక్కిలి. అపథమ్ = అస్థానమును. త్రివేదీవాక్యానామ్ = మూడువేదములలోని వాక్యములకును. అనతిచిర భగ్నాః ఇవ = అప్పుడే అస్పృష్టములైనవానివలె. ఖిలాః = అప్రతిహతములును (తిరుగు లేనివనుట) (ఖిలమప్రహతేఽపి స్యాత్ - మేదినీ). శ్రుతిగ్రాహ్యమ్ = చెవులచేత గ్రహింపదగిన. కిమపి = అనిర్వాచ్యమగు. జ్యోతిః = తేజస్సు అయినవియు. బహిరంతర్మలముషః = బాహ్యాభ్యంతర పాపములను పోగొట్టునవియు. మృజాయాః = శుద్ధికి. మజ్జానః = సారభూతములును (సారో మజ్జా నరి - అమరము), అయిన. ద్విజ గిరః = బ్రాహ్మణవాక్కులు. క్వను = ఎచ్చట. విపరియన్తి = విపరీతములగు చున్నవి ! - ఎచ్చటను నిష్ఫలములగుటలేదని భావము (శిఖరిణి).

తాత్పర్యము :- ఇహలోక పరలోక దుఃఖములకు అస్థానములై దూరముగా నుండునవియు, వేదత్రయమంత్రముల నుండి ప్రత్యగ్రముగా స్వీకరింపబడిన వానివలె తిరుగులేనివియు. చెవులతో గ్రహింపదగిన ఏదో జ్యోతిస్సు వంటివియు పవిత్రీకరణమునకు సారభూతములునైన విప్రవాక్యములు ఎన్నడును ఎచ్చటను నిష్ఫలములు

శతానందః :- (స్వగతమ్) నూనం రామభద్రమేవ జామాతరమభిసంధాయ భగవానయం పునఃపునర్వక్రోక్తిభిః సీరధ్వజం పరిమోహయతే. భవతు. అహమస్య ప్రరోచనార్థమసంవిదాన ఇవ పృచ్ఛామి. (ప్రకాశమ్) భగవన్. కస్యేదం శకుంతరాజకేతోరివ కౌస్తుభ శ్రీవత్సౌ రత్నద్వయమ్

---

కావు. నా ఆశీర్వాదము వెంటనే నెరవేరుననుట (దవీయస్యః=మహిమాన్వితము లను, తదాం దూరాత్ అపఠమ్ అనియు కొందరు అన్వయించిరి. దూరాత్ దవీయస్యః = దూరమునకే దూరముగా — పూర్తిగా అందవని మరికొందరు)

సమాసములు :- త్రయాణాం వేదానాం సమాహారః - త్రివేదీ. త్రివేద్యాః వాక్యాని-తేషామ్. న అతిచిరమ్ - అనతిచిరం భగ్నాః. శ్రుతిభ్యామ్ గ్రాహ్యమ్. బహి రంతర్వ్యాప్తి చ తన్మలం చ - మలం ముష్ణాతీతి. ద్విజానాం గిరః.

సంధులు :- దవీయస్యః + దూరాత్. మృషః + మృజా - ఉత్త్వ దేశవిసర్గ. భగ్నాః + ఇవ, మృజాయాః + ముక్తాః - విసర్గలోప.

క్రియ :- ఇట్ గతౌ. పరస్మై. లట్. ప్రథమ (ఇణో యణితి యణా దేశః) (వివరి)

ఏతి — ఇతః — యన్తి

నూనమితి :- (స్వగతమ్ = తనలో) నూనమ్ = నిశ్చయముగా. రామభద్రమ్ ఏవ = రామచంద్రునే. జామాతరమ్ = అల్లునిగా, అభిసంధాయ = మనసు నందుంచుకొని, అయమ్ = ఈ, భగవాన్ = విశ్వామిత్రుడు, పునః పునః = మరల మరల, వక్రోక్తిభిః = వక్రోక్తులతో, సీరధ్వజమ్ = జనక మహారాజును, పరిమోహయతే = ప్రలోభపెట్టుచున్నాడు — వశీకరించుకొనుచున్నాడు. (ణిచశ్చ అని ఆత్మనేపదము) భవతు = అగుగాక. అహమ్ = నేను, అస్య = దీనికి, ప్రరోచనార్థమ్ = ప్రరోచనగా, అసంవిదానః ఇవ = ఏమియు నెరుగనివానివలె, పృచ్ఛామి = ప్రశ్నింతును. (ప్రకాశముగా). భగవన్ = మహాత్మా! శకుంతరాజకేతోః = గరుడధ్వజుని యొక్క, కౌస్తుభశ్రీవత్సౌ ఇవ = కౌస్తుభము శ్రీవత్సములవలె, ఇదమ్ = ఈ. రత్నద్వయమ్ = రత్నముల జంట. కస్య = ఎవనిది? ఈ కుమారులిద్దరెవరనుట.

విశ్వామిత్రః :- (విహస్య. స్వగతమ్) సాధు వత్స శతానంద, సాధు. యదే తత్కృతం తీర్థం వివక్షితస్య వస్తునః సుఖావతారాయ. (ప్రకాశమ్) వత్స గౌతమ. కకుత్స్థకులసంభవౌ కుమారావేతౌ.

శతానందః :- (సప్రత్యభిజ్ఞమివ)

పుత్రార్థే జగదేకబాంధురకయయోద్దామభ్రమత్కీర్తినా
చాతుర్హోత్రవితీర్ణ విశ్వవసుధాచక్రేణ చక్రే మఖః ।
రాజ్ఞా పంక్తిరథేన యత్ర సకలస్వర్వాసిసర్వాతిథౌ
స స్వేనైవ ఫలప్రదః ఫలమపి స్వేనైవ నారాయణః॥ 20

---

సాధ్వితి :— (విహస్య = నవ్వి స్వగతమ్ = తనలో) వత్స = నాయనా, శతానంద = గౌతమా!, సాధుసాధు = బాగుబాగు, వివక్షితస్య = చెప్పనుద్దేశించిన. వస్తునః = విషయముయొక్క, సుఖావతారాయ = సుఖావతరణమునకై, తీర్థమ్ = రేవు— ప్రారంభించుటకనువైన సందర్భమనుట, ఏతత్ = ఇదే, కృతమ్ = కల్పింపబడినది. (తీర్థం క్షేత్రాధ్వరక్షేత్రోపాయోపాధ్యాయ మంత్రిషు—విశ్వః) (ప్రకాశముగా), వత్స = నాయనా! గౌతమా = శతానందా!, ఏతౌ = ఈయిద్దరును, కకుత్స్థకులసంభవౌ = కాకుత్స్థవంశమునందు పుట్టిన, కుమారౌ = యౌవనులు — రాకుమారులు.

పుత్రార్థేఇతి :. (సప్రత్యభిజ్ఞమ్ ఇవ = ఏదో గుర్తుతెచ్చుకొనుచున్నట్లు) జగత్ = ప్రపంచమునందు. ఏక = అద్వితీయమై, బాంధుర = వేగము కలిగిన. హయ = అశ్వమేధయాగాశ్వము అనునట్టి (యయుకరశ్వోఽశ్వమేధీయః - అమరము) ఉద్దామ = అతిశయముగా, భ్రమత్ = సంచరించునట్టి, కీర్తినా = యశస్సు కలవాడును- యాగాశ్వమువలె నిరాతంకముగా దశదిశలబడిపట్టి వచ్చిన కీర్తి కలవాడన ట, చాతుర్హోత్ర = నలుగురు హోతలకును వితీర్ణ = దారాదత్తముగావింపబడిన. విశ్వవసుధా చక్రేణ = సమస్త భూగోళము కలవాడునైన. రాజ్ఞా = మహారాజగు, పంక్తిరథేన = దశరథునితో, పుత్రార్థే = సంతాన ప్రాప్తి కొఱకు, మఖః = యజ్ఞము. చక్రే = చేయబడినది. సకల = గరుడ గంధర్వాది భేదములతోనున్న. స్వర్వాసి = దేవతలు అందరును. సర్వ = అన్ని విధములుగను అతిథౌ = అతిథులుగా కలిగినదగు. యత్ర = (ఏ) ఆ యాగమునందు సః = ఆ, నారాయణః = విష్ణుమూర్తి, స్వేన ఏవ = స్వయముగా, ఫలప్రదః =

(సకల యాగములకును) ఫలప్రదుడై, స్వేన ఏవ = స్వయముగా, ఫలమ్ అపి = ఫలముకూడ (అఖాత్ = అయ్యెను). యయురశ్వోఽశ్వమేధీయః - అమర.

తాత్పర్యము :- నిరాటంకముగా సంచరించిన అశ్వమేధయాగాశ్వముతో జగత్తున వ్యాపించిన కీర్తికలవాడును, నల్గురు పురోహితులకు సమస్త సామ్రాజ్యమును దానముచేసినవాడును అగు దశరథుడు పుత్రకామేష్టి చేసెను. సకల దేవతలు బ్రహ్మరుద్రేంద్రాదులెల్ల అతిథులై వచ్చిన ఆ యజ్ఞమునందు యాగఫల ప్రదాతయైన శ్రీమన్నారాయణుడే యాగఫలమయ్యెను. (సకల = కళాసహితులు మూర్తిమంతులై, స్వర్వాసి = దేవతలు, సర్వ = అందరును అతిథులైరని మరొక అన్వయము. సర్వ శబ్దము శర్వసూచకమనియు వాసవదత్తలో గౌరవసర్వప్రియా అనుచోట శర్వప్రియా అని అర్థము చెప్పిరనియు కొందరు. సకలస్వర్వాసులును, శర్వ = రుద్రుడును అతిథులైన యాగమని అర్థము) శార్దూల విక్రీడితము.

విశేషములు :- అశ్వమేధమునకు పురోహితులు నల్గురు. నాల్గు వేదములకు నల్గురు ప్రతినిధులని రుచిపతి వ్యాఖ్య. చాతుర్హోత్రమనునది యజ్ఞ విశేషమని శ్రీరామచంద్ర మిశ్రుడు. బ్రహ్మ, హోత, అధ్వర్యుడు, ఉద్గాత అని నల్గురు యజ్ఞ నిర్వాహకు లుందురు. వారికి దశరథుడు తన రాజ్యమును ధారవోసి ప్రత్యామ్నాయ వస్తు ప్రదానముతో తిరిగి స్వీకరించినట్లు రామాయణము (బాల, 14 స. 43–50).

సమాసములు :- జగతి ఏకః — ఏకశ్చాసౌ జాంఘికశ్చాసౌ యయుశ్చ - ఉద్దామా చ సా ప్రథమస్తి చ సా కీర్తిశ్చ - జగదేక జాంఘికయయురేవ ఉద్దామ ప్రథమత్కీర్తిః యస్య — తేన. చత్వారో హోతారస్తేషాం సమాహారః — చతుర్హోతా ఏవ చాతుర్హోత్రమ్ — (స్వార్థేఽణ్) చాతుర్హోత్రాయ వితీర్ణం విశ్వవసుధా చక్రం యేన సః — తేన. సకలాశ్చ. తే స్వర్వాసినశ్చ — సర్వప్రకారేణ అతిథిః — సకలస్వర్వాసినః సర్వాతిథయః యస్మిన్ సః - తస్మిన్.

క్రియ :— డుకృఞ్. కరణే, ఆత్మనే, లిట్, ప్రథమ

చక్రే — చక్రాతే — చక్రిరే

తత్కి-మేతావేవ తౌ దాశరథీ యౌ కిల రామలక్ష్మణౌ తాడకా మథన మంగళోద్ఘాత వితీర్ణ దివ్యాస్త్రమంత్రపారాయణేన భగవతైవ వినీతౌ వైతానికస్య కర్మణశ్ఛిద్రాపిధానదక్షిణయా భగవంత ముపాసాం బభూవతుః.

విశ్వామిత్రః :- (సకౌతుకమ్) అథకిమ్.

(జనకస్తౌ సస్నేహబహుమానం పశ్యతి)

శతానందః :- తదనయోః కతరో రామభద్రః కతరశ్చ లక్ష్మణః ?

విశ్వామిత్రః :- (రామం నిర్దిశ్య) వత్స, ఆంగిరస,

---

తత్కి-మితి :- తాడకా = తాటకయనునట్టి రాక్షసియొక్క-. మథన = వధయనునట్టి. మంగళ = శుభముయొక్క-. ఉద్ఘాత = ఉపక్రమమునందు. వితీర్ణ= ధారవోసిన. దివ్యాస్త్రమంత్ర = దివ్యాస్త్రమంత్రములనునట్టి. పారాయణేన = అభీష్టము కలవాడవగు. (దివ్యాస్త్రమంత్రసారిల్యమునిగాని) భవతాఏవ = నీ చేతనే. వినీతౌ = సుశిక్షితులును (సమ్మానితులును). వైతానికస్య = యజ్ఞసంబంధమగు. కర్మణః = ఏ పనికి. ఛిద్ర = విఘ్నములను, అపిధాన = తొలగించుటయనునట్టి. దక్షిణయా = గురుదక్షిణతో. భగవంతమ్ = నిన్ను. ఉపాసాంబభూవతుః = ఉపాసించిన వారును. దాశరథీ = దశరథుని కుమారులున్నైన. యౌ = ఏ. రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు కలరో. తౌ = వారు. ఏతౌ ఏవ కిమ్ = వీరేనా ?

అథేతి :- (సకౌతుకమ్ = ఉత్సుకతతో) అథకిమ్ = అవును. (జనకః= సీరధ్వజుడు. తౌ=వారిరువురిని. సస్నేహబహుమానమ్=అనురాగముతో గౌరవముతో, పశ్యతి = చూచును).

తదితి :- తత్ = అయినచో, అనయోః = వీరిద్దరిలో. కతరః = ఎవరు, రామభద్రః = రాముడు ? కతరః = ఎవరు[ను], లక్ష్మణః = సౌమిత్రి ?

యేఇతి :- (రామమ్ = రామభద్రుని, నిర్దిశ్య = చూపించుచు) వత్స = నాయనా!, ఆంగిరస = శతానందా ! - దినకరకుల = సూర్యవంశమునందలి, క్షత్ర సంతాన = రాకుమారులనునట్టి, మల్లీమాలా=మల్లెపూలదండకు, అమ్లాన = వాడిపోని

యే చత్వారో దినకరకులక్షత్ర సంతానమల్లీ
మాలామ్లాన స్తబకమధురా జజ్ఞిరే రాజపుత్రాః ।
రామ స్తేషామచరమభవస్తాడకాకాలరాత్రి
ప్రత్యూషోఽయం సుచరితకథాకందలీమూలకందః॥ 21

---

స్తబక = (నడిమి) గుత్తివలె. మధురాః = మనోహరులై. యే = ఏ. చత్వారః = నలుగురు. రాజపుత్రాః = రాకుమారులు. జజ్ఞిరే = జన్మించిరో. తేషామ్ = వారిలో. అచరమభవః = మొట్టమొదటివాడును, తాడకా = తాటక అనునట్టి. కాలరాత్రి = ప్రళయరాత్రికి, ప్రత్యూషః = ప్రొద్దుపొడుపువంటివాడును (ప్రత్యూషోఽహర్ముఖమ్-అమర). సుచరిత కథా = పుణ్యకథ అనునట్టి. కందళీ = వృక్షవిశేషమునకు, మూల కందః = (మొదలిదుంప) అవిర్భావ హేతువునైన. రామః = రాముడు. అయమ్ = ఇతడే. [మందాక్రాంతా వృత్తము].

తాత్పర్యము :- సూర్యవంశమునందలి క్షత్రియ సంతానమనునట్టి మల్లెమాలకు వాడిపోని పూలగుత్తివలె దశరథునికి జన్మించిన నల్గురు సంతానములోను తాడకయను కాళరాత్రికి సూర్యోదయమువంటివాడై పుణ్యకథా వృక్షమునకు ఆవిర్భావ బీజమైన రాముగితడే.

సమాసములు :- దినకరస్య కులమ్ - కులే ప్రభవం క్షత్రసంతానమ్- సంతానమేవ మల్లీమాలా - అమ్లానశ్చాసౌ స్తబకశ్చ - మాలాయా అమ్లాన స్తబకః - స్తబక ఇవ మధురాః. రాజ్ఞః పుత్రాః. చరమే భవః - న చరమ భవః. తాడకా ఏవ కాళరాత్రిః - రాత్రేః ప్రత్యూష ఇవ. సుచరిత కథా ఏవ కందళీ - కందళ్యాః మూలకందః.

సంధులు :- చత్వారః + దినకర - ఉత్వాదేశ విసర్గ. మాలా + అమ్లాన- సవర్ణదీర్ఘ. మధురాః + జజ్ఞిరే - విసర్గలోప. రామః + తేషామ్. భవః + తాడకా - సాదేశ విసర్గ. ప్రత్యూషః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - ప్రత్యూషో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- జనీఙ్ ప్రాదుర్భావే, ఆత్మనే, లిట్. ప్రథమ.

జజ్ఞే - జజ్ఞాతే - జజ్ఞిరే

శతానందః :- (లక్ష్మణం నిర్దిశ్య) అయం చాపరో లక్ష్మణః. దిష్ట్యా భగవ ద్వసిష్ఠప్రసూతం క్షత్రకులమృద్ధ్యతే.

జనకః :- (విహస్య) సాధు భగవన్. అస్మాదృశేషు ప్రజాసు ప్రవిశ్య క్రీడసి.

క్రోధాగ్నౌ పురుహూతహుంకృతి పరాభూతత్రిశంకుత్రపా
సంపాతజ్వలితే జగత్త్రియమయీం త్వయ్యాహుతిం జుహ్వతి ।

---

అలంకారము :- అమ్లాన స్తబకమువలె మనోహరులనుటలో ఉపమ. తాటకాశార్వరి. కథాకందళీ అనుచోట్ల రూపకము. ప్రత్యూషః, మూలకందః అని అధ్యవసానము చేయుటచే రూపకాతిశయోక్తి. సంసృష్టి.

అయమితి :- (లక్ష్మణమ్ = సౌమిత్రిని. నిర్దిశ్య = నిర్దేశించిచూపుచు) అపరః = రెండవ వ్యక్తియగు. అయమ్ చ = ఇతడేమో. లక్ష్మణః = సౌమిత్రి. దిష్ట్యా = భాగ్యవశమున. భగవత్ = మహానుభావుడగు. వసిష్ఠ = వసిష్ఠునిచేత. ప్రసూతమ్ = జాతకర్మాది సంస్కారములు గావింపబడినదై, క్షత్రకులమ్ = రాజవంశము- సూర్యవంశమనుట. ఋద్ధ్యతే = వృద్ధిపొందుచున్నది. (వసిష్ఠ విశ్వామిత్రుల కథ విశ్వామిత్రుని క్షత్రియత్వము).

సాధ్వితి :- (విహస్య = నవ్వి) సాధు = లెస్స భగవన్=మహాత్మా। అస్మాదృశేషు = మావంటివారిగు. ప్రజాసు = సాధారణ మానవులయందు. ప్రవిశ్య= జతగూడి. క్రీడసి = వినోదించుచున్నావు.

క్రోధాగ్నావితి :- పురుహూత = దేవేంద్రునియొక్క. హుంకృతి = హుంకారముతో. పరాభూత = అవమానింపబడి వెనుదిరిగిన. త్రిశంకు = త్రిశంకు మహారాజుయొక్క. త్రపాసంపాత = లజ్జాభారముచే - సిగ్గుతో. జ్వలితే = ప్రజ్వలించినదగు. క్రోధాగ్నౌ = కోపవహ్నిలో. జగత్త్రయమయీమ్ = జగత్త్రియ రూపమగు. ఆహుతిమ్ = హోమద్రవ్యమును - ముల్లోకములను సముధగాననుట. త్వయి = నీవు. జుహ్వతి (వతి) = హోమముచేయుటకై; సంభ్రాంత = భయభ్రాంతుడై. ఉపనతస్య = వచ్చినవాడును, దేవస్య = సృష్టికర్తయునైన. అంబుజభువః = బ్రహ్మయొక్క. నాటిత = ప్రకటమైన. జరా = ముసలితనముతోనైన. వైక్లబ్య =

సంభ్రాంతోపనతస్య నాతితజరావైక్లబ్య శీర్ణాక్షరాః
ప్రత్యూహాయ బభూవురంబుజభువో దేవస్య చాటూక్తయః॥ 22

తమపి నామ భగవంతం యజమానమన్యే గోపాయితారః.

---

అశక్తతచే [వణుకుతో], శీర్ణ = జారిపోవుచున్న. అక్షరాః = వర్ణములు కలిగినవగు. చాటూక్తయః = స్తోత్రవాక్యములు - ప్రియభాషణములు [ఇచ్చకము లనుట]. ప్రత్యూహాయ = విఘ్నముకొఱకు. బభూవుః = అయినవి - విఘ్నము కల్పించిన వనుట [శార్దూలము].

తాత్పర్యము :- దేవేంద్రుని తిరస్కారముతో నేలకు పడిపోవుచున్న త్రిశంకుని సిగ్గువలన ప్రజ్వలించిన తన కోపవహ్నియందు ముల్లోకములను విశ్వామిత్రుడు దహించివేయ సంకల్పింపగా. బ్రహ్మదేవుడు పరుగునవచ్చి బ్రతిమాలుకొనెను. ముసలితనము కారణముగా శిథిలము లగుచున్న అక్షరములతో చతుర్ముఖు డాడిన ఇచ్చకములు నీ ప్రయత్నమునకు విఘ్నకారులైనవి.

సమాసములు :- క్రోధః ఏవ అగ్నిః - తస్మిన్. పురుహూతస్య హుంకృతిః - హుంకృత్యా పరాభూతః - పరాభూతశ్చాసౌ త్రిశంకుశ్చ - త్రిశంకోః త్రపాసంపాతః - సంపాతేన జ్వలితః - తస్మిన్. జగతాం త్రయః - జగత్త్రియస్య వికారః - టిడ్ఢాణఞ్ ఇతి ఙీప్- తామ్ - సంభ్రాంతశ్చాసౌ ఉపనతశ్చ-తస్య. జరయా వైక్లబ్యమ్ - నాటితం చతత్ జరావైక్లబ్యంచ - వైక్లబ్యేన శీర్ణాని - వైక్లబ్యశీర్ణాని అక్షరాణి యాసు తాః. అంబుజే భవతీతి - అంబుజభూః - తస్య.

సంధులు :- క్రోధ + అగ్నౌ, శీర్ణ + అక్షరాః, చాటు + ఉక్తయః - సవర్ణదీర్ఘ. త్వయి + అహూతిమ్ - యణాదేశ. సంభ్రాంత + ఉపనత - గుణసంధి. భువః + దేవస్య - ఉత్వాదేశవిసర్గ.

తమితి :- తమ్ అపి నామ = అంతటివాడై, యజమానమ్ = యాగము చేయుచున్న, భగవంతమ్ = మహాత్మునిగురించి, అన్యే = ఇతరులు. గోపాయితారః = రక్షకులా ; నీకు ఇతరులు సంరక్షకులా అనుట.

శతానందః :- రాజర్షే. ఏవమేతత్. కిం పునర్న దీక్షిష్యమాణాః క్రుధ్యన్తీతి రక్షితారం క్షత్రియముపాదదతే.

జనకః :- (సహర్షం రామలక్ష్మణౌ నిర్వర్ణ్య జనాంతికమ్) భగవన్, శతానంద.

భవతి న తథా భానోః శిష్యే గురౌ రసతో న చ
స్వయమపి మునౌ విశ్వామిత్రే గృహానధితిష్ఠతి।
దశరథసుతావేతౌ దృష్ట్వా యథోచ్ఛ్వసితం మనః
శిథిలయతి మే ప్రత్యగ్జ్యోతిః ప్రబోధసుఖాసికామ్॥ 23

---

రాజర్షేఇతి :- రాజర్షే = ఓ రాజర్షీ। ఏవమ్ ఏతత్ = నీవన్నది నిజమే. కింపునః = కానీ. దీక్షిష్యమాణాః = యాగదీక్షను స్వీకరించువారు. నక్రుధ్యన్తి ఇతి= కోపింపరని. రక్షితారమ్ = రక్షకునిగా. క్షత్రియమ్ = ఒక క్షత్రియుని. ఉపాదదతే= స్వీకరించెను.

భగవన్నితి :- (సహర్షమ్ = సంతోషముతో. రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, నిర్వర్ణ్య = చూచి. జనాంతికమ్ = జనాంతికముగా) భగవన్ = మహాత్మా। శతానంద = గౌతమా।

భవతీతి :- ఏతౌ = ఈ. దశరథసుతౌ = రామలక్ష్మణులను, దృష్ట్వా = చూచి. మే = నా యొక్క, మనః = మనస్సు. ఉచ్ఛ్వసితమ్ = వికసించినదై. ప్రత్యగ్జ్యోతిః ప్రబోధసుఖాసికామ్ - ప్రత్యగ్జ్యోతిః = జ్యోతిస్స్వరూపుడైన పరమాత్మ యొక్క. ప్రబోధ = జ్ఞానమువల్లనైన. సుఖాసికామ్ = సుఖస్థానమును, యథా = ఎట్లు. శిథిలయతి = జారవిడుచుచున్నదో (నిరాదరించుచున్నదో) తథా = అట్లు, భానోః = సూర్యునియొక్క, శిష్యే = శిష్యుడును, గురౌ = గురువునైన యాజ్ఞవల్క్యునిపట్ల, రసతః=అనురాగముతోనేని. న భవతి = కాలేదు. చ = మరియు. మునౌ= ఋషియగు. విశ్వామిత్రే = కౌశికుడు, స్వయమ్ అపి = తనంత తానుగా, గృహాన్ = మన భవనమును, అధితిష్ఠతి సతి = అధిష్ఠించినవాడైనను. న తథా భవతి = అట్లు కాలేదు. (హరిణి).

శతానందః :- రాజర్షే వైదేహ. ఏవమేతత్. మమాపి రాజపుత్రావిమౌ
సాక్షాత్కుర్వతో వత్సే సీతోర్మిలే న హృదయాదవరోహతః.

జనకః :- (విశ్వామిత్రం ప్రతి) భగవన్.

ఇదం వయో మూర్తిరియం మనోజ్ఞా వీరాద్భుతోఽయం
చరితప్రరోహః ।
ఇమౌ కుమారౌ బత పశ్యతో మే కృతార్థమంతర్నటతీవ చేతః॥ 24

---

తాత్పర్యము :- రామలక్ష్మణులనుచూచి నా మనస్సు తత్త్వజ్ఞానోపలబ్ధి నాటి ఆనందమునుగూడ తృణీకరించుచున్నది. (పరమాత్మతత్త్వ దర్శనమువలన కలిగిన ఆనందముకన్న ఎక్కువ ఆనందము కల్గుచున్న దనుట). అనురాగమున్నప్పటికిని గురువులవల్లగాని. విశ్వామిత్రుని ఆగమన సందర్భమునగాని నాకు ఇట్టి ఆనందానుభూతి కలుగనులేదు. నా మనస్సు ఇట్లు ఆత్మతత్త్వానందమును తృణీకరింపనులేదు.

సమాసములు :- దశరథస్య సుతౌ. ప్రత్యగ్జ్యోతిషః ప్రబోధః-ప్రబోధే సుఖాసికా - తమ్.

క్రియ :- శిథిల (ధాతుత్వవివక్ష - ణిచ్) పరస్మై, లట్, ప్రథమ.
శిథిలయతి - శిథిలయతః - శిథిలయన్తి

రాజర్షే ఇతి :- రాజర్షే = రాజర్షీ । వైదేహ = విదేహాధిపా । ఏవమేతత్= నీవన్నది నిజమే. ఇమౌ = ఈ, రాజపుత్రౌ = రామలక్ష్మణులను, సాక్షాత్కుర్వతః = దర్శించుచున్న, మమ అపి = నాకును, హృదయాత్ = అంతరంగమునుండి, వత్సే= బిడ్డలు, సీతోర్మిళే = సీతయు ఊర్మిళయు. న అవరోహతః = వైదొలగుటలేదు - వీరిద్దరిని చూచుచుండగా వారిద్దరే మనసులో మెదలుచున్నారనుట.

ఇదమితి :- (విశ్వామిత్రం ప్రతి = కౌశికు నుద్దేశించి) భగవన్ =మహాత్మా! ఇదమ్=ఈ, వయః=వయస్సు, ఇయమ్ = ఈ, మనోజ్ఞా = అందమైన, మూర్తిః = ఆకారము. వీరాద్భుతః = వీరోచితకృత్యములతో అద్భుతావహమైన. అయమ్=వీరి ఈ చరితప్రరోహః = కథాప్రారంభము. బత = అహో ! ఇమౌ = ఈ, కుమారౌ = రాజకుమారులను, పశ్యతః = చూచుచున్న, మే = నాయొక్క, చేతః = హృదయము,

విశ్వామిత్రః :- (సోత్ప్రాసమ్) సఖే సీరధ్వజ, హృదయమేవామంత్రయస్వ
కిమర్థం కృతార్థమసీతి.

జనకః :- (సఖేదస్మితమ్)

యద్గోత్రస్య ప్రథమపురుష స్తేజసా మీశ్వరోఽయం
యేషాం ధర్మప్రవచనగురుర్బ్రహ్మవాదీ వసిష్ఠః ।
యే వర్తన్తే తవ చ హృదయే సుష్ఠు సంబంధయోగ్యా
స్తే రాజానో మమ పునరసౌ దారుణః శుల్కసేతుః॥ 25

కృతార్థమ్ = కోరిక నెరవేరినదై, అంతః = లోలోపల. నటతి ఇవ = గెంతు చున్నట్లున్నది.

తాత్పర్యము :- రామలక్ష్మణుల రూపము వయస్సు వీరోచితకృత్యములు ఇవి యన్నియు చూచి నా మనస్సు వాంఛితార్థము సిద్ధించినట్లు ఆనందముతో గంతులు వేయుచున్నది. (ఉపజాతివృత్తము)

సంధులు :- వయః + మూర్తిః, పశ్యతః + మే – ఉత్వాదేశవిసర్గ. మూర్తిః + ఇయమ్ – రేఫాదేశవిసర్గ. అద్భుతః + అయమ్ – ఉత్వాదేశవిసర్గ – అద్భుతో + అయమ్ – పూర్వరూప. వీర + అద్భుత, కృత + అర్థ, నటతి + ఇవ – సవర్ణదీర్ఘ.

సఖేఇతి :- (సోత్ప్రాసమ్ = మందస్మితముతో - ఉత్ప్రాసః న మనాక్ స్మితమ్ - అమరము) సఖే = మిత్రమా । సీరధ్వజ = విదేహాధిపా । కిమర్థమ్ = ఎందుకని, కృతార్థమ్ = కృతార్థమవు, అసి=అయితివని, హృదయమ్ ఏవ=నీ హృదయమునే. ఆమంత్రయస్వ = అడుగుము ।

యద్గోత్రేతి :- (సఖేదస్మితమ్ = ఖేదముతోకూడిన చిరునవ్వుతో) యద్గోత్రస్య = ఏవంశమునకు. అయమ్ = ఈ. తేజసామ్ = వెలుగులకు. ఈశ్వరః = అధిపతియైన సూర్యుడు. ప్రథమపురుషః = మూలపురుషుడో, యేషామ్ = ఏ వంశము వారికి, బ్రహ్మవాదీ = బ్రహ్మజ్ఞానియైన. వసిష్ఠః = వసిష్ఠుడు. ధర్మప్రవచనగురుః = ధర్మోపదేశకుడైన గురువో, యే = ఏ మహారాజులు. తవ = నీ యొక్క. హృదయే= మనస్సునందు. వర్తన్తే = ఎల్లప్పుడు మెదలుదురో (నీవు ఎవరిహితమును కోరు

రామలక్ష్మణౌ :- (సవిమర్శమ్) కథమస్మదీయాః కథాః ప్రస్తూయన్తే.

విశ్వామిత్రః :- (సస్మితమ్) రాజర్షే, యది శుల్కసంస్థైవ కేవలమంతరాయ
స్తన్న కించిదేతత్.

---

కొందువో). తే = ఆ. రాజానః = సూర్యవంశపురాజులు. మమ = నాకు. సుష్ఠు = అన్నివిధములుగను. సంబంధయోగ్యాః = వియ్యము కల్పుకొనదగినవారు. పునః = కానీ. అసౌ = ఈ. శుల్కసేతుః = శుల్కమనునట్టి బంధము (హరధనుర్భంగము). దారుణః = భయంకరము.

తాత్పర్యము :- సూర్యుడు మూలపురుషుడుగా వసిష్ఠుడు కులగురువుగా నీవు శ్రేయోఽభిలాషివిగా ఉన్న ఇక్ష్వాకులతో వియ్యము పొందదగినదే. కానీ హర ధనుర్భంగము భయంకరమైన శుల్కముగదా! (మందాక్రాంతా వృత్తము).

సమాసములు :- యేషాం గోత్రమ్ - తస్య. ప్రథమశ్చాసౌ పురుషశ్చ. ధర్మస్య ప్రవచనమ్ - ధర్మప్రవచనే గురుః. సంబంధాయ యోగ్యాః. శుల్కరూపః సేతుః.

సంధులు ;- పురుషః + తేజసామ్. యోగ్యాః + తే - సాదేశవిసర్గ. ఈశ్వరః + అయమ్ = ఉత్వాదేశవిసర్గ - ఈశ్వరో + అయమ్ - పూర్వరూప. గురుః + బ్రహ్మ - రేఫాదేశవిసర్గ. రాజానః + మమ - ఉత్వాదేశవిసర్గ.

కథమితి :- (సవిమర్శమ్ = సాలోచనగా). కథమ్ = ఎట్లూ. అస్మదీయాః = మనవియైన. కథాః = చరిత్రలు ప్రస్తూయన్తే = ప్రస్తావింపబడుచున్నవే!

రాజర్షేఇతి ;- (సస్మితమ్ = చిఱునవ్వుతో) రాజర్షీ! శుల్కసంస్థాఏవ= శుల్కముయొక్క ఉనికియే. కేవలమ్ = ఒకేఒక్క. అంతరాయః యది = అభ్యంతరమైనచో, తదేతత్ = అయ్యది, న కించిత్ = ఏకొంచెమంతరాయమును కానేకాదు— లెక్కలోనిది కాదనుట.

జనకః :- (సఖేదం విమృశన్నపవార్య) భగవన్నాంగిరస.

యద్విదన్నపి విదేహనందినీపాణిపీడనవిధేర్మహార్ఘతామ్।
ఏవమాహ మునిరేష కౌశికస్తేన ముహ్యతి చిరాయ మే మనః॥ 26

---

భగవన్నితి ;- (సఖేదమ్ = దిగులుతో, విమృశన్ = ఆలోచనతో, అపవార్య = శతానందునికి (ప్రేక్షకులకు మాత్రమే విన్పించునట్లు) భగవన్ = మహాత్మా, అంగిరస = గౌతమా ।

యదితి :- విదేహ నందినీ = జానకియొక్క, పాణిపీడన విధేః = పరిణయముయొక్క, మహార్ఘతామ్ = బహుమూల్యతను — దుర్లభత్వమును, విదన్ అపి = ఎరిగియు, (జానకిని చేపట్టవలెనన్నచో చెల్లింపవలసిన శుల్కము ఎంతటిదో గ్రహించియునునట), ఏషః = ఈ, మునిః = ముని, కౌశికః=విశ్వామిత్రుడు, ఏవమ్ = ఇట్లు (అది అంతరాయమేకాదని). యత్ = ఏది, ఆహ = పల్కెనో, తేన = దానిచేత, మే = నాయొక్క, మనః = హృదయము, చిరాయ ముహ్యతి=పెద్దకాలము సమ్మోహమగుచున్నది — నమ్మలేను నమ్మకుండలేను.

తాత్పర్యము :- సీతను వివాహమాడుట కష్టసాధ్యమని తెలిసియు విశ్వామిత్రుడు హరధనుర్భంగమొక అంతరాయమే కాదు బొమ్మనుచున్నాడు. దీనితో నా మనస్సు ఒక నిర్ణయమునకు రాలేక మొద్దుబారిపోవుచున్నది.

సమాసములు :- విదేహానాం నందినీ (విదేహస్య వా), నందిన్యాః పాణి పీడనమ్ (పాణేః పీడనమ్). పాణిపీడనరూపో విధిః — తస్య.

సంధులు :- విదన్ + అపి — అనునాసికద్విత్వసంధి. విధేః + మహా, మునిః + ఏష — రేఫాదేశవిసర్గ. ఏషః + కౌశికః — తదేతద్విసర్గలోప. కౌశికః + తేన— సాదేశ విసర్గ.

క్రియ :- బ్రూఞ్ వ్యక్తాయాం వాచి(బ్రువః పంచానామాదిత ఆహో బ్రువః) లట్, పరస్మై, ప్రథమ.

ఆహ - ఆహతుః - ఆహుః

ముహ వైచిత్యే (శ్యన్), పరస్మై. లట్. ప్రథమ.

ముహ్యతి - ముహ్యతః - ముహ్యన్తి

తదేవ స్థాణవీయం వా ధనుః స్యాదిదమీదృశమ్।
ఏతదారోపణం నామ పణో వా మమ జర్జరః॥ 27

శతానందః :- శాంతం శాంతమ్.

దుర్లంఘ్యమీశ్వరశరాసనమప్రమోచ్య
శుల్కగ్రహస్త్వమసి సర్వమిదం తథైవ।
కింత్వస్య రాఘవశిశోః సహజానుభావ
గంభీరభీషణ మతిస్ఫుటమేవ వృత్తమ్॥ 28

---

ఛందస్సు :- రథోద్ధతము. రాన్నరావిహ రథోద్ధతా లగౌ. (రనరలగ)

| ర | న | ర | లగ |
|---|---|---|---|
| U I U | I I I | U I U | I U |
| యద్వివ | న్నపివి | దేహనం | దినీ |

తదితి :- తదేవ = వంశపరంపరగా ప్రసిద్ధమైన, ఇదమ్ = ఈ, స్థాణవీయమ్ = పరమేశ్వరునిదగు, ధనుః = విల్లు, ఈదృశమ్ = (శుల్కమునకు అనుకూలముగా విశ్వామిత్రుని మాట వలన ఎక్కుపెట్టబడి) అంతరాయముకానిదిగా, స్యాత్ వా = అగునో. ఏతదారోపణం నామ = దీని నెక్కుపెట్టుటయనునట్టి, మమ = నా కల్పించిన, పణః = శుల్కము, జర్జరః=శిథిలీకరింపబడినదిగా (ఉపసంహరింపబడి). స్యాత్ వా = అగునో; విశ్వామిత్రుని మహిమవలన ఈ రెండింటిలో నేదేని జరుగ వచ్చును. (పథ్యావక్త్రము).

దుర్లంఘ్యమితి :- శాంతమ్ శాంతమ్ = శాంతము శాంతము - పణో వా మమ జర్జరః అనుట నీ వంటి సత్యవాదికి తగదనుట. ఈశ్వర శరాసనమ్ = శివ ధనుస్సు, దుర్లంఘ్యమ్ = దురారోపము - తేలికగా ఆరోపింపగానిది, త్వమ్ = నీవు, అప్రమోచ్య = విడువరాని, శుల్కగ్రహః = శుల్క నియమము కలవాడవు. అపి = అయితివి - నీ నియమము నీవు విడువరాదు. ఇదమ్ సర్వమ్ = ఇదియంతయు, తథా ఏవ = మార్పులేనిదే. కింతు = కాని, అస్య = ఈ, రాఘవ శిశోః = రామభద్రుని యొక్క, వృత్తమ్ = వ్యవహారము, సహజ = సహజమైన, అనుభావ = ప్రభావాతిశయముతో [చిహ్నములతో అనిగాని], గంభీర భీషణమ్ = గంభీరమై భీషణమునై, అతిస్ఫుటమ్ ఏవ = విస్పష్టమే, [వసంతతిలక].

జనకః :- (మునింప్రతి) భగవన్, కౌశిక, చిరమపి వికల్పయన్న భవద్గిరా మభిధేయమద్యాపి నిశ్చినోమి.

విశ్వామిత్రః :- (విహస్య) తదుపదర్శయ కార్ముకమైందుశేఖరం రామభద్ర ఏవ వ్యాకరోతు.

---

తాత్పర్యము :- శివధనుస్సు దురారోపము. నీవు కల్పించిన శుల్కనియమము ఉపసంహరింపరానిది. కానీ ఈ రాముని ప్రభావము అతిగంభీరము దుర్జేయము, తాటకాది సంహారమున అతిభీషణము. ఇది స్పష్టమైన విషయము. కావున శివధనురారోపణము ఇతనికి సాధ్యము కావచ్చుననుట.

సమాసములు :- ఈశ్వరస్య శరాసనమ్ [శరాణామాసనమ్] న ప్రమోచ్యః అప్రమోచ్యః. శుల్కస్య గ్రహః. అప్రమోచ్యః శుల్కగ్రహః యస్య సః. రాఘవస్య శిశుః - తస్య. సహజశ్చ అసావనుభావశ్చ - గంభీరం చ. తత్ భీషణం చ సహజానుభావేన గంభీర భీషణమ్.

సంధులు :- గ్రహః + త్వమ్ - సాదేశవిసర్గ. తథా + ఏవ - వృద్ధిసంధి కింతు + అస్య - యణాదేశ. సహజ + అనుభావ - సవర్ణదీర్ఘ.

క్రియ :- అస భువి. పరస్మైపద. లట్. మధ్యమ.

అసి - స్థః - స్థ.

భగవన్నితి :- (మునింప్రతి = విశ్వామిత్రు నుద్దేశించి) భగవన్ = మహాత్మా ! కౌశిక = విశ్వామిత్రా ! చిరమ్ = చాలసేపు. వికల్పయన్ అపి = తర్జనభర్జనలుపడినవాడనయ్యు. భవత్ = నీయొక్క, గిరామ్ = వాక్కులకు. అభిధేయమ్ = ఉద్దిష్టార్థమేమో. అద్యఅపి = ఇప్పటికిని, న నిశ్చినోమి = నిశ్చయింపలేకున్నాను.

తదితి :- (విహస్య = నవ్వి) తత్ = అయినచో, ఐందుశేఖరమ్ = ఈశ్వరునియొక్క, కార్ముకమ్ = ధనుస్సును, ఉపదర్శయ = చూపుము, రామభద్రః ఏవ = రామచంద్రుడే, వ్యాకరోతు = విశదీకరించును. (నా వాక్యమునకు అర్థమును అతడు ప్రదర్శించుననుట.)

రామః :- (సహర్షమ్, స్వగతమ్) కథమళీకవికల్పైరాత్మానం ప్రమోహయామి. నన్వయం మమైవ కౌతుకం పూరయితుమైశ్వరం ధనురభ్యర్థయతే భగవాన్. (జనకం చ దృష్ట్వా సవిమర్శమ్) అహహ !

బాలేన సంభావ్యమిదం చ కర్మ బ్రవీతి చ ప్రత్యయితో మహర్షిః।
ఇతి ధ్రువం మంత్రయతే నృపోఽయం దత్తే కిమత్రోత్తర
మాకులోఽస్మి॥ 29

---

కథమితి :- (సహర్షమ్ = సంతోషముతో. స్వగతమ్ = తనలో) అళీకవికల్పైః = కల్పించుకొన్న వితర్కములతో. ఆత్మానమ్ = నన్ను నేను. ప్రమోహయామి = మోహపెట్టుకొనుచున్నాను, అయమ్ = ఈ. భగవాన్ = మహాత్ముడు కౌశికుడు, మమ = నాయొక్క, కౌతుకమ్ = ఉత్సుకతను (కోరికను). పూరయితుమ్ ఏవ = తీర్చుటకే ఐశ్వరమ్ ధనుః = శివధనుస్సును. అభ్యర్థయతే = అభ్యర్థించుచున్నాడు. (జనకమ్ = జనకమహారాజును. దృష్ట్వా = చూచి సవిమర్శమ్ = సాలోచనగా) అహహ !

బాలేనేతి :- ప్రత్యయితః = ఆప్తుడైన (ఆప్తః ప్రత్యయితస్త్రిషు - అమరము) మహర్షిః = విశ్వామిత్రుడు, ఇదమ్ = ఈ, కర్మ = శివధనురారోపణమను పని, బాలేన = బాలునిచేత, సంభావ్యమ్ = సాధ్యమని, బ్రవీతి ఇతి = చెప్పుచున్నాడుగదా అని, అయమ్ = ఈ, నృపః = జనకమహారాజు, ధ్రువమ్ = నిశ్చయముగా, మంత్రయతే = ఆలోచించుచున్నాడు - ఈ బాలునికిది సాధ్యమా అని సంశయించుకొనుచున్నాడనుట, అత్ర = ఈ విషయమున, కిమ్ ఉత్తరమ్ = ఏమి సమాధానమును, దత్తే ఇతి=ఇచ్చునోఅని, ఆకులః అస్మి=కలతపడుచున్నాను. (ఈ బాలునికిది సాధ్యముకాదు లెమ్మని మునివాక్యములను త్రోసిపుచ్చునేమో అని రాముని కలత) ఉపజాతివృత్తము.

తాత్పర్యము :- శివధనురారోపము ఈ బాలునికి సాధ్యమని విశ్వామిత్రుడు నమ్మకముగా పల్కిన మాటను జనకుడు ఆలోచనలో పడెను. ఏమి సమాధానము చెప్పునో కదా !

జనకః :- (ముహూర్తమివ స్థిత్వా దీర్ఘముష్ణం చ నిఃశ్వస్య) భగవన్, క్వ తాదృశం భాగధేయమస్మాకం యేన భగవతా విశ్వామిత్రేణ నాథవన్తో వయం మైథిలీమేతస్మై రఘుకుల కుమారాయ ప్రతిపాద్య చిరాయ కృతార్థీభవామః. (రామో లజ్జతే) కించ భగవన్ —

యేషాం చాపసమర్పిత త్రిభువనచ్ఛిద్రాపిధానం వ్రతం
జాతం రోహితమేవ కేవలముపజ్యాబంధమైంద్రం ధనుః ।

---

సంధులు :- ప్రత్యయితః + మహర్షిః - ఉత్వాదేశవిసర్గ. నృపః + అయమ్. అకులః + అస్మి - ఉత్వాదేశవిసర్గ - నృపో + అయమ్. అకులో + అస్మి - పూర్వరూప. మహా + ఋషిః - గుణసంధి.

క్రియ :- బ్రూఞ్ వ్యక్తాయాం వాచి. పరస్మై. లట్, ప్రథమ.

బ్రవీతి - బ్రూతః - బ్రువన్తి

మన్త్రి గుప్తభాషణే, ఆత్మనే, లట్. ప్రథమ (ణిచ్)

మంత్రయతే - మంత్రయేతే - మంత్రయన్తే

అస భువి, పరస్మై. లట్. ఉత్తమ

అస్మి - స్వః - స్మః

భగవన్నితి:- (ముహూర్తమివ స్థిత్వా = క్షణకాలమాగి. దీర్ఘమ్ ఉష్ణమ్ చ నిఃశ్వస్య = పెద్దగా వేడిగా నిట్టూర్చి) భగవన్ = మహాత్మా ! కౌశికర్షీ ! తాదృశమ్= అటువంటి. భాగధేయమ్=అదృష్టము. అస్మాకమ్=మాకు, క్వ=ఎక్కడిది ! — మాకు అంత అదృష్టమా అనుట. యేన = ఏ. భగవతా = మహానుభావుడగు, విశ్వామిత్రేణ= కౌశికునితో, నాథవంతః = సనాథులమై, వయమ్ = మేము. మైథిలీమ్ = సీతను, ఏతస్మై = ఈ, రఘుకులకుమారాయ=రామునికై, ప్రతిపాద్య=పెండ్లికి నిశ్చయించి, చిరాయ = ఇంతకాలమునకు. కృతార్థీభవామః = చరితార్థుల మయ్యెదము — అంతటి అదృష్టము సంభవమా అనుట. (రామః = రాముడు, లజ్జతే = సిగ్గుపడును) భగవన్= మహాత్మా ! కించ = మరియు.

యేషామితి :— చాప = స్వీయధనుస్సులయందు. సమర్పిత = కర్తవ్యముగా అర్పింపబడిన, త్రిభువనచ్ఛిద్రాపిధానమ్ - త్రిభువన = ముల్లోకములయొక్క.

తేఽపి ప్రేక్ష్య పురా శరాసనమిదం మౌర్వీకిణశ్యామికా
కస్తూరీసురభీకృతానబిభరుర్వ్యర్థం భుజాన్ భూభుజః॥ 30

ఛిద్ర = ఆపదలను. అపిధానమ్ = తొలగించుట యనునది. యేషామ్ = ఏ మహా రాజులకు. వ్రతమ్ = వ్రతమో, ముల్లోకములను రక్షించుట ఏ మహావీరుల ధనుస్సులకు (సమర్పింపబడిన) వ్రతమో అనుట. ఐంద్రమ్ = ఇంద్రునియొక్క. ధనుః = ధనుస్సు, అపజ్యాబంధమ్ = నారి వదిలింపబడినదై. కేవలమ్ = కేవలము[ఎల్లప్పుడు] రోహితమ్ ఏవ = నిలువుగా నున్నదిగనే [తదేవ ఋజు రోహితమ్—అమరము]. జాతమ్ = అయ్యెనో [మహావీరులు స్వర్లోకమును గూడ సంరక్షించుటతో ఇంద్ర ధనుస్సునకు పనిలేకపోయినదనుట]. తే = ఆ. భూభుజః అపి = మహారాజులుకూడ. ఇదమ్ = ఈ. శరాసనమ్ = ధనుస్సును, పురా = పూర్వము. ప్రేక్ష్య = చూచి. మౌర్వీ = తమ వింటి నారిచే నేర్పడిన. కిణ = కాయలయొక్క, శ్యామికా = నల్లదన మనునట్టి. కస్తూరీ = మృగమదముచేత. సురభీకృతాన్ = సుగంధిలములుగావింపబడిన. భుజాన్=బాహువులను. వ్యర్థమ్=వ్యర్థముగా [పనికిమాలినవిగా] అబిభరుః =ధరించిరి. ఇంతదనుక ఏ మహావీరుడును ఈ ధనుస్సును ఎత్తలేకపోయెననుట. [శార్దూలము]

తాత్పర్యము :- త్రిలోక రక్షణ బాధ్యతను వ్రతముగా తమ ధనుస్సుల యందు ఆరోపించుకొని దేవేంద్రుని ధనుస్సునకు [నిత్యసరళముగా] విశ్రాంతి నొసగిన మహావీరులు కూడ ఈ శివధనుస్సును ఎక్కుపెట్టలేక వింటి ఒరిపిడిచే కాయలు కాసిన తమ భుజములను వ్యర్థములుగా ధరించుచుండిరి.

సమాసములు :- చాపే సమర్పితమ్. త్రిభువనానాం ఛిద్రాః - ఛిద్రాణామ్ అపిధానమ్ - చాపసమర్పితం చ తత్ త్రిభువనచ్ఛిద్రాపిధానమ్. అపగతం జ్యాబంధం యస్య తత్. మౌర్వ్యాః కిణః - కిణానాం శ్యామికా - శ్యామికైవ కస్తూరీ - కస్తూర్యా సురభీకృతాః - తాన్. భువం భుంజన్తీతి - భూభుజః.

సంధులు :- త్రిభువన + ఛిద్ర - తుగాగమసంధి. ఛిద్ర + అపిధానమ్. శర + అసన = సవర్ణదీర్ఘ. తే + అపి - పూర్వరూప. అబిభరుః + వ్యర్థమ్ - రేఫాదేశవిసర్గ.

క్రియ :- డుభృఞ్ ధారణపోషణయోః (హ్లు) పరస్మై. లఙ్, ప్రథమ. (భృఞామిత్)

అబిభః — అబిభృతామ్ - అబిభరుః

విశ్వామిత్రః :- (విహస్య) సఖే, సీరధ్వజ. కథం మహాపుణ్యరాశిమాత్మాన మవమన్యసే.

త్వద్భాగధేయమపి తాదృశముత్సవానా
మేతాదృశాం వయమపి ప్రసమీక్షితారః।
సంత్యేవ విశ్వభువనాభయదానశౌండాః
క్షోణీభుజః పరమమీ తు న రామభద్రః॥ 31

---

సఖేఇతి :- (విహస్య = నవ్వి) సఖే = మిత్రమా। సీరధ్వజ = జనక మహారాజా। మహాపుణ్యరాశిమ్ = గొప్పపుణ్యములరాశివై, ఆత్మానమ్=నిన్నునీవు, కథమ్ అవమన్యసే = ఏల కించపరచుకొందువు॥

త్వదితి :- త్వత్ = నీయొక్క, భాగధేయమ్ అపి = అదృష్టముకూడ, (భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః - అమరము) తాదృశమ్ = అటువంటిది - నీ అదృష్టము మంచిదే అనుట. ఏతాదృశామ్ = ఇటువంటి, ఉత్సవానామ్=కల్యాణ మహోత్సవములకు, వయమ్ అపి = మేము, ప్రసమీక్షితారః = ద్రష్టలము - నిర్వహించు ప్రేక్షకులమనుట. విశ్వభువన = సమస్త ప్రపంచమునకును, అభయ = అభయమును, దాన = ఇచ్చుటయందు, శౌండాః = నిపుణులగు, (శౌండస్తు కుశలే మత్తే-ధరణిః) క్షోణీభుజః = మహారాజులు, సంతి ఏవ = చాలమంది ఉన్నారు. పరమ్ = కానీ, అమీ తు = వీరెవ్వరును, న రామభద్రః = రాముడు కారు.

తాత్పర్యము :- నిన్ను నీవు కించపరచుకొనవలసిన పనిలేదు. నీ అదృష్టము మంచిదే. కళ్యాణమహోత్సవముల నిట్టివానిని [సమీక్షించుటకు] నిర్వహించుటకు మేముంటిమి. ముల్లోకములను రక్షింపగల మహారాజులు చాలమంది ఉన్నారు, కానీ వారిలో ఏ ఒక్కడును రాముడు కాడుసుమా। [వసంత తిలక]

సమాసములు :- తవ భాగధేయమ్. విశ్వంచ తత్ భువనంచ - విశ్వ భువనస్య అభయమ్ - అభయస్య దానమ్ - దానే శౌండాః. క్షోణీం భుంజ న్తీతి.

క్రియ :- అసభువి, పరస్మై, లట్, ప్రథమ

అస్తి - స్తః - సన్తి

లక్ష్మణః :- (స్వగతమ్) కథముపాధ్యాయేనైతదభిహితం యదస్మి వక్తు కామః.

జనకః :- భగవన్, సత్యమచింత్యో మణిమంత్రౌషధీనామపి రఘుకుల కుటుంబికానామనుభావః. పరమేతద్బ్రవీమి.

గిరీశేనారాద్ధస్త్రిజగదపవిత్రం దివిషదా
ముపాదాయ జ్యోతిః సరసిరుహజన్మా యదసృజత్।
హృషీకేశో యస్మిన్నిషురజని మౌర్వీ ఫణిపతిః
పురస్త్రిస్రో లక్ష్యం ధనురితి కిమప్యద్భుతమిదమ్॥ 32

---

కథమితి :- (స్వగతమ్ = తనలో) కథమ్ = ఎట్టూ! యత్ = ఏది. వక్తుకామః అస్మి = చెప్పబోయితినో, ఏతత్ = అది [ఆ రాజులలో నెవరును రాముడు కాదనుట]. ఉపాధ్యాయేన = గురువుగారిచేత, అభిహితమ్ = స్పష్టముగా చెప్పబడినది.

భగవన్నితి :- భగవన్ = మహాత్మా! సత్యమ్ = నీ వన్నమాట. నిజమే, మణిమంత్రౌషధీనామ్ = మణి [అల్పపరిమాణము]. మంత్ర = మంత్రము [అల్పాక్షరము] ఓషధీనామ్ = [సాధారణాల్ప రూపము] ఓషధుల యొక్కయు, రఘుకుల కుటుంబికానామ్=రఘువంశమునందు జన్మించినవారి యొక్కయు. ప్రభావః= శక్తి, అచింత్యః = ఊహలకు అందనిది. పరమ్ = కాని, ఏతత్ = ఈ ఒక్క మాటను, బ్రవీమి = చెప్పుచున్నాను.

గిరీశేనేతి :- గిరీశేన = పరమేశ్వరునిచేత, ఆరాద్ధః = ఆరాధింపబడిన వాడై, సరసిరుహజన్మా = కమలసంభవుడు, దివిషదామ్ = సకల దేవతలయొక్క. జ్యోతిః = తేజస్సును, ఉపాదాయ = స్వీకరించి, త్రిజగత్ = ముల్లోకములకు. అపవిత్రమ్ = ధ్వంసకమైన, యత్ = ఏ ధనుస్సును, అసృజత్ = సృష్టించెనో, యస్మిన్ = ఏ శరాసనమున, హృషీకేశః = నారాయణుడు, ఇషుః = బాణము, అజని = అయ్యెనో, ఫణిపతిః = ఆదిశేషుడు, మౌర్వీ = నారిగా, అజని=అయ్యెనో త్రిస్రః = మూడయిన, పురః = పురములు - త్రిపురాసురుడనుట, లక్ష్యమ్ =

శతానందః :- అః కిమనయా పునఃపునః పినాకప్రశస్తిపంక్తికయా. తదేతత్కౌశికమేవ ప్రమాణయన్తో బహుమన్యామహే. అపి చ కిమశక్యం రామభద్రస్య.

---

ఒకేటర్క్ లక్ష్యము అజని = అయ్యెనో. ఇదమ్ = అటువంటి ఇయ్యది, ధనుః ఇతి = ధనుస్సు అని. కిమపి = ఏదో. అద్భుతమ్ = అద్భుతవస్తువు. [శిఖరిణీ వృత్తము].

తాత్పర్యము :- పరమేశ్వరునిచే ఆరాధింపబడిన బ్రహ్మదేవుడు సకల దేవతల తేజస్సును స్వీకరించి ఈ ధనుస్సును స్వయముగా సృష్టించెను. త్రిపురదాహము నాడు ఆదిశేషుడు నారియై నారాయణుడు బాణమై దీనినలంకరించిరి. నిజమునకిది ధనుస్సుకాదు ఒకానొక అద్భుతము

సమాసములు :— గిరిణా ఈశః-తేన. త్రయాణాం జగతాం సమాహారః- త్రిజగతః అపత్యై త్రమ్. నట సిరుహే జన్మ యస్య సః. ఫణీనాం పతిః.

సంధులు :- గిరి + ఈశేన + ఆర్ధ. ఉప + ఆదాయ -సవర్ణదీర్ఘసంధులు ఆరాద్ధః + త్రి. పురః + ఛిత్రః — సాదేశవిసర్గ. హృషీకేశః + యస్మిన్, త్రిపురః + లక్ష్యమ్ — ఉత్వాదేశవిసర్గ. యస్మిన్ + ఇషుః - అనునాసికద్విత్వ. ఇషుః + అజని, ధనుః + ఇతి - లోపాదేశవిసర్గ. అపి + అద్భుతమ్ — యణాదేశ.

క్రియ :- సృజ విసర్గే (శః. సేట్) పరస్మై. లఙ్. ప్రథమ.

అసృజత్ - అసృజతామ్ - అసృజన్

జనీఙ్ ప్రాదుర్భావే. పరస్మై, లుఙ్, ప్రథమ.

అజని / అజనిష్ట — అజనిషాతామ్ — అజనిషత

అఃఇతి :- అః = అహో, పునః పునః = మాటిమాటికిని, అనయా = ఈ, పినాక ప్రశస్తి పంక్తికయా = శివస్తోత్ర పద్ధతితో (విస్తృతితో) కిమ్ = ఏమిపని, ఏతత్ = ఈ, కౌశికమ్ ఏవ = విశ్వామిత్రునే (మాటలనే). ప్రమాణయన్తః = ప్రమాణముగా స్వీకరించి, బహుమన్యామహే = గౌరవింతము (ఆదరింతము). అపిచ = మరియు, రామభద్రస్య = రామునికి, కిమ్ అశక్యమ్ = ఏది అసాధ్యము ;

ఉత్పాదయన్ కమపి కౌణప కోటిహోమం
తేజోహుతాశన సమింధనసామిధేనీమ్।
యస్తాడకామకృత బాలసఖైః పృషత్కై-
రీషజ్జయః స్ఫుటమనేన దశాననోఽపి॥ 33

ఉత్పాదయన్నితి :— యః = ఏ రాముడు, కమపి = అనిర్వాచ్యమగు, కౌణపకోటి హోమమ్ – కౌణపకోటి = రాక్షస సమూహములతో, హోమమ్ = హోమమును, ఉత్పాదయన్ = కల్పించుచు, – రాక్షస హోమమును నిర్వహింపబూని అనుట. (రాక్షసః కౌణపః క్రవ్యాత్ - అమరము), తాడకామ్ = తాటకను, తేజః = తన ప్రతాపమనునట్టి, హుతాశన = అగ్నికి, సమింధన = ప్రజ్వలింపజేయునట్టి, సామిధేనీమ్=మంత్రమునుగా[ఋక్సామిధేనీ ధాయ్యా చ యా స్యాదగ్ని సమింధనే–అమరము. అగ్నిని ప్రజ్వలింపజేయునప్పుడు చదువు మంత్రము – ఋక్కు]. బాలసఖైః = బాలునికి మిత్రములైన, పృషత్కైః = బాణములతో, (పృషత్క-బాణ విశిఖాః - అమర) అకృత = చేసెనో, అనేన = అటువంటి ఈ రామునిచేత, స్ఫుటమ్ = స్పష్టముగా, దశాననః అపి = రావణుడు కూడ, ఈషజ్జయః = సుఖముగా జయింపబడువాడే. (వసంతతిలకము) రావణ పురోహిత ప్రవేశ సూచన.

తాత్పర్యము :- రాక్షస సంహార రూపమగు హోమమును చేయబూని తన ప్రతాపాగ్నికి తాడకను సామిధేనిగా బాలబాణములతో సంతరించిన రామునిచేత రావణుడు కూడ జయింపబడినట్లే.

సమాసములు :- కౌణపానాం కోటిః - కోటిభిః హోమః – తమ్. తేజ ఏవ హుతాశనః — హుతాశనస్య సమింధనమ్ - సమింధనే సామిధేనీ – తామ్. బాలస్య సఖాయః (రాజాహఃసఖిభ్యష్టచ్) – తైః. ఈషజ్జయః ఈషద్దుస్సుషు – ఖల్ ప్రత్యయము - సుఖేన జేతుం శక్యః. దశసంఖ్యాకాని ఆననాని యస్య సః - దశాననః.

సంధులు :- తేజస్ + హుతాశన – ఉత్వాదేశవిసర్గ. యః + తాడకామ్ సాదేశవిసర్గ. పృషత్కైః + ఈషత్–రేఫాదేశవిసర్గ. ఈషత్ + జయః - శ్చుత్వసంధి. దశ + ఆనన - సవర్ణదీర్ఘ. దశాననః + అపి – ఉత్వాదేశవిసర్గ - దశాననో + అపి- పూర్వరూప.

(నేపథ్యేఽర్ధ ప్రవిష్టః)

పురుషః :- దశాననపురోహితః శౌష్కలో మహారాజం దిదృక్షతే.

శతానందః :- (సోద్వేగమ్) ఆః, ఆగచ్ఛతు.

(పురుషో నిష్క్రాంతః)

రామః :- (సవ్యథం జనాంతికమ్) వత్స, లక్ష్మణ, కథమంతరితోఽయమనేన దురాత్మనా రాక్షసేన కామారికార్ముకపరిచర్యామహోత్సవః.

లక్ష్మణః :- ఆర్య, న కేవలమయమ్ - (ఇత్యర్ధోక్తే హసతి)

---

క్రియ :- డు కృఞ్ కరణే, ఆత్మనే. లుఙ్. ప్రథమ.

అకృత - అకృషాతామ్ - అకృషత

(నేపథ్యే = తెరలో నుండి. అర్ధప్రవిష్టః = సగము ప్రవేశించినవాడై)

దశాననేతి :- దశాననపురోహితః=రావణుని పురోహితుడగు, శౌష్కలః= శౌష్కలుడనువాడు, మహారాజమ్ = జనకమహారాజును, దిదృక్షతే = చూడ గోరుచున్నాడు. (జ్ఞాశ్రుస్మృదృశాం సనః - ఆత్మనే).

ఆఃఇతి :- (సోద్వేగమ్ = ఉద్వేగముతో-పీడవచ్చెరా విఘ్నమని) ఆః = ఓహో!, ఆగచ్ఛతు = వచ్చుగాక! [రానిమ్మనుట].

[పురుషః = దౌవారికుడు, నిష్క్రాంతః = నిష్క్రమించును]

వత్సేతి :- [సవ్యథమ్ = నొచ్చుకొనుచు. జనాంతికమ్ = జనాంతికముగా] వత్స = సోదరా! లక్ష్మణా, అనేన = ఈ. దురాత్మనా = దుర్మార్గుడగు. రాక్షసేన = రాకాసిగానిచేత. అయమ్ = మనకు లభించబోయిన ఈ. కామారి కార్ముక = శివ ధనుస్సుయొక్క, పరిచర్యా = సేవ అనునట్టి. మహోత్సవః = గొప్పవేడుక, అంతరితః = అడ్డగింపబడినది. కథమ్ = ఇప్పుడింకెట్లు!

ఆర్యేతి :- ఆర్య = అగ్రజా! కేవలమ్ = కేవలము. అయమ్ న = ఈ ధనురారోపణ మహోత్సవమే కాదు........ [ఇతి = అని. అర్ధోక్తేన = సగము పల్కి. హసతి = నవ్వును] పరిణయ మహోత్సవము కూడ అడ్డగింపబడినదని సౌమిత్రి అభిప్రాయము.

(రామః సప్రణయరోషస్మితం తమపాంగేన పశ్యతి)

(ప్రవిశ్య)

శౌష్కలః :- (ప్రత్యేకమవలోక్యాత్మగతమ్) కథమత్రైవ జనకశతానందాభ్యాం పురస్కృతో విశ్వేషామస్మాకమమిత్రో విశ్వామిత్రః. (విచింత్య) తిష్ఠతు కోఽయం హస్తదక్షిణేన. (దృష్ట్వా) అయే, కావేతౌ క్షత్త్రియ బ్రహ్మచారిణౌ ।

పుణ్యలక్ష్మీకయోః కోఽయమనయోః ప్రతిభాసతే ।
మౌంజ్యాదివ్యంజనః శాంతో వీరోపకరణో రసః॥ 34

---

[రామః = రాముడు, సప్రణయరోషస్మితమ్ = అనురాగముతో రోషముతో చిఱునవ్వుతో, తమ్ = ఆ సౌమిత్రిని, అపాంగేన = క్రీగంటితో, పశ్యతి = చూచును.]

[ప్రవిశ్య = శౌష్కలుడు ప్రవేశించి]

కథమితి :- [ప్రత్యేకమ్ = ఒక్కొక్కరిని, అవలోక్య = చూచి, ఆత్మగతమ్ = తనలో] కథమ్ = ఎట్టూ। జనకశతానందాభ్యామ్ = జనక శతానందులతో, పురస్కృతః = కూడినవాడై – పరివేష్టింపబడి, విశ్వేషామ్ = సమస్తమైన, అస్మాకమ్ = మా రాక్షసులకును, అమిత్రః = శత్రువు, విశ్వామిత్రః = విశ్వామిత్రుడు. అత్ర ఏవ = ఇక్కడనే ఉన్నాడు [విచింత్య = ఆలోచించి] తిష్ఠతు = ఉండుగాక। హస్తదక్షిణేన = నా కుడిచేతిపై పున, అయమ్ కః = వీడెవడు । (దృష్ట్వా = చూచి) అయే = అహో, ఏతౌ = ఈ, క్షత్రియ బ్రహ్మచారిణౌ = రాజవటువులు, కౌ = ఏవరో ।

పుణ్యేతి :- పుణ్య = శుభప్రదమైన, లక్ష్మీకయోః = కాంతికలవారైన [పుణ్యం శోభనే త్రిషు - మేదినీ], అనయోః = ఈ ఇరువురికిని[లో], మౌంజ్యాది వ్యంజనః = మౌంజమేఖల వటు దండము మొదలగు బ్రహ్మచారి చిహ్నములతో కూడినదియు, [వ్యంజనం తేమనే చిహ్నే] వీరోపకరణః = వీరరస పరిపోషితము నైన, కోఽయమ్ = ఇదేమో। శాంతః రసః = శాంతరసము. ప్రతిభాసతే = ప్రకాశించుచున్నది.

నిసర్గోదగ్రమిదం చ కుమారద్వయమ్.

పార్శ్వే త్రయాణామేతేషామృక్సామ యజుషామివ ।
రూపాభ్యాం విధిమంత్రాభ్యామథర్వేవ ప్రదీప్యతే॥ 35

---

తాత్పర్యము :- శుభప్రదమగు కాంతితో వెలుగొందుచున్న ఈ ఇరువురి యందును మౌంజీ బంధనాది చిహ్నములతో శాంతము ఉట్టిపడుచున్నది. శరీర సౌష్ఠవ ధనుర్ధారణాదులతో అది వీరరసపరిపోషితమగుచు ఆశ్చర్యపరచుచున్నది. (పథ్యావక్త్రమ్)

సమాసములు :- పుణ్యా లక్ష్మీర్యయోః — తయోః. మౌంజ్యాదిః వ్యంజనం యస్య సః. వీరః ఉపకరణమ్ యస్య సః.

సంధులు :- రః + అయమ్ — ఉత్వాదేశవిసర్గ. ఓ + అయమ్ - పూర్వరూప. మౌంజీ + ఆది — యణాదేశ. శాంతః + వీరోపకరణః + రసః - ఉత్వాదేశవిసర్గ. వీర + ఉపకరణ — గుణసంధి.

క్రియ :- భాసృఙ్ దీప్తౌ. ఆత్మనే. లట్. ప్రథమ [ప్రతి].
భాసతే - భాసేతే - భాసన్తే

నిసర్గేతి :- చ = మరియు. ఇదమ్ = ఈ. కుమారద్వయమ్ = పటువుల జంట, నిసర్గోదగ్రమ్ = సహజసిద్ధమగు తేజస్సుతో కూడినది.

పార్శ్వ ఇతి :- ఋక్సామ యజుషామ్ ఇవ = ఋక్సామ యజుర్వేదముల వలెనున్న, ఏతేషామ్ = ఈ, త్రయాణామ్ = జనక శతానంద విశ్వామిత్రుల యొక్క. పార్శ్వే = సమీపమునందు. రూపాభ్యామ్ = రూపుధరించిన, విధి మంత్రాభ్యామ్ = అనుష్ఠాన విధానము మంత్రములతో, అథర్వా ఇవ = అథర్వవేదమువలెను ప్రదీప్యతే = ఈ కుమారుల జంట ప్రకాశించుచున్నది. [రూపశబ్దమునకు గ్రంథావృత్తి అనియు నర్థము - గ్రంథావృత్తౌ భవే ద్రూప మాకారశ్లేష యోరపి - విశ్వః] అనుష్టుప్పు.

తాత్పర్యము :- ఋక్సామ యజుర్వేదములవలె నున్న జనక శతానంద విశ్వామిత్రుల సన్నిధిలో ఈ రాజకుమారుల జంట విధి మరియు మంత్రముతో అథర్వ వేదమువలె ప్రకాశించుచున్నది.

(విమృశ్య) అః. నూనం స ఏవ లక్ష్మణద్వితీయో రామహతకః కౌశిక ఋషిమనుప్లవమానో మిథిలాముపస్థితః. (సక్రోధశోకమ్) హా, వత్సే, సుకేతునందిని తాడకే కథమీదృశాన్మనుష్యడింభాత్ తాదృశో దైవదుర్విపాకస్తే సంవృత్తః. కష్టమనరణ్యవంశజన్మనః క్షత్రియశిశోరనాత్మవేదితా.

సుందాసురేంద్ర సుతశోణితసీధుపాన
దుర్మత్తమార్గణ నిరర్గళవీరశబ్దః ।

---

[విమృశ్య = ఆలోచించి] అః = అహో! నూనమ్ = నిశ్చయమే. సః ఏవ = వాడే, రామ హతకః = దుష్టుడు రాముడు. లక్ష్మణ ద్వితీయః = లక్ష్మణుడు ద్వితీయుడుగా కలవాడై, కౌశిక ఋషిమ్ = విశ్వామిత్ర మహర్షిని [ఋత్యకః - ప్రకృతి భావము]. అనుప్లవమానః = అనుసరించుచు, మిథిలామ్ = ఈ మిథిలను, ఉపస్థితః = చేరెను. [సక్రోధశోకమ్ = క్రోధముతో శోకముతో] హా, వత్సే = బిడ్డా! సుకేతు నందిని = సుకేతుని పుత్రికా! తాడకే = తాటకా! ఈదృశాత్ = ఇటువంటి, మనుష్య డింభాత్ = మానవ శిశువువలన [డింభో బాలిశబాలయోః]. తాదృశః = అటువంటి దైవదుర్విపాకః = దురదృష్టము, కథమ్ సంవృత్తః = ఎట్లు సంభవించినది. [విపాకః పచనే భేదే కర్మణో విసదృక్ఫలే - మేదినీ] కష్టమ్ = కష్టము! అనరణ్య వంశ జన్మనః = అనరణ్యుడను రాజు జన్మించిన వంశమునందు పుట్టిన, క్షత్రియశిశోః = ఈ రాజుమానిసియొక్క, అనాత్మవేదితా = స్వరూపజ్ఞాన రాహిత్యము, కష్టమ్ = క్షమింపరానిది. భరింపరానిదనుట. అనరణ్యుడు అనునొక రాజు దశరథునికి పూర్వము సూర్యవంశమున నుండెననియు అతడు రావణునిచే ఒకసారి పరాభూతుడయ్యెననియు నొక కథ ఉత్తర రామాయణమునసున్నది. పరాభూతుడైన అనరణ్యుడు—ఉత్పత్స్యతే కులేహ్యస్మిన్నిక్ష్వాకూణాం మహాత్మనామ్ రామో దాశరథిర్నామ యస్తే ప్రాణాన్ హరిష్యతి - అని రావణుని శపించెను. [ఉత్తర 19-31].

సుందేతి :. సుంద = సుందుడనునట్టి అసురేంద్ర = రాక్షస రాజు యొక్క, సుత = పుత్రుడైన సుబాహునియొక్క, శోణిత = రక్తమనునట్టి, సీధు = మద్యమును [మైరేయమాసవస్సీధుః - అమరము]. పాన = త్రాగుటచే, దుర్మత్త = బాగుగమదించిన, మార్గణ = బాణముచేత, నిరర్గళ = నిరాటంకముగా లభించిన, వీర

ద్రోహం చకార దశకంఠకుటుంబకేఽపి
సోఽయం వటుః కుశికనందనయజ్ఞబంధుః॥ 36

భవతు. ద్రష్టవ్యమస్య భుజాశౌండీర్యమ్. (ఉపసృత్య) అపి సుఖినో యూయం జనకమిశ్రాః.

---

శబ్దః = వీరుడను బిరుదుకలవాఁడై. దశకంఠ = రావణునియొక్క. కుటుంబకే అపి = బంధువర్గమునపట్లగూడ. ద్రోహమ్ = ద్రోహమును. చకార = చేసెనో. కుశికనందన= కౌశికునియొక్క. యజ్ఞ = యాగమునకు. బంధుః = సంరక్షకుడయిన. సః = ఆ. వటుః = బ్రహ్మచారి. అయమ్ = ఇతడే- వాడే వీడనుట. [వసంత తిలకము]

తాత్పర్యము :- సుబాహుని రక్తమను మద్యమును త్రాగి మదించిన బాణములతో స్థాపింపబడిన వీరశబ్దము కలవాడును, రావణుని కుటుంబసభ్యులపై గూడ (తాటకి) ద్రోహము చేసినవాడును, విశ్వామిత్రయాగ సంరక్షకుడు నైన ఆ వటువు ఇతడే।

సమాసములు :- సుందనామకః అసురేంద్రః_అసురేంద్రస్య సుతః - సుతస్య శోణితమ్ - శోణితమేవ సీధుః - సీధోః పానమ్-పానేన దుర్మత్తాః - దుర్మత్తాశ్చతే మార్గణాశ్చ - మార్గణైః నిరర్గళః — వీర ఇతి శబ్దః - నిరర్గళః వీరశబ్దః యస్య సః దశకంఠస్య కుటుంబకమ్ — తస్మిన్. కుశికనందనస్య యజ్ఞస్య బంధుః.

సంధులు :- సుంద + అసుర — సవర్ణదీర్ఘ. అసుర + ఇంద్ర - గుణసంధి. కుటుంబకే + అపి - పూర్వరూప. సః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - సో + అయమ్ — పూర్వరూప.

క్రియ :- డుకృఞ్ కరణే. పరస్మై, లిట్. ప్రథమ
చకార - చక్రతుః — చక్రుః

భవత్వితి :- భవతు = అగుగాక, అస్య = వీనియొక్క, భుజాశౌండీర్యమ్ = బాహుబలము. ద్రష్టవ్యమ్ = గమనింపదగినదే. (ఉపసృత్య = సమీపించి), జనకమిశ్రాః = పెద్దలగు జనకులు, యూయమ్ = మీరు. అపి సుఖినః = కుశలురా ! (మిశ్రశబ్దము గౌరవార్థకము)

జనకః :— స్వాగతం పౌలస్త్యపురోహితస్య. ఇత ఆస్యతామ్.

(శౌష్కలస్తథా కరోతి)

అపి కుశలం తే రాజ్ఞో రావణస్య. అథవా —

విపదాం ప్రతికర్తారో యస్యోపాయైరథర్వభిః ।
త్వాదృశాః సన్తి కిం తస్య కల్యాణమనుయుజ్యతే॥ 37

---

స్వాగతమితి :- పౌలస్త్యపురోహితస్య = రావణ పురోహితునికి, స్వాగతమ్ = స్వాగతము. ఇతః=ఇచట, ఆస్యతామ్ = కూర్చుండుండీ। (శౌష్కలః = శౌష్కలుడు, తథా కరోతి = అట్లే చేయును) తే=మీయొక్క. రాజ్ఞః = ప్రభువైన, రావణస్య చ = రావణునికిని, అపి కుశలమ్ = క్షేమమేకదా। అథవా=అయినను,

విపదామితి :- అథర్వభిః = అథర్వవేదోక్తములైన, ఉపాయైః = వశీకరణాదిమాంత్రిక క్షుద్రోపాయములతో, విపదామ్ = ఆపదలకు, ప్రతికర్తారః = ప్రతిక్రియను జరుపగల్గినవారు. త్వాదృశాః = నీవంటివారు, యస్య = ఎవనికి, సన్తి= కలరో, తస్య = ఆ రావణునియొక్క, కల్యాణమ్ = శుభము, కిమ్ అనుయుజ్యతే = ఏమని ప్రశ్నింపబడును। శుభమును గూర్చి ప్రశ్నింపనేల అనుట। (పథ్యావక్త్రము)

తాత్పర్యము:- అథర్వోక్తములగు క్షుద్రవిద్యలలో ఆరితేరిన నీవంటి పురోహితులుండగా రావణునికి కుశలముగాక మరేమి। విపదాం ప్రతి అని ద్వితీయ సమన్వయించి ఆపదలను కల్పించు నీవంటివా రుండగా అతనికి కుశలమనుమాట యెట్లనియు చమత్కారము.

సంధులు:- ప్రతికర్తారః + యస్య - ఉత్వాదేశవిసర్గ. యస్య + ఉపాయైః - గుణసంధి. ఉపాయైః + అథర్వ - రేఫాదేశవిసర్గ.

క్రియ:— అస భువి. పరస్మై. లట్. ప్రథమ

అస్తి - స్తః - సన్తి

యుజిర్ సమాధౌ. ఆత్మనే. లట్. ప్రథమ,

యుజ్యతే - యుజ్యేతే - యుజ్యన్తే

శౌష్కలః :- (విహస్య) శ్రోత్రియ సీరధ్వజ. ప్రత్యాకరిష్యామైవ వయం యది స్వభుజమండలీ మత్తవారణావలీ వలయితోరః ప్రాసాద సుస్థితచతుర్దశ లోకలక్ష్మీమహాంతఃపురే లంకాపతౌ కిమపి ప్రతికార్యమభవిష్యత్. పశ్య—

యచ్చేష్టాః సమనీకసీమని పరిత్రస్తః పరాంచన్నపి
ప్రత్యక్షీకురుతే సహస్రనయనః పృష్ఠోద్భవైరక్షిభిః ।
చక్రే వర్త్మ చ నాగలోకజయినీం యాత్రామివ ప్రస్తువ
న్యః కైలాసముదస్య కీదృశమపాదానం తు తస్యాపదామ్॥ 38

---

శ్రోత్రియేతి :— (విహస్య = నవ్వి) శ్రోత్రియ = వేదవేత్తా। (ఛాందసుడా।) సీరధ్వజ = జనకమహారాజా। స్వభుజమండలీ = తనబాహువుల సముదాయమనునట్టి. మత్తవారణావలీ = మదిగజసమూహముచేత. వలయితః = పరివేష్టింపబడిన, ఉరః =(రావణుని) వక్షః స్థలమనునట్టి. ప్రాసాద = రాజభవనమునందు. సుస్థిత=భద్రముగా స్థిరముగానిల్చిన. చతుర్దశలోకలక్ష్మీ=పదునాల్గు భువనములయొక్క సంపదను — రాజ్యలక్ష్మి యనుట, మహాంతఃపురే = గొప్ప అంతఃపురమువంటివాడైన. (అంతఃపుర శబ్దము లక్షణావృత్తితో అంతఃపురీ వాచకము. చతుర్దశ లోకలక్ష్మియే భార్యగా కలవాడని కాని- శృంగారం భూభుజామంతఃపురం స్యాత్ - అమరము) లంకాపతౌ = రావణుని విషయమున. కిమపి = ఏదేని. ప్రతికార్యమ్ = అనిష్టము (ప్రతిక్రియ జరుపవలసిన ఆపద). యది అభవిష్యత్ = సంభవించినచో - అసలు సంభవింపదు, ఒకవేళ సంభవించినచో వయమ్ = మేము. ప్రతికరిష్యామ ఏవ = తప్పక ప్రతిక్రియ జరుపగలవారమే। పశ్య = చూడుము।

యదితి :- సమనీక సీమని = యుద్ధభూమియందు (అనీకోఽస్త్రీ రణే సైన్యే - విశ్వః). పరివిత్రస్తః = భయపడినవాడై (ఓడిపోయి), పరాంచన్ అపి = వెనుదిరిగియు. సహస్రనయనః = వేయికన్నుల దేవేంద్రుడు. పృష్ఠోద్భవైః = వెనుక భాగమునందున్న. అక్షిభిః = కన్నులతో. యత్ = ఎవనియొక్క. చేష్టాః = చేష్టలను. ప్రత్యక్షీకురుతే = ప్రత్యక్షముగా (చూచునో) విందుకొనునో. నాగలోకజయినీమ్ = నాగలోకమును జయించుటకు సాధనమైన. యాత్రామ్ ఇవ = ప్రయాణమును

లక్ష్మణః :- (సామర్షం జనాంతికమ్) ఆర్య, కథమసౌ సహస్రార్జునవాలిభ్యా
మవలీఢశౌర్యసారో దురాత్మా రావణః ప్రస్తూయతే.

రామః :- వత్స, న వక్తవ్యమిదమ్. మహాన్తో హి తాదృశాః, కించ—

---

వలె, ప్రస్తువన్ = సంభావించుచు, యః = ఎవడు, కైలాసమ్ = కైలాసపర్వతమును, ఉదస్య = పెకలించి, వర్త్మ = మార్గమును, చక్రే = చేసెనో, తస్య = అటువంటి దశకంధరునికి, ఆపదామ్ = ఆపదలయొక్క, ఆపాదానమ్ = సంభవము [ఆవిర్భావము] కీదృశమ్ = ఎట్లు?

తాత్పర్యము :- యుద్ధరంగమునందు ఓడి పారిపోవుచు దేవేంద్రుడు తన పృష్ఠభాగము నందలి కన్నులతో రావణాసురుని చేష్టలను ప్రత్యక్షముగా చూచును. నాగలోకస్త్రీయాత్రకు మార్గమును నిర్మించు చున్నట్లు రావణుడు కైలాసగిరిని పెకలించినాడు. అంతటి వానికి ఆపదలు సంభవమా? [శార్దూలము]

సమాసములు :- సమనీకస్య సీమ - తస్మిన్. యస్య చేష్టాః. నాగానాం లోకః - లోకస్య జయమస్యాః అస్తీతి - తామ్ - [జయతి శీలమస్యాః].

సంధులు :- యత్ + చేష్టాః - శ్చుత్వసంధి. పరాంచన్ + అపి - అనునాసిక ద్విత్వసంధి. పృష్ఠ + ఉద్భవైః - గుణ ఉద్భవైః + అక్షిభిః = రేఫాదేశ విసర్గ. తస్య + ఆపదామ్ - సవర్ణదీర్ఘ.

క్రియ :- డుకృఞ్ కరణే. ఆత్మనే. లట్. ప్రథమ

కురుతే - కుర్వాతే - కుర్వతే

లిటి: - చక్రే - చక్రాతే - చక్రిరే

ఆర్యేతి :- [సామర్షమ్= క్రోధముతో, జనాంతికమ్ = జనాంతికముగా] ఆర్య ! సహస్రార్జున = కార్తవీర్యార్జునుడు, వాలిభ్యామ్= వాలి అను ఇరువురిచేతను అవలీఢ = అణగగొట్టబడిన, శౌర్యసారః = పరాక్రమసారము కలవాడైన, దురాత్మా= దుష్టుడగు, రావణః = రావణుడు. కథమ్ ప్రస్తూయతే=ఇట్లు స్తుతింపబడుచున్నాడేల ! వీరు రావణస్తుతి సహించుచున్నారేమి అనియు.

వత్సేతి :- వత్స = సోదరా ! ఇదమ్ = ఇది [నీ వన్న విషయము] న

స్యాతాం నామ కపీంద్రహైహయపతీ తస్యావగాఢాంతర
స్థామానౌ దశకంధరస్య మహతీ స్కంధప్రతిష్ఠా పునః ।
సద్యః పాటితకంఠకీకసకణాకీర్ణా యదంసస్థలీః
స్వేనేభాజినపల్లవేన ముదితః ప్రాస్ఫోటయద్ధూర్జటిః॥ 39

---

వక్తవ్యమ్ = అనరానిది. అట్లనరాదనుట. తాదృశాః = అటువంటివారు. మహాన్తః = చాలగొప్పవారు. కించ=మరియు-

స్యాతామితి :- కపీంద్ర హైహయపతీ = వాలి కార్తవీర్యార్జునులు. తస్య - (రావణునియొక్క-) రావణునివిషయమై, అవగాఢ = తెలిసికొన్న. అంతర స్థామానౌ = లోపలి బలముకలవారు, స్యాతామ్ నామ = అగుదురుగాక । - అఇరువురును రావణబలమును గుర్తించి యుందురుగాక । పునః = కాని, దశకంధరస్య = రావణునియొక్క-, స్కంధప్రతిష్ఠా = అంసభాగపు కీర్తి-శారీరకబలమనియు. (రూపాది పంచకే స్కంధః కాయేఽంసే ఘాతపలావకే - విశ్వః). పునః = అంతకంటెను, మహతీ = గొప్పది. సద్యః = అప్పటికప్పుడు. పాటిత = ఖండింపబడిన. కంఠ = కంఠములయొక్క-. కీకసకణ = ఎముకముక్కలతో. (కీకసం కుల్యమస్థి చ-అమర) ఆకీర్ణాః = వ్యాప్తములైన, యత్ = ఏ రావణునియొక్క-. అంసస్థలీః = స్కంధములను ముదితః = సంతోషించినవాడై. ధూర్జటిః = శివుడు, స్వేన = తనయొక్క-. ఇభాజిన పల్లవేన = గజచర్మపు కొనతో. ప్రాస్ఫోటయత్ = వీజనముచేసెనో ఆ దశకంఠుని గొప్పదనము వారెరిగిన దానికంటె అధికమైనదని అన్వయము.

తాత్పర్యము:- శివుని గూర్చి తపస్సు చేయుచు దశకంధరుడు తనశిరస్సులను ఖండించుకొనెను. దానికి శివుడు సంతోషించి వరము లొసగెను. ఆ సమయమున తన గజచర్మపు కొనలతో రావణుని గాయములకు వింజామరలు స్వయముగా వీచెను. వాలికి కార్తవీర్యునికి తెలిసినదానికన్న ఎక్కువ గొప్పదనము రావణుని కున్నది.

సమాసములు :- హైహయానాం పతిః. కపీనామింద్రః - కపీంద్రశ్చ హైహయపతిశ్చ. అంతరం చ తత్ స్థామ చ-అవగాఢమ్ అంతరస్థామ యాభ్యామ్ తౌ. దశసంఖ్యాకాః కంధరాః యస్య-తస్య. స్కంధానాం ప్రతిష్ఠా సద్యః పాటితాశ్చ తే

అపిచ

మఘోనస్తద్ఘోరం కులిశమలసీకృత్య సమరే
భునక్తి స్వారాజ్యం త్రిభువనభటోఽయం దశముఖః ।
శ్రియో నానాస్థానభ్రమణరమణీయాం చపలతా
మవచ్ఛిద్య స్వస్మిన్నపి భుజవనే పూరయతి యః॥ 40

---

తంతాశ్చ. కీకసానాం కణాః – కంటానాం కేకస కణాః – కణైః ఆకీర్ణా – తాః. యస్య అంసస్థలీ – తాః. ఇభస్య అజినమ్ – అజినమేవ పల్లవమ్ అథవా అజినస్య పల్లవమ్ – తేన. (శార్దూలము)

సంధులు :– కపి+ఇంద్ర, తస్య+అవగాఢ+అంతర, కణ+ఆకీర్ణ ఇభ+అజిన, ప్ర+అస్ఫోటయత్ – సవర్ణదీర్ఘ, ఆకీర్ణాః + యత్ – విసర్గలోప స్వేన+ఇభ – గుణసంధి.

క్రియ :– స్ఫుటిర్ విశరణే (ణిచ్) పరస్మై, లఙ్, ప్రథమ.
అస్ఫోటయత్ – అస్ఫోటయతామ్ – అస్ఫోటయన్.

మఘోనఇతి :- అపిచ = మరియు – త్రిభువన భటః = ముల్లోకములకును ఏకైకవీరుడై, అయమ్ = ఈ. దశముఖః = రావణుడు. సమరే = యుద్ధమునందు మఘోనః = దేవేంద్రునియొక్క. తత్ = ఆ. ఘోరమ్ = భీకరమైన కులిశమ్ = వజ్రాయుధమును. అలసీకృత్య = నిశ్చేష్టపరచి. స్వారాజ్యమ్ = స్వర్లోకమును – ఇంద్రసామ్రాజ్యమును. భునక్తి = అనుభవించుచున్నాడు – పరిపాలించుచున్నాడు. శ్రియః = లక్ష్మీదేవికి. నానాస్థాన = పలుతావులందు. భ్రమణ = సంచరించుట అనునట్టి. రమణీయామ్ = అందమైన. చపలతామ్ = చాంచల్యమును. అవచ్ఛిద్య = తప్పించి (పోగొట్టి). స్వస్మిన్ = తనదైన. భుజవనే = బాహుసముదాయమునందు. యః = ఎవడు. పూరయతి = నింపుచున్నాడో (నిల్పుచున్నాడో) ఆ రావణుడని పూర్వార్ధములోనికి అన్వయము. [శిఖరిణి]

తాత్పర్యము :– దేవేంద్రుని వజ్రాయుధమును గూడా తృణీకరించి స్వర్గ సామ్రాజ్యమును ఆక్రమించినవాడు. లక్ష్మీదేవికి తన భుజమందిరములయందే స్థిర నివాసమేర్పరచి చాంచల్యమును మాన్పినవాడు.

జనకః :- (శౌష్కలం ప్రతి) బ్రహ్మన్, సత్యమీదృశో రాక్షసరాజః.
శౌష్కలః :- రాజర్షే జనక.

సంతుష్టే తిసృణాం పురామపి రిపౌ కండూలదోర్మండలీ
క్రీడాకృత్తపునఃప్రరూఢశిరసి వీరస్య లిప్సోర్వరమ్ ।
యాంచాదైన్యపరాంచి యస్య కలహాయన్తే మిథస్త్వం వృణు
త్వం వృణ్విత్యభితో ముఖాని స దశగ్రీవః కథం వర్ణ్యతామ్॥ 41

---

సంధులు :- మహోనః + తత్ - సాదేశవిసర్గ. స్వర్ + రాజ్యమ్ - ఢలోపదీర్ఘసంధి. ఘటః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ—ఘటో + అయమ్-పూర్వరూప. శ్రియః + నానా - ఉత్వాదేశవిసర్గ. స్వస్మిన్ + అపి - అనునాసికద్విత్వ.

క్రియ :— భుజపాలనాభ్యవహారయోః, పరస్మై. లట్. ప్రథమ (శ్నమ్)

భునక్తి - భుఙ్క్తః - భుంజన్తి

పూరీ ఆప్యాయనే, పరస్మై లట్. ప్రథమ [చురాది]

పూరయతి - పూరయతః - పూరయన్తి

బ్రహ్మన్నితి :- [శౌష్కలమ్ ప్రతి=శౌష్కలునుద్దేశించి] బ్రహ్మన్= విప్రుడా ! సత్యమ్ = నిజమే. రాక్షసరాజః = రావణుడు, ఈదృశః = ఇంతటివాడే - యుచ్చేష్టాః అను శ్లోకములో వర్ణించిన యంతటివాడే అనుట.

సంతుష్టఇతి :- రాజర్షే ! జనక ! తిసృణామ్ = మూడయినట్టి. పురామ్ = పురములకు-త్రిపురములకు. రిపౌ = శత్రువైన శంకరుడు. సంతుష్టే అపి = సంతుష్టుడు కాగా, త్రిపురాసురునికి శత్రువై మహేశ అనునాయకునికి సంతుష్టుడగుట అపి శబ్దపు చమత్కారము - కండూల = మదించిన, దోర్మండలీ = బాహా సముదాయము చేత. క్రీడా = విలాసముగా. కృత్త = నరికివేయబడి, పునఃప్రరూఢ = తిరిగిమొలిచిన, శిరసః = తలలు కలవాడై. వరమ్ = వరమును. లిప్సోః = కోరుచున్నవాడగు. యస్య = ఏ వీరస్య = వీర రావణునియొక్క. ముఖాని = పది ముఖములును. యాంచా దైన్యపరాంచి = యాచనయందలి దైన్యమునకు సమ్మతింపనివై. త్వమ్ = నీవు. వృణు = కోరుము. త్వమ్ = నీవు. వృణు ఇతి = కోరుమని. అభితః = అన్ని వైపులనుండియు. మిథః = తమలోతాము, కలహాయన్తే = కలహించుకొనుచున్నవో.

సోఽపి —

కన్యామయోనిజన్మానం పరీతుం ప్రతిభూయ మామ్।
పురోధసా గౌతమేన గుప్తస్య భవతో గృహాన్॥ 42

సః = అటువంటివాడగు. దశగ్రీవః = రావణుడు. కథమ్ = ఎట్లు. వర్ణ్యతామ్ = వర్ణింపబడెడిని ః (శార్దూలము)

తాత్పర్యము :- పరమేశ్వరుని సంతుష్టుని జేయుటతో తిరిగి మొలిచిన రావణ ముఖములు వరమును కోరుకొనబోయి యాచనయందలి దైన్యము నంగీకరింప నిష్టై నీవు కోరుము నీవు కోరుమని తమలో తాము జగడమాడుకొన్నవి. అట్టి రావణుని వర్ణింపదరమా ః

సమాసములు :- కండూలా చ సా (సిధ్మాదిభ్యశ్చ-లచ్) దోర్మండలీవ-క్రీడయా కృత్తాని—దోర్మండల్యా క్రీడా కృత్తాని - కృత్తాని చ తాని పునః ప్రరూఢాని చ - ప్రరూఢాని శిరాంసి యస్య సః — తస్య. యాంచాయాం దైన్యమ్ — దైన్యస్య పరాంచి. దశసంఖ్యాకాః గ్రీవాః సంత్యస్య,

సంధులు :- శిరసః + వీరస్య, అభితః + ముఖాని — ఉత్వాదేశ విసర్గ. లిప్సోః + వరమ్ — రేఫాదేశవిసర్గ. మిథః + త్వమ్ - సాదేశవిసర్గ. వృణు + ఇతి + అభితః —యణాదేశ.

క్రియ :- కలహ (శబ్దవైరకలహేత్యాదినా క్యఙ్) ఆత్మనే, లట్. ప్రథమ.

కలహాయతే - కలహాయేతే — కలహాయన్తే

వర్ణ వర్ణక్రియా విస్తారగుణవచనేషు, కర్మణి, ఆత్మనే. లట్, ప్రథమ

వర్ణ్యతామ్ - వర్ణ్యేతామ్ — వర్ణ్యన్తామ్

కన్యామితి :- సః అపి = అంతటి రావణుడుకూడ - (యాచనాపరాఙ్ముఖుడైనను), పురోధసా = పురోహితుడగు. గౌతమేన = శతానందునితో, గుప్తస్య = సంరక్షింపబడుచున్న. భవతః = నీయొక్క, గృహాన్ = సౌధముల నుద్దేశించి — నీ వద్దకనుట, అయోనిజన్మానమ్ = అగర్భసంభవయగు, కన్యామ్ = కన్యను సీతను,

విశ్వామిత్రః :- సఖే సీరధ్వజ. పశ్య పినాకదర్శనోల్లాసికావిసంస్థులచిత్తవృత్తిరివ వత్సో రామభద్రః.

జనకః :- (విహస్య)

కిమేతదేవ భగవన్నభిధీయే పునస్తరామ్ ।
ఇక్ష్వాకవో విదేహాశ్చ పరవన్తస్త్వయా వయమ్॥ 43

---

వరీతుమ్ = యాచించుటకొఱకు, మామ్ = నన్ను. ప్రజిఘాయ = పంపెను. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- అయోనిజయగు నీ కూతును తనకు భార్యగా అర్థింపుమని అంతటి రావణుడు నన్ను నీయొద్దకు పంపెను. గౌతముని తపశ్శక్తితో సంరక్షింపబడుచున్న గృహములు కలవాడవు నీవు. (ఇది శతానందునికి కార్యసాధనకై పొగడ్త).

క్రియ :- హి గతౌ వృద్ధౌ చ. పరస్మై, లిట్, ప్రథమ. (ప్ర)
జిఘాయ — జిఘ్యతుః - జిఘ్యుః

సఖేఇతి :- సఖే = మిత్రమా । సీరధ్వజ = జనకా । పశ్య = చూడుము - పినాక = శివధనుస్సుయొక్క, దర్శన = దర్శనమందలి, ఉల్లాసికా = ఉత్సుకతతో, విసంస్థుల = వ్యాకులమయిన - త్వరపడుచున్న. చిత్తవృత్తిః ఇవ = మనఃప్రవృత్తి కలవానివలె. వత్సః రామభద్రః = చిరంజీవి రామభద్రుడు. అస్తి = ఉన్నాడు.

కిమితి :- (విహస్య = నవ్వి) భగవన్ = మహాత్మా । ఏతత్ఏవ = ఇదే మాటను. పునస్తరామ్ = మాటిమాటికిని. కిమ్ అభిధీయే = చెప్పుచున్నావేల । ఇక్ష్వాకవః = రాఘవులు, విదేహాః చ = వైదేహులును అగు. వయమ్ = మేము - రెండు వంశములవారముననుట. త్వయా = నీచేత, పరవన్తః = అధీనులము - నీకు అధీనులమనుట. (పథ్యావక్త్రము).

తాత్పర్యము :- విశ్వామిత్రా : అదేమాటను మరల మరల చెప్పుచుంటివేల । ఇక్ష్వాకులును మా విదేహులమును నీకు విధేయులమే.

సంధులు :— భగవన్ + అభి - అనునాసికద్విత్వ. ఇక్ష్వాకవః + విదేహాః - ఉత్వాదేశవిసర్గ. విదేహాః + చ, పరవన్తః + త్వయా — శషసాదేశ విసర్గ.

శౌష్కలకః :- భోః సీరధ్వజ, కిమిదమస్మాకమాకాశవచనమ్, ఉత దుష్ప
రిచ్ఛేద్య ఏవాయమర్థః. యదుత్తరమపి న ప్రతిపద్యసే. పశ్య-

దాతవ్యేయమవశ్యమేవ దుహితా కస్మైచిదేనామసౌ
దోర్లీలామసృణీకృతత్రిభువనో లంకాపతిర్యాచతే।
తత్కిం మూఢవదీక్షసే నను కథాగోష్ఠీషు శంసన్తి నః
త్వద్వృత్తాని పరోరజాంసి మునయః ప్రాచ్యా మరీచ్యాదయః॥ 44

---

ప్రక్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః, కర్మణి, లట్, ఉత్తమ, ఆత్మనే (అభి)

అభిధీయే - అభిధీయావహే - అభిధీయామహే

భో ఇతి :- భోః సీరధ్వజ = ఓవిదేహాధిపా। కిమ్ = ఏమీ। ఇదమ్ = ఈ, అస్మాకమ్ = మామాట. ఆకాశవచనమ్ = గాలిలో మాటయా? సమాధానము చెప్పవలసిన అవసరములేనిదా వినబడలేదా అనుట. ఉత = కాదేని. అయమ్=ఈ, అర్థః = అర్థము - నా మాటకు అర్థము, దుష్పరిచ్ఛేద్యః = కష్టసాధ్యమా। బోధపడ లేదా అనుట. యత్ = ఏలయనగా, ఉత్తరమ్ అపి = సమాధానమునుగూడ, న ప్రతిపద్యసే = చెప్పకున్నావు। పశ్య = చూడుము-

దాతవ్యేతి :- ఇయమ్=ఈ, దుహితా = నీ తనయ, కస్మైచిత్ = ఎవనికో ఒకనికి అవశ్యమ్ = తప్పక, దాతవ్యా ఏవ = ఈయవలసినదే. దోర్లీలా = భుజా విలాసముతో. మసృణీకృత = స్నిగ్ధముగావింపబడిన (సరళము గావించిన). త్రిభువనః = ముల్లోకములను కలవాడగు, అసౌ = ఈ, లంకాపతిః = రావణుడు, ఏనామ్ = ఈ నీ తనయను, యాచతే = అభ్యర్థించుచున్నాడు. తత్ = ఇంక, కిమ్= ఏమీ। మూఢవత్ = మూఢునివలె, ఈక్షసే = చూచుచున్నావు। నః = మాయొక్క, కథాగోష్ఠీషు = లౌకికప్రసంగములందు, ప్రాచ్యాః = ప్రాచీనులగు, మరీచ్యాదయః = మరీచి మొదలయిన, మునయః = ఋషులు, త్వత్ = నీయొక్క, వృత్తాని = కథలను ప్రవర్తనలననుట, పరోరజాంసి = రజోగుణమునకు అవలివిగా - కేవలసాత్త్వికములుగా, శంసంతి = పొగడుదురు. వారట్లు పొగడుదురు నీవిట్లు నీళ్ళు నములుదువేమనుట.
(శార్దూల విక్రీడితము)

శతానందః :- బ్రహ్మన్. చిరాయ ద త్తమేవో త్తరమస్మాభిః.
పౌష్కలః :- హ న్త. రాజపుత్రీ సమర్పణాదన్యత్కీదృశం తత్.
శతానందః :- శృణు-

తాత్పర్యము :- సీరధ్వజా! ఈ నీ పుత్రికను ఎవరికో ఒకరికిచ్చి వివాహము చేయవలసినదేగదా! ముల్లోకములను తన భుజాబలముతో స్వాయ త్తము చేసికొన్న లంకాపతి ఈమెను ఇమ్మని అభ్యర్థించుచున్నాడు. ఇంకను మూఢునివలె చూతువేల! ఋషులతో మాకేర్పడిన గోష్ఠులలో మరీచ్యాదిమునులు నిన్ను స త్త్వగుణ సంపన్నునిగా పొగడుదురు గదా!

సమాసములు :- దోర్భ్యాం ఆయ్యా ముష్ఠీకృతమ్ త్రిభువనం యేన సః. లంకాయాః పతిః. మరీచిః ఆదిః యేషాం తే. రజసః పరాణి-పరోరజాంసి. రాజదంతాదిత్వాత్ పూర్వనిపాత, పారస్కరాదిత్వాత్ సుట్.

సంధులు :— దాతవ్యా + ఇయమ్ - గుణసంధి. త్రిభువనః + లంకా. పరః + రజాంసి - ఉత్వాదేశవిసర్గ. పతిః + యాచతే - రేఫాదేశవిసర్గ. ప్రాచ్యాః + మరీచి — విసర్గలోప. మరీచి + ఆదయః - యణాదేశ.

క్రియ :- (టు) యాచృఙ్ యాఞ్ఞాయామ్. ఆత్మనే. లట్ ప్రథమ.
యాచతే - యాచేతే - యాచ న్తే
ఈక్షఙ్ దర్శనే. ఆత్మనే. లట్. మధ్యమ
ఈక్షసే — ఈక్షేథే - ఈక్షధ్వే
శంసు స్తుతౌ. పరస్మై. లట్. ప్రథమ
శంసతి — శంసతః - శంస న్తి

బ్రహ్మన్నితి :- బ్రహ్మన్ = విప్రా! చిరాయ = చాలకాలము క్రిందటనే, అస్మాభిః = మాచేత, ఉ త్తరమ్ = సమాధానము, ద త్తమ్ = ఈయబడినది.

హన్తేతి :- హ న్త = అక్కటా! రాజపుత్రీ సమర్పణాత్ = సీతను సమర్పించుట కంటె. అన్యత్ = వేరొకటిగా — భిన్నముగా. తత్ = నీవిచ్చిన ఆ సమాధానము. కీదృశమ్ = ఎటువంటిది? సీతనిచ్చుటకన్న వేరొక సమాధానమేమున్నదనుట.

శాంభవం చాపమారోప్య యోఽస్మానానందయిష్యతి ।
పూర్ణపాత్రమియం తస్మై మైథిలీ కల్పయిష్యతే॥ 45

శౌష్కలః :- (విహస్య) శాంతమ్. అహహ యుష్మాకమప్యమూన్యక్షరాణి!
తేనాంగుళీశతనిఘుష్టకుబేరశైల
కంఠోక్తదోః కులిశ కందళ విక్రమేణ ।
మాహేశ్వరేణ మహతా దశకంధరేణ
కర్మేదృశం కథమనార్యమధిక్రియేత॥ 46

---

శాంభవమితి :- శృణు = వినుము - యః = ఎవడు, శాంభవమ్ = శివునిదైన, చాపమ్ = ధనుస్సును, ఆరోప్య = ఎక్కుపెట్టి, అస్మాన్ = మమ్మందరిని ఆనందయిష్యతి = ఆనందింపజేయునో, తస్మై = వాని కొఱకు, ఇయమ్ = ఈ, మైథిలీ = జానకి, పూర్ణపాత్రమ్ = పూర్ణకుంభముగా, కల్పయిష్యతే = కల్పింపబడును - సమర్పింపబడుననుట. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- ఎవడు శివధనుస్సును ఎక్కుపెట్టి మమ్మందరిని ఆనందింపజేయునో వానికి ఈ సీత పూర్ణకుంభమువలె సమర్పింపబడును.

క్రియ :- ఆనంద (ణిచ్) లృట్, పరస్మై, ప్రథమ.
ఆనందయిష్యతి –ఆనందయిష్యతః - ఆనందయిష్యన్తి
కల్ప (ణిచ్) లృట్, ఆత్మనే, ప్రథమ
కల్పయిష్యతే–కల్పయిష్యేతే–కల్పయిష్యన్తే

శాంతమితి :- (విహస్య = నవ్వి) శాంతమ్ = శాంతము ! శాంతము ! అహహ = ఆహాహా, యుష్మాకమ్ అపి = మీకుగూడ, అమూని అక్షరాణి=ఇటువంటి పలుకులా! సర్వజ్ఞులగు మీ నోటినుండి ఇటువంటి మాటలు రారాదనుట.

తేనేతి :- అంగుళీ శత = నూఱువేళులతో (ఇరువది బాహువులు). నిఘుష్ట = కదలింపబడిన, కుబేరశైల = కైలాసముచేత, కంఠోక్త=స్పష్టముగా యెలుగెత్తి ప్రకటింపబడిన, దోః కులిశ = బాహువులనునట్టి వజ్రాయుధములయొక్క, కందళ = సమూహముతోనైన, విక్రమేణ = పరాక్రమము కలవాడును, మాహేశ్వరేణ = శివభక్తుడును, మహతా = గొప్పవాడునైన, తేన = ఆ, దశకంధరేణ = మా

శతానందః :- (విహస్య) బ్రహ్మన్.

అయం మహాక్షత్రియగోత్రజన్మా దృఢప్రతిజ్ఞో జనకాధిరాజః।
న చాపమారోపయితా దశాస్యస్తథాపి జానాసి యదుత్తరం నః॥ 47

---

లంకాధిపతితో. ఈదృశమ్ = ఇటువంటి. అనార్యమ్ = అనుచితమగు, కర్మ = పని, కథమ్ = ఎట్లు. అధిక్రియేత = అనుష్ఠింపబడును। (వసంతతిలక)

తాత్పర్యము :- రావణుడు వజ్రతుల్యమగు బాహుపరాక్రమముకలవాడను విషయమును నూఱు వేళులతో కదలింపబడిన కైలాసము కంఠోక్తిగా ప్రకటించినది. ఆ ఘనకార్యమువలననే లోకమునకు తెలిసినదనుట. పైగ దశకంఠుడు పరమ మాహేశ్వరుడు. శివుని ధనుస్సు నారోపించుట అనునట్టి అనుచితము సీతకు చేయడు.

సమాసములు :- అంగులీనాం శతమ్-శతేన నిఘృష్టః - నిఘృష్టశ్చాసౌ కుబేరశైలః - శైలేన కంఠోక్తః - దోః కులిశానాం కందళః - కందళస్య విక్రమః - కంఠోక్తః ... విక్రమః యస్య - తేన. మహేశ్వరస్యాయమ్ - తేన. దశసంఖ్యాకాః కంధరాః యస్య - తేన. న ఆర్యమ్ - అనార్యమ్.

క్రియ :- డు కృఞ్ కరణే. కర్మణి. ఆత్మనే. విధిలిఙ్. ప్రథమ (అధి)
క్రియేత - క్రియేయాతామ్ - క్రియేరన్

అయమితి :- (విహస్య = నవ్వి) బ్రహ్మన్ = విప్రా । మహా = గొప్పదియగు. క్షత్రియగోత్ర జన్మ = రాజ వంశమునందు పుట్టినవాడగు, అయమ్ = ఈ. జనకాధిరాజః = జనకమహారాజు, దృఢప్రతిజ్ఞః = సడలని ప్రతిజ్ఞ కలవాడు - ప్రతిజ్ఞను సడలింపడనుట. దశాస్యః = మీ దశకంఠుడు. చాపమ్ = ధనుస్సును, న ఆరోపయితా = ఎక్కుపెట్టడు । ఎక్కుపెట్టలేనివాడనుట. తథాపి = అయినను, నః = మాయొక్క. యత్ ఉత్తరమ్ = ఏ సమాధానము కలదో దానిని. జానాసి = ఎరుగుదువు. (ఉపేంద్రవజ్ర)

తాత్పర్యము :- ఈ జనక మహారాజు గొప్పక్షత్రియ వంశమునందు జన్మించినవాడగుటచే తన ప్రతిజ్ఞను సడలింపడు. మీ దశకంఠుడు శివధనుస్సును ఎక్కుపెట్టడు. ఈ పరిస్థితిలో మా సమాధానమేమో నీవు ఎరుగుదువు.

శౌష్కలః :- (సహాసమ్)

అంగిరాశ్చ పులస్త్యశ్చ ప్రసవౌ పరమేష్ఠినః ।
పౌలస్త్యే జ్ఞాతిధర్మోఽయం తత్కిమాంగిరసస్య తే॥ 48

(సామర్షమ్)

మాహేశ్వరో దశగ్రీవః క్షుద్రాశ్చాన్యే మహీభుజః ।
పినాకారోపణం శుల్కం హా సీతే కిం భవిష్యసి॥ 49

---

సమాసములు :- మహాక్షత్రియాణాం గోత్రమ్ - గోత్రే జన్మ యస్య సః. (మహచ్చ తత్ క్షత్రియగోత్రం చ) ధృఢా ప్రతిజ్ఞా యస్య సః. జనకశ్చాసౌ అధిరాజశ్చ.

క్రియ :- జ్ఞా అవబోధనే, పరస్మై, లట్, మధ్యమ
జానాసి - జానీథః - జానీథ
ఆరోప (ణిచ్) లుట్, పరస్మై, ప్రథమ
ఆరోపయితా - ఆరోపయితారౌ - ఆరోపయితారః

అంగిరాఇతి :- (సహాసమ్ = చిఱునవ్వుతో) అంగిరాః చ = అంగిరసుడును, పులస్త్యః చ = పులస్త్యుడును, పరమేష్ఠినః = బ్రహ్మకు, ప్రసవౌ = కుమారులు. పౌలస్త్యే = పులస్త్యకుమారుడగు రావణునిపట్ల, ఆంగిరసస్య = అంగిరసుని మనుమడవైన, తే = నీకు, అయమ్ = ఈ, జ్ఞాతిధర్మః = వైరము, తత్ కిమ్ = అదేమి ; తగదనుట.

తాత్పర్యము :- అంగిరసుని కుమారుడు గౌతముడు. గౌతముని కుమారుడు శతానందుడు. అంగిరసుడును పులస్త్యుడును బ్రహ్మదేవుని సంతానము. పులస్త్యుని పుత్రుడు రావణుడు. మీ ఇరువురికిని జ్ఞాతివైరము సహజమే అయినను తగదనుట. (పథ్యావక్త్రము).

సంధులు :- అంగిరాః + పులస్త్యః + చ - శాదేశవిసర్గ. ధర్మః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - ధర్మో + అయమ్ - పూర్వరూప.

మాహేశ్వరఇతి :- (సామర్షమ్ = సక్రోధముగా) దశగ్రీవః = రావణుడు, మాహేశ్వరః = శివభక్తుడు - కావున శివధనుస్సును ఎక్కుపెట్టగల్గియు

శతానందః :- (సరోషవ్యథమ్) బ్రహ్మన్, ఏవమనేన ధనుషా కిమపి వినయాధికారిక మధ్యాప్యతే. యదద్య పరమమాహేశ్వరస్తే రావణోఽపి సంవృత్తః.

శంభోరాధారమచలముత్క్షేప్తుం భుజకౌతుకీ ।
మాహేశ్వరో ధనుః ద్రష్టుమహో తే దశకంధరః॥ 50

---

ఎక్కుపెట్టుట. అన్యే = ఇతరులైన. మహీభుజః = రాజులు. క్షుద్రాః = బలహీనులు-కావున వారివల్లకాదు. పినాకారోపణమ్ = శివధనుస్సు నెక్కుపెట్టుట. శుల్కమ్= నీకు కట్నము. హా సీతే = ఓ జానకీ ! కిమ్ భవిష్యసి = ఏమి కానుంటివో ! ఇక నీకు వివాహమగుట కల్ల - అని (పథ్యావృత్తము)

తాత్పర్యము :- ధనుస్సును ఆరోపింపగల ఒకేఒక్క మహావీరుడు రావణుడు. అతడేమో మాహేశ్వరుడు. తక్కిన రాజులు బలహీనులు. పినాకారోపణము కట్నము. ఇది ఉపసంహరింపబడని అంశము. కావున ఓసీతా ! ఏమయిపోదువో !

సంధులు :- మాహేశ్వరః + దశ - ఉత్వాదేశవిసర్గ. క్షుద్రాః + చ - శాదేశవిసర్గ. చ + అన్యే. పినాక + ఆరోపణ - సవర్ణదీర్ఘ.

క్రియ :- భూ సత్తాయామ్. పరస్మై, లృట్. మధ్యమ
భవిష్యసి - భవిష్యథః - భవిష్యథ

బ్రహ్మన్నితి :- (సరోషవ్యథమ్ = క్రోధముతో బాధతో) బ్రహ్మన్= విప్రా ! అనేన = ఈ, ధనుషా = ధనుస్సుచేత. ఏవమ్ = ఇట్లు. కిమపి = ఏదేని. వినయాధికారికమ్ = వినయాధికారికము అను ఒక అధ్యాయముగల తత్త్వము(చాణక్య గ్రంథమున ఈ భాగము వినయోపదేశకము). అధ్యాప్యతే = నేర్పబడుచున్నదా ! యత్ = ఏలయన. అద్య = ఇప్పుడు. తే = నీయొక్క. రావణః అపి = దశగ్రీవుడు సైతము. పరమ మాహేశ్వరః = మహాశివభక్తుడుగా, సంవృత్తః = అయ్యెను !

శంభోరితి :- శంభోః = శివునియొక్క. ఆధారమ్ = ఆశ్రయమైన. అచలమ్ = పర్వతమును. ఉత్క్షేప్తుమ్ = పెకలించుటకు. భుజకౌతుకీ = బాహువుల కుతూహలము కలవాడైన. తే = నీయొక్క. దశకంధరః = రావణుడు. ధనుః =

(శౌష్కలవర్జమన్యే స్మయన్తే)

(సరోషావహిత్థమ్) రామభద్ర,

తదేతదారోపయ చాపమీశప్రకోష్ఠభస్మప్రతిరూషితజ్యమ్ ।
శౌర్యోష్మభాజాం భజతాం ముఖాని స్వబాహుమౌర్వీకిణకాలికైవ॥51

---

ఈ ధనుస్సు ప్రిష్టమ్ = ఎక్కుపెట్టు విషయమున. మాహేశ్వరః = పరమశివభక్తు డయ్యెను. అహో ! = ఓ హోహో !

తాత్పర్యము :- శివునికి ఆవాసమైన కైలాసము నెత్తుటకు సంబరపడిన మీ దశగ్రీవుడు ఇప్పుడీ శివధనుస్సు నెక్కుపెట్టుటకు పరమమాహేశ్వరు డయ్యెను! ఓహో! ఏమి వింత!

(శౌష్కలవర్జమ్=శౌష్కలుడు తప్ప. అన్యే=తక్కినఅందరును. స్మయన్తే= నవ్వుదురు).

[సరోషావహిత్థమ్ = రోషముతో ఆకారగోపనముతో]. రామభద్రా !

తదేతదితి :- ఈశ = శివునియొక్క. ప్రకోష్ఠభస్మ = మోచేతి భస్మ ముతో [స్యాత్కఫోణిస్తు కూర్పరః. తస్యోపరి ప్రగండః స్యాత్ప్రకోష్ఠస్తస్యచాప్యధః అమర] ప్రతిరూషితజ్యమ్ = పులుమబడిన నారికల్గిన. తదేతత్ = ఇప్పటి వరకు ప్రస్తుతింపబడిన ఈ. చాపమ్ = ధనుస్సును, ఆరోపయ = ఎక్కుపెట్టుము. స్వబాహు = నీ భుజములయందు. మౌర్వీకిణ = వింటినారి దెబ్బలచే నేర్పడిన కాయలయొక్క. కాలికా ఏవ = నల్లదనమే. శౌర్యోష్మభాజామ్ = ప్రతాపగర్వమును వహించువారి యొక్క, ముఖాని = ముఖములను, భజతామ్ = ఆక్రమించుగాక! [ఉపజాతి]

తాత్పర్యము :- ఓ రామభద్రా ! శివుని చేతి భస్మముతో అలంకరింప బడిన నారి కలదైన ఈధనుస్సును ఎక్కుపెట్టుము. నీహస్తములపై వింటినారి తాకిడిచే నేర్పడిన కాయల నల్లదనము - పరాక్రమ గర్విష్ఠుల ముఖములను ఆక్రమించుగాక ! రావణాదుల ముఖములు అవమానముతో నల్లబడుననుట.

సమాసములు :- ఈశస్య ప్రకోష్ఠః - ప్రకోష్ఠస్య భస్మ - భస్మనా ప్రతిరూషితా - ప్రతిరూషితా జ్యా యస్య తత్. శౌర్యస్య ఊష్మ భజతి - తేషామ్, స్వస్య బాహూ - బాహ్వోః మౌర్వీకిణాని కిణానాం కాలికా.

శౌష్కలః :- (సక్రోధమ్) అరేరే, శతానంద, కిముద్భ్రాంతోఽసి. యదేవ మస్మదగ్రే పౌలస్త్యం మహారాజమధిక్షిపసి. కథమయం తే మాణిక్య పరిహాణేన గైరికపరిగ్రహః. యదేవం దశగ్రీవ మవమన్యమానస్య మనుష్యపోతేఽనురాగః. యది వా తత్ర భవంతం గౌతమముపహాయ దులిచక్షుషి సహస్రాక్షే భవతో మాతురహల్యాయాః.

---

క్రియ :- రూప రూప క్రియాయామ్ (జిచ్) లోట్. పరస్మై, మధ్యమ
అరోపయ/అరోపయతాత్-అరోపయతమ్- అరోపయత
భజ సేవాయామ్, లోట్, ఆత్మనే, ప్రథమ
భజతామ్ - భజేతామ్ - భజన్తామ్

అరేఇతి :- (సక్రోధమ్ = క్రోధముతో) అరేరే శతానంద = ఓరోరీ గౌతమా! ఉద్భ్రాంతోఽసి కిమ్ = మతి చలించినదా ఏమి! ఏవమ్ = ఇట్లు, అస్మదగ్రే = మా యెట్టయెదుట, మహారాజమ్ = మా మహారాజగు, పౌలస్త్యమ్ = రావణుని, అధిక్షిపసి = ఆధిక్షేపించుచున్నావు. తే = నీయొక్క, అయమ్ = ఇది-నీవు చేయుచున్న ఈ పని, మాణిక్య పరిహాణేన = రత్నమును త్యజించుటతో, గైరిక పరిగ్రహః = గైరిక ధాతు శిలను స్వీకరించుట. కథమ్ = ఎట్లు సంగతము! రావణుని వదలి రాముని స్వీకరించుట రత్నమును వదలి రాయిని స్వీకరించుట అని శౌష్కలకుని అభిప్రాయము. దశగ్రీవమ్ = రావణాసురుని, అవమన్యమానస్య = తిరస్కరించు చున్నవానికి నీకు, మనుష్యపోతే = మానవ శిశువునందు, ఏవమ్ = ఇట్లు, అనురాగః = అనురాగమా! యదివా = అప్పుడులే - తత్రభవంతమ్ = మహానుభావుడగు, గౌతమమ్ = గౌతమ మహర్షిని, అపహాయ = విడిచిపెట్టి, భవతః = నీయొక్క, మాతుః = తల్లియైన అహల్యాయాః = అహల్యకు, దులిచక్షుషి = తాబేటి కన్నులవాడగు (కమఠీ దులిః - అమరము. అక్షిణీ తే ఇంద్ర పింగళాని అను శ్రుతి వాక్యముచే ఇంద్రుని కన్నులు తాబేటి కన్నులవలె పింగళములుగా నుండునట), సహస్రాక్షే = దేవేంద్రునియందు, అ రాగః = అనురాగముగదా! ఇది నీకు తల్లినుండి సంక్రమించిన గుణమనుట.

శతానందః :- (సరోషహాసమ్) కిమాత్థ రే. కిమాత్థ అస్మదగ్ర ఇతి.

విశ్వామిత్రః :- (సప్రణయరోషమివ) వత్స. గౌతమ. విరమ విరమ శుష్కకలహాత్. అతిథిరయమస్మాకముపాధ్యాయో దశకంఠస్య. (వ్యథమానౌ రామలక్ష్మణౌ చ దృష్ట్వా విహస్య) వత్స. రామభద్ర. ధనుర్గృహోపసర్పణమనుజానాతి తే జనకాన్వయ పురోధాః.

రామః :- యదాదిశన్తి గురవః. (ఇతి సవినయలజ్జాకౌతుకం పరిక్రమ్య లక్ష్మణేన సహ నిష్క్రాంతః)

---

కిమితి :- (సరోషహాసమ్=క్రోధముతో నవ్వుచు) రే=ఒరోరీ! కిమ్ ఆత్థ= ఏమంటివి । కిమాత్థ = ఏమంటివి! అస్మదగ్రే ఇతి = మా ఎట్టయెదుటనే .... అనియా?

వత్సేతి :- (సప్రణయరోషమివ = గౌతమునిపట్ల ప్రేమతో, శౌష్కలకునిపై కోపముతో) వత్స = నాయనా । గౌతమా = శతానందా । శుష్కకలహాత్ = వృధాకలహమునుండి, విరమ, విరమ = విరమించుము, విరమించుము, దశకంఠస్య= రావణుని యొక్క, ఉపాధ్యాయః అయమ్ = పురోహితుడితడు, అస్మాకమ్ = మనకు అతిథిః = అతిథి. (వ్యథమానౌ = కలతచెందుచున్న, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, దృష్ట్వా = చూచి, విహస్య చ = నవ్వి) వత్స । రామభద్రా । జనకాన్వయ పురోధాః = జనకవంశ పురోహితుడు శః శతానందుడు, ధనుర్గృహోపసర్పణమ్ = ధనుస్సు ఉన్న శాలను సమీపించుటకు, తే = నీకు, అభ్యనుజానాతి = అనుమతించుచున్నాడు.

యదితి :- గురవః = గురువులు, యత్ ఆదిశన్తి = ఆజ్ఞాపించినట్లే. (ఇతి = అని. సవినయలజ్జాకౌతుకమ్ = వినయము, సిగ్గు, కుతూహలములు పెనవేసికొనగా, పరిక్రమ్య = కదిలి, లక్ష్మణేన సహ = సౌమిత్రితో కలిసి, నిష్క్రాంతః = నిష్క్రమించెను.)

శౌష్కలః :- రాజర్షే సీరధ్వజ. ధన్యోఽసి, పురా కిల పరమేశ్వర పరి
చర్యావదానే నికృత్తేషు నవ మూర్ధసు
పరం తాదృక్కర్మాద్భుత సదృశమప్రేక్ష్య కిమపి
ప్రరోహద్వైక్లవ్యం పురవిజయినో యేన దదృశే।
తదస్మాత్కృష్టం యేన త్రిభువనమపి ప్రార్థితమిదం
తదేవ త్వయ్యర్థీభవతి దశమం రావణముఖమ్॥ 52

---

రాజర్షేఇతి :- రాజర్షే। జనకమహారాజా। ధన్యః అసి = ధన్యుడవైతివి. పురాకిల = పూర్వమొకప్పుడు. పరమేశ్వర పరిచర్యా + అవదానే = శివుని సేవించుట అనునట్టి పవిత్ర కృత్యమునందు, నికృత్తేషు = ఖండింపబడినవైన. నవమూర్ధసు = తొమ్మిది శిరస్సులయందును_

పరమితి :- తాదృక్ = అటువంటి. కర్మ = తలలు నరికికొనుట అను పనియొక్క, అద్భుత = అద్భుతత్వము నకు. సదృశమ్ = సాటివచ్చునట్టి, వరమ్= వరము, కిమపి = ఏదియును, అప్రేక్ష్య = లభింపక - అంతటి వరమేదియు కన్పింపక పోవుటతో, పురవిజయినః = త్రిపుర విజేతయొక్క. ప్రరోహద్వైక్లవ్యమ్=పొటమరించుచున్న సిగ్గును. యేన = ఏ ముఖముతో. దదృశే = చూచెనో. తత్ = ఆ శివుని సిగ్గును, అస్మాత్కృష్టమ్=పోగొట్టుటకు, యేన=ఏ ముఖముతో. త్రిభువనమ్ అపి = లోకత్రయమే. ప్రార్థితమ్ = వరముగా అభ్యర్థింప బడినదో, తదేవ = అదే, దశమమ్ = పదియవదగు. రావణముఖమ్ = రావణుని వదనము. త్వయి = నీపట్ల, అర్థీభవతి = యాచకత్వము వహించుచున్నది. (శిఖరిణి)

తాత్పర్యము :- భక్తితో తొమ్మిది తలలను నరికివేసికొనుట అనునట్టి అత్యద్భుత కృత్యమునకు అనుగుణమగు వరము ఈయలేక సిగ్గుపడుచున్న శివుని చూచినదియు, త్రిభువనాధిపత్యమును వరముగా అడిగి శివుని సిగ్గును తొలగించినదియునగు రావణుని ఆ పదియవ శిరస్సు ఇప్పుడు నిన్ను యాచించుచున్నది.

సమాసములు :- తాదృశకర్మణః అద్భుతసదృశమ్. న ప్రేక్ష్య. ప్రరోహచ్చ తద్వైక్లవ్యంచ. త్రయాణాం భువనానాం సమాహారః. రావణస్య ముఖమ్.

శతానందః :- (ఉత్థాయ. నేపథ్యావలోకితకేన సహర్షాద్భుతమ్) పశ్యన్తు భవన్తః—

యస్మిన్నైరధనుష్మతో భగవతః ఖట్వాంగపాదేరసా
వారృష్టో గుణతాం గతోఽప్యహిపతిః కర్ణావతంసాయతే।
ఉన్ముక్తః పునరేవ భూషణపదం యాతి ప్రకోష్ఠాంతరే
(జనక ఔత్సుక్యం నాటయతి)
కాకుత్స్థేన తదేవ భార్గవగురోః కోదండమాకృష్యతే॥ 53

---

క్రియ :- దృశిర్ ప్రేక్షణే. లిట్. ఆత్మనే. ప్రథమ
దదృశే – దదృశాతే – దదృశిరే.

పశ్యన్త్వితి :- (ఉత్థాయ = లేచి, నేపథ్యావలోకితకేన=నేపథ్యములోనికి చూచుట నభినయించుచు, సహర్షాద్భుతమ్ = హర్షము అద్భుతము స్ఫురించునట్లు) భవన్తః = మీరందరును పశ్యన్తు = చూడుడీ।

యస్మిన్నితి :- ఏకధనుష్మతః=అద్వితీయ ధానుష్కుడును, భగవతః= మహాత్ముడునగు, ఖట్వాంగపాదేః = శివునియొక్క, యస్మిన్ = ఏ ధనుస్సునందు, గుణతామ్ = ప్రత్యంచారూపత్వమును, గతః = పొందినవాడై – అల్లెత్రాడుగా బిగింపబడినవాడై, అహిపతిః = ఆదిశేషుడు, ఆకృష్టః = ఎక్కుపెట్టబడి, కర్ణావతంసాయతే = శివునికి కర్ణభూషణమగుచున్నాడో, పునః = తిరిగి, ఉన్ముక్తః = ఎక్కుపెట్టిన బాణమును విడుచుటతో సడలింపబడినవాడై, ప్రకోష్ఠాంతరే = మణికట్టు పై భాగమున, భూషణపదమ్ = కంకణ స్థానమును – కంకణరూపమనుట, యాతి = పొందునో.

(జనకః = జనకుడు, ఔత్సుక్యమ్ = ఉత్సుకత్వమును, నాటయతి = నటించును) తత్ ఏవ = అదే, భార్గవగురోః = పరశురాముని గురువైన శివునియొక్క, కోదండమ్= ధనుస్సు, కాకుత్స్థేన = రఘురామునిచే, ఆకృష్యతే = ఎక్కుపెట్టబడుచున్నది. (శార్దూలము)

తాత్పర్యము :- శివధనుస్సునకు ఆదిశేషుడే అల్లెత్రాడు. ఎక్కుపెట్టగా అతడు శివునికి కర్ణభూషణమగును. విడిచిపెట్టగా కంకణమగును. అట్టి ధనుస్సును రాముడు ఎక్కుపెట్టుచున్నాడహో। చూడుడీ।

(నేపథ్యే)

లక్ష్మణః :- రుంధన్నష్ట విధేః శ్రుతీర్ముఖరయన్నష్టౌ దిశః క్రోడయ
న్మూర్తీరష్ట మహేశ్వరస్య దళయన్నష్టౌ కులక్ష్మాభృతః।
తాన్యక్ష్ణా బధిరాణి పన్నగకులాన్యష్టౌ చ సంపాదయ
న్నున్మీలత్యయమార్యదోర్బలదళత్కోదండకోలాహలః॥ 51

---

సమాసములు :- నితల్పనో ధనుష్మాన్ — తస్య. ఖట్వాంగం పాణౌ యస్య — తస్య. అహీనాం పతిః. భార్గవస్య గురుః - తస్య.

సంధులు :- యస్మిన్ + ఏవ - అనునాసికద్విత్వం. ధనుష్మతః + భగవతః, అకృష్టః + గుణతామ్ - ఉత్వాదేశవిసర్గ. పాదః + అసౌ - రేఫాదేశవిసర్గ. అసౌ + అకృష్టః - అయవాదేశసంధి. గతః + అపి — ఉత్వాదేశ - గతో + అపి - పూర్వరూప. అపి + అహి - యణాదేశ. కర్ణ + అవతంస, ప్రకోష్ఠ + అంతరే - సవర్ణదీర్ఘ. ఉత్ + మూర్తిః - అనునాసికాదేశ.

క్రియ :- అవతంస (ణిచ్) లట్. ఆత్మనే. ప్రథమ
అవతంసాయతే - అవతంసాయేతే - అవతంసాయన్తే
యా ప్రాపణే, పరస్మై, లట్, ప్రథమ
యాతి - యాతః - యాన్తి
కృషట్ విలేఖనే (కర్మణి) ఆత్మనే, లట్, ప్రథమ
అకృష్యతే — అకృష్యేతే — అకృష్యన్తే
(నేపథ్యే = తెరలో)

రుంధన్నితి :- విధేః = బ్రహ్మయొక్క, అష్ట = ఎనిమిదియగు, శ్రుతీః = చెవులను, రుంధన్ = బధిరపరచుచు, అష్టౌ = ఎనిమిదియగు, దిశః = దిక్కులను, ముఖరయన్ = మారుమ్రోగించుచు, మహేశ్వరస్య = శివునియొక్క, అష్ట = ఎనిమిదియగు, మూర్తీః = మూర్తులను (పృథివ్యాదులను - అష్టమూర్తి), క్రోడయన్ = వ్యాపించుచు (లోబడజేయుచు), అష్టౌ = ఎనిమిదియగు, కులక్ష్మాభృతః = కులపర్వతములను దళయన్ = చీల్చుచు, తాని = సుప్రసిద్ధములగు, పన్నగకులాని = సర్పవంశములను, అష్టౌ = ఎనిమిదింటిని, అక్ష్ణా = చూపుతో,

జనకః :- (సహర్షవిషాదాద్భుతమ్) కథం భగ్నమపి!
శతానందః :- వైదేహీకరబంధమంగళయజుస్సూక్తం ద్విజానాం ముఖే
నారీణాం చ కపోలకందళతలే శ్రేయానులూలుధ్వనిః ।

---

బధిరాణి = గ్రుడ్డివిగా, సంపాదయన్ = చేయుచు - పాములు కన్నులతో వినును కావున నిట్లు గ్రుడ్డి తనమే బధిరత్వము - అస్య = రామునియొక్క, దోర్బల = బాహుబలముచే, దళత్ = విశీర్ణమగుచున్న, కోదండ = శివధనుస్సుయొక్క, కోలాహలః = భీకరధ్వని(గుణధ్వని), అయమ్ = ఇదే, ఉన్మీలతి = విజృంభించుచున్నది. (శార్దూలము)

తాత్పర్యము :- రాముని చేతిలో విరిగిన శివధనుస్సు పెళపెళార్భటులు బ్రహ్మ చెవులకు చిల్లులు పెట్టినవి. దశదిశలను పిక్కటిల్లినవి. అష్టమూర్తిని వ్యాపించినవి. కులపర్వతములను పగిల్చినవి. అష్టసర్పకులములను బధిరపరచినవి. ఇటు పాతాళమునకు అటు బ్రహ్మ లోకమునకు వ్యాపించినవనుట.

సంధులు :- కుంభన్ + అష్ట, ముఖంయన్ = అష్టౌ దళయన్ + అష్టౌ, సంపాదయన్ + ఉన్మీలయన్ - అనునాసికద్విత్వసంధి. శ్రుతిః + ముఖ. మూర్తిః + అష్ట - రేఫాదేశవిసర్గ. తాని + అష్ట. కులాని + అష్టౌ - యణాదేశ. ఉత్ + మీలతి - అనునాసికాదేశ.

క్రియ :- మీల నిమేషణే. లట్, పరస్మై, ప్రథమ
మీలతి - మీలతః - మీలన్తి

కథమితి :- (సహర్షవిషాదాద్భుతమ్ = ఆనందము విషాదము అద్భుతములు స్ఫురించునట్లు) కథమ్ = ఎట్లూ! భగ్నమపి = విరిగినది కూడనా!

వైదేహీతి :- రామ = శ్రీరామునిచే, భగ్న = భగ్నముగావింపబడిన, మహోక్షలాంఛనధనుర్దంభోళిజన్మా - మహోక్షలాంఛన = శివునియొక్క, ధనుః = ధనుస్సు అనునట్టి దంభోళి = వజ్రాయుధము నుండి, జన్మా = పుట్టినదైన, రవః = ఈ ధ్వని, ద్విజానామ్ = బ్రాహ్మణులయొక్క, ముఖే = వదనమునందు, వైదేహీ = సీత యొక్క, కరబంధ = వివాహ సమయమునందలి, మంగళ = శుభప్రదమైన యజుస్సూక్తమ్ = యజుర్వేదమంత్రమై, నారీణామ్ = ప్రేక్షక స్త్రీలయొక్క, కపోల

పేష్టుం చ ద్విషతాముపశ్రుతిశతం మధ్యేనభో జృంభతే
రామాకృష్టమహోక్షలాంఛనధనుర్దంభోళిజన్మా రవః॥ 55

కౌశికః :- (సవిషాదాద్భుతమాత్మగతమ్) అహో! దురాత్మనః క్షత్రియస్ఫులింగస్య సర్వకర్మీణమాశ్చర్యాయితమ్.

---

కందళతతే = చెక్కిళుల గుంపుల యందు. శ్రేయాన్ = మంగళప్రదమగు. ఉలూలుధ్వనిః = ఉలూలూ అను ధ్వనియై. ద్విషతామ్ = శత్రువులయొక్క, పేష్టుమ్ = పిండిచేయుటకు. ఉపశ్రుతిశతమ్ = [అమంగళ సూచక] శకున వాక్యముల శతకమై మధ్యేనభః = ఆకాశ మధ్యభాగమున, జృంభతే = విజృంభించుచున్నది. (శార్దూలము)

తాత్పర్యము :- శ్రీ ధనుర్భంగ ధ్వని బ్రాహ్మణ వదనములయందు వైదేహీ వైవాహిక మంత్రమై, నారీముఖములయందు శుభ సూచకమగు ఉలూలు ధ్వనియై, శత్రువులకు అశకున వాక్యమై విజృంభించుచున్నది. ఉలూలు ధ్వని ఓఢ్ర సంప్రదాయము. (ద్విషతః పేష్టుమ్ = శత్రువుల నావరించుటకు అని పాఠాంతరము).

సమాసములు :- వైదేహ్యాః కరబంధః — మంగళం చ తద్యజుస్సూక్తం చ - కరబంధే సూక్తమ్. కపోలానామ్ కందళః — కందళస్య తతే ఉపశ్రుతీనాం శతమ్ - అథవా - శ్రుతిశతస్య సమీపమ్ నభసః మధ్యే (పారేమధ్యే షష్ఠ్యా వా). రామేణ కృష్టమ్ - మహోక్షలాంఛనస్య ధనుః - ధనురేవ దంభోళిః - దంభోళేః జన్మ యస్య సః.

క్రియ :- జృభిః గాత్రవినామే, ఆత్మనే, లట్, ప్రథమ.
జృంభతే - జృంభేతే - జృంభన్తే

అలంకారము :- ఒకే ధనుర్ధ్వని యజుస్సూక్తముగను, ఉలూలుధ్వనిగను, శత్రువులకు ఉపశ్రుతి శతముగను వర్ణింపబడుట నుల్లేఖము. బహుభిర్బహుధోల్లేఖాదేకస్యోల్లేఖ ఇష్యతే.

అహో ఇతి :- (సవిషాదాద్భుతమ్ = విషాదముతో ఆశ్చర్యముతో, ఆత్మగతమ్ = తనలో) అహో! దురాత్మనః = దురాత్ముడగు. క్షత్రియ స్ఫులింగస్య = రాజవంశమునందు పుట్టిన విస్ఫులింగమువంటివాడగు శ్రీ రామునియొక్క, సర్వకర్మీణమ్

జనకః :- (సహర్షం పాదయోర్నిపత్య) భగవన్. కుశికనందన.

ఇయమాత్మగుణేనైవ క్రీతా రామేణ మైథిలీ ।

స్వగృహవ్యవహారస్తు లక్ష్మణాయోర్మిళాస్తు నః॥ 56

విశ్వామిత్రః :- (సస్మితమ్) సఖే. సీరధ్వజ. యదభిరుచితం భవతే.

శతానందః :- (జనకకర్ణే ఏవమేవం కథయిత్వా) భగవన్విశ్వామిత్ర.

మమాపి చంద్రశేఖరశరాసనారోపణప్రథమప్రియవాదినః

పారితోషికం ధారయసి.

---

= సర్వకార్యములను సాధించుటకు సమర్థమగు. ఊర్జస్వితమ్ = తేజస్విత్వము - అహో ;

ఇయమితి :- (సహర్షమ్ = ఆనందములో. పాదయోః నిపత్య = పాదములపైపడి) మహాత్మా ; విశ్వామిత్రా ; రామేణ = రామునిచే, ఇయమ్ = ఈ, మైథిలీ = సీత. ఆత్మగుణేన ఏవ = స్వబాహు పరాక్రమముచేతనే, క్రీతా = ఆర్జింపబడినది. స్వగృహవ్యవహారః తు = నా గృహస్థధర్మముగా (కన్యాదానము), లక్ష్మణాయ = సౌమిత్రికై, నః = మా ఔరసి. ఊర్మిళా = ఊర్మిళ, అస్తు = అగుగాక ; (పథ్యావక్త్రము).

తాత్పర్యము :- రాముడు సీతను గెలుచుకొన్నాడు కావున కన్యాదానమవసరపడదు. గృహస్థధర్మముగా కన్యాదానఫలము నాకు దక్కవలెనన్నచో సౌమిత్రికి ఊర్మిళ భార్యయగుగాక ; (వ్యవహారాయ అని పాఠాంతరము)

సఖేఇతి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) సఖే = మిత్రమా ; సీరధ్వజా ; భవతే = నీకు, యత్ అభిరుచితమ్ = ఏది ఇష్టమో అట్లే ;

భగవన్నితి :- (జనకకర్ణే = జనకుని చెవిలో, ఏవమ్ ఏవమ్ = ఇట్లు ఇట్లని ఏదో, కథయిత్వా = చెప్పి) భగవన్ = మహాత్మా ; విశ్వామిత్ర = కౌశికా ; చంద్రశేఖర = శివునియొక్క, శరాసన = ధనుస్సుయొక్క, ఆరోపణ = ఎక్కువెట్టుటరూపమైన, ప్రథమప్రియవాదినః = ప్రియమును మున్ముందట చెప్పినవాడనగు, మమ అపి = నాకుగూడ. పారితోషికమ్ = బహుమానమును, ధారయసి = బాకీపడితివి - ఈవలసియుంటి వనుట.

విశ్వామిత్రః :- (విహస్య) వత్స. దీయతే. కిమభిప్రైషి.

శతానందః :- కుశధ్వజదుహితృభ్యాం మాండవీశ్రుతకీర్తిభ్యాం భరతశత్రుఘ్నావభ్యర్థయే.

విశ్వామిత్రః :- ఏవమస్తు. (శతానందం హస్తే గృహీత్వా సస్మితమ్) వత్స, సర్వమస్మాభిర్విధాతవ్యమ్. ఆగమయస్వ తావద్దశరథమ్.

జనకః :- తర్హి ప్రహీయతామేష ఏవ భగవానాంగిరసః ప్రియసుహృద ముత్తరకోసలేశ్వరమానేతుమ్.

విశ్వామిత్రః :- ఏవమస్తు.

---

వత్సేతి :— (విహస్య = నవ్వి). వత్స = నాయనా! దీయతే = ఈయబడు చున్నది - ఇత్తుననుట. కిమ్ అభిప్రైషి = ఏమికోరుకొనుచుంటివి?

కుశధ్వజేతి :— కుశధ్వజదుహితృభ్యామ్ = కుశధ్వజుని తనయలగు, మాండవీశ్రుతకీర్తిభ్యామ్ = మాండవీ శ్రుతకీర్తులకై. భరతశత్రుఘ్నౌ = భరత శత్రుఘ్నులను. అభ్యర్థయే = కోరుచున్నాను.

ఏవమితి :- ఏవమ్ అస్తు = అట్లే అగుగాక! (శతానందుని, హస్తే గృహీత్వా = చేతిలోనికి తీసికొని - అతనిచేయి మృదువుగా తన చేతిలోనికి తీసికొని అనుట - సస్మితమ్ = చిఱునవ్వుతో) వత్స = నాయనా! అస్మాభిః = మనచే, సర్వమ్ = అంతయును, విధాతవ్యమ్ = నిర్వహింపబడవలసి యున్నది - అన్ని మర్యాద లను పద్ధతులను మనము పాటింపవలెననుట. తావత్ = అందుచే, దశరథమ్ = దశరథుని, ఆగమయస్వ = రప్పింపుము, అతనితో సంప్రదించి నిర్వహింతమనుట.

తర్హీతి :- తర్హి = అయినచో. ప్రియసుహృదమ్ = ప్రియమిత్రుడగు, ఉత్తరకోసలేశ్వరమ్ = దశరథుని, ఆనేతుమ్ = తీసికొనివచ్చుటకు, ఏషః = ఈ, భగవాన్ = మహాత్ముడగు, ఆంగిరసః ఏవ = శతానందుడే, ప్రహీయతామ్ = పంపబడు గాక! వెడలునుగాక యనుట.

ఏవమితి :- ఏవమ్ అస్తు = అట్లే అగుగాక!

శతానందః :- (ఉత్థాయ) భగవన్. కిమన్యదధికమస్తి వాచికమ్.
విశ్వామిత్రః :- వత్స. నిసృష్టార్థోఽసి. గమ్యతామ్.
(ఇతి శతానందో నిష్క్రాంతః)
విశ్వామిత్రః :- (హర్షం నాటయన్నాత్మగతమ్)
దోర్లీలాదళితేందుశేఖర ధనుర్విఖ్యాత విక్రాంతినా
కాకుత్స్థేన కృతో విదేహనృపతిః పూర్ణ ప్రతిజ్ఞాభరః।
పశ్యామశ్చ సుహృద్గృహాన్నవనవోన్మీలద్వివాహోత్సవాన్
ఇక్ష్వాకేషు చ మైథిలేషు చ ఫలత్యస్మాకమద్యాశిషః ॥ 57

---

భగవన్నితి :- (ఉత్థాయ = లేచి) భగవన్ = మహాత్మా। అన్యత్ అధికమ్ = ఇంతకన్న అధికముగా వేరొకటి. వాచికమ్ = దశరథునికి చెప్పవలసిన సందేశము. కిమ్ అస్తి = ఏదేని ఉన్నదా।

వత్సేతి :- వత్స = నాయనా। శతానందా। నిసృష్టార్థః = నిసృష్టార్థుడు అనునట్టి దూతవు. అసి = అయితివి. గమ్యతామ్ = పోయిరమ్ము. ఇరువైపులవారి భావములను గ్రహించి స్వయముగా సమాధానములు చెప్పి కార్యమును సాధించుకొని వచ్చు దూతను నిసృష్టార్థుడందురు — ఉభయోర్భావమున్నీయ స్వయం వదతి చోత్తరం సుశ్లిష్టం కురుతే కార్యం నిసృష్టార్థస్తు సః స్మృతః—సాహిత్య దర్పణము. సంధ్యాది కుశలో దూతో నిసృష్టార్థ ఇతీర్యతే.

(ఇతి = అంతట. శతానందుడు, నిష్క్రాంతః = నిష్క్రమించును)

దోర్లీలేతి :- (హర్షమ్ = సంతోషమును. నాటయన్ = అభినయించుచు. ఆత్మగతమ్ = తనలో) దోర్లీలా = భుజవిలాసముచేత. దళిత = ఖండింపబడిన. ఇందు శేఖరధనుః = శివధనుస్సుచే. విఖ్యాత = ప్రసిద్ధికెక్కిన (మిక్కిలినుతిగన్న). విక్రాంతినా = పరాక్రమముకలవాడగు. కాకుత్స్థేన = రామునిచే. విదేహనృపతిః = జనకమహారాజు. పూర్ణప్రతిజ్ఞాభరః = నెరవేరిన ప్రతిజ్ఞా సర్వస్వము కలవాడుగా, కృతః = చేయబడినాడు. సుహృద్గృహాన్ = మిత్రుల గృహములను, నవనవోన్మీల ద్వివాహోత్సవాన్ = నవనవముగా వికసించుచున్న వివాహ కౌతుకములు కలవిగా.

శౌష్కలః :- (వైలక్ష్యరోషాభ్యాం స్మయమానః) భోః సీరధ్వజ, పురుష
ప్రకర్షాధానే హి విద్యావృద్ధ సంయోగాత్ బహిరంగాని వయాంసి.
యదనయా ప్రహీణలబ్ధవిస్యయా యౌనసంబంధోపస్థితం

---

పశ్యామః = చూతుము. ఇక్ష్వాకేషు = ఇక్ష్వాకు వంశస్థుల యందును. చ = మరియు. మైథిలేషు = జనక వంశస్థులయందును, అస్మాకమ్=మాయొక్క. ఆశిషః = దీవెనలు. అద్య = నేడు. ఫలన్తి = ఫలించుచున్నవి. (శార్దూలవిక్రీడితము).

తాత్పర్యము :- అవలీలగా శివధనుస్సును ఖండించుటతో రాముని పరాక్రమము జగద్విఖ్యాతి నందినది. జనకుని ప్రతిజ్ఞ నెరవేరినది. ఇక ప్రియమిత్రుల గృహములలో నవనవోన్మేషమగు పెండ్లిండ్లను చూతుము. రెండు వంశములకును మా ఇచ్చిన దీవెనలు నేడు ఫలించుచున్నవి.

సమాసములు :- దోర్లీలయా దళితమ్ - ఇందుశేఖరస్య ధనుః-ధనుషా విఖ్యాతా - విఖ్యాతా విక్రాంతిర్యస్య సః - తేన. విదేహానాం నృపతిః.పూర్ణః ప్రతిజ్ఞా భరః యస్య సః. సుహృదో గృహాన్. నవనవోన్మీలంశ్చ సః వివాహోత్సవః యత్ర తాన్.

సంధులు :- ధనుః + విఖ్యాత - రేఫాదేశవిసర్గ. కృతః + విదేహ - ఉత్వాదేశవిసర్గ. పశ్యామః + చ - శాదేశవిసర్గ. ఉత్ + మీలత్ - అనునాసికాదేశ. ఫలన్తి + అస్మాకమ్ - యణాదేశ. అద్య + ఆశిషః - సవర్ణదీర్ఘసంధి.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే. పరస్మై. లట్. ఉత్తమ
పశ్యామి - పశ్యావః - పశ్యామః
ఫల నిష్పత్తౌ. లట్. పరస్మై. ప్రథమ.
ఫలతి - ఫలతః - ఫలన్తి

భోఇతి :- (వైలక్ష్యరోషాభ్యామ్=సిగ్గ కోపములతో. స్మయమానః = నవ్వుచు) భోః = ఓయీ! సీరధ్వజ = జనకా! పురుష = పురుషునికి. ప్రకర్ష = గుణాతిశయమును. ఆధానే = సంపాదించి పెట్టుటయందు. వయాంసి = వయస్సులు. విద్యావృద్ధ సంయోగాత్ = విద్యాధిక సంసర్గము కంటె. బహిరంగాని హి = అప్రధానములు గదా! - విద్యావృద్ధత్వమే ప్రకర్షాధాయకమనియు. వయోవృద్ధత్వము కాదనియు

పులస్త్యకులముపేక్షమాణో వర్షీయానపి కోమలప్రజ్ఞోఽసి. (మునిం ప్రతి) కౌశిక, నాద్యాపి కించిదతిక్రామతి. తవాపి లంకాపతౌ తాడకావధాపరాధ మపమార్ష్టుమయమేవావసరః. (కౌశికస్తత్రావజ్ఞాం నాటయతి)

జనకః :- భగవన్, ఏహి. స్వయముపేత్య రామచంద్ర వదనచంద్ర చంద్రికా ప్రవాహేణ నిర్వాపయామి తావదళీకధనుర్ధర సహస్ర ప్రార్థ్యమాన మైథిలీ కదర్థితమాత్మానమ్. నహి మిహిర మరీచి నిచయ పచేళిమస్య తుహినకరబింబ సంవాదాదపరోఽపి కశ్చిదగదంకారః కైరవాకరస్య.

---

తాత్పర్యము. యత్ = ఏలయని, ప్రహీణలబ్ధకన్యయా = అస్వామిక ధనముగా లభించిన కన్యయగు. (ప్రహీణమ్ = అస్వామిక ధనము. నిస్సార క్షేత్రము). అనయా = ఈ జానకిచేత. యౌన సంబంధోపస్థితమ్ = వివాహసంబంధమును గోరి వచ్చిన. పులస్త్యకులమ్ = పులస్త్య బ్రహ్మపుత్రుని. ఉపేక్షమాణః = ఉపేక్షించినవాడవై తిరస్కరించి అనుట, వర్షీయాన్ అపి = వృద్ధుడవయ్యును. కోమలప్రజ్ఞః అసి = మందమతివైతివి. (మునింప్రతి = విశ్వామిత్రునితో) కౌశిక = విశ్వామిత్రా। అద్యాపి= ఇప్పటికిని, కించిత్ న అతిక్రామతి = మించిపోయినది లేదు. తాడకావధాపరాధమ్ = తాడకా సంహారరూపమగు నీ అపచారమును. లంకాపతౌ = రావణునిపట్ల. అపమార్ష్టుమ్ = పోగొట్టుకొనుటకు. అయమ్ ఏవ = ఇదే. అవసరః = తగిన అవకాశము. (కౌశికః = విశ్వామిత్రుడు, తత్ర = ఆ మాటపట్ల, అవజ్ఞానమ్ = అవమానమును, నాటయతి = ప్రదర్శించును)

భగవన్నితి :- భగవన్ = మహాత్మా। ఏహి = రమ్ము. అళీకధనుర్ధర సహస్ర = వ్యర్థధానుష్కుల సమూహముచేత (మిథ్యావీరులనుట) ప్రార్థ్యమాన = అభిలషింపబడిన, మైథిలీ = జానకివలన, కదర్థితమ్ = దుఃఖితమైన, ఆత్మానమ్ = (నన్ను) నా హృదయమును - వృథాహంకారులు జానకిని కోరుటతో కలిగిన నా దుఃఖముననుట, స్వయమ్ ఉపేత్య = నేనుగా సమీపించి, రామచంద్ర = రాముని యొక్క, వదనచంద్ర = ముఖ చంద్రునియొక్క, చంద్రికా = వెన్నెలయొక్క,

(ఇత్యుత్థాయ పరిక్రామతః)

శౌష్కలః :- (సఖేదమాకాశే) హా తపస్విని సీతే. హతాసి. పౌలస్త్య ప్రార్థితాపి విచార్యసే.

త్రిభువన విజయశ్రియః సపత్నీం
జనయతు కో భవతీమనాత్మతంత్రామ్ ।
స్వజనమపి న తే నిరూపయామః
కిమపి విపాట్య భువం వినిర్గతాసి ॥ 58

---

ప్రవాహేణ = ప్రవాహముతో, నిర్వాపయామి = ఉపశమింపజేసికొందును. మిహిర = సూర్యునియొక్క, మరీచి నిచయ = కిరణసముదాయముచే. పచేళిమస్య = పక్వమైన (తప్తమైన అనుట). కైరవాకరస్య = కలువల సరస్సునకు, తుహిన కరబింబ సంవాదాత్ = చంద్రబింబముతోడి పరిచయముకన్న, సంపర్కముకన్న, అపరః = వేరొకడు అగదంకారః = వెజ్జు, నహి = అసంభవముగదా । చంద్రస్పర్శయే వైద్యుడనుట.

[ ఇతి = అని, ఉత్థాయ = లేచి, పరిక్రామతః = నడుతురు ]

హేతి :- [సఖేదమ్ = దిగులుతో, ఆకాశే = మింటివైపు చూచుచు].
హా = అయ్యో । తపస్విని = తపస్వినీ । సీతే = జానకీ । హతాసి = చచ్చితివి - వివేకశూన్యుడగు నీ తండ్రిచే నష్టపోయితివనుట. పౌలస్త్యప్రార్థితా అపి = రావణు నంతటి వానిచే అభిలషింపబడిన దానవయ్యును, విచార్యసే = ఆలోచించుచున్నావు.

త్రిభువనేతి :- అనాత్మతంత్రామ్ = పరాధీనురాలవగు, భవతీమ్ = నిన్ను, త్రిభువన విజయశ్రియః= త్రిలోక జయలక్ష్మికి. సపత్నీమ్ = సవతినిగా, కః= ఎవడు, జనయతు = చేయును - చేయవలసిన తండ్రియే చేయుటకు అంగీకరించుట లేదు అనుట. తే = నీకు, స్వజనమ్ అపి = సోదరులు మున్నగు వారినైనను, న నిరూపయామః = నిరూపింపలేకున్నాము - తండ్రి నెదిరించి నీకు పెండ్లిసేయుటకు స్వజనులు లేరు. కిమపి = ఏదో, భువమ్ = నేలను, విపాట్య = చీల్చుకొని, నిర్గతా అసి = జన్మించితివి.

తాత్పర్యము :- త్రిలోక జయలక్ష్మికి నిన్ను సవతిని చేయుటకు ఎవరున్నారు. నీవా పరాధీనురాలవు. సోదరాదులా లేరు - భూమిని చీల్చుకొని జన్మించితి వటగదా!

(సరోషం జనకం ప్రతి) సీరధ్వజ.

పౌరాణీభిరనేక విక్రమకథాగాథాభిరర్థాపితా
స్తే వీరస్య జయన్తి రాక్షసపతేర్దోః స్తంభదంభోళయః।
యానుత్ప్రేక్ష్య విశోషయన్మదమయం మైరేయమైరావణో
భూషాస్రగ్భిరభూదమాత్యమధుపశ్రేణీషు సాధారణః ॥ 59

---

సమాసములు :- త్రిభువనస్య విజయః - విజయ ఏవ శ్రీః - తస్యాః. న ఆత్మపరతంత్రా - తామ్.

క్రియ :- జనీప్రాదుర్భావే (ణిచ్) లోట్. పరస్మై. ప్రథమ.
జనయతు/జనయతాత్ - జనయతామ్ - జనయన్తు

పౌరాణీభిరితి :- (సరోషమ్ = రోషముగా, జనకునితో) సీరధ్వజః - పౌరాణీభిః = పురాతనములగు, అనేక = బహుప్రకారములగు, విక్రమ కథా = పరాక్రమ కథల రూపమున నున్న, గాథాభిః = స్తుతులచేత, అర్థాపితాః = వాఖ్యాతములైన, వీరస్య = మహావీరుడగు, రాక్షసపతేః = రావణునియొక్క, తే = ఆ, దోః స్తంభ దంభోళయః = స్తంభములవంటి బాహువులనునట్టి వజ్రాయుధములు, జయన్తి = విరాజిల్లుగాక! యాన్ = ఆ బాహువులను, ఉత్ప్రేక్ష్య = తేరిచూచి, మదమయమ్ = మదరూపముననున్న, మైరేయమ్ = మద్యమును, విశోషయన్ = ఇట్టింక జేసికొనుచు, ఐరావణః = ఇంద్రగజము [ఐరావతము], భూషాస్రగ్భిః = అలంకారములైన పూలదండలతో, అమాత్య మధుపశ్రేణీషు - అమాత్య = వెన్నంటి తిరుగుచున్న, మధుపశ్రేణీషు = తుమ్మెదల గుంపులయందు, సాధారణః = సర్వసాధారణమగు ఒక ఏనుగుగా మారెను. [అమర్త్య మధుప-అని పాఠాంతరము].

తాత్పర్యము :- అనేక విజయగాథలతో స్తుతింపబడు రావణ భుజ వజ్రములకు శుభమగుగాక! అతని భుజములను చూచి ఐరావతమునకు మదస్రావమాగిపోయినది - ఇంకిపోయినది. కేవలము పూలదండలతో అదిప్పుడు తుమ్మెదల దృష్టిలో తక్కిన సర్వసాధారణ గజములవంటిదే అయిపోయినది. [శార్దూలము].

సమాసములు :- విక్రమస్య కథాః ఏవ గాథాః - అనేకాశ్చ తా గాథాశ్చ

తేషు చ సత్సు—

వృథా సజ్జన సంబంధ సత్కారేణాపి వంచితః ।
పౌలస్త్య హస్తవర్తిన్యా సీతయా తు భవిష్యతే ॥ 60

(సాక్షేపం చ నేపథ్యాభిముఖమవలోక్య)

---

ఆఖిః. రాక్షసానాం పతిః - తస్య. దోః స్తంభా ఏవ దంభోళయః. అమాత్యాశ్చ తే మధుపాశ్చ — మధుపానాం శ్రేణీషు.

క్రియ :- జి జయే, లట్, పరస్మై. ప్రథమ
జయతి — జయతః - జయన్తి

వృథేతి :— తేషు చ సత్సు = అవి యట్లుండగా - సజ్జన = సజ్జనుడైన రావణునితో. సంబంధ = వివాహసంబంధమునున్నట్టి సత్కారేణ = గౌరవముతో, వృథా = వ్యర్థముగా. వంచితః అపి = వంచితుడవైతివి - ఆ సంబంధమును వృథాగా కోల్పోయితివనుట. తు = కాని. సీతయా = ఈ జానకిచేత, పౌలస్త్య = రావణుని యొక్క, హస్తవర్తిన్యా = చేతచిక్కినదిగానే. భవిష్యతే = కానున్నది. సీతాదేవి రావణునికి చేచిక్కుట తప్పదనుట. వృథా + అసజ్జన అను విరుపుతో రామ సంబంధమున మోసపోయితివనియు కొందరన్వయించిరి.

తాత్పర్యము :— జనకా! రావణ సంబంధమును వృథాగా పోగొట్టుకొంటివి, కాని రేపు సీత రావణునికి చేజిక్కుట తథ్యము, బలాత్కరించుననుట.

సమాసములు :— సజ్జనేన సంబంధః - సంబంధః ఏవ సత్కారః - తేన. హస్తే వర్తత ఇతి - పౌలస్త్యస్య హస్తవర్తినీ — తయా.

క్రియ :— భూ సత్తాయామ్. భావే లృట్. ఆత్మనే ప్రథమ
భవిష్యతే — భవిష్యేతే — భవిష్యన్తే

(సాక్షేపమ్ = ధిక్కారముతో - సభర్త్సనముగా - నేపథ్యాభిముఖమ్ = తెరవైపు. అవలోక్య = చూచి].

సమంతాదితి :— సమంతాత్ = అన్నివైపులయందును. ఉత్తాలైః = ఉన్నతముగా వ్యాపించినవగు. సురసహచరీచామర మరుత్తరంగైః - సురసహచరీ =

సమంతాదుత్తాలై స్సురసహచరీచామరమరు
త్తరంగై రున్మీలద్భుజపరిఘ సౌరభ్య శుచినా ।
స్వయం పౌలస్త్యేన త్రిభువనభుజా చేతసి కృతా
మరే రామ త్వం మా జనకపతిపుత్రీ ముపయథాః ॥ 61

---

దేవతా స్త్రీలయొక్క. చామర = వింజామరలనుండి వెలువడుచున్న, మరుత్తరంగైః= వాయువీచికలచేత, ఉన్మీలత్ = వికాసము పొందుచున్న. భుజపరిఘ = పరిఘలవంటి (ఆయుధవిశేషము) బాహువులయొక్క, సౌరభ్య = ప్రతాప సుగంధముతో, శుచినా = పవిత్రుడును - గుబాళించువాడు వనుట. త్రిభువన భుజా = ముల్లోకములకు పరిపాల కుడునగు, పౌలస్త్యేన = రావణునిచేత, స్వయమ్ = స్వయముగా, చేతసి కృతామ్ = వాంఛింపబడినదగు, జనకపతి పుత్రీమ్ = జానకిని, అరే = ఓరీ। రామ = దాశరథీ ! త్వమ్ = నీవు, మా ఉపయథాః = వివాహమాడకుము.

తాత్పర్యము :- దేవకాంతలు వీచుచున్న వింజామరలచే దశదిశలకు వ్యాపించుచున్న భుజబల పరిమళములుకలవాడై, త్రిలోక విజేతయై రావణుడు స్వయముగా మనసుపడిన సీతను ఓరీ రామా ! నీవు పరిణయ మాడకుము - అది నీకు శుభప్రదము కాదనుట.

సమాసములు :- సురాణాం సహచర్యః - సురసహచరీణాం చామరాః చామరాణాం మరుత్తరంగాః - తైః, భుజాః పరిఘా ఇవ — పరిఘానాం సౌరభ్యమ్— ఉన్మీలచ్చ తత్ భుజపరిఘ సౌరభ్యం చ - సౌరభ్యేన శుచిః - తేన, త్రయాణాం భువనానాం సమాహారః — త్రిభువనం భునక్తీతి - త్రిభువనభుక్ — తేన [క్విప్చ]. జనకానాం పతిః [జనకశ్చాసౌ పతిశ్చ రాజా] - జనకపతేః పుత్రీ - తామ్.

సంధులు :— తరంగైః + ఉన్మీలత్ — రేఫాదేశవిసర్గ. ఉత్ + మీలత్ - అనునాసికాదేశ.

క్రియ :- యమ ఉపయమే - ఉపాద్యమః స్వకరణే ఇత్యాత్మనే, లుఙ్, మధ్యమ

(సవిమర్శమాత్మగతమ్) అహో! గంభీరమిదముపస్థితం వస్తు. తన్మంత్రిణం మాల్యవంతమేవ పురస్కృత్య లంకేశ్వరస్య నివేదయామి. (ఇతి నిష్క్రాంతాః సర్వే)

—: ఇతి పినాకభంగో నామ తృతీయోఽఙ్కః :—

---

ఛందస్సు :- శిఖరిణీవృత్తము. రసై రుద్రైశ్ఛిన్నా యమనసభలాగ శిఖరిణీ.

| య | మ | న | స | భ | లగ |
|---|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I I | I U |
| సమంతా | దుత్తాలైః | సురస | హచరీ | చామర | మరుత్ |

అహో ఇతి :- (సవిమర్శమ్ = సాలోచనగా, ఆత్మగతమ్ = తనలో) అహో! ఇదమ్ = ఈ. ఉపస్థితమ్ = జరిగినట్టి, వస్తు = కథ-శివధనుర్భంగాదికము, గంభీరమ్ = అతిగహనమైనది. తత్ = అందుచేత, మంత్రిణమ్ = మంత్రియగు, మాల్యవంతమ్ ఏవ = మాల్యవంతునే. పురస్కృత్య = ముందుంచుకొని — కలుపుకొని, లంకేశ్వరస్య = రావణాసురునికి. నివేదయామి = విన్నవింతును. ( ఇతి = అని, సర్వే = అందరును, నిష్క్రాంతాః = నిష్క్రమింతురు).

—: ఇది పినాకభంగమను తృతీయాంకము :—



# అనర్ఘరాఘవమ్

## చతుర్థోఽఙ్కః

(తతః ప్రవిశతి మాల్యవాన్)

మాల్యవాన్ :- (జృంభమాణశ్చక్షుషీ పరిమృజ్య) అయే, విభాతైవ విభావరీ. తథా హి—

స్తోకోన్నిద్ర నిదాఘదీధితి మహ స్తంద్రాలు చంద్రాతపా
స్తాయ న్తే కకుభో రథాంగగృహిణీగార్హస్థ్యగర్హాభిదః ।
అద్యాపి స్వకులాయశాఖిశిరసి స్థిత్వా రువన్తో ముహు
స్తూష్ణీం ప్రత్యభిజానతే బలిభుజో భీతాః స్వయూథ్యస్వరాన్ ॥ 1

---

(తతః = అంతట, మాల్యవాన్ = మాల్యవంతుడు, ప్రవిశతి = ప్రవేశించును)

అయేఇతి :- (జృంభమాణః = ఆవులించుచు, చక్షుషీ = కన్నులను, పరిమృజ్య = నలుపుకొనుచు) అయే = అహో ! విభావరీ = రాత్రి, విభాతా ఏవ = తెల్లవారినదే, తథాహి = అవునుగదా ।

స్తోకేతి :- స్తోక = కొంచెముగా, ఉన్నిద్ర = వికసించుచున్న, నిదాఘ దీధితి = సూర్యునియొక్క, మహః = కాంతితో, తంద్రాలు = వికాసము కోల్పోయిన, చంద్రాతపాః = వెన్నెల కలవియు, రథాంగగృహిణీ = ఆడు చక్రవాకము యొక్క గార్హస్థ్య = గృహస్థజీవితమునందు — సంసారమునందేర్పడిన, గర్హా = విరహరూపమగు దురవస్థను, భిదః = పోగొట్టునవియునై, కకుభః = దిక్కులు (దిశస్తు కకుభః కాష్ఠాః— అమరము), తాయ న్తే = విస్తృతిని పొందుచున్నవి - స్పష్టపడుచున్నవనుట. అద్య అపి = ఇప్పటికిని, స్వకులాయశాఖి = తన గూడున్నచెట్టుయొక్క, శిరసి = అగ్రభాగమునందు, స్థిత్వా = నిలిచి, బలిభుజః = కాకులు, (కులాయో నీడమస్త్రియామ్, కాకే తు కరటారిష్టబలిపుష్ట సకృత్ప్రజాః — అమరము), ముహుః=మాటిమాటికిని, రువ న్తః=

ప్రాచీం వాసరసృష్టికా ముపగతే భానౌ దిశాం వల్లభే
పశ్యైతా రుచయః పతంగదృషదామాగ్నేయనాదింధమాః।

---

అరుచుచు, భీతాః = భయపడినవై. తూష్ణీమ్ = ఒక్కసారిగా మిన్నకుండి, స్వయూథ్య స్వరాన్ = తమ జట్టు కాకుల గొంతులను, ప్రత్యభిజానతే = గుర్తించుచున్నవి. (శార్దూలము)

తాత్పర్యము :— సూర్యకాంతులు ఉదయించుటతో చంద్రకాంతులు వెల వెల బోవుచున్నవి. దిక్కులు స్పష్టపడుచున్నవి. చక్రవాకములకు విరహావస్థ తొలగిపోవుచున్నది. కాకులు తమ గూడులున్న చెట్లపై నిలిచి బిగ్గరగా అరుచుచు ఒక్కొక్కసారి భయపడి మిన్నకుండి తమ జట్టు కాకుల గొంతులను గుర్తించు చున్నవి.

సమాసములు :_ స్తోకం చ తదున్నిద్రం చ — నిదాఘపీడితైః మహః — స్తోకోన్నిద్రం చ తన్నిదాఘపీడితమహాశ్చ — మహాంసి తంద్రాలసః - తంద్రాలసః చంద్రాతపాః యాసు తాః. రథాంగస్య గృహిణీ - గృహిణ్యాః గార్హస్థ్యమ్ - గార్హస్థ్యే గర్హా — గర్హాయాః భిదః. స్వకులాయస్య ఆశ్రయః శాఖీ - శాఖినః శిరః — తస్మిన్. స్వయూథ్యానాం స్వరాన్.

సంధులు :_ ఉత్ + నిద్ర - అనునాసికాదేశ. స్తోక + ఉన్నిద్ర - గుణ సంధి. చంద్ర + ఆతపాః, రథ + అంగ, అద్య + అపి — సవర్ణదీర్ఘ. ఆతపాః + తాయన్తే, మహః + తూష్ణీమ్ - సాదేశవిసర్గ. శిరసః + రథాంగ. రువన్తః + ముహుః, బలిభుజః + భీతాః - ఉత్వాదేశవిసర్గ. ప్రతి + అభి - యణాదేశ.

క్రియ :— తాయృఙ్ సంతానపాలనయోః, ఆత్మనే, లట్, ప్రథమ.

తాయతే — తాయేతే — తాయన్తే

జ్ఞా అవబోధనే (సంప్రతిభ్యామనాధ్యానే - ఇతి తఙం విధాయ పశ్చాదభినా సంబంధః) ఆత్మనే, లట్, ప్రథమ.

ప్రతి + అభి + జానీతే - జానాతే - జానతే

ప్రాచీమితి :_ అపిచ = మరియు - దిశామ్ = దిక్కులకు, వల్లభే = భర్తయయిన, భానౌ = సూర్యుడు, వాసరసృష్టికామ్ = వాసరసృష్టికరమైన, ప్రాచీమ్ =

లోకస్య క్షణదానిరంకుశరసౌ సంభోగనిద్రాగమౌ
కోకస్తోమ కుముద్వతీవిపినయోర్నిక్షేపమాతన్వతే॥ 2

తూర్పుదిక్కును. ఉపగతే = సమీపింపగా, పశ్య = చూడుము, పతంగ దృషదామ్ = సూర్యకాంతమణులయందలి. ఆగ్నేయనాడింధమాః = ఆగ్నేయనాడిని ప్రజ్వలింప జేయునవై, ఏతాః = ఈ, రుచయః = కిరణములు. లోకస్య = ప్రపంచమునకు, క్షణదా = రాత్రివేళలయందు, నిరంకుశరసౌ = నిరాటంకముగా ఆనందమునుకూర్చునట్టి, సంభోగ నిద్రాగమౌ = సంభోగము నిద్ర అను రెండు సుఖములను – క్రమముగా, కోకస్తోమ = చక్రవాక సమూహమునందును, కుముద్వతీవిపినయోః = కలువల కొలనునందును, నిక్షేపమ్ = న్యాసముగా [నిధిని దాచినట్లు], ఆతన్వతే = ఉంచుచున్నవి. [శార్దూలము]

తాత్పర్యము :- వాసకసజ్జికవలె తనరాకకు ఎదురుచూచుచున్న ప్రాగ్దిశాంగనను సూర్యుడు చేరుకొన్నాడు. సూర్యకాంతపుమణులలోని ఆగ్నేయనాడి ప్రజ్వరిల్లుచున్నది. [నాడీముష్ట్యోశ్చ – ఖశ్ – నాడింధమాః] చూడుము. రాత్రి సమయము లోకమునకు నిరాటంకానందదాయకము. దాని సంభోగ సుఖమును చక్రవాకములకు, నిద్రా సుఖమును కలువలకు సూర్యకిరణములు న్యాసముగా దఖలు పరచుచున్నవి. వాసవదీక్షితామ్ అని పాఠాంతరము. దేవేంద్రునితో (వాసవ) చిహ్నితమైన (దీక్షిత) తూర్పుదిక్కు అని భావము.

విశేషములు :- భర్తవచ్చు సమయమునకు తనను తన గృహమును మాటిమాటికి అలంకరించుకొని సిద్ధముగానున్న వనిత వాసకసజ్జిక. ప్రియాగమన వేళాయాం మండయ స్తి ముహుర్ముహుః, కేళీగృహం తథాత్మానం సా స్యాద్వాసకసజ్జికా.

సమాసములు :- క్షణదాయాం నిరంకుశః రసః యయోః. సంభోగశ్చ నిద్రాగమశ్చ, కోకస్తోమే చ కుముద్వతీ విపినే చ.

సంధులు :- పశ్య + ఏతాః - వృద్ధి, నిద్రా + ఆగమౌ - సవర్ణదీర్ఘః ఏతాః + రుచయః - విసర్గలోప, విపినయోః + నిక్షేప - రేఫాదేశవిసర్గ.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే, లోట్, పరస్మై, మధ్యమ,
పశ్య / పశ్యతాత్ - పశ్యతమ్ - పశ్యత
తనుఃఞః విస్తారే, ఆత్మనే, లట్, ప్రథమ (అ)
తనుతే – తన్వాతే – తన్వతే.

(సర్వతో నిరూప్య) హన్త సమన్తాదామోదమానపౌరసమ్భోగమయీ ఖల్వియం దశగ్రీవభుజార్గళాపరిపాలితా రాజధానీ.

ఇతః పౌరస్త్యాయాం కకుభి వివృణోతి క్రమదల
త్తమిస్రామర్మాణాం కిరణకళికామమ్బరమణిః ।
ఇతో నిష్క్రామన్తీ నవరతిగురోః ప్రోఞ్ఛతి వధూః
స్వకస్తూరీ పత్రాఙ్కురమకరికా ముద్రితమురః ॥ 3

---

హన్తేతి :- (సర్వతః నిరూప్య = అన్నివైపులకును చూచి) హన్త = అహో ! దశగ్రీవ = రావణునియొక్క, భుజార్గళా = బాహువులనెడి గడియలతో, పరిపాలితా = సంరక్షింపబడుచున్న. ఇయమ్ = ఈ. రాజధానీ = ముఖ్యపట్టణము, సమన్తాత్ = అంతటను. ఆమోదమాన = ఆనందించుచున్న. పౌరసంభోగమయీ ఖలు = పురవాసుల సుఖములతో నిండినది కదా !

ఇత ఇతి :- ఇతః = ఇటువైపు. పౌరస్త్యాయామ్ కకుభి = తూర్పుదిక్కునందు, క్రమ = నెమ్మదినెమ్మదిగా. దలత్ = విరియుచున్న, తమిస్రా = రాత్రియొక్క. మర్మాణమ్ = మర్మము కలదైన. చీకటిని తొలగించుచున్నదైన అనుట. కిరణకలికామ్ = వెలుగు మొగ్గను. అంబరమణిః = సూర్యుడు. వివృణోతి = ప్రకాశింపజేయుచున్నాడు. ఇతః = ఇటువైపునన నగరమునందు, వధూః = క్రొత్త పెండ్లికూతురు. నిష్క్రామన్తీ = పడకటింటి నుండి బయల్వెడలుచు, నవరతిగురోః = మన్మథతత్త్వోపదేశకుడైన తన భర్తయొక్క. ఉరః = వక్షఃస్థలమును, స్వకస్తూరీపత్రాంకురమకరికా = కస్తూరితో రచింపబడిన తన మకరికా పత్రముతో, ముద్రితమ్ = చిహ్నితమును — ఆతని గుండెలపై అంటుకొనిన తన మకరికాపత్ర చిహ్నమునసుట. ప్రోంఛతి = తుడుచుచున్నది (శిఖరిణి).

తాత్పర్యము :- చీకటి మర్మములను తొలగించుచు సూర్యుడు వెలుగు మొగ్గను వికసింపజేయుచున్నాడు. పడకటింటినుండి బయటికి వచ్చుచున్న వనిత తన ప్రియుని గుండెల కంటిన తన కస్తూరిని తుడిచివేయుచున్నది.

సమాసములు :- తమిస్రాయాః మర్మ—క్రమేణ దలత్ — క్రమదలచ్చ తమిస్రామర్మ యయా. కిరణః ఏవ కలికా — తామ్. రతేః గురుః — నవశ్చాసౌ

అపిచ

అయం మృదుమృణాళినీ వనవిలాసవైహాసిక
స్త్విషాం వితపతే పతిః సపది దృశ్యమానా నిజాః।
స్తనౌ పులకయన్తి చోత్పలదృశాం ప్రియోరఃస్థలే
విపర్యయితవృత్తయో ఘుసృణ పంకపత్రాంకురాః॥ 4

---

రతిగురుశ్చ - నవరతేః గురుర్వా — తస్య. కస్తూరీ పత్రస్య అంకురః - అంకురైః విరచితా మకరికా - స్వస్య.... మకరికా — మకరికయా ముద్రితమ్.

క్రియ :- వృఞ్ వరణే (శ్న) పరస్మై. లట్. ప్రథమ.
వివృణోతి - వివృణుతః - వివృణ్వన్తి
ఉఛి ఉంఛే, పరస్మై. లట్. ప్రథమ (ప్ర)
ప్రోంఛతి - ప్రోంఛతః - ప్రోంఛన్తి

అయమితి :- అపిచ = మరియు - మృదు = సుకుమారమైన. మృణాళినీ వన = పద్మవనముయొక్క. విలాస = వికాసమునకు. వైహాసికః = విదూషకుడగు (వైహాసికః కేళికరః ప్రహాసీ చ విదూషకః - అమరము) అయమ్=ఈ త్విషాం పతిః = వెలుగుఱేడు. వితపతే = మిక్కిలి ప్రకాశించుచున్నాడు. సపది = ఇటువైపు ఇప్పుడు. ప్రియోరఃస్థలే = తమ భర్తలయొక్క వక్షఃస్థలమునందు. విపర్యయితవృత్తయః = కుడియెడమలు తారుమారై ముద్రింపబడిన. దృశ్యమానాః = స్పష్టముగా కన్పించుచున్నవై. నిజాః = తమవైన. ఘుసృణపంక పత్రాంకురాః = కుంకుమ పంకముతో రచింపబడిన మకరికా పత్రములు. ఉత్పలదృశామ్ = ఆయా పద్మాక్షులకు, స్తనౌ = కుచములను, పులకయన్తి = పులకింప జేయుచున్నవి. (శిఖరిణి).

తాత్పర్యము :- పద్మవనమును కళకళ లాడించు విదూషకుడు సూర్యుడు ప్రకాశించుచున్నాడు. [కుల స్త్రీలు గడచిన రాత్రి సయ్యాటలను తలచుకొని పులకించుచున్నారు.] అలిసిపోయి ఒక వధువు భర్తపై సోలిపోగా ఆమె కుచముల కుంకుమ భర్త గుండెలపై కుడియెడమలు మారి అంటినది. అది చూచుటతో ఆమె గుండెలు పులకించుచున్నవి.

ఇతశ్చ—

ప్రియవసతేరపయాన్త్యో మిథః కరంబిత కరాంబుజన్మానః ।
కరజవ్రణవిరళస్తనపులకమమూః కిమపి వివదన్తే॥ 5

---

సమాసములు :- మృణాళినీనాం వనమ్ - మృదు చ తద్వనం చ - వనస్య విలాసః - విలాసాయ వైహాసికః. ఉత్పలే ఇవ దృశౌ యస్యాః సా - తాసామ్. ప్రియస్య ఉరః స్థలమ్ - తస్మిన్. ఓపాస్యయుతా వృత్తిః యేషాం తే. ఘుసృణస్య పంకః - పంకేన విరచితాః పత్రాంకురాః.

సంధులు :- వైహాసికః + త్రిపామ్ - సాదేశవిసర్గ. దృశ్యమానాః + నిజాః - విసర్గలోప. చ + ఉత్పల - గుణసంధి. వృత్తయః + ఘుసృణ - ఉత్వాదేశ విసర్గ.

క్రియ :- తప సంతాపే (ఉద్విగ్నాంగ తపః) ఆత్మనే. లట్, ప్రథమ (వి)
వితపతే - వితపేతే - వితపన్తే
పులక (ణిచ్) పరస్మై. లట్, ప్రథమ
పులకయతి - పులకయతః - పులకయన్తి

ప్రతిపదార్థ :- ఇతః చ = ఇటుప్రక్క - ప్రియవసతేః = ప్రియుని గృహము నుండి (వసతిః గృహయామిన్యోః - శాశ్వతః). అపయాన్త్యః = బయటకువచ్చుచున్న అమూః = ఈ వారవనితలు, మిథః = పరస్పరము, కరంబిత = అవలంబించిన, కరాంబుజన్మానః = హస్తపద్మములు కలవారై, కరజవ్రణ = నఖక్షతములతో, విరళ = స్వల్పముగా కన్పించుచున్న, స్తనపులకమ్ = కుచముల పులకింత కలిగి, కిమపి = ఏదో, వివదన్తే = వాదించుకొనుచున్నారు - పరస్పరము వేళాకోళము చేసికొను చున్నారనుట (అర్థ).

తాత్పర్యము :- వారాంగనలు తమతమ ప్రియుల గృహములనుండి వెలువడి చెట్టపట్టాలు వేసికొని నడుచుచు, నఖక్షతములతో కుచముల పులకింతను కప్పిపుచ్చుకొనుచు ఒండొరులను మేలమాడుకొనుచున్నారు.

సమాసములు :- ప్రియస్య వసతిః - తస్మాత్. కరాః అంబుజన్మానీవ - కరంబితాని కరాంబుజన్మాని యాసాం తాః. కరజవ్రణైః యత్ర విరళం స్తనపులకం యథా భవతి తత్తథా.

(అన్యతశ్చ దృష్ట్వా) ఇతో రమ్యతరం వర్తతే —
ప్రభాతే పృచ్ఛన్తీ రసురహసవృత్తం సహచరీ
ర్నవోఢా న వ్రీడాముకుళితముఖీయం సుఖయతి।
లిఖన్తీనాం పత్త్రాంకురమనిశమస్యాస్తు కుచయో
శ్చమత్కారో గూఢం కరజపదమాసాం కథయతి॥ 6

---

క్రియ :- వద వ్యక్తాయాం వాచి. లట్. ప్రథమ (భాసనేత్యాదినా(వి)తజ్)
వివదతే - వివదేతే - వివదన్తే

ఇత ఇతి :- (అన్యతః చ = మరొకవైపునను. దృష్ట్వా = చూచి.) ఇతః = ఇటువైపున. రమ్యతరమ్ = ఇంకను అందమైనది. వర్తతే = కన్పించుచున్నది—

ప్రభాతే ఇతి :- ప్రభాతే=ప్రాతఃకాలమునందు, అనురహసవృత్తమ్= రాత్రి జరిగిన రహస్యవృత్తాంతమును, పృచ్ఛన్త్యః = తెలుపుమని అడుగుచున్న, సహచరీః= చెలికత్తెలను, వ్రీడా = సిగ్గుతో, ముకుళితముఖీ=ముడుచుకొన్నముఖము కలిగిన, ఇయమ్ = ఈ, నవోఢా = క్రొత్తపెండ్లికూతురు, న సుఖయతి=ఆనందింప జేయుటలేదు. తు = కానీ, పత్త్రాంకురమ్ = మకరికా పత్త్రములను, అనిశమ్ = ఎల్లప్పుడును, లిఖన్తీనామ్ = రచించువారైన, ఆసామ్ = ఈ చెలికత్తెలకు, అస్యాః= ఈ నవోఢయొక్క, కుచయోః = కుచములయొక్క, చమత్కారః = చేష్టావిశేషము, గూఢమ్ = రహస్యముగా దాచుకొనిన, కరజపదమ్ = నఖక్షతమును, కథయతి = ప్రకటించుచున్నది.

తాత్పర్యము :- పడకటింటి నుండి వచ్చిన క్రొత్త పెండ్లికూతును చుట్టుముట్టి చెలికత్తెలు రాత్రి జరిగిన కథను తెలుపమని నిర్బంధింపగా ఆమె సిగ్గుతో ముఖము ముడుచుకొని కూర్చున్నదే కానీ నోరువిప్పుటలేదు. అయినప్పటికిని నిత్యము నామెకు మకరికా పత్రములను రచించు చెలికత్తెలకు ఆమె కుచముల చమత్కారము నిగూఢ నఖక్షతములను వెల్లడి చేయుచున్నది. (శిఖరిణీ వృత్తము).

సమాసములు :- అను సమీపం రహః — అనురహసమ్ (అన్వవతప్తాద్రహసః-అచ్) అనురహసమ్ వృత్తమ్, వ్రీడయా ముకుళితం ముఖం యస్యాః సా,

(ముహూర్తమనుధ్యాయ) అహో యతః ప్రభృతి వైదేహీవరణాయ ప్రహితేన పురోధసా కథ్యమానం కకుత్స్థకులకుమారస్య మానుష్యకాతిశయమశ్రుణవమ్. తతః ప్రభృతి కష్టాం దశామనుభవామి. తథా హి

తత్తాదృశం కథముదేతి మనుష్యలోకే
తేజోఽద్భుతం నిరభిసంధి న తావదేతత్ ।

---

సంధులు :- వృశ్చస్తిః + అసు. సహచరీః + నవోఢా - రేఫాదేశవిసర్గ. నవ + ఊఢా - గుణసంధి. మహీ + ఇయమ్, పత్త్రి + అంకుర - సవర్ణదీర్ఘ. అస్యాః + తు, కుచయోః + చమత్కారః - శషసాదేశవిసర్గసంధి. చమత్కారః + గూఢమ్ - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- సుఖ తత్క్రియాయామ్. పరస్మై, లట్, ప్రథమ.

సుఖయతి - సుఖయతః - సుఖయన్తి

కథ వాక్యప్రబంధే, ణిచ్, పరస్మై, లట్, ప్రథమ

కథయతి - కథయతః - కథయన్తి.

అహో ఇతి :- (ముహూర్తమ్ = క్షణకాలము, అనుధ్యాయ = ఆలోచించి) అహో, వైదేహీవరణాయ = రావణునికి సీతనడుగుటకై. ప్రహితేన = పంపబడిన, పురోధసా = శౌష్కలుని చేత, కథ్యమానమ్ = చెప్పబడుచున్న, కకుత్స్థకుల కుమారస్య = రాముని యొక్క, మనుష్యకాతిశయమ్ = మానవులకు అసాధారణమగు అతిశయమును-మానవాతీతమగు శక్తి అనుట. యతః ప్రభృతి = ఎప్పుడు. అశ్రుణవమ్ = వింటినో, తతః ప్రభృతి = అప్పటి నుండి, కష్టామ్ దశామ్ = ఒక దురవస్థను, అనుభవామి = అనుభవించుచుంటిని. తథాహి = అట్లుగదా ! -

తదితి :- మనుష్యలోకే = భూలోకమునందు. అద్భుతమ్ = ఆశ్చర్య జనకమగు, తాదృశమ్ = అటువంటి, తత్ తేజః = ఆ కాంతిపుంజము - తేజస్వియగు రాముడనుట. కథమ్ = ఎట్లు. ఉదేతి = ఆవిర్భవించును। ఏతత్ = ఈ రామ జననము, నిరభిసంధి = ఏదో నిగూఢమగు ప్రయోజనము లేనిది. న = కాదు. అస్య = ఈ, దశాననస్య = రావణుని యొక్క. చరితాని = చేష్టితములు (ప్రవర్తనలు), తాని ఏవ =

తాన్యేవ చాస్య చరితాని దశాననస్య
ధిక్చింతయా రజనిరక్షిషు నః ప్రభాతి॥ 7

అపిచ —

శ్రుత్వా దుఃశ్రవమద్భుతం చ మిథిలావృత్తాంతమంతఃపత
చ్చింతాపహ్నవసావహిత్థవదన త్వగ్విప్రకీర్ణస్మితః ।

---

అపే, ధిక్ = అయ్యో! చింతయా = బాధతో, నః = మా యొక్క, అక్షిషు = కన్నుల యందు, రజనిః = రాత్రి, ప్రభాతి = ప్రకాశించుచున్నది. (వసంత తిలక)

తాత్పర్యము :- రామాకారమున మహాద్భుతమగు తేజస్సు భూమిపై అవతరించుటలో ఏదో రహస్యమున్నది. అది నిష్కారణముకాదు. రావణుని ప్రవర్తనలో మార్పులేదు. ధిక్! ఇదే చింతతో మాకు కన్నులలో తెల్లవారుచున్నది. రేలు నిద్దుర ఉండుటలేదని.

సంధులు :- తేజః + అద్భుతమ్ - ఉత్వాదేశవిసర్గ — తేజో + అద్భుతమ్ — పూర్వరూపసంధి. రజనిః + అక్షిషు — రేఫాదేశవిసర్గ. తాని + ఏవ - యణాదేశ.

క్రియ :- ఇణ్ గతౌ. పరస్మై. లట్. ప్రథమ

ఏతి - ఇతః - యన్తి

భా దీప్తౌ. పరస్మై. లట్ ప్రథమ

భాతి - భాతః - భాన్తి

శ్రుత్వేతి :- అపిచ = మరియు — దుఃశ్రవమ్ = వినరానిదియు. అద్భుతమ్ చ = ఆశ్చర్యకరమైనదియునైన, మిథిలా వృత్తాంతమ్ = మిథిలానగరము నందు జరిగిన కథను (రామకృత శివధనురారోపణము, జనకకృత రావణ తిరస్కారము) శ్రుత్వా = విని, అంతః పతత్ = హృదయములో నెగసిపడుచున్న, చింతా = బాధను అపహ్నవ = కప్పిపుచ్చుటయందు, సావహిత్థ = ఆకారగోపనముతో కూడిన (అవహిత్థాకారగుప్తిః - అమరము), వదన = పది ముఖములయొక్క, త్వక్ = పైచర్మము నందు, విప్రకీర్ణ = వ్యాపించిన (పలుచగా చెదిరిన), స్మితః = చిఱునవ్వు కలవాడును,

హేలాకృష్ట సురావరోధరమణీ సీమంత సంతానక
స్రగ్వాసోజ్జ్వలపాణిరప్యవతి మాం వత్సో న లంకేశ్వరః॥ 8

(విమృశ్య ఆకాశే) అహాహ, దారుణేయమస్మాకం చిరజీవితా.

---

హేలా = విలాసముగా, ఆకృష్ట = లాగిన. సురావరోధరమణీ = అప్సరసలయొక్క, సీమంత = కొప్పులయందలి. సంతానకస్రక్ = పారిజాతపు మాలికచే కలిగిన, వాస = సుగంధముతో, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న పాణిః అపి = చేతులు కలవాడయినప్పటికిని వత్సః = బిడ్డయగు, లంకేశ్వరః = రావణుడు మామ్ = నన్ను, న అవతి = ఆనందింప చేయుటలేదు. స్రగ్దామోజ్జ్వల = మాలికల సమూహముతో ప్రకాశించు - పాఠాంతరము.

తాత్పర్యము :- వినరాని అద్భుతవార్తను మిథిల నుండి విన్నప్పటి నుండియు బాధను దాచుకొనుటలో కలతచెందుచున్న పది ముఖములకును పైపై భాగమున మాత్రమే స్ఫురించుచున్న చిరునవ్వు కలవాడై ఈ రావణుడు అప్సరః కాంతల సిగలలోని పుష్పములను లాగుటతో సుగంధయుక్తమైన చేతులు కలవాడయినప్పటికిని నాకు ఆనందమును కల్గింపకున్నాడు. (శార్దూలము)

సమాసములు :— మిథిలాయాః వృత్తాంతః - తమ్. అంతః వర్తతీతి చ సా చింతా చ. చింతాయాః ఆపన్నః - అవహిత్థేన సావహిత్థాని - సావహిత్థాని చ తాని వదనాని - వదనానాం త్వక్ - త్వచి విశీర్ణం స్మితం యస్య సః. సురాణామవరోధరమణ్యః - తాసాం సీమంతాః - సీమంతేషు విద్యమానాః సంతానకస్రజః. హేలయా ఆకృష్టాః - హేలాకృష్టాశ్చ తాః స్రజశ్చ - స్రజాం వాసః - వాసేన ఉజ్జ్వలాః పాణయః యస్య సః.

సంధులు :- వతత్ + చింతా - శ్చుత్వసంధి. పాణిః + అపి - రేఫాదేశవిసర్గ. అపి + అవతి - యణాదేశ. వత్సః + న - ఉత్వాదేశ విసర్గ.

క్రియ :- అవ కాంతిగతిరక్షణప్రీత్యాదిషు. పరస్మై. లట్. ప్రథమ.

అవతి - అవతః - అవన్తి

అహాహేతి :- [విమృశ్య = ఆలోచించి. ఆకాశే = మిన్నుజూచుచు] అహాహ! అస్మాకమ్ = మాయొక్క. ఇయమ్ చిరజీవితా = ఈ దీర్ఘాయుర్దాయము. దారుణా = భయంకరమైనది గదా!

ప్రీతే విధాతరి పురా పరిభూయ మర్త్యా
న్వవ్రేఽన్యతో యదభయం స భవానహంయుః ।
తన్మర్మణి స్పృశతి మామతిమాత్రమద్య
హా వత్స శాంతమథవా దశకంధరోఽసి॥ 9

(సవిమర్శమ్) అహో మైథిలస్య నృపతేరకార్యజ్ఞతా.

---

ప్రీతేఇతి :- పురా = పూర్వకాలమునందు, విధాతరి = బ్రహ్మదేవుడు, ప్రీతే = నీ తపస్సునకు సంతుష్టుడై ప్రత్యక్షముకాగా, మర్త్యాన్ = మానవులను, పరిభూయ=(అవమానించి) విడిచిపెట్టి, అన్యతః=తక్కిన ప్రాణికోటినుండి, అభయమ్ =అభయమును (మరణము లేకుండునట్లు), సః = ఆ, భవాన్ = నీవు, వవ్రే = అడిగియుంటివి, తత్ = అది, అద్య = ఇప్పుడు, మామ్ = నన్ను, అతిమాత్రమ్ = అత్యంతము, మర్మణి స్పృశతి = హృదయమును బాధించుచున్నది, హా వత్స = అయ్యోబిడ్డా ! శాంతమ్=అమంగళము శాంతించుగాక ! అథవా = ఆ గర్వమేలేనిచో, దశకంధరః అసి=దశకంఠుడవుగదా ! — ఏరకంపులకు భయపడవలసిన పనిలేదనుట. వసంతతిలక. అహం శుభమోర్యుస్ - అహంయుః.

తాత్పర్యము :- బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరమడుగు మనగా, నీవు మానవులను సరకుగొనక తక్కిన ప్రాణికోటినుండి అభయమడిగితివి. ఆనాటి నీ అహంకారమే ఈనాడు నన్ను బాధించుచున్నది. కాకున్నచో నీవు దశకంధరుడవు, నీకు భయమేమి !

సంధులు :- వవ్రే + అన్యతః, దశకంధరః + అపి (ఉత్వాదేశవిసర్గ) - పూర్వరూప. అన్యతః + యత్—ఉత్వాదేశవిసర్గ. తత్ + మర్మణి - అనునాసికాదేశ.

క్రియ :- వృఞ్ వరణే, ఆత్మనే, లిట్, ప్రథమ
వవ్రే - వవ్రాతే - వవ్రిరే
స్పృశఞ్ బాధన స్పర్శనయోః, లట్, పరస్మై, ప్రథమ
స్పృశతి — స్పృశతః — స్పృశన్తి

అహోఇతి :- (సవిమర్శమ్ = సాలోచనగా) అహో!, నృపతేః = రాజయిన, మైథిలస్య = జనకునియొక్క, అకార్యజ్ఞతా=అకార్యజ్ఞత్వము - జనకుడు ఉచితానుచితములు ఎరుగడనుట.

విశ్వామిత్రవశీకృతే హృది వయం మా భూమ సంబంధిన
స్తే దృష్టా న కథం పురాణమునయో మాన్యాః పులస్త్యాదయః।
జామాతాపి మహేంద్రమౌళివలభీ పర్యంకరత్నాంకుర
జ్యోత్స్నాపుష్టనఖేందు దీధితిరయం నాపేక్షితో రావణః॥ 10

---

విశ్వామిత్రేతి :- విశ్వామిత్ర = కౌశికునిచేత, వశీకృతే = స్వాధీన పరచు కొనబడిన, హృది = జనకుని హృదయమునందు, వయమ్ = మేము, సంబంధినః = వియ్యమందదగినవారముగా, మా భూమ = కాకపోయితిమి, కాని, పురాణ మునయః = మా వంశమునందు ప్రాచీనులైన మునులై, మాన్యాః = గౌరవింపదగిన వారైన, తే = ఆ సుప్రసిద్ధులగు, పులస్త్యాదయః = పులస్త్యుడు మున్నగువారు, కథమ్ = ఎట్లు, న దృష్టాః = పరిగణింపబడరైరో। మహేంద్ర = దేవేంద్రునియొక్క మౌళి = శిరస్సు అనునట్టి, వలభీ = సౌధోపరి గృహముయొక్క (చూరు అని కాని) పర్యంక = ఒడియందలి (సమీపమునందలి), రత్నాంకుర = నూతన రత్నములయొక్క జ్యోత్స్నా = వెలుగు వెన్నెలతో, పుష్ట = అభివృద్ధి చెందింపబడిన, నఖ + ఇందు దీధితిః = కాలి (గోళ్లు) గోరు అనునట్టి చంద్రునియొక్క కాంతులు కలవాడగు, అయమ్ = ఈ, రావణః అపి = దశకంఠుడు కూడ, జామాతా = అల్లుడుగా, న + అపేక్షితః = అంగీకరింపబడడయ్యెను [శార్దూలము]

తాత్పర్యము :- విశ్వామిత్రునికి వశంవదుడై జనక మహారాజు మా సంబంధము నిర్వహింపకుండెను. మా వంశమున పూర్వీకులగు పులస్త్యాది మహాము నులున్నారు. వారిని చూచియైనను మా వియ్యము నంగీకరింపడయ్యెను. స్వయముగా రావణుడు మహావీరుడు. దేవేంద్రుని కిరీటపు రత్నకాంతులు దశకంఠుని కాలిగోరులకు చంద్రజ్యోత్స్నలను పొందుగుచుండుట సుప్రసిద్ధము. ఇంతటివాడైనను రావణుడు జనకునికి అల్లుడుగా పనికిరాకపోయెను।

సమాసములు :- విశ్వామిత్రేణ వశీకృతే. పురాణాశ్చ తే మునయశ్చ. పులస్త్యః ఆదిర్యేషాం తే. మహాంశ్చాసౌ ఇంద్రశ్చ - మహేంద్రస్య మౌళిః - మౌళిరేవ వలభీ - వలభ్యాః పర్యంకః - పర్యంకే విద్యమానాః రత్నాంకురాః - అంకురాణాం జ్యోత్స్నా - జ్యోత్స్నయా పుష్టా — నఖాః ఇందురివ — నఖేందోః దీధితిః — పుష్టా నఖేందుదీధితిర్యస్య సః.

(పురోఽవలోక్య) కథం మిథిలాచరితాని చరితుమనుప్రహితా చిరయతి వత్సా శూర్పణఖా.

(ప్రవిశ్య శూర్పణఖా)

శూర్పణఖా :- (సహర్షమ్) అమ్మహే, సౌమ్యసుందర వివాహనేపథ్యలక్ష్మీ విచ్ఛుర్దిత కాంతి ప్రాగ్భారాణి రఘుకులకుమారాణాం ముఖపుండరీకాణి ప్రేక్షమాణా జుగుప్సితేనాపి మాయామానుషీభావేన కృతార్థీకృతాస్మి. అహో ! సా తాదృశీ గుణానాం ప్రకృతిర్యా

---

సంధులు ;- సంబంధినః + తే - సాదేశవిసర్గ. మునయః + మాన్యాః. అపేక్షితః + రావణః - ఉత్వాదేశవిసర్గ. పులస్త్య + ఆదయః. న + అపేక్షితః. జామాతా + అపి. రత్న + అంకుర - సవర్ణదీర్ఘ. మహా + ఇంద్ర. నఖ + ఇందు - గుణసంధి. దీధితిః + అయమ్ - రేఫాదేశవిసర్గ.

క్రియ :- భూ సత్తాయామ్. పరస్మై. లుఙ్. ఉత్తమ

అభూవమ్ - అభూవ - అభూమ.

కథమితి :- (పురః అవలోక్య = ముందునకు చూచి) కథమ్ = ఎట్లూ ! మిథిలాచరితాని = మిథిలానగరమందలి వృత్తాంతములను. చరితుమ్ = చారవృత్తితో తెలిసికొనుటకు. అనుప్రహితా = పంపబడిన. వత్సా = బిడ్డ. శూర్పణఖా = శూర్పణఖ. చిరయతి = జాగుసేయుచున్నదే !

(శూర్పణఖ ప్రవేశించి)

అమ్మహేఇతి :. (సహర్షమ్ = ఆనందముతో). అమ్మహే = ఓహోహో ! (అమ్మో అమ్మహే ఇతి పదం కుర్యాత్ స్త్రీణాం తు విస్మయే-భరతః) సౌమ్య = ప్రసన్నములై. సుందర = అందమైనవై. వివాహనేపథ్య = వివాహ ప్రయత్నములవలననైన. లక్ష్మీ = (పెండ్లి) కళతో. విచ్ఛుర్దిత = వృద్ధిపొందింపబడిన. కాంతిప్రాగ్భారాణి = శోభాతిశయము కల్గినవైన. రఘుకులకుమారాణామ్ = దాశరథుల యొక్క. ముఖపుండరీకాణి = ముఖపద్మములను. ప్రేక్షమాణా = చూచుచున్నదానవై. జుగుప్సితేన అపి = అసహ్యము పుట్టించునదైనను. మాయామానుషభావేన = కపట మానవస్త్రీవేషముతో. కృతార్థీకృతా అస్మి = కృతార్థురాలను గావింపబడితిని. అహో !

విపక్షహస్తపతితాపి సుఖయతి (అమ్మహే. సోమ్మసుందర విఅహా దేవచ్ఛ లచ్ఛి విచ్ఛురిదకాన్తి పచ్చారాఇం రహఉల కుమారాణం మహాపుండరీఅఇం పేక్ఖన్తీ జాదచ్ఛిదేణావి మాఅ మాణుసీభావేణ కదత్థీకిదమ్హి. అమ్మో. సా తారిసీ గుణాణం పకిదీ జా విపక్ఖహత్థ పదిదావి సుహావేది.)

మాల్యవాన్ :- (దృష్ట్వా సస్నేహమ్) కథం వత్సా మే శూర్పణఖా. వత్సే అయమహమ్. ఇత ఇతో భవతీ.

శూర్పణఖా :- కథమిహైవ అట్టాలకశిఖరప్రగ్రీవే మాతామహః. అహో దుఃశ్లిష్టతా దగ్ధకార్యాణామ్. యదిదానీం ప్రజాగరక్లాంత లోచనః ప్రతిక్షణజృంభా ప్రసారిత ముఖ కుహరదృష్ట హృదయస్థిత

---

గుణానామ్ = సౌందర్యాది గుణములయొక్క. సా = ఆ, ప్రకృతిః = స్వభావము. తాదృశీ = అటువంటిదిగదా ! విపక్ష = శత్రువులయొక్క. హస్త = చేతులయందు, పతితా అపి = ఉన్నదయినను. సుఖయతి = ఆనందింపజేయును — శత్రుపక్షమునకు చెందినదైనను ప్రశంసింపబడుననుట.

కథమితి :- (దృష్ట్వా = చూచి. సస్నేహమ్ = ఆదరముతో) కథమ్ = ఎట్లా ! మే = నాయొక్క. వత్సా = మనుమరాలు. శూర్పణఖా = శూర్పణఖ ! వత్సే = బిడ్డా !. అయమ్ అహమ్ = ఇదిగో నేనే. ఇత ఇతః భవతీ = ఇటు — ఇటు అమ్మా ! రమ్ము.

ఇహైవేతి :- కథమ్ = ఎట్లా ! ఇహైవ = ఇచ్చటనే, అట్టాలక = అటకయొక్క, శిఖర = అగ్రభాగము యొక్క, ప్రగ్రీవే = ముంగిలియందు. సౌధోపరి భాగమునందనుట. మాతామహః = తాతగారు (తల్లియొక్క తండ్రి) ఉన్నారనుట, అహో ! దగ్ధకార్యాణామ్ = నింద్యములగు పనులయొక్క (దగ్ధహతక నిందితాని కుత్సాయామ్). దుఃశ్లిష్టతా = దుఃఖప్రదత్వమెంతటిది ! యత్ = ఏలయన, ఇదానీమ్ = ఇప్పుడు, ప్రజాగర = చిరజాగరణమువలన, క్లాంత = అలసిపోయిన, లోచనః = నేత్రములుకలవాడును, ప్రతిక్షణ = మాటిమాటికిని, జృంభా = ఆవులింతలతో, ప్రసారిత = తెరువబడిన, ముఖకుహర = పెద్దనోటితో, దృష్ట = స్పష్టము గావింప

కఠినకార్యభారోఽన్య ఇవ కోఽపి దృశ్యతే. అథవా సామాన్యోఽపి గురుకో మన్త్రిభావో విశేషేణ సాహసైకరస వ్యవసాయస్య చణ్డచరితస్యాస్మాకం స్వామినో రావణస్య. జానామి మామేవ ప్రతిపాలయంస్తిష్ఠతి. యావదేనముపసర్పామి. (సవిషాదముపసృత్య) ఆర్య, వందే. (కథం ఇహ జ్జేవ్వ అట్టాలఅ సిహరపగ్గీవే మాదామహో. అహో! దుసిలిట్ఠతా దడ్ఢకజ్జాణమ్. జం దాణిం పఆగరకిలిఅన్తలోఅణో పఢిక్ఖణ జింభిఆపసారిదముహకుహర దిట్ఠహి అఅట్ఠిద కఠిణకజ్జభారో అణ్ణో విఅ కో వి దీసది. అహవా సామణ్ణో వి గురుఓ మంతిభావో విసేసేణ సాహసేక్కరసవ్వవసాఅస్య చండచరిదస్స అహ్మసామిణో రావణస్స. జాణామి మం జేవ్వ పడిపాలఅన్తో చిట్ఠది. జావణం అవసప్పామి. (సవిషాదముపసృత్య) అజ్జ, వన్దే.)

మాల్యవాన్ :- వత్సే, కల్యాణినీ భూయాః. ఇహాస్యతామ్. అపి భరత శత్రుఘ్నాభ్యాం మిథిలాముపస్థితో దశరథః.

---

బడిన (సూచింపబడిన). హృదయస్థిత = ఎడదలోపలి. కఠిన = కఠినమైన కార్య భారః = కార్యభారము కలవాడును, అయిన, ఈః మాల్యవంతుడు. అన్యః = మరియొకడు. కః అపి ఇవ = ఎవడోవలె దృశ్యతే = కన్పించుచున్నాడు. అథవా=లేదా. సామాన్యః అపి = సాధారణమైనను. మంత్రిభావః = మంత్రిపదవి. గురుకః = బరువైనది. సాహసైకరస = సాహసమే ప్రధానముగాగల. వ్యవసాయస్య = ప్రయత్నములు చేయువాడును, చండచరితస్య = తీవ్ర స్వభావముగలవాడునైన. స్వామినః= మా ప్రభువగు. రావణస్య=దశకంఠునియొద్ద, మంత్రిభావః = మంత్రిపదవి, విశేషేణ = మరింతగా. గురుకః = బరువైనది. మామ్ ఏవ = నన్నే. ప్రతిపాలయన్ = ప్రతీక్షించుచు. తిష్ఠతి = కూర్చున్నాడనుట. జానామి=ఎరుగుదును ఏనమ్ = వీనిని, ఉపసర్పామి = సమీపింతును. (సవిషాదమ్ = దిగులుతో, ఉపసృత్య = సమీపించి) ఆర్య ! వందే = నమస్కరించుచున్నాను.

వత్సేఇతి :- వత్సే = శూర్పణఖా ! కల్యాణినీ = శుభములుకలదానివి. భూయాః = కమ్ము ! నీకు శుభమగుగాక అనుట. ఇహ=ఇట. ఆస్యతామ్=కూర్చుం

శూర్పణఖా :- (ఉపవిశ్య) ఆర్య. దశరథే ఆగతే కుమారాణాం గోదానమంగళే చ సంవృత్తే తావన్మయా ప్రాప్తం మిథిలానగరమ్. (అజ్జ. దసరహే ఆఅదే కుమారాణం గోదాణమంగళే అ సంవృత్తే దావ మఏ పత్తం మిహిలాణఅరమ్)

మాల్యవాన్ :- (నిఃశ్వస్య) అతిప్రకాశోఽయమర్థో యథా నివృత్తస్వీకరణా జానకీతి.

శూర్పణఖా :- అథకిమ్. (అధ ఇం)

మాల్యవాన్ :- (విమృశ్య) అహో దురాత్మనః క్షత్రియబ్రాహ్మణస్య కుశికజన్మనో దుర్నాటకమ్.

---

దము. భరతశత్రుఘ్నాభ్యామ్ = భరత శత్రుఘ్నులతో. దశరథః = దశరథుడు. మిథిలామ్ = మిథిలను. అపి ఉపస్థితః = చేరుకొనెనా ?

ఆర్యేతి :- (ఉపవిశ్య = కూర్చుండి) ఆర్య ! దశరథే = దశరథుడు. ఆగతే = రాగా. కుమారాణామ్ = పెండ్లికొడుకులయొక్క. గోదానమంగళే = గోవు లను దానముచేయుట అనునట్టి మంగళ కార్యాచరణము, ప్రవృత్తే చ = నిర్వహింప బడగా. తావత్ = అప్పుడు. మయా = నా చేత. మిథిలానగరమ్ = మిథిలా పట్టణము ప్రాప్తమ్ = పొందబడినది - ఆ సమయమునకు నేను మిథిలకు చేరుకొంటిననుట.

అతీతి :- (నిఃశ్వస్య=నిట్టూర్చి) జానకీ = సీత. నివృత్త స్వీకరణా ఇతి= వివాహితమైనది అనునట్టి. అయమ్ = ఈ. అర్థః = విషయము. అతిప్రకాశః = మిక్కిలి స్పష్టము.

అథేతి :- అథకిమ్ = అవును.

అహోఇతి :- [విమృశ్య = ఆలోచించి] అహో ! దురాత్మనః = దుర్మార్గు ను. క్షత్రియబ్రాహ్మణస్య = క్షత్రియవంశమునందు పుట్టి బ్రహ్మర్షిత్వ మును పొందినవాడును అగు. కుశికజన్మనః = విశ్వామిత్రునియొక్క. దుర్నాటకమ్ = ఈ చెడ్డ నటన ఎంతటిది ! అహో ! ఎంత నాటకమాడెననుట.

యజ్ఞోపప్లవశాంతయే పరిణతో రాజా సుతం యాచిత
స్తం చానీయ వినీయ చాయుధవిధౌ తే జఘ్నిరే రాక్షసాః।
త్రైయక్షం విదళయ్య కార్ముకమథ స్వీకార్య సీతామితో
నో విద్మః కుహనావిటేన వటునా కిం తేన కారిష్యతే॥ 11

యజ్ఞేతి :- యజ్ఞ = తన యాగమున కేర్పడిన, ఉపప్లవ = విఘ్నముల యొక్క, శాంతయే = శమనము కొఱకు, పరిణతః = వృద్ధుడగు, రాజా = దశరథుడు. సుతమ్ = తనయుని, యాచితః = కౌశికునిచే అర్థింపబడెను. విశ్వామిత్రుడు దశరథుని యాచించెననుట [(ప్రధాన కర్మణ్యాఖ్యేయే లాదీనాహుర్ద్వికర్మణామప్రధానే దుహాదీనామ్... ...] తమ్ = ఆ రాముని, ఆనీయ = తీసికొనివచ్చి, ఆయుధవిధౌ = యుద్ధ విద్యయందు వినీయ చ = శిక్షణయిచ్చి, తే = ఆ, రాక్షసాః = రాక్షసులందరును, జఘ్నిరే = చంపబడిరి, అథ = అటుపైని, త్రైయక్షమ్ = ముక్కంటికిచెందిన, కార్ముకమ్ = ధనుస్సును, విదళయ్య = భంగపరపించి, సీతామ్ = జానకిని, స్వీకార్య = స్వీకరింపజేసి, కుహనా విటేన = దంభాచారముతో దూర్తుడైన, తేన = ఆ వటునా= విశ్వామిత్రునిచేత, ఇతః = ఇటుపైని కిమ్ = ఏది, కారిష్యతే = కావింపబడనున్నదో, నో విద్మః = ఎరుగకున్నాము. (శార్దూలము)

తాత్పర్యము :- యజ్ఞమును నిర్విఘ్నముగా కొనసాగించు మిషతో దశరథుని యాచించి శః విశ్వామిత్రుడు రాముని కొనివచ్చెను. అస్త్రవిద్య నుపదేశించి తాటకాదులను సంహరింపజేసెను. శివధనుస్సును భంగము చేయించెను. సీతను పరిణయమాడించెను. ఇకముందు ఏమి చేయింపనున్నాడో!

సమాసములు :- యజ్ఞస్య ఉపప్లవః - ఉపప్లవస్య శాంతిః - తస్మై ఆయుధానాం విధిః - తస్మిన్, త్రీణి అక్షీణి యస్య సః - త్ర్యక్షస్య ఇదమ్ (నయ్వాభ్యామిత్యాదినా ఐచ్).

సంధులు :- యజ్ఞ + ఉప - గుణ. పరిణతః + రాజా - ఉత్వాదేశ విసర్గ. యాచితః + తమ్ - సాదేశవిసర్గ. చ + ఆనీయ, చ + ఆయుధ - సవర్ణదీర్ఘ.

శూర్పణఖా :- ఆర్య. ఏవమేతత్. స మయా తత్ర బ్రాహ్మణో వసిష్ఠ
మహర్షేరపి స్ఫురన్ దృష్టః. (అజ్జ. ఏవ్వంణేదమ్. సో మఏ
తహిం బహ్మణో వసిట్ఠమహేసిణో వి ఫురన్తో దిట్ఠో)

మాల్యవాన్ :- (విహస్య) వత్సే. తపోభిరస్య బ్రాహ్మణాదేశోఽపి స్థాని
వద్భావేన క్షత్రకార్యం న జహాతి. కించ స్వభావమధురోఽపి
కాకుత్స్థ పటురౌత్పత్తికేన క్షాత్రేణ బ్రాహ్మణ్యేన చ జన్మనా
త్రిజాతకాదస్మాన్మునేరధీయానోఽపరీణః పరిణంస్యతే. తథాహి

---

క్రియ :- హన హింసాగత్యోః కర్మణి. లిట్. ఆత్మనే. ప్రథమ
జఘ్నే — జఘ్నాతే — జఘ్నిరే
డు కృఞ్ కరణే కర్మణి. లృట్. ఆత్మనే ప్రథమ
కారిష్యతే - కారిష్యేతే - కారిష్యన్తే

ఆర్యేతి :- ఆర్య । ఏవమేతత్ = ఇది యిట్లే. సః = ఆ విశ్వామిత్రుడు, తత్ర = ఆ మిథిలయందు. బ్రాహ్మణః = బ్రాహ్మణుడగు. వసిష్ఠ మహర్షేః అపి = వసిష్ఠునికన్నను. స్ఫురన్ = ప్రకాశించుచు. మయా = నాచేత. దృష్టః = చూడబడినాడు— నాకట్లగుపించెననుట.

వత్సేతి :- [విహస్య = బిగ్గరగా నవ్వి] వత్సే । అస్య = ఈ విశ్వామిత్రునికి. తపోభిః = స్వీయ తపస్సులచేనైన. బ్రాహ్మణాదేశః = బ్రాహ్మణత్వలబ్ధి– ఆదేశము. స్థానివద్భావేన = స్థానివద్భావముతో. క్షత్రకార్యమ్ = క్షత్రియలక్షణమును, న జహాతి = విడువదు. జన్మసిద్ధమగు క్షత్రియత్వము పోదనుట. [స్థానివద్భావము వ్యాకరణ చమత్కారము – స్థానివదాదేశోఽనల్విధౌ]. కించ = మరియు. స్వభావమధురః = నిసర్గ సుందరుడగు. కాకుత్స్థపటుః అపి = ఈ రఘు కుమారుడును. అస్మాత్ = ఈ. ఔత్పత్తికేన = పుట్టుకతో నేర్పడిన. జన్మనా = జన్మతోను [మాతృగర్భసంబంధి]. క్షాత్రేణ జన్మనా = క్షత్రియోచితమగు ఉపనయనమువల్లనైన జన్మతోను. బ్రాహ్మణ్యేన జన్మనా = తపోబలముచే లభించిన జన్మతోను. త్రిజాతకాత్ = మూడు జన్మలు కలవాడైన విశ్వామిత్రుని నుండి. అధీయానః = విద్యనేర్చినవాడై. అపరీణః = [సమాజముచే] తిరస్కృతుడుగా [అపరీణో ధిక్కృతః — అమరము] పరిణంస్యతే = పరిణమించుచున్నాడు. [అధరీణః అని పాఠాంతరము. నిందితుడని అర్థము]. తథా హి = అంతే కదా ।

అవినయభువామజ్ఞానానాం శమాయ భవన్నపి
ప్రకృతికుటిలాద్విద్యాభ్యాసః ఖలత్వవివృద్ధయే ।
ఫణిభయభృతామస్తూచ్ఛేదక్షమ స్తమసామసౌ
విషధర ఫణారత్నాలోకో భయం తు భృశాయతే॥ 12

---

అవినయేతి :- అవినయభువామ్ = దుర్నయమునకు నివాస స్థానములగు, అజ్ఞానానామ్ = అజ్ఞానములయొక్క. శమాయ = ఉపశమనమునకై, భవన్ అపి = సమర్థమైనదయ్యును. ప్రకృతి కుటిలాత్ = జన్మతః వక్ర స్వభావము కలవానినుండి. విద్యాభ్యాసః = విద్యనేర్చుకొనుట అనునది. ఖలత్వవివృద్ధయే = కుటిలత్వమును పెంపొందించుటకే అగును. ఫణిభయభృతామ్ = సర్పము లున్నవేమో అని భయమును కలిగించునట్టి, తమసామ్ = చీకటులకు. ఉచ్ఛేదక్షమః = పోగొట్టజాలినది. అస్తు = అగుగాక తు = కానీ. అసౌ = ఈ. విషధర =పాముయొక్క. ఫణా = పడగమీద నున్న. రత్న = మణియొక్క. ఆలోకః=వెలుగు [కాంతి]. భయమ్=అసలైన భయమును, భృశాయతే = అతిశయింపజేయుచున్నది.

తాత్పర్యము :- ప్రకృతి కుటిలుని యొద్ద విద్యాభ్యాస మొనర్చుట అజ్ఞానములను తొలగించుటకు సమర్థమయ్యును కడకు కుటిలత్వమునే పెంచును. పాము పడగపై నున్న మణుల కాంతులు సర్పభయమును కల్గించునట్టి చీకటులను తొలగించుటకు చాలినవయ్యును చివరకు భయమునే పెంపొందించును గదా ! (హరిణీవృత్తము)

సమాసములు :- అవినయో భవత్యస్మాదిత్యవినయభూః - తేషామ్. ప్రకృత్యా కుటిలః - తస్మాత్. విద్యాయాః అభ్యాసః. ఖలత్వస్య వివృద్ధిః - తస్యై. ఫణిభ్యో భయమ్ - ఫణిభయం బిభర్తి - తేషామ్. ఉచ్ఛేదాయ క్షమః. విషధరస్య ఫణా - ఫణాయాం రత్నః - రత్నస్య ఆలోకః. అభృశం భృశం భవతి - భృశాయతే.

సంధులు :- భవన్ + అపి - అనునాసికద్విత్వ. అస్తు + ఉత్. రత్న + ఆలోక - సవర్ణదీర్ఘ. క్షమః + తమసామ్ - సాదేశవిసర్గ. ఆలోకః + భయమ్ - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- భృశమ్ (భృశాదిభ్యో భువ్యచ్వేర్లోపశ్చ హలః - క్యఙ్)
ఆత్మనే, లట్, ప్రథమ
భృశాయతే - భృశాయేతే - భృశాయన్తే.

భవతు. కిమతిక్రాంతోపవర్ణనేన. కథం త్విదానీం స్వయంగ్ర
హీతు ముత్తిష్ఠమానో రాక్షసపతిః ప్రతికర్తవ్యః స్యాత్.

శూర్పణఖా :- ఆర్య. న ఖలు మోట్టిమం పరిహాంరతోఽన్య ఉపాయో లక్ష్యతే.
(అజ్జ. ణ ఖు మోట్టిమం పరిహారిస్తో అణ్ణో ఉఆఓ లక్ఖీఅది)

మాల్యవాన్ :- వత్సే. మా మైవమ్. మహాదోషో హి తాదృశేన ధర్మవిజ
యినా వీరప్రవాలేన పరిగృహీతాయా వైదేహ్యాః ప్రసహ్యాప
హారః. పశ్య —

దోఃస్తంభద్వయ దర్పడంబరమితి స్పష్టం న విస్పందతే
వైదేహీకరబంధసూచనమితి ప్రస్తౌతి న వ్రీడయా।

---

భవత్వితి :- భవతు = అగుగాక। అతిక్రాంత = జరిగిపోయినదానిని. ఉప
వర్ణనేన = వర్ణించుటతో. కిమ్ = ఏమి ప్రయోజనము। ఇదానీమ్ = ప్రస్తుతము.
స్వయంగ్రహీతుమ్ = సీతను స్వయముగా అపహరించి తెచ్చుటకు. ఉత్తిష్ఠమానః =
ఉద్యుక్తుడగుచున్న. రాక్షసపతిః = రావణుడు. కథమ్ = ఎట్లు. ప్రతికర్తవ్యః స్యాత్ =
ఉపశమింపబడును। ఇది ఎట్లు తీరునో ఆలోచింపవలెననుట.

ఆర్యేతి :- ఆర్యా। మోట్టిమమ్ = బలాత్కారమును. పరిహరతః =
తప్పించి. అన్యః = మరియొకటి. ఉపాయః=ఉపాయము. నఖలు లక్ష్యతే = కన్పట్టుట
లేదు గదా।

వత్సేఇతి :- వత్సే = శూర్పణఖా। మామా ఏవమ్ = కాదు. కాదు అట్లు
కాదు. ధర్మవిజయినా = ధర్మబద్ధముగా జయమును పొందినవాడును. వీరప్రవాలేన =
వీర కిశోరుడునగు. తాదృశేన = అంతటి రామునిచే. పరిగృహీతాయాః = పరిణయ
మాడబడినదగు. వైదేహ్యాః = సీతయొక్క. ప్రసహ్య అపహారః = బలవంతముగా
అపహరణము - సీతను బలాత్కారముగా అపహరించుట. మహాదోషః హి = మహా
పాపము సుమా। పశ్య = చూడు -

దోఃస్తంభేతి :- దోఃస్తంభద్వయ = స్తంభరూపములైన బాహువుల
జంటయొక్క. దర్ప = అహంకారముయొక్క. డంబరమ్ = ప్రకటనము, స్యాత్
ఇతి = అగునని శంకించి. స్పష్టమ్ = స్ఫుటముగా. న విస్పందతే = ప్రతి స్పందిం

ఇత్యాలోచ్య కృతస్మితై ర్మునిభిరాదిష్టేన యేన క్షణా
దాత్తం వందితమాఞ్చితం చ సహసా భగ్నం చ తాదృగ్ధనుః॥ 13

చుటలేదు వైదేహ్యాః = సీతయొక్క, కరబంధ = పరిణయముయొక్క, సూచనమ్ = సూచనము, స్యాత్ ఇతి = అగునని భావించి, వ్రీడయా = సిగ్గుతో, న ప్రస్తౌతి = ధనుర్గ్రహణమును ప్రస్తుతించుట లేదు. ఇతి = అని, ఆలోచ్య = ఆలోచించి, కృతస్మితైః = చిఱునవ్వులు చిందించువారైన, మునిభిః = విశ్వామిత్ర శతానందాది మునులతో, ఆదిష్టేన = ఆజ్ఞాపింపబడినవాడై, యేన = [ఏ] రామునిచేత, క్షణాత్ = క్షణకాలములో, తాదృక్ ధనుః = అంతటి శివ ధనుస్సు, ఆత్తమ్ = సమీపింపబడినది. వందితమ్ = నమస్కరింపబడినది. ఆంచితమ్ = ఎక్కుపెట్టబడినది. చ = మరియు, సహసా = ఉన్నట్టుండి, భగ్నమ్ = విరిగిపోయినది. [శార్దూలము]

తాత్పర్యము :- బాహంగర్వ ప్రకటనమగునను శంకతో రాముడు శివ ధనుర్భంగ విషయమున స్పర్థను ప్రకటించుటలేదు జానకిని చేపట్టుట సూచింపబడునని భావించి సిగ్గుపడి శివధనుర్భంగమును తాను చేయుదునని ప్రస్తుతించుటలేదు - ఇట్లు ఆలోచించిన శతానందాదులు ఆజ్ఞాపించగా రాముడు అంతటి శివ ధనుస్సును సమీపించి నమస్కరించి చేపట్టి వంచి నారి తగిలించి ఎక్కుపెట్టగా ఒక్కపెట్టున అది భగ్నమయ్యెను. ఇంతటి సద్గుణ సంపన్నుని భార్యను అపహరించుట ఉచితము కాదనుట.

సమాసములు :- దోష్ణా స్తంభావివ — దోః స్తంభయోః ద్వయమ్ — ద్వయస్య దర్పః - దర్పస్య డంబరమ్ వైదేహ్యాః కరబంధః—కరబంధస్య సూచనమ్. కృతం స్మితం యైః తైః.

క్రియ :- స్పదిజ్ కించిచ్చలనే, ఆత్మనే, లట్, ప్రథమ.

స్పందతే — స్పందేతే — స్పన్దన్తే

ష్టుఞ్ స్తుతౌ, పరస్మై, లట్, ప్రథమ.

స్తౌతి - స్తుతః — స్తువన్తి

ఛందస్సు :- మూడవపాదమునందు ఆదిష్టేన అనుదాని నఖండపదముగా భావించి యతిభంగము నాశంకించి రుచిపతి కొంత చర్చించెను. ఆఙ్ పూర్వక దిశిధాతు నిష్పన్న నిష్ఠాంతమగుట యతిభంగము ప్రసక్తము కాదు.

తత్కథమిదం చ తస్మిన్నిశాచరనాథమాతతాయిన మనుజానీమః.

శూర్పణఖా :- (సాశ్చర్యమ్) యథా నిరూపితం మాతామహేన. అహో, కాలస్య మాహాత్మ్యమ్. యదిదానీం త్రిభువనజయలక్ష్మీ లీలా వందీకారే మహారాజ రావణేఽప్యేవం మంత్ర్యతే. (జధా జిరూవిదం మాదామహేణ. అహో కాలస్స మాహప్పం. జం దాణిం తిహుఅణ జఅలచ్ఛీలీలావన్దిఆరే మహారాఅరావణేవి ఏవ్వం మన్తీఅది)

మాల్యవాన్ :- వత్సే—

మునిరపి గురుర్దివ్యాస్త్రాణాం బభూవ దివౌకసా
మజగవ ధనుర్భంగే తావానహో స మహోత్సవః ।

---

తదితి :- తత్ = అందువలన. తస్మిన్ = ఆ రాముని విషయమునందు. నిశాచరనాథమ్ = రావణాసురుని, ఆతతాయినమ్ = పరదారాపహర్తగా (సీతాపహరణమునకు) కథమ్ అనుజానీమః = ఎట్లు అంగీకరింతుము. ఎట్లు అనుమతింతుమనుట. అగ్నిదో గరదశ్చైవ శస్త్రోన్మత్తో ధనాపహః క్షేత్రదారాపహారీ చ షడేతే ఆతతాయినః.

యథేతి :- (సాశ్చర్యమ్ = నివ్వెఱపోయి) మాతామహేన = తాతగారిచే (నీచేత) యథా నిరూపితమ్ = నిరూపింపబడినట్లే. నీవన్నట్లే అనుట. అహో! త్రిభువన జయలక్ష్మీ = త్రిలోక విజయలక్ష్మిని, వందీకారే = బంధిగా నొనర్చుకొనిన — సులభముగా స్వాధీనపఱచుకొని స్తుతుల నందుచున్నవాడనుట — మహారాజ రావణే అపి = రావణ మహారాజు విషయమునగూడ, ఇదానీమ్ = ఇప్పుడు, ఏవమ్ = ఇట్లు, యత్ మంత్ర్యతే = ఆలోచన జరుగుచున్నదనగా — సీతను అపహరింపగలడా? లేడా? ఉచితమా? అనుచితమా? అని — అహో!, కాలస్య = కాలముయొక్క, మాహాత్మ్యమ్ = ప్రభావము! (ఎంతటిది!)

మునిరితి :- వత్సా! మునిః = విశ్వామిత్రుడు, దివ్యాస్త్రాణామ్ = దివ్యములైన అస్త్రములకు, గురుః అపి = ఉపదేశకుడును, బభూవ = అయ్యెను. అజగవ ధనుర్భంగే — అజగవ = పినాకమనునట్టి (పినాకోఽజగవం ధనుః — అమరము). ధనుః = ధనుస్సుయొక్క, భంగే = భంగము నందును. దివౌకసామ్ = దేవతలకు,

రఘుపతిగుణక్రీతామేతామవేహి జగత్త్రయీం
విపరిణమతే దౌర్జన్యం తు ప్రభుత్వపదేన నః॥ 14

సః = ఆ. మహోత్సవః = ఆనందము, తావాన్ = అంతటిది, బభూవ = అయ్యెను, అహో! ఏతామ్ = ఈ, జగత్త్రయీమ్ = (ముల్లోకములను) లోకత్రయమును, రఘుపతి = రాముని యొక్క, గుణ = సద్గుణములచే, క్రీతామ్ = కొనివేయబడిన దానినిగా, అవేహి = తెలిసికొనుము. తు = కాగా, ప్రభుత్వపదేన = ప్రభుత్వమను మాటతో [మదేన = గర్వముతో అని పాఠాంతరము], నః = మన యొక్క (చేయబోవునట్టి), దౌర్జన్యమ్ = బలాత్కార రూపమగు దుర్జనత్వము, విపరిణమతే = బెడిసికొట్టును. (హరిణి - నసమరసలాగః షడ్వేదైః హయైః హరిణీమతా).

తాత్పర్యము :- రామునికి విశ్వామిత్రుడు దివ్యాస్త్రముల నుపదేశించెను. శివధనుర్భంగము దేవతలకు కోపకారణము కాకపోగా ఆనందమహోత్సవమయ్యెను. ఇంతయేల రాముడు తన గుణములతో ముల్లోకములను వశీకరించుకొనెను. ఇప్పట్టున ప్రభుత్వ గర్వముతో మనము దౌర్జన్యము చేసినచో బెడిసికొట్టును.

సమాసములు :- దివ్యాని చ తాని అస్త్రాణి చ - తేషామ్. దివమ్ ఓకః యేషాం - తేషామ్. అజగవమితి ధనుః - ధనుషో భంగః - తస్మిన్. మహాంశ్చాసౌ వుత్సవశ్చ. రఘుపతేః గుణాః - గుణైః క్రీతా - తామ్. జగతః త్రయీ - తామ్. ప్రభుత్వస్య మదేన.

సంధులు :- మునిః + అపి. గురుః + దివ్య - రేఫాదేశవిసర్గ. దివ్య + అస్త్రాణామ్ - సవర్ణదీర్ఘ. దివ + ఓకసామ్ - వృద్ధి మహా + ఉత్సవః - గుణసంధి.

క్రియ :- ఇణ్ గతౌ. లోట్, పరస్మై. మధ్యమ (అవ) గత్యర్థకాస్తే బుద్ధ్యర్థకాః

ఇహి / ఇతాత్ - ఇతమ్ - ఇత

ణమ ప్రహ్వత్వే శబ్దే చ. కర్మవ్యతిహారే, ఆత్మనే. లట్. ప్రథమ

విపరిణమతే - విపరిణమేతే - విపరిణమన్తే

శూర్పణఖా :- కః సందేహః. తస్మిన్వివాహమహోత్సవే సర్వం మయా ప్రత్యక్షీకృతమ్. (కో సందేహో. తస్సిం వివాహమహూసవే సవ్వం మఏ పచ్చక్ఖీకిదమ్.)

మాల్యవాన్ :- తదేవమేకలోష్ఠవధః స్యాత్. తథాహి. మిథిలాం ప్రవిశ్య బలాదాకృష్యమాణే కళత్రే కథం తితిక్షేత రఘురాజపుత్రః. తం చోత్తిష్ఠమానం పౌరజానపదప్రకృతయోఽప్యనుతిష్ఠేరన్. కిమంగ. సంబంధి బాంధవాః. తథోక్తమ్ - అరణ్యోఽగ్నిరివ దుస్సహదుఃఖామర్షజం తేజో విక్రమయతి. మండలస్య చాను గ్రాహ్యో భవతి-ఇతి.

---

క ఇతి :- సందేహః కః = సందేహమేమున్నది ; తస్మిన్ = ఆ, వివాహమహోత్సవే = కల్యాణ వైభవమునందు, సర్వమ్ = అంతయును, మయా = నాచేత, ప్రత్యక్షీకృతమ్ = కన్నులారా గాంచబడినది. ప్రత్యక్షముగా చూచితి ననుట.

తదేవమితి :- తత్ = అందుచేత, ఏవమ్ = ఈ ప్రకారముగా (దౌర్జన్యము చేసినచో) ఏకలోష్ఠవధః స్యాత్ = ఏకలోష్ఠ వధ అగును మట్టిబెడ్డను మట్టిబెడ్డతో కొట్టినచో రెండింటిలో ఏదో ఒకటి తప్పక చితుకుట తథ్యము. అట్లే రామరావణులు కలబడినచో ఎవరో ఒక్కడే మిగులుదురనుట - ఏకలోష్ఠవధః. తథాహి = అంతే కదా ; మిథిలామ్ = మిథిలానగరమును, ప్రవిశ్య = ప్రవేశించి. కళత్రే = భార్యను (సీతను), బలాత్ = బలాత్కారముగా, ఆకృష్యమాణే = అపహరించుచో, రఘు... రాజపుత్రః = రాకుమారుడగు రాముడు, కథం తితిక్షేత = ఎట్లు ఓర్చి ఊరకుండును ; ఉత్తిష్ఠమానమ్ = యుద్ధసన్నద్ధుడగుచున్న, తమ్ = ఆ రాముని, పౌర = నాగరులు, జానపద = గ్రామీణులు, ప్రకృతయః అపి = ప్రజలు అధికారులును, అనుతిష్ఠేరన్ = అనుసరింతురు. వారును రావణునిపైకి దండెత్తుదురనుట, అంగ = వత్సా! సంబంధి బాంధవాః = రామునికి సంబంధించిన బంధువులు, కిమ్ = చెప్పనదేమున్నది ! (అంగ సంబోధనే హర్షే పునరర్థే చ దృశ్యతే.) యథా ఉక్తమ్ = రాజనీతి కోవిదులు ఇట్లు చెప్పిరి — అరణ్యః = అరణ్యమునందలి, అగ్నిః ఇవ = అగ్నివలె-దవానలము వలె, దుస్సహ దుఃఖామర్షజమ్ = భరింపరాని అవమాన దుఃఖముతో కలిగిన, తేజః =

శూర్పణఖా :- (దీర్ఘముష్ణం చ నిఃశ్వస్య) ఆర్య, కిమిదానీం యుక్తమ్.
(అజ్జ. కిం దాణిం జుత్తమ్)

మాల్యవాన్ :- శృణు వత్సే. కార్యజ్ఞాసి. అస్తి వనౌకసాం మంత్రీ జాంబవాన్. స మతంగాశ్రమ వాస్తవ్యాముపసృత్య శ్రమణాం నామ సిద్ధ శబరీ మభ్యర్థితవాన్. యథాస్య వాలినో ద్వైరాజ్యేన క్షీణా లుబ్ధాపచితాః ప్రకృతయః కిష్కింధాయాం కుమారసుగ్రీవ మభిప్రేక్ష్యమాణాః సామవాయికం రామభద్రమపేక్షన్తే.

శూర్పణఖా :- (సాతంకమ్) కథం క్షత్రియపోతకో వాలినిగ్రహేఽపి

---

పరాక్రమము. విక్రమయతి = విక్రమింపజేయును. చ = మరియు. మండలస్య = రాజ్యమునకును (రాజ సమూహమునకనిగాని), అనుగ్రాహ్యః = అనుమతింపదగినది, భవతి = అగును, ఇతి = అని. రాజనీతిజ్ఞులు చెప్పిరనుట.

ఆర్యేతి :- (దీర్ఘమ్ ఉష్ణమ్ చ నిఃశ్వస్య = వేడిగా నిట్టూర్చి) ఆర్య! ఇదానీమ్ = ఈ పరిస్థితిలో, కిమ్ యుక్తమ్ = ఏది ఉచితము ; కర్తవ్యమేమి అనుట.

శృణ్వితి :- వత్సా ! శృణు = వినుము. కార్యజ్ఞా అసి = కార్యజ్ఞురాలవు గదా ! వనౌకసామ్ = వానరులకు, మంత్రీ = మంత్రి, జాంబవాన్=జాంబవంతుడను వాడు, అస్తి = ఉన్నాడు. సః = అతడు, మతంగ + ఆశ్రమ వాస్తవ్యామ్ = మతంగాశ్రమ నివాసినియైన, శ్రమణామ్‌నామ = శ్రమణ అనునట్టి. సిద్ధ శబరీం = సిద్ధశబర కాంతను ఉపసృత్య = సమీపించి, అభ్యర్థితవాన్ = అభ్యర్థించెను యథా = ఎట్లనగా, అస్య = ఈ, వాలినః = వాలియొక్క, ద్వైరాజ్యేన = అనిశ్చిత పరిపాలనతో, క్షీణాః = విసిగి వేగిపోయినవారును, లుబ్ధ = ధనలుబ్ధులైన వార్ధుషికులచే [వడ్డీ వ్యాపారులు], అపచితాః = దోచుకొనబడినవారునైన, ప్రకృతయః = శిష్ట పురుషులు ; కిష్కింధాయామ్ = కిష్కింధా సామ్రాజ్యమునందు, సుగ్రీవమ్ = సుగ్రీవుని, అభిషేక్ష్యమాణాః = అభిషేకింపగోరుచున్నవారై, సామవాయికమ్ = సైన్యసహితుడై సహకరించువానినిగా, రామభద్రమ్ = రామచంద్రుని, అపేక్షన్తే = కోరుచున్నారు - ఎప్పుడు వచ్చునా అని ఎదురుచూచుచున్నారనుట.

కథమితి :- (సాతంకమ్ = అద్భుతగులుచు), కథమ్ = ఎట్లూ ; క్షత్రియ పోతకః = ఈ రాకుమారుడు, వాలి నిగ్రహే అపి = వాలి వధపట్లగూడ, సహాయః =

సహాయః సమీహ్యతే. తత స్తతః. (వధం ణ త్తి అపోదట్ వాలి నిగ్గహే వి సహాఓ సమీహీఅది. తదో తదో.)

మాల్యవాన్ :- తతశ్చాయోధ్యాతః కైకేయ్యా భరతవార్తాహరణాయ ప్రేషితా మన్థరా నామ స్థవిరదాసీ కఠోర తరణితాప పఞ్చానలజ్వాలావలీఢ జీవితా మిథిలాప్రాన్తరే తిష్ఠతీతి నిదాఘ కిరణాన్తేవాసీ సతీర్థ్య మృషియాజ్ఞవల్క్యముపస్థాయ సంప్రత్యేవ నిమేషమాత్రా న్నివృత్తో హనూమాన్కథయతి. అత స్త్వమప్యస్మదనురోధేన హనూమత్ప్రత్యవేక్షిత స్వశరీరా పరపురప్రవేశ విద్యయా మన్థరా శరీరమధితిష్ఠన్తీ మిథిలాముపేత్య ప్రత్యయితా సంవిధానకమిదం చిరంతగోచరీకరిష్యసి. ఇత్థంభావినా గురునిదేశ

---

సహాయుడుగా. సమీహ్యతే = కోరబడుచున్నాడా ! - వాలిని చంపుటకు సీతకు శస్త్రా అనుట. తత స్తతః = అటుపైని -

తతశ్చేతి :- తతశ్చ = అంతట - శబరితో కొంతవంతునిమాటల కొన సాగింపు - అయోధ్యాతః = అయోధ్యనుండి కైకేయ్యా = కైకేయిచేత, భరతవార్తాహరణాయ = భరతుని సమాచారమును చెప్పుటకై, ప్రేషితా = పంపబడిన, మన్థరా నామ = మంథర యను పేరుగల. స్థవిర దాసీ = వృద్ధదాసి, కఠోర = తీవ్రమైన. తరణితాప = సూర్యుని వేడిమియనునట్టి. పఞ్చానల = పంచాగ్నితో, అవలీఢ = భక్షింపబడిన. జీవితా = ప్రాణము కలదై - వడగొట్టి అనుట. మిథిలా ప్రాన్తరే = మిథిలా సమీపమునందు. (ప్రాన్తరం దూరశూన్యోఽధ్వా - అమరము) తిష్ఠతి ఇతి = పడియున్నదని. నిదాఘ కిరణాన్తే వాసీ = సూర్యుని శిష్యుడగు, హనుమాన్ = ఆంజనేయుడు, సతీర్థ్యమ్ = తన సహాధ్యాయుడగు, ఋషి యాజ్ఞవల్క్యమ్ = యాజ్ఞవల్క్య మహర్షిని. ఉపస్థాయ = నమస్కరించి. సంప్రతి ఏవ = ఇప్పుడే, నిమేష మాత్రాత్ = క్షణకాలములో, నివృత్తః = తిరిగి వచ్చినవాడై, కథయతి = తెలియజేయు చున్నాడు అతః = అందుచేత. త్వమ్ అపి = నీవు కూడ, (శబరి) అస్మదనురోధేన = నా ఆలోచన ననుసరించి. హనూమత్ = ఆంజనేయునిచేత. ప్రత్యవేక్షిత = సంరక్షింపబడిన, స్వశరీరా = స్వశరీరము కలదానివై, పరపురప్రవేశ విద్యయా = పరకాయ ప్రవేశ కళతో, (యోగిని కనుక) మన్థరా శరీరమ్ = (స్పృహకోల్పోయిపడియున్న)

చర్యా ప్రసంగేణ పంకపాషాణవిషమకంటకవ్యాలకుల బహుళా మరణ్యానీమనుప్రవిష్టః సర్వధా వైదేశికో రాజపుత్రః కార్య గౌరవాన్నియతమేవ వాలివధపూర్వకేణ ప్రతీకారసంధినా సంబంధేన సుగ్రీవముపగృహ్ణీయాదితి.

శూర్పణఖా :- (సకౌతుకమ్) ఆర్య, కిం తత్సంవిధానకమ్. (అజ్జ, కిం తం సంవిహాణఅమ్)

మాల్యవాన్ :- (కర్ణే) ఏవమేవమ్. (ఇతి కథయతి)

---

మంథర దేహమును, అధితిష్ఠన్తీ = ప్రవేశించినదానవై, మిథిలామ్ = మిథిలా నగరమును, ఉపేత్య = చేరి, ప్రత్యయితా = నమ్మకము కలిగించి, ఇదమ్ = ఈ, సంవిధానకమ్ = (భరత పట్టాభిషేకము రామ వనగమనము అనునట్టి) పథకము, దశరథ = దశరథునికి, గోచరీకరిష్యసి = తెలియపరుతువు, ఇత్థంభావినా = ఇట్లుకానున్న, గురునిదేశ చర్యా ప్రసంగేణ = పితృవాక్య పాలన ప్రసక్తితో, పంకపాషాణ = బురదచే రాలచే, విషమ = ఎగుడు దిగుడై, కంటకకుల = ముండ్లగుంపుతో, వ్యాళకుల = సర్పముల లేక పులుల సమూహముతో, బహుళామ్ = సాంద్రమైన - అట్టి క్రూర జంతువు లధికముగా కలిగిన అనుట, అరణ్యానీమ్ = మహారణ్యమును, (మహారణ్య మరణ్యానీ-అమరము) అనుప్రవిష్టః = ప్రవేశించినవాడై, సర్వధా = అన్ని విధముల, వైదేశికః = పరాయివాడైన - ఆ ప్రాంతమునకు క్రొత్తవాడనుట, రాజపుత్రః = రాముడు, కార్య గౌరవాత్ = వనవాస కర్తవ్య భారమువలన, ప్రతీకార సంధినా = పరస్పర సహాయ రూపమగు ఒడంబడికతోనైన, సంబంధేన = మైత్రితో, సుగ్రీవమ్ = సుగ్రీవుని, ఉపగృహ్ణీయాత్ = స్వీకరించును (మయాస్యోపకృతం పూర్వమయం మాముపకరిష్యతి ఇతి యః క్రియతే సంధిః ప్రతీకారః స ఉచ్యతే, ఉపకారం కరోమ్యస్య మమాప్యేష కరిష్యతి అయం వాపి ప్రతీకారో రామసుగ్రీవ యోరివ - చాణక్య) ఇతి = అని జాంబవంతుడు శబరికి చెప్పెను.

ఆర్యేతి :- (సకౌతుకమ్ = ఉత్సుకతతో) ఆర్యా ! తత్ = ఆ, సంవిధానకమ్ = వ్యూహము (పథకము), కిమ్ = ఏమి ?

ఏవమితి :- (కర్ణే = చెవిలో) ఏవమేవమ్ = ఇట్లు ఇట్లు (ఇతి = అని, కథయతి = చెప్పును).

శూర్పణఖా :- (హసన్తీ) అహో! వృద్ధయుకస్య కుటిలతా. (అహో! ముద్ద రిచ్చున్న. కుడిలదా)

మాల్యవాన్ :- తతశ్చ సాపి శబరయోగినీ సుగ్రీవగుణానురోధేన సర్వమో మితి ఉరరీకృత్య తదైవ విదేహాధిముఖీ ప్రస్థితేతి మే జనస్థాన విహారిభిర్నిశాచరైరాగత్య నివేదితమ్. తదమునా చ జాంబవ త్ప్రయోగేన ఫలతా విరాధప్రభృతిభిరధిష్ఠితేషు వింధ్యగిరి గహ్వరేషు విహరతో రామస్య సుకరం కళత్రాపహరణమ్. అస్మదీయాస్తు మాయాః సురాసురప్రథమవేఖయోధస్య యుద్ధ ముదితవిబుధపతినా వితీర్ణమాయాహరణ మంత్రధారిణో దశ రథస్య సంనిధౌ న ప్రభవన్తి.

---

అహో ఇతి :- (హసన్తీ = నవ్వుచున్నదై) అహో! వృద్ధయుకస్య = ముదుసలి భల్లూకరాజు యొక్క. కుటిలతా = కుటిలత్వము! (వక్రరాజనీతి).

తత ఇతి :- తతశ్చ = అటుపైని. సా = ఆ. శబరయోగినీ అపి = యోగిని యగు శబరి కూడ. సుగ్రీవగుణానురోధేన = సుగ్రీవుని గుణములచేతైన అంగీకార ముతో, సర్వమ్ = ఈ పథకము నంతటిని, ఓమితి = సరే అని ఉరరీకృత్య = స్వీకరించి- అంగీకరించి. తథా ఏవ = ఆ క్షణమే, విదేహాభిముఖీ = విదేహదేశమునకు, అభిముఖియై. ప్రస్థితా = బయలుదేరినది, ఇతి = అని. జనస్థాన విహారిభిః = జనస్థానమునందు సంచ రించువారైన, నిశాచరైః = మన రాక్షసులచేత, ఆగత్య = ఇటకు వచ్చి, మే = నాకు, నివేదితమ్ = విన్నవింపబడినది - వారు వచ్చి విన్నవించిరనుట. తత్ = అందుచేత. ఫలతా = ఫలవంతమగుచున్న. అమునా = ఈ. జాంబవత్ ప్రయోగేణ = జాంబవంతుని పథకముతో - పథకము పారుచుండగా ననుట, విరాధ ప్రభృతిభిః = విరాధుడు మొద లగువారిచే, అధిష్ఠితేషు = అధివసింపబడినవగు, వింధ్యగిరిగహ్వరేషు = వింధ్యాద్రి గుహలయందు, విహరతః = (పథకములో భాగమై) సంచరించుచున్న, రామస్య = రాముని యొక్క, కళత్రాపహరణమ్ = భార్యను అపహరించుట, సుకరమ్ = సులభము, యుద్ధ = రణమునందు సహాయపడుటచే, ముదిత = ఆనందించిన, విబుధపతినా = దేవేం ద్రునిచేత, వితీర్ణ = బహూకరింపబడిన, మాయాహరణ = మాయాహరణమనునట్టి,

శూర్పణఖా :- (సవిచికిత్సమ్) ఆర్య. ఉపనతస్యైవం క్రియతే. (అజ్జ. ఉవణదస్స ఏవ్వం కరీఅది)

మాల్యవాన్ :- (విహస్య) వత్సే. సాధు. వృద్ధసంవాదినీ తే దృష్టిః. యదాహుః-యోహ్యుపనతస్య పుత్రదారానతిమన్యతే తస్యోద్విగ్నం మండలమభావాయోపతిష్ఠతే- ఇతి కిం పునరస్మాసు నైష నిసర్గతేజస్వీ సంశ్రయప్రవృత్తిమాతిష్ఠతే.

---

మంత్ర = మంత్రోపదేశమును. ధారిణః = వహించువాడును. ఆ మంత్రము నెరిగినవాడనుట. సురాసుర = దేవదానవులయందు, ప్రథమరేఖ = మొదటి శ్రేణికి చెందిన, యోధస్య = యోధుడును అగు. దశరథస్య = దశరథునియొక్క, సన్నిధౌ = సమీపమందు - దశరథుని దగ్గర. అస్మదీయాః = మనవియగు, మాయాః తు = మాయలేమో, న ప్రభవన్తి = సమర్థములుకావు - పనిచేయవనుట. కావున దశరథుని నుండి రాముడు విడివడిన పిమ్మటే మనము రంగములోనికి ప్రవేశింతమనుట.

ఆర్యేతి :- (సవిచికిత్సమ్ = విచికిత్సతో) ఆర్యా! ఉపనతస్య = చేరువకు వచ్చినవానికి. ఏవమ్ క్రియతే = ఇట్లు చేయదగునా!

వత్సేతి :- (విహస్య = నవ్వి), వత్సే = బిడ్డా! సాధు = బాగుబాగు! తే = నీయొక్క, దృష్టిః = అభిప్రాయము. వృద్ధసంవాదినీ = పెద్దల దృష్టికి సరిపోలినది. యత్ ఆహుః = పెద్దలు అందురు - యః = ఎవడు ఉపనతస్య = శరణు జొచ్చిన వానియొక్క, పుత్రదారాన్ = సంతానమునుగాని భార్యనుగాని, అతిమన్యతే = అపహరించునో. తస్య = అతనియొక్క, ఉద్విగ్నమ్ = కలతచెందిన, మండలమ్ = రాజ్యము, అభావాయ = వినాశనమునకై, ఉపతిష్ఠతే = పర్యవసించును. ఇతి = అని. కింపునః = కాని. నిసర్గతేజస్వీ = సహజసిద్ధమగు పరాక్రమము కలవాడైన. ఏషః = ఈ రాముడు, అస్మాసు = మనపట్ల, సంశ్రయప్రవృత్తిమ్ = శరణాగతత్వమును, న అతిష్ఠతే = ఆదరించుటలేదు గదా! మనలను శరణు జొచ్చినవాడు కాడనుట - కావున దారాపహారణము తప్పుకాదని.

హంమితి :- హమ్ = ఊఁ! అని అంగీకరించి, అన్యత్ భణామి = మరియొకటి అడుగుచున్నాను. రామభద్రః = రాముడు. ఏవమ్ = పథకము ప్రకారము

శూర్పణఖా :- హుం ! అన్యద్భణామి. అప్యేవం కరిష్యతి రామభద్రః.
(అణ్ణం భణామి. అవి ఏవ్వం కరిస్సది రామభద్దో)

మాల్యవాన్ :- కస్సందేహః. లోకోత్తరం హి కిమప్యుస్మీలయన్తో జగతి రాజ్యోప భోగేభ్యోఽపి బీభత్సన్తే మహానుభావాః.

శూర్పణఖా :- అన్యదపి కిమప్యనర్థాంతరమత్ర పతితమితి తర్కయామి.
(అణ్ణం వి కిం వి అణత్థన్తరం అత్థి పడిదమితి తక్కేమి)

మాల్యవాన్ :- (సహర్షమ్) కిం తత్ ?

శూర్పణఖా :- మయా జనకనగరాన్నిష్క్రాంతయా శ్రుతం. యథా భగ్న శ్రీకంఠ శరాసనస్య దాశరథేర్మాత్సర్యేణ సకలక్షత్రియకృతాంతః పరశురామః పరాగత ఇతి. (మఏ జణఅణఅరాదో ణిక్కన్తిఏ

---

పితృవాక్యబద్ధుడై అడవులకు వచ్చుట. అపి కరిష్యతి = చేయునా ! తండ్రి చెప్పినంత మాత్రమున వనవాసమునకు అంగీకరించునా అనుట.

క ఇతి:- కః సందేహః=సందేహమేమి! తప్పక చేయును. మహానుభావాః= మహానుభావులు. జగతి = లోకమునందు. కిమపి = మాటలకందని ఏదో ఒక. లోకోత్తరమ్ = ఉత్కృష్టకార్యమును, ఆదర్శమును. ఉన్మీలయన్తః = ప్రకాశింపచేయువారై రాజ్యోపభోగేభ్యః అపి = రాజ్యము రాజ్యసుఖముల నుండియు. బీభత్సన్తే = అసహ్యించుకొందురు - అసహ్యవస్తువుగా పరిత్యజింతురనుట.

అన్యదితి :- అన్యత్ అపి = మరొకటియు. కిమపి = ఒకానొక. అనర్థాంతరమ్ = అనర్థము. అత్ర = ఈ పథకమునందు. పతితమ్ ఇతి = ఉన్నదని. తర్కయామి = భావించుచున్నాను.

కిమితి :- (సహర్షమ్ = హర్షముతో) కిమ్ తత్ = ఏమది !

మయేతి :- జనక గృహాత్ = మిథిలానగరమునుండి. నిష్క్రాంతయా = తిరిగివచ్చుచున్న. మయా = నాచేత. శ్రుతః = వినబడినది- నేనువింటిననుట. యథా = ఏమని యనగా. భగ్న = భగ్నము గావింపబడిన. శ్రీకంఠ శరాసనస్య = శివధనుస్సు కలవాడైన - శివధనుస్సును భగ్నముగావించిన వాడనుట. దాశరథేః = రాముని (యొక్క)పై. మాత్సర్యేణ = ఈర్ష్యతో (కోపముతో). సకల

పరం త్వనేనాపి సకలమూర్ధాభిషిక్త కంఠకాండరుధిరావసేక పంకిల కుఠారేణ దురభిభవో దాశరథిః.

శూర్పణఖా :- (సాభ్యసూయమ్) అహో, దుగ్ధముఖే తస్మిన్ క్షత్రియ

---

సమాసములు :- భుజైః అర్గళితా - అర్గళితా చ సా నర్మదా చ - నర్మదాయాః మకరచక్రమ్ - చక్రస్య దంష్ట్రాంకురాః - అంకురైః ప్రణప్రకరః - ప్రకరేణ కర్కశమ్. బిభ్రత్ అనుచో నాభ్యస్తాచ్ఛతుః అని నుమ్నిషేధము. గుణైః ధనుః - ధనుషః వ్యళీకమ్.

సంధులు :- భుజ + అర్గళ. దంష్ట్రా + అంకుర - సవర్ణదీర్ఘ. హైహయః + నృపతిః - ఉత్త్వాదేశవిసర్గ. నృపతిః + అర్జునః - ధనుః + వ్యళీకమ్ - రేఫాదేశ విసర్గ.

క్రియ :- ఈక్షిట్ దర్శనే, ఆత్మనే. లట్. ప్రథమ (ఉప)

ఈక్షతే - ఈక్షేతే - ఈక్షన్తే

ఛందస్సు :- పృథ్వీ వృత్తము. జసౌ జసయలా వసుగ్రహయతిశ్చ పృథ్వీ గురుః.

| జ | స | జ | స | య | లగ |
|---|---|---|---|---|---|
| I U I | I I U | I U I | I I U | I U U | I U |
| భుజార్గ | ళితన | ర్మదామ | కరచ | క్రదంష్ట్రాం | కుర |

పరమితి :- పరం తు = కానీ, సకల మూర్ధాభిషిక్త = సమస్త మహారాజుల యొక్కయు. (మూర్ధాభిషిక్తో రాజన్యో బాహుజః క్షత్రియో విరాట్ - అమరము) కంఠ = కంఠములయందలి. కాండ = నాళముల యొక్క లేక - కంఠములనెడి కాండములయొక్క. రుధిర = నెత్తుటిచేనైన, అవసేక = సేచనముతో - నెత్తుటితో తడియుట వలన - పంకిల = బురదగొన్న. కుఠారేణ = పరశువుకలవాడైన, అనేన అపి = ఈ భార్గవరామునిచే సైతము, దాశరథిః = రాముడు, దురభిభవః = దుర్జయుడు పరశురామునికి ఈ దశరథ రాముడు లొంగడనుట.

అహో ఇతి :- (సాభ్యసూయమ్ = కోపము నభినయించుచు) అహో, దుగ్ధముఖే = చంటివాడైన. తస్మిన్ = ఆ. క్షత్రియవటుకే = క్షత్రియ బాలునివల్ల.

తదేహి, రాజకులమేవ గచ్ఛావః. (ఇతి నిష్క్రాంతౌ)

—: విష్కంభకః :—

(నేపథ్యే)

భో భో జనకాగ్నిహోత్ర పరిచారకాః. పాద్యం పాద్యం. అర్ఘోఽర్ఘః.

---

ననుట, మునిః = మహర్షియునైన, పరశురామః = పరశురాముడు, అయమ్ = ఇదిగో, ప్రాప్తః = వచ్చెను. కిమ్ కరిష్యతి=ఏమి చేయునో. న విద్మః =ఎరుగము. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- క్షత్రియుల రక్తమునందు త్రిషవణ స్నానముచేసిన పరశురాముడిదే వచ్చుచున్నాడు ఏమి చేయునో ఎరుగలేము.

సమాసములు :- రాజన్యానాం రుధిరమ్ - రుధిరపూర్ణః అంభోధిః - అంభోధౌ కృతం త్రిషవణమ్ యేన సః.

సంధులు :- రుధిర + అంభోధి - సవర్ణదీర్ఘ. త్రిషవణః + మునిః - ఉత్వాదేశవిసర్గ. రామః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - రామో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- డుకృఞ్ కరణే. లృట్. పరస్మై. ప్రథమ

కరిష్యతి - కరిష్యతః - కరిష్యన్తి

విద జ్ఞానే. పరస్మై. లట్. ఉత్తమ

వేద్మి - విద్వః - విద్మః

తదితి :- తత్ = అందుచేత. ఏహి = రమ్ము. రాజకులమ్ = రాజ గృహమునకే, గచ్ఛావః = పోవుదము. (ఇతి = అని, నిష్క్రాంతౌ = ఇరువురు నిష్క్రమించిరి)

—: ఇది విష్కంభకము :—

(నేపథ్యే = తెరలో)

భో ఇతి :- భో భో = ఓయోయీ ; జనకాగ్నిహోత్ర పరిచారకాః = జనకుని అగ్నిహోత్రశాలయందలి పరిచారకులారా ; పాద్యమ్ పాద్యమ్ = పాద్యము పాద్యము. అర్ఘః అర్ఘః = పూజాద్రవ్యము, పూజాద్రవ్యము ;

అపిచ—

ఏష స్త్రైణకపోల కుంకుమ లిపి స్తేయాతిభీరో భుజే
బిభ్రాణశ్చతురంతరాజవిజయి, జ్యానాదరౌద్రం ధనుః।
తూణావేవ పునస్తరాం ప్రథయతి స్వాదన్తరస్మాత్పటా
దాకృష్టైః కుశచీరతంతుభి రభిక్రుద్ధో మునిర్భార్గవః॥ 19

---

శ్రేణిః — విభ్రాజమానా చ సా శ్రేణిశ్చ - శ్రేణిరేవ సంజ్ఞా (లిపిః) - సంజ్ఞయా అంతరితా. వసుమతీ చక్రస్య చైత్రప్రశస్తిః —అంతరితా — ప్రశస్తిర్యస్య సః. పక్షః పీతమివ ఘనాని. చ తాని అస్త్రాణి చ - ఘనాస్త్రైః ప్రజాః. ప్రజానాం కిణాః - కిణైః కఠినమ్ - తస్మిన్. రాజన్యానాం గోష్ఠి - గోష్ఠి ఏవ వనగజాః - గజానాం మృగయా- మృగయాయాం కౌతుకీ.

ఏషఇతి ;- అపిచ = మరియు - స్త్రైణ = స్త్రీలయొక్క, కపోల = చెక్కిళులందలి, కుంకుమలిపి = మకరికా పత్రములను. స్తేయ = అపహరించుట యందు, అతిభీరో = మిక్కిలి భయపడునట్టి - స్త్రీ స్పర్శను భీతి చెందువాడనుట (ఆజన్మ బ్రహ్మచారి), భుజే = చేతియందు. చతురంత రాజవిజయి - చతురంత = నాలుగు సముద్రములచే పరివేష్టింపబడిన భూమండలమునందలి. రాజ = క్షత్రియు లను, విజయి = జయించినదియు, జ్యానాదరౌద్రమ్ = ధనుష్టంకారముచే భీషణమై నదియునైన. ధనుః = ధనుస్సును, బిభ్రాణః = ధరించువాడై. ఏషః = ఈ, భార్గవః మునిః = భార్గవరాముడు, అభిక్రుద్ధః = మిక్కిలి కోపించినవాడునై. అంతరస్మాత్ = లోపలనున్న, స్వాత్ = తనయొక్క. పటాత్ = వస్త్రమునుండి - లోపలనున్న ఉత్త రీయమునుండి యనుట. ఆకృష్టైః = లాగిన, కుశచీర తంతుభిః = [నారవస్త్రపు] దారపు పోగులతో, తూణౌ ఏవ = అమ్ముల పొదులను. పునస్తరామ్ = మాటిమాటికిని — మిక్కిలి, ప్రథయతి = బిగించుచున్నాడు. (శార్దూలము) యుద్ధసన్నద్ధుడై వచ్చుచున్నా డనుట. (చతురంతరీపవిజయి అని పాఠాంతరము. చతుర్ద్వీపములను జయించిన).

తాత్పర్యము :- స్త్రీ స్పర్శ నెరుగని తన చేతియందు, సకల క్షత్రియు లను జయించిన ధనుస్సును ధరించినవాడును. ఉత్తరీయమునుండి లాగిన దారపుపోగు

(తతః ప్రవిశతి శరచాపహస్తః క్రోధోద్ధతో జామదగ్న్యః)

జామదగ్న్యః — (సఖేదమ్) అహహ యథా మృష్టభోజినా కృతాంతేన
ప్రత్యవసితాస్తే సాంయుగీనాః. వర్తమానే తు —

శస్త్రాశస్త్రి కథైవ కా ననుభవద్గీర్వాణవాణీంధమాః
పంథానోఽపి సంపదన్తి వసుధా వంధ్యా న సూతే భటాన్ ।

---

లతో అమ్ముల పొదులను మూపున బిగించుకొనుచున్నవాడునై భార్గవరాముడతిక్రుద్ధుడై సమీపించుచున్నాడు.

సమాసములు :— శ్రైద్రాశ్చ తే కపోలాశ్చ. కపోలేషు కుంకుమ లిపయః లిపీనాం శ్రేణీ అంకితాః — తస్మిన్. చతురంతస్య రాజానః — రాజ్ఞాం విజయి. జ్యాయాః నాదః — నాదేన ఘోరమ్. కుశచీరస్య తంతవః — తైః. స్త్రీపుంసాభ్యామ్ సహితౌ — [illegible]ఖమ్.

సంధులు :— ఏషః + శ్రైద్రిణ — తదేతద్విసర్గలోప. బిభ్రాణః + చతురంత కాదేశవిసర్గ. నాదో + ఏవ — అయవాదేశసంధి. తంతుభిః + అబి — మునిః + భార్గవః రేఫాదేశవిసర్గ. క్రుద్ధః + మునిః — ఉత్వాదేశ విసర్గ.

క్రియ :— దృభ (ణిచ్) పరస్మై. లట్. ప్రథమ.

ద్రభయతి — ద్రభయతః — ద్రభయన్తి

[తతః = అంతట శరచాపహస్తః = ధనుర్బాణములను చేబూనినవాడును. క్రోధోద్ధతః = క్రోధముతో మండిపడుచున్నవాడునై. జామదగ్న్యః = పరశురాముడు. ప్రవిశతి = ప్రవేశించును].

అహహేతి :— [సఖేదమ్ = బాధగా] అహహ! మృష్టభోజినా = మృష్టాన్న ప్రియుడగు [మిష్టభోజినా అని పాఠాంతరము — చనిపోయినవారిని భక్షించువాడనుట]. కృతాంతేన = యమునిచేత. తే = అప్పటివారగు. సాంయుగీనాః = యుద్ధప్రియులు క్షత్రియులు ప్రత్యవసితాః = పూర్తిగా భక్షింపబడిరి. వర్తమానే తు = ప్రస్తుత కాలమునందేమో —

శస్త్రేతి :— శస్త్రాశస్త్రికథా ఏవ = శస్త్రమునకు శస్త్రముగా యుద్ధము చేయు వార్తయే, కా = ఎక్కడిది — యుద్ధమన్నమాటయే వినబడుట లేదు. ననుభవత్ —

లక్ష్మీరప్యరవింద సౌధవలభీ నిర్వ్యూహ పర్యంకికా
విశ్రాంతై రళిభిర్న కుంజరఘటాగండోద్గతై ర్మోదతే ॥ 20

(యుద్ధరంగమున చనిపోయిన వీరులు దేవతలుగా మారిపోదురని విశ్వాసము) క్రొత్తగా అవతరించుచున్న. గీర్వాణ = దేవతలతో. పాణింధమాః = క్రిక్కిరిసినవగు, ఒకరిచేతులొకరికి ఒరసికొనుచు నడుచుచున్నారనుట. పంథానః = మార్గములు. దివి = స్వర్లోకమున. సంరుధ్యన్తి = పొదుబడుచున్నవి — దారులు మూతపడుచున్నవనుట. వసుధా = భూదేవి. వంధ్యా = గొడ్రాలై (యోగ్య సంతానము లేనిది). భటాన్ = వీరులను. న సూతే = ప్రసవించుటలేదు. లక్ష్మీః అపి = జయలక్ష్మియును. కుంజర ఘటా = యుద్ధముల కుపయోగించు మదగజ సమూహముయొక్క. గండ = గండ స్థలములనుండి, ఉద్గతైః = విడిచి ఎగిరి వచ్చినవియు — భూలోకమున గజ సైన్యమే లేకపోవుటతో ఎగిరివచ్చినవనుట. అరవింద = పద్మమనునట్టి. సౌధ = భవనముయొక్క వలభీ = పైభాగమునందలి. నిర్వ్యూహ పర్యంకికా = గిలదంతె పర్యంకమునందు. విశ్రాంతైః = చేరి విశ్రాంతి గైకొనుచున్నవియునైన. అళిభిః = తుమ్మెదలతో. న మోదతే = ఆనందింపకున్నది (నిర్వ్యూహ శ్శేఖరే ద్వారే నిర్వ్యూహో నాగదంతకే — ధరణిః)

తాత్పర్యము :- భూలోకమునందు వర్తమానకాలమున యుద్ధమన్న మాటయే వినిపించుటలేదు. రణరంగమున చనిపోయి స్వర్గలోకమున క్రొత్త దేవతలుగా అవతరించువారితో క్రిక్కిరియవలసిన స్వర్లోకమార్గములు శూన్యములై పాడువడిపోవు చున్నవి. గజ సైన్యము కరవగుటతో మదము స్రవించు గండస్థలములు దొరుకక తుమ్మెదలన్నియు పద్మమునే ఆశ్రయించి విశ్రాంతి గొనుచున్నవి. ఇది జయలక్ష్మికి - కమలాలయకు — చిరాకు పుట్టించుచున్నది. [శార్దూలము]

సమాసములు :- శస్త్రైశ్చ శస్త్రైశ్చ ప్రహృత్యేదం వృత్తం - తత్ర తేనేదమితి సరూపే - బహువ్రీహిః — ఇచ్కర్మ వ్యతిహారే (ఇచ్) — అన్యేషామపి దృశ్యతే - దీర్ఘః - శస్త్రీః కథా. నవాః భవన్తః - నవభవన్తశ్చ తే గీర్వాణాశ్చ - గీర్వాణానాం పాణింధమాః (ఉగ్రం పశ్యేరమ్మదపాణింధమాశ్చ). సౌధస్య వలభీ - వలభ్యాః నిర్వ్యూహపర్యంకికా - అరవిందమేవ... ...పర్యంకికా - పర్యంకికాయాం విశ్రాంతాః - తైః. కుంజరాణాం ఘటా - ఘటానాం గండాః- గండేభ్యః ఉద్గతాః-తైః.

(సరోషవికటం పరిక్రామన్) భో భో విదేహాః, క్వ రామో దాశరథిః ?

---

భిద్యన్తే = పగిలిపోవుచున్నవో, తత్ = అటువంటి, ఐశమ్ ధనుః = శివ ధనుస్సు, దాశరథినా = రామునిచే, భగ్నమ్ = విరిచివేయబడినది। [శంభో అని సతిసప్తమి పాఠాంతరము]

తాత్పర్యము :- ఏ ధనుస్సును శివు దాకర్ణాంతముగా ఎక్కుపెట్టినంతనే త్రిపురాసురస్త్రీల కర్ణోత్పలములు రాలిపోవునో, సంధించిన బాణమును ప్రయోగించి ఆ యూపున వింటినారి శివుని చేతి మణికట్టును తాకిన సవ్వడి సోకినంతనే త్రిపురాసుర స్త్రీల కంకణములు చిట్లిపోవునో (వైధవ్యము ప్రాప్తించుననుట) ఆ శివధనుస్సు దశరథ రామునిచే భగ్నము గావింపబడినది. అహో ! (శార్దూలము)

సమాసములు :- గుణః వల్లరీవ - యస్య గుణవల్లరీ - తామ్. కర్ణస్య అంతికమ్. కర్ణేషు అలంకృతాని ఉత్పలాని - కర్ణోత్పలానాం గ్రంథయః. త్రిపురస్య అవరోధసుదృశః - తాసామ్

సంధులు :- శంభుః + యత్ - రేఫాదేశవిసర్గ. ఉపనయతి + అభ్యేష్య - యణాదేశ. కర్ణ + అంతికమ్. త్రిపుర + అవరోధ, చ + అప్యాలయతి - సవర్ణదీర్ఘ కర్ణ + ఉత్పల - గుణసంధి ఉత్ + ముఖ్య - అనునాసికాదేశ.

క్రియ :- భ్రంశు అధః పతనే (శ్యన్) పరస్మై. లట్, ప్రథమ

భ్రశ్యతి - భ్రశ్యతః - భ్రశ్యన్తి

భిదిర్ విదారణే, కర్మకర్తర్యాత్మనే పదమ్, లట్, ప్రథమ-

భిద్యతే - భిద్యేతే - భిద్యన్తే

అలంకారము :- శివుని చెవికి వింటినారి సోకగా త్రిపురాసుర స్త్రీల కర్ణోత్పలములు రాలిపోయినవి. అదే వింటినారి శివుని చేతికి సోకగా త్రిపురాంగనల హస్త కంకణములు చిట్లిపోయినవి. కార్యకారణముల భిన్నదేశత్వము అసంగతి అను అలంకారమగును. విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వోరసంగతిః విషం జలధరైః పీతం మూర్ఛితాః పథికాంగనాః

భో భో ఇతి :- (సరోషవికటమ్ = రోషముతో వికటముగా. పరిక్రామన్ = ముందునకు అంగులు వేయుచు) భో భో విదేహాః = ఓయోయీ ! విదేహ ప్రజలారా! దాశరథిః = దశరథుని సుతుడైన, రామః = రాముడు, క్వ = ఏడీ ? ఎక్కడ ?

యస్మిన్నర్జునదోస్సహస్రనలకప్రోద్గచ్ఛదస్రచ్ఛటా
జిహ్వాలే జుహవాంబభూవిమ రుషా రాజన్యసత్తామపి ।
సోఽయం ప్రాక్తనకాలగ్రహస్య విఘసీభూతేష్వపి క్షత్రియ
క్షుద్రేషు క్షుధితశ్చిరేణ పరశు స్తేనాయ మన్విష్యతే॥ 22

---

యస్మిన్నితి :- అర్జున = కార్తవీర్యార్జునునియొక్క. దోస్సహస్ర = వేయిబాహువులయొక్క. నలక = అస్థికలనుండి (కాహాస్థి నలకం ప్రోక్తమ్. బాహ్వాస్థి నలకం క్లీబమ్ - హలాయుధః). ప్రోద్గచ్ఛత్ = ఎగసిపడుచున్న, అస్రచ్ఛటా = రక్తప్రవాహములచేత. జిహ్వాలే = ఎఱ్ఱని నాల్కలు కలదైన. యస్మిన్ = ఏ పరశువు నందు, రాజన్యసత్తామ్ అపి = క్షత్రియుల ఉనికినికూడ(అస్తిత్వము, యావత్త్వము). రుషా = కోపముతో. జుహవాంబభూవిమ = హోమము చేసివేసితిమో. సః అయమ్= అట్టి ప్రసిద్ధికెక్కిన ఇదే. పరశుః = గండ్రగొడ్డలి. ప్రాక్తనకాలగ్రహస్య = తొలి నాళ్ళనైన [illegible]. విఘసీభూతేషు = భుక్తశేషముగా మిగిలిన (అమృతం విఘసో యజ్ఞశేషభోజన శేషయోః - అమరము). క్షత్రియక్షుద్రేషు=అల్పక్షత్రియుల పట్ల. చిరేణ = చాల కాలముగా. క్షుధితః = ఆకలిగొన్నది (కావుననే భుక్తశేషము [illegible]). స్తేన = అంతటిచేత లేక దానిచేత, అయమ్ = ఈ దాశరథి. అన్విష్యతే = అన్వేషింపబడుచున్నాడు. (స్వేన అని పాఠాంతరము. తన పరశువుచేత స్వయముగా నని అర్థము.) శార్దూలము.

తాత్పర్యము :- కార్తవీర్యార్జునుని బాహుసహస్రముల నుండి వెల్లువికిన రక్తప్రవాహములే నాలుకలుగా సకల క్షత్రియ సమూహమును నాశనముచేసిన నా పరశువు ఇప్పుడు భుక్తశేషముగా మిగిలిపోయిన అల్ప క్షత్రియులనుగూడ భక్షించుటకు నేడు ఆరాటపడుచున్నది. రాముడెక్కడ అని అన్వేషించుచున్నది.

సమాసములు :- అర్జునస్య దోస్సహస్రమ్ - సహస్రస్య నలకాని - నలకేభ్యః ప్రోద్గచ్ఛన్త్యః చ తాః అస్రచ్ఛటాః - అస్రచ్ఛటాభిః జిహ్వాలః - తస్మిన్. ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్ - లచ్ - జిహ్వాలః. రాజన్యానాం సత్తా - తామ్. ప్రాక్తనః కాలగ్రహః - తస్య. క్షుద్రాశ్చ తే క్షత్రియాశ్చ - [illegible] అని సమాసము - పూర్వనిపాత - తేషు.

(తతః ప్రవిశతి సధైర్యప్రమోదో దాశరథీ రామః)

సాకం శక్తిధరేణ తత్రభవతో దేవాద్భవానీపతే
ర్యః సమ్యంచమవాప చాపనిగమం సమ్యంచి సామాని చ ।
శూరాణాం చ తపస్వినాం చ పరమాం కాష్ఠామధిష్ఠాస్నుభి
స్తేజోభిర్భగవానసౌ భృగుపతిర్దిష్ట్యాద్య దర్శిష్యతే ॥ 23

---

సంధులు :— యస్మిన్ + అధ్వని - అనునాసికద్విత్వ. సః + అయమ్ - ఉత్వాదేశ - సో + అయమ్ - పూర్వరూప. ఖాలేషు + అపి - యణాదేశ. పాధిపః + చ. పరశుః + తేన - శషసాదేశసంధి.

క్రియ :- భీహ్రీభృహువాం శ్లువచ్చ(అమ్) చిత్తవిశేషాత్ పరోక్షే లిట్,
ఉత్తమ. హు దానాదనయోః
జుహవాంబభూవ—జుహవాంబభూవివ—జుహవాంబభూవిమ
ఇష గతౌ, కర్మణి. ఆత్మనే. లట్. ప్రథమ
అన్విష్యతే - అన్విష్యేతే - అన్విష్యన్తే

(తతః = అంతట. సధైర్యప్రమోదః = ధైర్య ఆనందములతో కూడిన. దాశరథిః రామః = దశరథ రాముడు, ప్రవిశతి = ప్రవేశించును)

సాకమితి :- తత్రభవతః = పూజ్యుడయిన. దేవాత్ = దైవమయిన. భవానీపతేః = శివుని నుండి. శక్తిధరేణ సాకమ్ = కుమారస్వామితో కలిసి, చాపనిగమమ్ = ధనుర్వేదమును, చ = మరియు. సమ్యంచి = పవిత్రములైన. సామాని = సామవేదమంత్రములను, యః = ఏ వ్యక్తి, సమ్యంచమ్ = బాగుగా, అవాప = అధ్యయనము చేసెనో లేక పొందెనో. శూరాణామ్ = అటు మహావీరులలోను, తపస్వినామ్ = ఇటు మహాతపస్వులలోను, పరమామ్ కాష్ఠామ్=ఉత్తమోత్తమ స్థానమును-పై అవధిని. అధిష్ఠాస్నుభిః = అధిష్ఠించునట్టి, తేజోభిః = తేజస్సులతో(కూడినవాడై) అసౌ = ఈ, భగవాన్ = మహానుభావుడు, భృగుపతిః = పరశురాముడు. దిష్ట్యా = అదృష్టవశమున, అద్య = ఈనాడు, దర్శిష్యతే = దర్శింపబడుచున్నాడు.

తాత్పర్యము :- కుమారస్వామికి సహాధ్యాయియై పరమేశ్వరుని నుండి ధనుర్వేదమును సామవేదమును అభ్యసించి శూరులలోను తపస్వులలోను అగ్రగణ్య

జామదగ్న్యః :– (సఖేదోపాలంభమాత్మానం ప్రతి)

భస్మాంకురేతి ఖురళీకలహే కుమార
మప్యాక్షిపన్ పరుషరోషరసార్ద్ర చేతాః ।
దృష్టోఽస్మి యః కృతమిథోహసితం శివాభ్యాం
తచ్చాపభంగమపి హా సఘృణః శృణోమి ॥ 24

---

దైన పరశురాముని దర్శనము అదృష్టవశమున రామునకు లభించుచున్నది. (గ్లాజిస్థశ్చగ్స్నుః – అధిష్ఠాస్నుః) శబ్దాలము.

క్రియ :– ఆప్లృ వ్యాప్తౌ. (ఖ్ను) పరస్మై. లిట్. ప్రథమ.

ఆప – ఆపతుః – ఆపుః

దృశిర్ ప్రేక్షణే, కర్మణి, ల్పట్. ఆత్మనే. ప్రథమ.

దర్శిష్యతే – దర్శిష్యేతే – దర్శిష్యన్తే

[illegible] :– (సఖేదోపాలంభమ్ = ఖేదముతో తన్నుతాను నిందించుకొనుచున్నట్లు. ఆత్మానమ్ ప్రతి = తనతో తానుగా) ఖురళీ కలహే = ప్రదర్శనకై ఏర్పాటుచేసిన కలహాంతమునందు. (ఖురళీ అనగా విద్యాభ్యాస భూమి – అభ్యాసః ఖురళీ యోగ్యా – పాదాపనీ – యని కొందరును, శస్త్రప్రయోగమునకు లక్ష్యముగా నేర్పరుపబడిన [illegible] కొందరును – ఖురళీలక్ష్యబంధనమితి కేశవః హరిహరదీక్షిత) పరుష = దారుణమైన. రోషరస = క్రోధభావాతిశయముతో. ఆర్ద్ర = ఉచితజ్ఞతను కోల్పోయిన. చేతాః = అంతరంగములవాడనై. కుమారమ్ = కుమారస్వామిని. భస్మాంకుర ఇతి = ఓరీ భస్మాంకురా ! అని [భగ్నవ్రతాత్పముత్పన్నో యోఽసౌ భస్మాంకురః స్మృతః – [illegible]. అనుటచే శివుడు మునిపత్నులపట్ల భగ్నవ్రతుడగుట నాతని పుత్రుడు భస్మాంకురుడు అయ్యె). ఆక్షిపన్ అపి = నిష్ఠురముగా చెప్పుచున్నవాడనై నప్పటికిని (రా రా యని తొడగొట్టి పిల్చుట పెద గుండెల). శివాభ్యామ్ = పార్వతీపరమేశ్వరులచేత. కృతమిథోహసితమ్ = ఒండొరులు నవ్వుకొనుటగా. యః = ఏ నేను. దృష్టః అస్మి = చూడబడితినో. సః అహమ్ = ఆ నేను, సఘృణః = దయనీయుడనై. హా = అయ్యో! తత్ = ఆ శివునియొక్క. చాపభంగమ్ అపి = ధనుర్భంగముగూడ. శృణోమి = వినుచుంటిని – విని ఉప్పటివడకు నూరకుండుట దయనీయ స్థితి అనుట. (మసృణః అని పాఠాంతరము – మందుడనై అని అర్థము)

(విమృశ్యచ) అహో ! మామరణ్యనివాసినముపశ్రుత్య దురాత్మనా రఘు కుటుంబకేన దూరముచ్ఛ్వసితమ్. (కించిదుచ్చైః)

రే కాకుత్స్థాః కథం వః శ్రుతివిషయమయం నాగమద్భార్గవోయో
దుస్సామంతాపచారప్రచిత పితృ వధామర్ష నిస్తారబంధుః ।

---

తాత్పర్యము :- బలప్రదర్శనకై ఏర్పరచిన ఖురళీ కలహమునందు ఔచిత్యము కోల్పోయి క్రోధముతో కుమారస్వామిని ఓస్కంటకుర అని పిలిచితిని. దానికి పార్వతీ పరమేశ్వరులు కోపింపక ఒంటోరులు నవ్వుచు నన్ను వాత్సల్యముతో చూచిరి. అట్లు వారి ప్రేమను కుమారస్వామి కంటె అధికముగా పొందిన నేను శివ ధనుర్భంగమును విని ఇంతవరకు సూరకొంటిని. సిగ్గు ! సిగ్గు !! [వసంతతిలక]

సమాసములు :- ఖురళ్యాం ఖురళీతి వా కలహః-తస్మిన్. పరుషశ్చాసౌ రోష రసశ్చ - రసేన అంధమ్ - రసాంధం చేతః యస్య సః. స్మితం మిథోపాంసితం. యథా భవతి తత్తథా. శివశ్చ శివా చ - శివౌ (పుమాన్ స్త్రియా - ఏకశేషః) తాభ్యామ్. తస్య చాపః - చాపస్య భంగమ్. ఘృణయా సహితః. ధిక్కష్ట అంటురః - తత్పురుష.

సంధులు :- అంకుర + ఇతి - గుణసంధి. అపి + అశీషన్ - యణాదేశ. రస + అంధ - సవర్ణ దీర్ఘ. దృష్టః + అస్మి - ఉత్వాదేశవిసర్గ - దృష్టో + అస్మి - పూర్వరూప. తత్ + చాప - శ్చుత్వ.

క్రియ :- అస భువి. పరస్మై. లట్. ఉత్తమ
అస్మి - స్వః - స్మః
శ్రు శ్రవణే. పరస్మై. లట్. ఉత్తమ.
శృణోమి - శృణువః / శృణ్వః - శృణుమః / శృణ్మః

అహో ఇతి :- (విమృశ్య చ = ఆలోచించి) అహో ! మామ్ = నన్ను, అరణ్యనివాసినమ్ = వనమునందు తపస్సుచేసికొనుచున్నవానినిగా. ఉపశ్రుత్య = విని దురాత్మనా = దుర్మార్గుడైన, రఘుకుటుంబకేన = దాశరథిచే - దుర్మార్గుడైన రఘువంశముచే అని కాని - దూరమ్ = మిక్కిలి, ఉచ్ఛ్వసితమ్ = సాహసింపబడినది. (కించిత్ ఉచ్చైః = కొంచెము బిగ్గరగా)

రే ఇతి :- రే = ఓరోరీ ! కాకుత్స్థాః = కకుత్స్థ వంశోద్భవులారా ! దుస్సామంత = దుష్టరాజన్యులయొక్క, అపచార = అత్యాచారముతో. ప్రచిత = నిర్వ

వారానావన్నవింశాన్ విశసిత విషమక్షత్రజాతిప్రరోహః
క్రోధాదుత్కృత్తగర్భామిషరుధిరవసావిస్రగంధిః కుఠారః ॥ 25

---

హింపబడిన. పితృవధ = నా తండ్రియొక్క వధవల్లనైన. అమర్ష = క్రోధముయొక్క విస్తార = పరిపూర్తికి - క్రోధమును తొలగించుకొనుటయందు. బంధుః = సహాయపడినదియును. అనన్నవింశాన్ వారాన్ = ఇరువదియొక్క మారులు (అనన్నవింశః = ఇరువదికి దగ్గరివి). విశసిత = సంహరింపబడిన, క్షత్రజాతిప్రరోహః = క్షత్రియ వంశాంకురములు గలదియును. క్రోధాత్ = రోషముతో, ఉత్కృత్త = చీల్చివేయబడిన. గర్భ = రాజకాంతల గర్భములయందలి (గర్భస్థ శిశువులు), అమిష=మాంసము రుధిర = రక్తము. వసా = క్రొవ్వు - వీనిచేనైన. విస్రగంధిః=అమవాసనగలదియును (విస్రం స్యాదామగంధి యత్ - అమరము). భార్గవీయః = భార్గవరామునిదియునైన. అయమ్ = ఈ. కుఠారః = గండ్రగొడ్డలి. వః = మీ యొక్క, శ్రుతివిషయమ్ = శ్రోత్ర పథమును. న అగమత్ కిమ్ = పొందలేదా ; దీనిని గురించి వినలేదా అనుట. (స్రగ్ధర)

తాత్పర్యము :- దుష్టులైన క్షత్రియులు మా తండ్రిని సంహరింపగా దానికి ప్రతీకారమును చేయుటలో ప్రధానసాధనమై సహకరించినదియు, ఇరువదియొక్క మారులు క్షత్రియవంశములను నాశనము చేసినదియు, క్షత్రియకాంతల గర్భములను విచ్ఛిన్నము చేసినదియునైన నా ఈ గండ్రగొడ్డలిని గురించి వినియుండలేదా ! ఓరోరీ ! రాజన్యులారా !

సమాసములు :- దుష్టాశ్చ తే సామంతాశ్చ - సామంతానామపచారః - అపచారేణ ప్రచితః - ప్రచితశ్చాసౌ పితృవధశ్చ - వధాదమర్షః - అమర్షస్య విస్తారః విస్తారేబంధుః. అనన్నావింశతిర్యేషామ్ (సంఖ్యయావ్యయాసన్నేత్యాదినా బహువ్రీహిః) అనన్నవింశాః - తాన్. (బహువ్రీహౌ సంఖ్యేయే డజబహుగణాత్ - డచ్. తివింశతేర్డితి - టిలోపః). విషమక్షత్రజాతేః ప్రరోహః - విశసితః.... .... ప్రరోహః యేన సః. ఉత్కృత్తశ్చాసౌ గర్భశ్చ - అమిషం చ రుధిరం చ వసా చ - గర్భస్య అమిషరుధిరవసాభిః విస్రగంధిః

సంధులు :- న + అగమత్. సామంత + అపచార. వధ + అమర్ష - సవర్ణదీర్ఘ. భార్గవీయః + దుస్సామంత - ఉత్వాదేశవిసర్గ.

రామః :- (దృష్ట్వా సహర్షబహుమానమ్)

జేతారం దశకంధరస్య రభసాద్దోఃశ్రేణి నిశ్శ్రేణికా
తుల్యారూఢసమస్తలోక విజయశ్రీపూర్యమాణోరసమ్ ।
యస్సంఖ్యే నిజఘాన హైహయపతిం శత్రోర్ముఖం దృష్టవాన్
యః పృష్ఠం దదతోఽపి షణ్ముఖజయే సోఽయం కృతీ భార్గవః॥ 26

---

క్రియ :- గమ్ఌ గతౌ, పరస్మై, లుఙ్, ప్రథమ
అగమత్ - అగమతామ్ - అగమన్

జేతారమితి :- (దృష్ట్వా = చూచి, సహర్షబహుమానమ్ = ఆనందముతో, ఆదరముతో) దశకంధరస్య = రావణాసురునికి, జేతారమ్ = విజేతయు - రావణుని జయించినవాడనుట, రభసాత్ = సంరంభముతో, దోఃశ్రేణి = బాహుసహస్రమనునట్టి నిశ్శ్రేణికా = నిచ్చెనలను (నిశ్శ్రేణిస్త్వధిరోహిణీ - అమరము). తుల్య = సమానముగా ఒకేసారి, ఆరూఢ = అధిరోహించిన, సమస్తలోకవిజయశ్రీ = త్రిభువన విజయ లక్ష్మితో, పూర్యమాణ = ఆక్రమింపబడిన, ఉరసమ్ = వక్షః స్థలము కలవాడునైన, హైహయపతిమ్ = కార్తవీర్యార్జునుని, సంఖ్యే = యుద్ధమునందు, యః = ఏ మహావీరుడు, నిజఘాన = సంహరించెనో, షణ్ముఖజయే = కుమారస్వామినోడించునప్పుడు, పృష్ఠం దదతః అపి = పారిపోవుచున్నను, శత్రోః = శత్రువుయొక్క (షణ్ముఖునియొక్క), ముఖమ్ = మోమును, యః = ఏ మహాశూరుడు, దృష్టవాన్ = చూచెనో (చూడగల్గెనో), సః = అంతటి ప్రసిద్ధుడై, కృతీ = ధన్యుడైన, భార్గవః = పరశురాముడు, అయమ్ = ఇతడే। (శార్దూలము)

తాత్పర్యము :- రావణాసురుని జయించినవాడును, సహస్రబాహువులచే సంపాదింపబడిన త్రిభువన జయలక్ష్మి కలవాడు అయిన కార్తవీర్యార్జునుని అవలీలగా జయించిన మహావీరుడును, కుమారస్వామి ఓడిపోయి పారిపోవుచుండుటచే వెనుకతట్టు ముఖమును చూడగల్గిన మహాశూరుడునగు ధన్యాత్ముడు ఆ పరశురాముడితడే।

సమాసములు :- దోఃశ్రేణిరేవ నిఃశ్రేణికాః - నిశ్శ్రేణికాభ్యః తుల్యం ఆరూఢా - ఆరూఢా చ సా సమస్తలోకవిజయశ్రీః - శ్రియా పూర్యమాణం. ఉరః యస్య సః - తమ్ షణ్ముఖస్య జయే.

(క్షణం చ నిర్వర్ణ్య సస్మితమ్) అహో! సంకీర్యమాణానేకరసానుభావ గంభీరమధురోఽయమస్యాభోగః. తథాహి —

జటాం ధత్తే మూర్ధా పరశుధనుషీ బాహుశిఖరం
ప్రకోష్ఠో రౌద్రాక్షం వలయ మిషుదండానపి కరః ।
ప్రరూఢ ప్రౌఢాస్త్రవ్రణ వికట రౌద్రాద్భుతమిదం
ప్రశాంతామైణేయీం త్వచమపి చ వక్షః కలయతి ॥ 27

---

సంధులు :- తుల్య + ఆరూఢ - సవర్ణదీర్ఘ. పూర్యమాణ + ఉరసమ్ - గుణసంధి. శ్రోత్రో: + ముఖమ్ - రేఫాదేశవిసర్గ. దదతః + అపి. సః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - దదతో + అపి. సో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- హన హింసాగత్యోః. పరస్మై. లిట్. ప్రథమ. (ని)

జఘాన - జఘ్నతుః - జఘ్నుః

అహో ఇతి :- (క్షణమ్ = క్షణకాలము, నిర్వర్ణ్య = పరిశీలనగాచూచి, సస్మితమ్ = చిఱునవ్వుతో) అహో! సంకీర్యమాణ = కలగలియుచున్న. అనేకరస = పలు రసములను సంబంధించిన. అనుభావ = వికృతులతో. గంభీర = గంభీరమైనదియు మధురః = రమణీయమైనదియును. అస్య = ఈ పరశురామునియొక్క. అయమ్ = ఈ. ఆభోగః = రూప విస్తారము. తథా హి = అంతే కదా! —

జటామితి :- మూర్ధా = ఈ పరశురాముని శిరస్సు. జటామ్ = జటను. ధత్తే = ధరించుచున్నది. బాహుశిఖరమ్ = రెండు భుజముల అగ్రభాగద్వయము. పరశు ధనుషీ = గొడ్డలిని ధనుస్సును. ధత్తే = ధరించుచున్నవి (ఒక అంసముపై పరశువు మఱొక అంసముపై ధనువు). ప్రకోష్ఠః = మణికట్టు. రౌద్రాక్షమ్ = రుద్రాక్ష నిర్మితమైన. వలయమ్ = మాలికను. ధత్తే = ధరించుచున్నది. (రెండు చేతులకును రుద్రాక్ష మాలలున్నవనుట). కరః = చేయి. ఇషు దండాన్ = బాణములను పలాశ దండమును. ధత్తే = ధరించుచున్నది (ఒకటి బాణము. ఒకటి దండము). ప్రరూఢ = లోతుగా నాటుకొని స్థిరపడిన. ప్రౌఢాస్త్రవ్రణ = గొప్ప ఆయుధాఘాతములతో (గాయముల మచ్చలు కన్పించుచున్నవనుట), వికట = భీకరమై. రౌద్ర = రౌద్రముగను, అద్భుతమ్ = ఆశ్చర్యజనకముగనునున్న. ఇదమ్ = ఈ కన్పించుచున్న. వక్షః = పరశు

(ఇత్యుపసర్పతి)

జామదగ్న్యః :- (విలోక్య) కథమయమసౌ శ్రూయమాణగుణానుకల్పితాకారసంవాదీ దాశరథిః. సాధు రే రాజన్యపోత. సాధు.

---

రాముని ఉరః స్థలము, ప్రశాంతామ్ = సాత్త్వికమగు, ఐణేయీమ్ త్వచమ్ అపి = లేడి చర్మమును గూడ,(జింకతోలు) కలయతి = అందముగా వహించుచున్నది.(శిఖరిణి)

తాత్పర్యము :- పరశురాముని ఆకారము పలురసముల కలగలుపువలె నున్నది. శిరస్సుపై జడ, భుజములపై గొడ్డలి ధనుస్సు. మణికట్టులకు రుద్రాక్ష మాలలు, చేతులలో బాణము మోదుగు దండము, కాయలుకాసి ధీరమైన వక్షః స్థలమున (ఉత్తరీయముగ) అజినము – అందముగా భాసించుచున్నవి. శాంతము రౌద్రము అద్భుతమునైన రూపమునుట.

సమాసములు :- పరశుశ్చ ధనుశ్చ. బాహోః శిఖరమ్ ప్రోధాని చ తాని అస్త్రాణి చ - అస్త్రైః కృతాని వ్రణాని - ప్రరూఢాని చ తాని వ్రణాని చ - వ్రణైః వికటమ్ రౌద్ర మద్భుతం చ.

క్రియ :- డు ధాఞ్ ధారణపోషణయోః, ఆత్మనే, లట్, ప్రథమ.

ధత్తే - దధాతే - దధతే

కల గతౌ సంఖ్యానే చ (ణిచ్) పరస్మై. లట్. ప్రథమ.

(కలిః కపీనాం కామధేనుః)

కలయతి - కలయతః - కలయన్తి

(ఇతి = అని, ఉపసర్పతి = సమీపించును)

కథమితి :- (విలోక్య = తేరిపారజూచి) కథమ్ = ఎట్టా ! శ్రూయమాణ = అప్పటప్పట వినబడిన, గుణ=(శౌర్యౌదార్యరూపయౌవనాది) గుణములతో, అనుకల్పిత = ఊహించుకొనిన [మనసులో నిర్మించుకొనిన], ఆకార = రూపముతో, సంవాదీ = సరిపోలుచున్న. దాశరథిః = రాఘవుడు. అయమ్ అసౌ = ఇతడే ! రాజన్యపోత = ఓరీ రాచబిడ్డా !, సాధు రే సాధు = బాగురా బాగు బాగు !!!

సవిధమితి :- సవిధమ్ = సమీపమును, ఉపసరన్ = పొందుచు - దగ్గరకు వచ్చుచు, నీవు, కరికుంభకూట = గజకుంభాగ్ర భాగములయొక్క, కోటి =

సవిధము పసరిస్పమూలకాషం
కషితనృపాన్వయమద్య మాంధినోషి ।
హరిమివ కరికుంభకూట కోటి
ప్రకట కఠోరనఖాంకురం కురంగః ॥ 28

రామః :- (సస్మితమ్) భగవన్ భార్గవ. గురుగర్భరూపయోరేతావదే
వాంతరమ్. కించ—

కోటి సంఖ్యగల ; మూపురములచే. ప్రకట = వెల్లడియైన - అనేక కుంభస్థలముల యందు నాటుకొని ప్రసిద్ధి కెక్కిన అనియు - కఠోర = తీక్ష్ణమైన. నఖాంకురమ్ = నఖముల అగ్రభాగములు కలదియగు, హరిమ్ = సింహమును. కురంగః ఇవ = లేడి వలె. మామ్ = నన్ను. సమూలకాషమ్ = ఆమూలమూలముగా [పూర్తిగా నుసుట] కషిత = పిప్పిగావించిన. నృపాన్వయమ్ = రాజవంశములు కలవానిని. అద్య = నేడు ధినోషి = ఆనందింపజేయుచున్నావు. [కూటం శిఖరసంఘయోః]

తాత్పర్యము :- కోటి గజ కుంభములను చీల్చి ప్రసిద్ధి కెక్కిన సింహ మును లేడిపిల్ల చేరుకొన్నట్లు నీవిప్పుడు సర్వరాజ వంశ వినాశకుడనైన నన్ను సమీ పించుట ఆనందదాయకముగా నున్నది.

సమాసములు :- సమూలకాషమ్ - సమూలనిమూలయోః కషః-ణముల్. కషితః నృపాన్వయః యేన సః - తమ్. కరిణాం కుంభాః - కుంభానాం కూటాని - కూటానాం కోట్యః - కోటిషు ప్రకటః - కఠోరశ్చాసౌ నఖాంకురశ్చ - ప్రకటాః కఠోర నఖాంకురాః యస్య సః - తమ్.

క్రియ :— ధివి ప్రీణనే (ధిన్వ్) పరస్మై. లట్, మధ్యమ
ధినోషి — ధినుథః - ధినుథ

ఛందస్సు :— పుష్పితాగ్రము. అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.

భగవన్నితి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) భగవన్ = మహాత్మా ! భార్గవ = పరశురామా ! గురు గర్భరూపయోః = పెద్దలకును పిన్నలకును [గర్భ రూపః = బాలకః]. ఏతావత్ ఏవ అంతరమ్ = అంతర మింతటిదే. నీవు పెద్దవాడవు

ఆదేష్టా భగవాన్ భృగుర్జననయో రౌత్పత్తిక బ్రాహ్మయో
ర్దేవో ధూర్జటి రస్త్రకర్మణి గురుర్వీర్యం చ దూరే గిరామ్।
సప్తద్వీపవతీం దదద్భువ మభిప్రైషి ద్విజాన్ కశ్యప
ప్రాయానప్రతిమానుభావ భవతే కస్మైచిదస్మై నమః ॥ 29

---

కావున సింహముతో పోలిక, నేను పిన్నవాడను కావున కుఠింగముతో పోలిక — ఉచితమే అనుట. కించ = మరియు —

ఆదేష్టేతి :- ఔత్పత్తిక బ్రాహ్మయోః = పుట్టుక బ్రహ్మచర్య దీక్ష అనునట్టి, జననయోః = [సీ] రెండు జన్మలకును, భగవాన్ = మహాత్ముడైన, భృగుః = భృగు మహర్షి. ఆదేష్టా = నిర్వాహకుడు. జన్మనిచ్చినవాడును ఉపనయనము చేసినవాడుననుట. అస్త్రకర్మణి = అస్త్ర విద్యయందు. దేవః = సాక్షాత్తుగా దేవుడైన. ధూర్జటిః = పరమేశ్వరుడు. గురుః = ఉపదేశకుడు. చ = ఇంక. వీర్యమ్ = [సీ] పరాక్రమము. గిరామ్ = వాక్కులకు. దూరే = దూరమునందు [వర్తతే = ఉన్నది] - వాక్కులకు అందనిదనుట. సప్తద్వీపవతీమ్ = ఏడు ద్వీపములతో కూడిన, భువమ్ = భూలోకమును, దదత్ [సన్] = జయించి చేకొన్నవాడవై. కశ్యపప్రాయాన్ = కశ్యపుడు మొదలైన, ద్విజాన్ = మహర్షులను, అభిప్రైషి = ప్రతిగ్రహీతలుగా పొందుచున్నావు — వారిని చేరికోరి దానము చేసితివనుట. అప్రతిమానుభావ = ఓ సాటిలేని పరాక్రమము కలవాడ! అస్మై = ఇటువంటి, కస్మైచిత్ = అనిర్వచనీయ గుణములు కలిగిన. భవతే = నీకై, నమః = ఇదే వందనము. [శార్దూలము]

తాత్పర్యము :- ఓ అప్రతిమానుభావా! నీకు జన్మనిచ్చి ఉపనయనముచేసి బ్రహ్మోపదేశము చేసినవాడు సాక్షాత్తు భృగుమహర్షి. అస్త్రవిద్యా గురువు పరమేశ్వరుడు. ఇక నీ పరాక్రమమో మాటలకు అందనిది. యావద్భూలోకమును జయించి కశ్యపాదులకు కోరి దానము చేసిన మహానుభావుడవు. నీకిదే నమస్కారము.

విశేషములు :- సప్తద్వీపములు సప్తసముద్రములున్నవని—జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాకశాల్మలి పుష్కరాః ద్వీపాస్సప్తాథ సప్తైవ సముద్రా అపి కీర్తితాః లవణేక్షు సురా సర్పిర్దధి దుగ్ధపయోమయాః — పురాణము.

సమాసములు :- ఉత్పత్తి భవమౌత్పత్తికం (అధ్యాత్మాదిత్వాత్ ఠఞ్)

జామదగ్న్యః :- అరే క్షత్రియడిమ్భ, తవానేన సత్త్వసౌజన్య పౌరుషోత్క-
ర్షేణ కిమప్యన్తరాప్యాయితోఽస్మి. కిం తు—
నారాచైః కృతవీర్యనన్దనవధూవాష్పప్రియంభావుకై-
రుత్పాద్య క్షతజోదమర్ణవమథ న్యస్తం పితృభ్యాం పయః ।

---

చ (బ్రాహ్మం చ (పఠంతి...ణం వ్రతం బ్రహ్మ) – తయోః. అప్రతిమః అనుభావః యస్య సః తత్సంబుద్ధి.

సంధులు :- భృగుః + జననయోః + రుత్పత్తిర బ్రాహ్మయోః + దేవః, ధూర్జటిః + అపి, గురుః + వీర్యమ్ - రేఫాదేశవిసర్గ. దేవః + ధూర్జటిః - ఉత్వాదేశ విసర్గ. ప్ర + ఏషి – వృద్ధి అప్రతిమ + అనుభావ – సవర్ణదీర్ఘ.

క్రియ :- ఇణ్ గతౌ. (ఇటి) పరస్మై. లట్. మధ్యమ

ఏషి - ఇథః - ఇథ

అభిప్రైషి ద్విజాన్ అను పాఠాంతరమును చూచి ఇణ్ ధాతోర్లుటి గాజాదేశో వికల్పిత ఇతి భోజరాజేన శబ్దప్రకాశికాయాముక్తమ్. ఇణో యణి ప్లేస్సిచ్. సిచివృద్ధిః పరస్మైపదేషు ఇతిశ్చేతిః. అస్తి సిచోఽపృక్తే ఇతీడాగమః వృద్ధిశ్చ - అని లుఙ్ మధ్యమైకవచన ముగా [...] పాఠాంతర టీకయందు సాధించినది.

అరే ఇతి :- అరే క్షత్రియ డింభ = ఓరీ క్షత్రియ బాలకా ; తవ = నీ యొక్క. అనేన = ఈ, సత్త్వ = బలము, సౌజన్య = ప్రియవాదిత్వము. పౌరుష = పౌరుషము - అను వీనియొక్క, ఉత్కర్షేణ = అతిశయముతో, కిమపి = ఏదో తెలియకున్నను. అంతర్ = లోలోపల. ఆప్యాయితః అస్మి = సంతుష్టుడనగుచుంటిని. కిన్తు = కాని –

నారాచైరితి :- కృతవీర్యనందన=కార్తవీర్యార్జునునియొక్క. వధూ = భార్యలయొక్క, బాష్ప = కన్నీటికి, ప్రియంభావుకైః = పోషకములైన– ఆ స్త్రీలను దుఃఖింపజేయునవనుట, నారాచైః = బాణములతో. క్షతజోదమ్ = రక్తమే నీరుగా కల్గిన, అర్ణవమ్ = సముద్రమును, ఉత్పాద్య = కల్పించి, అథ = అటుపైని, పితృభ్యామ్ = నా తల్లిదండ్రులకు, పయః = (రక్త) తర్పణము, న్యస్తమ్ = ఈయబడినది. సమస్తబాహుజభుజః=సకల క్షత్రియులను భక్షించినదై, నిర్వాసనతః =

సంప్రత్యస్య సమస్తబాహుజభుజః క్రోధస్య నిర్వాస్యతః
క్షున్దానో ధనురైన్దుశేఖరమహో జాతో భవానిన్ధనమ్॥ 30

రామః :- (స్మిత్వా) భగవన్,

బాలస్వభావసులభేన కుతూహలేన
కృష్టం ధనుర్భగవతో వృషభధ్వజస్య ।

---

ఉపశమించుచున్న. అస్య = ఈ. క్రోధస్య = క్రోధమునకు. సంప్రతి = ఇప్పుడు. ఐన్దుశేఖరమ్ = చంద్రశేఖరునికి సంబంధించిన. ధనుః = వింటిని. క్షున్దానః = భగ్నముగావించినవాడవై, భవాన్ = నీవు, ఇన్ధనమ్ = ఇంధనముగా — మండించు సాధనముగా, జాతః = ఏర్పడితివి. (శార్దూలము)

తాత్పర్యము :- కార్తవీర్యార్జుని భార్యలకు భర్తృవియోగ దుఃఖమును కల్పించిన బాణములతో రక్తసముద్రమును సృష్టించి నా తల్లిదండ్రులకు తర్పణములు విడిచితిని. క్షత్రియులనందరిని భుజించి చల్లారుచున్న నా క్రోధవహ్నికి నీ విప్పుడు హరధనుస్సును భగ్నముగావించి ఇంధనమవైతివి. క్రోధాగ్నిని మరల ప్రజ్వరింప జేయుచున్నావనుట.

సమాసములు :- కృతవీర్యస్య నందనః—నందనస్య వధ్వః - వధూనాం బాష్పః - బాష్పస్య ప్రియం భావుకాః — తైః. (కర్తరి భువః ఖిష్ణుచ్ ఖుకఞౌ — ప్రియం భావుకః). క్షతజమేవోదకం యస్య — తమ్. పితా చ మాతా చ తాభ్యామ్ (పితా మాత్రా ఇత్యేకశేషః). సమస్తాశ్చ తే బాహుజాశ్చ- బాహుజాన్ భుంక్తే—భుక్— తస్య. (క్షుదిర్ సంపేషణే — రుధాది - శానచ్ — క్షున్దానః)

సన్ధులు :- భావుకైః + ఉత్పాద్య. ధనుః + ఐన్దు — రేఫాదేశవిసర్గ సంధి. సంప్రతి + అస్య - యణాదేశ. క్షున్దానః + ధనుః, జాతః + భవాన్ — ఉత్వాదేశవిసర్గ.

బాలేతి :- (స్మిత్వా = నవ్వి) భగవన్=మహాత్మా! — బాలస్వభావ సులభేన - బాల = బాలునియొక్క. స్వభావ = స్వభావమునకు. సులభేన = సులభమైన— ఉచితమైన అనుట, కుతూహలేన = కౌతుకముతో, భగవతః = భగవంతుడైన వృషభధ్వజస్య = శివునియొక్క. ధనుః = ధనుస్సు. కృష్టమ్ = ఎక్కుపెట్టబడినది

తత్రానుషంగిక మమంగళమీదృశం తు
సంపృత్తమత్ర న మయా గణిత స్త్వమాసీః॥ 31

జామదగ్న్యః :- (సరోషమ్) అః క్షుద్రక్షత్రియడింభ, కథం ప్రమథనాథ
ప్రథమాంతేవాసినం పరశురామమపి భవాన్నాతిగణత్.
మహాసేనో యస్య ప్రమదయమదంష్ట్రాసహచరైః
శరైర్ముక్తో జీవన్ ద్విరివ శరజన్మా సమభవత్।

---

తత్ర = ఆ సందర్భమునందు. అనుషంగికమ్ = ఊహించనిదిగా ఈదృశమ్ = ఇటు వంటి. అమంగళమ్ = ధనుర్భంగరూపమగు అశుభము. సంపృత్తమ్ = జరిగినది. అత్ర = ఈ విషయమునందు. మయా = నాచేత. త్వమ్ = నీవు. గణితః = గణింప బడినవాడవు. న ఆసీః = కాలేదు — నీకు సంబంధమున్నదనుటను నేను గుర్తింపలేక పోయితిననుట.

తాత్పర్యము :- బాల్యచాపల్యముతో ధనుస్సు నెక్కుపెట్టగా అది అట్లయి నది. ఇట్టి అశుభము జరుగుననికానీ. శివధనుస్సుతో నీకు సంబంధమున్నదనికానీ నే నూహింపజేసిపోయితిని

సంధులు :- ధనుః + భగవతః - రేఫాదేశవిసర్గ. భగవతః + వృషభ - ఉత్వాదేశవిసర్గ. తత్ర + అనుషంగికమ్ - సవర్ణదీర్ఘ. గణితః + త్వమ్ - సాదేశవిసర్గ

క్రియ :- అస భువి. పరస్మై. లఙ్, మధ్యమ
ఆసీః - ఆస్తమ్ - ఆస్త

అఃక్షితి :- (సరోషమ్ = రోషముతో) అః. క్షుద్రక్షత్రియడింభ = ఓరీ క్షుద్ర రాజకుమారా! — శిశువా! అనుట. కథమ్ = ఎట్లు? ప్రమథనాథ = పరమ శివునికి. ప్రథమాంతేవాసినమ్ = మొదటి శిష్యుడనగు, పరశురామమ్ అపి = ఈ పరశు రామునిగూడ, భవాన్ = నీవు. న + అతిగణత్ = లెక్కింపలేదా!

మహాసేనఇతి :- యస్య = ఏ పరశురామునియొక్క, ప్రమద = మిక్కిలి మదించిన. యమదంష్ట్రా = యముని కోరలతో. సహచరైః = సాటివచ్చునట్టి. శరైః = బాణములతో. ముక్తః = విడిచి పెట్టబడినవాడై (చంపక విడుచుటతో). జీవన్ = బ్రతుకుచు. మహాసేనః = షణ్ముఖుడు, (కార్తికేయో మహాసేనః శరజన్మాషడాననః —

ఇమాం చ క్షత్రాణాం భుజవనమహాదుర్గవిషమా
మయం వీరో వారానజయదుపవింశానస్వసుమతీమ్॥ 32

అమరము) ద్విః ఇవ = రెండు పర్యాయములుగా. శరజన్మా = శరజన్మ కలవాడు. సమభవత్ = అయ్యెనో - తల్లినందు పుట్టుటచే - తొలిసారి శరజన్మ. శరములచే దయతలచి విడువబడిన వాడగుటచే - రెండవసారి - శరజన్మ. చ = మరియు. క్షత్రాణామ్ = క్షత్రియులయొక్క. భుజ = బాహువులను నెట్టి. వనమహాదుర్గ = అరణ్య దుర్గములతో. విషమామ్ = ఎగుడు దిగుడైన. ఇమామ్=ఈ. వసుమతీమ్ = భూమిని. ఉపవింశాన్ వారాన్ = ఇరువదియొక్క మారులు. యః వీరః = ఏ వీరుడు. అజయత్ = జయించెనో - ఆ యీ పరశురామునే నీవు సరకుగొనకున్నావనుట.

తాత్పర్యము :- నా క్రూరబాణములతో (శరములతో) చంపక దయతలచి విడువగా కుమారస్వామి రెండు పర్యాయములు శరజన్ముడాయెను. ఇరువదియొక్క మారులు క్షత్రియ సంహారముచేసి ఈ భూమిని జయించితిని నన్నే సరకుగొనవా!
[శిఖరిణీ వృత్తము]

సమాసములు -: ప్రమదర్శాసో యస్య - ప్రమదయమస్య దంష్ట్రః దంష్ట్రాణాం సహచరాః - తై. శరే శరైర్వా జన్మ యస్య సః. మహ చ్చ తద్దుర్గంచ- వనే మహాదుర్గాణి - భుజా ఏవ వనమహాదుర్గాణి - తైః విషమా - భుజవనాన్యేవ మహాదుర్గాణి, భుజవనేన మహాదుర్గా - [దుర్గమా] - తామ్ అనియు. ఉపగతా వింశతి ర్యేషాం తాన్.

సంధులు :- మహాసేనః + యస్య, ముక్తః + జీవన్. వీరః + వారాన్ ఉత్వాదేశవిసర్గ. శరైః + ముక్తః, ద్విః + ఇవ - రేఫాదేశవిసర్గసంధి.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై. లఙ్. ప్రథమ
అభవత్ - అభవతామ్ - అభవన్
జి జయే, పరస్మై. లఙ్. ప్రథమ
అజయత్ - అజయతామ్ - అజయన్.

రామః :- శాంతం శాంతమ్. ప్రసీద భగవన్. అవిమృశ్యకారితయా న
గణితోఽపి. న పునరవలేపాత్.

స్త్రీషు ప్రవీరజననీ జననీ తవైవ
దేవీ స్వయం భగవతీ గిరిజాపి యస్యై ।
త్వద్దోర్వశీకృత విశాఖ ముఖావలోక
వ్రీడావిదీర్ణహృదయా స్పృహయాంబభూవ॥ 33

---

శాంతమితి :- శాంతమ్ శాంతమ్ = శాంతించుము. శాంతించుము. భగవన్ = మహాత్మా ।. ప్రసీద = క్షమింపుము, అవిమృశ్యకారితయా = అజ్ఞానవశమున. న గణితః అపి = గణింపబడకపోయితివి నిన్ను సరకుగొనకపోవుట కేవలము నా అజ్ఞానము. పునః = అంతేకాని, అవలేపాత్ న = గర్వమువలన కాదు. [ అవలేపః స్మృతో గర్వే - విశ్వః].

స్త్రీష్వితి :- త్వత్ = నీయొక్క, దోః = భుజములతో. వశీకృత = ఓడింపబడిన. విశాఖ = కుమారస్వామియొక్క [విశాఖః శిఖివాహనః - అమరము]. ముఖ = ముఖమును, అవలోక = చూచుటచేనైన. వ్రీడా = సిగ్గుతో, విదీర్ణ = చిట్లిన. హృదయా = హృదయము కలదియును, దేవీ = పరమేశ్వరియు, భగవతీ = అమ్మవారునైన. గిరిజా అపి = పార్వతీదేవి కూడ. యస్యై = ఏ వనితపట్ల. స్వయమ్ = తనంతతానుగా. స్పృహయాంబభూవ = గౌరవము నెరపెనో. సా = అటువంటి. తవ = నీయొక్క. జననీ = తల్లి, స్త్రీషు = స్త్రీలందరియందును, ప్రవీర జననీ ఏవ = నిస్సంశయముగా వీరమాతయే [వసంత తిలక]

తాత్పర్యము :- కుమారస్వామి నీ చేతిలో ఓడిపోగా పార్వతీదేవి సిగ్గుపడియు నీ తల్లిని కొనియాడినదనగా నిస్సంశయముగా నీ జనని వీరమాత.

సమాసములు :- ప్రకృష్టశ్చాసౌ వీరశ్చ - ప్రవీరస్య జననీ. తవ దోర్భ్యాం వశీకృతశ్చాసౌ విశాఖశ్చ - విశాఖస్య ముఖమ్ - ముఖస్య అవలోకః - అవలోకేన వ్రీడా - వ్రీడయా విదీర్ణం హృదయం యస్యాః సా.

క్రియ :- స్పృహ ఈప్సితః. భూ సత్తాయామ్. పరస్మై. లిట్. ప్రథమ.
స్పృహయాంబభూవ - బభూవతుః - బభూవుః

అనుభవ పునరుక్తాం ముంచ నః స్తోత్రచర్యా
ముపనమయ తదేతత్కౌశికోపజ్ఞమస్త్రమ్ ।
క్షిపతి న ఖలు కాలం వీరగోష్ఠీవినోద
ప్రియపరశురయం మే బాహురుద్యచ్ఛమానః॥ 34

అనుభవేతి :- [పిహాస్య = నవ్వి]. రే = ఓరీ । రాజన్యశిశో = క్షత్రియశిశూ । అనుభవపునరుక్తామ్ = ప్రత్యక్ష పునరుక్తమగు- ప్రత్యక్ష సిద్ధమనుట. నః = మా యొక్క. స్తోత్రచర్యామ్ = స్తోత్రపాఠమును - మమ్ము స్తుతించుట యనుట. విరమ = విడిచి పెట్టుము. కౌశికోపజ్ఞమ్ = విశ్వామిత్రునుపదేశించిన. తదే తత్ = అదేదో. అస్త్రమ్ = అస్త్రమును. ఉపనయ = వెలికితీయుము - ప్రదర్శించుము. వీరగోష్ఠీ = యుద్ధరంగమునందు. వినోద = ఆనందించుటలో. ప్రియ = ఇష్టమైనట్టి. పరశుః = గండ్రగొడ్డలిని ధరించినదై. అయమ్ = ఈ. మే = నాయొక్క. ఉద్యచ్ఛ మానః = పైకెత్తబడుచున్న. బాహుః = బాహువు. కాలమ్ = సమయమును. న క్షిపతి ఖలు = వ్యర్థ పఱచదు సుమా ।

తాత్పర్యము :- ఓ రాకుమారా । నా శక్తిసామర్థ్యములు ప్రత్యక్ష సిద్ధములు. నీ స్తోత్రపాఠమవసరము లేదు. కౌశికునినుండి నేర్చిన శస్త్రాస్త్రములు వెలికి ప్రదర్శించుము. యుద్ధరసికమై గండ్రగొడ్డలిని ధరించిన నా బాహువు కాలమును వృథా పరచుటకు ఇచ్చగించదు సుమా ।

సమాసములు :— అనుభవేన పునరుక్తా - తామ్. స్తోత్రమితి చర్యా - తామ్. కౌశికః ఉపజ్ఞా యస్య తత్. (ఉపజ్ఞా జ్ఞాన మాద్యం స్యాత్ — అమరము) వీర గోష్ఠీషు వినోదః - వినోదేషు ప్రియః - ప్రియః పరశుః యస్మిన్ సః - బాహుః.

సంధులు :— పరశుః + అయమ్. బాహుః + ఉత్ - రేఫాదేశవిసర్గ. కౌశిక + ఉపజ్ఞమ్ - గుణసంధి.

క్రియ :— ముచ్లృ్ మోక్షణే, పరస్మై, లోట్, మధ్యమ

ముంచ / ముంచతాత్ - ముంచతమ్ - ముంచత

ణమ ప్రహ్వత్వే శబ్దే చ. పరస్మై, లోట్, మధ్యమ

నమయ / నమయతాత్ — నమయతమ్ - నమయత

రామః :- (స్వగతమ్) అయే, భగవంతం విశ్వామిత్రమపి స్పృశతి. భవ
త్వేవం తావత్. (ప్రకాశమ్, సధైర్యస్మితమ్)

భూమాత్రం కియదేతదర్ణవమయం తత్సాధితం హార్యతే
యద్వీరేణ భవాదృశేన వదతి త్రిస్సప్తకృత్వో జయః।
డింభోఽయం నవబాహురీదృశమిదం ఘోరం చ వీరవ్రతం
తత్కోపాద్విరమ ప్రసీద భగవన్ । జాత్యైవ పూజ్యోఽసి నః॥ 35

---

క్షిప్ ప్రేరణే. (శః) లట్, పరస్మై, ప్రథమ
క్షిపతి - క్షిపతః — క్షిపన్తి

ఛందస్సు :- మాలిని. ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః.

| న | న | మ | య | య |
|---|---|---|---|---|
| I I I | I I I | U U U | I U U | I U U |
| అనుభ | వపున | రంక్తాంముం | చనఃస్తో | త్రచర్యామ్ |

అయేఇతి :- (స్వగతమ్ = తనలో) అయే । భగవంతమ్ = మహాత్ము డగు, విశ్వామిత్రమ్ అపి = విశ్వామిత్రునిగూడ, స్పృశతి = స్పృశించుచున్నాడు - నిందించుచున్నాడనుట. తావత్ ఏవమ్ భవతు = సరే ఇట్లగుగాక । (ప్రకాశమ్ = ప్రకాశముగా, సధైర్యస్మితమ్ = ధైర్యముతో కూడిన చిఱునవ్వుతో)

భూమాత్రమితి :- ఏతత్ = ఈ, భూమాత్రమ్ = నేలయనుట, కియత్ = ఏపాటిది । అర్ణవమయమ్ = సముద్రములతో సహా, భవాదృశేన = నీవంటి వీరేణ = శూరునిచేత, యత్ = ఏది, సాధితమ్ = సంపాదింపబడినదో, తత్ = అది, హార్యతే = ఎప్పటికప్పుడు పరులచే అపహరింపబడుచున్నదని. త్రిసప్తకృత్వః = ముయ్యేడుమారులు గావింపబడిన, జయః = నీ విజయమే, వదతి = చెప్పుచున్నది. అయమ్ = ఈ, డింభః = బాలుడు, నవబాహుః = లేత చేతులు కలవాఁడు. ఇదమ్=ఈ, వీరవ్రతమ్ = యుద్ధము, ఈదృశమ్ = ఇట్టిది, ఘోరమ్ చ = ఘోరమైనదియును. తత్ = అందుచేత, కోపాత్ = కోపమునుండి, విరమ = విరమించుము. ప్రసీద = క్షమించుము. భగవన్ = మహాత్మా । జాత్యా ఏవ = జాతి మాత్రముచేతనే. నః = మాకు, పూజ్యః అపి = గౌరవింపదగినవాడవై తివి. (శార్దూలము)

జామదగ్న్యః :- (సక్రోధకంపం స్వగతమ్) అహో ! దురాత్మనోఽస్య రాజన్య పోతస్య వీరప్రహతాయాః పద్ధతేరస్ఖలితము క్తిపై దగ్ధ్యమ్.

---

తాత్పర్యము :- నీవు జయించిన భూమిని మరొకరెవరో అపహరించు చుండిరనుట ముయ్యేడుమారులు నీ కావించిన విజయమువలన తెలియుచున్నది. నేను బాలకుడను. లేత చేతులవాడను. నీతో యుద్ధమందమా అంతటి ఘోరము. కావున మహాత్మా ! కోపము నుపసంహరింపుము. జాతిచే నీవు మాకు పూజ్యుడవు.

సంధులు :- స ప్తర్పత్వః + జయః - ఉత్వాదేశవిసర్గ. డింభః + అయమ్ ఉత్వాదేశ - డింభో + అయమ్ - పూర్వరూప. బాహుః + ఈదృశమ్ - రేఫాదేశ విసర్గ. జాత్యా + ఏవ - వృద్ధిసంధి. పూజ్యః + అసి - ఉత్వాదేశవిసర్గ - పూజ్యో + అసి - పూర్వరూప.

క్రియ :- హృఞ్ హరణే, కర్మణి. లట్. ఆత్మనే. ప్రథమ.

హార్యతే - హార్యేతే - హార్యన్తే

వద వ్యక్తాయాం వాచి, పరస్మై. లట్, ప్రథమ

వదతి - వదతః - వదన్తి

రముఞ్ క్రీడాయామ్, వ్యాఙ్ పరిభ్యో రమః - పరస్మై.

లోట్, మధ్యమ

విరమ / విరమతాత్ - విరమతమ్ - విరమత

షద్లు విశరణ గత్యవసాదనేషు (పాఘ్రాధ్మాస్థామ్నాదాణ్ దృశ్యర్తిసర్తిశదసదాం పిబజిఘ్రధమతిష్ఠమనయచ్ఛపశ్యర్ఛధౌశీయసీదాః) పరస్మై.

లోట్, మధ్యమ

ప్రసీద / ప్రసీదతాత్ - ప్రసీదతమ్ - ప్రసీదత

అస భువి, పరస్మై, లట్, మధ్యమ

అసి - స్థః - స్థ

అహో ఇతి :- (సక్రోధకంపమ్ = కోపముతో వణకుచు. స్వగతమ్ = తనలో) అహో ! దురాత్మనః = దుర్మార్గుడగు, అస్య = ఈ, రాజన్యపోతస్య = రాజకుమారునియొక్క, వీరప్రహతాయాః = వీరులచే ప్రసిద్ధమైన. పద్ధతేః = మార్గము నుండి. అస్ఖలితమ్ = పై దొలగని, ఉక్తిపై దగ్ధ్యమ్ = మాట నేర్పరితనము - రాముని

(ప్రకాశమ్) అః పాప, జాత్యైవ కేవలయా పూజ్యతే పరశు రామః. కథమద్యాపి నిరాయుధోఽసి ।

వినయనిచుళితై ర్భవద్వచోభిః కిమపి నవం వివృణద్భిరంకమంతః ।
అయమజని కరః కృతాంతదంష్ట్రాక్రకచకఠోరకుఠారదుర్నిరీక్ష్యః॥ 36

---

ఉక్తి చాతుర్యము పీరపద్ధతికి అనుగుణముగా నున్నదనుట. (ప్రకాశమ్=ప్రకాశముగా) అః పాప = ఓరీ పాపాత్మా । పరశురామః = ఈ భార్గవుడు. కేవలయా = కేవలము. జాత్యా ఏవ = జాతిమాత్రముతోనే, పూజ్యతే = గౌరవింపబడువాడా । బ్రాహ్మణత్వము తప్ప మరొక గౌరవ హేతువు నాయందు లేదా అనుట. కథమ్ = ఎట్లూ । అద్యఅపి = ఇప్పటికిని, నిరాయుధః అసి = నిరాయుధుడవుగనే యుంటివా ।

వినయేతి :- వినయ = వినయముతో, నిచుళితైః = కప్పబడినవై, అంతః = లోపల. కిమపి = ఏదో, నవమ్ = వినూతనమగు, అంకమ్ = కళంకము ను (అవమానమును). వివృణద్భిః = వివరించుచున్నవైన. భవద్వచోభిః = నీ మాటలతో. అయమ్ = ఈ, కరః = నాచేయి. కృతాంత = యమునియొక్క. దంష్ట్రా = కోరలనునట్టి. క్రకచ = అంపమువలె, కఠోర = కఠినమైన, కుఠార = గొడ్డలితో. దుర్నిరీక్ష్యః = తేరిపారజూడ శక్యముగానిదిగా. అజని = అయినది. (పుష్పితాగ్ర).

తాత్పర్యము :- నీ పలుకులలో పైకి వినయమున్నను లోపల నన్ను అవమానించుచున్నవి. అందులకే యమదంష్ట్రవంటి గొడ్డలితో ఈ నాచేయి పైకి లేచినది.

సమాసములు :- వినయేన నిచుళితాని - తైః. కృతాంతస్య దంష్ట్రా - దంష్ట్రా ఏవ క్రకచః క్రకచవత్ కఠోరః - కఠోరశ్చాసౌ కుఠారశ్చ - కుఠారేణ దుర్నిరీక్ష్యః.

సంధులు :- నిచుళితైః + భవత్, వివృణద్భిః + అంకమ్—రేఫాదేశవిసర్గ.

క్రియ :- జనీప్రాదుర్భావే, లుఙ్, పరస్మై. ప్రథమ

అజని - అజనిషాతామ్ - అజనిషత

(ఉచ్చైశ్చ) అహో ను ఖలు భోః.

త్రైలోక్యత్రాణ శౌండః సరసిజవసతేర్యః ప్రసూతో భుజాభ్యాం
స క్షత్రం నామ వర్ణః కులిశకఠినయోర్యస్య దోష్ణోర్విలీనః।
జ్వాలాజిహ్వాలకాలానలకబళ భయభ్రాంత దేవాసురాణి
వ్యాతన్వానో జగన్తి జ్వలతి మునిరయం పార్వతీధర్మపుత్రః॥ 37

---

త్రైలోక్యేతి :- (ఉచ్చైశ్చ = బిగ్గరగా) అహోను ఖలు భోః = అహో! (అహోను ఖలు భోరితి విస్మయే సంప్రయుజ్యతే) త్రైలోక్య = ముల్లోకములను, త్రాణ = రక్షించుటయందు, శౌండః = విఖ్యాతమై (శౌండోమత్తేచ విఖ్యాతే దక్షకాలి న్యపి స్మృతః_విశ్వః), సరసిజవసతేః = పద్మగర్భునియొక్క, భుజాభ్యామ్= బాహువల నుండి, ప్రసూతః = అవిర్భవించినదై, యః = ఏ, క్షత్రమ్ నామ = క్షత్రమనునట్టి, వర్ణః=(జాతి) వర్ణముకలదో, సః=ఆ వర్ణము (క్షత్రియులు విరాట్పురుషుని బాహువుల నుండి జన్మించిరని_ బాహూ రాజన్యః కృతః శ్రుతి) కులిశకఠినయోః=వజ్రాయుధ మువలె కఠినములైన, యస్య = ఎవనియొక్క, దోష్ణోః=బాహువులయందు, విలీనః= అంతరించిపోయెనో, జగన్తి = లోకములను, జ్వాలా=మంటలతో, జిహ్వాల = నాలు కలు కలదైన, కాలానల = ప్రళయకాల వహ్నిచే, కబళ = గ్రహింపబడునప్పటివలె, భయభ్రాంత = భయముతో చెల్లాచెదురైన, దేవాసురాణి = దేవతలును రాక్షసులును కలవిగా, వ్యాతన్వానః = చేయుచున్నవాడై, పార్వతీధర్మపుత్రః=పార్వతీదేవికి పుత్ర ప్రాయుడగు, మునిః = ఆ ముని, అయమ్ = ఇతడే, జ్వలతి = నీ యెట్టయెదుట ప్రకాశించుచున్నాడు - మండిపడుచున్నాడు. (స్రగ్ధరావృత్తము)

తాత్పర్యము :- ముల్లోకములను రక్షించుటకై బ్రహ్మదేవుని బాహు వుల నుండి అవిర్భవించిన క్షత్రియజాతి నా కులిశకఠినములగు బాహువులయందు అంతరించినది. కాలానల జ్వాలలను ప్రేరేపి దేవాసురలోకములను భయభ్రాంతములు చేయుచు ఇదే పార్వతీ ధర్మపుత్రుడగు పరశురాముడు ప్రజ్వరిల్లుచున్నాడు.

సమాసములు :- త్రైలోక్యస్య త్రాణే శౌండః, సరసిజం వసతిర్యస్య-తస్య, కులిశే ఇవ కఠినే _ తయోః, జ్వాలాభిః జిహ్వాలః_జిహ్వాలశ్చాసౌ కాలానలశ్చ —కాలానలేన కబళనమ్ — కబళేన భయమ్_భయేన భ్రాంతాః - భ్రాంతాః దేవాసురాః యేష సన్తి తాని_జగన్తి. పార్వత్యాః ధర్మపుత్రః.

(నేపథ్యే)

భగవన్, భార్గవ!

అప్రవృత్తివిషయం వితన్వతః క్షత్రశబ్దమియమేవ మేదినీ
దక్షిణా తవ బభూవ యజ్వనో ముంచ సంప్రతి తు
శుష్కమాయుధమ్॥ 38

---

సంధులు :— వసతేః + యః కఠినయోః + యస్య, దోష్ణోః + విలీనః, మునిః + అయమ్ - రేఫాదేశవిసర్గ. ప్రసూతః + భుజాభ్యామ్, వ్యాళన్యాసః + జగన్తి- ఉత్వాదేశవిసర్గ. సః + క్షత్రమ్ - తదేతద్విసర్గలోపసంధి. వి + అతన్వానః - యణా దేశ, కాల + అనల, దేవ + అసుర—సవర్ణదీర్ఘ.

క్రియ :- జ్వల దీప్తౌ, పరస్మై, లట్, ప్రథమ

జ్వలతి — జ్వలతః - జ్వలన్తి

(నేపథ్యే = తెరలో)

అప్రవృత్తిరితి :- భగవన్ = మహాత్మా! భార్గవ = పరశురామా! క్షత్రశబ్దమ్ = క్షత్రియుడు అనుమాటను. అప్రవృత్తివిషయమ్ = ప్రవృత్తిశూన్యముగా వితన్వతః = చేయువాడవై - క్షత్రియ శబ్దమునకు సార్థకత చేకూర్చువాడే లేకపోయె ననుట. యజ్వనః = క్షత్రియ (క్షత్రియ సంహారరూపమగు) యాగముజేసిన. తవ = నీకు. ఇయమ్ = ఈ. మేదినీ ఏవ = భూమండలమే. దక్షిణా బభూవ = బ్రాహ్మణున కిచ్చిన దక్షిణ యైనది. తు = కాగా. సంప్రతి = ఇప్పుడు. శుష్కమ్ = నిష్ప్రయోజన మైన. ఆయుధమ్ = నీ పరశువును. ముంచ = విడువుము.

తాత్పర్యము :- పరశురామా! క్షత్రియశబ్దమును నిర్వీర్యమొనర్చి సర్వ భూమండలమును స్వైవసమొనర్చుకొని యజ్ఞసమాప్తిలో కశ్యపునికి దానమిచ్చితివి. మరింక నీకు ఆయుధమేల! (నీ అధీనములోనున్నదానికై నీవు యుద్ధమునకు దిగనవ సరములేదనుట) విడువుము.

క్రియ :- ముచ్ఌ్ మోక్షణే. లోట్. పరస్మై. మధ్యమ

ముంచ /ముంచతాత్ - ముంచతమ్ - ముంచత

జామదగ్న్యః :- అయే. ప్రశాంతగంభీరః క ఏషః. తర్హి, జనకేన భవితవ్యమ్. (తదభిముఖమవలోక్య) రాజర్షే సీరధ్వజ. భగవతః సూర్యశిష్యాత్పురాణవాజసనేయినో యాజ్ఞవల్క్యాదధీతబ్రహ్మసిద్ధాంతో గృహీతవాక్య ఏవాసి. కిం తు నాయమవసరః శిష్టానురోధస్య.

అవనిమధికవింశానభ్యవస్కంద్య వారా
నవభృథభృతకేభ్యః సంప్రదాయ ద్విజేభ్యః ।

---

ఛందస్సు :- రథోద్ధతము - రాన్నరావిహ రథోద్ధతా లగౌ. ర-న-ర-లగ

అప్రవృ త్తివిష యంవిత న్వతః

U I U I I I U I U I U
ర న ర లగ

అయేఇతి :- అయే ! ప్రశాంత గంభీరః = ప్రశాంతమును, గంభీరమునైన స్వరముకలవాడు, ఏషః కః = ఇతడెవరోకదా ! తర్హి = అట్లయిన, జనకేన భవితవ్యమ్ = జనకుడు కావచ్చును. (ప్రశాంత గంభీరస్వరేణ జనకేన భవితవ్యమ్—అని పాఠాంతరము). (తదభిముఖమ్ = అవైపు. అవలోక్య = చూచి) రాజర్షే = ఓ రాజర్షీ ! సీరధ్వజ = సీరధ్వజా ! భగవతః = మహాత్ముడైన. సూర్యశిష్యాత్ = సూర్యశిష్యుడును, పురాణవాజసనేయినః = పురాతనమగు యజుర్వేదమును నేర్చినవాడును (పురాణవాజసనేయమధీతే వేద వా - శౌనకాదిభ్యశ్ఛందసి ణినిః) అయిన, యాజ్ఞవల్క్యాత్ = యాజ్ఞవల్క్యునినుండి, అధీతబ్రహ్మసిద్ధాంతః = బ్రహ్మవిద్యను నేర్చినవాడవైన నీవు, గృహీతవాక్యః ఏవ అసి = గౌరవింపదగిన - శిరసావహింపదగిన - వాక్కు కలవాడవే. నీ మాటను పాటింపవలసినదే అనుట. కింతు = కానీ. శిష్టానురోధస్య = శిష్టుల మాటను పాటించుటకు, అయమ్ న అవసరః = ఇది సమయము కాదు.

అవనిమితి :- అధికవింశాన్ = ఇరువదికి పైగా. వారాన్ = పర్యాయములు - ఇరువదియొక్క మారులనుట. అవనిమ్ = భూమిని. అవస్కంద్య = ముట్టడించి (జయించి). అవభృథభృతకేభ్యః = అవభృథస్నానము చేయించిన. ద్విజేభ్యః = ఋత్విక్కులకు, సంప్రదాయ = భూమిని ధారవోసి, నిఖిల = సమస్తమైన, నృపతి =

విరమతి రమణీయాత్ ద్వంద్వయుద్ధాత్కథం మే
నిఖిల నృపతి హత్యాదృష్టసారః కుఠారః॥ 39

(పునర్నేపథ్యే)

భృగుతిలక నమస్తే ముంచ వైమత్యమేత
త్కురు కరుణమిదానీం మానసం మానశౌండ।

---

రాజులయొక్క, హత్యా = సంహారములో. దృష్టసారః = నిరూపింపబడిన బలము కలదైన. మే = నాయొక్క, కుఠారః = పరశువు. రమణీయాత్ = అందమైన (సులభసాధ్యమైన), ద్వంద్వయుద్ధాత్ = ఈ తులాయుద్ధమునుండి. కథమ్ విరమతి = ఎట్లు విరమించును? (దీక్షాంతోఽవభృథో యజ్ఞే – అమరము. భృతకో భృతిభుక్కర్మకరో వైతనికోఽపి సః – ధరణిః) మాలినీవృత్తము.

తాత్పర్యము :– ఇరువదియొక్కమారులు జయించిన భూమండలమును ఋత్విక్కులకు పంచి ప్రసిద్ధిపడసిన బలముగల ఈ కుఠారము సులభవిజయమగు ఈ ద్వంద్వయుద్ధమునుండి విరమించునా? విరమింపదు.

సమాసములు :– అధికా వింశతిర్యేషాం తాన్. అవభృథస్య భృతకాః – తేభ్యః. నిఖిలాశ్చ తే నృపతయశ్చ–నృపతీనాం హత్యా – హత్యయా (హత్యాయాం వా) దృష్టం సారం యస్య సః.

క్రియ :– రముఙ్ క్రీడాయామ్ (వ్యాఙ్పరిభ్యో రమః) పరస్మై. లట్. ప్రథమ

విరమతి – విరమతః – విరమన్తి

(పునః నేపథ్యే = మరల తెరలో)

భృగుతిలకేతి :– భృగుతిలక = భృగువంశశ్రేష్ఠా!, తే = నీకై, నమః = నమస్కారము. ఏతత్ = ఈ, వైమత్యమ్ = విరుద్ధభావమును–శత్రుత్వమును లేక క్రోధమును. ముంచ = విడువుము, మానశౌండ = అభిమానముతో విఖ్యాతికెక్కిన వాడా! ఇదానీమ్ = ప్రస్తుతము. మానసమ్ = నీహృదయమును. కరుణమ్ = దయకలదిగా. కురు = చేయుము–దయాళువవు కమ్ము, త్రిజగత్ = ముల్లోకములకును, అభయదాన = అభయమునిచ్చుటయందు, స్థూలలక్ష్యః = ఏనుగుపాడి కలదియైన– అధికముగా అభయము నిచ్చువాడనుట (స్థూలలక్ష్య. బహుప్రదః – అమరము), తే = నీ

వహతి బత కిమస్త్రం పుత్రభాండేఽపి రామే
త్రిజగదభయదానస్థూలలక్ష్యో భుజస్తే॥ 40

జామదగ్న్యః :- (రామంప్రతి) అయే, ధీరకర్కశస్వరః క ఏషః ?
రామః :- (సప్రశ్రయమ్) భగవన్, అయం నస్తాతో రఘుపతిః.

---

యొక్క, భుజః = బాహువు, పుత్రభాండే = పుత్రతుల్యుడైన (భాండం పాత్రేఽపి సదృశే స్వల్పేఽపి చ నిగద్యతే - ధరణిః) రామే అపి = రామునిపట్లగూడ, బత = అయ్యో!, అస్త్రమ్ = ఆయుధమును, వహతి కిమ్=వహించునా? - వహింపదగదనుట, (మాలిని),

తాత్పర్యము :- ఓ పరశురామా! క్రోధమును విడువుము, మనస్సును సకరుణమొనర్చుము, ముల్లోకములకును అధికముగా అభయమిచ్చు నీ భుజము పుత్రప్రాయుడైన రామునిపై ఆయుధమెత్తుట తగదు. (స్యూల్వదాన్య స్థూలలక్ష్యదానశౌండా బహుప్రదే - అమరము)

సమాసములు :- మానేన మానే వా శౌండః - తత్పురుషః. త్రయాణాం జగతాం సమాహారః - త్రిజగత్ అభయస్య దానమ్ - దానే స్థూలలక్ష్యః.

సంధులు :- నమః + తే, భుజః + తే - సాదేశవిసర్గసంధి. భాండే + అపి - పూర్వరూపస్వరసంధి. లక్ష్యః + భుజః - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- ముచ్ఌ్ మోక్షణే, లోట్, పరస్మై, మధ్యమ.

ముంచ / ముంచతాత్ - ముంచతమ్ - ముంచత
డుకృఞ్ కరణే, లోట్, పరస్మై, మధ్యమ
కురు / కురుతాత్ - కురుతమ్ - కురుత
వహ్ ప్రాపణే, లట్, పరస్మై, ప్రథమ
వహతి - వహతః - వహన్తి

అయేఇతి :- (రామం ప్రతి = రామునితో) అయే = ఓయీ! ధీరకర్కశ స్వరః = ధీరమును కఠినమునైన స్వరముగలవాడు, ఏషః = ఈతడు, కః = ఎవడు ?

భగవన్నితి :- (సప్రశ్రయమ్ = వినయముగా) భగవన్ = మహాత్మా! అయమ్ = ఈతడు, నః = మాయొక్క, తాతః = తండ్రి, రఘుపతిః = దశరథుడు.

జామదగ్న్యః :- (సవ్యథమ్) ధిక్. సర్వతః క్షత్రకలంబోద్భేదః. (నేపథ్యాభిముఖ మవలోక్య) భో రాజన్ దశరథ, అస్మన్నామధేయ మాత్రమిత్రేణ పుత్రేణామునా మానార్హో భవాన్. కిం పునరనభిజ్ఞోఽసి వీరవ్యవహారస్య.

పురమథనధనుర్విమర్దనోత్థం ప్రదహతి దహార్దివమస్తి తీవ్రమర్చిః।
రఘుజనకకుటుంబబాష్పపూరైః పరమిహ శాంతిముశన్తి శస్త్రభాజః॥

---

ధిగితి :- (సవ్యథమ్= వెతపడుచు) ధిక్। సర్వతః = అంతటను, క్షత్రకలంబ = క్షత్రియాంకురముల, ఉద్భేదః = ఆవిర్భావమే - అన్నివైపులను క్షత్రియ స్వరములే వినబడుచున్నవనుట. (నేపథ్యాభిముఖమ్ = తెరపై పునకు, అవలోక్య = చూచి) భో రాజన్ దశరథ = ఓ దశరథమహారాజా। అస్మత్ = నాయొక్క, నామధేయ మాత్ర = నామసామ్యముతో, మిత్రేణ = మిత్రుడయిన, అమునా = ఈ, పుత్రేణ = కుమారునిలో, భవాన్ = నీవు, మానార్హః = పూజ్యుడవయితివి. కింపునః = కానీ, వీరవ్యవహారస్య = వీరపద్ధతికి, అనభిజ్ఞః అసి = తెలియని వాడవయితివి - యుద్ధ సమయమున సాంత్వనవచనములు పలుకరాదనుటను గుర్తింపవైతివనుట.

పురమథనేతి :- పురమథన = త్రిపురాసుర సంహర్తయైన శివుని యొక్క, ధనుః = ధనుస్సును, విమర్దన = భంగపరచుటచే, ఉత్థమ్ = పుట్టిన, తీవ్రమ్ = తీవ్రమైన, అర్చిః = అగ్ని (క్రోధాగ్ని). అహర్దివమ్ = ప్రతిదినమును, ప్రదహత్ = దహించివేయుచు, అస్తి = నా హృదయమునందున్నది, రఘు జనక కుటుంబ = రఘువంశస్థులయు జనక వంశస్థులయు, బాష్పపూరైః = కన్నీటి ప్రవాహములతోనే, శస్త్రభాజః = నావంటి శస్త్రధారులగు వీరులు, ఇహ = ఇటువంటి పరిస్థితుల యందు, పరమ్ = మిక్కిలి, శాంతిమ్ = కోప శమనమును, ఉశన్తి = పొందగోరుదురు. (పుష్పితాగ్ర)

తాత్పర్యము :- శివధనుస్సును విరుచుటతో పుట్టిన క్రోధాగ్ని రేయింబవళ్ళు నన్ను దహించివేయుచున్నది. ఇట్టి పరిస్థితుల యందిక మరి రఘుజనక వంశస్థుల కన్నీటి ధారలతోనే నావంటి వీరుల క్రోధాగ్ని చల్లారును.

(నేపథ్యే)

ఆః జామదగ్న్య. కిమేవమతిప్రసక్తః సంన్యస్తశస్త్రానస్మానపి బలాద్ధనుర్గ్రాహయసి.

జామదగ్న్యః :- (సరోషమ్) అరే విదేహప్రసవపాంసన.

అయమధిపతిర్భాసామేకాంతరో భవతో గురు
స్త్వమసి తపసా యద్వర్షీయానితి స్మ తితిక్షసే।

---

సమాసములు :- పురమథనస్య ధనుః - ధనుషః విమర్దనమ్—విమర్దనేన ఉత్థమ్. అహశ్చ దివసశ్చ - అచతురవిచతురేత్యాదినా నిపాతనాత్. రఘవశ్చ జనకాశ్చ – రఘుజనకానాం కుటుంబాః - కుటుంబానాం బాష్పపూరైః. శస్త్రం భజతీతి – శస్త్రభాక్ - తే.

క్రియ :- వశ కాంతౌ (గ్రహిజ్యేత్యాదినా సంప్రసారణమ్) పరస్మై. లట్. ప్రథమ.

ఉశతి - ఉశతః - ఉశన్తి

(నేపథ్యే = తెరలో)

ఆఇతి :- ఆః జామదగ్న్య = ఓ భార్గవా! (అస్త్రు స్యాత్కోపపీడయోః. అమరము) ఏవమ్=ఇట్లు, అతిప్రసక్తః = అత్యుద్ధతుడవై, సంన్యస్త శస్త్రాన్=ఎనాడో ధనుర్బాణములను విడిచినవారమైన, అస్మాన్ అపి=మమ్మునుకూడ, బలాత్ = బలవంతముగా, ధనుః గ్రాహయసి కిమ్=ధనుస్సు చేపట్టునట్లు చేయుచున్నావే! ఇది తగదనుట (ఇది తెరలో జనకుని వాక్కు.)

అయమిత్రి ;- (సరోషమ్ = క్రోధముతో) అరే = ఒరీ! విదేహప్రసవపాంసన = విదేహపుత్రులలో అధముడా! జనకాధమా - అనుట. అయమ్=ఈ ఆకాశమున ప్రకాశించుచున్న, భాసామ్ అధిపతిః = వెలుగుఱేడు, భవతః = నీకు, ఏకాంతరః = ఏకవ్యక్తి వ్యవధానముగా, గురుః=ఉపదేశకుడు, (సూర్యునికిని జనకునికిని నడుమ యాజ్ఞవల్క్యుడు వ్యవధానముగా నుండెను. సూర్యుని శిష్యుడు యాజ్ఞవల్క్యుడు. యాజ్ఞవల్క్యుని శిష్యుడు జనకుడు) త్వమ్ = నీవు, తపసా=తపస్సుతో, వర్షీయాన్ ఇతి = నాకంటె పెద్దవాడవని. తితిక్షసే స్మ = ఇంతకాలమును ఓర్పుతో ఉపేక్షింపబడితివి - ఇరువదియొక్కమార్లలో నెప్పుడును నిన్ను సంహరింపనైతినను. ఇప్పుడు,

కథమసి ధనుర్నామగ్రాహీ తదేష సమాప్యసే
మమ హి సకలక్షత్రాలంభక్రతోరమృతం భవాన్ ॥ 42

( నేపథ్యే )

భార్గవ, భార్గవ, చ్యవనాది వృద్ధవాక్యగౌరవ నిగృహీత సంప్రహారక్రియా సమభిహారస్య తత్రభవతః పరమే బ్రహ్మణి వర్తమానస్య పునరుపప్లవస్తే

---

ధనుర్నామగ్రాహీ = ధనుస్సు అను పేరు నెత్తినవాడవు. కథమ్ అసి = ఏల అయితివో, తత్ = అందుచేత. ఏషః=ఇదే, సమాప్యసే = సంహరింపబడుచున్నావు. మమ = నా యొక్క, సకల క్షత్రాలంభక్రతోః – సకల = సమస్తమైన, క్షత్ర = రాజులయొక్క, ఆలంభ = మారణరూపమగు, క్రతోః = యజ్ఞమునకు, భవాన్ = నీవు, అమృతమ్ హి = హుత శేషమవు గదా। (అమృతం యజ్ఞశేషే స్యాత్ — విశ్వః. హి హేతావవధారణే - అమరము) హరిణీవృత్తము.

సమాసములు :– ఏకః అంతరే యస్య సః. ధనుషః నామ గృహ్ణాతి ఇతి. సకలాశ్చ తే క్షత్రాశ్చ – సకల క్షత్రాణా మాలంభః – ఆలంభ ఏవ క్రతుః– తస్య.

సంధులు :- అధిపతిః + భాసామ్, ధనుః + నామ, క్రతోః + అమృతమ్- రేఫాదేశవిసర్గ. ఏకాంతరః + భవతః + గురుః – ఉత్వాదేశవిసర్గ. గురుః + త్వమ్ - సాదేశవిసర్గ. ఏషః + సమాప్యసే - తదేతద్విసర్గలోపసంధి.

క్రియ :- తిజ నిశానే, కర్మణి, లట్, మధ్యమ

తితిక్ష్యసే - తితిక్ష్యేథే - తితిక్షధ్వే

ఆప్ల లంభనే, కర్మణి, ఆత్మనే, లట్, మధ్యమ

సమాప్యసే - సమాప్యేథే - సమాప్యధ్వే

( నేపథ్యే = తెరలో )

భార్గవ రామా। ఓ భార్గవరామా। చ్యవనాది=చ్యవనుడు మొదలైన, వృద్ధ = పెద్దలయొక్క, వాక్య = మాటలయందలి, గౌరవ = గౌరవముతో, నిగృహీత = నిగ్రహింపబడిన, సంప్రహారక్రియాసమభిహారస్య = యుద్ధపౌనఃపున్యము కలవాడవై, పరమే బ్రహ్మణి = పరబ్రహ్మయందు, వర్తమానస్య = సంచరించుచున్నట్టి, తత్ర

బుద్ధయః. తద్విరమ. కియచ్చిరమితః పరమపి నాటయిష్యతి భవన్తమాయుధ పిశాచీ.

జామదగ్న్యః :— (విహస్య) అహో యాజ్యస్నేహః శతానందముపాలయతి. భవతు. సాన్త్వయామి తావదేనమ్. (తదభిముఖమ్) అంగిరస.

నృపస్తే పాల్యోఽయం మమ పశుపురోడాశరసికః
పృథివ్యామవ్యాజోద్భటభుజభృతః సన్తి రఘవః ।
అమీషాముత్సిక్తం కిమపి కులముత్కృత్య లవశో
విధాతా తత్సర్వం యదభిరుచితం తే భృగుపతిః ॥ 43

భవతః = నీయొక్క, బుద్ధయః = ఆలోచనలు. పునః = మరల. ఉపప్లవన్తే = యుద్ధమునకు చెలరేగుచున్నవి - ఎగిరి పడుచున్నవి. తద్విరమ = ఉడుగుము. ఇతః పరమ్ = ఇంతను, కియచ్చిరమ్ = ఎంతకాలమని, ఆయుధపిశాచీ = ఆయుధ తృష్ణ, భవన్తమ్ = నిన్ను. నాటయిష్యతి = ఇట్లు ఆడించును ;

అహో ఇతి :- (విహస్య = నవ్వి) అహో । యాజ్యస్నేహః = పురోహితమైత్రి (యజ్ఞముచేయువానికిని చేయించువానికి నుండు మైత్రి - యాజ్యస్నేహము) శతానందమ్ = ఈ శతానందుని, ఆకులయతి = కలతపెట్టుచున్నది. భవతు = అగుగాక; ఏనమ్ = ఈతనిని, సాంత్వయామి తావత్ = ఓదార్తును. (తదభిముఖమ్ = ఆ వైపునకు తిరిగి) అంగిరస = శతానందా ;

నృప ఇతి :- పశు పురోడాశరసికః = పశుపురోడాశమునందు ప్రణయము కలవాడగు - నిరంతరముగా యజ్ఞయాగములు చేయువాడనుట, తే = నీయొక్క, అయమ్ = ఈ, నృపః = యజమానుడు - జనకుడు, మమ = నాకును, పాల్యః = రక్షణీయుడు. పృథివ్యామ్ = ఈ లోకమునందు, అవ్యాజ = అకారణముగా లేక నిష్కపటముగా, ఉద్భట = ఉద్ధతములైన, భుజ = బాహువులను, భృతః = వహించువారై - అకారణముగా అఖండ బలశాలులై అనుట, రఘవః = రఘువంశస్థులు, సన్తి = విరాజిల్లుచున్నారు. కిమపి = మాటలకు అందనంతగా, ఉత్సిక్తమ్ = గర్వించిన, అమీషామ్ = వీరియొక్క, కులమ్ = వంశమును, లవశః = తునియలుగా, ఉత్కృత్య = ఖండించి, భృగుపతిః = ఈ భార్గవరాముడు, తే = నీకు, యత్ అభి

(నేపథ్యే)

అః పాప క్షత్రియాయాః పుత్ర. క్షత్రియభ్రూణహత్యాపాతకిన్ నిసర్గ నిష్ప్రాణం హి ప్రహరణమిక్ష్వాకూణాం బ్రాహ్మణేషు. తైర్యాదృశస్తాదృశో వా నిధవోఽసి. కథమేవమతిక్రామన్నస్మాకమపి బ్రహ్మవర్చసాన్న బిభేషి.

---

రుచితమ్ = ఏది హితవో, తత్ సర్వమ్ = అది అంతయు, ( రాఘవుని విడువుమనుట తప్ప నీ అభిమతమేదయినను తీర్తుననుట) విధాతా = నెరవేర్పగలడు.

తాత్పర్యము :- నిరంతరముగా యజ్ఞయాగములు చేయు జనకుడు నాకును సంరక్షణీయుడే. ఈ రాఘవుల భుజబలమును అణచి రఘువంశమును నిర్మూలింతును. అట్లు చెప్పకుము, తక్కిన నీ అభిరుచితమేదియైనను నిర్వర్తింతును.

సమాసములు :- పశుపురోడాశయోః రసికః. అవ్యాజేన ఉద్భటాః - ఉద్భటాశ్చ తే భుజాః - భుజాన్ బిభర్తీతి - భుజభృతః.

సంధులు :- నృపః + తే - సాదేశవిసర్గ. పాల్యః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - పాలో + అయమ్ - పూర్వరూప. అవ్యాజ + ఉద్భట - గుణసంధి. లవశః + విధాతా - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః పరస్మై. లుట్. ప్రథమ

విధాతా - విధాతారౌ - విధాతారః

[నేపథ్యే = తెరలో]

అః = ఓరీ, పాప = పాతకీ! క్షత్రియాయాః పుత్ర = క్షత్రియాంగనయగు రేణుకా దేవికి (రేణుకాదేవి తండ్రి గాధి. అతడు క్షత్రియుడు) పుట్టిన వాడా! (పాపక్షత్రియాయాః పుత్ర అని కొందరన్వయించిరి. రేణుకను నిందింపబనిలేదు కదా) [క్షత్రియాయాః పుత్ర - అనుచోట నిందలో షష్ఠికి అలుక్ - షష్ఠ్యా ఆక్రోశే.] క్షత్రియ భ్రూణ = క్షత్రియ వంశాంకురముల (గర్భస్థ పిండములను). హత్యా = సంహారముతో, పాతకిన్ = పాపాత్ముడా! ఇక్ష్వాకూణామ్ = రఘువంశసంభవులయొక్క, ప్రహరణమ్ = ఆయుధము, బ్రాహ్మణేషు = బ్రాహ్మణులపట్ల, నిసర్గ = సహజముగనే నిష్ప్రాణమ్ హి = బలహీనము సుమా! యాదృశః తాదృశః వా = ఎటువంటివాడ

జామదగ్న్యః :- (సరోషహాసమ్) అరే. బ్రహ్మబంధో. బాంధకినేయ. గౌతమగోత్రపాంసన.

కుర్యుః శస్త్రకథామమీ యది మనోర్వంశే మనుష్యాంకురాః
స్యాచ్చేద్బ్రహ్మగణోఽయ మాకృతిగణ స్తత్రేష్యతే చేద్భవాన్ ।
సమ్రాజాం సమిధాం చ సాధకతమం ధత్తే భిదాకారణమ్
ధిఙ్మౌర్వీకుశకర్షణోల్బణ కిణగ్రంథిర్మమాయం కరః ॥ 44

---

పైనను - ఎంతటి అపరాధిపైనను - తైః = వారిచే, సోఢవ్యః అపి = సహింపవలసినవాడవైతివి. కాని - ఏవమ్ = ఇట్లు, అతిక్రామన్ = విఱ్ఱవీగుచు (హద్దుదప్పియనుట) అస్మాకమ్ = మాయొక్క. బ్రహ్మవర్చసాత్ అపి = బ్రహ్మతేజస్సువలనగూడ, న బిభేషి = భయపడకున్నావు. కథమ్ = ఏట్లూ ! మమ్మునేని సరకుగొనవేమని ఆశ్చర్యము. (స్యాద్బ్రహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధిః — అమరము).

అరేఇతి :- [సరోషహాసమ్ = రోషముతో ఎకసక్కెముగా] అరే = ఓరీ ! బ్రహ్మబంధో = బ్రాహ్మణాధమా ! [బ్రహ్మబంధురధిక్షేపే]. బాంధకినేయ = కులటాపుత్రుడా ! [అథ బాంధకినేయః స్యాద్బంధులశ్చాసతీసుతః - అమరము] గౌతమ గోత్రపాంసన = గౌతమ గోత్రమును కళంకపరచినవాడా !

కుర్యురితి :- మనోః = మనువుయొక్క. వంశే = వంశమునందలి. అమీ = ఈ. మనుష్యాంకురాః = మానవశిశువులు. శస్త్రకథామ్ = యుద్ధమును (ఆయుధేతి వృత్తమును) యది కుర్యుః = చేయుదురేని, అయమ్ = ఈ. బ్రహ్మగణః = బ్రాహ్మణ [ఋత్విక్] సమూహము, ఆకృతి గణః = ఆకృతి గణము [ఆకృతి గణము వ్యాకరణ ప్రసిద్ధము. ఆకారాది సామ్యముచే ఆ గణమునందు మరికొన్నింటిని చేర్చుకొనవచ్చును] స్యాత్ చేత్ = అగునేని, తత్ర = ఆగణమునందు, భవాన్ = నీవు. ఇష్యతే చేత్ = ఉందువేని, సమ్రాజామ్ = సమ్రాట్టులకును, సమిధామ్ = సమిధలకును, భిదాకారణమ్ = భేదనహేతువైన, సాధకతమమ్ = [ప్రకృష్ట సాధనము] గండ్రగొడ్డలిని, ధత్తే = ధరించునదై, చ = మరియు, మౌర్వీ = వింటి నారియొక్కయు, కుశ = దర్భలయొక్కయు, కర్షణ = లాగుటలచే [నారిసెక్కు పెట్టుట. దర్భలను పెరుకుట]. ఉల్బణ = అతిశయించిన. కిణగ్రంథిః = కాయలు కలదైన. అయమ్ = ఈ. కరః = చేయి, ధిక్ = నిష్ఫలము. [ధిగ్భర్త్సనే చ నిందాయాం నిష్ఫలే కుత్సితేఽపి

(నేపథ్యే)

భగవన్ భార్గవ, భార్గవ,

---

చ — విశ్వః. మౌర్వీ జ్యా శింజినీ గుణః — అమరము. కిణః స్యాన్మృత కోణిత్తే - అమరము] శార్దూల విక్రీడితము.

తాత్పర్యము :- మానవ మాత్రులుకూడ నాతో యుద్ధము చేయుదురేని, బ్రాహ్మణగణము కేవలము ఆకృతిగణమగునేని, అందు నీవు కూడ పరిగణింపబడుదువేని, ఈ నా చేయి నిష్ఫలము. సమ్రాట్టులను సమిధలను ఛేదించు గండ్రగొడ్డలిని ధరించి, జ్యాఘాతములతో కాయలు కాసిన ఈ నాచేయి వ్యర్థము.

**సమాసములు** :- శస్త్రాణాం కథా - తామ్. మనుష్యాణాం అంకురాః, బ్రహ్మణాం గణః. ఛిదాయాః కారణమ్. మౌర్వీ చ కుశాశ్చ - మౌర్వీ కుశానాం విఘ్నణమ్ - కర్షణేన ఉల్బణాః - కర్షణోల్బణాః కిణగ్రంథయః యస్మిన్ సః.

సంధులు :- మనోః + వంశే. గ్రంథిః + మమ - రేఫాదేశవిసర్గ. మనుష్య + అంకురాః, మమ + అయమ్ - సవర్ణదీర్ఘ. స్యాత్ + చేత్ - శ్చుత్వసంధి గణః + అయమ్ . ఉత్వాదేశవిసర్గ - గణో + అయమ్ - పూర్వరూపసంధి. తత్ర + ఇష్యతే. కర్షణ + ఉల్బణ - గుణసంధి ధిక్ + మౌర్వీ - అనునాసికాదేశ.

క్రియ :- డుకృఞ్ కరణే, విధి లిఙ్, పరస్మై. ప్రథమ

కుర్యాత్ - కుర్యాతామ్ - కుర్యుః

అస భువి, పరస్మై, విధి లిఙ్, ప్రథమ

స్యాత్ - స్యాతామ్ - స్యుః

డుధాఞ్ దానే, ఆత్మనే, లట్, ప్రథమ

ధత్తే - దధాతే - దధతే

[నేపథ్యే = తెరలో]

ప్రతిపదార్థ :- భగవన్ = మహాత్మా ! భార్గవా ! ఓ భార్గవా ! త్వమ్ = నీవు వేదవాన్ అపి = వేద విదుడవై యుంటివి. వసిష్ఠ గురోః = గురువైన వసిష్ఠునికి సనాభిః [అపి]= సపిండుడవు - ఏక గోత్రులనుట [సపిండాస్తు సనాభయః—అమరము] తే = నీకు. ప్రభవః = జన్మకారకుడైన, గురుః = తండ్రి, భగవాన్ = మహాత్ముడు.

జామదగ్న్యః :- (సరోషహాసమ్) అరే. బ్రహ్మబంధో. బాంధకినేయ.
గౌతమగోత్రపాంసన,

కుర్యుః శస్త్రకథామమీ యది మనోర్వంశే మనుష్యాంకురాః
స్యాచ్చేద్బ్రాహ్మణగణోఽయ మాకృతిగణ స్తత్రేష్యతే చేద్భవాన్ ।
సమ్రాజాం సమిధాం చ సాధకతమం ధత్తే ఛిదాకారణమ్
ధిఙ్మౌర్వీకుశకర్షణోల్బణ కిణగ్రంథిర్మమాయం కరః ॥ 44

---

పైనను - ఎంతటి అపరాధిపైననను - తైః = వారిచే, సోఢవ్యః అసి = సహింపవల సినవాడపై తివి. కానీ - ఏవమ్ = ఇట్లు, అతిక్రామన్ = మిక్కిలిగుచు (పొడిచిప్పుయునుట) అస్మాకమ్ = మాయొక్క. బ్రహ్మవర్చసాత్ అపి = బ్రహ్మతేజస్సువలనగూడ, న బిభేషి = భయపడకున్నావు. కథమ్ = ఏట్లు ? మమ్ముసేని సరకుగొనవేమని ఆశ్చ ర్యము. (స్యాద్బ్రాహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధిః — అమరము).

అరేఇతి ;— [సరోషహాసమ్ = రోషముతో ఎకసక్కెముగా] అరేఓరీ ; బ్రహ్మబంధో = బ్రాహ్మణాధమా ; [బ్రహ్మబంధురితిక్షేపే]. బాంధకినేయ = కులటా పుత్రుడా ; [అథ బాంధకినేయః స్యాద్బంధులశ్చాసతీసుతః - అమరము] గౌతమ గోత్రపాంసన = గౌతమ గోత్రమును కళంకపరచినవాడా ;

కుర్యురితి :- మనోః = మనువుయొక్క, వంశే = వంశమునందలి, అమీ = ఈ, మనుష్యాంకురాః = మానవశిశువులు, శస్త్రకథామ్ = యుద్ధమును (అను దేతి వృత్తమును) యది కుర్యుః = చేయుదురేని, అయమ్ = ఈ, బ్రాహ్మగణః = బ్రాహ్మణ [ఋత్విక్] సమూహము, ఆకృతి గణః = ఆకృతి గణము [ ఆకృతి గణము వ్యాకరణ ప్రసిద్ధము, ఆకారాది సామ్యముచే ఆ గణమునందు మరికొన్నింటిని చేర్చుకొనవచ్చును ] స్యాత్ చేత్ = ఆగునేని, తత్ర = ఆగణమునందు, భవాన్ = నీవు, ఇష్యతే చేత్=ఉందువేని, సమ్రాజామ్ = సమ్రాట్టులకును, సమిధామ్ = సమిధలకును, ఛిదాకారణమ్ = ఛేదనహేతువైన, సాధకతమమ్ = [ప్రకృష్ట సాధనము] గండ్రగొడ్డ లిని, ధత్తే = ధరించునదై, చ = మరియు, మౌర్వీ = వింటి నారియొక్కయు, కుశ = దర్భలయొక్కయు, కర్షణ = లాగుటలచే [నారినెక్కు పెట్టుట, దర్భలను పెరకుట], ఉల్బణ = అతిశయించిన, కిణగ్రంథిః = కాయలు కలదైన, అయమ్ = ఈ, కరః = చేయి, ధిక్ = నిష్ఫలము. [ధిగ్భర్త్సనే చ నిందాయాం నిష్ఫలే కుత్సితేఽపి

(నేపథ్యే)

భగవన్ భార్గవ. భార్గవ.

---

చ — విశ్వః. మౌర్వీ జ్యా శింజినీ గుణః — అమరము. కిణః స్యాన్మృత త్వగ్ ఘనీతే - అమరము] శార్దూల విక్రీడితము.

తాత్పర్యము :- మానవ మాత్రులుకూడ నాతో యుద్ధము చేయుదురేని, బ్రాహ్మణగణము కేవలము ఆకృతిగణమగునేని, అందు నీవు కూడ పరిగణింపబడుదు వేని, ఈ నా చేయి నిష్ఫలము. సమ్రాట్టులను సమిధలను ఛేదించు గండ్రగొడ్డలిని ధరించి, జ్యాఘాతములతో కాయలు కాసిన ఈ నాచేయి వ్యర్థము.

సమాసములు :- శస్త్రాణాం కథా - తామ్. మనుష్యాణాం అంకురాః, బ్రహ్మణాం గణః. ఛిదాయాః కారణమ్. మౌర్వీ చ కుశాశ్చ - మౌర్వీ కుశానాం కర్షణమ్ - కర్షణేన ఉల్బణాః - కర్షణోల్బణాః కిణగ్రంథయః యస్మిన్ సః.

సంధులు :- మనోః + వంశే, గ్రంథిః + మమ — రేఫాదేశవిసర్గ. మనుష్య + అంకురాః, మమ + అయమ్ — సవర్ణదీర్ఘ. స్యాత్ + చేత్ - శ్చుత్వసంధి గణః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - గణో + అయమ్ — పూర్వరూపసంధి. తత్ర + ఇష్యతే కర్షణ + ఉల్బణ - గుణసంధి ధిక్ + మౌర్వీ - అనునాసికాదేశ.

క్రియ :- డుకృఞ్ కరణే, విధి లిఙ్, పరస్మై, ప్రథమ

కుర్యాత్ - కుర్యాతామ్ - కుర్యుః

అస భువి, పరస్మై, విధి లిఙ్, ప్రథమ

స్యాత్ - స్యాతామ్ — స్యుః

డుధాఞ్ దానే, ఆత్మనే, లట్, ప్రథమ

ధత్తే - దధాతే - దధతే

[నేపథ్యే = తెరలో]

ప్రతిపదార్థ :- భగవన్ = మహాత్మా ! భార్గవా ! ఓ భార్గవా ! త్వమ్ = నీవు వేదవాన్ అపి = వేద విదుడవై యుంటివి. వసిష్ఠ గురోః = గురువైన వసిష్ఠునికి సనాభిః [అపి] = సపిండుడవు - ఏక గోత్రులనుట [సపిండాస్తు సనాభయః — అమరము] తే = నీకు. ప్రభవః = జన్మకారకుడైన, గురుః = తండ్రి, భగవాన్ = మహాత్ముడు

త్వం వేదవానసి వసిష్ఠగురోః సనాభిః
స్వాయంభువః స భగవాన్ ప్రభవో గురుస్తే ।
తేనాతిమాత్ర మసృణం హృదయం మదీయ
మద్యాపి న త్రుటతి శామ్యతు తే కుదృష్టిః ॥ 45

సః = ఆ [ప్రసిద్ధుడనుట]. స్వాయంభువః = బ్రహ్మపుత్రుడగు భృగుమహర్షి. [వసిష్ఠ భృగుమహర్షులు బ్రహ్మపుత్రులగుటచే వసిష్ఠ పరశురాములు సపిండులైరి] తేన = ఆ కారణముచే, మదీయమ్ = నాయొక్క. హృదయమ్ = ఎడద. అతిమాత్ర మసృణమ్ = నీపట్ల మిక్కిలి కోమలముగా [స్నిగ్ధముగా] ఉన్నది. అద్య అపి = ఇప్పటికిని [ఇందరిని ఇంతగా నీవు నిందించినప్పటికి ననుట], న త్రుటతి = [అది] కోపమును వహించుట లేదు. తే = నీ యొక్క. కుదృష్టిః = వక్ర దృష్టి [వక్రబుద్ధి]. శామ్యతు = ఉపశమించుగాక ! [వసంత తిలక].

తాత్పర్యము :- భార్గవా ! నీవు వేదవేత్తవు. మా గురువులు వసిష్ఠుల వారికి సపిండుడవు. బ్రహ్మపుత్రుడగు భృగుమహర్షి నీ తండ్రి. ఈ కారణములచే నా హృదయము నీపై కోపింపకున్నది. నీ వక్రబుద్ధిని ఇప్పటికైనను మరల్చుకొనుము.

సమాసములు :- వేదాస్సంత్యస్యేతి. వసిష్ఠశ్చాసౌ గురుశ్చ — తస్య. స్వయం భువః అపత్యం పుమాన్ - స్వాయంభువః [సంజ్ఞాపూర్వకవిధేరనిత్యత్వాత్ న గుణః, ఉవఙేవ] ప్రభవతి అస్మాదితి — ప్రభవః. కుత్సితా చ సా దృష్టిశ్చ — కుదృష్టిః.

సంధులు :- ప్రభవః + గురుః - ఉత్వాదేశవిసర్గ. గురుః + తే - సాదేశ విసర్గ. తేన + అతి. అద్య + అపి — సవర్ణదీర్ఘ.

క్రియ :- త్రుట - ఛేదనే. పరస్మై. [శః]. లట్. ప్రథమ
త్రుటతి - త్రుటతః - త్రుటన్తి
శము ఉపశమే [శ్యన్—శమి దీర్ఘః] లోట్. పరస్మై. ప్రథమ.
శామ్యతు / శామ్యతాత్ — శామ్యతామ్ — శామ్యన్తు

జామదగ్న్యః :- (సోచ్చైర్హాసమ్) కిమాత్థ రే దశరథ, కిమాత్థ నాద్యాపి హృదయం త్రుటతీతి. కథం వా త్రుటతు యావదేష న వ్యాప్రియతే పరశుః.

(నేపథ్యే)

అః జామదగ్న్య, గురూనప్యధిక్షిపసి

పురోజన్మా నాద్యప్రభృతి మమ రామః స్వయమహం
న పుత్రః పౌత్రో వా రఘుకులభువాం చ క్షితిభుజామ్ ।
అధీరం ధీరం వా కలయతు జనో మామయమయం
మయా బద్ధో దుష్టద్విజ దమన దీక్షా పరికరః ॥ 46

---

కిమితి :- [సోచ్చైః + హాసమ్ = బిగ్గరగా నవ్వుచు] రే దశరథ = ఓరీ దశరథుడా ! కిమాత్థ కిమాత్థ = ఏమంటి వేమంటివి ! అద్యాపి = ఇప్పటికిని, హృదయమ్ = ఎడంద, న త్రుటతి ఇతి = కోపింపకున్నదనియా ! ఏషః = ఈ. పరశుః = గండ్రగొడ్డలి, యావత్ న వ్యాప్రియతే = ఇంకను కదలాడనిదే, కథం వా త్రుటతు = ఎట్లు నీ హృదయము బ్రద్దలగును. (త్రుటికి అర్థాంతరస్వీకారము).

(నేపథ్యే = తెరలో)

పురోజన్మేతి :- అః = ఓహో ! జామదగ్న్య = భార్గవా ! గురూన్ అపి = పెద్దలను కూడ, అధిక్షిపసి = ఆధిక్షేపించుచున్నావా ! అద్య ప్రభృతి = ఈ క్షణమునుండి. రామః = రాముడు, మమ = నాకు, పురోజన్మా = అగ్రజుడు. న = కాదు. చ = మరియు, రఘుకులభువామ్ = రఘువంశ సంభవులగు, క్షితిభుజామ్ = రాజులకు, పుత్రః వా = తనయుడనుగానీ, పౌత్రః వా = మనుమడనుగానీ, న = కానే కాదు. అహమ్ = నేను, స్వయమ్ = స్వతంత్రుడను. జనః = ప్రజాసమూహము. మామ్ = నన్ను. అధీరమ్ వా = (భీరువుగాగానీ) ధీరతాగుణము లేనివానిగా గానీ. ధీరమ్ వా = ధీరునిగా గానీ. కలయతు = పరిగణించిన పరిగణించుగాక. అయమ్ అయమ్ = ఇదే ఇదే. దుష్ట ద్విజ = ఈ దుష్ట బ్రాహ్మణునియొక్క. దమన = శిక్షించుట యనునట్టి. దీక్షా = దీక్షతో, పరికరః = ప్రారంభము, మయా=నా చేత, బద్ధః =

జామదగ్న్యః :- (సావజ్ఞం రామం ప్రతి) అయే, కిమయం లక్ష్మణో భవంతం పురోజన్మాన మపదిశతి.

రామః :- (సవిలక్షస్మితమ్) ప్రసీద భగవన్. స ఏవాయం యౌవనా దర్వాచి నిరపరాధమధురే వయసి వర్తమానో యాని కానిచి దక్షరాణి ప్రలపతి.

---

స్వీకరింపబడినది. బద్ధపరికరః అనుమాట కార్యసాధనకు నడుము బిగించుట, సన్నాహ సన్నద్ధుడగుట అనునర్థములందుపయోగింపబడును. (శిఖరిణీ వృత్తము).

తాత్పర్యము :- ఈ క్షణమునుండియు రాముడు నాకు అగ్రజుడు కాడు. నేను స్వతంత్రుడను. నా చేయు పనివలని పాపపుణ్యములు నావే అనుట. రఘువంశ సంభవులకును నాకును నెట్టి సంబంధమును లేదు. నన్ను ధీరునిగానీ అధీరునిగానీ లోకులు భావింతురు గాక. ఈ దుష్ట బ్రాహ్మణుని సంహరించుటకు ఇదే నడుము బిగించితిని.

సమాసములు :- పురస్తాత్ జన్మ యస్య సః. రఘూణాం కులమ్ – కులే భవతి – తేషామ్. క్షితిం భునక్తి – తేషామ్. న ధీరః – తమ్. దుష్టశ్చాసౌ ద్విజశ్చ - ద్విజస్య దమనమ్ - దమనే దీక్షా - దీక్షాయాం పరికరః.

క్రియ :- కలి కలీనాం కామధేనుః లోట్, పరస్మై. ప్రథమ.
కలయతు/కలయతాత్ – కలయతామ్ - కలయన్తు

అయేఇతి :- (సావజ్ఞమ్ = అవమానస్ఫోరకముగా, రామునితో) అయే = ఓయీ! అయమ్ = ఈ, లక్ష్మణః = సౌమిత్రి, పురోజన్మానమ్ = అన్న గారివైన, భవంతమ్ = నిన్ను, అపదిశతి కిమ్ = దూరముచేయుచున్నాడేమి!

ప్రసీదేతి :- (సవిలక్షస్మితమ్ = సిగ్గుతోకూడిన చిఱునవ్వుతో) భగవన్ = మహాత్మా! ప్రసీద = క్షమింపుము. సః ఏవ అయమ్ = ఆయీ లక్ష్మ ణుడు, యౌవనాత్ = యౌవనముకంటె, అర్వాచి = ముందరిదై, నిరపరాధమధురే = అపరాధరహితమగుటచే మధురమైన, వయసి = కౌమారమునందు, వర్తమానః = ఉన్న వాడగుటచే, యానికానిచిత్ అక్షరాని = ఏవో అక్షరములను, ప్రలపతి = (అనర్థకము లను) వాగును. (ప్రలాపోఽనర్థకం వచః - అమరము)

జామదగ్న్యః :- (సస్మితమ్) కథమేతావత్యపి మామమృష్యమాణ మాశంకసే. యతస్త్వదనువర్తీ ఖల్వయం త్వామేవాస్త మయమానమన్వస్తమయిష్యతే. నిర్వాణం హి సవితారం తరణిమణిరప్యనునిర్వాతి. (నేపథ్యం ప్రతి) సాధు. రే. లక్ష్మణ. సాధు. కనిష్ఠతరోఽపి వరం భవాన్. న పునరయం వృధాజ్యేష్ఠో రామస్తే.

ప్రాగుచ్చైశ్శిరసం క్షురప్రనఖరైః క్రౌంచాద్రి దంతావలం
ఛిత్త్వా హంసమయాని మౌక్తికఫలాన్యాకీర్య పర్యాపితామ్।

---

కథమితి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) ఏతావతి అపి = ఇంత నిష్ఠురముగా ప్రలాపించినవానిపట్లగూడ, అమృష్యమాణమ్ = క్షమింపకయు మిన్నకున్న. మామ్ = నన్ను, కథమ్ ఇతి ఆశంకసే = ఎట్లా అని ఆశంకించుచున్నావా! సౌమిత్రిని క్షమించుటో సంహరించుటో చేయక ఇంతసేపు ఎట్లు ఊరకుండెనా అని ఆశంక. యతః = ఏకారణముచేతననగా, అయమ్ = ఈ సౌమిత్రి, త్వదనువర్తీ ఖలు = నీకు అనుచరుడు కదా! (అనుజన్ముడు - తోబుట్టువు). అందుచేత. అస్తమయమానమ్ = అస్తమించుచున్న. త్వామ్ ఏవ = నిన్నే. అన్వస్తమయిష్యతే = అనుసరించి అస్తమించును - అగ్రజుడవు కనుక ముందు నీవు. అనుజుడు కనుక నీ వెంట లక్ష్మణుడు నా చేతిలో అస్తమింతురనుట. నిర్వాణమ్ = అస్తమించుచున్న. సవితారమ్=సూర్యుని. తరణిమణిః అపి = సూర్యకాంతమణియు. అనునిర్వాతి హి = అనుసరించి అస్తమించును గదా! (నేపథ్యం ప్రతి = తెరవైపు ముఖము త్రిప్పి) ఓరీ సౌమిత్రీ! రే లక్ష్మణ = ఓరీ లక్ష్మణా! సాధు సాధు = బాగు బాగు! కనిష్ఠతరః అపి = (రామునికన్న) చిన్నవాడవైనను. భవాన్ = నీవే, వరమ్ = మేలు. పునః = అంతేకాని, తే = నీకు. వృధా జ్యేష్ఠః = వ్యర్థముగా అన్నగారైన, అయమ్ = ఈ, రామః = రాముడు. న వరమ్ = గొప్పకాదు. (మనాగిష్టే వరం యత్తు కశ్చిదాహ తదవ్యయమ్ - శాశ్వతః. దేవాద్వృతే వరః శ్రేష్ఠే త్రిషు క్లీబం మనాక్ ప్రియే - అమరము)

ప్రాగితి :- ప్రాక్=పూర్వకాలమునందు. క్షురప్రనఖరైః = బాణములు అనునట్టిగోళ్ళతో. ఉచ్చైశ్శిరసమ్ = ఎత్తయిన శిరస్సు అను శిఖరము కలిగిన.

సైంహీం వృత్తిమధిష్ఠితేఽపి హి మయి క్షాత్రేణ కల్పేన తే
దిష్ట్యా కౌతుకమాభిరామికమసి త్వం కోఽపి వీరాంకురః॥ 47

(నేపథ్యే)

---

క్రౌంచాద్రి దంతావళమ్ = క్రౌంచ పర్వతమనునట్టి ఏనుగును. భిత్త్వా = ఖండించి-శిరోభాగమున రంధ్రము చేసి. హంసమయాని = హంసల రూపమునన్నున్న. మౌక్తిక ఫలాని = ముత్తెములను. ఆకీర్య = వెదజల్లి (అటునిటు సంచరించునట్లుచేసి). పర్యాపితామ్ = వ్యవస్థాపితమైన. సైంహీమ్ వృత్తిమ్ = సింహప్రవృత్తిని. అధిష్ఠితే = పొందినవాడనైన. మయి అపి = నాపట్లను జూపిన, తే = నీయొక్క. క్షాత్రేణ = క్షత్రియోచితమైన. కల్పేన = ప్రవర్తనాదికముతో. దిష్ట్యా = భాగ్యవశమున. ఆభిరామికమ్ = ప్రీతిదాయకమగు. కౌతుకమ్ = ఔత్సుక్యము (జాయతే = కల్గుచున్నది). త్వమ్ = నీవు. కః అపి = ఎవడవో. వీరాంకురః అపి = బాలవీరుడవై యుంటివి; (శార్దూలము)

తాత్పర్యము :- ఎత్తయిన శిరస్సు కలిగిన క్రౌంచ పర్వతములనునట్టి ఏనుగును ఆయుధములనునట్టి నఖములతో చీల్చి హంసలనునట్టి ముత్తెములు ఎగురునట్లు చేయుటతో నా సింహప్రవృత్తి లోకమున ఏనాడో సుప్రతిష్ఠితమైనది. అట్టి నాపట్ల నీవు క్షాత్ర పద్ధతిని ప్రదర్శించుచున్నావనగా భళా! ఆనందముగా నున్నది. నీవెవడవో వీరాంకురమవు.

సమాసములు :- ఖరప్రాః ఏవ నఖరాః - తైః. క్రౌంచాద్రిరేవ దంతావళః - తమ్ [ దంత శిఖాత్సంజ్ఞాయామ్ - వలచ్ - వలే చ - దీర్ఘః ] అభిరామాయ ప్రభవతి - [ తస్మై ప్రభవతి సంతాపాదిభ్యః - ఠక్ ] - ఆభిరామికమ్. వీరస్యాంకురః వీరః అంకుర ఇవ.

సంధులు :- ఫలాని + ఆకీర్య – యణాదేశ. వీర + అంకురః - సవర్ణ దీర్ఘ. అధిష్ఠితే + అపి, కో + అపి – పూర్వరూప. కః + అపి. కో + అపి – ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- అస భువి, పరస్మై, లట్, మధ్యమ

అసి – స్తః – స్థ

[నేపథ్యే = తెరలో]

భార్గవ. భార్గవ. దుర్విజ్ఞానమిదమర్వాక్ఫలనిష్పత్తేరాభిరామికం సాంగ్రామికం వా.

రామః :- (సరోషం నేపథ్యాభిముఖమ్) అః. వత్స. కోఽయమద్యతనస్తే దుర్వినయప్రరోహో యద్గురూనపి క్షేత్రీకరోషి.

(నేపథ్యే)

ఆర్య. తూష్ణీమయమస్మి. క్షమస్వ జామదగ్న్య. నియంత్రితోఽహమార్యేణ.

జామదగ్న్యః :- (విహస్య) అరే రామ. కథమద్యాపి వాచమేవ సూనృతామస్మదభియోగప్రశమనీం ప్రథయసే. కవచహరోఽసి. శస్త్రైరేవ ప్రతిక్రియంతాం శస్త్రాణి. కించ రే-

---

ఓ పరశురామా! పరశురామా! ఫలనిష్పత్తేః = ఫలనిష్పత్తికంటె, అర్వాక్ = ముందుగనే, ఇదమ్=ఇది, ఆభిరామికమ్ వా=ఆనందదాయకమో, సాంగ్రామికమ్ వా = ద్వంద్వయుద్ధ ప్రదాయకమో. దుర్విజ్ఞానమ్ = తెలిసికొనుట కష్టము. ముందుగా ముగింపు నూహింపలేమనుట.

అ ఇతి ;- [సరోషమ్ = రోషముతో. నేపథ్యాభిముఖమ్ = తెరవైపు చూచుచు] అః వత్స = ఓయీ సోదరా! కః అయమ్ = ఏమిది! తే = నీ యొక్క. అద్యతనః = ఈ వినూతనమైన, దుర్వినయప్రరోహః = అవినయావిర్భావము ! మున్నెన్నడు నిట్టి అవినయము నీ గుండెలో మొలచుటెరుగమే అనుట. గురూన్ అపి = గురువులను కూడ, క్షేత్రీకరోషి = నీ అవినయమునకు గురిచేయుచున్నావే !

(నేపథ్యే = తెరలో)

ఆర్యేతి :- ఆర్య = అగ్రజా! తూష్ణీమ్ అయమ్ అస్మి = ఇదిగో మిన్నకున్నాను. జామదగ్న్య = ఓ పరశురామా ! క్షమస్వ = క్షమింపుము. (క్షము ప్రసహనే - ఘ్వాదిరాత్మనే పదీ). ఆర్యేణ = అన్నగారిచే. అహమ్ = నేను. నియంత్రితః = నివారింపబడితిని.

అరేఇతి :- (విహస్య = పకపకనవ్వి) అరేరామ = ఓరీ రామా ! కథమ్ = ఎట్టా ! అద్యాపి = ఇప్పటికిని, అస్మత్ = మాయొక్క, అభియోగ = యుద్ధోద్యమమును, ప్రశమనీమ్ = చల్లార్చునదై. సూనృతామ్ = సత్యమును ప్రియము

రాజన్యేభ్యో జన్మ వైవస్వతేభ్యశ్చక్రే చాపాచార్యకం కౌశికశ్చ ।
క్షాత్రీం చర్యామేవముమ్ముఞ్చతస్తే గోత్రాక్షేపీ వజ్రలేపః కళంకః॥48

రామః :- (సగర్వస్మితమ్) భగవన్. సత్యమేతత్.

---

నైన, వాచమ్ ఏవ = మాటనే, ప్రథయసే = విస్తరించి పలుకుచున్నావే ! (సత్యం ప్రియం చ వచనం సూనృతం సముదాహృతమ్) అది నిష్ప్రయోజనమనుట. కవచహరః అపి = సన్నద్ధుడవైతివి. శస్త్రాణి = ఆయుధములు. శస్త్రైః ఏవ = ఆయుధములతోనే, ప్రతిక్రియంతామ్ = సమాధానింపబడునుగాక ! తే = ఓరీ ! కించ=మరియు –

రాజన్యేభ్య ఇతి :- వైవస్వతేభ్యః=సూర్యసంతతియైన. రాజన్యేభ్యః = రాజులనుండి. జన్మ = నీ పుట్టుక. కౌశికః = విశ్వామిత్రుడంతటివాడు, చాపాచార్యకమ్ = ధనుర్విద్యాగురుత్వమును. చక్రే = నిర్వహించెను. క్షాత్రీమ్ = క్షత్రియోచితమైన, చర్యామ్ = పరిపాటిని, ఏవమ్=ఇట్లు, ఉన్ముంచతః = విడిచిపెట్టుచున్న. తే = నీకు. గోత్రాక్షేపీ = వంశమునంతటిని ముంచెత్తునదియు, వజ్రలేపః = చెరిపి తొలగించుటకు వీలులేనిదియునైన, కళంకః = అపకీర్తి (అపవాదు) సంభవించును.

తాత్పర్యము :- రామా ! నీవు సూర్యవంశమునందు పుట్టితివి. కౌశికుని వద్ద ధనుర్విద్య నభ్యసించితివి, క్షత్రియోచితముగా యుద్ధమునకు సన్నద్ధుడవు కాక ఇట్లూరకుంటివేని అది నీ వంశమునకును నీకును మాయని మచ్చయగును సుమా !

సంధులు :- రాజన్యేభ్యః + జన్మ – ఉత్వాదేశవిసర్గ. వైవస్వతేభ్యః + చక్రే. కౌశికః + చ. ముంచతః + తే – శషసాదేశవిసర్గ. ఉత్ + ముంచతః – అనునాసికాదేశ. గోత్ర + ఆక్షేపీ – సవర్ణదీర్ఘ.

ఛందస్సు :- శాలిని. "మాత్తౌగౌ చేచ్ఛాలినీ వేదలోకైః" – మతతగగ

క్రియ :- డుకృఞ్ కరణే. లిట్. ఆత్మనే. ప్రథమ

చక్రే – చక్రాతే – చక్రిరే

జాత ఇతి :- (సగర్వస్మితమ్ = గర్వముతో కూడిన చిఱునవ్వుతో) భగవన్ = మహాత్మా ! సత్యమ్ ఏతత్ = నీవన్నది సత్యమే సః అహమ్ = ఆ నేను దినకరకులే = సూర్యవంశమునందు, క్షత్రియశ్రోత్రియేభ్యః = వేదవేత్తలగు క్షత్రి

జాతస్సోఽహం దినకరకులే క్షత్రియశ్రోత్రియేభ్యః
విశ్వామిత్రాదపి భగవతో దృష్టదివ్యాస్త్రపారః ।
అస్మిన్వంశే కథయతు జనో దుర్యశో వా యశో వా
విప్రే శస్త్రగ్రహణగురుణః సాహసిక్యాద్బిభేమి॥ 49

---

యుల నుండి (క్షత్రియశ్రేష్ఠులనికానీ). జాతః = జన్మించితిని - వారి రక్తముపంచుకొని పుట్టితిననుట. భగవతః = మహాత్ముడైన. విశ్వామిత్రాత్ = విశ్వామిత్రునినుండి దృష్టదివ్యాస్త్రపారః = దివ్యాస్త్రముల పారము ముట్టితిని - సంపూర్ణముగా నభ్యసించితిననుట. జనః = ప్రజాసమూహము, అస్మిన్ = నేను జన్మించిన ఈ, వంశే = వంశమునందు. దుర్యశః వా = అపకీర్తిని కానీ. యశః వా = కీర్తినికానీ. కథయతు= వచింతురుగాక । విప్రే = బ్రాహ్మణునిపట్ల, శస్త్రగ్రహణగురుణః = ఆయుధమునెత్తుట యనునట్టి. సాహసిక్యాత్ = సాహసమునుండి. బిభేమి = జంకుచున్నాను (శార్దూలము)

తాత్పర్యము :- ఉత్తమ క్షత్రియ వంశమున పుట్టి, విశ్వామిత్రునినుండి ధనుర్విద్యను చేపట్టిన నేను - ప్రజలు ఏమే ననుకొందురుగాక - బ్రాహ్మణుని పైకి ఆయుధము నెత్తు సాహసమును మాత్రము చేయజాలను.

సమాసములు :- దినకరస్య కులమ్ - తస్మిన్. క్షత్రియాశ్చతే శ్రోత్రియాశ్చ - తేభ్యః. దివ్యాని చ తాన్యస్త్రాణి చ - దివ్యాస్త్రాణాంపారమ్ - దృష్టం దివ్యాస్త్రపారం యేన సః. శస్త్రస్య గ్రహణమ్ - గ్రహణేన గురు - తస్మాత్. సహో బలమ్-తేన సహావర్తతే (ఓజస్సహోఽమ్భసా వర్తతే - ఠక్) ఇతి సాహసికః -తస్యభావః- సాహసిక్యమ్ - తస్మాత్.

సంధులు :- సః + అహమ్ - ఉత్వాదేశవిసర్గ - సో + అహమ్ - పూర్వరూపసంధి. శ్రోత్రియేభ్యః + విశ్వ. యశః + వా - జనః + దుర్. భగవతః + దృష్ట - ఉత్వాదేశవిసర్గ. దివ్య + అస్త్ర - సవర్ణదీర్ఘసంధి.

క్రియ :- కథ వాక్యప్రబంధే, ణిచ్, పరస్మై. లోట్, ప్రథమ

కథయతు / కథయతాత్ - కథయతామ్-కథయన్తు

ఞిభీ భయే. లట్, పరస్మై. ఉత్తమ

బిభేమి - బిభివః / బిభీవః - బిభిమః / బిభీమః

జామదగ్న్యః :- (సక్రోధమ్) ఆః పాప. దుర్ముఖ. వసిష్ఠ ఇవ విశ్వామిత్ర ఇవ స్వస్తివాచనికో బ్రాహ్మణస్తే పరశురామః. (సవ్యథమ్) ధిక్కష్టమ్. ఏవముచ్చావచవాచః క్షత్రియాః శ్రూయన్తే (క్రోధాతిశయం నాటయన్) అయమహం భోః.

సహ దశరథమద్యోత్కృత్య పుత్రైశ్చతుర్భిః
జనకకులకబంధస్కంధ నిర్గత్వరీభిః।
నవరుధిరలతాభిః క్లృప్తలీలాపతాకాం
రణభువమతిరౌద్రీం రుద్రశిష్యః కరోమి॥ 50

---

ఆఇతి :- (సక్రోధమ్ = క్రోధముతో) ఆః పాప = ఓయీ పాపాత్మా! దుర్ముఖ = పాడునోటివాడా! వసిష్ఠ ఇవ = వసిష్ఠునివలెను, విశ్వామిత్రః ఇవ = కౌశికునివలెను, తే = నీకు. పరశురామః = శః భార్గవుడు, స్వస్తివాచనికః = (సంధ్యావనలు స్వీకరించి) స్వస్తివాక్యములు పలుకునట్టి. బ్రాహ్మణః = బ్రాహ్మణుడా! — నీకు అట్లు కన్పించుచున్నానా అనుట. (సవ్యథమ్ = బాధతో) ధిక్! కష్టమ్ = కష్టము! ఏవమ్ = ఇట్లు, ఉచ్చావచవాచః = వివిధాలాపములు కలవారుగా. క్షత్రియాః = రాజులు శ్రూయన్తే = వినబడుచున్నారు - క్షత్రియులిట్లే మాట్లాడుదురని ప్రసిద్ధి అనుట. (క్రోధాతిశయమ్ = అధిక క్రోధమును, నాటయన్ = అభినయించుచు) భోః = ఓయోయీ! అయమ్ అహమ్ = శః నేను —

సహేతి :- పుత్రైః = పుత్రులు, చతుర్భిః సహ = నల్గురితోను. దశరథమ్ = దశరథుని, అద్య = ఇప్పుడు. ఉత్కృత్య = తొలగించి (సంహరించి), జనకకుల = జనకుని వంశస్థులయొక్క, కబంధ = మొండెముల, స్కంధ = మెడలనుండి నిర్గత్వరీభిః = వెలువడునట్టి, నవరుధిరలతాభిః - నవ = నూతనమైన, రుధిర = రక్త ప్రవాహములనునట్టి, లతాభిః = తీగెలతో, క్లృప్త = రచింపబడిన, లీలా పతాకామ్ = విలాస సూచకమగు పతాక కలదానినిగా, రణభువమ్ = యుద్ధరంగమును, అతి రౌద్రీమ్ = మిక్కిలి భయానకముగా, రుద్రశిష్యః అహమ్ = రుద్రుని శిష్యుడనగు నేను. కరోమి = చేయుదును. (మాలిని — ననమయయ యుతేయం మాలినీ భోగిలోకైః).

రామః :- (సరోషమ్) అః జామదగ్న్య. కేయం వాగ్విభీషికా. దూరమతి
క్రామతి ప్రసంగే కదాచిదిక్ష్వాకవోఽపి దుర్మనాయన్తే.

జామదగ్న్యః :- (సభ్రుకుటీభంగమ్) తతః కిమ్.

రామః :- (సావష్టంభమ్) తతశ్చ

---

తాత్పర్యము :- పుత్రులు నల్గురితోను దశరథుని నిర్మూలించి జనక వంశ్యుల మొండెముల నుండి ఎగజిమ్ము రక్తధారలే లతలుగా వినూతన జయపతాకను రణభూమిలో ఎగురవేసి ఈ రుద్రశిష్యుడు అతి రౌద్రతను ఇదే కల్పించుచున్నాడు.

సమాసములు :- జనకస్య కులమ్ - జనక కులానాం కబంధాః - కబంధానాం స్కంధాః - స్కంధేభ్యః నిర్గత్వరీభిః (గత్వరశ్చ). నవరుధిరాణ్యేవ లతాః - తాభిః. క్లృప్తా లీలాపతాకా యస్యాం సా - తామ్. రణస్య భూః - రుద్రస్య శిష్యః.

సంధులు :- అద్య + ఉత్ - గుణసంధి. పుత్రైః + చతుర్భిః + జనక - శాదేశవిసర్గ - రేఫాదేశవిసర్గ.

క్రియ :- డుకృఞ్ కరణే, లట్, పరస్మై, ఉత్తమ
కరోమి - కుర్వః - కుర్మః

అఃఇతి :- (సరోషమ్=కోపముతో) అః జామదగ్న్య = ఓయీ ! భార్గవా ! ఇయమ్ = ఈ తీరున, వాగ్విభీషికా = మాటలతో భయపెట్టుట. కా = ఏమిది ! ఇట్టి బిభీషికలు వలదనుట. ప్రసంగే = సంభాషణము. దూరమ్ అతిక్రామతి(సతి) = మేర మీరి దూరముసాగినచో. కదాచిత్ = ఒక్కొక్కప్పుడు. ఇక్ష్వాకవః అపి = రఘు వంశ్యులు కూడ. దుర్మనాయన్తే = కుపితులగుదురు.

తతఇతి :- (సభ్రుకుటీభంగమ్ = కనుబొమలు చిట్లించి) తతః కిమ్ = దుర్మనస్కుడవైనచో నేమి !

త్రైరితి :- (సావష్టంభమ్ = సగర్వముగా) తతశ్చ=దుర్మనస్కుడవైనచో - త్రిః సప్తభిః ఏవ= కేవలము ముయ్యేడుమారులే అయిన, తైః = ఆ, రాజవిజయైః=

తై స్త్రిస్స ప్తభిరేవ రాజవిజయైర్య త్తే భుజ స్తంభయోః
కృత్వా తోరణమాకాలిం పునరయం ద్వావింశమారిప్సతే।
ద్రక్ష్యామి త్వయి వ ర్తమానమధునా తచ్చాపవిద్యాద్భుతం
శంభో స్తస్య హి కేవలేన ధనుషా కృష్టేన తుష్టిర్న మేః 51

---

క్షత్రియ విజయములతో. తే భుజ స్తంభయోః = నీ బాహువులను స్తంభములకు. తోరణమాలికామ్ = విజయతోరణముల దండను, కృత్వా = నిర్మించి. పునః = మరల నిప్పుడు. అయమ్ = ఈ, ద్వావింశమ్ = ఇరువదిరెండవ విజయమును. ఆరిప్సతే యత్ = ఆరంభింపగోరుచున్నవై. త్వయి = నీయందు. వ ర్తమానమ్ = పరిఢవిల్లు చున్న. తత్ = ఆ, చాపవిద్యాద్భుతమ్ = ధనుర్విద్యయొక్క (అద్భుత) మహా త్త్వ మును, అధునా = ఈ రోజు. ద్రక్ష్యామి = దర్శింతును. తస్య = ఆ, శంభోః = శివునియొక్క. ధనుషా = ధనుస్సు. కేవలేన = కేవలము. కృష్టేన = ఎక్కుపెట్ట బడినదగుటతో. మే = నాకు. తుష్టిః న = సంతృప్తిలేదు. [శార్దూలము]

తాత్పర్యము : ఇరువదియొక్క మారులు క్షత్రియులను జయించి భుజ స్తంభములకు విజయ తోరణములు కట్టుకొని ఇప్పుడు ఇరువదిరెండవ మారు విజయ మును పొందుట కారంభించుచున్నావు. ఇట్టి నీయందున్న ధనుర్విద్యామహా త్త్వమును దర్శింప నుబలాటపడుచుంటిని. శివధనుస్సును భంగపరచుటతో నా హృదయము తృప్తి పడుటలేదు. శివుని శిష్యుడవైన నీ సామర్థ్యమునుగూడ చూడవలసినదే. (ద్వావింశతేః పూరణమ్ - తస్య పూరణే డట్ - తివింశతేర్డితి - టిలోపః).

సంధులు :- తైః + త్రిః + సప్త. శంభోః + తస్య - సాదేశవిసర్గ. సప్తభిః + ఏవ. విజయైః + యత్. తుష్టిః + న - రేఫాదేశవిసర్గ. తత్ + చాప - శ్చుత్వసంధి. విద్యా + అద్భుతమ్ - సవర్ణదీర్ఘ.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే. ల్రుట్. పరస్మై. ఉత్తమ
ద్రక్ష్యామి - ద్రక్ష్యావః - ద్రక్ష్యామః
రభజ్ రాభస్యే (సన్). ఆత్మనే. లట్. ప్రథమ (అజ్)
ఆరిప్సతే - ఆరిప్సేతే - ఆరిప్సన్తే

జామదగ్న్యః :- (సరోషమ్) కిమాత్థ రే కిమాత్థ ! (ద్రక్ష్యామి త్వయి వర్తమానమధునా .... ఇత్యాదిశ్లోకోత్తరార్ధం పఠిత్వా సవ్యథమ్) అహో ! సర్వతః సమిధ్యమాన దారుణస్య రోషజాతవేదసో విదేహదిలీపయోః కులం నామ కతి భవిష్యంత్యాహుతయః. (ఉచ్చైః) భో భోః సప్తద్వీపకులపర్వతవర్తినో రాజానః చేతయధ్వం చేతయధ్వమ్.

యేన స్వాం వినిహత్య మాతరమపి క్షత్రాస్రమధ్వాసవ
స్వాదాభిజ్ఞపరశ్వధేన విదధే నిఃక్షత్రియా మేదినీ ।

---

కిమితి :- (సరోషమ్ = రోషముతో) రే = ఓరీ, కిమాత్థ = ఏమంటివి! (ద్రక్ష్యామి త్వయి వర్తమానమధునా — ఇత్యాది శ్లోకోత్తరార్ధమ్ = అను శ్లోకపుటుత్తర భాగమును. పఠిత్వా = తాను పఠించి, సవ్యథమ్ = వెతపడుచు) అహో ! సర్వతః = అన్నివైపులనుండియు, సమిధ్యమాన దారుణస్య = రగుల్కొల్పబడుటచే భీషణమైన. రోష = రోషమనునట్టి, జాతవేదసః = యాగాగ్నికి. విదేహ దిలీపయోః = జనకుడు దిలీపుడు అనువారియొక్క, కులమ్ నామ = వంశమన్నది. కతి=ఎన్ని, ఆహుతయః = ఆహుతులు [హవ్యము వేల్చుటలు]. భవిష్యన్తి = అగునో ! [ఉచ్చైః = బిగ్గరగా] భోః భోః = ఓయోయీ ! సప్తద్వీప = ఏడు ద్వీపములయందును, కుల పర్వత= సప్త కుల పర్వతములయందును, వర్తినః = సంచరించునట్టి [వసించువారైన] రాజానః = క్షత్రియులారా ! చేతయధ్వమ్ ! చేతయధ్వమ్ = సావధానులు కండు, సావధానులు కండు !

యేనేతి :- స్వామ్ = తనదియైన, మాతరమ్ అపి = తల్లిని కూడ వినిహత్య = సంహరించి. క్షత్రాస్ర = రాజరక్తమునునట్టి, మధ్వాసవ = మద్యము యొక్క. (మధ్వాసవో మాధవకో మధుమాధ్వీకమద్యయోః — అమరము), స్వాద + అభిజ్ఞ = రుచి నెరిగిన, పరశ్వధేన = పరశువుకలవాడైన, (పరశుశ్చ పరశ్వధః—అమర) యేన = ఏ భార్గవ రామునిచే, మేదినీ = భూమండలము, నిఃక్షత్రియా = క్షత్రియ శూన్యముగా, విదధే = కావింపబడినదో, యత్ = ఎవనియొక్క, బాణవ్రణ = బాణాఘాతమునునట్టి, వర్త్మనా = మార్గము నుండి, హంసచ్ఛలాత్ = హంసలు అను

యద్బాణవ్రణవర్త్మనా శిఖరిణః క్రౌంచస్య హంసచ్ఛలా
దద్యాప్యస్థికణాః పతన్తి స పునః క్రుద్ధో మునిర్భార్గవః॥ 52

రామః :- (సహర్ష సంభ్రమమ్)

నృపానప్రత్యక్షాన్ కిమపవదసే నన్వయమహం
శిశుక్రీడాభగ్నత్రిపుర హరధన్వా తవ పురః ।

---

వంకతో, క్రౌంచస్య శిఖరిణః = క్రౌంచ పర్వతముయొక్క. అస్థికణాః = ఎముకల ముక్కలు, అద్య + అపి = ఇప్పటికిని, పతన్తి = రాలి పడుచున్నవో, సః = ఆ, మునిః = మునియగు, భార్గవః = పరశురాముడు. పునః = మరల, క్రుద్ధః = క్రుద్ధుడయ్యెను. (శార్దూలము)

తాత్పర్యము :- సొంత తల్లిని సంహరించి క్షత్రియ రక్తమును రుచి మరిగిన పరశువుతో భూమిని రాజశూన్యము గావించిన ఈ పరశురాముడు బాణముతో నేర్పరచిన గాయపు రంధ్రమునుండి హంసలనుసట్టి మిషతో క్రౌంచపర్వతముయొక్క ఎముకలు ఇప్పటికిని రాలిపడుచున్నవి. అంతటి ఈ పరశురాముడు ఇంతకాలమున కిప్పుడు మరల క్రుద్ధుడాయెను. అంతటి బీభత్సమును మరల చేయుననుట.

సమాసములు :- క్షత్రాణామ్ అస్రమ్ – అస్రమేవ మధ్వాసవమ్ – ఆసవస్య స్వాదః – స్వాదే అభిజ్ఞః – అభిజ్ఞః పరశ్వధః యస్య సః – తేన. బాణేన వ్రణమ్ – బాణవ్రణస్య (వ్రణమేవ వా) వర్త్మ – తేన.

సంధులు :- క్షత్ర + అస్ర, స్వాద + అభిజ్ఞ, అద్య + అపి - సవర్ణదీర్ఘ. మధు + ఆసవ, అపి + అస్థి - యణాదేశ. హంస + ఛలాత్ - తుగాగమ. క్రుద్ధః + మునిః - ఉత్వాదేశవిసర్గ. మునిః + భార్గవః - రేఫాదేశవిసర్గ.

క్రియ :— డుధాఞ్ ధారణ పోషణయోః, ఆత్మనే, లిట్, ప్రథమ [వి]

దధే – దధాతే – దధిరే

పత్ల గతౌ, పరస్మై, లట్, ప్రథమ

పతతి – పతతః – పతన్తి

నృపానితి :- (సహర్ష సంభ్రమమ్ = ఆనందముతో సంభ్రమముతో) అప్రత్యక్షాన్ = ఎట్ట యెదుటలేని, నృపాన్ = రాజులను, కిమ్ అపవదసే = నిందింతు

అహంకారక్రూరార్జున భుజవనవ్రశ్చనకళా
నిసృష్టార్థో బాహుః కథయ కతరస్తే ప్రహరతు॥ 53

---

వేల। నను = ఇదే [నన్విత్యాభిముఖ్యే-అమరము], శిశుక్రీడా = బాలక్రీడగా. భగ్న= భగ్నముగావించిన. త్రిపురహరధన్వా = శివధనుస్సుకలవాడనై. అయమ్ అహమ్ = ఈః నేను. తవ = నీ యొక్క. పురః = ఎట్టయెదుట నుంటిని. అహంకార = గర్వముతో. క్రూర = నిష్ఠురుడైన, అర్జున = కార్తవీర్యార్జునునియొక్క. భుజవన = బాహువులు అనునట్టి అరణ్యమును - బాహువుల సమూహమునమట. వ్రశ్చన = ఛేదించుటయన్దలి. కళా = ప్రావీణ్యముతో. నిసృష్టార్థః = సృష్టపడిన బలముకలదైన- ఛేదన కళతో నిరూపింపబడిన సామర్థ్యము కలది - అనియేని - తే = నీ యొక్క కతరః బాహుః = ఏ భుజము. ప్రహరతు = [నన్ను] కొట్టవలెనో. కథయ = ఆజ్ఞాపింపుము. నన్ను కొట్టుటకు నీ బాహువు నాజ్ఞాపింపుమనుట. శిఖరిణీ వృత్తము.

తాత్పర్యము :- ఎట్టయెదుట లేనివారిని నిందించి యేమి లాభము. శిశుక్రీడగా శివధనుస్సును విరిచినవాడను ఇదిగో నీ యెట్టయెదుట నుంటిని. కార్తవీర్యార్జును బాహుసమూహమును ఖండించి, ప్రసిద్ధి కెక్కిన నీ భుజమును నన్ను కొట్టుటకు ఆజ్ఞాపింపుము.

సమాసములు :- శిశోః క్రీడా - క్రీడయా భగ్నమ్ - భగ్నం త్రిపురహరస్య ధనుః యేన [యస్య] సః. అహంకారేణ క్రూరః -క్రూరశ్చాసావర్జునశ్చ- అర్జునస్య భుజవనమ్ - వనస్య వ్రశ్చనమేవ కళా - [వ్రశ్చనే వా] - కళయా నిసృష్టార్థః

సంధులు :- నను + అయమ్ - యణాదేశ. క్రూర + అర్జున. నిసృష్ట + అర్థ - సవర్ణదీర్ఘ. అర్థః + బాహుః - ఉత్వాదేశవిసర్గ. కతరః + తే - సాదేశ విసర్గ.

క్రియ :- కథ వాక్యప్రబంధే. ణిచ్, పరస్మై. లోట్, మధ్యమ
కథయ / కథయతాత్ - కథయతమ్ - కథయత
హృఞ్ హరణే. లోట్. పరస్మై. ప్రథమ [ప్ర]
ప్రహరతు / ప్రహరతాత్ - ప్రహరతామ్ - ప్రహరన్తు
వద వ్యక్తాయాం వాచి. అపాద్వదః - ఇత్యాత్మనే పదమ్. లట్
మధ్యమ
అపవదసే - అపవదేథే - అపవదధ్వే

జామదగ్న్యః :- (సకోపాటోపమ్) ఆః పాప. వికర్తనకుల కళంక. పునస్తరాం తదేవ పార్వతీదయిత కోదండదళన సాహసముద్భావయసి. అహహ ! క్షత్రియోఽపి భార్గవస్య కార్తవీర్యజయినం భుజదండమన్విష్యతి. అహో గరీయాన్ కాలః । యదశ్రుతచరమపి శ్రావయతి. అదృష్టచరమపి దర్శయతి. అపి చ రే రాజన్యకీట.

జానాస్యేవ యథా పితుః పరిభవన్ హోమార్జునీమర్జునో
మత్కోదండ మనేక రాజక వధస్వాధ్యాయ మధ్యాపిపత్ ।

---

ఆఃఇతి :- [సకోపాటోపమ్ = కోపాతిశయముతో] ఆః పాప = ఓరీ పాపాత్ముడా ! వికర్తన కుల కళంక = సూర్యవంశమునకు కళంకము వంటివాడా! పునస్తరామ్ = మరల మరల. తదేవ = అదే. పార్వతీదయిత = శివునియొక్క. కోదండ = ధనుస్సును. దళన = భంగపరచుటయన్నటి. సాహసమ్ = సాహసమును. ఉద్భావయసి = ప్రకటించుచున్నావు. అహహ ! క్షత్రియః అపి = ఇతడు క్షత్రియుడై యుండియును. భార్గవస్య = ఈ పరశురామునియొక్క. కార్తవీర్యజయినమ్ = కార్తవీర్యార్జునుని జయించినట్టి. భుజదండమ్ = బాహుదండమును. అన్విష్యతి = తానే ఏపి అని వెదకుచున్నాడు ! అహో ! కాలః = కాలము. గరీయాన్ = గొప్పదికదా ! — సర్వాధికమనుట. యత్ = ఏలయన. అశ్రుతచరమ్ అపి = వినియుండని విషయమును గూడ. శ్రావయతి = వినిపింపజేయును. అదృష్టచరమ్ అపి = కనియుండని దృశ్యమునుగూడ (భూతపూర్వే చరట్). దర్శయతి = కనిపింపజేయును — కాలమహిమ అంతటిదనుట. అపిచ = మరియు. రే = ఓరీ. రాజన్యకీట = క్షత్రియాధమా !

జానాసీతి :- పితుః = నా తండ్రియొక్క. హోమార్జునీమ్ = హోమ సాధనమైన సౌరభేయిని (....అర్జునీ.... సౌరభేయీ... గౌః —అమరము). పరిభవన్ = అపహరించువాడై. అర్జునః = కార్తవీర్యార్జునుడు. (అర్జునఃకకుభేపార్థే భవేదప్యర్జునీ గవి - మేదినీ) మత్ = నాయొక్క. కోదండమ్ = ధనుస్సును. అనేక రాజక = సమస్త క్షత్రియ సమూహము యొక్క. వధ=సంహారరూపమైన. స్వాధ్యాయమ్ = వేదపాఠమును. అధ్యాపిపత్ = కఱపెను — ఆవేదమును నా ధనుస్సునకు నేర్పెననుట.

తేనైవాస్తి భవత్సు యద్యపి మమ క్రోధోఽయమౌత్సర్గిక
స్తత్సంప్రత్యుపసర్జనం గురుధనుర్భంగాదయం హేతుమాన్॥ 54
రామః :- ఋషే, జామదగ్న్య, పటచ్చరీభూతా ఖల్వియం పురాతనీ కీర్తి

---

జానాసి ఏవ = ఇది నీవెరుగనే యెరుగుదువు. తేన ఏవ = ఆ కారణముచేతనే. యద్యపి = నిజమునకు భవత్సు = మీ క్షత్రియులందరిపట్లను. మమ = నా యొక్క క్రోధః = కోపము. ఔత్సర్గికః = సర్వసాధారణమైపోయినది - అందరిపట్లను కినుక వహించితి ననుట. తత్ = అది. సంప్రతి = ప్రస్తుతము. ఉపసర్జనమ్ = అప్రధానము, అయమ్ = ప్రస్తుతమున్న ఈ క్రోధము. గురు ధనుర్భంగాత్ = శివధనుర్భంగమువలన. హేతుమాన్=సహేతుకము. ఇప్పటి కోపమునకు శివధనుర్భంగమే కారణమనుట. (అధ్యాపయత్. భంగాదహం హేతుమాన్. భంగేతు హేతుమాన్ - అని పాఠాంతరములున్నవి.) శార్దూల విక్రీడితము.

సమాసములు :- హోమ సాధనికా చ సా అర్జునీ చ - తామ్. అనేకంచ తత్ రాజకం చ — రాజకస్య వధః - వధ ఏవ స్వాధ్యాయః - తమ్ గురోః ధనుః — ధనుషో భంగః - తస్మాత్. హేతురస్యాస్తీతి హేతుమాన్. (తత్ప్రయోజకో హేతుశ్చ) రాజసమూహో - రాజకమ్. (గోత్రోక్షోష్ట్రేత్యాదినా వుఞ్).

సంధులు :— జానాసి + ఏవ, యది + అపి. సంప్రతి + ఉప—యణాదేశ. హోమ + అర్జునీమ్. స్వ + అధ్యాయ, ఏవ + అస్తి - సవర్ణదీర్ఘ. అర్జునః + మత్— ఉత్వాదేశవిసర్గ. తేన + ఏవ - వృద్ధి. క్రోధః + అయమ్ - ఉత్వాదేశ — క్రోధో + అయమ్ - పూర్వరూప. ఔత్సర్గికః + తత్ - సాదేశవిసర్గ.

క్రియ :- జ్ఞా అవబోధనే(క్ర్యా) - జ్ఞాజనోర్జా - లట్, పరస్మై. మధ్యమ

జానాసి — జానీథః — జానీథ

ఇఙ్ అధ్యయనే. ణిచి. యుక్. క్రీఙ్జీనాంణౌ ఇత్యాత్వే. పుగాగమే ప్రథమ

అధ్యాపిపత్ - అధ్యాపిపతామ్ - అధ్యాపిపన్

ఋషేఇతి :— మహర్షీ! భార్గవా! ఇయమ్ = ఈ. పురాతనీ = అతి పురాతనమైన. కీర్తిపతాకా = యశోపతాకయైనట్టి. పటచ్చరీభూతా ఖలు = చిరిగిపోయిన

పతాకా, నన్విదానీమేవ ద్రష్టవ్యమ్. (నేపథ్యాభిముఖమ్) వత్స. లక్ష్మణ, ధనుర్ధనుః.

జామదగ్న్యః :- (సాక్షేపమ్) అరే అనాత్మజ్ఞ, క్షత్రియవటో.

తచ్చాపమీశభుజపీడనపీతసారం
ప్రాగప్యభజ్యత భవాంస్తు నిమిత్తమాత్రమ్।
రాజన్యకప్రధనసాధనమస్మదీయ
మాకర్ష కార్ముకమిదం గరుడధ్వజస్య॥ 55

---

గుడ్డ సుమా। (పటచ్చరం జీర్ణవస్త్రమ్ - అమరము). ఇదానీమ్ నీవ= ప్రస్తుతమే, నను ద్రష్టవ్యమ్ = చూడదగినది. (నేపథ్యాభిముఖమ్ = తెరవైపు చూచుచు). వత్స = నాయనా। లక్ష్మణా। ధనుః ధనుః = ధనుస్సు, ధనుస్సు - త్వరగా నందిమ్మనుటలో ద్విరుక్తి.

అరేఇతి :- (సాక్షేపమ్ = ఆక్షేపముగా) అరే = ఓరీ। అనాత్మజ్ఞ = స్వస్వరూప జ్ఞానము లేనివాడా। క్షత్రియవటో = క్షత్రియ బాలుడా।

తచ్చాపమితి :- ఈశ = పరమేశ్వరునియొక్క, భుజ = బాహువుచేనైన పీడన = వాడకమువలన [త్రిపురాసుర సంహారాదికమునందు వినియోగింపబడుటచేత] పీత = వ్యయముగావింపబడిన [త్రాగి వేయబడిన]. సారమ్ = బలము కలదియగు. తత్ = ఆ [నీవు విరిచినది] చాపమ్ = శివధనుస్సు. ప్రాగపి = అంతకుముందే [నీవు విరుచుటకు ముందే]. అభజ్యత = తనకు తానే దుల్లిపోయినది. భవాన్ తు = [అది విరుగుటలో] నీవేమో, నిమిత్త మాత్రమ్ = ఉపలక్షణ మాత్రుడవు. రాజన్యక = క్షుద్రులైన రాజులయొక్క, ప్రధన = మారణమునందు, సాధనమ్ = సాధనమైనదియు, అస్మదీయమ్ = నాదియునైన, గరుడధ్వజస్య = విష్ణుమూర్తియొక్క, ఇదమ్ = ఈ, కార్ముకమ్ = ధనుస్సును, ఆకర్ష = ఎక్కుపెట్టుము. [వసంత తిలక]

తాత్పర్యము :- శివ ధనుర్భంగమునకు నీవు కేవలము నిమిత్తమాత్రుడవు. శివుడు వాడుటచే అది ఏనాడో దుల్లిపోయినది. సకల క్షత్రియ సంహారమున నాకు సహాయపడిన ఈ విష్ణు ధనుస్సును ఎక్కుపెట్టుము చూతము।

అకృష్టేన పునరమునైవ ధనుషా కిలాస్మానభియోత్స్యసే. క్షత్రసత్త్రే దీక్షితానాం తు చిరస్య హోతాయం పరశురస్మాకమస్త్యేవ (ఇతి రామస్య హస్తే ధనురర్పయతి).

రామః :- (గృహీత్వా) భార్గవ, సమంతాదుద్ఘాతినీ భూమిరియమ్. తదేహి విమర్దక్షమం ప్రదేశాంతరమవతరావః.

---

సమాసములు :- ఈశస్య భుజః - భుజేన పీడనమ్ - పీడనాత్ పీతం సారమ్ యస్య తత్. రాజన్యకానాం ప్రథనమ్ - ప్రథనే సాధనమ్. గరుడః ధ్వజః యస్య సః - తస్య.

సంధులు :- తత్ + చాపమ్ - శ్చుత్వసంధి అపి + అభజ్యత - యణాదేశ. భవాన్ + తు - తాంస్తాన్సంధి.

క్రియ :- భంజో ఆమర్దనే. కర్మకర్త్తరి ఆత్మనే. లఙ్, ప్రథమ

అభజ్యత – అభజ్యేతామ్ – అభజ్యంత

కృష విలేఖనే. లోట్. పరస్మై. మధ్యమ

అకర్ష/అకర్షతాత్ – అకర్షతమ్ – అకర్షత

అకృష్టేనేతి :- అకృష్టేన = నీచే ఎక్కుపెట్టబడినదైనచో. పునః = అప్పుడు, అమునా = ఈ, ధనుషా ఏవ = ధనుస్సుతోనే, అస్మాన్ = మమ్ము. అభియోత్స్యసే కిల = ఢీకొందువుసుమీ ! - దీనితోనే నీవు యుద్ధము కొనసాగింపవలసి యుండుననుట. క్షత్రసత్త్రే = క్షత్రియ సంహారరూపమగు సత్త్రయాగమునందు (సత్త్ర యాగము దీర్ఘకాలికము). దీక్షితానామ్ = బద్ధకంకణులమైన, అస్మాకమ్ తు = మాకేమో, అయమ్ = ఈ, పరశుః = గండ్రగొడ్డలి, చిరస్య = చిరకాలమునుండియు, హోతా = ప్రధానఋత్విక్కు - క్షత్రసత్త్రమును నిర్వహింపజేయుచున్న ప్రధానసాధనము నాకు ఉండనేయున్నదనుట. (ఇతి = అని, రామస్య=దాశరథియొక్క. హస్తే= చేతియందు. ధనుః = తన వైష్ణవధనుస్సును. అర్పయతి = ఉంచును)

భార్గవేతి :- (గృహీత్వా=ధనుస్సును స్వీకరించి) భార్గవ=పరశురామా ! ఇయమ్ = ఈ, భూమిః = నేల, సమంతాత్ = అంతటను, ఉద్ఘాతినీ = ఎగుడు దిగు

జామదగ్న్యః :- (సరోషం పరిక్రామన్) భో భోః క్షాత్రేణ బ్రాహ్మేణ చ
తేజసా వికత్థమానాః, తదత్ర—

భవతు శరణదో వా శస్త్రసర్వాభిరామః
ప్రతివిదధతు వాస్మిన్నాశిషో వైజయిక్యః।
అదశరథమరామం నిర్విదేహేంద్రముర్వీ
వలయమిహ విధత్తే రోషణో రైణుకేయః॥ 56

---

దులుగా నున్నది, తత్=అందుచేత, ఏహి = రమ్ము. విమర్దక్షమమ్ = త్రొక్కిడిని
సైచుకొనగలిగిన – యుద్ధయోగ్యమైన అనుట. ప్రదేశాంతరమ్ = వేరొకచోటును,
అవతరావః = ప్రవేశింతము.

భోభో ఇతి :- (సరోషమ్ = రోషముతో. పరిక్రామన్ = తిరుగుచు)
భోభోః = ఓయోయీ! క్షాత్రేణ = క్షత్రియసంబంధమైన. తేజసా = తేజస్సుతోను.
బ్రాహ్మేణ=బ్రాహ్మణసంబంధమైన. తేజసా=తేజస్సుతోను. వికత్థమానాః = పొగడి
కొనుచున్న జనులారా! – జనక వసిష్ఠ విశ్వామిత్రానుయాయులారా! – అనుట.
తదత్ర = ఇప్పుడింక–

భవత్వితి :- శస్త్ర = శస్త్రములయొక్క, సర్వాభిసారః = సన్నాహము
(సర్వాభిసార స్సర్వౌఘస్సర్వ సన్నహనార్థకః – అమరము) – విశ్వామిత్రోపదిష్టము
లగు సర్వశస్త్రాస్త్ర సమూహమనుట, శరణదః = మీకు రక్షణము కల్పించునది.
భవతు=అగుగాక! వా = లేదా. వైజయిక్యః = విజయప్రయోజనములైన (తదస్య
ప్రయోజనమితి – ఠక్) ఆశిషః = (వసిష్ఠాదుల) ఆశీస్సులు. అస్మిన్ = ఈ యుద్ధము
నందు, ప్రతివిదధతు=(నా శస్త్రాస్త్రములకు) విఱుగుడు కల్పించుగాక. విఱుగుడు వేసిన
వేయుగాక! – అనియేని. రోషణః=అతికుపితుడైన (క్రుధమండార్థేభ్యశ్చ – యుచ్)
రైణుకేయః = ఈ రేణుకాసుతుడు, ఉర్వీవలయమ్=భూమండలమును. అదశరథమ్=
దశరథుడు లేనిదిగను. అరామమ్ = రామరహితముగను. నిర్విదేహేంద్రమ్ = జనక
విహీనముగను. ఇహ=ఇప్పుడు ఇచ్చట. విధత్తే=చేయుచున్నాడు. (మాలినీవృత్తము)

తాత్పర్యము :- విశ్వామిత్రోపదిష్టమగు శస్త్రాస్త్ర సమూహమంతయు
సన్నద్ధమై వచ్చి రామునికి రక్షణమే కల్పించునో! వసిష్ఠాదుల విజయాశీస్సులు నా

(ఇతి నిష్క్రాంతౌ)

(నేపథ్యే)

భో భోః పౌరజానపదాః. ప్రవర్త్యతాం మాంగళికమాతోద్యమ్. ప్రసజ్యతా మయమపి వైదేహీవివాహమహోత్సవో జామదగ్న్యవిజయోత్సవేన.

---

శస్త్రాస్త్రములకు విరుగుడే వేయునో ! ఇదిగో ఈ భార్గవరాముడు అతిక్రుద్ధుడై ఈ భూమండలమును రామదశరథ జనకవిహీనము గావించుచున్నాడు.

సమాసములు :- శస్త్రాణాం సర్వాభిసారః, న విద్యతే దశరథః యస్మిన్. న విద్యతే రామః యస్మిన్. విదేహానామింద్రః - నిర్గతః విదేహేంద్రః యస్మాత్. ఊర్వ్యాః వలయమ్. రేణుకాయా అపత్యం పుమాన్ - స్త్రీభ్యో ఢక్. శరణం దదాతీతి శరణదః — [శరణం గృహరక్షిత్రోః - అమరః]

సంధులు :- శరణదః + వా - ఉత్వాదేశవిసర్గ. అస్మిన్ + ఆశిషః — అనునాసికద్విత్వసంధి ఆశిషః + వైజయిక్యః - ఉత్వాదేశవిసర్గ. విదేహ + ఇంద్రమ్— గుణసంధి. రోషణః + రైణుకేయః — ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- భూ సత్తాయామ్. పరస్మై. లోట్. ప్రథమ

భవతు / భవతాత్ - భవతామ్ - భవన్తు

డు ధాఞ్ ధారణపోషణయోః. పరస్మై. లోట్. ప్రథమ [వి]

దధతు / ధత్తాత్ - ధత్తామ్ - దధన్తు

డుధాఞ్ ధారణపోషణయోః, ఆత్మనే. లట్. ప్రథమ

ధత్తే - దధాతే - దధతే

[ఇతి = అని. నిష్క్రాంతౌ = రామ పరశురాములు నిష్క్రమించిరి]

[నేపథ్యే = తెరలో]

భో భో ఇతి :- భో భోః = ఓయోయీ ! పౌరజానపదాః=పౌరులారా ! జానపదులారా ! మాంగళికమ్ = మంగళప్రదమైన [తస్మై ప్రభవతి సంతాపాదిభ్యః - మాంగళికమ్—ఠక్]. ఆతోద్యమ్ = చతుర్విధ వాద్యబృందము [చతుర్విధమిదం వాద్యం వాదిత్రాతోద్య నామకమ్ - అమరః - వీణామురజసంశకాంస్యవాద్యమ్]. ప్రవర్త్యతామ్ = ప్రయోగింపబడుగాక ! జామదగ్న్య విజయోత్సవేన = భార్గవరాముని జయించిన

కన్యా కాచిదిహాపి కర్మణి పణః స్యాదిత్యసూయావల
త్సీతాపాంగమయూఖమాంసలముఖజ్యోత్స్నావిలిప్తం దివమ్ ।
కుర్వాణేన రఘూద్వహేన చకృషే నారాయణీయం ధనుః
సంధాయాథ శరశ్చ భార్గవగతిచ్ఛేదాదమోఘీకృతః ॥ 57

---

విజయోత్సవముతో. అయమ్ = ఈ. వైదేహీ వివాహమహోత్సవః అపి = సీతాకల్యాణోత్సవముగూడ. ప్రసజ్యతామ్ = నిర్వహింపబడుగాక । విజయోత్సవము ప్రధానమైె కల్యాణోత్సవము అప్రధానమైన దనుట. (ఒకటి సాధించుటలో వేరొకటి సిద్ధించుట – ప్రసంగము, గుడిలోని దీపారాధనవల్ల బాటసారులకు దారి కనబడుట)

కన్యేతి :– ఇహ = ఈ. కర్మణి = వైష్ణవధనురారోపణమునందు గూడ, కాచిత్ కన్యా = ఒకానొక కన్య. పణః స్యాత్ ఇతి = పందెపుసొమ్ముగా లభించునని. అసూయా = ఈర్ష్యతో, వలత్ = కదలాడుచున్న. సీతా = జానకియొక్క. అపాంగ = నేత్రాంచలములందలి. మయూఖ = కాంతులతో. మాంసల = వృద్ధిపొందిన, ముఖజ్యోత్స్న = ముఖచంద్రకాంతితో. విలిప్తామ్ = పులుమబడినదానినిగా. దివమ్ = ఆకాశమును. కుర్వాణేన = చేయుచున్నవాడగు, రఘూద్వహేన = రఘురామునిచే. నారాయణీయమ్ = విష్ణుమూర్తికి సంబంధించిన, ధనుః = ధనుస్సు. చకృషే=ఎక్కుపెట్టబడినది. అథ చ = మరియు, శరః = బాణము, సంధాయ = సంధించి. భార్గవ = పరశురామునియొక్క. గతి = స్వర్గగమనమును. ఛేదాత్ = నిరోధించుటతో, అమోఘీకృతః = సఫలము గావింపబడినది–(బాణము కర్త) శార్దూలము.

తాత్పర్యము :– ఈ ధనురారోపణమువలన గూడ మరొక కన్య పణముగా లభించునేమో అని సీతాదేవి ఈర్ష్యతో చూచుచున్నది. ఆ చూపులకాంతితో రాముని ముఖచంద్రబింబము మరింత కాంతిమంతమై ఆకాశమున వెన్నెల పులిమినది. అట్లున్న రాఘవుడు వైష్ణవధనుస్సును ఎక్కుపెట్టుటే కాదు. భార్గవరాముని స్వర్గమార్గమును ఛేదించి బాణము నమోఘమని నిరూపించెను.

సమాసములు :– సీతాయాః అపాంగౌ – అపాంగయోః మయూఖాః – అసూయయా వలతః – వలతశ్చ తే సీతాపాంగమయూఖాః – మయూఖైః మాంసలా – మాంసలా చ సా ముఖజ్యోత్స్నా చ – జ్యోత్స్నయా విలిప్తామ్. (విలిప్త + క్తాదల్పాఖ్యాయామ్ – ఙీష్). భార్గవస్య గతిః – గతేః ఛేదః–తస్మాత్.

(తతః ప్రవిశతో రామజామదగ్న్యౌ)

రామః :- భగవన్, భార్గవ,

పరైరాహూతానాం విహితమపి శస్త్రం భవతు నః
ప్రకృత్యా విప్రేభ్యః పునరకృతశిల్పా రఘుభువః।
చిరాదండీరేణ త్వయి తదపి రామే న గణితం
తపోవిద్యావీరవ్రతమయ మయి క్షామ్యతు భవాన్ ॥ 58

---

సంధులు :- ఇహ + అపి. సీతా + అవ + అంగ. రఘు + ఉద్వాహేన. సంధాయ + అథ—సవర్ణదీర్ఘ. ఇతి + అసూయా—యణాదేశ. శరః + చ—శాదేశవిసర్గ. గతి + చేదాత్ — తుగాగమ.

క్రియ :- డు కృఞ్ కరణే. కర్మణి. లిట్. ఆత్మనే. ప్రథమ
చకృషే - చకృషాతే - చకృషిరే

(తతః=అంతట, రామజామదగ్న్యౌ=రామపరశురాములు. ప్రవిశతః=ప్రవేశింతురు)

పరైరితి ;- భగవన్ = మహాత్మా ! భార్గవ = పరశురామా ! పరైః = శత్రువులచే, ఆహూతానామ్ = యుద్ధమునకు ఆహ్వానింపబడినవారమైన (చో). నః = మాకు, శస్త్రమ్ = ఆయుధస్వీకారము, విహితమ్ = విధాయకము. అపి భవతు = అగుగాక. పునః = కానీ, ప్రకృత్యా = సహజముగా, రఘుభువః = రఘువంశసంభవులు. విప్రేభ్యః = బ్రాహ్మణులపై. అకృతశిల్పాః = యుద్ధవిద్యను చూపరు - వారిపై యుద్ధము చేయరనుట. తత్ అపి = ఆ నియమముగూడ. రామే త్వయి = పరశురాముడవైన నీయందు, చిరాత్ = చాలకాలమునకు, అండీరేణ = గర్విష్ఠుడనైన నాచేత. న గణితమ్ = పరిగణింపబడలేదు - ఇంతకాలమునకు నేను దాని నుల్లంఘించితిననుట. తపో విద్యావీరవ్రతమయ = ఓ తపోమయా ! ఓ విద్యామయా ! ఓ వీరవ్రతమయా ! మయి = నావిషయమునందు, భవాన్ = నీవు, క్షామ్యతు = క్షమింతువుగాక ! (శిఖరిణీ వృత్తము)

తాత్పర్యము :- శత్రువులు కయ్యమునకు కాలుదువ్వినచో శస్త్రమును గ్రహించుట మాకు పరిపాటి. విప్రులపై దండెత్తుట మా వంశమునందు లేదు. కానీ ఆ వ్రతమునుగూడ నీపట్ల నేనుల్లంఘించితిని. గర్విష్ఠుడనై అని నన్ను క్షమింపుము.

జామదగ్న్యః :- (విహస్య) కథమపరాద్ధ మస్మాసు వత్సేన
యదర్థమస్మాభి రిహ ప్రకోపిత స్తదద్య దృష్ట్వా తవ ధామ
వైష్ణవమ్।
విశీర్ణ సర్వామయమస్మదాంతరం చిరస్య కంచిల్లఘిమానమశ్నుతే॥59

---

విశేషములు :- అంతీరః — కాండాండాదీరన్నీరచౌ - ఈరచ్. అంతీరః పురుషః శక్తే - అని మేదినీ నిఘంటువు.

సంధులు :- పరైః + అహూతానామ్ - రేఫాదేశవిసర్గ. అకృతశిల్పాః + రఘు - విసర్గలోప. తపస్ + విద్యాః - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- భూ సత్తాయామ్. పరస్మై. లోట్. ప్రథమ
భవతు / భవతాత్ - భవతామ్ - భవన్తు
క్షమూ సహనే. లోట్. పరస్మై. ప్రథమ
క్షామ్యతు / క్షామ్యతాత్ - క్షామ్యతామ్ - క్షామ్యన్తు

కథమితి :- (విహస్య=నవ్వి) వత్సేన=చిరంజీవివైన నీచేత. అస్మాసు =మాపట్ల. కథమ్ అపరాద్ధమ్ = అపరాధము గావింపబడినదనుట యెట్లు! అపరాధ మేమియు లేదనుట.

యదర్థమితి :- యదర్థమ్=దేనికోసమై. అస్మాభిః = మాచేత. ఇహ = ఇచ్చట. ప్రకోపితః = కోపింపజేయబడితివో. తత్ = అ, తవ = నీయొక్క. వైష్ణవమ్ = విష్ణుసంబంధమైన, ధామ = తేజస్సును, అద్య = ఇప్పుడు. దృష్ట్వా=దర్శించి. అస్మత్ = మాయొక్క. అంతరమ్ = అంతరంగము (అస్మదంతరమ్ - అనియు పాఠాంతరము). విశీర్ణ = సడలిపోయిన. సర్వామయమ్ = సమస్తరోగములు కలదై (రాగద్వేషాదికము సడలిపోయి అనుట), చిరస్య = చాలకాలమునకు, కంచిత్ = కొద్ది పాటి, లఘిమానమ్ = తేలికపాటును. అశ్నుతే = పొందుచున్నది. ఇది ఉపకారమే అనుట. (గర్వామయమ్ అని పాఠాంతరము. గర్వమనునట్టి రోగమని అర్థము).

తాత్పర్యము :- రామా! నీలోని యే వైష్ణవతేజస్సును దర్శింపగోరి నిన్ను కోపింపజేసితినో ఆ ప్రయోజనము నెరవేరినది. హృదయము తేలికపడినది. రాగద్వేషాదులు తొలగిపోయినవి.

రామః :- ఇత ఇతో భగవన్

జామదగ్న్యః :- (రామస్య చిబుకమున్నమయ్య సస్మితమ్) వత్స. అప్రశస్తః ఖలు ఆరణ్యకానాం జనపదేషు చిరప్రచారః. తత్క్వ పునరస్మాన్నేష్యసి.

రామః :- భగవన్. భగవతో యాజ్ఞవల్క్యస్యావసథే కృతాతిథేయ సంవిధానౌ తాతజనకౌ భవంతమనుపాలయతః.

---

సమాసములు :- యస్మై (అర్థమ్) - యదర్థమ్. సర్వశ్చాసౌ ఆమయశ్చ - విశేష్య సర్వామయః యస్మిన్ తత్. మమ అంతరమ్.

సంధులు :- అస్మాభిః + ఇహ - రేఫాదేశవిసర్గ. ప్రకోపితః + తత్ - సాదేశవిసర్గ. సర్వ + ఆమయమ్ - సవర్ణదీర్ఘ. కించిత్ + లభిమానమ్ - లాదేశసంధి.

క్రియ :- అశూఙ్ వ్యాప్తౌ సంఘాతే చ. లట్. ఆత్మనే. ప్రథమ

అశ్నుతే - అశ్నువాతే - అశ్నువతే

ఛందస్సు :- వంశస్థవిలము. వదన్తి వంశస్థవిలం జతౌ జరౌ (జతజర)

| జ | త | జ | ర |
|---|---|---|---|
| I U I | U U I | I U I | U I U |
| చిరస్య | కించిల్ల | భిమాన | మశ్నుతే |

ఇతఇతి :- భగవన్ = మహాత్మా ! ఇతః ఇతః = ఇటు-ఇటు దయచేయుడు

వత్సేతి :- (రామస్య = రాముని యొక్క. చిబుకమ్ = గడ్డమును. (అధస్తాచ్చిబుకం - అమరః) ఉన్నమయ్య = పైకెత్తి. సస్మితమ్ = చిరునవ్వుతో) వత్స = నాయనా ! ఆరణ్యకానామ్ = నావంటి వనవాసులకు. జనపదేషు = గ్రామనగరాదులయందు. చిరప్రచారః = బహుకాలసంచారము. అప్రశస్తః ఖలు = తగనిదికదా !-నిషిద్ధమనుట. తత్ = అందుచేత. అస్మాన్ = మమ్ము. క్వనేష్యసి = ఎటకుకొనిపోదువు ? (పునః అనునది వాక్యాలంకారము కొరకు)

భగవన్నితి :- భగవన్ = మహాత్మా !. భగవతః = మహానుభావుడైన. యాజ్ఞవల్క్యస్య = యాజ్ఞవల్క్యుని యొక్క. ఆవసథే = ఆశ్రమమునందు. కృతాతి

ఏహి విష్టరపాదార్ఘ్యమధుపర్కైరుపస్థితాన్
ఇక్ష్వాకూంశ్చ విదేహాంశ్చ పునీహి భగవన్నమూన్ ॥ 60

జామదగ్న్యః:- వత్స, అపరిహార్యమేవ హ్యాతిథ్యం రాజన్యశ్రోత్రియాణామ్. కిం పునరేవంవిధ వైఖానసోచితాచార స్ఖలితవిలక్షో న శక్నోమి ధర్మాచార్యం యాజ్ఞవల్క్యముపేత్యావలోకితుమ్. ఆచారస్తు దూరాదపి కృతః కృతః స్యాత్ (కించిదుచ్చైర్నేపథ్యాభిముఖమ్)

---

ధేయ సంవిధానౌ = సన్నద్ధము గావింపబడిన అతిథ్యసంభారము కలవారై, తాతజనకౌ = దశరథ జనకమహారాజులు. భవంతమ్ = నిన్ను. అనుపాలయతః = ప్రతీక్షించుచున్నారు- అర్ఘ్యపాద్యాదులతో సిద్ధముగా నున్నారనుట.

ఏహీతి :- విష్టర = ఆసనము, పాదార్ఘ్య = పాదోదకము, మధుపర్కైః = మధుపర్కము - అను వీనితో. ఉపస్థితాన్ = సిద్ధముగానున్న. అమూన్ = ఈ. ఇక్ష్వాకూన్ = ఇక్ష్వాకువంశస్థులను విదేహాన్ + చ = విదేహాన్వయులను. పునీహి = పవిత్రులను చేయుము. (పథ్యావక్త్రము).

తాత్పర్యము :- అనర్ఘ్యపాద్యమధుపర్కాదులతో సిద్ధమై ఎదురుచూచుచున్న దశరథ జనకమహారాజులను వారి వంశములను పావనమొనరింపుము.

సంధులు :- పాద + అర్ఘ్య - సవర్ణదీర్ఘ. మధుపర్కైః + ఉప - రేఫాదేశవిసర్గ. ఇక్ష్వాకూన్ + చ. విదేహాన్ + చ - శాంస్తోన్సంధి. భగవన్ + అమూన్ - అనునాసికద్విత్వ. విష్టరశ్చ పాదార్ఘ్యశ్చ మధుపర్కాశ్చ — తైః.

క్రియ :- ఇణ్ గతౌ. పరస్మై. లోట్. మధ్యమ

ఏహి/ఇతాత్ - ఇతమ్ — ఇత

పూఞ్ పవనే. లోట్. పరస్మై. మధ్యమ (శ్నా)

పునీహి/పునీతాత్ - పునీతమ్ - పునీత.

వత్సేతి :- వత్స = నాయనా! రాజన్య శ్రోత్రియాణామ్ = క్షత్రియులలో శ్రోత్రియులైన దశరథ జనకమహారాజులయొక్క, ఆతిథ్యమ్ = అతిథిసత్కారము, అపరిహార్యమ్ ఏవ = పరిహరింపరానిదే, కింపునః = కానీ. ఏవంవిధ = ఈ

యస్య స్మృతీః ప్రతీక్షన్తే చతుర్వర్గే మనీషిణః ।
నమో భగవతే తస్మై యాజ్ఞవల్క్యాయ యోగినే ॥ 61

(నేపథ్యే)

గాయత్రీ ద్రుపదా దేవీ పాప్మానమపహన్తు తే
పునన్తు పావమాన్యస్త్వామృధ్నోతు బ్రహ్మ తే పరమ్ ॥ 62

---

విధముగా. వైఖానసోచితాచారస్ఖలిత విలక్షః_వైఖానస = అరణ్యకులకు.(వానప్రస్థులు) ఉచిత = అర్హమైన. ఆచార = సంప్రదాయమును _ శాంతప్రవృత్తి యనుట స్ఖలిత = విడుచుటతో, విలక్షః = లజ్జితుడనైన నేను. ధర్మాచార్యమ్ = ధర్మాచార్యుడగు. యాజ్ఞవల్క్యమ్ = యాజ్ఞవల్క్యమహర్షిని. ఉపేత్య = సమీపించి. అవలోకితుమ్ = చూచుటకు, న శక్నోమి = చాలకున్నాను. ముఖము చెల్లకున్నదనుట. ఆచారః = వందనాదికమగు మర్యాద. దూరాత్ కృతః అపి = దూరమునుండి చేయబడినదైనప్పటికిని, కృతః స్యాత్ = చేయబడినదే అగును _ దూరమునుండి నమస్కరించినను నమస్కరించినట్లే అనుట. ఇచ్చట నుండియే దశరథజనకుల ఆతిథ్యమును స్వీకరించుటయైనదనుట. (నేపథ్యాభిముఖమ్ = తెరవైపు తిరిగి. కించిత్ ఉచ్చైః = కొంచెము బిగ్గరగా)

యస్యేతి :- మనీషిణః = పండితులు. చతుర్వర్గే = ధర్మార్థకామమోక్షములనునట్టి నాలుగు పురుషార్థముల విషయమునను (త్రివర్గో ధర్మకామార్థైశ్చతుర్వర్గః సమోక్షకైః_అమరము). యస్య = ఎవనియొక్క. స్మృతీః = స్మృతివాక్యములను (సూత్రములను), ప్రతీక్షన్తే = ప్రమాణములుగా స్వీకరించుచున్నారో. తస్మై = ఆ యోగినే=యోగియైన. భగవతే = మహానుభావుడు. యాజ్ఞవల్క్యాయ=యాజ్ఞవల్క్యునికి. నమః = వందనము. (పథ్యావక్త్రము) ఈక్షతే_ఈక్షేతే_ఈక్షన్తే.

తాత్పర్యము :- చతుర్విధ పురుషార్థములలో దేనిపట్ల ఏట్టి సంశయము కలిగినను పండితులందరు ఏ యాజ్ఞవల్క్యస్మృతిని నిర్ధారితముగా ప్రతీక్షింతురో ఆ మహానుభావునికి నమస్కారము.

(నేపథ్యే = తెరలో)

గాయత్రీతి :- ద్రుపదా = ద్రుపదాదివ ముముచానః _ ఇత్యాది మంత్రాక్షరములతో కూడిన, గాయత్రీ దేవీ = సావిత్రీదేవి (గాయత్రీ మంత్రాధిదేవత). తే =

జామదగ్న్యః :- భగవన్. అపత్రపమాణో న భవంతం ద్రష్టుముత్సహే.
తదనుమన్యస్వ మామరణ్యాయ.

(నేపథ్యే)

శివాస్తే పంథానో వ్రజ నిజగృహేభ్యో నిజగృహాన్
కిమన్యత్సర్వేషాం గుణమయ। శిరోమాల్యమసి నః।

---

నీయొక్క. పాప్మానమ్ = పాపమును. అపహన్తు = తొలగించుగాక।. పావమాన్యః = పవిత్రతను చేకూర్చునట్టి ఋగ్వేదమంత్రవిశేషములు, త్వామ్ = నిన్ను. పునన్తు = పావనముచేయుగాక। తే = నీయొక్క. పరమ్ = శ్రేష్ఠమైన. బ్రహ్మ = జ్ఞానము - తత్త్వజ్ఞానమనుట, ఋధ్నోతు = వృద్ధిపొందునుగాక। (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- గాయత్రీమాత నీ పాపములను తొలగించుగాక। ఋగ్వేద మంత్ర విశేషములు నిన్ను పావనము చేయుగాక। నీ బ్రహ్మజ్ఞానము వృద్ధిపొందుగాక।

క్రియ :- హనహింసాగత్యోః. పరస్మై. లోట్. ప్రథమ
హన్తు/హతాత్ - హతామ్ - ఘ్నన్తు
పూఞ్ పవనే (క్ర్యా) లోట్, పరస్మై. ప్రథమ
పునాతు/పునీతాత్ - పునీతామ్ - పునన్తు
ఋధు వృద్ధౌ [శ్న] లోట్, పరస్మై. ప్రథమ
ఋధ్నోతు/ఋధ్నుతాత్ - ఋధ్నుతామ్ - ఋధ్నువన్తు

భగవన్నితి :- భగవన్ = మహాత్మా। అపత్రపమాణః = సిగ్గుపడుచున్న నేను, భవంతమ్ = నిన్ను, ద్రష్టుమ్ = దర్శించుటకు. న ఉత్సహే = ఉత్సాహపడను, తత్ = అందుచేత. మామ్ = నన్ను. అరణ్యాయ = వనవాసమునకై. అనుమన్యస్వ = అనుమతింపుము. [లజ్జా సాపత్రపాన్యతః - అమరము]

[నేపథ్యే = తెరలో]

శివా ఇతి :- తే = నీయొక్క. పంథానః = పయనించు మార్గములు, శివాః = శుభప్రదములగుగాక। నిజగృహేభ్యః = మా నివాసస్థానములనుండి [లేక జనపదముల నుండి అనుట]. నిజగృహాన్ = నీ ఆశ్రమములను. వ్రజ = పొందుము [పొమ్ము

త్రిలోకీ నిర్మాణ స్థితి నిధనబంధోర్మధుభిదో
భవాన్షష్ఠీ మూర్తిర్భృగు కులమధిష్ఠాయ రమతే ॥ 63

---

నుట] అన్యత్ కిమ్ = మరియొకటేమున్నది ! - మరింక కోరదగినదేమున్నదనుట. గుణమయ = సద్గుణస్వరూపా ! [సాకారా ! అనుట]. నః = మా. సర్వేషామ్ = అందరికిని. శిరోమాల్యమ్ = శిరసుపూవవు, అసి = అయితివి. [పుష్ప పుష్ప్రస్రజో ర్మాల్యమ్ - అమరము]. త్రిలోకీ = ముల్లోకములయొక్క. నిర్మాణ=సృష్టికి. స్థితి = ఉనికికి. నిధన = వినాశనమునకును, బంధోః = కర్తయయిన. మధుభిదః = మధుసూదనునియొక్క. షష్ఠీ = ఆరవదైన. మూర్తిః = అవతారమవై. భవాన్ = నీవు, భృగు కులమ్ = భృగువంశమును. అధిష్ఠాయ = అధిష్ఠించి. రమతే = క్రీడించుచున్నావు. [శిఖరిణీ వృత్తము]

తాత్పర్యము :- ఓ పరశురామా ! నీ పయనించుమార్గములు శుభప్రదము లగుగాక ! మా గృహములనుండి నీ ఆశ్రమములకు పయనింపుము. మా అందరికిని శిరోభూషణమైతివి. ఇక కోరదగినదేమున్నది ! ఓ గుణమయా ! సృష్టిస్థితిలయకారణమైన విష్ణుమూర్తికి నీవు ఆరవ అవతారమవు. భృగువంశమున పుట్టి వినోదించుచున్నావు. (మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథ వామనః. రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కీ చ తే దశ)

సమాసములు :- శిరసి మాల్యమ్. త్రయాణాం లోకానాం సమాహారః. నిర్మాణం చ స్థితిశ్చ నిధనం చ - త్రిలోక్యాః సృష్టిస్థితినిధనాని - నిధనానాం బంధుః - తస్య. మధుం భేత్తీతి - మధుభిద్ - తస్య. భృగోః కులమ్.

సంధులు :- శివాః + తే - సాదేశవిసర్గ. పంథానః + ప్రజ. గృహేభ్యః + నిజ. శిరః + మాల్యమ్. ఇదః + భవాన్ - ఉత్వాదేశవిసర్గ. బంధోః + మధు. మూర్తిః + భృగు - రేఫాదేశవిసర్గ.

క్రియ :- 1. వ్రజ గతౌ. లోట్. పరస్మై. మధ్యమ

వ్రజ/వ్రజతాత్ - వ్రజతమ్ - వ్రజత.

2. రముఙ్ క్రీడాయామ్. ఆత్మనే. లట్. ప్రథమ

రమతే - రమేతే - రమన్తే

జామదగ్న్యః :- వత్స. రామభద్ర ।
రామః :- ఆజ్ఞాపయ.
జామదగ్న్యః:- నివర్తస్వ. నూనమిదానీం కృతకౌతుకాగారమంగళోపచారః శ్వశురకులలోక స్త్వాం ప్రతీక్షతే. (ఇతి పరిష్వజ్య నిష్క్రాంతః).
రామః :- (సోద్వేగమ్) కథం గతో భగవాన్. త దహమపి తాతసమీప మేవ గచ్ఛామి.(ఇతి పరిక్రామన్ పురోఽవలోక్య) కథం తాతశ్చ జనకశ్చేత ఏవాభివర్తేతే. (ఇత్యుపసర్పతి).
(తతః ప్రవిశతో జనక దశరథౌ రాజానావన్యోన్యం పరిష్వజ్య)

---

3. అస భువి. లట్. పరస్మై. మధ్యమ
అసి - స్థః - స్థ

వత్సేతి :- వత్స = నాయనా ! రామభద్ర = రామభద్రుడా !

ఆజ్ఞాపయేతి :- ఆజ్ఞాపయ = ఆజ్ఞాపింపుము.

నివర్తస్వేతి :- నివర్తస్వ = ఇక మరలుము—నీవుండుమనుట. నూనమ్ ఇదానీమ్ = నిజమునకిప్పుడు, శ్వశురకులలోకః = నీ అత్తవారింటి బంధుసమూహము కృతకౌతుకాగార మంగళోపచారః = పెండ్లియింట మంగళాలంకారములనుచేసి, (కౌతుకం తు వివాహే స్యాదుత్సవే నర్మహర్షయోః_మేదినీ). త్వామ్ = నిన్ను. ప్రతీక్షతే= ఎదురుచూచుచుండును, (ఇతి = అని, పరిష్వజ్య = కౌగిలించుకొని. నిష్క్రాంతః = నిష్క్రమించును).

కథమితి :- (సోద్వేగమ్ = ఆరాటపడుచు) కథమ్ = ఎట్లూ ! భగవాన్ = పరశురాముడు, గతః = వెడలిపోయెను। తత్ = అందుచేత, అహమ్ అపి = నేనును, తాతసమీపమ్ ఏవ = తండ్రియొద్దకే, గచ్ఛామి = పోదును. (ఇతి = అని, పరిక్రామన్= నడచుచు, పురః అవలోక్య = ముందునకుచూచి) కథమ్ = ఎట్లూ ! తాతః చ = తండ్రి దశరథుడును, జనకః చ = జనకుడును, ఇతః ఏవ = ఇటువైపే, అభివర్తేతే = వచ్చుచున్నారు ! (ఇతి = అని, ఉపసర్పతి = సమీపించును). (తతః = అంతట, ప్రవిశతః= ప్రవేశించుచు, జనకదశరథౌ రాజానౌ = జనక దశరథ మహారాజులు, అన్యోన్యమ్ = పరస్పరమును, పరిష్వజ్య = కౌగిలించుకొని)

జనకః- సుచరితమిదమైతిహాసికానాం హృది న విరంస్యతి యత్తవైష పుత్రః।
భృగుసుతపరశూదరాద్విరాజం సహజవిజిత్వరమాచకర్ష తేజః॥ 64

---

సుచరితమితి :- తవ = నీ యొక్క. ఏషః = ఈ. పుత్రః = కుమారుడు - రాముడు, భృగుసుత = పరశురామునియొక్క, పరశూదరాత్ = పరశుగర్భము నుండి, విరాజమ్ = క్షత్రియులయొక్క, సహజవిజిత్వరమ్ = సహజముగా విజయశీలమైన. తేజః = తేజస్సును. యత్ ఆచకర్ష = ఆకర్షించెనన్నట్టి. ఇదమ్ = ఈ. సుచరితమ్ = ఘనకార్యము. ఐతిహాసికానామ్ = ఇతిహాసవేత్తలయొక్క. హృది = హృదయమునందు, న విరంస్యతి = మాసిపోదు—స్థిరముగా నిల్చునుట. (రాజాజః క్షత్రియో విరాట్—అమరము).

తాత్పర్యము :- ఓ దశరథా! జయశీలమగు క్షాత్ర తేజస్సును పరశురాముని అనువగర్భమునుండి ఆకర్షించిన నీ కుమారుని ఈ ఘన పవిత్ర ఐతిహాసికుల హృదయములలో స్థిరముగా నిల్చిపోవును సుమా!

సమాసములు :- భృగోః సుతః - సుతస్య పరశుః - పరశోః ఉదరాత్ సహజతయా విజిత్వరమ్ (ఇణ్నశజిసర్తిభ్యః క్వరప్ - జిత్వరమ్)

సంధులు :- ఏషః + పుత్రః - ఏతత్తదోస్సులోపః తవ + ఏషః - వృద్ధి సంధి. పరశు + ఉదరాత్ - సవర్ణదీర్ఘ.

క్రియ :- రముఙ్ క్రీడాయామ్ (వ్యాఙ్పరిభ్యో రమః) పరస్మై. లృట్. ప్రథమ

విరంస్యతి - విరంస్యతః - విరంస్యన్తి
కృష విలేఖనే. పరస్మై. లిట్. ప్రథమ
చకర్ష - చకృషతుః - చకృషుః

ఛందస్సు :- పుష్పితాగ్రము. అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా. ఒకటి మూడు పాదములలో ననరయ అను గణములును: రెండు నాలుగు పాదములలో నజజరగ - అను గణములు నుండును.

దశరథః :- (పురోఽవలోక్య సహర్షమ్) కథమాగత ఏవ వత్సో రామభద్రః

జనకః— సఖే మహారాజ దశరథ, పశ్య పశ్య —

చిరాత్ క్షాత్త్రం తేజస్త్రిజగదవజైత్రం జనయితా
విధాతా సర్వేషాముపరి సవితారం కులభృతామ్ ।
వినేతా వర్ణానాం భృగుపతి భుజాదర్ప నికషో
మహావీరః శ్రీమానయమమృతమక్ష్ణోర్వికిరతి ॥ 65

---

కథమితి :- (పురః అవలోక్య = ముందునకు చూచి, సహర్షమ్ = ఆనందముతో) కథమ్ = ఎట్లా ! వత్సః రామభద్రః = నా చిన్నారి రాముడు, ఆగతః ఏవ = రానే వచ్చెను ।

సఖేఇతి :- సఖే = మిత్రమా !, మహారాజా ! దశరథా ! పశ్య పశ్య = చూడుము చూడుము —

చిరాదితి :- చిరాత్ = చాల కాలమునకు క్షాత్త్రమ్ తేజః = క్షత్రియ బలమును, త్రిజగదవజైత్రమ్ = ముల్లోకములు జయించునదిగా, జనయితా = చేసినవాడును, కులభృతామ్ = వంశకారకులైన, సర్వేషామ్ = చంద్రాదులందరికిని, ఉపరి = అగ్రభాగమునందు, సవితారమ్ = సూర్యుని, విధాతా = నిల్పినవాడును — చంద్రవంశమునకంటె సూర్యవంశమును గొప్పదిగా నిలబెట్టెననుట వర్ణానామ్ = బ్రాహ్మణాది చతుర్వర్ణములకును, వినేతా = సత్ప్రవర్తన (వినయము) నేర్పినవాడును, భృగుపతి = పరశురామునియొక్క, భుజాదర్ప = బాహుగర్వమునకు, నికషః = పరీక్షకుడును, (నికషః కష పట్టికా, శాణస్తు నికషః కషః — అమరము), మహావీరః = గొప్పవీరుడును, శ్రీమాన్ = పుణ్యప్రదములైన లక్షణములు కలవాడును అయిన, అయమ్ = ఈ రాముడు, అక్ష్ణోః = నేత్రములకు, అమృతమ్ = సుధను, వికిరతి = చల్లుచున్నాడు. (శిఖరిణీ వృత్తము).

తాత్పర్యము :- క్షాత్ర తేజస్సునకు చాలకాలము తరువాత మెనుకటి ప్రతిష్ఠను చేకూర్చినవాడును, సూర్యవంశమును సర్వోన్నతముగా నిల్పినవాడును, వర్ణాశ్రమ ధర్మములను లోకమునకు నేర్పినవాడును, పరశురాముని బాహుబలమును పరీక్షించినవాడును, మహావీరుడునైన శ్రీరాముడు నా కన్నులకు అమృతము పంచుచున్నాడు.

దశరథః :- (నిర్వర్ణ్య, సస్నేహమ్) సఖే సీరధ్వజ, రఘురాజ ధర్మాధికార సర్వధురీణః శిశురపి వత్సోఽయమ్. తదస్మిన్ జరసా దుర్వహం వర్ణాశ్రమ భారమారోప్య వయమపి క్వాపి తపోవనే దిలీపకులోచితేన విధినా శేషమాయురుపబుభుక్షామహే.

జనకః :- సఖే దశరథ, సాధు తే హృదయమీదృశమ్. క్రమాదేతదనుష్ఠాతవ్యమ్.

రామః :- (ఉపసృత్య) తాతౌ, అభివాదయే.

---

సంధులు :- తేజః + త్రి - సాదేశవిసర్గ. నికషః + మహః – ఉత్వాదేశ విసర్గ. అక్ష్ణోః + వికిరతి – రేఫాదేశవిసర్గ.

క్రియ :- కౄ విక్షేపే, పరస్మై. లట్. ప్రథమ (వి)

కిరతి – కిరతః – కిరన్తి

సఖేఇతి :- (నిర్వర్ణ్య = చూచి, సస్నేహమ్ = మైత్రితో) సఖే = మిత్రమా ! సీరధ్వజ = జనకా ! అయమ్ = ఈ. వత్సః = రాముడు, శిశుః అపి = చిన్నవాడే అయినను, రఘురాజ = రఘు వంశ్యులయొక్క. ధర్మాధికార = ధర్మనిర్వహణాధికారమునకు సంబంధించిన, సర్వధురీణః = సర్వభారమును వహింపగలవాడు. తత్ = అందుచేత. జరసా = వార్ధకము కారణముగా, దుర్వహామ్ = వహింపగానిదగుచున్న, వర్ణాశ్రమభారమ్ = వర్ణాశ్రమ సంరక్షణ భారమును, అస్మిన్ = ఈరామునియందు. ఆరోప్య = ఆరోపించి, వయమ్ అపి = మనము కూడ (పరశురామునివలె) క్వాపి = ఎచటనో, తపోవనే = ఒకానొక తపోవనమునందు, దిలీపకులోచితేన = దిలీపుని వంశమునకు తగినదైన. విధినా = పద్ధతితో (వార్ధకే మునివృత్తీనామ్ - అన్నట్లు) శేషమ్ ఆయుః = శేషజీవితమును, ఉపబుభుక్షామహే = అనుభవింతము – గడుపుదమనుట.

దశరథేతి :- సఖే = మిత్రమా ! దశరథా ! తే = నీ యొక్క. హృదయమ్ = కోరిక, ఈదృశమ్ = ఇట్లుండుట, సాధు = బాగున్నది–సముచితమే అనుట. ఏతత్ = ఇది, క్రమాత్ = క్రమముగా, అనుష్ఠాతవ్యమ్ = అనుష్ఠింపదగినది.

తాతావితి :- (ఉపసృత్య = సమీపించి) తాతౌ = పెద్దలారా ! అభివాదయే = నమస్కరించుచున్నాను.

జనకః :- ఏహ్యేహి వత్స రామభద్ర. (ఇతి సహర్షమాలింగతి).

దశరథః - (రామమాలింగ్య) సఖే జనక. రామభద్రమభిషేక్తుం జామదగ్న్య విజయప్రీతి రేవ శ్రేయానవసరః. కాలక్షేపే పునః కో హేతుః ।

(ప్రవిశ్య)

లక్ష్మణః :- ఇయమార్యయా మంథరయోపనీతా మధ్యమాంబాయాః పత్రీ.
(రాజానౌ సవితర్కమన్యోన్యం పశ్యతః)

రామః :- (సహర్షమ్) వత్స లక్ష్మణ. అపి సపరివారాయాః కుశల మంబాయాః కథయత్యార్యా మంథరా?

---

ఏహీతి :- వత్స = నాయనా । రామభద్రా । ఏహి ఏహి = రమ్ము రమ్ము. ఇతి = అని, సహర్షమ్ = సంతోషముతో, ఆలింగతి = కౌగిలించుకొనును).

జనకేతి :- (రామమ్ = రాముని, ఆలింగ్య = కౌగిలించుకొని) సఖే = మిత్రమా । జనకా । రామభద్రమ్ = రామచంద్రుని. అభిషేక్తుమ్ = పట్టాభిషిక్తుని జేయుటకు, జామదగ్న్య విజయప్రీతిః ఏవ = పరశురాముని జయించెనన్న సంతోషమే శ్రేయాన్ = శ్రేష్ఠమైన, అవసరః = సమయము. కాలక్షేపే = కాలయాపనచేయుట యందు. పట్టాభిషేకమును వాయిదావేయుటకు-కః హేతుః = హేతువేమి । కాలయాపన జేయ బనిలేదనుట ఇది భావి కథా సూచన.

(ఇట్టి దానిని ఛలోక్తి యందురు — వాక్యం వాక్యాంతరాసక్త మర్థాంతరదిశ్య సూచనం యత్ర సా స్యాచ్ఛలోక్తిస్తు నాట్యాలంకారసమ్మతా - భరతుడు).

( ప్రవిశ్య = ప్రవేశించి )

ఇయమితి :- ఇయమ్=ఇది, ఆర్యయా = ఆర్యురాలైన, మంథరయా = మంథరచే, ఉపనీతా = తీసికొనిరాబడిన, మధ్యమాంబాయాః పత్రీ = కైకేయి లేఖ. (రాజానౌ = జనకదశరథులు, సవితర్కమ్ = సాలోచనగా, అన్యోన్యం పశ్యతః = ఒండొరులను చూచుకొందురు)

వత్సేతి :- వత్సా । లక్ష్మణా । సపరివారాయాః = పరివారముతోసహా, అంబాయాః = తల్లిగారియొక్క (కైకేయి), కుశలమ్ = క్షేమవార్తను, ఆర్యా మంథరా = ఆర్యురాలైన మంథర, అపి కథయతి = చెప్పుచున్నదా ।

లక్ష్మణః :- ఆర్య. అథకిమ్.

రామః :- నూనమస్మత్ప్రవాస దౌర్మనస్యమంబాం పీడయిష్యతి.

జనకః :- (లక్ష్మణహస్తా త్పత్త్రికాం గృహీత్వా వాచయతి) స్వస్తి.
మహారాజం దశరథం కైకేయీ విజ్ఞాపయతి. యథా —

తస్మై వరద్వయమురీకృతపూర్వ మేవ
యాచే బిభర్తు భరత స్తవ రాజ్యలక్ష్మీమ్।
వర్షాణి తిష్ఠతు చతుర్దశ దండకాయాం
సౌమిత్రి మైథిలసుతా సహితశ్చ రామః ॥ 66

---

ఆర్యేతి :- ఆర్య = అగ్రజా ! అథకిమ్ = అవును.

నూనమితి :- నూనమ్ = నిజమే. అస్మత్ = మనయొక్క. ప్రవాస = ఎడబాటువల్లనైన. దౌర్మనస్యమ్ = దిగులు. అంబామ్ = అమ్మను. పీడయిష్యతి = బ్రతుంగపీడును. (వివాహ నిమిత్తముగా దూరదేశమునకు వచ్చుట. ఈ వాక్యమునందలి భావికథా సూచన స్పష్టము).

స్వస్తీతి :- (లక్ష్మణహస్తాత్ = సౌమిత్రి చేతినుండి. పత్త్రికామ్ = లేఖను. గృహీత్వా = స్వీకరించి. వాచయతి = పఠించును) స్వస్తి = శుభము. మహారాజమ్ = మహారాజగు. దశరథమ్ = దశరథుని. కైకేయీ = కైకేయి. విజ్ఞాపయతి = విన్నవించుచున్నది. యథా = ఎట్లనగా —

తస్మై :- మే = నాకై. ఉరీకృత పూర్వమ్ = ఇంతకుముందే అంగీకరించిన. తత్ = ఆ. వరద్వయమ్ ఏవ = రెండు వరములనే. యాచే = అడుగుచున్నాను. తవ = నీ యొక్క. రాజ్యలక్ష్మీమ్ = రాజ్యసంపదను. భరతః = భరతుడు. బిభర్తు = వహించుగాక!. చతుర్దశ = పదునాల్గు. వర్షాణి = సంవత్సరములు. దండకాయామ్ = దండకారణ్యమునందు. రామః=రాముడు. సౌమిత్రిమైథిలసుతాసహితః = లక్ష్మణునితో సీతతో. తిష్ఠతు = నివసించుగాక ! (వసంత తిలక)

( ఇతి రాజానౌ మూర్ఛితః )

రామః :— యదాదిశ్యత్యంబా. (ఇతి శిరసి పత్త్రికాం దత్త్వా) వత్స. లక్ష్మణ నిజామస్మదారాధన సహాధ్యాయినీం ప్రజావతీమాదాయ పురోభవ

లక్ష్మణః :- తథా. (ఇతి నిష్క్రాంతః)

---

తాత్పర్యము :- దశరథ మహారాజా ! ఎప్పుడో నీవు నా కిచ్చిన రెండు వరములను ఇప్పుడు అడుగుచున్నాను. భరతుడు నీ రాజ్యలక్ష్మిని వహించుగాక ! సీతతో సౌమిత్రితో రాముడు పదునాలుగేండ్లు దండకారణ్యమునందు నివసించుగాక !

సమాసములు :- వరయోః ద్వయమ్. పూర్వమ్ ఉరీకృతమ్. రాజ్యస్య లక్ష్మీః — తామ్. చతురధికో దశ. సౌమిత్రిశ్చ (మైథిలస్య సుతా) మైథిల సుతా చ — తయోః సహితః.

సంధులు :- తత్ + మే - అనునాసికాదేశ. భరతః + శిప - సాదేశ విసర్గ. సహితః + చ — శాదేశవిసర్గ.

క్రియ :- భృఞ్ భరణే. లోట్. పరస్మై. ప్రథమ.

బిభర్తు/బిభృతాత్ - బిభృతామ్ - బిభ్రతు

ష్ఠా గతి నివృత్తౌ. పరస్మై. లోట్. ప్రథమ

తిష్ఠతు/తిష్ఠతాత్ - తిష్ఠతామ్ - తిష్ఠన్తు

(ఇతి = అని పఠించుటతో, రాజానౌ = రాజులిరువురును, మూర్ఛితః=మూర్ఛపోదురు)

యదితి :- అంబా = కైకేయి, యత్ ఆదిశ్యతి = ఆదేశించినట్లే. (ఇతి= అని, శిరసి = శిరస్సుపై, పత్త్రికామ్ = లేఖను, దత్త్వా = ఉంచుకొని) వత్స = సోదరా లక్ష్మణా ! అస్మత్ = నాయొక్క, ఆరాధన = సేవయందు, సహాధ్యాయినీమ్ = నీకు సహపాఠియు, నిజామ్ = నీదయిన, ప్రజావతీమ్ = వదినగారిని, (ప్రజావతీ భ్రాతృజాయా — అమరము. ప్రజావతీ దోహదశంసినీ తే తపోవనేషు స్పృహయాలురేవ — కాళిదాసః), ఆదాయ = వెంట బెట్టుకొని, పురఃభవ = ముందు నడువుము. [పురస్తాద్భవ. అని పాఠాంతరము].

తథేతి :- తథా=అట్లే, [ఇతి=అని, నిష్క్రాంతః=నిష్క్రమించెను]

రామః :- తాతౌ, సమాశ్వసితం సమాశ్వసితమ్.

జనకః :- (ఆశ్వస్య) అహహ ।

పాణిః గృహీతో రఘుపుంగవేన దేవః పురాణః శ్వశురో వివస్వాన్ ।
పితా స్వయం కేకయచక్రవర్తీ కర్మేదమేతాదృశమాః కిమేతత్ ॥ 67

(ఇతి మూర్ఛతి) (రామః పటాంచలేన వీజయతి)

దశరథః :- (ఆశ్వస్య)

కోఽప్యేష వాఙ్మనసయోరతివృత్తవృత్తి
ర్భావో హుతాశనమయశ్చ తమోమయశ్చ ।

---

తాతావితి :- తాతౌ = పెద్దలారా ! సమాశ్వసితమ్ సమాశ్వసితమ్ = ఊరడిల్లుడీ ! ఊరడిల్లుడీ !

పాణిరితి :- [ఆశ్వస్య = తెప్పరిల్లి]. అహహ ! రఘుపుంగవేన = దశరథునిచేత, పాణిః = చేయి, గృహీతః = స్వీకరింపబడినది. దశరథుడు వివాహ మాడెననుట. పురాణః = అతిపురాతనుడైన, దేవః = దేవుడు. వివస్వాన్ = సూర్యుడు, శ్వశురః = మామగారయ్యెను. పితా = తండ్రియేమో, స్వయమ్ = స్వయముగా, కేకయ చక్రవర్తీ = కేకయరాజు. ఇదమ్ = ఈ, కర్మ = పని [రామ వనవాసరూపము]. ఏతాదృశమ్ = ఇటువంటిది. ఆః = అయ్యో ! కిమ్ ఏతత్=ఏమిది!

తాత్పర్యము :- కైకేయిని చేపట్టినవాడు దశరథుడు. సూర్యభగవానుడా మామగారు. తండ్రియేమో కేకయ చక్రవర్తి. అయినను చేసిన పని ఇట్టిది, అయ్యో! ఏమిది !

సంధులు :- పాణిః + గృహీతః - రేఫాదేశవిసర్గ. గృహీతః + రఘు శ్వశురః + వివస్వాన్ - ఉత్వాదేశవిసర్గ. కర్మ + ఇదమ్ - గుణసంధి.

ఛందస్సు :- ఇంద్రవజ్రోపేంద్రవజ్రల కలయికతో నేర్పడిన ఉపజాతి.

[ఇతి = అని, మూర్ఛతి = మూర్ఛపోవును రామః = రాముడు, పటాంచలేన = ఉత్తరీయపు కొసతో. వీజయతి = వీచును.]

కోఽప్యేషఇతి :- [ఆశ్వస్య = తెప్పరిల్లి] వాఙ్మనసయోః = వాక్కుల కును మనస్సులకును, అతివృత్తవృత్తిః = అందని వ్యాపారమై, హుతాశనమయశ్చ=

భోక్తృత్వమాత్రమిహ మే పునరీదృశం మాం
హా వత్స రామ కథముత్సహసే విహాతుమ్ ॥ ౧౪

(విమృశ్య) హా వత్సే. జానకి. నిశాచరాణామాతిథేయీ భవితుం దశరథ గృహే ప్రవిష్టాసి. (ఇతి మూర్ఛతి).

---

అగ్నిజ్వాలారూపమై [మనస్సును దహించివేయుచు]. తమోమయః చ=గాఢాంధకారమై [ఆలోచనాజ్ఞానమును నశింపజేయుచు]. ఏషః = ఈ. భావః = మనఃస్థితి. కః అపి = ఇదియేమో తెలియరాకున్నది ! ఇహ = ఇప్పుడిట. మే = నాకు. భోక్తృత్వమాత్రమ్= దుఃఖమును అనుభవించుట మాత్రమే మిగిలినది. పునః = మరి. ఈదృశమ్ = ఇట్టి దురవస్థలోనున్న. మామ్ = నన్ను. విహాతుమ్ = విడిచిపోవుటకు. హా ! వత్సా ! రామా ! కథమ్ ఉత్సహసే = ఎట్లు ఒప్పుకొనుచున్నావయ్యా ! [వసంత తిలక]

తాత్పర్యము :- హా రామా ! ఇదియేమో తెలియరాని దుఃఖము నా గుండెలను పిండుచున్నది. చీకట్లు నింపుచున్నది. అనుభవించుటే నాకు మిగిలినది. ఇట్టి స్థితిలో నన్ను విడిపోవుటకు నీవు మనసెట్లు ఒప్పుకొనుచున్నది తండ్రీ !

సమాసములు :- వాక్చ మనశ్చ - తయోః [అచతురవిచతురేత్యాది నిపాతనాత్ వాఙ్మనస].

సంధులు :- కః + అపి - ఉత్వాదేశవిసర్గ. కో + అపి - పూర్వరూప. అపి + ఏషః-యణాదేశ. ఏషః + వాక్ - తదేతద్విసర్గలోప. వాక్ + మనస్ - అనునాసికాదేశ. వృత్తిః + భావః. మనసయోః + అతి - రేఫాదేశవిసర్గ. భావః + హంత- ఉత్వాదేశవిసర్గ. హంత + అశన-సవర్ణదీర్ఘ, హుతాశనమయః + చ, తమోమయః + చ - శాదేశవిసర్గ.

క్రియ :- షహఙ్ మర్షణే. ఆత్మనే. లట్. మధ్యమ
సహసే - సహేథే - సహధ్వే

హేతి :- (విమృశ్య = ఆలోచించి) హా ! వత్సా ! జానకీ ! నిశాచరాణామ్= రాక్షసులకు, ఆతిథేయీ భవితుమ్ = అతిథి సత్కారములు చేయుటకొరకు. దశరథ గృహే = దశరథుని గృహమునందు, ప్రవిష్టా అపి = ప్రవేశించితివి(వా). (ఇతి=అని. మూర్ఛతి = మూర్ఛపోవును.)

రామః :- తాతౌ, సమాశ్వసితమ్. సమాశ్వసితమ్.

జనకః :- (ఆశ్వస్య, ఆకాశే లక్ష్యం బద్ధ్వా) సాధు, సఖి, కైకేయి, సాధు. యదస్యా విశ్వంభరాదుహితుర్మే వత్సాయాః పత్యురనువృత్తిరేవ ప్రసాదీకృతా. (విమృశ్య, సవ్యథమ్)

ధనుష్మంతౌ వత్సౌ దశరథభుజైరూష్మలతమాః
ప్రదేశాస్తే వత్సా శిశురశివవృత్తా వనభువః ।
ప్రియై రాజా ముక్తైరసుభిరపమార్ష్టి స్వమయశ
శ్చరిత్రవ్యత్యాసః సఖి కథమయం కేకయకులే ॥ 69

---

తాతావితి :- తాతౌ = పెద్దలారా ! సమాశ్వసితమ్, సమాశ్వసితమ్ = ఊరడిల్లు డూరడిల్లుడు.

సాధ్వితి :- (ఆశ్వస్య = తేరుకొని. ఆకాశే = ఆకాశమునందు, లక్ష్యం బద్ధ్వా = దృష్టినిలిపి) సఖీ ! కైకేయీ ! సాధు సాధు = బాగుబాగు ! అస్యాః = ఈ, విశ్వంభరాదుహితుః = భూదేవికూతురైన, మే = నాయొక్క, వత్సాయాః = తనయకు (సీతకు), పత్యుః అనువృత్తిః ఏవ = భర్తను అనుసరించుటయే. ప్రసాదీకృతా = ప్రసాదముగా అనుగ్రహించితివి. సీతతో సహితుడై రాముడు అడవులకు పోవలె ననుటకు జనకు డానందించుచున్నాడు. (విమృశ్య = ఆలోచించి, సవ్యథమ్ = బాధతో)

ధనుష్మంతా వితి :- వత్సౌ = రామలక్ష్మణులు, ధనుష్మంతౌ = ధనుర్ధారులు. తే = వారు పోవలసిన అరణ్యప్రదేశములు, దశరథభుజైః = దశరథునిబాహువులచే, ఊష్మలతమాః = తేజఃపూర్ణములు – పరిపాలితములనుట. వత్సా = నాబిడ్డ జానకి, శిశుః = బాల్యావస్థ దాటనిది, వనభువః = అరణ్యప్రదేశములు, అశివవృత్తాః = విఘ్నబహుళములు–అనేక భయములతో కూడినవనుట. రాజా = దశరథుడు ప్రియైః = అత్యంత ప్రీతిపాత్రములైన, ముక్తైః = విడువబడిన, అసుభిః = ప్రాణములతో, స్వమ్ = తనయొక్క, అయశమ్ = అపకీర్తిని, అపమార్ష్టి = పోగొట్టుకొనును. సఖి = ఓ కైకేయీ ! కేకయకులే = కేకయ రాజవంశమునందు, అయమ్ = ఈ, చరిత్రవ్యత్యాసః = కథా వైపరీత్యము – అపకీర్తి, కథమ్ = ఎట్లు తొలగును !

కష్టం చ, వయమపి కథమనేన జనపదేషు బహులీభవతా భరత యౌవ రాజ్యలక్ష్మీకర్ణపూర తమాలపల్లవేన కైకేయీ దుర్యశసా మూర్ధానమున్న మయ్య లోకస్య ముఖం ద్రక్ష్యామః.

రామః :- (ఉత్థాయ) తాత జనక, యథా సుస్థం తాతం శృణోమి తథా భవతా విధాతవ్యమ్. (ఇతి నిష్క్రాంతః)

---

తాత్పర్యము :— రామలక్ష్మణులు ధనుర్ధారులగుటచేతను, దండకారణ్యములు దశరథ పాలితములగుటచేతను బహుళీకరములగు వనములందేని బాలికయగు సీతకు భయములేదు దశరథుడు ప్రాణములను విడిచి తన అపకీర్తిని తొలగించుకొనును. కానీ ఓ! కైకేయీ! నీ పుట్టింటికి వచ్చిన అపకీర్తి ఎట్లు తొలగును! (శిఖరిణీ) (సిధ్మాదిత్వాత్ లచ్ మతుబర్థే- ఉఃష్మలః).

సంధులు :- భుజైః + ఉఃష్మల, శిశుః + అశివ, ముక్తైః + అనుభః + అప - రేఫాదేశవిసర్గ. ప్రదేశాః + తే-సాదేశవిసర్గ. వృత్తాః + వన, ప్రియైః + రాజా- విసర్గలోప. అయశః + చరిత్ర - శాదేశవిసర్గ.

క్రియ :— మృజూష్ శుద్ధౌ, (లుక్) పరస్మై, లట్. ప్రథమ (అప)
మార్ష్టి - మృష్టః - మృజన్తి

కష్టమితి :- కష్టమ్ చ = ఎంత కష్టము! జనపదేషు = గ్రామముల యందును నగరములయందును, బహులీ భవతా = దట్టముగా వ్యాపించునదియు, భరత= భరతునియొక్క, యౌవరాజ్యలక్ష్మీ = యౌవరాజ్యలక్ష్మియొక్క, కర్ణపూర = కర్ణాలంకారమైన, తమాలపల్లవేన = తమాల వృక్షపు చిగురాకువంటిదైన (కానుగుచెట్టు), అనేన = ఈ, కైకేయీ దుర్యశసా = కైకేయి అపకీర్తితో, వయమ్ అపి = మేము మాత్రము, మూర్ధానమ్ ఉన్నమయ్య = తల ఎత్తుకొని, లోకస్య = లోకముయొక్క, ముఖమ్ = ముఖమును, కథమ్ ద్రక్ష్యామః = ఎట్లు చూడగలము!

తాతేతి :- (ఉత్థాయ = ప్రయాణమునకు సన్నద్ధుడై నిలిచి) తాత = ఆర్యా జనక = జనక మహారాజా! తాతమ్ = మా తండ్రిగారిని, సుస్థమ్ = సుఖముగానున్న వానిగా, యథాశృణోమి = ఎట్లు విందునో, తథా = అట్లు, భవతా = మీచేత, విధాత

దశరథః :- (ఆశ్వస్యోత్థాయ చ) వత్స రామభద్ర, పరిపాలయ మామ్.
(ఇతి జనకేన ధార్యమాణో నిష్క్రాన్తః). (ఇతి నిష్క్రాన్తాస్సర్వే)

—: ఇతి దశరథ విప్రలమ్భో నామ చతుర్థోఽఙ్కః :—

---

వ్యమ్ = చేయదగియున్నది - మాతండ్రి సుస్థుడగునట్లు చూడుడీ అనుట. [ఇతి=అని. నిష్క్రాన్తః = నిష్క్రమించెను.]

వత్సేతి :- [ఆశ్వస్య = తేరుకొని. ఉత్థాయ చ = లేచి] వత్స = నాయనా! రామభద్ర = రామా! మామ్ = నన్ను. పరిపాలయ = రక్షింపుము. కాపాడుము. [ఇతి = అని, జనకేన = జనకునితో. ధార్యమాణః = ధరింపబడుచున్నవాడై - జనకుని ఆసరాతో. నిష్క్రాన్తః = నిష్క్రమించును] [ఇతి = ఇట్లు. సర్వే = అందరును నిష్క్రాన్తాః = నిష్క్రమింతురు]. [ఇతి = ఇది. దశరథ విప్రలంభః నామ = దశరథ విప్రలంభమనునట్టి, చతుర్థః అంకః = నాల్గవ అంకము ]

— ★ —

# అనర్ఘరాఘవమ్

## పంచమోఽఙ్కః

(తతః ప్రవిశతః శ్రవణాజాంబవంతౌ)

జాంబవాన్ :- తత స్తతః

శ్రవణా :- తతో మిథిలాయా నిష్క్రమ్య మంథరాకళేబరమపకీర్య మారుతి ప్రత్యవేక్షితం స్వశరీరమధిష్ఠాయ గంగాయాం శృంగిబేరపురం నామ నిషాదపక్కణమాగత్య శబరీభూతాస్మి.

జాంబవాన్ :- తత స్తతః.

శ్రవణా :- తతశ్చ మమానుపదమేవ తస్మిన్నిమౌ రామలక్ష్మణావియం సీతేతి సర్వతః శబ్దో మహానభూత్.

---

[తతః = అంతట, శ్రవణా జాంబవంతౌ = శబరీ జాంబవంతులు, ప్రవిశతః = ప్రవేశింతురు].

తత స్తతః = అటుపైని

మిథిలాయా ఇతి :- తతః = అంతట. మిథిలాయాః = మిథిలా నగరమునుండి, నిష్క్రమ్య = నిష్క్రమించి. మంథరా కళేబరమ్ = మంథరా శరీరమును, అవకీర్య = విడిచి. మారుతిప్రత్యవేక్షితమ్ = అంతవరకు హనుమంతునిచే సంరక్షింపబడుచున్న, స్వశరీరమ్ = నా దేహమును [శబరి]. అధిష్ఠాయ = ప్రవేశించి, గంగాయామ్ = గంగా తీరమునందలి, శృంగబేరపురం నామ = శృంగబేరపురమనునట్టి, నిషాదపక్కణమ్ = నిషాదుల పట్టణమును, ఆగత్య = చేరుకొని శబరీభూతా అస్మి = శబరినైతిని

తతః తతః = అంతట

మమేతి :- తతశ్చ = అంతట, మమ అనుపదమ్ ఏవ = నా వెనువెంటనే తస్మిన్ = ఆ శృంగబేరపురమందు, ఇమౌ = ఈ ఇరువురే, రామలక్ష్మణౌ = రామ

జాంబవాన్ :- (సహర్షమ్) తత స్తతః.

శ్రవణా :- తతశ్చ కావేతౌ రామలక్ష్మణావితి కర్ణధారాధిపతినా గుహేనాహ
మనుయుక్తా నివేదితవత్యస్మి.

పుత్త్రీయతా దశరథేన మునిప్రసాదాత్
ప్రాప్తాః పురాణపురుషస్య కళాశ్చతస్రః ।
తాసామయం గుణమయః ప్రథమః కుమారో
వీరోద్ధతః పునరసావపర స్తృతీయః 1

---

లక్ష్మణులు. ఇయమ్ = ఈమెయే, సీతా ఇతి = జానకి అని. సర్వతః = అన్నివైపు
లను, మహాన్ శబ్దః = పెద్ద కలకలము. అభూత్ = అయ్యెను.

తత స్తతః :- [సహర్షమ్ = ఆనందముతో] తతః తతః = అటుపైని—

కావితి :— తతశ్చ = అంతట. ఏతౌ = ఈ. రామలక్ష్మణౌ = రామ
లక్ష్మణులు, కౌ ఇతి = ఎవరని, కర్ణధారాధిపతినా = నావికుల రాజయిన, గుహేన =
గుహునితో, అనుయుక్తా = ప్రశ్నింపబడినదాననై. అహమ్ = నేను. నివేదితవతీ
అస్మి = తెలియ చెప్పితిని.

పుత్త్రీయతేతి :— పుత్త్రీయతా = పుత్త్రులను కోరుకొనుచున్న. దశర
థేన = దశరథునిచే. మునిప్రసాదాత్ = ఋష్యశృంగుని అనుగ్రహమువలన. పురాణ
పురుషస్య = విష్ణుమూర్తియొక్క. చతస్రః కళాః = నాలుగైన కళలు [అంశలు].
ప్రాప్తాః = పుత్త్రులుగా పొందబడినవి. తాసామ్ = ఆ కళలలో, గుణమయః = సకల
సద్గుణ నిధి. అయమ్ = ఈతడు, ప్రథమః కుమారః = పెద్ద కొడుకు - రాముడు.
పునః = మరి, అపరః = మరియొకడు, అసౌ = ఈ కన్పించుచున్నవాడు. వీరోద్ధతః =
వీరుడును నుద్ధతుడునైన, తృతీయః = మూడవ కొడుకు - లక్ష్మణుడు. [వసంత తిలక].

తాత్పర్యము :— పురాణపురుషుని నాలుగు అంశలును నలుగురు పుత్త్రు
లుగా దశరథునింట జన్మించెను. దీనికి ఋష్యశృంగుని అనుగ్రహము కారణము.
వారిలో మొదటివాడే ఈ రాముడు. మూడవవాడు ఈ వీరోద్ధతుడు లక్ష్మణుడు.

జాంబవాన్ :- శ్రవణే, సాధూ_క్తమ్, తత స్తతః.

శ్రవణా :- తతశ్చోదకాంత నివ_ర్తితానుయాత్రిక బంధువర్గః ససంభ్రమో పగతేన గుహేనోపనీతాం నావమధిరుహ్య—

తీ_ర్త్వా భూతేశమౌళిస్రజమమరధునీమాత్మనాసౌ తృతీయ
స్తస్మై సౌమిత్రి మైత్రీమయముపహృతవానాతరం నావికాయ ।

---

సంధులు :- ...కాః + చతస్రః, అపరః + తృతీయః - ...సాదేశవిసర్గ సంధులు. కుమారః + వీర - ఉత్వాదేశవిసర్గ. వీర + ఉద్ధతః - గుణసంధి. అసౌ + అపరః - అయవాదేశసంధి

విశేషములు :- పుత్రీయతా - ఆత్మనః పుత్ర మిచ్ఛతి. "సుప ఆత్మనః క్యచ్", "క్యచి చ" అని దీర్ఘము — పుత్రీయత్ - తృతీయ.

శ్రవణఇతి :— శ్రవణే = శబరీ! సాధు + ఉక్తమ్ = చక్కగాచెప్పితివి తత స్తతః = అటుపై నటుపైని

తతఇతి :- తతశ్చ = అంతట, ఉదకాంత నివ_ర్తిత = ఆ ఉదకాంతం ప్రియమనువ్రజేత్ అను నియమమునుబట్టి నదివరకువచ్చి వెనుదిరిగిన, అనుయాత్రిక బంధువర్గః = సహప్రయాణికులైన బంధువుల సమూహముకలవాడై - రాముడు, ససంభ్రమోపగతేన=సంభ్రమముతో సమీపించిన, గుహేన=గుహునిచేత, ఉపనీతామ్= కొనిరాబడిన, నావమ్ అధిరుహ్య = నౌకను ఆరోహించి.

తీర్త్వేతి :- ఆత్మనా = తనతో, తృతీయః = మూడవవాడైన (సీతా-లక్ష్మణులు మరియు తాను). అసౌ = రాముడు, భూతేశ = శివునియొక్క, మౌళి స్రజమ్ = శిరస్సునందలి దండవంటిదైన, అమరధునీమ్=గంగానదిని, తీర్త్వా=దాటి, తస్మై = ఆ, నావికాయ = నావికునికొఱకు, సౌమిత్రిమైత్రీమయమ్ = లక్ష్మణునితో మైత్రియనునట్టి, ఆతరమ్ = పడవ రుసుమును (దాటించినందుకు మూల్యము) ఉపహృతవాన్ = సమర్పించెను (ఆతరస్తరపణ్యం స్యాత్ద్రోణీ కాష్ఠాంబువాహినీ - అమరము). అథో = అనంతరము- వ్యామగ్రాహ్యస్తనీభిః = గొప్ప వక్షోజసంపదగల. (వ్యామో బాహ్వోస్సకరయోస్తతయోస్తిర్యగంతరమ్ - అమరము. వ్యామమనగా బార.

వ్యామగ్రాహ్యస్తనీభిః శబరయువతిభిః కౌతుకోదంచదక్షం
కృచ్ఛ్రాదన్వీయమానః క్షణమచలమథో చిత్రకూటం ప్రతస్థే॥ 2

జాంబవాన్ :- హన్త, మహత్కరుణమ్.

శ్రవణా :- ఆర్య. కరుణభయాదేవ తస్మిన్నింగుదీతరుమూలే కుమారయో ర్జటా గ్రహణ వృత్తాంత మంతరితవత్యస్మి.

---

కౌగలకుచాలు కుటములుగలవారనుట). శబరయువతిభిః=ఆటవికస్త్రీలచేత. కౌతుక = కుతూహలముతో. ఉదంచత్ + అక్షమ్ = విప్పారిన నేత్రములుకల్గునట్లు. క్షణమ్ = క్షణకాలము. కృచ్ఛ్రాత్ = నెమ్మదిగా. అన్వీయమానః = వెంబడింపబడుచున్నవాడై - చకితనయనలైన ఆ స్త్రీలు మెల్లమెల్లగా అనుసరించుచున్నారనుట. చిత్రకూటమ్ అచలమ్ = చిత్రకూటమను పర్వతమును. ప్రతస్థే = చేరుకొనెను (స్రగ్ధరావృత్తము)

తాత్పర్యము :- రాముడు తనతోకలిపి ముగ్గురుగా గంగానదిని దాటి సౌమిత్రితోటిచెలిమునే మూల్యముగా నావికునకర్పించి, అటుపైని గురుకుచలగు శబర కాంతలు విస్తుపోయి చూచుచు వెంబడింపగా చిత్రకూట పర్వతమునకు చేరుకొనెను.

సమాసములు :- భూతానామీశః - భూతేశస్య మౌళిః - మౌళ్యాం ప్రసిప - తామ్. అసురాణాం ధునీ-తామ్. సౌమిత్రేః మైత్రీ, వ్యామేన గ్రాహ్యౌస్తనౌ యస్యాఃస్సా-తాభిః, కౌతుకేన ఉదంచతీ అక్షిణీ యస్మిన్ కర్మణి తత్తథా.

సంధులు :- భూత + ఈశ, కౌతుక + ఉదంచత్ - గుణసంధి. ఆత్మనా + అసౌ - సవర్ణదీర్ఘసంధి. తృతీయః + తస్మై - సొపేశవిసర్గ.

క్రియ :- స్థా గతి నివృత్తౌ, లిట్, ఆత్మనే, ప్రథమ.

తస్థే - తస్థాతే - తస్థిరే

హన్తేతి :- హన్త = అయ్యయ్యో!, మహత్కరుణమ్ = ఎంతటి దీనావస్థ!

ఆర్యేతి :- ఆర్య = అయ్యా! కరుణభయాత్ ఏవ = నీకు దుఃఖహేతు-వగునని భయముతోనే, తస్మిన్=అవలి యొడ్డునందలి, ఇంగుదీతరుమూలే = ఇండెపు చెట్టుమొదట జరిగినదగు, కుమారయోః = రామలక్ష్మణులయొక్క. జటాగ్రహణ

జాంబవాన్ :- శ్రవణే, సర్వమేతత్కల్యాణోదర్కం భవిష్యతి.

శ్రవణా :- అహం తు నిషాదపతిప్రీతయే తత్రైవాతిష్ఠమ్. అతీతే చ గణరాత్రే సహప్రకృతిజనపదః పితుః స్వర్గారోహణవార్తాభిధాయీ ద్వితీయో దాశరథీ రామభద్రమయోధ్యాముపనేతుం తేనైవ పథా చిత్రకూటముపగతః.

జాంబవాన్ :- తతస్తతః.

శ్రవణా :- తతశ్చ తస్మిన్, "ఆర్య, లోకే కైకేయానామాకల్ప మనల్పమకీర్తిస్తంభం నిఖనతా తేనాపి చ్ఛలితాస్స్మః. తత్త్వం ప్రతిగృహాణ రఘూణామధిరాజ్యమ్" ఇతి పునః పునశ్శిరసానుబంధీ

---

వృత్తాంతమ్ = జటా ధారణ కథను, అంతరితవతీ అస్మి = కప్పిపుచ్చితిని-ఆ సంఘటనను నీకు వివరించి చెప్పక దాటవేసితిననుట.

శ్రవణఇతి :- శ్రవణే = ఓ శబరీ! ఏతత్ సర్వమ్ = ఇదియంతయు, కల్యాణ + ఉదర్కమ్ = శుభఫలముకలది, భవిష్యతి = అగును। (ఉదర్కః ఫలముత్తరమ్-అమరము)

అహమితి :- అహంతు = నేనేమో, నిషాదపతి ప్రీతయే = నిషాదరాజు నాజ్ఞను పాలించి ప్రీతికల్గించుటకై, తత్రైవ = అచ్చటనే, అతిష్ఠమ్ = ఉండిపోయితిని. గణరాత్రే = చీకటిరాత్రులు. అతీతే = గడచిపోగా (గణరాత్రం నిశాబహ్వ్యః - అమరము), ద్వితీయః దాశరథిః = దాశరథులలో రెండవ వాడగు భరతుడు. సప్రకృతిజనపదః = పౌర జానపదులతో కూడినవాడును, పితుః = తండ్రియైన దశరథునియొక్క, స్వర్గారోహణవార్తా + అభిధాయీ = మరణవార్తను తెల్పువాడునై, రామభద్రమ్ = రామచంద్రుని, అయోధ్యామ్ ఉపనేతుమ్ = అయోధ్యకు గొనిపోవుటకై, తేన + ఏవపథా = అదేదారిని. చిత్రకూటమ్ ఉపాగతః = చిత్రకూట పర్వతమును సమీపించెను.

తతఇతి :- (సశంకమ్ = శంకించుచు) తతస్తతః = అంతట నంతట —

తస్మిన్నితి :- తతశ్చ = అంతట, ఆర్య = అగ్రజా! లోకే = ప్రపంచమునందు కైకేయానామ్ = కేకయ వంశస్థులకు, అకల్పమ్ = కల్పాంతస్థాయిగా, అనల్పమ్ = మిక్కిలి పెద్దదియైన, అకీర్తిస్తంభమ్ = అపకీర్తి రూపమైన శిలాస్తంభమును.

రామేణ స్పృష్టికయా ప్రత్యాదిష్టః కృతజటాపరిగ్రహో భరతః శరభంగమునిప్రేషితామస్య పాదుకాం భద్రాసనమధిరోప్య ప్రజానామాభ్యుదయిక మవేక్షమాణ స్తదైవ నందిగ్రామం గతవాన్.

జాంబవాన్ :- (సహర్షమ్) హన్త ఫలితమస్మద్వ్యవసాయ శ్రవణా పరిశ్రమాభ్యామ్. తత స్తతః.

శ్రిపణా :- తతశ్చ శావాశౌచమాస్థితస్య క్షత్రియస్య ప్రతిషిద్ధమస్త్రగ్రహణమితిచ్ఛిద్రాన్వేషిభిర్జనస్థానవా స్తవ్యైః ఖరదూషణప్రభృతిభి స్తత్ర విరాధోనామ రాక్షసః తీక్ష్ణః ప్రహితః.

---

నిఖసతా = ఏర్పరుచువాడైన. కేన + అపి = ఎవనిచేతనో. తాతః = తండ్రిగారు ఛలితః = మోసగింపబడెను – నిన్ను అడవులకు పంపుట ఎవరిచో పన్నాగమనుట. తత్ = అందుచేత. సంప్రతి = ఇప్పుడు. రఘూణామ్ అధిరాజ్యమ్ = రఘువంశ సింహాసనమును, గృహాణ = స్వీకరింపుము. ఇతి = అని. తస్మిన్ = ఆ రామునియందు. చిరమ్=చాలసేపు. పునః పునః=మరల మరల. అనుబంధీ=సస్నేహముగా నిర్బంధించినవాడై. రామేణ = ఆ రామునిచేత. స్పృష్టికయా = శపథముతో (ఒట్టు). ప్రత్యాదిష్టః= తిరస్కరింపబడినవాడై (స్పృష్టికాశపథేఽపిచ—రత్నకోశః. శరీరస్పృష్టికయా అని పాఠాంతరము—నెత్తిపై చేయిపెట్టిఒట్టు వేసి అని అర్థము). కృతజటాపరిగ్రహః = జటాధారణముపంగీకరించి. భరతః = ఆ భరతుడు. శరభంగముని ప్రేషితామ్ = శరభంగుడను మునిచే పంపబడిన (భరతుడు భయపడి శరభంగునిచే నడిగించెననుట). అస్య = రాముని యొక్క. పాదుకామ్ = పాదుకను (అథపాదుకా పాదూరుపానత్ – అమరము). భద్రాసనమ్ అధిరోప్య = సింహాసనముపై నుంచి. ప్రజానామ్ = ప్రజలయొక్క. ఆభ్యుదయికమ్ = అభ్యుదయమును. అవేక్షమాణః = చూచుచు (పాలించుచు) తదాఏవ = అప్పుడే. నందిగ్రామమ్ = నందిగ్రామమును. గతవాన్ = చేరుకొనెను.

హన్తేతి :- (సహర్షమ్ = ఆనందముతో) హన్త = ఆహో! అస్మత్ వ్యవసాయ = మా ప్రయత్నము. శ్రవణా పరిశ్రమాభ్యామ్=శబరికృషి—ఈ రెండింటివలన, ఫలితమ్ = ఫలమిది – వ్యవసాయము కృషితో ఫలించినదనుట. తతస్తతః = అంతట

శావాశౌచమితి :- తతశ్చ = అటుపైని. శావాశౌచమ్=(తండ్రిమరణము వలని) మైలను. అస్థితస్య = పొందియున్న. క్షత్రియస్య = క్షత్రియునికి. అస్త్ర

జాంబవాన్ :- (విహస్య) ధిఙ్మూర్ఖాః. అతిపాతికే హి కార్యే రాజ్ఞాం సద్యః శుద్ధిః. తత స్తతః.

శ్రవణా :- తతశ్చ విరాధవధాక్షిప్త హృదయే దుస్సహశోక దీర్ఘామౌర్ధ్వదేహికీం పితుః క్రియామతివాహ్య భగవతా చతుస్సముద్రముష్టింధయేన వింధ్యాచల చాపలారంభ విస్రబ్ధఘాతినా వాతాపిదానవ దీర్ఘయాత్రామంగళకలశేన కలశయోనినా సనాథామరణ్యపీఠీం ప్రతిష్ఠమానే దాశరథౌ పథి ధారాధరో నామ వాయసః సహసైవ వైదేహీముపాద్రవత్.

---

గ్రహణమ్ = ఆయుధ స్వీకరణము. ప్రతిషిద్ధమ్ = నిషిద్ధము. ఇతి = అని. ఛిద్రాన్వేషిభిః = రంధ్రాన్వేషణ తత్పరులైన. జనస్థాన వాస్తవ్యైః = జనస్థాన నివాసులైన. ఖరదూషణ ప్రభృతిభిః = ఖరుడు దూషణుడు మొదలైన రాక్షసులచేత. తత్ర = అప్పటికి. తీక్ష్ణః = ప్రచండుడైన. విరాధః నామ రాక్షసః = విరాధుడను రాక్షసుడు. ప్రహితః = పంపబడెను.

ధిగితి ;- (విహస్య = బిగ్గరగా నవ్వి) ధిఙ్మూర్ఖాః = మూర్ఖులారా! సిగ్గు! సిగ్గు! అతిపాతికే = కాలయాపనను సహింపనట్టి. కార్యే = పనియందు—అత్యవసరమైన పని వచ్చియున్నప్పుడు అనుట (అతిపాతమనగా శత్రువులు వచ్చిపడుట - అట్టి సమయము నందనియు), రాజ్ఞామ్ = పరిపాలకులకు. సద్యః = తత్క్షణమే, శుద్ధిః హి = (మైలకు) శుద్ధియుమా! రాజకార్య నిర్వహణమునందు రాజులకు మైల పట్టింపు ఉండదనుట. (న రాజ్ఞాం రాజకర్మణి అని స్మృతి). తతస్తతః = అంతట.

విరాధేతి ;- తతశ్చ = అంతట, విరాధ = విరాధునియొక్క, వధ = సంహారముతో! ఆక్షిప్త = వ్యాకులమైన, హృదయే = హృదయమునందు, దుస్సహ శోక = భరింపరాని దుఃఖముతో, దీర్ఘామ్ = ఎంతయును గడవని పగిలుదలవిగా, పితుః = తండ్రియొక్క, ఔర్ధ్వదేహికీమ్ క్రియామ్ = శ్రాద్ధక్రియను, అతివాహ్య = జరిపి, భగవతా = మహానుభావుడును, చతుస్సముద్ర ముష్టింధయేన = చతుస్సముద్రములను పుడిసిటబట్టి త్రాగివేసినవాడును(ముష్టికృత్య ధయతి పిబతి ఇతి ముష్టింధయః- నాడీముష్ట్యోశ్చ - ఖశ్) వింధ్యాచల = వింధ్య పర్వతము యొక్క, చాపలారంభ =

జాంబవాన్ :- (స్వగతమ్) ఇదం తావదపశకునం నామ. (ప్రకాశమ్) తత స్తతః—

శ్రవణా :- తతశ్చ

రక్షోభిచార చరుభాండమివ స్తనం యో
దేవ్యా విదేహ దుహితుర్విదదార కాకః।
ఐషీకమస్త్ర మధికృత్య తదా తమక్ష్ణి
కాణీచకార చరమో రఘురాజపుత్రః ॥ 3

---

చాపల్యముతోనైన విజృంభణమును. విస్రబ్ధఘాతినా = నమ్మకముగా పోగొట్టినవాడును (నమ్మించి అణచిన వాడనుట లేదా కోలాహలము లేకుండ అణచిన వాడనికానీ) వాతాపి = వాతాపి అనునట్టి. దానవ = రాక్షసునియొక్క. దీర్ఘయాత్రా=మరణరూపమగు దీర్ఘయాత్రకు, మంగళ కలశేన = మంగళ కలశమువంటి వాడైన. కలశయోనినా = అగస్త్యునిచేత. సనాథామ్ = అధిష్ఠింపబడిన. అరణ్యవీథీమ్ = అరణ్యమార్గమునుబట్టి. (వీథ్యాళి రావళిః పంక్తిః - అమరః). దాశరథౌ = రాముడు. ప్రతిష్ఠమానే = పోవుచుండగానే. పథి = మార్గమునందు. ధారాధరః నామ = ధారాధర నామకమగు. వాయసః = కాకి. సహసా = హఠాత్తుగా. వైదేహీమ్ ఏవ = జానకినే. ఉపాద్రవత్ = హింసించెను.

ఇదమితి :. (స్వగతమ్ = తనలో) ఇదమ్ తావత్ = ఇదే, అపశకునమ్ నామ = అప్పమైన అపశకునము - కాకి పొడుచుట అపశకునము. (ప్రకాశముగా) తతస్తతః = అటుపిమ్మట.

రక్షఇతి :- తతశ్చ = అంతట, రక్షః = రాక్షసజాతియొక్క, అభిచార= మారణహోమమునకైన, చరుభాండమ్ ఇవ=హవ్యపాత్రవంటిదగు. దేవ్యాః విదేహదుహితుః = సీతాదేవియొక్క, స్తనమ్ = వక్షోజమును, యః కాకః = ఏ కాకాసురుడు. విదదార=గీరెనో [చీల్చెనో], తమ్ = ఆ కాకాసురుని, తదా=అప్పుడే. ఐషీకమ్ అస్త్రమ్ అధికృత్య = గడ్డిపోచను అస్త్రముగా సంధించి. చరమః = మొదటివాడైన. రఘురాజ పుత్రః = రఘునందనుడు. అక్ష్ణి కాణీచకార = ఒక కన్ను గ్రుడ్డిదియగునట్లు చేసెను. (వసంత తిలక).

జాంబవాన్ :- తతస్తతః.

శ్రవణా :- తతశ్చ—

---

తాత్పర్యము :- రాక్షసజాతిని సంహరించుటకు చేయు యాగమునందు హవ్యపాత్రవంటిదైన జానకీస్తనమును చీల్చిన కాకాసురునిపైకి గడ్డిపోచను అస్త్రముగా సంధించి రాముడు అతని కన్నులొట్టపరచెను.

విశేషములు :- చరమో రఘురాజపుత్రః — అనుదానికి పలువ్యాఖ్యలున్నవి. కాకాసురుని కన్నుపోగొట్టినవాడు రాముడే అనుట వాల్మీకిమున నిర్వివాదాంశము. "చరమః" అనగా చివరివాడని ప్రసిద్ధార్థము. చివరివాడు శత్రుఘ్నుడు. ఈ అన్వయానౌచిత్యమును తొలగించుటకు వ్యాఖ్యాతలు ప్రయత్నించిరి. రమయతీతి రమః (జ్వలతి కసంతేభ్యోణః). రమః = రామః రఘురాజపుత్రః రమః కాణీచకార చ - అని అన్వయించిరి. [అప్పుడు చకారము వ్యర్థపదముగుచున్నది]. మరికొందరు చరా(సంచారిణీ) మా (లక్ష్మీః) యస్యసః చరమః = రామః. రాజ్యలక్ష్మి చరత్వమును పొందినది కావున చరముడు రాముడనిరి. చరమో జ్యేష్ఠకనిష్ఠయోః అని విశ్వప్రకాశనిఘంటువున నున్నదని మరికొందరు. మురారి ప్రమాదపడెనన్నవారును లేకపోలేదు. అప్రసిద్ధపదములను వినూతనములను ప్రయోగించుటలో సిద్ధహస్తుడగు మురారి విశ్వప్రకాశమునుబట్టి జ్యేష్ఠార్థమునుపయోగించి యుండును అనుట లెస్స.

సమాసములు :- రక్షసామభిచారః - అభిచారస్య చరుభాండమ్ ఇవ విదేహస్య దుహితా - తస్యాః. అక్ష్ణి కాణః-యేనాంగవికారః-తృతీయా. రఘురాజస్య పుత్రః.

సంధులు :- రక్షః + అభిచార - ఉత్వాదేశవిసర్గ - రక్షో + అభిచార - పూర్వరూప. యః + దేవ్యాః, చరమః + రఘు -ఉత్వాదేశవిసర్గ. దేవ్యాః + విదేహ- విసర్గలోప. దుహితుః + విదదార - రేఫాదేశవిసర్గ.

క్రియ :- దౄవిదారణే [శ్నా] పరస్మై. లిట్. ప్రథమ.

దదార-దదరతుః-దదరుః.

దృ (దౄ) హింసాయామ్-దదార -దద్రతుః-దద్రుః.

తతఇతి :- తతస్తతః = అటుపైని-

క్రమేణైవ సుతీక్ష్ణాదీనుపస్థాయ మహామునీన్ ।
అగస్త్యశాసనాదాస్తే పంచవట్యాం రఘూద్వహః ॥ 4

జాంబవాన్ :- (సహర్షమ్) తర్హి హస్తగత ఏవాస్మాకమ్. కియదంతర మృష్యమూకజనస్థానయోః.

శ్రవణా :- ఆర్య, న ఖల్వద్యాపి శ్రోతవ్యం శృణోషి.

---

క్రమేణేతి :- తతశ్చ=అటుపైని — రఘూద్వహః=రఘువంశతిలకుడు. క్రమేణ = వరుసగా, సుతీక్ష్ణాదీన్ = సుతీక్ష్ణుడు శరభంగుడు తృణబిందుడు మొదలైన, మహామునీన్ = మహర్షులను, ఉపస్థాయ = అర్చించి. అగస్త్యశాసనాత్ = అగస్త్యుని ఆజ్ఞవలన, పంచవట్యామ్ = పంచవటియందు, ఆస్తే=నివసించుచున్నాడు (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- సుతీక్ష్ణాదులను మహర్షులను సేవించుచు వెడలినరాముడు అగస్త్యుని ఆజ్ఞమేరకు పంచవటిలో నివసించుచున్నాడు.

సమాసములు :- సుతీక్ష్ణః ఆదిః యేషాం — తాన్, మహాంశ్చాసౌ మునిశ్చ — తాన్, అగస్త్యస్య శాసనాత్, పంచానాం వటానాం సమాహారః—ద్విగోశ్చేతి జీప్ — తస్యామ్, రఘుషు ఉద్వహః

సంధులు :- క్రమేణ + ఏవ — వృద్ధి, సుతీక్ష్ణ + ఆదీన్, రఘు + ఉద్వహః — సవర్ణదీర్ఘ

క్రియ :- ఆసట్ ఉపవేశనే, ఆత్మనే, లట్, ప్రథమ (శబ్లుక్)
ఆస్తే — ఆసాతే — ఆసతే

తర్హీతి :- (సహర్షమ్ = సంతోషముతో) తర్హి = అయినచో, అస్మాకమ్= మాకు (మనకు) హస్తగతః ఏవ = చేతికిచిక్కినవాడే, ఋష్యమూక జనస్థానయోః = ఋష్యమూకము జనస్థానముల నడుమ, కియత్ అంతరమ్ = దూరమెంత?

ఆర్యేతి :- ఆర్య = అయ్యా! శ్రోతవ్యమ్ = వినవలసిన అంశమును, అద్య + అపి = ఇప్పటికింకను, న శృణోషి ఖలు = వినపైతివికదా! అసలు చెప్ప వలసిన అంశమును ఇంకను నేను చెప్పనేలేదనుట.

జాంబవాన్ :- అవహితోఽస్మి.

శ్రవణా :- తత్ర చ రాముకీ రామభద్రమనుప్రవిశ్య రసం దాస్యామీతి సంకల్పిత పతిద్రోహపాతకినీ శూర్పణఖా లక్ష్మణరోషహుత భుజి కర్ణనాసోష్ఠమయీభిస్తిసృభిరాహుతిభిః ప్రాయశ్చిత్త యాంచక్రే.

జాంబవాన్ :- (సాతంకమ్) అహహ మహాననర్థకందస్సంవృత్తః. అథ భగిన్యాస్తాదృశం విడంబనముపలోక్య ఖరాదిభిః కిం ప్రతిపన్నమ్.

శ్రవణా :- (విహస్య) ఆర్య. కిం ప్రతిపన్నమ్। యద్రామభద్రే ధృత ధనుషి ప్రతిపద్యతే.

---

అవహితఇతి :- అవహితః అస్మి = సావధానుడనై యున్నాను. చెప్పుమనుట.

తత్రేతి :- తత్ర చ = ఆ పంచవటియందుండగా, రాముకీ = రమింపగోరునదై (లషపత ఇత్యాదినా ఉకఞ్. ఙీప్). శూర్పణఖా = శూర్పణఖ. రామభద్రమ్ = రామచంద్రుని. అనుప్రవిశ్య = మోహింపజేసి. రసమ్ = ఒకవిధమగు విషమును. దాస్యామి ఇతి = ఇత్తునుఅని. సంకల్పిత = సంకల్పించుకొనిన. పతిద్రోహ పాతకినీ = రామునికి ద్రోహము అను పాపముకలదై, లక్ష్మణ=సౌమిత్రియొక్క, రోష=రోషము నునట్టి. హుతభుజి = యాగాగ్నియందు. కర్ణనాస + ఓష్ఠమయీభిః = చెవులు. ముక్కు. పెదవులు అనునట్టి, తిసృభిః = మూడైన, ఆహుతిభిః = ఆహుతులచే (మంత్రపూర్వకముగ అగ్నికుండములో స్వాహా అని విడుచుట ఆహుతి). ప్రాయశ్చిత్తయాంచక్రే = ప్రాయశ్చిత్తము చేసికొన్నది.

అహహేతి:- (సాతంకమ్ = ఇబ్బందిగా) అహహ! మహాన్ = గొప్పది యగు. అనర్థకందః = అనర్థమూలము, సంవృత్తః = జరిగినది (ఏర్పడినది). అథ = అప్పుడు, భగిన్యాః = సోదరియొక్క, తాదృశమ్ = అటువంటి. విడంబనమ్ = అవమానమును, అవలోక్య = చూచి. ఖరాదిభిః = ఖరుడుమొదలగు రాక్షసులచే. కిమ్ ప్రతిపన్నమ్ = ఏమి ఆచరింపబడినది? అప్పుడు వారేమి చేసిరనుట.

ఆర్యేతి :- (విహస్య = నవ్వి) ఆర్యా! కిమ్ ప్రతిపన్నమ్ = ఏమి ఆచరింపబడిన దందును. రామభద్రే = రామభద్రుడు. ధృతధనుషి = ధనుర్ధారియై యుండగా, యత్ ప్రతిపద్యతే = ఏది జరుగునో అదే జరిగిన దనుట.

జాంబవాన్ :- (సహర్షహాసమ్) తత్కిం తేఽపి వాలిసాహాయకోపస్థాయినో విరాధయాత్రా ప్రహతమధ్వానమనుప్రపన్నాః.

శ్రీవణా :- అథకిమ్.

జాంబవాన్ :- శ్రవణే, ప్రరూఢమిదానీం రామరావణయోర్వైరమ్.

శ్రీవణా :- (హాసస్తి) ఆర్య, మన్యే ఖరదూషణప్రభృతీనామభిభవాభిధానే కేవలం క్లేశయిష్యతి వాచమాత్మనః. పునరనక్షరమపి శూర్పణఖాముఖమావేదయిష్యతి దశకంధరస్య.

జాంబవాన్ :- (సస్మితమ్) శ్రీవణే, లఘూత్థమనర్థముత్ప్రేక్ష్య ప్రముగ్ధోఽస్మి.

---

తదితి :- (సహర్షహాసమ్ = ఆనందముతో నవ్వుచు), వాలి = వాలికి సాహాయక = సహాయకులుగా, ఉపస్థాయినః = అటకు వచ్చినవారైన, తే అపి = ఆ ఖరాదులుకూడ, విరాధ = విరాధునియొక్క, యాత్రా = ప్రయాణముతో, ప్రహతమ్= నలిగిన, అధ్వానమ్ = దారినే, అనుప్రపన్నాః కిమ్ = అనుసరించిరాయేమి!

అథకిమ్ = అవును.

శ్రవణేఇతి :- శ్రవణే = ఓ శబరీ! ఇదానీమ్ = ఇప్పుడు, రామరావణయోః = రామ రావణులయొక్క, వైరమ్ = శత్రుత్వము, ప్రరూఢమ్ = గట్టిపడినది.

ఆర్యేతి :- (హాసస్తి = నవ్వుచు) ఆర్య! ఖరదూషణప్రభృతీనామ్ = ఖరదూషణాదులయొక్క, అభిభవ అభిధానే = మరణవార్త చెప్పుటయందు, (శూర్పణఖ) కేవలమ్ = కేవలము, ఆత్మనః = తనయొక్క, వాచమ్ = వాక్కును, క్లేశయిష్యతి = శ్రమపెట్టును, మన్యే = అని భావించుచున్నాను. పునః=కానీ, అనక్షరమ్ అపి = అక్షరములు లేకుండగనే (వాక్కులతో పనిలేకుండ). శూర్పణఖాముఖమ్ = శూర్పణఖయొక్క ముఖము, దశకంధరస్య = రావణునికి, ఆవేదయిష్యతి = సమస్తమును తెలియపరచును. కావున శూర్పణఖ వాక్కును శ్రమపెట్టదనుట.

లఘ్వితి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) శ్రవణా! లఘూత్థమ్ =

ఐక్ష్వాకేణ పురాపి కౌశికమఖాదారభ్య లంకేశ్వరో
ధత్తే శాశ్వతికం విరోధమధునా త్వేతే హతా బాంధవాః ।
ఉత్సాహప్రభుమంత్రశక్తిభి రలంభూష్ణుశ్ఛలజ్ఞో బలీ
దృప్తః శూర్పణఖానికారమపరం దృష్ట్వా కథం మృష్యతే॥ 5

---

త్వరలో రాబోవుచున్న. అనర్థమ్ = అనిష్టమును. ఉత్ప్రేక్ష్య = ఊహించి. ప్రముగ్ధః అస్మి = ఏమియు తోచనివాడనైతిని.

ఐక్ష్వాకేణేతి :- పురా అపి = ఇంతకుముందుకూడ. కౌశికమఖాత్ ఆరభ్య = విశ్వామిత్రుని యాగమునాటినుండియు. లంకేశ్వరః = రావణుడు. ఐక్ష్వాకేణ = రామునితో. శాశ్వతికమ్ = శాశ్వతమైన. విరోధమ్ = శత్రుత్వమును. ధత్తే = వహించి యున్నాడు. అధునా తు = ఇప్పుడేమో, ఏతే = ఈ. బాంధవాః = బంధువులైన ఖర దూషణాదులు. హతాః = రామునిచే సంహరింపబడిరి. ఉత్సాహ ప్రభుమంత్రశక్తిభిః = ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి — అను ఈ మూడుశక్తులచే, అలంభూష్ణుః = సమర్థుడును, ఛలజ్ఞః = మోసగించుట తెలిసినవాడును. బలీ = బలవంతుడును. దృప్తః = గర్వించినవాడును అయిన రావణుడును, అపరమ్ = మరియొకటియగు. శూర్పణఖా నికారమ్ = శూర్పణఖకు జరిగిన అవమానమును. దృష్ట్వా = చూచి. కథమ్ మృష్యతే = ఎట్లు సహించును ? (శార్దూలము)

తాత్పర్యము :- విశ్వామిత్రయాగ సంరక్షణము నాటినుండి రామునిపై రావణుడు కినుక వహించియున్నాడు. ఇప్పుడు అతని బంధువులను నిహతులైరి, ఇక శాశ్వత శత్రుత్వమును వహించును. ఉత్సాహ ప్రభుమంత్రశక్తులు మూడును కలిగి మాయతెరిగి బలశాలియైన రావణుడు శూర్పణఖకు జరిగిన ఈ అవమానమును సహించునా.

సమాసములు :- కౌశికస్య మఖః - తస్మాత్. లంకాయాః ఈశ్వరః । ఉత్సాహశ్చ ప్రభుశ్చ మంత్రశ్చ - ఉత్సాహ ప్రభు మంత్రాఖ్యాః, శక్తయః-తాభిః ఛలం జానాతి, శూర్పణఖాయాః నికారమ్, అలంభూష్ణుః - భువశ్చేతి గ్స్నుః .

సంధులు :- లంకా + ఈశ్వరః — గుణసంధి. లంకేశ్వరః + ధత్తే. ఛలజ్ఞః + బలీ - ఉత్వాదేశవిసర్గ. తు + ఏతే - యణాదేశ. హతాః + బాంధవాః విసర్గలోప. శక్తిభిః + అలమ్ — రేఫాదేశవిసర్గ. అలంభూష్ణుః + ఛల - శాదేశవిసర్గ.

శనైః శనైరనయోర్విరోధే సంధుక్షమాణే తుల్యవ్యసనస్థో దాశరథి రసహాయః సూర్యసూనునా సంధాతుమీషత్కరః స్యాత్.

శ్రీవణా :- ఆర్య. కిమిదానీమనుష్ఠేయమస్తి. మమ హి శిష్యపుత్రో నిషాదచక్రవర్తీ గుహో లక్ష్మణమిత్రమ్. అనేన సోపానేన సుఖాధిరోహో రఘుపతి రస్మాకమ్.

జాంబవాన్ :- (సహర్షస్మితమ్) శ్రీవణే, యద్యసి సుగ్రీవపక్షపాతినీ తద్గచ్ఛ సత్వరముపస్థాపయ నిషాదరాజమ్.

(ఇతి శ్రీవణా నిష్క్రాంతా)

---

క్రియ:- డుధాఞ్ ధారణపోషణయోః. ఆత్మనే, లట్, ప్రథమ.

ధత్తే – దధాతే – దధతే

మృషఞ్ తితిక్షాయామ్. ఆత్మనే (శ్యన్), ప్రథమ, లట్

మృష్యతే – మృష్యేతే – మృష్యన్తే

శనైరితి:- శనైః శనైః = మెల్లమెల్లగా. అనయోః = వీరిరువురికి. విరోధే = శత్రుత్వము, సంధుక్షమాణే = రాజుకొనుచుండగా (ఎగసన్రదోయబడుట). తుల్యవ్యసనస్థః = సమానమగు కష్టదశ ననుభవించుచున్నవాడైన. దాశరథిః = రాముడు, అసహాయః = మరొకరి సహాయము లేనివాడై. సూర్యసూనునా = సుగ్రీవునితో, సంధాతుమ్ = ఒడంబడుటకు (కలుపుటకు). ఈషత్కరః స్యాత్ = సులభుడగును తేలికగా స్నేహము కలుపవచ్చుననుట.

ఆర్యేతి:- ఆర్యా! ఇదానీమ్ = ఇప్పుడు. అనుష్ఠేయమ్ = కర్తవ్యము చేత నేను అనుష్ఠింపవలసినది. కిమ్ అస్తి = ఏమున్నది? మమ = నాకు, శిష్యపుత్రః = శిష్యపుత్రుడును, నిషాదచక్రవర్తీ = ఆటవికుల ప్రభువైన. గుహః = గుహుడు. లక్ష్మణమిత్రమ్ = సౌమిత్రికి మిత్రుడు, అనేన = ఈ, సోపానేన = ఉపాయముతో (మెట్టు). రఘుపతిః = రాముడు. అస్మాకమ్ = మనకు. సుఖాధిరోహః = సులభగమ్యుడు – తేలికగా అతనిని కలిసికొని సంధి చేసికొన వచ్చుననుట.

శ్రవణఇతి:- (సహర్షస్మితమ్ = ఆనందముతో చిఱునవ్వుతో) ఓ శబరీ! సుగ్రీవపక్షపాతినీ = సుగ్రీవుని పక్షమునకు చెందినదానవు. యది అసి = అయితివేని–

(నేపథ్యే. ఏకతః)

భో భో లక్ష్మణ, వైశేషికకందలీపండితో జగద్విజయమానః పర్యటామి. క్వాసౌ రామః, తేన సహ వివదిష్యే.

(అన్యతః)

భోభో. పరివ్రాజక. కాలసర్పఖలీకార ఖర్జూలతా న ఖలు సుఖాకరీ వృశ్చిక మంత్ర తాంత్రికస్య.

---

అతనిపట్ల అభిమానముకలదేని అనుట. తత్ గచ్ఛ = ఇదే వదలుము, సత్వరమ్ = వెను వెంటనే, నిషాదరాజమ్ = గుహుని. ఉపస్థాపయ = ఇటకు కొనిరమ్ము. (ఇతి = అనుటతో, శ్రవణా = శబరి. నిష్క్రాంతా = నిష్క్రమించినది).

(నేపథ్యే = తెరలో. ఏకతః = ఒకవైపునుండి)

భో ఇతి:- భోభో లక్ష్మణ = ఓయోయీ ! లక్ష్మణా ! వైశేషిక కటంది పండితః = వైశేషిక దర్శనమునకు వ్యాఖ్యా గ్రంథమైన "కటంది" యందు పండితుడను (కందళీ అనియు దీనికి నామాంతరము, అది కొన్నిచోట్ల పాఠాంతరముగా నున్నది. ఈ వ్యాఖ్యను రావణుడు వ్రాసెనని ప్రసిద్ధి). జగద్విజయమానః = ప్రపంచమును జయించువాడనై - ఆయా పండితులను జయించుచుననుట. పర్యటామి = దేశములు తిరుగుచున్నాను. అసౌ రామః = సుప్రసిద్ధుడగు రాముడు. క్వ = ఎక్కడ ? తేన సహ = అతనితో, వివదిష్యే = వాదింతును. (వాసనోప - ఇత్యాదిచే ఆత్మనే పదము)

(అన్యతః = తెరలో మరొక వైపునుండి)

పరివ్రాజకేతి:- ఓయీ ! పరివ్రాజకా ! వృశ్చికమంత్ర తాంత్రికస్య = తేలుమంత్రము నేర్చినవానికి (వృశ్చికః శూకకీటౌషధి విశేషయోః - విశ్వః తాంత్రికో జ్ఞాత సిద్ధాంతః - అమరము), కాలసర్ప = మహాసర్పమునకు, ఖలీకార = ద్రోహము చేయవలెననునట్టి, ఖర్జూలతా = కండూతి-మహాసర్పమును జయింపవలెనన్న అభిలాషం న సుఖాకరీ ఖలు = సుఖప్రదము కాదు సుమా ! (సుఖ ప్రియాదానులోమ్యే - డాచ్)

కథమితి:- కథమ్ = ఎట్టా ! లక్ష్మణ పరివ్రాజకౌ = లక్ష్మణుడును పరివ్రాజకుడును, సంలపతః = సంభాషించుకొనుచున్నారా ! (సంలాపో భాషణమ్

జాంబవాన్ :- కథం లక్ష్మణపరివ్రాజకౌ సంలపతః. శృణోమి తావత్.

(ఇత్యవధత్తే)

(నేపథ్యే పునరేకతః)

ఆః లక్ష్మణ, సర్వవిద్రావణః ఖల్వహమ్. కో మయా జనితమానభంగో న పరాజీయతే.

(నేపథ్యే పునరన్యతః)

కిం భవాన్ రావణః ?

(జాంబవాన్సవిశేషమవదధాతి. నేపథ్యే పునరేకతః)

భో వాచో యుక్తిజ్ఞ, సర్వేషాం విద్రావణః ఖల్వహమితి సమస్య వ్యాహృత మన్యథాభిసంధాయ వాక్ఛలేన ప్రత్యవతిష్ఠమానో నిగృహీతోఽసి. తన్మ్రంచ మాం భిక్షో.

---

మిథః - అమరిమ) శృణోమి తావత్ = వినుదునుగాక । (ఇతి = అని, అవధత్తే = సావధానుడగును).

(నేపథ్యే = తెరలో, పునరేకతః = మరల మరొకవైపునుండి)

ఆఃఇతి;- ఆః లక్ష్మణ = ఓ సౌమిత్రీ ! అహమ్ = నేను, సర్వ + విద్రావణః ఖలు = సర్వవిజేతను సుమా । (సర్వవిత్ = సర్వజ్ఞుడనైన, రావణః = రావణుడను — అనియు). మయా = నాచేత, జనితమానభంగః = చేయబడిన మానభంగము కలవాడై, కః = ఎవడు, న పరాజీయతే = పరాజితుడగుట లేదు! -అందరును పరాజితులగుచున్నారనుట.

(నేపథ్యే = తెరలో, పునరన్యతః = మరల మరొకవైపునుండి)

కిమితి:- కిమ్ = ఏమీ ! భవాన్ = నీవు, రావణః = రావణుడవా !

(జాంబవాన్ = జాంబవంతుడు, సవిశేషమ్ = మిక్కిలి ఏకాగ్రతతో, అవదధాతి = వినును)

(నేపథ్యే = తెరలో, పునరేకతః = మరల మరొకవైపునుండి)

భోఇతి;- భో = ఓయీ! వాచః = వాక్కులయొక్క, యుక్తిజ్ఞ = యుక్తినెరిగినవాడా ! (యుక్తిప్రత్యుక్తులను వాచోయుక్తిః అందరు - వాగ్విశ్వశ్యదోషి

(అన్యతః)

కిం త్వయా. కింతరాం చ రావణేన. అహమప్యుత్సుకోఽస్మి.
త్వరితం గచ్ఛామి.

జాంబవాన్ :- కథమేతదస్ఫుటార్థమేవ నిర్వహణమ్. మన్యే పునరేష పరివ్రాజకచ్ఛలేన రావణ ఏవ కోహాదుత్తరమప్యుపలభ్య స్వాం నామ ద్రాగపక్రాన్తః. * (సర్వతో నిరూప్య) అయే. పురాణప్రియసుహృదస్మాకం దక్షిణస్యాం దిశి పరాపతన్ జటాయురివ లక్ష్యతే. తదేనమనుపాలయామి తావత్. దూరదృష్టో హి గృధ్రాః. కదాచిదేష లంకాద్వీపవృత్తాన్తమప్యుపలభేత.

---

యుక్తి దండహారేషు అని అలుక్) గూఢార్థముతో ఒక వాక్యమును పల్కి. (ప్రత్యర్థి గ్రహించిన అర్థమును కాదని మఱొక పద విభాగముతో మఱొక యర్థమును చెప్పి ప్రత్యర్థి ; నిగృహీతుడవై ఉన్నట్టి వాచోయుక్తి, సర్వేషామ్ = అందరికిని, అహమ్ = నేను, విద్రావణః ఖలు = విజేతను సుమా. ఇతి = అని. సమస్య = సమాసముచేసి. వ్యాహృతమ్ = చెప్పినమాటను, అన్యథా = మఱొక రకముగా, అభిసంధాయ = అర్థముచేసికొని, వాక్ఛలేన = మాటలోని వక్రతతో, ప్రత్యవతిష్ఠమానః = సమాధానము చెప్పినవాడవై, నిగృహీతః అసి = ఓడింపబడితివి, తత్ = అందుచేత, మామ్ = నన్ను, భిక్షాయై = భిక్షకొఱకు, ముంచ = విడువుము - నన్ను పోనిమ్మనుట.

(అన్యతః = మఱొకవైపునుండి)

కిమితి:- కిమ్ త్వయా = నీతోనేమి (పని) ; కింతరామ్ చ రావణేన = రావణునితో మాత్రము మఱేమి (పని) ; అహమ్ అపి = నేనుకూడ, ఉత్సుకః అస్మి = ఉత్సుకుడనై యుంటిని. త్వరితమ్ = త్వరగా, గచ్ఛామి = పోవుదును.

కథమితి:- కథమ్ = ఎట్టూ ; ఏతత్ = ఈ, నిర్వహణమ్ = (సంభాషణ యొక్క) ఉపసంహారము (ఉపక్రాంతస్య సంహారో భవేన్నిర్వహణం త్విదమ్-ఇతి) అస్ఫుటార్థమ్ ఏవ = అస్పష్టముగానే ఉండిపోయినది ; పునః = కానీ, ఏషః =

---

* క్రమణా నిష్క్రాంతా అన్నచోటినుండి ద్రాగపక్రాంతః అన్నంతవరకు గల భాగము కొన్ని ప్రతులలో లేదు.

(ప్రవిశ్య)

జటాయుః :- ప్రాప్తైవేయమస్మాభిః పంచవటీ. యదమూర్గోదావరీ తరంగ సీకరసేక సుకుమారమాంసల పరిసరారణ్యమాలినో జనస్థాన సీమానః. అపిచ —

దృశ్యన్తే మధుమత్త కోకిల వధూనిర్ధూత చూతాంకుర
ప్రాగ్భార ప్రసరత్పరాగ సికతాదుర్గాస్తటీ భూమయః ।

---

ఈతడు. పరివ్రాజకచ్ఛలేన = పరివ్రాజకుడు అను వేషముతో. రావణః ఏవ = రావణుడే అని, మన్యే = భావించుచున్నాను. కోపాత్ = కోపమున. ఉక్తమ్ = పైకిచెప్పిన. స్వమ్ నామ అపి = తన పేరునే. అపలప్య = కప్పిపుచ్చి. ద్రాక్ అపక్రాంతః = త్వరత్వరగా జారుకొన్నాడు. (సర్వతః = అన్నివైపులకును నిరూప్య = చూచి) అయే = అరే, అస్మాకమ్ = మాకు, పురాణప్రియ సుహృత్ = ప్రాచీనకాలమునుండియు ప్రియమిత్రుడు. దక్షిణస్యాః దిశః = దక్షిణ దిక్కునుండి పరాపతన్ = వచ్చుచు నీతడు, జటాయుః ఇవ = జటాయువువలె, లక్ష్యతే = కనబడుచున్నాడే ! ఏనమ్ = ఈతనిని. అనుపాలయామి తావత్ = ప్రతీక్షింతును గాక ! గృధ్రాః = గృధ్రములు, దూరదృశః హి = సుదూరము వ్యాపించు చూపు కలవిగదా ! కదాచిత్ = ఒకవేళ. ఏషః = ఈతడు. లంకాద్వీపవృత్తాంతమ్ అపి = లంకాద్వీపము నందలి వార్తనుగూడ, ఉపలభేత = అందింపగలడు.

(ప్రవిశ్య = ప్రవేశించి)

ప్రాప్తేతి :- అస్మాభిః మాచేత, ఇయమ్ = ఇదే, పంచవటీ = పంచవటి, ప్రాప్తా ఏవ = పొందబడినది - పంచవటిని సమీపించనే సమీపించితిమనుట. అమూః = ఇవే, గోదావరీ = గౌతమియొక్క, తరంగ = కెరటములనుండి యెగసిన సీకర = తుంపురులచేతనైన, సేక = సేచనముతో, సుకుమార = కోమలములై, మాంసల = దట్టముగా పెరిగిన, పరిసరారణ్యమాలిన్యః = పరిసరాటవీ సమూహముకలవైన. జనస్థానసీమానః = దండకారణ్య ప్రాంతములు. అపిచ = మరియు.

దృశ్యన్తఇతి :- మధు = మకరందముచే (వసంతాగమనముచేత). మత్త = మదించిన, కోకిలవధూ = కోకిలాంగనలచే, నిర్ధూత = ఎగురగొట్టబడిన.

యాః కృచ్ఛ్రాదతిలంఘ్య లుబ్ధకభయాత్తైరేవ రేణూత్కరై-
ర్ధారావాహిభిరస్తి లుప్తపదవీనిశ్శంక మేణీకులమ్ ॥ 6

---

చూతాంకుర = మావిపూతయొక్క. ప్రాగ్భార = విస్తారమునుండి - పూవుల గుంపు నుండి యనుట. ప్రసరత్ = వచ్చిపడుచున్న, పరాగ = పుప్పొడి యనునట్టి. సికతా = ఇసుకతో, దుర్గాః = దుష్ప్రవేశ్యములై, తటీభూమయః = పరిసర ప్రదేశములు. దృశ్యంతే = కన్పించుచున్నవి. యాః = అట్టి తటీభూములను. కృచ్ఛ్రాత్ = అతికష్టము మీద, అతిలంఘ్య = దాటి, ఏణీకులమ్ = లేడిగుంపు. లుబ్ధకభయాత్ = వేటగాని భయమువలన శంకించునదయ్యెను. ధారావాహిభిః = ఎడతెగక రాలుచున్న తైః = ఆ, రేణూత్కరైః ఏవ = పుప్పొడులతోనే. లుప్తపదవీ నిశ్శంకమ్ = కప్పి వేయబడిన అడుగుజాడలు కలిగి నిశ్శంకముగా, అస్తి = ఉన్నది - సంచరించుచున్నది. (శార్దూలము)

తాత్పర్యము :- కోకిలాంగనలు ఎగురగొట్టిన మావిపుప్పొడి దట్టముగా వ్యాపించి గౌతమీ తీరభూములు దుర్గమములుగా నున్నవి. వానిమీదుగా నడచివచ్చిన లేడిగుంపు తమ అడుగుజాడలవెంట వేటగాడు వచ్చునేమో అను శంకను విడిచి హాయిగా సంచరించుచున్నవి - కారణమేమనగా - నిరంతరముగా రాలుచున్న పుప్పొడి ఆ అడుగుజాడలను ఎప్పటికప్పుడు కప్పివేయుచున్నది.

సమాసములు:- మధుమత్తాశ్చ తాః కోకిలవధ్వః - మధుమత్తకోకిలవధ్వః - తాభిః నిర్ధూతః - చూతాంకురాణాం ప్రాగ్భారః. నిర్ధూతశ్చాసౌ ప్రాగ్భారశ్చ - ప్రాగ్భారాత్ ప్రసరం తశ్చ తే పరాగాశ్చ - పరాగా ఏవ సికతా-సికతాభిః దుర్గాః లుబ్ధకాత్ భయమ్-తస్మాత్. రేణూనా ముత్కరాః-తైః. లుప్తా చ సా పదవీ చ - పదవ్యా నిశ్శంకం యథా భవతి తథా. ఏణీనాం కులమ్.

సంధులు:- చూత + అంకుర, రేణు + ఉత్కర - సవర్ణదీర్ఘ, దుర్గాః + తటీ-సాదేశవిసర్గ తైః + ఏవ, ఉత్కరైః + ధారావాహిభిః + అస్తి - రేఫాదేశవిసర్గ.

క్రియ:- దృశిర్ ప్రేక్షణే. కర్మణి. ఆత్మనే. లట్. ప్రథమ

దృశ్యతే - దృశ్యేతే - దృశ్యన్తే

అస భువి, పరస్మై. లట్. ప్రథమ

అస్తి - స్తః - సన్తి

జాంబవాన్ :- (కించిదుపసృత్య) కుతః పునరియతా వేగేన వయస్యో జటాయుః.

జటాయుః :- (దృష్ట్వా) కథం జాంబవాన్। సఖే, క్షమస్వ. న సభాజయిష్యామి తావద్భవంతమ్. మయా హి మలయాచలకులాయాదార్యసంపాతి పాదానభివాద్య నివర్తమానేన మారీచ సహచరః సంచరన్నిమామరణ్యానీ మభిలక్షితో రాక్షసరాజః. తదతివిషమమాశంకమానం మాం వత్సరామభద్ర స్నేహ స్త్వరయతి.

---

కుత ఇతి:- (కించిత్ ఉపసృత్య = కొంచెము సమీపించి) వయస్యః = మిత్రుడైన, జటాయుః = జటాయువు, ఇయతా వేగేన = ఇంతటి వేగముతో, కుతః పునః = ఎక్కడినుండి వచ్చుచున్నాడు చెపుమా ।

కథమితి - (దృష్ట్వా = చూచి) కథమ్ = ఎట్టూ । జాంబవాన్ = జాంబవంతుడా । సఖే = మిత్రమా । క్షమస్వ = క్షమింపుము. భవంతమ్ = నిన్ను, న సభాజయిష్యామి తావత్ = ప్రస్తుతము (ఆగి నమస్కరించలేను) సంభాషణాదికముతో సత్కరించలేను. హి = ఎందువల్లననగా, మలయాచల కులాయాత్ = మలయ పర్వతముమీది గూటినుండి, ఆర్యసంపాతి పాదాన్ = మా అన్నగారగు సంపాతి యొక్క పాదములను మ్రొక్కి, నివర్తమానేన = తిరిగి వచ్చుచున్న, మయా = నాచేత. మారీచ సహచరః = మారీచునితో కలిసి, ఇమామ్ = ఈ, అరణ్యానీమ్ = గాఢారణ్యమును, సంచరన్ = సంచరించుచున్నవాడైన, రాక్షసరాజః = రావణాసురుడు, లక్షితః = చూడబడినాడు — ఇట సంచరించుచున్న మారీచ రావణులను చూచితిననుట. (సభాజం ప్రీతి సేవనయోః: మహారణ్య మరణ్యానీ—అమరః — హిమారణ్యయో రానుక్). తత్ = అందుచేత. అతి విషమమ్ = ఏదో అనిష్టమును, ఆశంకమానమ్= ఆశంకించుచున్న, మామ్ = నన్ను. వత్సరామభద్ర స్నేహః = చిరంజీవి రామచంద్రునిపై గల స్నేహము, త్వరయతి = తొందరించుచున్నది — త్వరగానేగి రామభద్రునికి ఈ విషయమును తెలియపరచవలెననుట.

జాంబవాన్ :- (స్వగతమ్) వయమప్యేతదేవ ప్రతిపిత్సామహే.
(ప్రకాశమ్) సఖే. త్వరస్వ. (ఇతి నిష్క్రాంతౌ)

జటాయుః :- (పరిక్రమ్య, అవలోక్య చ) ఇయమగ్రే పంచవటీ.
(సవితర్కమ్)

నీతో దూరం కనకహరిణశ్రద్ధయా రామభద్రః
పశ్చాదేనం ద్రుతముపసరత్యేష వత్సః కనిష్ఠః ।

---

వయమితి:- (స్వగతమ్ = తనలో) వయమ్ అపి = మేమును. ఏతత్ ఏవ = ఇదే, ప్రతిపిత్సామహే = తెలిసికొనగోరుచున్నాము. (ప్రకాశముగా) సఖే = మిత్రమా !, త్వరస్వ = త్వరపడుము. (ఇతి = అని. నిష్క్రాంతౌ = నిష్క్రమించును).

నీతఇతి:- (పరిక్రమ్య = ముందునకు నడచి. అవలోక్య చ = చూచి) ఇయమ్ = ఇదే, అగ్రే = ఎట్టఎదుట, పంచవటీ = పంచవటి. (సవితర్కమ్ = సవివరముగా) కనకహారిణ శ్రద్ధయా = బంగారులేడిపై గల అభిలాషచే, రామభద్రః = రామచంద్రుడు, దూరమ్ నీతః = సుదూరము కొనిపోబడినాడు. పశ్చాత్ = వెనువెంటనే. ఏనమ్ = ఈ రాముని, ద్రుతమ్ = సత్వరముగా, ఏషః = ఈ, వత్సః = చిరంజీవి, కనిష్ఠః = చిన్నవాడగు లక్ష్మణుడు, ఉపసరతి = సమీపించుచున్నాడు. తతః = అటుపైని. భిక్షుః = ఒక భిక్షువు, పర్ణశాలామ్ = పంచవటిని. చకితమ్ చకితమ్ ప్రవిశతి = భయపడుచు భయపడుచు ప్రవేశించుచున్నాడు. ధిక్ భోః కష్టమ్ = అయ్యో! అయ్యో ! కష్టము కష్టము ! (ధిక్కష్టం భోశ్చాపి ఖేదేఽభిహితః). అయమ్ = ఈ. రావణః = రావణుడు, నిజామ్ = తనయొక్క, ఆకృతిమ్ = అసలు రూపమును, ప్రథయతి = ప్రకటించుచున్నాడు. (మందాక్రాంతము)

తాత్పర్యము:- బంగారు లేడిని వెంబడించి రాముడు సుదూరమేగెను. సౌమిత్రి యాతనిని అనుసరించి సమీపించుచున్నాడు. ఇదే ఒక భిక్షువు భయపడుచు పడుచు పర్ణశాలలోనికి ప్రవేశించుచున్నాడు. అయ్యయ్యో ! భిక్షు వేషమును వీడి రావణుడే అయినాడు. (కనకహరిణచ్ఛద్మనా – అని పాఠాంతరము – పంక్తిలోననుట.)

దిష్ట్యద్య ప్రవిశతి తతః పర్ణశాలాం చ భిక్షుః
ధిక్ కష్టం భోః ప్రథయతి నిజామాకృతిం రావణోఽయమ్ ॥ 7

అహాహా !

ఆర్యపుత్రార్యపుత్రేతి రుదంతీం కురరీమివ ।
రథమారోప్య వైదేహీమేష పాపః క్వ యాస్యతి ॥ 8

---

సంధులు :- సీతః + దూరమ్ - ఉత్వాదేశ విసర్గ. అనుసరతి + ఏషః - యణాదేశ. ఏషః + వత్సః - తదేతద్విసర్గలోప. భిక్షుః + ధిక్ - రేఫాదేశ విసర్గ. రావణః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - రావణో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- సృ గతౌ. పరస్మై, లట్, ప్రథమ.

సరతి - సరతః - సరన్తి

విశ ప్రవేశనే, పరస్మై. లట్. ప్రథమ. (ప్ర)

ప్రవిశతి - ప్రవిశతః - ప్రవిశన్తి

ప్రథ ప్రఖ్యానే (ణిచ్), పరస్మై, లట్, ప్రథమ

ప్రథయతి - ప్రథయతః - ప్రథయన్తి

ఆర్యపుత్రేతి :- అహాహా ! ఆర్యపుత్ర ఆర్యపుత్ర ఇతి = ఆర్యపుత్రా ! ఆర్యపుత్రా ! అని. కురరీమ్ ఇవ = కురరివలె (ఆడుగొఱ్ఱె). రుదంతీమ్ = దుఃఖించుచున్న, వైదేహీమ్ = సీతను, రథమ్ ఆరోప్య = రథముపై వేసికొని, ఏషః = ఈః, పాపః = దుష్టుడు, క్వ యాస్యతి = ఎటకు పోవునో ! [పథ్యావక్త్రము]

తాత్పర్యము :- ఆర్యపుత్రా ఆర్యపుత్రా అనుచు కురరివలె దుఃఖించుచున్న సీతను రథముపై రెక్కించుకొని ఈః దుష్టరావణుడు ఎక్కడికి తీసికొని పోవుచున్నాడో కదా ! (ఆర్యపుత్రేతి సంబోధ్యః పతిః పత్నీజనేన తు - భరతః).

సంధులు :- ఆర్యపుత్ర + ఆర్యపుత్ర - సవర్ణదీర్ఘ. పుత్ర + ఇతి - గుణసంధి, ఏషః + పాపః - తదేతద్విసర్గలోప.

క్రియ :- యా ప్రాపణే, పరస్మై, లృట్, ప్రథమ

యాస్యతి - యాస్యతః - యాస్యన్తి

(సాటోపం పరిక్రామన్) అరేరే రావణ,

వధూటీమిక్ష్వాకోర్నిజకరతల స్పర్శమలినా
మిమాం కుర్వాణస్య స్ఫురతి హృది శోభైవ భవతః ।
కులే యేషాం కిం తు త్వమసి గణితాస్తేఽపి గురవో
న సప్త బ్రహ్మాణః కథమివ పులస్త్యప్రభృతయః ॥ 9

---

వధూటీమితి :- (సాటోపమ్ = వేగముగా. పరిక్రామన్ = ముందున కురుకుచు) అరేరే ! రావణా ! ఇక్ష్వాకోః = ఇక్ష్వాకు వంశమునకు. వధూటీమ్ = కోడలైన, ఇమామ్ = ఈ సీతను, (వధూటీ వధ్వటీ జనే - అమరః). నిజ = స్వీయము. [నీ యొక్క] కరతల = హస్తాగ్రముయొక్క, స్పర్శ = స్పర్శతో, మలినామ్ కుర్వాణస్య = మైలపరచుచున్న, భవతః = నీ యొక్క, హృది = హృదయమునందు, శోభా ఏవ = ఆనందమే, స్ఫురతి = ప్రకాశించుచున్నది - సిగ్గుపడవైతివనుట. కిన్తు = కానీ, యేషామ్ = ఎవరియొక్క, కులే = వంశమునందు, త్వమ్ అసి = నీవు జన్మించితివో, తే = ఆ, గురవః = పెద్దలు, పులస్త్య ప్రభృతయః = పులస్త్యుడు మున్నగువారు, సప్తబ్రహ్మాణః = ఏడుగురు బ్రహ్మమానస పుత్రులు, కథమ్ = ఎట్లు, న గణితాః = నీచే పరిగణింపబడరైరో ! వారి గొప్పదనమును చూచియైనను నీ విట్టి పాడుపని చేయరాదు అనుట [శిఖరిణి].

సమాసములు :- నిజశ్చాసౌ కరశ్చ - నిజకరస్య తలమ్. నిజకరతలస్య స్పర్శః - స్పర్శేన మలినా - తామ్. సప్త చ తే బ్రహ్మాణశ్చ.

విశేషములు :- మరీచి మత్ర్యంగిరసౌ పులస్త్యం పులహం క్రతుం వసిష్ఠం చ మహాతేజాస్సోఽసృజత్సప్త మానసాన్ - ఈ ఏడుగురు బ్రహ్మ మానస పుత్రులు.

సంధులు :- ఇక్ష్వాకోః + నిజ - రేఫాదేశవిసర్గ. శోభా + ఏవ - వృద్ధి. గణితాః + తే - సాదేశవిసర్గ. తే + అపి - పూర్వరూప. గురవః + న - ఉత్వాదేశ విసర్గ.

క్రియ :- స్ఫుర స్ఫురణే సంచరణే చ. పరస్మై. లట్. ప్రథమ

స్ఫురతి - స్ఫురతః - స్ఫురన్తి

(పునరాకాశే) అలీకాట్టహాస ధూమధూసరిత దశవక్త్రవల్మీక, కిమాత్థరే రాక్షసాపసద, కిమాత్థ ।

జగద్విలోభి సీతాఖ్యమామిషం హరతో మమ ।
అయం కిల జరద్గృధ్రః కరాదాచ్ఛిద్య నేష్యతి ॥-ఇతి.

అః పాప, కథమేవ మభిదధాసి తిష్ఠ తిష్ఠ.
భుజవిటపమదేన వ్యర్థమంధంభవిష్ణు

---

అలీకేతి :- [పునః ఆకాశే = మరల ఆకాశమునందు దృష్టి నిల్పి] అలీక + అట్ట హాస = వ్యర్థాట్టహాసము అనునట్టి, ధూమ = పొగతో. ధూసరిత = పొగ బారిన, దశవక్త్ర = పదినోళ్ళుగల, వల్మీక = పాముపుట్టా ? రాక్షసాపసద = రాక్షసాధమా ! కిమ్ ఆత్థ రే కిమ్ ఆత్థ = ఏమంటివిరా ! ఏమంటివి !

జగదితి :- జగత్ = ప్రపంచమునకు, విలోభి = లోభము పుట్టించునదగు [అందరును ఆశించునదనుట]. సీతాఖ్యమ్ = జానకి యనునట్టి, ఆమిషమ్=మాంసమును లేదా భోగ్యవస్తువును [ఉత్కోచే పలలే భోగే భోగ్యవస్తుని చామిషమ్ - విశ్వః]. హరతః = అపహరించుచున్న, మమ = నా యొక్క, కరాత్ = చేతినుండి, అయమ్ = ఈ, జరత్ + గృధ్రః = ముదుసలి గ్రద్ద, ఆచ్ఛిద్య = లాగికొని, నేష్యతి కిల = తీసికొని పోవునా ! -తన్నుకు పోవును కాబోలు అని ఎకసక్కెము- ఇతి = అనుచుంటివా ! [పథ్యావక్త్రము].

తాత్పర్యము :- ముల్లోకములను మోహింపజేయునట్టి సీత యను మాంసమును నా చేతి నుండి ఈ ముసలి గ్రద్ద తన్నుకొనిపోవును గాబోలు !

సంధులు :- హరతః + మమ - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- ణీఞ్ ప్రాపణే, లృట్, పరస్మై, ప్రథమ .
నేష్యతి - నేష్యతః - నేష్యన్తి

భుజేతి :- అః పాప = ఓరీ పాపాత్ముడా ! ఏవమ్ = ఇట్లు, కథమ్ అభిదధాసి = ఎట్లు పలుకగలుగుచున్నావు ! తిష్ఠ తిష్ఠ = నిలునిలుము; భుజ = బాహువులనునట్టి, విటప = శాఖలచేతైన, మదేన = గర్వముతో, వ్యర్థమ్ = వృథాగా, అంధం

ర్ధిగపసరసి చౌరంకారమాక్రుశ్యమానః ।
త్వదురసి విదధాతు స్వామపస్కారకేళిం
కుటిలకరజకోటిక్రూరకర్మా జటాయుః ॥ 11

(ఇతి నిష్క్రాన్తౌ)

—: విష్కమ్భకః :—

భవిష్ణుః = అంధుడవగుచు. ధిక్ = ఛీఛీ. ఆక్రుశ్యమానః = నిందింపబడుచు, చౌరంకారమ్ = చౌర్యము చేసినవానివలె [కర్మణ్యాక్రోశే కృఞః ఖముఞ్]. అపసరసి = పారిపోవుచుంటివి. కుటిల = వక్రములైన. కరజకోటి = నఖాగ్రములతో. క్రూరకర్మా = దారుణమాచరింపగలవాడగు. జటాయుః = ఈ జటాయువు. త్వత్ ఉరసి = నీ వక్షః స్థలమునందు. స్వామ్ = తన యొక్క, అపస్కారకేళిమ్ = నఖవిలేఖన క్రీడను, విదధాతు = నిర్వహించుగాక ! [మాలినీ].

తాత్పర్యము :— భుజ గర్వముచే అంధుడవై నింద్యుడవై దొంగవలె పారిపోవుచుంటివి నీ వక్షః స్థలముపై నా వాడిగోళ్ళు అపస్కారకేళిని జరుపుగాక !

సమాసములు :— భుజా ఏవ విటపాః — భుజవిటపానాం మదేన — అనంధః అంధో భవతీతి — అంధం భవిష్ణుః [భువశ్చ ... ఇతి ఖిష్ణుచ్]. చోరశబ్దముచ్చార్య — చోరం కారం — చౌరంకారమ్ [కర్మణ్యాక్రోశే కృఞః ఖముఞ్]. తవ ఉరసి. అపస్కార ఇతి కేళిః — [అపాచ్చతుష్పాదిత్యాదినా సుట్] లాన్. కుటిలాశ్చ తే కరజాశ్చ — కరజానాం కోటిభిః క్రూరం కర్మ యస్య సః.

క్రియ :— సృ గతౌ, పరస్మై, లట్, [అప] మధ్యమ
అపసరసి — అపసరథః — అపసరథ
డు ధాఞ్ ధారణపోషణయోః, పరస్మై, లోట్, ప్రథమ.
దధాతు/ధత్తాత్ — ధత్తామ్ — దధతు

[ఇతి = అని. నిష్క్రాంతౌ = ఇరువురును నిష్క్రమింతురు]

—: ఇతి విష్కంభము :—

(తతః ప్రవిశతి లక్ష్మణః)

లక్ష్మణః :—అహో, దుర్నివారదారుణక్రోధశోకలజ్జాగహనో విషమోఽయం దశావివర్తః. యస్మిన్నితికర్తవ్యతాభిధాన మప్యస్మాకమనౌపయికమ్. తథాహి —

తత్తాదృగ్దశకంఠవంచనరుషా ధూమాయమానో గిరం
నార్ధోక్త ప్రవిలీనవర్ణవిధురామార్యః సమాప్నోతి మే ।
చాపే తాతజటాయుజీవితకథాపర్యంత ధూమాయిత
క్రోధోత్పీడ నిపీతశోకజడిమా దృష్టిస్తు విశ్రామ్యతి॥ 12

---

[తతః = అంతట. లక్ష్మణః = సౌమిత్రి. ప్రవిశతి = ప్రవేశించును]

అహో ఇతి :— అహో ! దుర్నివార = వారింపశక్యముగాని. దారుణ = భీషణమైన. క్రోధ = [శత్రువుపై] కోపము. శోక = [భార్యావియోగమున] దుఃఖము. లజ్జా = [భార్యను సంరక్షింపలేని] సిగ్గు — వీనితో. గహనః = గంభీరమై. అయమ్ = ఈ. దశావివర్తః = దశా పరిణామము (సుడిగుండము). విషమః = భయంకరము. యస్మిన్ = ఏయీ విషమ స్థితియందు. ఇతి కర్తవ్యతా + అభిధానమ్ అపి = ఇది కర్తవ్యము అని చెప్పుటయు. అస్మాకమ్ = మాకు. అనౌపయికమ్ = అయుక్తము. [యుక్తమౌపయికం లభ్యమ్ - అమరః]. తథాహి = అంతేకదా !

తత్తాదృగితి :— తత్తాదృక్ = అంతటిదగు. దశకంఠ = రావణుని యొక్క. వంచన = మోసముచేసైన. రుషా = కోపముతో. ధూమాయమానః = పొగలు గ్రక్కుచున్నవాడై. మే = నా యొక్క. ఆర్యః = అగ్రజుడు — రాముడు. అర్ధోక్త = అర్ధోక్తియందు. ప్రవిలీన = నిలిచిపోయిన. వర్ణ = అక్షరములతో. విధురామ్ = ఖండితమైన - సగములోనే ఆగిపోయిన. గిరమ్ = వాక్యమును. న సమాప్నోతి = పూర్తిచేయుటలేదు — అంతలో - తాత = పూజ్యుడయిన (తాతోఽనుకంప్యే జనకే - ధరణిః) జాలిపడవలసినవాడగు. జటాయు = జటాయువుయొక్క. జీవితకథా = జీవనముయొక్క. పర్యంత = అవసానముతో - సమాప్తితో. ధూమాయిత = పొగగా లేచిన (క్రోధాగ్ని నుండి అనుట). క్రోధ = కోపముయొక్క.

(నేపథ్యాభిముఖః) ఇత ఇత ఆర్య. మారీచమథన. దృశ్యన్తా
మమూరవాచీం కకుభమభివర్ధమానా విన్ధ్యవనవీథిభూమయః.

(ప్రవిశ్య)

---

ఉత్పీడ = అతిశయముచే. నిపీత = లోగొనబడిన [నిగ్రహింపగన అనుట]. శోక
జడిమా = దుఃఖశైత్యము [జడత్వము] నిలిచి - దుఃఖము వలని జడత్వమును విడిచి
యనుట. దృష్టిః = చూపు. చాపే = ధనుస్సునందు. వ్యాప్నోతి = వాలుచున్నది.
(శార్దూలము)

తాత్పర్యము :- దశకంఠుని మోహముతో క్రోధాగ్ని ప్రజ్వరిల్ల పొగలు
సెగలు గ్రక్కుచున్న రాముడు అర్ధోక్తిలో నిలిపివేసిన వాక్యమును పూరించుచున్నాను.
జటాయు మరణవార్తా శ్రవణముతో అతిశయించిన క్రోధము దుఃఖజడత్వమును వది
లింపగా ధనుస్సుపై దృష్టి నిలిపెను.

సమాసములు :- దశకంఠేన కృతం వంచనమ్ - తత్పురుషః. దశకంఠ
వంచనం చ - వంచనేన రుట్ - తయా. అర్ధముక్తమ్ - అర్ధోక్తే ప్రవిరలాః - ప్రవిరలాశ్చ.
తే వర్ణాశ్చ - వర్ణైః విధురా - తామ్.

సంధులు :- ధూమాయమానః + గిరమ్ - ఉత్వాదేశవిసర్గ. న + అర్ధ -
సవర్ణదీర్ఘ. అర్ధ + ఉక్త. క్రోధ + ఉత్పీడ - గుణసంధి. దృష్టిః + తు - సకారాదేశవిసర్గ.
క్రియ :- ఆప్ల వ్యాప్తౌ. పరస్మై. లట్. ప్రథమ [శప్]

ఆప్నోతి - ఆప్నుతః - ఆప్నువన్తి
శ్రము తపసి ఖేదే చ [శ్యన్ - శమాదీనాం ...] పరస్మై. లట్లు
శ్రామ్యతి - శ్రామ్యతః - శ్రామ్యన్తి

ఇతఇతి:- (నేపథ్యాభిముఖః = తెరవైపు చూచుచు). ఇతః ఇతః =
ఇటు. ఇటు. ఆర్య = అగ్రజా!. మారీచమథన = మారీచసంహారకా!. అవాచీమ్ కకు
భమ్ = దక్షిణదిక్కుగా. అభివర్ధమానాః = వ్యాపించుచున్న. అమూః = ఈ, విన్ధ్య
వనవీథి భూమయః = వింధ్యారణ్యప్రాంతములు, దృశ్యంతామ్ = వీక్షింపబడుగాక!.
ఇటు దయచేయుము, వీనిని చూచుమనుట.

(ప్రవిశ్య = రాముడు ప్రవేశించి)

రామః :- (ఆకాశే లక్ష్యం బద్ధ్వా)

కులే వా శౌర్యే వా భుజసముదయే వా తపసి వా
బభూవుర్న ప్రాంచ స్త్వమివ భవితారో న చరమే।
అహో దిఙ్మోహ స్తే సమజని చిరాదేష న ఖలు
ప్రవీరాణాం పంథా దశవదన యేనాసి చలితః॥ 13

---

కులేఇతి :- (ఆకాశే = ఆకాశమునందు, లక్ష్యం బద్ధ్వా = దృష్టినిలిపి) దశవదన = ఓ రావణా !, కులే వా = కులమునందుగాని, శౌర్యే వా = పరాక్రమము నందుగాని, భుజసముదయే వా = బాహుసమూహమునందుగాని (బాహుసంపదయందు గాని), తపసి వా = తపస్సునందుగాని, ప్రాంచః = పూర్వులు, త్వమ్ ఇవ = నీవలె, నబభూవుః = కారు - నీకు సాటిరారనుట, చరమే = ముందుముందు, న భవితారః = కాలేరు - భవిష్యత్తులోనేని నీకు సాటివారుండరనుట, అహో ! చిరాత్ = ఇంతకాలమునకిప్పుడు, తే = నీకు, ఏషః = ఈ, దిఙ్మోహః = దిగ్భ్రాంతి, సమజని = కలిగినది, యేన = ఏమార్గమునందు, చలితః అసి = నీవు పయనించుచున్నావో, ఏషః = ఇయ్యది, ప్రవీరాణామ్ = మహావీరులకు, న పంథా ఖలు = మార్గముకాదు సుమా ! (శిఖరిణి)

తాత్పర్యము :- కులము శౌర్యము బాహుసంపద తపస్సు మొదలగు వానిలో నీకు సాటివచ్చువారు అటు పూర్వులలో లేరు, భవిష్యత్తులో ఉండరు. కానీ ఇంతకాలమునకు నీకు ఈ వ్యామోహము పుట్టినది. నీవు అనుసరించు మార్గము మహావీరులకు తగినది కాదుసుమా !

సంధులు :- బభూవుః + న - రేఫాదేశవిసర్గ. ప్రాంచః + త్వమ్. మోహః + తే - సాదేశవిసర్గ. భవితారః + న - ఉత్వాదేశవిసర్గ. దిక్ + మోహః - అనునాసికాదేశ. ఏషః + న - ఏతత్తదోః సులోపః. యేన + అపి - సవర్ణదీర్ఘ.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై. లిట్, ప్రథమ.

బభూవ - బభూవతుః - బభూవుః

లుట్ - భవితా - భవితారౌ - భవితారః

జనీ ప్రాదుర్భావే, పరస్మై. లుఙ్, ప్రథమ

(విమృశ్య. సఖేదస్మితమ్) హంహో పౌలస్త్య,
సిద్ధశ్రోత్రపరంపరా పరిగతై రేభిః ప్రపౌత్రస్య తే
వృత్తైరద్య పులస్త్యవర్జమఖిలైః స్మేరేషు దేవర్షిషు ।
విష్వగ్వక్త్రతిరస్కృతా నమయితుం దుర్వారలజ్జాభర
మ్లానశ్రీస్తు చతుర్ముఖీ భగవతో ధాతుః కథం వర్తతే॥ 14

---

అజని – అజనిషాతామ్ – అజనిషత
అన ధువి. పరస్మై. లట్. మధ్యమ.
అసి – స్థః – స్థ

సిద్ధేతి :- (విమృశ్య = ఆలోచించి. సఖేదస్మితమ్ = దుఃఖముతోకూడిన నవ్వుతో) హంహో = ఓయీ!. పౌలస్త్య = రావణా!, ప్రపౌత్రస్య = (బ్రహ్మదేవునికి) మునిమనుమడవైన. తే = నీయొక్క. ఏభిః = ఇటువంటి. సిద్ధశ్రోత్రపరంపరాపరిగతైః - సిద్ధ = సిద్ధులయొక్క. శ్రోత్రపరంపరా = శ్రోత్రపరంపరతో (కర్ణాకర్ణికగా) పరిగతైః = తెలియవచ్చినవైన. వృత్తైః = నీ దుష్కృత్యములతో. పులస్త్యవర్జమ్ = పులస్త్యుడు తప్ప. దేవర్షిషు = తక్కిన దేవఋషులందరును. స్మేరేషు = (సభలో) నవ్వుచుండగా. దుర్వార = వారింపశక్యముగాని. లజ్జాభర = మనసిగ్గుతో. మ్లానశ్రీః = మాడిపోయిన శోభకలదై. విష్వగ్వక్త్రతిః = సర్వతోముఖ మగుటచే (నాలుగు వైపులను ముఖములుండుటచే). నమయితుమ్ = తలదించుకొనుటకు. అసంగతా = వీలుపడనిదై. భగవతః = భగవంతుడైన. ధాతుః = బ్రహ్మదేవునియొక్క (నీ ముత్తాతయొక్క). చతుర్ముఖీ = ముఖచతుష్టయము. అద్య = ఈనాడు. కథమ్ వర్తతే = ఎట్లుండునో! (శార్దూలము)

తాత్పర్యము :- బ్రహ్మదేవునికి మునిమనుమడవైన ఓ రావణా! నీ దుర్వృత్తములు సిద్ధచారణాదులచే కర్ణాకర్ణికగా విని పులస్త్యుడు తప్ప బ్రహ్మసభలోని మహర్షులందరును నవ్వగా చతుర్ముఖుని అవస్థ వర్ణనాతీతముగదా! సిగ్గుతో నల్లనారిన ముఖములను దాచుకోలేడాయె! ఒక ముఖమును దించుకొన్నచో మూడుముఖములు పైకుండును.

సమాసములు :- సిద్ధానాం శ్రోత్రపరంపరా - తత్పరంపరయా పరిగతైః. అపులస్త్యేన వర్జమ్. దేవశ్చాసౌ ఋషిశ్చ - దేవానామ్ ఋషిః - తేషు. లజ్జాయాః భరః.

(క్షణమనుధ్యాయ) హా ప్రియే విదేహరాజపుత్రి ! (ఇతి సంవరణం నాటయతి)

లక్ష్మణః :- (ఉపసృత్య) ఆర్య, కోఽయమభిషంగో నామ భవాదృశానప్యస్వస్థీకరోతి.

పతితే వ్యసనే దైవాద్దారుణే దారుణాత్మని ।
సంవర్మయతి వజ్రేణ ధైర్యం హి మహతాం మనః॥ 15

---

దుర్వారశ్చాసౌ లజ్జాభరశ్చ - భరేణ మ్లానా శ్రీరస్యాస్యాః సా. చతుర్ణాం ముఖానాం సమాహారః - ద్విగోరితి ఙీప్

సంధులు :- పరిగతైః + ఏభిః, వృత్తైః + అద్య, వృత్తిః + అసంగతా- రేఫాదేశవిసర్గ. దేవ + ఋషి - గుణసంధి. శ్రీః + తు - సాదేశవిసర్గ. భగవతః + ధాతుః - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- వృతుఙ్ వర్తనే, ఆత్మనే. లట్, ప్రథమ.

వర్తతే - వర్తేతే - వర్తన్తే

ప్రోక్తి :- (క్షణమ్ అనుధ్యాయ = క్షణకాలము ధ్యానించి) హా ప్రియే = హా ప్రియురాలా !, విదేహరాజపుత్రి = జనకరాజసుతా ! (ఇతి = అని, సంవరణమ్ = మూర్ఛను, నాటయతి = నటించును).

పతితే ఇతి:- (ఉపసృత్య = సమీపించి) ఆర్య = అగ్రజా ! కః అయమ్ = ఏమో యిది, అభిషంగః నామ = దుఃఖమన్నది, భవాదృశాన్ అపి = మీవంటివారినికూడ, అస్వస్థీకరోతి = అస్వస్థులను చేసికొనుచున్నది - మిమ్ము నలోటబడుచున్నది ఆశ్చర్యము. (అభిషంగో పరాభవే- విశ్వః). దారుణే = భీషణమైన, వ్యసనే = దుఃఖమునందు, దైవాత్ = దుర్దైవ వశమున, దారుణాత్మని = మహాత్ముడు, పతితే (సతి) = పడినవాడుకాగా, (దారుణో భీషణే గురౌ - శాశ్వతః). ధైర్యమ్ = ధీరత్వమనునది, మహతామ్ = ఆ మహాత్ములయొక్క, మనః = మనస్సును, వజ్రేణ = వజ్రమను ద్రవ్యవిశేషముతో, సంవర్మయతి హి = ఆచ్ఛాదించునుకదా ! ("దారుణాత్మని" అని పాఠాంతరము. దీర్ఘదేశము స్వభావముగల దారుణే వ్యసనే (పతతి) పతితే-అని అన్వయము.)

రామః :- (దీర్ఘం నిఃశ్వస్య) పఠతి.

సహజధైర్యవశంవదవృత్తయో హృది రుషశ్చ శుచశ్చ
నియంత్రితాః ।
ఇహ తు కిం కరవై యదపత్రపా కిమపి మామవమత్య
విజృంభతే॥ 18

---

తాత్పర్యము:- దురదృష్టవశమున మహాత్ములు దారుణ దుఃఖముల పాలైరేని వారి ధీరత్వమే వారి మనస్సులకు వజ్రకవచము కాగలదు ! (శిథిలములైన శరపుంఖములకు సంశ్లేష దృఢత్వమునకై పులుము ద్రవ్యవిశేషమును వజ్ర మందురు).

(క్రియ:- వర్మన్ శబ్దము (నుండి) పరస్మైపద, లట్. ప్రథమ (ఏక). (సత్యాప పాశేత్యాదినా ణిచ్)

వర్మయతి – వర్మయతః – వర్మయన్తి.

సహజేతి:- (దీర్ఘం నిఃశ్వస్య = నిట్టూర్చి) పఠతి ! అన్వయః ! సహజ = జన్మసిద్ధమైన. ధైర్య = ధీరత్వమునకు. వశంవద వృత్తయః = లొంగి వర్తించునట్టి, రుషః = కోపములు. శుచః చ = దుఃఖములును. హృది = హృదయమునందు నియంత్రితాః = నిలుపరింపబడినవి – వానిని నిగ్రహించుకొంటి ననుట. తు = కాని ఇహ = ప్రస్తుతము. అపత్రపా = పరాభవముచేనైన సిగ్గు. యత్ కిమపి = అది యేదో (లజ్జా సాపత్రపాన్యతః–అమరః). మామ్ = నన్ను. అవమత్య = జయించి (నిగ్రహశక్తికి లొంగక), విజృంభతే = పెచ్చరిల్లుచున్నది. (ద్రుతవిలంబితము)

తాత్పర్యము:- నా ధైర్యమునకు లొంగియుండునట్టి రోషశోకములను గుండెలోనే భరించుచున్నాను. పరిభవమైన అవమానమువలని సిగ్గుమాత్రము నాకు లొంగక నన్ను జయించి పెచ్చరిల్లుచున్నది. దానిని నిగ్రహించలేకున్నాను.

సమాసములు:- సహజం చ తత్ ధైర్యం చ – సహజధైర్యస్య వశంవదా వృత్తిః యేషాం తే.

సంధులు:- వృత్తయః + హృది – ఉత్వాదేశ విసర్గ. రుషః + చ. శుచః + చ – శాదేశ విసర్గ.

లక్ష్మణః :- (పురోఽవలోక్య) ఆర్య. అయమగ్రే తాతజటాయుషో వీర
లోకసాధనసిద్ధక్షేత్ర మరణ్యానీసన్నివేశః పశ్య —
భగ్నోఽయం కథమస్తి రావణరథస్తాతేన వజ్రాంకుర
క్రూరాపస్కిరమాణభంగురనఖత్రోటిత్రుటద్బంధనః ।

రామః :- (సకరుణమ్)
హా సీరధ్వజరాజపుత్రి స తదా దృష్టస్త్వయా ధన్యయా
పక్షీంద్రో దశకంఠకుంజర శిరస్సంచారి పంచాననః ॥ 17

---

క్రియ:- దుకృఞ్ కరణే, ఆత్మనే, లోట్, ఉత్తమ
కరవై — కరవావహై — కరవామహై.
జృభిఙ్ గాత్ర వినామే (వి) ఆత్మనే లట్, ప్రథమ
విజృంభతే — విజృంభేతే — విజృంభన్తే

ఛందస్సు:- ద్రుతవిలంబితమాహ నభౌ భరౌ — నభభర

।।। ౦।। ౦।। ౦।౦
సహజ షైర్యవ శంవద వృత్తయః

అత్రేతి :- (పురః అవలోక్య = ముందునకు చూచి) ఆర్య = అగ్రజా! తాత జటాయుషః = మాన్యుడగు జటాయువునకు. వీరలోక సాధన = వీరస్వర్గమును సంపాదించినదగు, సిద్ధక్షేత్రమ = సిద్ధక్షేత్రమగు. అరణ్యానీ సన్నివేశః = వనప్రదేశము, అయమ్ = ఇదే. అగ్రే = ఎట్టఎదుట నున్నది. పశ్య = చూడుము —

భగ్న ఇతి :- వజ్రాంకుర = వజ్రపు తునుకలవలె. క్రూర = భయంకరముగా. అపస్కిరమాణ = గీరివేయునదై. భంగుర = సహజముగా వక్రములైన. నఖ = గోళులచే. త్రోటి = ముక్కుచే. త్రుటత్ బంధనః = శిథిలము గావింపబడిన బంధములు (సీలలు) కలదై, రావణ రథః = దశకంధరుని తేరు, తాతేన = జటాయువుచే. భగ్నః = విరుగగొట్టబడినదై, అయమ్ = ఇదే, కథమ్ అస్తి = చూచితివా! ఎట్లున్నదో! (సకరుణమ్ = జాలిగా) హా = అయ్యో! సీరధ్వజ రాజపుత్రీ = జానకీ! దశకంఠ = రావణుడనునట్టి. కుంజర = ఏనుగుయొక్క. శిరః = శిరస్సుపై సంచారి = లంఘించుచున్న, పంచాననః = సింహము వంటివాడైన. సః = ఆ,

(ఇతి లక్ష్మణమవష్టభ్య ధ్యానం నాటయతి)

లక్ష్మణః :- (స్వగతమ్) మహాదోషః ఖల్వయమతిప్రసజ్యమానో మానసః శోకాఖ్యో వికారః. తదన్యతః ప్రేరయామి. (ప్రకాశమ్) ఆర్య, పశ్య పశ్య—

---

పక్షీంద్రః = జటాయువు, ధన్యయా = ధన్యురాలవైన, త్వయా = నీచేత, తదా = ఆ సమయమునందు – అట్లు ఎగురుచున్న సన్నివేశమునందు, దృష్టః = చూడబడినాడా! అట్టి జటాయువును చూచి ధన్యవైతివా అనుట (శార్దూలము).

తాత్పర్యము:- జటాయువు తన వజ్రాంకురములవంటి గోళ్ళతో గీరి వేయగా బంధులు త్రెక్కదలి భగ్నమై పడియున్న రావణ రథముదగ్గ చూచితివా! అయ్యో! సీతా! రావణు డను ఏనుగు కుంభస్థలముమీదికి సింహమై లంఘించు జటాయువును చూచితివా! ధన్యవు కదా!

సమాసములు:- రావణస్య రథః. వజ్రాణామంకురాః ఇవ క్రూరముప స్కిరమాణాశ్చ తే భంగురాః— భంగురాశ్చ తే నఖాశ్చ. నఖానాం త్రోటయః— నఖాశ్చ త్రోటిశ్చ – నఖ త్రోటిభిః త్రుటన్తి బంధనాని యస్య సః. సీరధ్వజరాజస్య పుత్రీ— సంబుద్ధౌ. పక్షిణామింద్రః. దశకంఠ ఏవ కుంజరః — కుంజరస్య శిరః – శిరసి సంచారీ – శిరస్సంచారీ పంచానన ఇవ.

సంధులు:- భగ్నః + అయమ్–ఉత్వాదేశ విసర్గ – భగ్నో + అయమ్ – పూర్వరూప. రథః + తాతేన – సాదేశ విసర్గ. వజ్ర + అంకుర, క్రూర + ఉపస్కిరమాణ. పక్షి + ఇంద్రః – సవర్ణదీర్ఘ. సః + తదా – తదేతద్విసర్గలోప. దృష్టః + త్వయా – సాదేశ విసర్గ. ఇంద్రః + దశ – ఉత్వాదేశ విసర్గ.

(ఇతి = అని, లక్ష్మణమ్ అవష్టభ్య = లక్ష్మణుని అలంబనము చేసికొని, ధ్యానమ్ నాటయతి = ధ్యానము నభినయించును).

మహాదోషఇతి:- (స్వగతముగా) అతి ప్రసజ్యమానః = నిరంతరము వృద్ధిపొందునదై, శోకాఖ్యః = శోకమను పేరుగల, మానసః వికారః అయమ్ = ఈ మనోవికారము, మహాదోషః ఖలు = గొప్ప దోషము సుమా! తత్ = అందుచేత, అన్యతః = మరొక విషయముపైపు, ప్రేరయామి = ప్రేరేపింతును. (ప్రకాశముగా) ఆర్యా! పశ్య. పశ్య = చూడుము చూడుము –

వింధ్యగిరిరాజకన్యాంతఃపుర మేతా_స్తరంగమాలిన్యః ।
వేతస్వతీభిరద్భిస్తౌర్యత్రికగుణనికాం దధతే॥ 18

---

వింధ్యేతి:- వింధ్యగిరిరాజ = వింధ్యపర్వతము యొక్క. కన్యాంతఃపురమ్ = అంతఃపుర కన్యలైన - పుత్రికలనుట. ఏతాః = ఈ. తరంగమాలిన్యః = నదులు, వేతస్వతీభిః = ప్రబ్బలిచెట్లతో కూడిన, అద్భిః = నీటితో - తరంగములతో ననుట, తౌర్యత్రిక గుణనికామ్ = నృత్యగీత విద్యాభ్యాసమును, దధతే = చేయుచున్నవి. (ఆర్య)

తాత్పర్యము:- వింధ్యపర్వత పుత్రికలైన ఈ నదులు ప్రబ్బలిచెట్ల అవరోధముతో గంతులువేయుచు ధ్వని చేయుచున్న జలములతో నృత్యగీత వాద్యములను అభ్యసించుచున్నట్లున్నవి.

విశేషములు:- అంతఃపుర శబ్దము లక్షణావృత్తి ననుసరించి అంతఃపుర కాంతలను బోధించును. శృంగారం భూభుజామంతఃపురం స్యాదవరోధనమ్. అభ్యాసే గుణనీయోగాభ్యా, తౌర్యత్రికం నృత్యగీతవాద్యమ్ - అని అమరము. అద్భిః అను చోట అప్ శబ్దమునకు అపోభిః అని తకారాదేశము. వేతస్వతీ - కుముదనడవేత సేభ్యో డ్మతుప్.

సమాసములు:- గిరీణాం రాజా - వింధ్యాఖ్యః గిరిరాజః - గిరిరాజస్య కన్యాంతఃపురమ్, తరంగానాం మాలాః - మాలాస్సంత్యస్యాః - తాః, తౌర్యత్రికస్య గుణనికా - తామ్,

సంధులు:- కన్యా + అంతఃపురమ్ - సవర్ణదీర్ఘ, ఏతాః + తరంగ - సాదేశ విసర్గ. వేతస్వతీభిః + అద్భిః - రేఫాదేశ విసర్గ. అద్భిః + తౌర్యత్రిక - సాదేశ విసర్గ.

క్రియ:- డుధాఞ్ ధారణ పోషణయోః, ఆత్మనే, లట్. ప్రథమ
ధత్తే - దధాతే - దధతే,

(ఇతి పరిక్రామతః)

లక్ష్మణః :- ఆర్య. అయమితో గిరిర్మాల్యవాన్.

ఇహ మహిషవిషాణ వ్యస్తపాషాణపీఠ
స్ఖలన సులభరోహిద్గర్భిణీభ్రూణహత్యాః ।
కుహర విహరమాణ ప్రౌఢభల్లూకహిక్కా-
(భ) చయచకిత కిరాతత్రస్తశస్త్రా వనాన్తాః ॥ 20

---

సంధులు:- విభ్రమాః + రమన్తే - విసర్గలోప. నృత్యత్ + ముఖర - అనునాసికాదేశ. మనోరమాః + తటిన్యః - సాదేశ విసర్గ.

క్రియ :- రముఙ్ క్రీడాయామ్, ఆత్మనే, లట్, ప్రథమ.
రమతే - రమేతే - రమన్తే
(ఇతి = అని, పరిక్రామతః = కదలుదురు)

ఇహోతి :- ఆర్య = అగ్రజా !. ఇతః = ఇటువైపు, అయమ్ = ఇదే, మాల్యవాన్ గిరిః = మాల్యవంతమను పర్వతము.

ఇహేతి:- మహిష = అడవిదున్నలయొక్క, విషాణ = కొమ్ములచే, వ్యస్త = కదలింపబడిన. పాషాణపీఠ = రాతి గట్టులయందు. స్ఖలన = దొర్లిపడుటచే, సులభ = సులభ సంభావ్యమైన. రోహిద్గర్భిణీ = గర్భవతులైన రోహిన్మృగ కాంతలయొక్క, భ్రూణహత్యాః = గర్భస్రావము కలవియును, కుహర = గుహలలో, విహరమాణ = సంచరించుచున్న. ప్రౌఢభల్లూక = పెద్ద యెలుగుబంట్లయొక్క, హిక్కాచయ (భయ) = "హిక్కా" ధ్వని సమూహముచే (భయముచే) చకిత = ఆశ్చర్యపోయిన. కిరాత = బోయవాండ్ర చేతులనుండి, త్రస్త = జారిపోయిన. శస్త్రాః = ఆయుధములు కలిగియున్నైన. వనాన్తాః = వన ప్రదేశములు, ఇహ = ఈ మాల్యవంతముపై (సన్తి) ఉన్నవి. (అంతః స్యాద్దేశ నాశయోః - ధరణిః, అంతం స్వరూపే దేశే నా స్త్రీ శేషేఽన్తి కేష్వపి - మేదినీకరః) వనసీమలు అనుట సాధారణము. (మాలినీ వృత్తము).

వత్స, లక్ష్మణ, ధారయ మామ్, న శక్నోమి స్తంభయితుమాత్మానమ్,

ఇయమవిరళశ్వాసా శుష్యన్ముఖీ భిదురస్వరా
తనురవయవైః శ్లాంతస్రస్తైర్ముహుః పతతి వివర్ణతామ్ ।

---

పంపుడు, విషధరవధూ = నాగకాంతలకు, గర్భాధాన = గర్భాధానోపయోగులై, ప్రియంకరిణీః = ప్రియము గూర్చునట్టి, అపః = జలములను, ప్రవర్షతి = మిక్కిలి కురియుచున్నాడు. (హరిణీ — నసమరసలాగఃషడ్వేదైః హయైః హరిణీ మతా).

తాత్పర్యము:- క్రొక్కారు మేఘములు క్రమ్మిన ఈ మాల్యవంతముపై ఎల్లయెడల మయూరములు ఆనందముతో పురి విప్పి యాడుచున్నవి. వికసించిన నీప పుష్పములను యథాబాధ సంతుష్టిగా తుమ్మెదలు ఆస్వాదించుచున్నవి. ఆడు పాము లకు గర్భాధానయోగ్యమైన వాతావరణము నెలకొన్నది.

సమాసములు:- పరిసరం పరిసరం ప్రతి - వీప్సార్థమున అవ్యయీ భావము. ప్రతిసరిసరే — అనియు పాఠము - తృతీయా సప్తమ్యోర్బహులమ్ అని అమ్భావనిషేధము. శిఖండం బిభర్తి ఇతి - శిఖండభృత్ - తేషామ్, ముశితమనతిక్రమ్య- యథా ముశితమ్, నిచుంబానాం విభూతయః, అభినవాశ్చ తే ఘనాశ్చ - ఘనైః వ్యూఢమ్ ఉరః యస్య సః, అప్రియం ప్రియం క్రియతే యాభిస్తాః - విషధర వధూనామ్ గర్భాధానేన ప్రియంకరణీః - విషధరాణాం వధ్వః.

క్రియ:- భుజ పాలనాభ్యవహారయోః కర్మణి, ఆత్మనే, లట్, ప్రథమ

భుజ్యతే — భుజ్యేతే — భుజ్యన్తే

వృషు సేచనే, పరస్మై, లట్, ప్రథమ

వర్షతి — వర్షతః — వర్షన్తి

వత్సేతి:- వత్స = సోదరా! లక్ష్మణ = సౌమిత్రీ! మామ్ = నన్ను. ధారయ = పట్టుకొనుము. ఆత్మానమ్ = నన్ను నేను. స్తంభయితుమ్ న శక్నోమి = నిలుపుకొనలేకున్నాను — నిలువలేకున్నాను పట్టుకొనుమనుట.

ఇయమితి:- ఇయమ్ = ఈ, తనుః = శరీరము. (స్త్రీ లింగము). అవిరళ శ్వాసా = ఎడతెగని నిట్టూర్పులు కలదై (ఆయాసపడుట). శుష్యత్ + ముఖీ= నోరు ఎండిపోవుచున్నదై (లేదా ముఖము బిగిసిపోవుట). భిదురస్వరా = గద్గదస్వరము

(ఇతి లక్ష్మణేన ధార్యమాణో నిమీలితాక్ష ఏవ) హా ప్రియే దండకారణ్య విహార సబ్రహ్మచారిణి। (ఇతి పునస్సంమ్మూర్ఛతే).

లక్ష్మణః :- (సఖేదమాత్మగతమ్) కేన పునరేష రసో రసాంతరేణ తిరస్క్రియతే.

(నేపథ్యే)

ఆః పాప కబంధహాతక, అయం న భవసి.

రామః :- (ఆకర్ణ్య ససంభ్రమమ్) వత్స లక్ష్మణ, దురాత్మనా దనుకబంధేన కలహాయమానో వయస్యస్తే గుహ ఇవ శ్రూయతే. బహుచ్ఛలాని రక్షాంసి. తత్త్వరితముపపద్యస్వ.

---

డుపదష్ గతౌ. దివాదిః. ఆత్మనే. లట్. ప్రథమ (వి)
పద్యతే - పద్యేతే - పద్యన్తే

హేతి:- (ఇతి = అని, లక్ష్మణేన = సౌమిత్రితో. ధార్యమాణః = పట్టుకొనబడుచున్నవాడై. నిమీలితాక్షః ఏవ = కన్నులు మూసికొనియే) హా! ప్రియే= ప్రియురాలా! దండకారణ్య = దండకావనమునందలి. విహార = సంచారమున, సబ్రహ్మచారిణి = సహాధ్యాయినీ! తోడు నీడగా వర్తించినదానా! అనుట, (ఇతి = అని, పునస్సంమ్మూర్ఛతే = మరల మూర్ఛిల్లును).

కేనేతి :- (సఖేదమ్ = దుఃఖపడుచు, ఆత్మగతమ్ = తనలో) ఏషః = ఈ. రసః = శోకభావాతిశయము (కరుణ), కేన = ఏ. రసాంతరేణ = వేరొక రసముతో. తిరస్క్రియతే = దూరీకరింపబడును — మరొక ఆలోచనలోనికి మరల్చబడును! అని. (నేపథ్యే = తెరలో)

ఆః ఇతి:- ఆః పాప = ఓరీ పాపాత్ముడా! కబంధ హాతక = దుష్ట కబంధా! అయమ్ = ఇదే, న భవసి = నీవిక లేవు - ఇదే చచ్చితివనుట.

వత్సేతి:- (ఆకర్ణ్య = విని, ససంభ్రమమ్ = సంభ్రమముతో) వత్స = సోదరా! లక్ష్మణ = సౌమిత్రీ! దురాత్మనా = దుష్టుడగు. దనుకబంధేన = కబంధుడను రాక్షసునితో, కలహాయమానః = యుద్ధము చేయుచున్నవాడై. తే = నీయొక్క. వయస్యః = మిత్రుడగు, గుహః ఇవ = గుహుడు వోలె, శ్రూయతే = వినబడు

లక్ష్మణః :- తథా. ఇతి నిష్క్రాన్తః

రామః :- (పార్శ్వతోఽవలోక్య. సకరుణమ్) దేవి వామశీలే సీరధ్వజరాజనందిని. ఇయం తే విశ్వవిస్రంభసఖ్యాస్మేరవనీ నిమూళనికుంజవేథా ఇహ హి—

స్వవపుషి నఖలక్ష్మ త్వేన కృత్వా భవత్యాః
కృతమితి చతురాణాం దర్శయిష్యే సఖీనామ్ ।

---

చున్నాడు - అతని స్వరూపమువలె నున్నదనుట, రథాంసి = దిక్కుల గుంపులు, బహూ వృలాని = పలు తెరంగు మాయలు కలవి. తత్ = అందువే. త్వరితమ్ = వెంటనే. ఉపపద్యస్వ = అతనిని సమీపింపుము

తథేతి:- తథా = అట్లే ; (ఇతి = అని. నిష్క్రాన్తః = పోయి నిష్క్రమించెను).

దేవీతి:- (పార్శ్వతః అవలోక్య = ప్రక్కకు చూచి. సకరుణమ్ = జాలిగా) దేవీ ; వామశీలే = ప్రశస్తమగు శీలము కలదానా : (వామౌ సుందరప్రతికూలౌ యోః, అమరః) సీరధ్వజ రాజనందిని = జనకరాజ పుత్రీ ;. ఇయమ్ = ఇది. తే = నీయొక్క, విశ్వ విస్రంభసఖ్యస్మేరవనీ = సమస్తమైన విశ్వాసముతో కూడి తత్త్వము నెఱిగిన. నిమళ నికుంజవేథా = ప్రబ్బలి గుబురుల పొదలు - ఈ పొదలు మన రహస్యముల నెఱిగిన దనుట. ఇహ హి = ఇప్పుడు గదా ;

స్వవపుషీతి: . స్వవపుషి = నా శరీరమునందు. త్వేన = నా గోటితోనే. నఖలక్ష్మ = నఖక్షతమును (గోటి గాటును) కృత్వా = చేసికొని. భవత్యాః = నీచేత. కృతమ్ = చేయబడినది. ఇతి = అని. చతురాణామ్ = నేర్పరులైన ; సఖీనామ్ = నీ చెలికత్తెలకు. దర్శయిష్యే = చూపింతును. ఇతి = అని. మయా = నాచేత. భీషితాయాః = భయపెట్టబడినదానిపై (భియో హేతుభయే షుక్). స్మర = మన్మథ సంబంధమైన. పరిమళ = సమ్మర్దాతిశయమువలన సుగంధముతో కూడిన. ముద్ర = నఖదంతక్షతాదులచే కలుగు, భంగ = భంగమును — సంభోగ చిహ్నములను హరించు క్రమమనుట, సర్వం సహాయః = సమస్తమును ఓర్చుకొను దిన్ను (అధీగర్థదయేశాం స్మరతి యోగే కర్మణి షష్ఠీ). రహసి = ఏకాంతమునందు, స్మరామి = తలచుకొను చున్నాను. (సర్వం సహా - పూస్సర్వయోర్దారి సహోః - ఖచ్) మాలిని.

ఇతి రహసి మయా తే భీషితాయాః స్మరామి
స్మరపరిమళముద్రాభంగ సర్వం సహాయాః ॥ 23

(ఇతి ధనురవష్టభ్య లక్ష్మణ వృత్తాంతదత్తచేతా స్తథైవా స్తే)

(తతః ప్రవిశతి లక్ష్మణో గుహశ్చ)

గుహః :- జయతు జయతు దేవః.

వినేతా వర్ణానామయమభయదుర్గం దివిషదాం
కనిష్ఠః కాకుత్స్థో జయతి జగదాశ్చర్యచరితః ।

---

తాత్పర్యము:- నా గోటితో నేనే నఖక్షతములను నేర్పరచుకొని యివి నీవు చేసితివని నీ చెలికత్తెలకు చూపింతును సుమా అని నేను భయపెట్టుటచే జంకి సంభోగ సమ్మర్దమునందు నఖక్షతాదులచేనైన శ్రమ సంతతిని కిమ్మనక ఓర్చుకొన్న నిన్ను ఇప్పుడిట్లు ఏకాంతములో స్మరించుచున్నాను.

క్రియ:- దృశిర్ ప్రేక్షణే (ణిచ్) ఆత్మనే. లట్. ఉత్తమ.

దర్శయిష్యే — దర్శయిష్యావహే — దర్శయిష్యామహే

స్మృ ఆధ్యానే. పరస్మై. లట్. ఉత్తమ

స్మరామి స్మరావః - స్మరామః

(ఇతి = అని విలపించి. లక్ష్మణ వృత్తాంత దత్తచేతాః = గుహుని సంరక్షించుట కేగిన లక్ష్మణుని విషయమునకు మనసు మరల్చి. ధనురవష్టభ్య = ధనుస్సు చేపట్టి, తథాఏవ ఆస్తే = అట్లే ఉండును. స్వగాంభీర్యమును నెలకొల్పుకున్నాడనుట).

(తతః = అంతట, లక్ష్మణః = సౌమిత్రి, చ = మరియు, గుహః = గుహుండు, ప్రవిశతి = ప్రవేశించును - ప్రత్యేకాన్వయము)

వినేతేతి:- జయతు జయతు దేవః=జయము జయము దేవా ! వర్ణానామ్= చతుర్వర్ణములకు, వినేతా = శాసకుడును, దివిషదామ్ = దేవతలకు, అభయ దుర్గమ్ = అభయము నిచ్చు దుర్గమువంటివాడును - వారినిగూడ రక్షింపగలవాడనుట. జగత్ = ప్రపంచమునకు, ఆశ్చర్య = అచ్చెరువు గొల్పు, చరితః = వ్యక్తిత్వము కల

రామః ;— సాధు వృత్తమ్. శివాస్సన్తు తస్య దేవయానాః పంథానః. వత్స
గుహా వియతి వివర్తమానః కశ్చిదచల ఇవ లక్షితః కిమసౌ
తేనైవ యోజనబాహునా ప్రహరణీకృతః.

గుహః :— దేవ,

దుందుభిం నామ దైత్యేంద్రం నిష్పిపేష కపీశ్వరః।
తస్య కంకాళకూటోఽయం కుమారేణ విలోడితః ॥ 25

---

సాధ్వితి:- సాధు = మేలు వృత్తమ్ = జరిగినది - మంచిపనియైనదనుట. దేవయానాః = దేవతలకు నడత్రోవయైన. పంథానః = ఊర్ధ్వలోక మార్గములు, తస్య = కబంధునికి. శివాః = శుభప్రదములు. సన్తు = అగుగాక! వత్స = మిత్రమా! గుహా = గుహుండా! వియతి = ఆకాశమునందు. వివర్తమానః = కదలాడుచున్నదై. కశ్చిత్ = ఏదో. అచలః ఇవ = పర్వతమువలె. లక్షితః = కన్పించుచున్నది. అసౌ = ఇది. తేన = ఆ. యోజనబాహునా = సుదీర్ఘబాహువగు కబంధునిచే. ప్రహరణీకృతః కిమ్ = ఆయుధముగా (సౌమిత్రి పైకి) ఉపయోగింపబడినదా యేమి?

దుందుభిమితి- దేవా! దుందుభిమ్ నామ = దుందుభి అను పేరుగల, దైత్యేంద్రమ్ = ఒక మహారాక్షసుని, కపీశ్వరః = వాలి. నిష్పిపేష = పిచమడిచెను. తస్య = ఆ దుందుభి యొక్క. కంకాళకూటః = అస్థికారాశి అయమ్ = ఇది. కుమారేణ = కుమార లక్ష్మణునిచే. విలోడితః = ఎగురగొట్టబడినది. (పథ్యావక్త్రము)

తాత్పర్యము:- కపీశ్వరుడైన వాలి దుందుభి అను రాక్షసుని సంహరించెను. అతని కళేబరపు ఎముకల రాసి ఇది. దీనిని లక్ష్మణుడు ఆకాశములోనికి ఎగురగొట్టెను. అంతేకానీ కబంధుడు విసిరిన ఆయుధము కాదు.

సంధులు:- దైత్య + ఇంద్రమ్ - గుణసంధి, కపి + ఈశ్వరః - సవర్ణదీర్ఘ, కూటః + అయమ్ - ఉత్వాదేశ విసర్గ – కూటో + అయమ్–పూర్వరూప.

క్రియ:- పిష్లృ సంచూర్ణనే, పరస్మై, లిట్. ప్రథమ. (నిస్)

పిపేష - పిపిషతుః - పిపిషుః

తన్నిమిత్తజన్మా సంప్రతి వాలినో మహానభియోగః సంభావ్యతే.

లక్ష్మణః :- తతః కిమ్ ।

రామః :- వత్స, మా మైవమ్. మాననీయః ఖల్వసౌ పురాణవీరో మహేంద్రసూనుః. (గుహం ప్రతి) కుతః పునరాగచ్ఛతో వత్సస్య యోజనబాహూరంతరాయః సంవృత్తః

గుహః :- దేవ, వ్యోమయానేన సత్వరముపక్రామతి రావణే సీతాదేవ్యాః....

రామః:- (సాశంకమాత్మగతమ్) కిం పునరస్యాః.

---

తదితి:- తన్నిమిత్తజన్మా = అందువల్ల కలిగిన, మహాన్ అభియోగః = గొప్ప ఆక్షేపణ (పితూరీ). సంప్రతి = ఇప్పుడు. వాలినః = వాలినుండి. సంభావ్యతే= రానున్నదని ఊహింపబడుచున్నది – వచ్చునన్న వార్త యుండినదనుట

తతః ఇతి :- తతః కిమ్ = అయిననేమి । (వచ్చిన రానిమ్మనుట)

వత్సేతి:- వత్స = నాయనా । లక్ష్మణా । మా మా ఏవమ్ = కాదు అట్లు కాదు । పురాణ వీరః = ప్రాచీనకాలము నుండియు మహావీరుడును, మహేంద్ర సూనుః = దేవేంద్రునికి కుమారుడునైన. అసౌ = ఈ వాలి. మాననీయః ఖలు = గౌరవింపదగినవాడు సుమా । [గుహమ్ ప్రతి = గుహునితో] కుతః = ఎచ్చటినుండి. పునరాగచ్ఛతః = తిరిగి వచ్చుచున్న. వత్సస్య = నీకు. యోజనబాహుః = కబంధుడు. అంతరాయః సంవృత్తః = అంతరాయమయ్యెను – ఎటునుండి నీవు వచ్చుచుండగా కబంధు డెదురుపడెననుట.

దేవేతి:- దేవా । వ్యోమయానేన = విమానముతో (వ్యోమయానం విమానోఽస్త్రీ – అమరః) సత్వరమ్ = వేగముగా. రావణే = రావణుడు. ఉపక్రామతి (సతి) = పారిపోవుచుండగా. సీతాదేవ్యాః = సీతాదేవియొక్క .... (అని అర్ధోక్తి అగును.)

కిమితి:- (సాశంకమ్ = ఏమయినదో అను శంకతో, ఆత్మగతమ్ = తనలో) అస్యాః = సీతాదేవికి. కిమ్ పునః = ఏమయినదో ।

గుహః :- యదుత్తరీయముత్ప్లుత్య హనూమానగ్రహీత్. తదేతద్దేవగుణానురాగిణా కుమార సుగ్రీవేణ సభాజయితుముపస్థితవతో మమహస్తే దేవస్య ప్రాభృతీకృతమ్.

(ఇతి రామస్య హస్తే సీతాయా ఉత్తరీయమర్పయతి)

రామః :- (గృహీత్వా హృదయే నిధాయ. సాస్రమ్) హా దేవి. విదేహరాజనందిని. కథముత్తరీయ శేషా దృశ్యసే. (ఇతి నిమీలితాక్షో లక్ష్మణమవష్టభ్నాతి)

లక్ష్మణః :- (నిఃశ్వస్య) సఖే నిషాదరాజ. కుశలం సుగ్రీవస్య ।

---

యదితి:- యత్ ఉత్తరీయమ్ = క్రిందికి పడుచున్న ఏ ఉత్తరీయమును. హనూమాన్ = హనుమంతుడు. ఉత్ప్లుత్య = ఎగిరి. అగ్రహీత్ = గ్రహించెనో. తత్ ఏతత్ = ఆ యీ ఉత్తరీయమును. దేవగుణానురాగిణా = రాముని యొక్క సద్గుణములయందు అనురక్తుడైన, కుమారసుగ్రీవేణ = కుమార సుగ్రీవునితో, సభాజయితుమ్ = నిన్ను సత్కరించుటకు, ఉపస్థితవతః = వచ్చుచున్నవాడనగు, మమ = నాయొక్క. హస్తే = చేతియందు. దేవస్య = ప్రభువుకు (నీకు) ప్రాభృతీకృతమ్= కానుక గావింపబడినది - నీకు కానుకగా దీనిని సుగ్రీవుడు నాతో పంపెననుట.

(ఇతి = అని, రామస్య = రాముని యొక్క. హస్తే = చేతియందు, సీతాయాః = సీతయొక్క. ఉత్తరీయమ్ = ఉత్తరీయమును. అర్పయతి = సమర్పించును) (ప్రాభృతం తు ప్రదేశన ముపాయనముపగ్రాహ్యమ్-అమరః)

హేతి :- (గృహీత్వా = స్వీకరించి. హృదయే = గుండెలయందు. నిధాయ = హత్తుకొని. సాస్రమ్ = కన్నీటితో) హా = అయ్యో ! దేవి = హృదయేశ్వరీ ! విదేహ రాజనందిని = జనకరాజ పుత్రి ! కథమ్ = ఎట్టా ! ఉత్తరీయశేషా = ఉత్తరీయమాత్రముగా మిగిలినదానవై , దృశ్యసే = దర్శనమిచ్చుచున్నావా ! (ఇతి = అని, నిమీలితాక్షః = కనులు మొగిచికొని. లక్ష్మణమ్ = సౌమిత్రిని, అవష్టభ్నాతి = ఆలంబించును.)

సఖేఇతి :- (నిఃశ్వస్య = నిట్టూర్చి) సఖే = మిత్రమా ! నిషాదరాజ = అటవిక ప్రభూ ! సుగ్రీవస్య = సుగ్రీవునికి. కుశలమ్ = క్షేమమా !

లక్ష్మణః :- ఆర్య, కథమస్మాసు వనౌకసోఽపి సౌజన్యమనురుధ్యన్తే.

రామః :- కిముచ్యతే, సుగ్రీవః సనాభిరయమస్మాకమ్. అస్య హి ప్రభవో భగవానైక్ష్వాకస్య రాజర్షి వంశస్య ప్రసవితా సహస్రదీధితిః. (హృదయస్థముత్తరీయం దృష్ట్వా) వత్స గుహ, స్పృహయామి సుగ్రీవ హనూమతోర్దర్శనాయ తదృష్యమూకగామినం మార్గమావేదయ.

---

లోప త్రాసః + రజసి - ఉత్వాదేశ విసర్గ. బాష్పైః + మమ - రేఫాదేశ విసర్గ. షణ్ణః + అయమ్ - ఉత్వాదేశ విసర్గ - షణ్ణో + అయమ్ – పూర్వరూప. దశ + ఆనన. కంఠ + అటవీ – సవర్ణదీర్ఘ.

క్రియ :- హృఞ్ హరణే. ఆత్మనే. లట్ ప్రథమ [అప]
అపహరతే - అపహరేతే - అపహరన్తే

ఆర్యేతి :- ఆర్య = మాన్యా! కథమ్ = ఎట్లా! అస్మాసు = మనపట్ల వనౌకసః అపి = వానరాదులగు అరణ్యకులుకూడ. సౌజన్యమ్ = మైత్రిని. అనురుధ్యన్తే = కోరుకొనుచున్నారే!

కిమితి :- కిమ్ ఉచ్యతే = ఏమి చెప్పబడవలె – ఏమందుమనుట. అయమ్ = ఈ, సుగ్రీవః = సుగ్రీవుడు. అస్మాకమ్ = మనకు, సనాభిః = సగోత్రుడు. అస్య = ఇతనికి. ప్రభవః = తండ్రియైన. భగవాన్ = మహాత్ముడు. ఐక్ష్వాకస్య = ఇక్ష్వాకుసంబంధమైన, రాజర్షి వంశస్య = మన రాజర్షివంశమునకు, ప్రసవితా = ఉత్పాదకుడైన, సహస్ర దీధితిః = వేవెలుగు - సూర్యుడు. [హృదయస్థమ్ = గుండెలపైనున్న. ఉత్తరీయమ్ = ఉత్తరీయమును. దృష్ట్వా = చూచి] వత్స = నాయనా! గుహ = గుహుండా!. సుగ్రీవ హనూమతోః = సుగ్రీవహనుమంతులయొక్క, దర్శనాయ = దర్శనముకొఱకు, స్పృహయామి = వాంఛించుచున్నాను. తత్ = అందుచేత, ఋష్యమూక గామినమ్ = ఋష్యమూక పర్వతమునకు పోవునట్టి. మార్గమ్ = దారిని, ఆవేదయ = తెలియజేయుము.

గుహః :- (సహర్షమాత్మగతమ్) కథమచిరాదేవ ఫలవతీ జాంబవతో మంత్రశక్తిః. (ప్రకాశమ్) ఇత ఇతో మతంగాశ్రమవర్త్మనా దేవః.

(ఇతి సర్వే పరిక్రామన్తి)

గుహః :- దేవ, పశ్య పశ్య —

విదధతి ముదమక్ష్ణోర్నూతనానూపనీప
ప్రహసన సహచర్యా నిత్యనృత్యన్మయూరాః ।
ఫలపులకిత జంబూకుంజకూజత్కపోత
ప్రియశబరపురంధ్రీబంధవో విన్ధ్యలేఖాః ॥ 27

---

కథమితి:. [సహర్షమ్=సంతోషముతో, ఆత్మగతమ్ = తనలో] కథమ్= ఎట్లా! జాంబవతః = జాంబవంతునియొక్క, మంత్రశక్తిః = మంత్రాలోచన శక్తి [మంత్రాంగము]. అచిరాత్ ఏవ = ఇంత వెంటనే, ఫలవతీ = ఫలించినది! [ప్రకాశముగా] దేవః = ప్రభువు. ఇతః ఇతః = ఇటు ఇటు. మతంగాశ్రమ వర్త్మనా = మతంగ మహర్షి యాశ్రమమార్గమున — దయచేయుగాక యనుట. [ఇతి = అని. సర్వే = అందరును. పరిక్రామన్తి = బయలుదేరుదురు].

విదధతీతి :- దేవా! పశ్య పశ్య = చూడుము చూడుము! — నూతన= క్రొత్తవియైన. అనూపనీప = నీటి ప్రబ్బలిచెట్లయొక్క. ప్రహసన = వికసనమునకు. సహచర్యా = అనుస్పందనగా. నిత్యమ్ = నిత్యమును, నృత్యత్ = నాట్యము చేయుచున్న. మయూరాః = నెమళులు కలవియును. ఫల = ఫలములతో. పులకిత = నిండిన. జంబూకుంజ = నేరేడు గుబురులందు. కూజత్ = కువకువ లాడుచున్న. కపోతప్రియ = ఆడు పావురములకును. శబరపురంధ్రీ = శబరకాంతలకును, బంధవః = బంధువులునైన. విన్ధ్యలేఖాః = విన్ధ్యపర్వత శ్రేణులు. అక్ష్ణోః = నేత్రములకు. ముదమ్ = ఆనందమును. విదధతి = కలిగించుచున్నవి. [మాలిని]

తాత్పర్యము :- నీటి ప్రబ్బలిచెట్ల నూతన వికాసమునకు అనుగుణముగా నెమళులు నాట్యము చేయుచున్నవి. నేరేడు గుబురులు ఫలభారముతో పావురములకు శబరకాంతలకు ఆనందము గూర్చుచున్నవి. ఈ విన్ధ్యపర్వత శ్రేణిని తిలకింపుము.

సు: :- (సర్వతోఽవలోక్య, సఖేదమ్)

సమంతాదున్మీలద్బహుళ లహరీ లంఘనకళా
లఘుప్రేంఖత్పంపానిల విదళదేలా సురభయః ।
అవిద్యావై దేహీశతలిపికరీణాం మమ ధియా
మమీ హస్తాలంబం విపిన వినివేశా విదధతే ॥ 28

---

సమాసములు :- నూతనాశ్చ తే అనూపనీపాశ్చ - నీపానాం ప్రహసనమ్ - ప్రహసనస్య సహచర్యా - సహచర్యయా నిత్యం నృత్యంతః మయూరాః యాసు తాః ఫలైః పులకితాని - పులకితాని చ తాని జంబూకుంజాని- కుంజేషు కూజంత్యః కపోతప్రియాః - ప్రియాశ్చ శబరపురంధ్ర్యశ్చ - పురంధ్రీనాం బంధవః. వింధ్యానాం లేఖా - తాః.

సంధులు :- అక్ష్ణోః + నూతన - రేఫాదేశవిసర్గ. నూతన + అనూప - సవర్ణదీర్ఘ. నృత్యంతః + మయూరాః - అనునాసికాదేశ. బంధవః + వింధ్య - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః - పరస్మై. లట్. ప్రథమ (వి)
దధాతి - ధత్తః - దధతి

ఛందస్సు :- మాలిని. ననమయయయుతేయం మాలినీ భోగిలోకైః.
విదధ - తిముద - మక్ష్ణోర్యూ - తనానూ - పనీప

సమంతాదితి :- [సర్వతః అవలోక్య = అన్ని వైపులకు చూచి. సఖేదమ్ = దుఃఖముతో] సమంతాత్ = అన్నివైపులకు. ఉన్మీలత్ = వ్యాపించుచున్న. బహుళ = అసంఖ్యాకములైన, లహరీ = తరంగములయొక్క. లంఘనకళా = ఎగసిపాటుచే. లఘు = నేర్పుగా [శీఘ్రముగా]. ప్రేంఖత్ = కదలాడుచున్న. పంపానిల = పంపాసరోవర వాయువులచే, విదళత్ = వికసించుచున్న. ఏలా = ఏలా పుష్పములతో. సురభయః = సుగంధిలములై, అమీ = ఈ, విపిన వినివేశాః = అరణ్యప్రదేశములు. అవిద్యా = మిథ్యా కల్పితమైన, వైదేహీశత = వందమంది సీతలను, లిపికరీణామ్ = చిత్రించుకొనుచున్న. మమ = నాయొక్క, ధియామ్ = ఊహలకు. హస్తాలంబమ్ = చేయూతను, విదధతే = అందించుచున్నవి — కల్పించుచున్నవి.

రామః :- (సాస్రమ్) హా దేవి జానకి,

మారీచమృగయావ్యగ్రే మయి ప్రాప్తే చ రావణే ।
అసామివ కురంగీణాం తవోత్పశ్యామిలోచనే ॥ 30

---

యొక్క, ప్రాక్ ప్రణిహితమ్ = ముందుగా సంలగ్నమైన. హృదయమ్ = హృదయము. శరవ్యాత్ = లక్ష్యమునుండి. అపరాద్ధమ్ = చెదరిపోయినది. (అపరాద్ధపృషత్కోఽసౌ లక్ష్యాద్యశ్చ్యుతసాయకః - అమరము) తు = కానీ, శరాః = బాణములు, న = లక్ష్యమునుండి చెదరిపోలేదు. (ప్రాక్ప్రణిహితాః శరాః న అని పాఠాంతరముతో అన్వయము) (శిఖరిణి).

తాత్పర్యము :- వేటగాడిని చూచి మగలేడి పారిపోయినది. మిగిలిన ఆడులేడి అతిదీనముగా చూచుచున్నది. వేటగాని భార్యకు జాలిపుట్టినది. చంపవద్దు చంపవద్దని భర్తను వారించుచున్నది. ఈ మాటలతో వేటగాని హృదయము చెదరినదే కానీ బాణము గురి తప్పలేదు. ఆడులేడిని సంహరించెనట.

సమాసములు :- భయేన భ్రష్టః - భ్రష్టశ్చాసౌ ప్రేయాన్ - ప్రేయసః విరహః - విరహేణ నిరహంకారా - నిరహంకారా చ సా హరిణీ చ - హరిణ్యాః ముఖమ్ - ముఖస్య ఆలోకః - ఆలోకాత్ ఉన్మీలన్ - గురుశ్చాసౌ కరుణశ్చ - ఉన్మీలంశ్చ గురు కరుణశ్చ-కరుణేన రుద్ధా - తామ్.

సంధులు :- ప్రేయః + విరహ. - ఉత్వాదేశవిసర్గ. ముఖ + ఆలోక-సవర్ణదీర్ఘ. ఆలోక + ఉత్ - గుణసంధి. ఉత్ + మీలత్ - అనునాసికాదేశ. శరవ్యాత్ + లబ్ధానామ్ - లాదేశ.

మారీచేతి :- (సాస్రమ్ = కన్నీటితో) హా! దేవీ! జానకీ! - మయి= నేను. మారీచ = మారీచుని (మృగముగా వచ్చిన) మృగయా = వేటాడుటయందు, వ్యగ్రే (సతి) = వ్యాకులుడనై యుండగా, రావణే = రావణుడు, ప్రాప్తే (సతి) = (అపహరింప) రాగా, తవ = నీయొక్క, లోచనే = నేత్రములను, అసామ్ = ఈ, కురంగీణామ్ ఇవ = మృగాంగనల నేత్రములను వలె - ఇట్లే ఉండియుండునని, ఉత్పశ్యామి = భావించుచున్నాను. అనుష్టుప్పు.

లక్ష్మణః :- (స్వగతమ్) కః పునరుపాయో యేన వినోదయతే హృదయ మార్యస్య.

(నేపథ్యే)

భో భో వనౌకసః కథయన్తు భవన్తః కేనాస్మత్కీర్తి కామినీ కేళి చంక్రమణ క్రీడా పర్వతో వివర్తితోఽయం దనుదానవకంకాళకూటః

---

తాత్పర్యము :- ఓ జానకీ! నేను మారీచుని వేటాడుటకు పోగా రావణుడు నిన్ను అపహరించుటకు రాగా అప్పటి నీ నేత్రములు, ఈ మృగాంగనల నేత్రములవలె నుండియుండునని భావించుచున్నాను

సమాసములు :- మారీచం లక్ష్యీకృత్య ప్రవృత్తా మృగయా - మృగయాయాం వ్యగ్రః - తస్మిన్.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే. పరస్మై. లట్. ఉత్తమ (ఉప)
పశ్యామి - పశ్యావః - పశ్యామః

క ఇతి :- (స్వగతమ్ = తనలో) ఆర్యస్య = అన్నగారియొక్క. హృదయమ్ = మనస్సు. యేన = ఏ ఉపాయముతో. వినోదయతే=ఆనందింపజేయబడునో, ఉపాయః = అటువంటి ఉపాయము, కః పునః = మరొకటి ఏమున్నది చెప్పుమా! - మరింకే ఉపాయముతో రాముని మనస్సును సీతావియోగదుఃఖమునుండి మరలింతునోకదా అని ఆలోచన. (వినోద్యతే, వినోద్యేత అని పాఠాంతరములు)

(నేపథ్యే = తెరలో)

భో భో వనౌకసః = ఓయోయీ! అరణ్యకులారా! - తపస్వులారా! అనికానీ, భవన్తః = మీరు. కథయన్తు = చెప్పుడీ! అస్మత్ = నాయొక్క. కీర్తికామినీ= కీర్తి అనునట్టి అందగత్తెకు, కేళిచంక్రమణ = వాహ్యాళికొఱకైన, క్రీడాపర్వతః = కృత్రిమ పర్వతమువంటిదైన. అయమ్ = ఈ. దనుదానవ కంకాళకూటః = దుందుభి యొక్క అస్థిపంజరపు రాశి — పెద్ద అస్థిపంజరమనుట. కేన = ఎవనిచేత. వివర్తితః = ఎగురగొట్టబడినది - దీనిని ఎవడు ఎగురదన్నెననుట (స్యాత్కంకాళోఽస్థిపంజరః — అమరః).

గుహః :- (దృష్ట్వా, సభయ సంభ్రమమ్) దేవ, పశ్య పశ్య కనకమయ సహస్రపత్ర పుండరీక వైకక్షక ప్రభాపటలేన దుందుభి కరంక వ్యతికరజన్మనా చ రోషరాగేణ త్రిగుణపిశంగీం తనుమాదధానః ప్లవగరాజోఽయమిత ఏవాభివర్తతే.

పౌలస్త్యావయవౌఘ సంకట భుజామూలక్షణోన్మూలిత
ద్వైరాజ్య మమరావతీం కృతవతే వీరాయ యస్మై హరిః ।

---

దేవేతి :- (దృష్ట్వా=చూచి. సభయ సంభ్రమమ్=భయసంభ్రమములతో) దేవా ! పశ్య పశ్య = చూడుము చూడుము. కనకమయ = బంగారముతో చేయింపబడిన. సహస్రపత్ర = వేయి రేకులు కలిగిన పుండరీక = పద్మములయొక్క. వైకక్ష = యజ్ఞోపవీతమువలె ధరింపబడిన (తిరశ్చీన) మాలయొక్క. ప్రభాపటలేన = కాంతిపుంజముతోను. [పుండరీకం సితాంభోజే శ్వేతచ్ఛత్రే చ భేషజే – విశ్వః యత్తిర్యక్ క్షిప్తమురసి కంఠాద్వైకక్షకం తు తత్ - అమరః వైకక్షిమ్. వైకక్ష్యకమ్. అని పాఠాంతరములు]: దుందుభి = దుందుభియొక్క, కరంక వ్యతికర = కళేబరము వెగుపడచిన పనితో. జన్మనా = ప్రభవించిన, రోషరాగేణ చ = క్రోధపు రక్తిమతోను [కరంకో మస్తకాస్థిని – మేదినీకారః]: త్రిగుణ పిశంగీమ్ = మూడు రెట్లయిన గోరోచనపు రంగుతోకూడిన [స్వభావ పింగళతయా చ = స్వతస్సిద్ధముగా నున్న పింగళవర్ణముతోను – అని కొన్నింట అధికపాఠము - అప్పుడు త్రిగుణత్వము సరిపడును]. తనుమ్ = శరీరమును, ఆదధానః = ధరించుచున్నవాడై, ప్లవగరాజః = వాలి, అయమ్ = ఇతడే [ఇదే]. ఇతః ఏవ = ఇటే. అభివర్తతే = వచ్చుచున్నాడు.

పౌలస్త్యేతి :- పౌలస్త్య = రావణునియొక్క. అవయవౌఘ = అవయవ సమూహముచే, సంకట = క్రిక్కిరిసిన (సంకటం నా తు సంబాధః – అమరః), భుజామూల = బాహుమూలముచే (కక్ష) క్షణ = క్షణకాలము. ఉన్మూలిత = తొలగింపబడిన, ద్వైరాజ్యమ్ = ఇద్దరు రాజులుండు నవస్థకలదిగా, అమరావతీమ్ = దేవనగరమును. కృతవతే = చేసినవాడగు. యస్మై = ఏ. వీరాయ = మహావీరునికై. హరిః = ఇంద్రుడు. నిత్య = నిరంతరము, ఆలోకన = చూచుటవల్లనైన, కౌతుక = ఆనందమునందు, వ్యసనినీః = నక్తములైన, దృశః = నేత్రములను, సహస్రమ్ =

నిత్యాలోకన కౌతుక వ్యసనినీః శంకే సహస్రం దృశః
పిండీకృత్య దశచ్ఛలేన కనకాంభోజస్రజం దత్తవాన్ ॥ 31

---

వేయింటిని. దశచ్ఛలేన = రేకులుగా. పిండీకృత్య = రాశిజేసి. కనకాంభోజస్రజమ్= బంగారు పద్మముల దండను. దత్తవాన్ = ఇచ్చెనని. శంకే = ఊహించుచున్నాను. (శార్దూలము).

తాత్పర్యము :- రావణాసురుని సందిట బంధించి క్షణకాలము అమరావతికి శత్రుపీడను వాలి తొలగించెను. దానికి ఇంద్రుడు ఆనందించెను—తన పుత్రుడు కదా ఇంత మేలు చేసెనని. నిరంతరముగా వాలిని చూచుచు ఆనందించుటకు ముచ్చట పడుచున్న తన వేయి కన్నులనే రేకులుగాచేసి ఇంద్రుడు శః స్వర్ణకమల మాలికను వాలికి బహూకరించియుండును.

విశేషములు :- ద్వైరాజ్యమ్. ద్వితీయో రాజా — ద్విరాజః. తస్య భావః — ద్వైరాజ్యమ్. సమాసాది వృత్తులయందు సంఖ్యావాచక శబ్దములకు పూరణ ప్రత్యయము లోపించుట భాష్యసమ్మతము. ఇద్దరు రాజులు కలిగియుండుట. రావణుడు ఆక్రమించి అమరావతి నేలుట పురాణప్రసిద్ధము. వాలి రావణుని సందిట బోదివి కొని సప్తసముద్రములలో సంధ్యోపాస్తి నెరవేర్చి వచ్చెననియు పురాణ ప్రసిద్ధి.

సమాసములు :- అవయవానామోఘః - పౌలస్త్యస్య అవయవౌఘః— ఓఘేన సంకటమ్ - సంకటం చ తత్ భుజా మూలం చ - భుజామూలేన క్షణ మున్మూలితమ్ - ఉన్మూలితం ద్వైరాజ్యం యస్యాస్సా — తామ్. నిత్యమాలోకనమ్ — ఆలోకనేన కౌతుకమ్ - కౌతుకే వ్యసనినీ - తాః. కనకమయాని అంభోజాని — కనకాంభోజానాం స్రక్ — తామ్.

సంధులు :- పౌలస్త్య + అవయవ, నిత్య + ఆలోక, కనక + అంభోజ- సవర్ణదీర్ఘ. అవయవ + ఓఘ—వృద్ధి. క్షణ + ఉత్ - గుణ, ఉత్ + మూలిత — అనునాసికాదేశ. దశ + ఛలేన - తుగాగమ.

క్రియ :- శకిఙ్ శంకాయామ్, ఆత్మనే, లట్, ఉత్తమ
శంకే — శంకావహే — శంకామహే

క్షణం చ దేవస్య మహావీరసంవాదగోష్ఠీయమృష్యమూకయాత్రామంత
రయిష్యతి. తదహమగ్రతో గత్వా దిష్ట్యా వర్ధయామి సూర్యతనయమ్.

రామః :— ఏవమస్తు.

గుహః :— వాచికం పునరేతావత్కుమార సుగ్రీవస్య యత్ "మిత్రపర్యా
యాంతరితం దేవస్య దాస్యమిచ్ఛామి" ఇతి.

రామః :— (అపవార్య) వత్స లక్ష్మణ. ఏవమాహ వయస్యస్తే గుహః.
కిం చ మంత్రోత్సాహ సంపన్నానా మపి ప్రభుశక్తిమపేక్షంతే

---

క్షణమితి :- మహావీర = ఈ మహావీరుడను వాలితో. సంవాదగోష్ఠీ = సంవాద సంభాషణము - వాక్కలహమనుట, ఇయమ్ = ఇది. దేవస్య = ప్రభువు యొక్క, ఋష్యమూకయాత్రామ్ = ఋష్యమూక గమనమును. క్షణమ్ = క్షణ కాలము. అంతరయిష్యతి = అభ్యంతరపరచును - క్షణకాలము జాగు అగుననుట. (మహావీరోఽయ మృష్యమూక యాత్రామ్ - అని కొన్నింట ద్రుష్టపాఠము), తత్ = అందుచేత అహమ్ = నేను. అగ్రతః గత్వా = ముందుగానేగి, సూర్యతనయమ్ = సుగ్రీవుని, దిష్ట్యా, వర్ధయామి = ఆనందము పెంపొందింతును - ఈ వార్త చెప్పి అతనిని ఆనందింపజేయుదు ననుట. (దిష్ట్యా పూర్వో వర్ధిరుత్సవే - భరతః, దిష్ట్యా సముపజోషం చేత్యానందః- అమరః).

ఏవమితి :- ఏవమ్ అస్తు = ఇట్లే అగుగాక ! - పోయి అతనికి పండువు సేయుమనుట.

వాచికమితి :- ఏతావత్ పునః = ఇంతరును. కుమార సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క వాచికమ్= సందేశవాక్యము (సందేశవాగ్వాచికం స్యాత్ - అమరః) యత్ = ఏదియనగా - మిత్రపర్యాయాంతరితమ్ = మిత్రపదముతో ఆచ్ఛాదితమైనదిగా. దేవస్య = ప్రభుపుయొక్క. దాస్యమ్ = సేవను. ఇచ్ఛామి = కోరుకొనుచున్నాను — మిత్రుడన్నది పైకి పేరేగానీ నేను రామునికి దాసుడనుగా నుండగోరుచున్నా ననుట- ఇతి = అని సుగ్రీవుని సందేశవాక్యము.

వత్సేతి :- (అపవార్య = గుహునికి వినిపించకుండ) వత్స ! లక్ష్మణా ! తే = నీయొక్క. వయస్యః = మిత్రుడు, గుహః = ఈ గుహుండు. ఏవమ్ = ఇట్లు, ఆహ = పలికెను, కించ = మరియు, మంత్రోత్సాహ సంపన్నానామ్ అపి = మంత్ర

సిద్ధయః తదహం వాలిస్థానే సుగ్రీవమభిషిచ్య తత్కోశ దండాభ్యాం సమగ్రశక్తిర్వైరపారం గంతుమిచ్ఛామి.

లక్ష్మణః :— (సస్మితమ్) యద్యేవముపయుజ్యమానమింద్రసూనుముపేక్ష్య సుగ్రీవేణోపయోక్ష్యమాణేన సంధిరితి వక్రః ఖల్వయం పంథాః

రామః :— (సస్మితమ్) వత్స, సాధ్వేవ బ్రవీషి కిన్తు—

దృప్యత్పౌలస్త్య కండూభిదుర భుజభరోష్మాయమాణః కపీంద్రో
నాయం నః సందధీత క్వచిదపి హి విధా నైవ సాహాయ్యకామః,

---

శక్తి ఉత్సాహశక్తి రెండును కలవారికేని, సిద్ధయః = ఫలసిద్ధులు, ప్రభుశక్తిమ్ = ప్రభుశక్తి సహాయమునుగూడ, అపేక్షంతే = కోరుచుండును - మంత్రోత్సాహశక్తు లున్నను ప్రభుశక్తి లేనిదే పనులు జరుగవనుట. తత్ = అందుచేత. అహమ్ = నేను, వాలిస్థానే = వాలిస్థానమునందు (ఆ సింహాసనమున) సుగ్రీవమ్ = సుగ్రీవుని అభిషిచ్య = అభిషేకించి, తత్ = వానియొక్క, కోశ = కోశము, దండాభ్యామ్ = సైన్యములతో. సమగ్రశక్తిః = (షడ్విధ) శక్తులు సంగ్రహముగా సమకూడిన వాడనై, వైరపారంగంతుమ్ = శత్రువును తుదముట్టించుటకు, ఇచ్ఛామి = వాంఛించు చున్నాను. ఇదీ నా ఆలోచన యనుట.

యదీతి :- (సస్మితమ్ = చిరునవ్వుతో) యది ఏవమ్ = అట్లే అయి నచో. ఉపయుజ్యమానమ్ = ఇప్పుడే యథాతథముగా ఉపయోగపడునట్టి (ప్రభుశక్తిగా) ఇంద్రసూనుమ్ = ఈ వాలిని. ఉపేక్ష్య = విడిచిపెట్టి ఉపయోక్ష్యమాణేన = ప్రభుశక్తిగా నుపకరించుటకు సమర్థుడు కానున్న. సుగ్రీవేణ = ఆ సుగ్రీవునితో. సంధిః ఇతి = మనకు పొత్తు అనుట - వాలిని విడిచి సుగ్రీవునితో సంధి చేసికొనుట. అయమ్ = ఇది, వక్రః పంథా ఖలు = వక్రమార్గముగదా ! దీనికి హేతువేమి అనుట.

వత్సేతి :- (సస్మితమ్ = చిరునవ్వుతో) వత్స = నాయనా లక్ష్మణా ! సాధు ఏవ బ్రవీషి = లెస్సగా పల్కితివి. కిన్తు = కాని.

దృప్యదితి :- దృప్యత్ = గర్వించిన, పౌలస్త్య = రావణునియొక్క కండూ = కండూతివి, భిదుర = స్వయముగా పోగొట్టిన, భుజభర = బాహుబల ముతో. ఊష్మాయమాణః = తేజస్సులను వెల్లగక్కువాడైన, అయమ్ = ఈ, కపీంద్రః = వాలి, నః = మనను, న సందధీత = పొత్తున గొనడు - మనతో

సోఽహం సుగ్రీవమేతద్దమనదృఢతరం మిత్రమిచ్ఛామి పశ్చా
త్పారస్త్రైణేయ పుత్రవ్యయశిథిలరుచం శక్రమారాధయామి॥ 32

సంధిని వాంఛింపడనుట. విధౌ = కార్యము పట్ల. క్వచిత్ అపి హి = ఒకప్పుడేని. సాహాయ్య కామః = ఒకరి సహాయమును గోరువాడు. న ఏవ = కానేరాడు. సః అహమ్ = ఈ నేను (సామర్థ్యాదిశయము వ్యంగ్యము). ఏతత్ = ఈ వాలియొక్క, దమన = సంహారముతో. దృఢతరమ్ = బలవంతుడైన. సుగ్రీవమ్ = సుగ్రీవుని, మిత్రమ్ = స్నేహితునిగా, ఇచ్ఛామి = కోరుచున్నాను. పశ్చాత్ = అటుపైని. పార స్త్రైణేయ = పరకాంతయందు జన్మించిన. పుత్ర = తనయునియొక్క (వాలి ఇంద్రు నికి పరకాంతయందు జన్మించెననుట). వ్యయ = వినాశముతో. శిథిల రుచమ్ = అల్పదుఃఖము కలిగిన. శక్రమ్ = దేవేంద్రుని. ఆరాధయామి = మంచిచేసికొందును. నెమ్మదిగా నాతని సౌముఖ్యము సంపాదింతుననుట. (పారస్త్రైణేయ వ్యయమువలన తొలగిన అవమానదుఃఖము. లేదా లజ్జాదాటము కలవాడని కొందరు అన్వయించిరి)- పారస్త్రైణేయస్తు పరస్త్రియా- అని అమరము. (స్రగ్ధరావృత్తము)

తాత్పర్యము :- రావణాసురుని గర్వమును స్వయముగా అణచి విజృంభిగు వాలి మనతో సంధిని వాంఛింపడు. అతనిని సంహరించి సుగ్రీవుని బలపరచి వానితో మైత్రిని కుదుర్చుకొనుట నా అభిమతము. వాలిని సంహరించుటవలన ఇంద్రుడు బాధ పడునేమో అన్నచో అది అటుపైని చూచికొందును. వాలి దేవేంద్రునికి పరస్త్రీ సంజాతు డగుట వాలివధ ఇంద్రునికి అల్పదుఃఖమునే కల్పించును.

సమాసములు :- దృప్యంశ్చాసౌ పౌలస్త్యశ్చ - పౌలస్త్యస్య కండూః - కండ్వాః విదురః - విదురశ్చాసౌ భుజభరశ్చ - భరేణ ఊష్మాయమానః. కపీనా మింద్రః. సాహాయ్యం కామయతీతి. ఏతస్య దమనమ్ - దమనేన దృఢతరః — తమ్. పారస్త్రైణేయశ్చాసౌ పుత్రశ్చ - పుత్రస్య వ్యయః - వ్యయేన శిథిలా రుగ్యస్య తమ్. పరస్త్రియా అపత్యం పుమాన్ - స్త్రీభ్యో ఢక్. కల్యాణ్యాదీనామినఙ్.

సంధులు :- భుజభర + ఊష్మాయమాణః - గుణసంధి. కపి + ఇంద్రః, న + అయమ్ - సవర్ణదీర్ఘ. ఇంద్రః + న - ఉత్వాదేశ - సో + అహమ్- పూర్వరూప

లక్ష్మణః :- సాధుదర్శినీ బుద్ధిరార్యస్య. కించ విధూతశాపేన దనునాపి దేవభూయాం గతి మభిలంభితేన సందిష్టమార్యస్య యథా "అస్య నిషాదపతేర్వచసి దేవేనావధాతవ్యమ్" ఇతి.

రామః :- తద్గుహోఽపి ప్రతిదూత్యమర్హతి.

లక్ష్మణః :- (గుహంప్రతి) వయస్య. ఏవమస్మద్గిరా సుగ్రీవో వక్తవ్యః-

పితాయం రేతోధాస్తవ తరణిరస్మత్కులగురు
ర్మనుర్వైవమాత్రేయస్తదపి సహజం మిత్రమసి నః ।

---

క్రియ :- డు ధాఞ్ ధారణపోషణయోః, ఆత్మనే. విధిలిఙ్. ప్రథమ (సమ్)

దధీత - దధీయాతామ్ - దధీరన్

ఇషు ఇచ్ఛాయామ్. పరస్మై. లట్. ఉత్తమ

ఇచ్ఛామి - ఇచ్ఛావః - ఇచ్ఛామః

సాధ్వితి :- ఆర్యస్య = అగ్రజునియొక్క బుద్ధిః = బుద్ధి, సాధుదర్శినీ= సమ్యగ్దర్శనము కలది, కించ = మరియు, విధూతశాపేన = శాపము తొలగినవాడై, దేవభూయామ్ గతిమ్ = దేవత్వమును, అభిలంభితేన=పొందినవాడైన, దనునా అపి= కబంధునిచేకూడ, ఆర్యస్య = ప్రభువునకు (నీకు). సందిష్టమ్ = సందేశమీయబడినది. యథా = ఎట్లనగా- అస్య = ఈ, నిషాదపతేః = గుహునియొక్క, వచసి = మాట యందు, అవధాతవ్యమ్ = ధ్యానము ఉంచవలసినది- ఇతి = అని, (స్యాద్దేవభూయం దేవత్వమ్ - అమరః)

తదితి :- తత్ = అందుచేత. గుహః=గుహుడు, ప్రతిదూత్యమ్ అపి= ప్రతిదూతగా పోవుటకును, అర్హతి = తగును.

వయస్యేతి :- (గుహంప్రతి = గుహునుద్దేశించి) వయస్య = మిత్రమా! ఏవమ్ = ఇట్లు, అస్మద్గిరా = మామాటగా(తో) సుగ్రీవః వక్తవ్యః = సుగ్రీవుడు వక్తవ్యుడు - సుగ్రీవునికి చెప్పుమనుట.

పితేతి :- అస్మత్ = మాయొక్క, కులగురుః = వంశమునకు ప్రవర్తకుడగు, అయమ్=ఈ, తరణిః = సూర్యుడు, తవ = నీకు, రేతోధః = తేజస్సు నిచ్చిన, పితా = తండ్రి, మనుః=మా వంశమున మూలపురుషుడగు మనువు, వైమా

అథాపి జ్ఞాతేయం శిథిలయసి కాపేయచపలః
శరాస్తస్మే వాలిక్షతజరసలోలాః ప్రతిభువః॥ 33

రామః :- (విహస్య) వత్స గుహ. ఏష ఖలు పౌలస్త్యగతేనామర్షేణ ధూమాయమానో యయా కయాచిద్వాచా సౌమిత్రిరభిదధాతు

---

త్రేయః = నీవు సవతితమ్ముడవు. తత్ = అందుచేత. నః = మాకు. సహజమ్ అపి = సహజముగను, మిత్రమ్ అసి = మిత్రుడవైతివి (వాలి వధతో కృత్రిమమిత్రత్వము) అథ + అపి = అయినప్పటికిని. కాపేయచపలః = కపిస్వభావమైన చపలత్వము కలవాడవై. జ్ఞాతేయమ్=బంధుత్వమును (సగోత్ర బాంధవ జ్ఞాతి బంధు స్వస్వజనాస్సమాః, జ్ఞాతేయం బంధుతా తేషాం క్రమాద్భావసమూహయోః - అమరః), శిథిలయసి = విడతువేని. వాలిక్షతజ = వాలి రక్తముయొక్క, రస = రుచియందు. లోలాః=ఆసక్తి కలవైన- రుచిమరుగనున్నయనుట, మే = నాయొక్క, శరాః = బాణములు. ప్రతిభువః = ఎక్కుపెట్టియే యుండును - సిద్ధముగా నుండుననుట. (శిఖరిణి)

తాత్పర్యము :- మాకు వంశప్రవర్తకుడగు సూర్యుడు నీ తండ్రి. మా వంశ మూలపురుషుడగు మనువు నీకు సవతితమ్ముడు. ఇట్లు మాకు బంధువవై సహజ మిత్రుడవు. కపిస్వభావమునతో ఈ బంధుత్వమును శిథిలపరితువేని (భోగలాలసుడవై కర్తవ్యము మరతువేని) వాలిని సంహరించి రక్తపు రుచి మరుగనున్న ఈ బాణములు ఉండనే యున్నవి.

సమాసములు :- రేతః దధాతీతి రేతోధాః. అస్మాకం కులగురుః. విమాతుః అపత్యం పుమాన్. వాలినః క్షతజమ్ - క్షతజస్య రసః - రసే లోలాః. జ్ఞాతేయమ్, కాపేయమ్ - కపిజ్ఞాత్యోర్ఢక్.

సంధులు :- రేతోధాః + తవ. వైమాత్రేయః + తత్. శరాః + తత్ - సాదేశ విసర్గసంధి. తటజః + అస్మత్. గురుః + మనుః + వైమాత్రేయః- రేఫాదేశ విసర్గ. తత్ + మే- అనునాసికాదేశ.

గుహేతి :- (విహస్య = నవ్వి) వత్స ! గుహ ! పౌలస్త్యగతేన = రావణునిపైనున్న. అమర్షేణ = క్రోధముతో. ధూమాయమానః = ధుమధుమలాడుచున్న. ఏషః సౌమిత్రిః = ఈ లక్ష్మణుడు. యయా కయాచిత్ వాచా = ఏదో ఒక వాక్కుతో.

నామ. సతతసమిధ్యమాన జానకీవిరహ వైశ్వానరేణ రామ
చేతసా పునరగ్నిసాక్షికమేవ సుగ్రీవో మిత్రమభ్యుపగతః.

గుహః :— (సహర్షమ్) పరమనుగృహీతో௨సౌ దేవేన వికర్తనతనయః.
(సపరిహాసస్మితం చ)

సుగ్రీవే యది పక్షపాతమధురం దేవ త్వదీయం మనః
కిం నస్తేన విదాంకరోతు భగవానంభోజినీవల్లభః ।
సవ్యేనాత్మజరాజ్యలాభరభసోద్భూతేన యస్తేజసా
పూర్వస్మాదధికేన దుస్సహతరో లోకేషు వర్తిష్యతే॥ 34

---

(కఠినమో మృదువో), అభిదధాతు నామ = పలికిన పలుకునుగాక!. పునః = కాని, సతతసమిధ్యమాన = నిరంతరముగా రాజుకొనుచున్న, జానకీవిరహవైశ్వానరేణ = సీతావిరహమనునట్టి అగ్నితోకూడిన, రామచేతసా = శ్రీ రామహృదయముతో. అగ్ని సాక్షికమ్ ఏవ = అగ్నిసాక్షిగనే, సుగ్రీవః = సుగ్రీవుడు, మిత్రమ్ = మిత్రుడుగా, అభ్యుపగతః = స్వీకరింపబడెను.

పరమితి :- (సహర్షమ్ = ఆనందముగా) దేవేన = ప్రభువుతో, అసౌ = ఈ, వికర్తనతనయః = సూర్యసుతుడు - సుగ్రీవుడు. పరమ్ = మిక్కిలి, అనుగృహీతః = అనుగ్రహింపబడినాడు. (సపరిహాస స్మితమ్ చ = మేలపు నవ్వుతో)

సుగ్రీవే ఇతి :- దేవ = ప్రభూ!, త్వదీయమ్ = నీయొక్క, మనః = మనస్సు, సుగ్రీవే = సుగ్రీవునియందు, పక్షపాతమధురమ్ యది = అనుగ్రహసుందరమైనచో, తేన = దానిచే, నః = మాకు, కిమ్ = ఏమిలాభము- అది మాకు తెలియుట వలన ప్రయోజనములేదనుట. భగవాన్ = ప్రత్యక్షదైవమగు, అంభోజినీవల్లభః = సూర్యుడు, విదాంకరోతు = తెలియజెప్పబడునుగాక! — సూర్యునికి తెలియపరచుమనుట. ఆత్మజ = తనయునికి (సుగ్రీవునికి) జరిగిన, రాజ్యలాభ = రాజ్యప్రాప్తివల్లనైన, రభస = ఆనందాతిశయముతో, ఉద్భూతేన = కలిగినదై, సవ్యేన = క్రొంగ్రొత్తదైన, అధికేన = అధికమైన, తేజసా = కాంతితో, యః = ఆ సూర్యుడు, పూర్వస్మాత్ = మునుపటికంటె, దుస్సహతరః = ప్రచండుడై, లోకేషు = లోకములయందు

లక్ష్మణః :- (విహస్య) కథం తపనతనయస్య రాజ్యమంగీకారితా వయం
వయస్యేన.

రామః :- (సస్మితమ్) వత్స గుహ. న తావత్త్ప్రకాశమేవం ప్రతిశుశ్రూ
షతి మే హృదయమ్.

---

వర్తిష్యతే = ప్రవర్తించును. (శరత్తు గడచి గ్రీష్మము వచ్చుట) సూర్యసాక్షికముగా ప్రతిజ్ఞ చేయుమని వ్యంగ్యము. (శార్దూలము)

తాత్పర్యము :- రామా ! సుగ్రీవునిపట్ల నీ మనస్సు మొగ్గుచూపునేని మాకు ఒరుగునదేమి ! ఇది సూర్యునికి తెలియజెప్పుము. అతడు తన కుమారునికి కలుగుచున్న రాజ్యప్రాప్తికి ఆనందపరవశుడై రెట్టించిన కాంతితో లోకములను ప్రకాశింపజేయును.

సమాసములు :- పక్షపాతేన మధురమ్. అంభోజినీనాం వల్లభః. ఆత్మజాయ రాజ్యలాభః - లాభేన రభసమ్ - రభసేన ఉద్భాతమ్ - తేన.

సంధులు :- నః + తేన, యః + తేజసా - సాదేశవిసర్గ. నవ్యేన + ఆత్మజ - సవర్ణదీర్ఘ. రభస + ఉత్ - గుణసంధి. దుస్సహతరః + లోకేషు - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుకృఞ్ కరణే. పరస్మై. లోట్. ప్రథమ.

కరోతు /కురుతాత్ - కురుతామ్ - కుర్వన్తు
వృతుఙ్ వర్తనే. ఆత్మనే. లృట్. ప్రథమ
వర్తిష్యతే - వర్తిష్యేతే - వర్తిష్యన్తే

కథమితి :- (విహస్య = బిగ్గరిగా నవ్వి) కథమ్ = ఎట్లా ! వయస్యేన = గుహునిచే, వయమ్ = మేము. తపనతనయస్య = సుగ్రీవునికి రాజ్యమ్=రాజ్యమును. అంగీకారితాః = (సంపాదించి ఇచ్చుటకు) అంగీకరింపజేయబడితిమి ! వాక్చాతుర్యముతో మమ్ము ప్రతిజ్ఞకు అంగీకరింపజేయుచున్నాడనుట.

వత్సేతి :- (సస్మితమ్ = చిరునవ్వుతో) వత్స = నాయనా ! గుహ ! మే = నాయొక్క. హృదయమ్ = అంతరంగము, ఏవమ్ = ఇట్లని - వాలిని సంహరించి సుగ్రీవునికి పట్టము కట్టుదునని. ప్రకాశమ్ = పల్లెటికిని వినిపించునట్లు. ప్రతి

గుహః :- (సప్రశ్రయస్మితమ్) స్వామిన్. ఇయమేవ మహతాం స్థితి

సంతో మనసికృత్యైవ ప్రవృత్తాః కృత్యవస్తుని ।
కస్య ప్రతిశృణోతి స్మ కమలేభ్యః శ్రియం రవిః॥ 35

(నేపథ్యే)

భోభో వనౌకసః, కథయన్తు భవన్తః. దుందుభి కరంక విశేష

---

ప్రతిశ్రాష తిన = ప్రతిజ్ఞచేయ నిచ్చగింముటలేదు. (అంగీకారాభ్యుపగమప్రతిశ్రవసమాధయః – అమరః)

సంతఇతి :- (సప్రశ్రయస్మితమ్ = వినయముతో కూడిన చిరునవ్వుతో) స్వామిన్ = ప్రభూ ! మహతామ్ = మహానుభావులయొక్క. స్థితిః = పద్ధతి. ఇయమ్ ఏవ = ఇదేకదా ! సన్తః = సత్పురుషులు. మనసికృత్యైవ = మనసులో (మాత్రమే) నిశ్చయించుకొని. కృత్యవస్తుని = కర్తవ్యముపట్ల – చేయదగిన కార్యమునందనుట. ప్రవృత్తాః (భవన్తి) = ప్రవర్తింతురు–పైకి చెప్పరు, ప్రచారము కోరరు – అనుట. రవిః = సూర్యుడు. కమలేభ్యః = పద్మములకై. శ్రియమ్ = శోభను. కస్య = ఎవనికి. ప్రతిశృణోతిస్మ = వినిపించి యిచ్చును – ఎవనియెదుట ప్రతిజ్ఞగా అంగీకరించి ఇచ్చుచున్నాడనుట (షష్ఠ్యర్థప్రశ్నము). (మనసికృత్య – అనత్యాధాన ఉపసిమనసీతి గతి సంజ్ఞాయాం సమాసే ల్యప్.)

తాత్పర్యము :- సత్పురుషులు ఏ కార్యమునైనను ముందుగా ప్రకటింపక ఆచరించి చూపుదురు. సూర్యుడు పద్మములకు శోభను ఎవనియెద్ద ప్రతిజ్ఞచేసెనని పంచుచున్నాడు !

క్రియ:- శ్రు శ్రవణే, పరస్మై, లట్, ప్రథమ.

శృణోతి – శృణుతః – శృణ్వన్తి.

(నేపథ్యే = తెరలో)

భోభోఇతి :- భోభో వనౌకసః = ఓరోరీ వనవాసులారా ! భవన్తః = మీరు, కథయన్తు = చెప్పుడీ ! దుందుభి = దుందుభియొక్క. కరంక = అస్థిపంజరము

సంభావ్యమాన గంభీరావష్టంభ నిర్భరేణ కేనాస్మాకమియం చిరస్య భుజకాండ కండూతి రపనేష్యతే.

గుహః :- (స్వగతమ్)

మన్యే దర్పామయావిభ్యాం నిత్యం దోర్భ్యామమర్షణః ।
జాంబవత్ప్రేరణాదీప్తః ప్రాప్తోఽయం ప్లవగేశ్వరః॥ 36

తదహమపి వీరయాత్రాదర్శనసుఖం ముహూర్తమనుభవామి.

---

యొక్క, విక్షేప = విక్షేపముతో (ఎగురగొట్టుట). సంభావ్యమాన = ఊహింపబడు చున్న. గంభీర = గంభీరమైన. అవష్టంభ = విక్రమగర్వముతో. నిర్భరేణ = నిండిన వాడైన. కేన = ఏవ్యక్తిచే. అస్మాకమ్ = మాయొక్క. ఇయమ్ = ఈ, చిరస్య = చిరకాలముగానున్న (ఇంతకాలమునకని గాని) భుజకాండ = బాహుదండములయొక్క. కండూతిః = దురద. అపనేష్యతే = పోగొట్టబడనున్నది ; (భుజములయొక్క ప్రకాండమైన కండూతి అనికాని) కండూతి తీర్చువాడెవడనుట.

మన్యేఇతి :- (స్వగతమ్ = తనలో) దర్ప + అమయావిభ్యామ్=గర్వ మనునట్టి రోగముతో కూడినవైన, దోర్భ్యామ్=బాహువులతో (అమయస్య చ దీర్ఘః... వినిః దీర్ఘత్వంచ), నిత్యమ్ = ఎల్లప్పుడును, అమర్షణః=క్రోధము వహించువాడును - నిత్యక్రోధి అనుట. జాంబవత్ = జాంబవంతుడను మంత్రియొక్క. ప్రేరణ=ప్రేర ణముతో, ఆదీప్తః = ప్రజ్వరిల్లుచున్నవాడును (ప్రేరణా + దీప్తః - అనియేని). ప్లవ గేశ్వరః = వాలి, అయమ్ = ఇతడే (ఇదే), ప్రాప్తః = వచ్చెనని. మన్యే = భావించు చున్నాను.

తాత్పర్యము :- గర్వముతో రోగగ్రస్తములైన బాహువులు కలిగి నిత్య క్రోధనుడైన వాలి జాంబవంతుని ప్రేరణతో ఇదే వచ్చెను.

తదితి :- తత్ = అందుచేత. అహమ్ అపి = నేనుకూడ. వీర = వీరుల యొక్క. యాత్రా = యుద్ధయాత్రయొక్క. దర్శన = చూచుటవలని. సుఖమ్ = ఆనందమును - వీరుల యుద్ధప్రస్థానమును చూచి పొందుసుఖమనుట. ముహూర్తమ్ = క్షణకాలము. అనుభవామి = అనుభవింతును.

యథా— "వత్స, పశ్య మనుష్యపోతద్వయావష్టబ్ధేన దురాత్మనా కపికీటేన కథం విజృంభితమ్"-ఇతి.

సారణః :- తత స్తతః.

మాల్యవాన్ :- తతో విభీషణః ప్రణమ్య వ్యజిజ్ఞపత్—"దేవ !—

జాతిం మానయ మానుషీమభిముఖో దృష్ట స్త్వయా హైహయః
స్మృత్వా వాలిభుజౌ న సాంప్రతమవజ్ఞాతుం చ తే వానరాః ।

---

పలికెను, యథా=ఎట్లనగా - వత్స=అనుజా ! పశ్య=చూడుము, మనుష్యపోతద్వయ= మానవ శిశువులిరువురిచే, అవష్టబ్ధేన = స్వీకరింపబడిన - రామలక్ష్మణుల బలముతో గర్వించిన వాడనుట, దురాత్మనా = దుష్టుడగు, కపికీటేన = వానర కీటకముచే - అల్ప వానరమనుట, కథమ్ విజృంభితమ్ = ఏట్లు విజృంభింపబడినదో ! - ఇతి=అని - రావణుడు విభీషణునితో పలికెనని అన్వయము. (అవష్టంభేన అని పాఠాంతరము).

తత ఇతి :- తత స్తతః = ఆపైని.

తత ఇతి :- తతః = అప్పుడు, విభీషణః = విభీషణుడు, ప్రణమ్య = నమస్కరించి, వ్యజిజ్ఞపత్ = ఇట్లు విన్నవించెను, దేవ = మహారాజా !—

జాతిమితి :- మానుషీమ్ జాతిమ్ = మానవజాతిని, మానయ = గౌరవింపుము. త్వయా=నీచేత, హైహయః=మానవుడగు కార్తవీర్యార్జునుడు, అభిముఖః= ప్రత్యక్షముగా, దృష్టః=చూడబడినాడు-నీకా అనుభవమున్నది-వాలిభుజౌ=వానరుడైన వాలి భుజములను, స్మృత్వా = తలచుకొని, తే = నీకు, వానరాః = వానరులు, అవజ్ఞాతుమ్ = అవమానించుటకు, సాంప్రతమ్ న = యుక్తముకాదు. వానరులని తిరస్కారము తగదనుట (యుక్తే ద్వే సాంప్రతం స్థానే) తత్ = అందుచేత, పౌలస్త్య = ఓ రావణా ! మహాగ్నిహోత్రిణమ్ = నిరంతరము నిష్ఠతో గార్హపత్యాగ్నిని అర్చించువాడవైన, త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, ఏతత్ = ఇది - ఈ చెప్పబోవునది, అభ్యర్థయే = అభ్యర్థించుచున్నాను, సీతామ్ = జానకిని, అర్పయ = రామునికి అప్పగించుము, చ=మరియు, కారాకుటుంబీకృతాన్=కారాగారమునందు బంధింపబడినవారగు క్రతుభుజః = దేవతలను, ముంచ=విడువుము,

తత్పౌలస్త్య! మహాగ్నిహోత్రిణమహం త్వామేతదభ్యర్థయే
సీతామర్పయ ముంచ చ క్రతుభుజః కారాకుటుంబీకృతాన్ ॥ 7

సారణః :- (సబహుమానాశ్చర్యమ్) అహహ. "వాలిభుజౌ" ఇతి బ్రువతా మాతామహేన కిమపి స్మారితోఽస్మి. ఆర్య.

కిమాచక్షే సేతుక్షితిధర శిరః శ్రేణి కషణైః
ప్రకోష్ఠే నీరోమ్ణః కపిభటభుజ స్తంభనివహాన్ ।

---

తాత్పర్యము :- కార్తవీర్యార్జునుని నీవెరుగుదువు. కావున మానవజాతిని గౌరవింపక తప్పదు. వాలి భుజబలము నీవెరుగుదువు. కావున వానరులను అగౌరవింపదగదు. ఓ పులస్త్యవంశసంభవా! ఓ నిత్యాగ్నిహోత్రీ! నిన్ను ఒక్కటే కోరుచుంటిని. సీతను రామునికి అప్పగించుము. నీ కారాగారములో క్రమ్గుచున్న దేవతలను విడిచి పెట్టుము. (శార్దూలము)

సంధులు :- అభిముఖః + దృష్టః = ఉత్వాదేశ విసర్గ. దృష్టః + త్వయా - సాదేశ విసర్గ. మహా + అగ్ని - సవర్ణదీర్ఘ. అభి = అర్థయే - యణాదేశ.

అహహేతి :- (సబహుమానాశ్చర్యమ్ = గౌరవముతో. ఆశ్చర్యముతో) అహహా! "వాలిభుజౌ" ఇతి = వాలి భుజములు అని. బ్రువతా = చెప్పుచున్న. మాతామహేన = తాతగారిచే. కిమపి = ఏదో. స్మారితః = గుర్తు తేబడినవాడను. అస్మి = అయితిని - ఏదో గుర్తు వచ్చుచున్నదనుట. ఆర్యా!

కిమితి :- సేతు = సేతు నిర్మాణము కొఱకు. క్షితిధర = పర్వతముల యొక్క. శిరః శ్రేణీ = శృంగసమూహమును తెచ్చుటలోనైన. కషణైః = ఒరిపిడులతో. ప్రకోష్ఠే = ముంజేతియందు. నీరోమ్ణః = వెంట్రుకలు లేనివైన - ఆ ఒరిపిడికి వెంట్రుకలు రాలిపోయినవనుట. కపిభటభుజ స్తంభ నివహాన్ - కపిభట = వానరవీరుల యొక్క. భుజ = బాహువులనునట్టి. స్తంభనివహాన్ = స్తంభముల సమూహములను. కిమ్ ఆచక్షే = ఏమని వర్ణింపను! చెప్పజాలననుట. సుమేరోః = మేరుపర్వతము యొక్క. మాత్సర్యాత్ = స్పర్ధవలన. అనతిచిర = నూతనముగా. సంరూఢ = మొలచినవై. మృదుభిః = మెత్తనివైన. శిరోభిః = శృంగములతో. వింధ్యః అపి =

సుమేరోర్మాత్సర్యాదనతిచిర సంరూఢమృదుభిః
శిరోభిర్వింధ్యో యద్భరమపి న సోఢుం పరివృఢః ॥ 8

(సాశంకమ్) తత స్తతః.

మాల్యవాన్ :- తతశ్చ రోషాంధతామిస్రే మజ్జతా రాక్షసరాజేన తథా చేష్టితం యథా విపక్షమప్యాశ్రితః.

---

వింధ్యపర్వతము గూడ, యద్భరమ్ = ఆ బాహుస్తంభముల భారమును, సోఢుమ్ = మోయుటకు. న పరివృఢః = సమర్థముకాదు. (శిఖరిణి)

తాత్పర్యము :- వానరుల బాహుస్తంభములను గూర్చి ఏమి చెప్ప మందువు ! అహో ! సేతుబంధనముకై పర్వత శృంగములను పెకలించి తెచ్చునప్పుడు ఆ ఘర్షణలో కపివీరుల భుజములకు మోచేతివరకు రోమములు రాలిపోయినవి. మేరువుతో స్పర్ధపడి విజృంభించిన వింధ్య శిఖరములు కూడా - నూతనములై మెత్తగా నుండియు_ఆ వానర బాహుస్తంభ సమూహముల భారమును మోయజాలవు.

సమాసములు :- క్షితేః ధరః - శిరసాం శ్రేణీః — క్షితిధరాణాం శిరః శ్రేణీః - శ్రేణేః కషణమ్ - సేతవే క్షితి....కషణమ్ — తైః. కపయశ్చ తే భటాశ్చ- భుజాః స్తంభా ఇవ — స్తంభానాం నివహః — కపిభటానాం భుజస్తంభ నివహాః — తాన్. అనతిచిరే సంరూఢాని చ తాని మృదూని చ - తైః శిరోభిః.

సంధులు :- మేరోః + మాత్సర్యాత్. శిరోభిః + వింధ్యః - రేఫాదేశ విసర్గ. వింధ్యః + యత్ - ఉత్వాదేశ విసర్గ. నిర్ + రోమ్ణః - ధలోపదీర్ఘ సంధి.

క్రియ :- చక్షిఙ్ వ్యక్తాయాం వాచి. లట్. ఆత్మనే. ఉత్తమ (లట్)
చక్షే - చక్ష్వహే - చక్ష్మహే

తత ఇతి :- (సాశంకమ్ = శంకించుచు) తత స్తతః = అటుపైని.

రోషేతి :- తతశ్చ=అంతట, రోషాంధతామిస్రే=గాఢాంధకారమునందు, మజ్జతా = మునిగిపోవుచున్న, రాక్షసరాజేన = రావణునిచే. తథా చేష్టితమ్ = అట్లు ప్రవర్తింపబడినది. యథా = ఏవిధముగా విభీషణుడు. ప్రతిపక్షమ్ అపి = శత్రుపక్షము నైనను, ఆశ్రితః = ఆశ్రయించెనో — ఆ విధముగా రావణుడు ప్రవర్తించెనుట.

సారణః :- (సఖేదమాకాశే) హాదేవ పులస్త్యనందన, కథం భవతైవ వైధర్మ్యదృష్టాంతేన మానతో మూలోచ్ఛేదనిమిత్తా న్నివర్తిష్యతే లోకః. (సాభ్యర్థనం చ).

అరిషడ్వర్గ ఏవాయమస్యాస్తాత పదాని షట్ ।
తేషామేకమపి చ్ఛిందన్ ఖంజయ భ్రమరీం శ్రియమ్ ॥ 9

(మంత్రిణంప్రతి) ఆర్య, యత్సత్యం రాఘవేణ వ్యూఢాం వానరవరూథినీ ముత్ప్రేక్ష్య శంకే-విభీషణ ఏవ యద్యస్మాకం కులతంతురవశిష్యేత.

---

హేతి :- (సఖేదమ్ = దుఃఖముతో, ఆకాశే = ఆకాశమునందు చూపు నిలిపి) హా = అయ్యో । దేవ = మహారాజా । పులస్త్యనందన = రావణాసురా । కథమ్ = ఎట్లా । వైధర్మ్య దృష్టాంతేన = వ్యతిరేకోదాహరణముగానైన, భవతా ఏవ = నీచేతనే, లోకః = ప్రపంచము, మూలచ్ఛేద నిమిత్తాత్ = వంశనాశన కారణ మగు, మానతః = అహంకారము నుండి, నివర్తిష్యతే = మరలింపబడుచున్నది. అహంకారము వంశనాశకము. చూడుడీ రావణుని - అని లోకము గ్రహించునట్లు చేసికొంటివనుట. (వైధర్మ్య = ధర్మాతిక్రమణము వలన. దృష్ట = పొందబడిన, అంతేన = నాశము కలవానిచే) (సాభ్యర్థనమ్ చ = అభ్యర్థించుచున్నట్లుగా).

అరీతి :- తాత = నాయనా । అస్యాః = ఈ సంపదకు (లక్ష్మికి). అయమ్ = ఈ, అరిషడ్వర్గః ఏవ = కామక్రోధలోభమోహ మద మాత్సర్యములు ఆరును, షట్ పదాని = ఆరు - ప్రయాణసాధనములు - పాదములు. తేషామ్ = వానిలో, ఏకమ్ అపి = ఒక్కదానినేని (పాదమును), ఛిందన్ = విరుగగొట్టినవాడవై, భ్రమరీమ్ = చంచల స్వభావము కలదగు, శ్రియమ్ = లక్ష్మిని, ఖంజయ = కుంటు వరచుము - కదలనిదిగా ఇంటనుండుకొనుమనుట. తుమ్మెదకు ఆరు పాదములుండుటచే షట్పది - అరిషడ్వర్గముతో లక్ష్మి భ్రమరిగా భావింపబడినది. (పథ్యా వక్త్రము).

తాత్పర్యము :- అరిషడ్వర్గమే లక్ష్మీదేవి పారిపోవుటకు ఆరుపాదములు. వానిలో నొక్కదానినేని ఖండించుచో లక్ష్మి స్థిరముగా నిలుచును. ఓ తంత్రీ । అది చేయుము. చంచలయగు శ్రీని నిలుపుకొనుము.

మాల్యవాన్ :- (నిఃశ్వస్య) వత్స, ద్వయోరపి కటకయోస్తత్త్వజ్ఞోఽసి. తత్కిమిదానీముచితమ్.

సారణః :- ఆర్య, నన్వేవం బ్రవీమి—రాజపుత్రోఽఙ్గదోఽసౌ బాలో నవబుద్ధిరామపాత్రమివ యద్యదాధీయతే తత్తదాచుచూషతి.

---

సంధులు :- వర్గః + ఏవ - విసర్గలోపః. ఏవ + అయమ్ - సవర్ణదీర్ఘః. అస్యాః + తాత - సాదేశవిసర్గ. అపి + ఛిందన్ - తుగాగమః.

క్రియ :- ఖజి గతివైకల్యే. లోట్, పరస్మై. మధ్యమ

ఖంజయ / ఖంజయతాత్ — ఖంజయతమ్ — ఖంజయత

ఆర్యేతి :- (మంత్రిణమ్ ప్రతి = మంత్రినుద్దేశించి — మాల్యవంతుడు రావణుని మంత్రి) ఆర్యా! రాఘవేణ = రామునిచే. వ్యూఢామ్ = వ్యూహారచనతో స్థాపింపబడిన లేక అధిష్ఠింపబడిన (వ్యూఢంతు బలవిన్యాసే) వానర వరూథినీమ్ = వానరసేనను. ఉత్ప్రేక్ష్య = పరిశీలించిన మీదట. సత్యమ్ = నిజముగా. శంకే = ఇట్లు భావించుచున్నాను — ఏమనగా - విభీషణః ఏవ = విభీషణుడొక్కడే. అస్మాకమ్ = మనయొక్క. కులతంతుః = రాక్షస వంశమునకు సూత్రముగా, అవశిష్యతే = మిగులునని - వంశవర్ధకుడైన ఏకైక వ్యక్తిగా అతడు మిగులును తక్కిన రాక్షసులందరును నశింతురనుట.

వత్సేతి :- (నిఃశ్వస్య = నిట్టూర్చి) వత్సా! ద్వయోః = రెండయిన. కటకయోఃఅపి = సేనా సన్నివేశములయొక్కయు. తత్త్వజ్ఞః = స్వరూపము నెరిగిన వాడవు. అసి = అయితివి. రెండింటి బలాబలముల నెరిగినవాడవు నీవొక్కడవే. తత్ = అందుచేత, ఇదానీమ్ = ఇప్పుడు. కిమ్ ఉచితమ్ = ఏది చేయదగినది - నీవే చెప్పవలెనను.

ఆర్యేతి :- ఆర్యా! ఏవమ్ = ఇట్లు. బ్రవీమి = చెప్పుదును - రాజపుత్రః = వాలి సుతుడైన. అంగదః = అంగదుడు. బాలః = చిన్నవయసువాడు. నవబుద్ధిః = క్రొత్తగా ఇప్పుడిప్పుడే అంకురించుచున్న ఆలోచనలు కలవాడు. యద్యత్ ఆధీయతే = ఏదియేది చేతికి అందింపబడునో, తత్తత్ = దానినట్లు. ఆమపాత్రమ్ ఇవ = అపక్వ పదార్థముతో నిండిన పాత్రనువలె, ఆచుచూషతి = త్రాగును (చూష పానే).

మాల్యవాన్ :- తతః కిమ్ ।

సారణః :- తతశ్చ భవతః పితృవైరిణౌ రామసుగ్రీవౌ వ్యాపాద్య కిష్కింధాయాం భవంత మభిషిచ్య వాలిసౌహృదస్యాత్మాన మనృణమిచ్ఛామ ఇతి గూఢప్రణిధిముఖేన దశకంధరాదేశ మభిధాయ సుగ్రీవశిబిరాదపవాహ్యతే. తస్మిన్నపక్రాంతే తు స్వగృహమహిభయోపజాపజర్జరమపేక్షమాణో వానరపతిః శిథిలితరామప్రయోజనః స్యాత్.

మాల్యవాన్ :- (సస్మితమ్) వత్స. సాధు సమర్థయసే. కిం పునః స్వయ మంగదో గర్భరూపోఽభినవోజ్జ్వలయౌవరాజ్యసుఖోపలాలితో

---

తతఇతి :- తతః కిమ్ = అయిననేమి ।

భవత ఇతి :- భవతః = నీయొక్క, పితృవైరిణౌ = తండ్రికి శత్రువులైన. రామసుగ్రీవౌ=రామసుగ్రీవులను. వ్యాపాద్య=సంహరించి కిష్కింధాయామ్= కిష్కింధయందు. భవంతమ్ = నిన్ను. అభిషిచ్య = అభిషేకించి, వాలి సౌహృదస్య= వాలితో మాకుగల స్నేహమునకు - సద్భావమునకు. ఆత్మానమ్ = నన్నునేను. అనృణమ్ = ఋణము తీర్చుకొన్నవాడనుగా. ఇచ్ఛామః = కోరుకొనుచున్నాము - ఇతి = అని. గూఢప్రణిధిముఖేన=రహస్యదూతతో, గూఢచారితో. దశకంధరాదేశమ్= రావణుని ఆజ్ఞగా (ఆజ్ఞా నిదేశ ఆదేశః) అభిధాయ = తెలియపరచి. సుగ్రీవ శిబిరాత్= సుగ్రీవుని శిబిరమునుండి. అపవాహ్యతే=మన పక్షమునకు అంగదుడు రావింపబడును. తస్మిన్ = ఇట్లా అంగదుడు. అపక్రాంతే తు=వెలుపలికి రావింపబడగా. వానరపతిః= సుగ్రీవుడు. స్వగృహమ్ = తన గృహమును. అహిభయ = స్వపక్ష ప్రభవమగు భయముతో (మహీభుజామహిభయం స్వపక్షప్రభవం భయమ్ - అమరః) ఉపజాప = భేదముకో (సమౌ భేదోపజాపౌ). జర్జరమ్ = వ్యాకులమైనదానినిగా. అపేక్షమాణః = గుర్తించినవాడై, శిథిలిత=సడలిపోయిన. రామప్రయోజనః=రామకార్యము కలవాడు. స్యాత్ = అగును.

వత్సేతి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) వత్సా ।సాధు = లెస్సగా సమర్థయసే = ప్రతిపాదించుచుంటివి. కింపునః=కానీ. గర్భరూపః=బాలకుడగు. అంగదః=

దురపవాహ ఏవ. యే చాస్య మాతాపితృభాంధవా స్తే సుగ్రీవస్యాపి సంబంధినః కథమేన ముత్తిష్ఠమాన మను జానీయుః.

సారణః :- యథా దృష్టమార్యేణ. కించ కాలాపేక్షీ దండనీతి ప్రయోగః. తథా కథమపి మహోత్సాహైః కపిభిః సేతుకర్మణి ప్రవృత్తం యథై తావతా కాలేన సంతీర్ణమహార్ణవో రామః సువేలశై లోపత్యకామధ్యాస్తే.

---

అంగదుడు, స్వయమ్=స్వయముగా, అభినవ=క్రొత్తదియై, ఉజ్జ్వల = విరాజిల్లుచున్న, యౌవరాజ్య సుఖ=యువరాజు పదవి వలని సుఖములతో, ఉపలాలిత- = ప్రేసన్నుడు గావింపబడినవాడు, దురపవాహః ఏవ = సుగ్రీవునినుండి ఒకపాటున విడివడనివాడే. అస్య = ఈ అంగదునికి, యే = ఎవరు, మాతా పితృబాంధవాః = తల్లివైపునుండి తండ్రివైపునుండి బంధువులో, తే చ = వారే, సుగ్రీవస్య అపి = సుగ్రీవునికికూడ, సంబంధినః = సంబంధించిన వారగుటచే, ఉత్తిష్ఠమానమ్ = మనవైపునకు లేచివచ్చుచున్న, ఏనమ్ = ఈ అంగదుని, కథమ్=ఎట్లు, అనుజానీయుః=అనుసరించి వత్తురు : - వారు రారనుట. వర్ధమానుడగు అంగదుని మనవైపు రానీయరని కానీ.

యథేతి : . ఆర్యేణ = మాల్యవంతునిచే, యథాదృష్టమ్=భావింపబడినట్లే- వారు రారనుట నిజమే అని. కించ = మరియు, దండనీతి ప్రయోగః = దండోపాయమును అమలుజరుపుట అనునది, కాలాపేక్షీ=అనుకూల సమయమును అపేక్షించునది, అదనుకై వేచియుండవలెననుట, మహోత్సాహైః = గొప్ప ఉత్సాహముగల, కపిభిః= వానరులచే, కథమపి = ఎట్లో, సేతుకర్మణి = సేతు నిర్మాణమునందు, తథా ప్రవృత్తమ్ = ఆ రీతిగా ప్రవర్తింపబడినది, యథా = ఎట్లనగా, ఏతావతా కాలేన = ఈ సమయమునకు, రామః = రాముడు, సంతీర్ణ మహార్ణవః = దాటిన సముద్రము కలవాడై, సువేలశై లోపత్యకామ్=సువేల పర్వతప్రాంతమును, (ఉపత్యకాద్రేరాసన్నా భూమిః - అమరః), అధ్యాస్తే = చేరుకొనియుండును. ఈ పాటికి రాముడు సముద్రమును దాటుటకు వీలుగా వానరులు సేతునిర్మాణమున పాల్గొనియుందురనుట.

మాల్యవాన్ :- (సవిమర్శాద్భుతమ్) అహహా ।

అసౌ మనుష్యమాత్రేణ లంఘితో యది సాగరః ।
ప్రతాపో దశకంఠస్య భువనైరపి లంఘితః ॥ 10

(సఖేదం చ)

పౌలస్త్యస్య సురాసురేంద్రశిరసాం నిర్మాల్యమంఘ్రిద్వయం
కుర్వాణేన రఘూద్వహేన ఘటితే సేతౌ నిధావంభసామ్ ।

---

అసావితి :- (సవిమర్శాద్భుతమ్=పాలోచనగా ఆశ్చర్యముతో) అహహా! అసౌ = ఈ శతయోజన విస్తీర్ణమగు, సాగరః = సముద్రము, మనుష్యమాత్రేణ = మానవ మాత్రునిచే, లంఘితః యది = దాటబడినదేని దశకంఠస్య=రావణుని యొక్క, ప్రతాపః అపి = పరాక్రమముకూడ - తేజస్సు, భువనైః = ముల్లోకములచే - ముల్లోకములవారిచే ననుట, లంఘితః = దాటబడినదన్నమాటే — అందరికిని ఇక లోకువ యనుట. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :— శతయోజన విస్తీర్ణమగు మహాసముద్రమును రాముడు లంఘించుటే జరిగినచో రావణప్రతాపము ఇక సర్వులకును లోకువే అనుట.

సంధులు :— లంఘితః + యది ప్రతాపః + దశ - ఉత్వాదేశవిసర్గ. భువనైః + అపి - రేఫాదేశవిసర్గ.

పౌలస్త్యేతి :- (సఖేదమ్ చ = ఖేదముతో) పౌలస్త్యస్య = రావణుని యొక్క, అంఘ్రి ద్వయమ్ = పాదముల జంటను, సురాసురేంద్ర శిరసామ్ = దేవ దానవుల శిరస్సులకు, నిర్మాల్యమ్ = త్యాజ్యవస్తువుగా, కుర్వాణేన = చేయువాడైన, రఘూద్వహేన=రామునిచే, అంభసామ్ నిధౌ = సముద్రమునందు, సేతౌ = సేతువు, ఘటితే = నిర్మింపబడుచో, అద్య = ఇంకనిప్పుడు, ఇద్ధః = ప్రచండుడగు, రవిః = సూర్యుడు, రాజీవమ్ = పద్మమును, స్వహస్తవిధృతమ్=తన కిరణములతో ధరింప బడినదిగా, ఉన్ముద్రయతి=వికసింపజేయును, చ=మరియు, ప్రత్యావృత్తరసస్య=తిరిగి పొందిన రసముకలవాడగు, ఇందోః = చంద్రుని యొక్క, కళాః = కళలు, అమృతభుజామ్ = దేవతలకు (అమృతము భుజించువారు), స్వదంతే = ఆనంద దాయకము లగును. (శార్దూలము)

అద్యోన్ముద్రయతి స్వహస్తవిధృతమ్ రాజీవమిష్టో రవిః
ప్రత్యావృత్తరసస్య చామృతభుజామిందోః స్వదంతే కలాః ॥ ౹౹

(విమృశ్య) వత్స. సారణ, వాలివధవిశుద్ధపార్ష్ణేరనేకవానరానీకనాయకేన సాక్షాదుపకృతేన సఖ్యా సుగ్రీవేణ మహాపక్షస్య హనుమత్ప్రభృతిభిర్జాతాస్కందీయు

---

తాత్పర్యము :- రావణాసురుని పాదములకు మ్రొక్కుటయను దుర్గతి నుండి దేవదానవులను తప్పింపబోవుచున్న రాముడు సముద్రమునకు సేతువును నిర్మించెనేని ఇకపై సూర్యుడు స్వకిరణములతో స్వేచ్ఛగా పద్మములను వికసింప జేయును. చంద్రకళలను దేవతలు సుఖముగా భుజింతురు.

సమాసములు :- సురాశ్చాసురాశ్చ సురాసురాణామింద్రాః - ఇంద్రాణాం శిరాంసి – తేషామ్. స్వస్య హస్తాః – స్వహస్తైః విధృతమ్. ప్రత్యావృత్తః రసః యస్య సః – తస్య. అమృతం భుఞ్జతే – తేషామ్.

సంధులు :- సుర + అసుర, రఘు + ఉద్యోగేన, చ + అమృత - సవర్ణదీర్ఘ. అసుర + ఇంద్ర అద్య + ఉత్ - గుణసంధి. సఖే + అంజసామ్ - అయవాదేశ. ఉత్ + ముద్రయతి - అనునాసికాదేశ. ఇష్టః + రవిః – ఉత్వ ఓత్వ విసర్గ ప్రతి + ఆవృత్త - యణాదేశ.

క్రియ :- ముద్రా (ణిచ్) పరస్మై. లట్, ప్రథమ. (ఉత్)
ముద్రయతి - ముద్రయతః – ముద్రయన్తి
ష్వదిట్ ఆస్వాదనే, లట్, ఆత్మనే, ప్రథమ.
స్వదతే - స్వదేతే - స్వదన్తే

వత్సేతి :– (విమృశ్య = ఆలోచించి) వత్స ! సారణా ! వాలివధ = వాలిని సంహరించుటతో, విశుద్ధపార్ష్ణేః = భయరహితము గావింపబడిన పృష్ఠదేశము కలవాడును. వెనుకనుండి శత్రువు దాడిచేయునను భయము లేనివాడనుట. అనేక వానరానీక = అనేక వానరసైన్యమునకు. నాయకేన = అధిపతియును. సాక్షాత్ ఉపకృతేన = ప్రత్యక్షముగా ఉపకారము పొందినవాడును, సఖ్యా = మిత్రుడునగు. సుగ్రీవేణ = సుగ్రీవునిచే, మహాపక్షస్య = ప్రబలపక్షమైనవాడును, హనుమత్ప్రభృతి = ఆంజనేయుని మొదలైన వారిచే

వృత్తేరయమేవ సువిహిత సకలాభియాస్యత్కర్మణ స్తస్యాభియోగ సమయః.

సారణః :- ఆర్య. అయమేవాత్మద్రవ్యప్రకృతిసంపన్నో నయస్యాధి ష్ఠానం విజిగీషురితి ప్రథమోదాహరణం దాశరథిః.

మాల్యవాన్ :- (స్తంభం నాటయిత్వా)

యత్తస్మిన్నిహతేఽపి వాలిని వయం క్షుద్రా స్తథైవాస్మహే
తద్యుక్తం భుజయోర్బలాదపి బలం దుర్గస్య దుర్నిగ్రహమ్।

---

జ్ఞాత = తెలియబడిన. అస్మదీయవృత్తేః = మన వ్యవహారము కలవాడునై . సువిహిత= ఇట్లు లెస్సగా నిర్వహింపబడిన, సకల + అభియాస్యత్ కర్మణః = యుద్ధారంభమునకు అవసరమైన అన్ని పనులను కల్గినవాడైన, తస్య = ఆ రామునికి. అయమ్ ఏవ = ఇదియే, అభియోగ సమయః = దాడివెడలుటకు తగిన సమయము. యుద్ధము ప్రారం భించుటకు కావలసిన అన్ని ఏర్పాట్లును చేసికొన్నాడనుట.

ఆర్యేతి :- ఆర్యా। ఆత్మద్రవ్య ప్రకృతి సంపన్నః = తపస్సు త్యాగము ఓర్పు మొదలగు ఆత్మ గుణములతోను దుర్గకోశాదికమగు ప్రకృతి సంపదతోను విల సిల్లువాడై . నయస్య = రాజనీతికి. అధిష్ఠానమ్ = ఆశ్రయమైనవాడు. విజిగీషుః ఇతి = జయశీలుడు అనుటకు, అయమ్ = ఈ. దాశరథిః ఏవః = రాముడే. ప్రథమోదా హరణమ్ = మొట్టమొదటి ఉదాహరణము.

యదితి :- (స్తంభమ్ నాటయిత్వా = నిశ్చేష్టత్వమును అభినయించి) తస్మిన్ = మహాబలశాలియగు, వాలిని = వాలి, నిహతే అపి = సంహరింపబడినను, వయమ్ = మేము. క్షుద్రాః = అల్పబుద్ధులము, తథా ఏవ = అట్లే. ఆస్మహే = ఉంటిమి. ఏమియు స్పందించలేదు జాగ్రత్తపడలేదు అనుట. తత్ = అది. యుక్తమ్ = యుక్తమే. ఏలయన - భుజయోః = బాహువులయొక్క, బలాత్ అపి = బలముకంటె. దుర్గస్య= (జల) దుర్గముయొక్క. బలమ్ = బలము. దుర్నిగ్రహమ్ = ఆక్రమించుటకు కష్ట సాధ్యము. సముద్రమధ్యముననున్న లంక శత్రువులకు లొంగదనుట. తు = కానీ. జగత్ = ప్రపంచమునందు, విలక్షణ = విశిష్టములగు. గుణగ్రామేణ = గుణముల సమూహముకలవాడును. మర్త్యేనఅపి = మానవమాత్రుడునైన, రామేణ = దాశరథి

మర్త్యేనాపి జగద్విలక్షణ గుణగ్రామేణ రామేణ తు
ద్వే గవ్యూతిశతే హి నామ కియతీ తీర్ణోఽయమర్ణోనిధిః ॥ 12

(దీర్ఘముష్ణం చ నిఃశ్వస్య ఆకాశే)

తర్షాత్రివ్యతిలేలిహాన రసనారమ్యైర్ముఖై రష్టభిః
క్రందన్తీ క్రమశః పపౌ దశముఖీ వత్సస్య యస్యాః స్తనౌ ।

---

చేత. అయమ్ = ఈ. అర్ణోనిధిః=సముద్రము. తీర్ణః = దాటబడినది. ద్వే=రెండయిన. గవ్యూతిశతే నామ = రెండువందల క్రోశములనగా. కియతీ = ఏపాటి । గవ్యూతిః స్త్రీ క్రోశయుగమ్ - అని అమరము. గవ్యూతి అనగా రెండు క్రోశములు. గవ్యూతి శత మనగా రెండువందల క్రోశములు. అవి ద్వే - రెండనగా మొత్తము నాలుగువందల క్రోశములు. నాలుగు క్రోశములు ఒక యోజనము. నాలుగువందల క్రోశములనగా వంద యోజనములు. సముద్రము శతయోజన విస్తీర్ణమని । (శార్దూలము)

తాత్పర్యము :- వాలిని రాముడు సంహరించినప్పుడు మేము పేల్కొన మైతిమి. సముద్రమధ్యమున నున్న లంక దుర్జయమనుకొంటిమి. సైనికబలముకన్న దుర్గబలము గొప్పది. కానీ జగద్విలక్షణ గుణ సంపన్నుడగు రాముడు సముద్రమును గూడా దాటివచ్చెను. అట్టివారికి శతయోజనములొక లెక్కయా ।

సంధులు :- నిహతే + అసి. తీర్ణో + అయమ్-పూర్వరూప. తీవ్రాః + తథా - సాదేశవిసర్గ. తథా + ఏవ - వృద్ధి. ఏవ + అస్మహే. మర్త్యేన + అపి-సవర్ణ దీర్ఘ. భుజయోః + బలాత్ - రేఫాదేశవిసర్గ. అర్ణస్ + నిధిః - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- ఆసట్ ఉపవేశనే (లుక్) ఆత్మనే. లట్. ఉత్తమ.

ఆసే - ఆస్వహే - ఆస్మహే

తర్షాత్రీతి :- (దీర్ఘమ్ ఉష్ణమ్ చ నిఃశ్వస్య = పేడిగా నిట్టూర్చి. ఆకాశే = ఆకాశమున దృష్టినిల్పి) వత్సే = తల్లీ । నైకషి=ఓ కైకసీ । (కైకసి - అనియు పాఠాంతరము. "నికషా" అనునామె రాక్షసి - నైకషీ - నికషాయాః అపత్యం స్త్రీ నైకషీ. స్త్రీభ్యోఢక్ అను సూత్రముచే నైకషేయీ అని యుండవలెను. కానీ క్వచిదప వాదవిషయే...ప్యుత్సర్గః ప్రవర్తతే అను నియమమునననుసరించి ఢక్ బదులుగా అణ్ చేరినది) విశ్వవిజనసీ సీమంతముక్తామణిః = ప్రపంచమందలి వీరమాతలయందు

వత్సే నైకషి విశ్వవీరజననీసీమంతముక్తామణిః
సా తాదృగ్భవతీ కథం గుణవతః పుత్రస్య కిం ద్రక్ష్యతి ॥ 13

అగ్రగణ్యురాలా ! యస్యాః = ఏసీయొక్క. స్తనౌ=పాలిండ్లను, క్రందన్తీ=అరచుతో ఏడ్చుచు, దశముఖీ = పదిముఖములు (పదిముఖముల సమూహము). తర్ష=దప్పికతో నైన, ఆర్తి = బాధచే. వ్యతిలేలిహాన = చప్పరించుచున్న. రసనా = నాల్కలతో. రమ్యైః = అందముగానున్నవియు, అష్టభిః = ఎనిమిదిగా శేషించినవియునైన, ముఖైః = ముఖములతో, క్రమశః = వరుసగా పపౌ = త్రాగెనో (ఆస్వాదించెనో) రావణుని రెండు ముఖములు పాలుగుడుచుచుండగా తక్కిన ఎనిమిది ముఖములును నాల్కలు చప్పరించుచు రోదించుచున్నవనుట - ఇట్లు క్రమముగా పదిముఖములును పాలుత్రాగినవని. తాదృక్ = అటువంటి, సా భవతీ = ఆ నీవు - అంతటి పుత్ర వాత్సల్యము కలదానవు. గుణవతః = గుణవంతుడగు, పుత్రస్య = రావణునియొక్క, కిమ్ = అవాచ్యమగు మరణమును, కథమ్ ద్రక్ష్యతి = ఎట్లు చూడగలవు ! పుత్ర మరణమునకెట్లు తట్టుకొనగలవనుట. (శార్దూలము).

తాత్పర్యము :- రావణుని కన్నతల్లీ ! ఓ కైకసీ ! (నైకషీ) ఓ వీర జననీ ! దశముఖములలో రెండు పాలు త్రాగుచుండగా తక్కిన ఎనిమిది ముఖములును నాలుకలు చప్పరించుచు విలపించుచుండగా ప్రేమతో పుత్రుని పెంచితివి. అట్టికుమారుని దుర్గతిని నీవెట్లు చూడగలవు తల్లీ !

సమాసములు :- తర్షేణ ఆర్తిః = ఆర్త్యా లేలిహానాశ్చ తాః రసనాశ్చ. రసనాభిః రమ్యైః. దశానాం ముఖానాం సమాహారః - ద్విగోరితి ఙీప్ - దశముఖీ. విశ్వే వీరః - విశ్వవీరస్య జననీ - విశ్వవీరజననీషు సీమంతముక్తా మణిః.

సంధులు :- తర్ష + అతి - సవర్ణదీర్ఘ. వి + అతి - యణాదేశ. రమ్యైః + అష్టభిః - రేఫాదేశవిసర్గ.

క్రియలు :- పా పానే. పరస్మై. లిట్. ప్రథమ

పపౌ - పపతుః - పపుః

దృశిర్ ప్రేక్షణే. పరస్మై. లృట్. ("భవతీ" కర్తయగుట) ప్రథమ

ద్రక్ష్యతి - ద్రక్ష్యతః - ద్రక్ష్యన్తి

సారణః :— శాంతం శాంతమ్. ప్రతిహతమమంగళమ్. అనర్థశంకీని బంధుహృదయాని భవన్తి. కించార్య —

భుజనివహవిహంగికావలంబీ నిబిడగుణౌఘధృతోఽపి రాజ్యభారః ।
స్వయమపి దశకంధరే ధురీణే స్ఖలతి యది స్ఖలనం తదాస్య రూపమ్ ॥ 14

---

శాంతమితి :— శాంతమ్ శాంతమ్=శాంతము, శాంతము. అమంగళమ్=అశుభము. ప్రతిహతమ్ = ప్రతిహతమగుగాక । బంధుహృదయాని = బంధువుల హృదయములు. అనర్థశంకిని = అనర్థములను ఆశంకించునవి. భవన్తి = అగుచున్నవి—సాధారణముగా ఆత్మీయుల మనస్సులు అనర్థముల నాశంకించుననుట కించ = మరియు. ఆర్య ।

భుజేతి :— భుజనివహ = బాహు సమూహమనునట్టి, విహంగికా=కావిడి బద్దను. అవలంబీ = ఆశ్రయించినదియు. నిబిడ = అధికములైన (దట్టమైన) గుణ = గుణములయొక్క, ఓఘ = సమూహముచే. — గుణమనగా రజ్జువనియు. గుణౌఘ = కావిడిచేరులచే. ధృతః అపి = ధరింపబడినదయ్యు, రాజ్యభారః = సామ్రాజ్యభారము. దశకంధరే = పదితలల రావణుడు, స్వయమ్ = స్వయముగా, ధురీణే అపి = భారవాహకుడైనప్పటికి. స్ఖలతి యది = జారిపడిపోవునేని, తదా = అప్పుడు. అస్య = ఈ రాజ్య భారమునకు, స్ఖలనమ్ = జారిపోవుట యనునది. రూపమ్ = స్వభావమన్నమాట.

తాత్పర్యము :- బాహువుల సమూహమే కావిడిబద్దగా, సద్గుణ సమూహమే చేరులుగా దశకంధరునంతవాడు స్వయముగా రాజ్యభారమును వహించుచున్నప్పటికిని ఇది జారిపోయెనేని అది కావిడిబద్ద దోషముకాదు, చేరుల తప్పుకాదు, మోయువాని అసమర్థతకాదు. కేవలము రాజ్యభారమునకు జారిపోవుట స్వభావమని భావింపవలసినదే. (దశకంధరే అన్నది సాభిప్రాయ విశేష్యమగుట పరికరాంకురాలంకారము).

సమాసములు :— భుజానాం నివహః — నివహః ఏవ విహంగికా — విహంగికాయాః అవలంబీ. గుణానామోఘః - నిబిడశ్చాసౌ గుణౌఘశ్చ - ఓఘేన ధృతః రాజ్యస్య భారః. దశసంఖ్యాకాః కంధరాః యస్య సః — తస్మిన్

మాల్యవాన్ :- (అశ్రూణి స్తంభయన్) వత్స.

విద్వానపావృత్తమివ స్వభాగ్యం న తావదాత్మానమహం బ్రవీమి।
మహామునేర్విశ్రవస స్తపోభిర్నివాపబీజం యది నః కులం
స్యాత్ ॥ 15

---

సంధులు :- గుణ + ఓఘ - వృద్ధి. ధృతః + అపి - ఉత్వాదేశవిసర్గ. ధృతో + అపి - పూర్వరూప. తదా + అస్య - సవర్ణదీర్ఘ.

ఛందస్సు :- పుష్పితాగ్ర. అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా.

క్రియ :- స్ఖల సంచలనే, లట్, ప్రథమ, పరస్మై.
స్ఖలతి - స్ఖలతః - స్ఖలన్తి

విద్వానితి :- (అశ్రూణి = కన్నీటిని, స్తంభయన్ = నిలువరించుకొనుచు) వత్స ! స్వభాగ్యమ్ = మన అదృష్టమును, అపావృత్తమ్ ఇవ = తొలగినదానినిగా, విద్వాన్ అపి = ఎరిగినవాడనయ్యు - అదృష్టము ముగిసినదని తెలిసియుననుట. అహమ్ = నేను, ఆత్మానమ్ = మనస్సును - అంతరంగమునకు. న బ్రవీమి = తెలుపనైతిని - నా అంతరంగమును నేనే మోసగించుకొంటిననుట. మహామునేః = మహర్షియగు. విశ్రవసః = విశ్రవసునియొక్క (రావణుని తండ్రి). తపోభిః = తపస్సుల ప్రభావముతో. నః = మనయొక్క, కులమ్ = వంశము, నివాపబీజమ్ స్యాత్ = తర్పణములు. విడుచుటకు ఒక్కడు మిగిలినది కావచ్చును — ఒక్కడు మిగులవచ్చుననుట. (ఉపజాతి)

తాత్పర్యము :- మన అదృష్టములు తారుమారైనవని నే నెరిగియును అంతరంగమును మోసగించుకొంటిని. విశ్రవసుని తపస్సులు గట్టివైనచో మన రాక్షస వంశమునందు తర్పణములు విడుచుటకు ఒక్కడేని మిగులును. (విదేశ్ర్యతుర్వసుః — విద్వాన్).

సంధులు :- మునేః + విశ్రవసః, తపోభిః + నివాప - రేఫాదేశవిసర్గ విశ్రవసః + తపోభిః - సాదేశవిసర్గ.

(ప్రవిశ్య పటాక్షేపేణ సంభ్రాంతః శుకః)

శుకః :- ప్రహస్తధూమ్రాక్షమహోదరాదీన్వ్యాపాద్య సేనాధిపతీ
నమాత్యాన్।

స ఏష లంకాముపరుధ్య రామః శాఖామృగై రర్ణవమాతనోతి॥ 18

మాల్యవాన్ :- (సవిషాదమ్) పురస్తాదేవ దృష్టమిదమస్మాభిః. దేశకాల వ్యవహితస్యాపి ప్రమేయగ్రామస్య యథాముఖీనమాదర్శ

---

(సంభ్రాంతః = సంభ్రాంతుడైన. శుకః = శుకుడు. పటాక్షేపేణ ప్రవిశ్య = వేగముగా తెరతొలగించి రంగమున ప్రవేశించి)

ప్రహస్తేతి :- ప్రహస్త ధూమ్రాక్ష మహోదరాదీన్ = ప్రహస్తుడు. మహోదరుడు మొదలైన. సేనాధిపతీన్ = సేనాపతులను. అమాత్యాన్=మంత్రులను. వ్యాపాద్య = సంహరించి, సః ఏషః రామః = ఇదే ఆ దాశరథి. లంకామ్ = లంకను. ఉపరుధ్య = ముట్టడించి. శాఖామృగైః = తన సైనికులగు కపీశ్వరులతో. అర్ణవమ్ = సముద్రమును, ఆతనోతి = విస్తరింపజేయుచున్నాడు - ఈవలి తీరమున విడిదిచేసిన కపిసేన సముద్రము విస్తరించినట్లున్నదనుట. (ఉపజాతి)

తాత్పర్యము :- ప్రహస్తాదులను సంహరించి లంకను ముట్టడించి ఇదే రాముడు తన కపిసేనతో మరొక సముద్రమును సృష్టించినాడు.

సంధులు :- సః + ఏషః + లంకామ్ - తదేతద్విసర్గలోప. మృగైః + అర్ణవమ్ - రేఫాదేశవిసర్గ. వి + ఆపాద్య - యణాదేశ.

క్రియ :- తనుఞ్ విస్తారే. పరస్మై. లట్. ప్రథమ
తనోతి - తనుతః - తన్వన్తి

పురస్తాదితి :- (సవిషాదమ్=దుఃఖములో) ఇదమ్=ఇది (ఇట్లుజరుగుట) అస్మాభిః = మాచేత. పురస్తాత్ ఏవ = ముందుగానే. దృష్టమ్ = ఊహింపబడినది. దేశకాల వ్యవహితస్య = దేశాంతరమునందును కాలాంతరమునందును జరిగిన. ప్రమేయగ్రామస్య = వస్తుసమూహమునకు (కార్యజాతమునకు). వృద్ధబుద్ధిః = వృద్ధుల బుద్ధి. యథాముఖీనమ్ = ముఖమునకు ఎదురుగానున్న అద్దమునందు ప్రతిఫలించు

తలం హి స్థవిరబుద్ధిః. (విమృశ్య. ఆకాశే) సాధు. రామ
భద్ర. సాధు. విజిగీషోరదీర్ఘసూత్రతా హి కార్యసిద్ధేరవ
శ్యంభావః.

సారణః :- సఖే శుక. అథ కింవిధానో యాతుధానేశ్వరః.

శుకః :- (సఖేదస్మితమ్) సఖే కిం తస్య విధానమ్.

శ్రుత్వా దాశరథీ సువేలకటకే సాటోపమర్ధే ధను
ష్టంకారైః పరిపూరయన్తి కకుభః ప్రోంఛన్తి కౌక్షేయకాన్ ।

---

మట్లు, ఆయా కార్యజాతము వృద్ధుల బుద్ధిలో ప్రతిఫలించుననుట. (విమృశ్య = ఆలోచించి, ఆకాశే = ఆకాశమునందు దృష్టినిలిపి) సాధు సాధు రామభద్ర=దాశరథీ ! మెప్పు మెప్పు. విజిగీషోః = జయశీలునికి, అదీర్ఘసూత్రతా = క్షిప్రకారిత్వము, కార్య సిద్ధేః = కార్యసిద్ధికి, అవశ్యంభావః హి = తప్పనిసరిరిదా !

సఖేఇతి :- సఖే = మిత్రమా ! శుకా ! యాతుధానేశ్వరః = రాక్షసరాజు రావణుడు, అథ = ఇప్పుడు, కింవిధానః = ఏమి ఆచరింపనున్నాడు ?

కిమితి :- (సఖేదస్మితమ్=బాధతో నవ్వుచు) సఖే=మిత్రమా ! తస్య= రావణునికి, కిమ్ విధానమ్ = ఏమిదారి ! అతనికి మరి దారిలేదనుట.

శ్రుత్వేతి :- దాశరథీ = రామలక్ష్మణులను, సువేలకటకే=సువేల పర్వత ప్రాంతమునందు, శ్రుత్వా = విని - అచ్చటికి చేరుకొన్నారని తెలిసియనుట. (కటకోఽస్త్రీ నితంబోఽద్రేః - అమరము). లంకాపతేః = రావణునియొక్క, అర్ధే కరాః = సగము చేతులు (పది. ప్రథమచరమేత్యాది సూత్రముచే అర్ధశబ్దమునకు సర్వ నామ సంజ్ఞ - అర్ధః - అర్ధౌ - అర్ధే) సాటోపమ్ = ఉద్ధతముగా, ధనుష్టంకారైః= ధనుష్టంకారములతో, కకుభః = దిక్కులను, పరిపూరయన్తి = నింపుచున్నవి, కౌక్షేయకాన్ = ఖడ్గములను, ప్రోంఛన్తి = పదునుపెట్టుచున్నవి. తథైవ = అట్లే, అర్ధే కరాః పునః = తక్కిన పదిచేతులును, చిత్రఫలకే = చిత్రఫలకమునందు, వైదేహీకుచపత్రవల్లిరచనా చాతుర్యమ్ - వైదేహీ = సీతయొక్క, కుచ = వక్షః స్థలమున, పత్రవల్లిరచనా = మకరికాపత్రములు రచించుటయందలి, చాతుర్యమ్ =

అభ్యస్యన్తి తథైవ చిత్రఫలకే లంకాపతే స్తత్పునః
వైదేహీ కుచ పత్త్రవల్లిరచనా చాతుర్యమర్ధే కరాః ॥ 17

మాల్యవాన్ :- (నిఃశ్వస్య) హా వత్స రావణ, కథమద్యాపి సైవ హృదయ పరిస్పందముద్రా. (శుకంప్రతి) వత్స, అథ గోపురగౌల్మిక బలాధ్యక్షేణ వత్సేన నరాంతకేన కిం ప్రతిపన్నమ్

శుకః :- (నిఃశ్వస్య) మాతామహ, కృతైవ కుమారేణ ద్వార

---

నేర్పును, అభ్యస్యన్తి = అభ్యసించుచున్నవి. (శార్దూలవృత్తము) కౌక్షేయకో మండలాగ్రః కరవాలః కృపాణవత్.

తాత్పర్యము :- రామలక్ష్మణులు సువేలపర్వతమును చేరుకొనిరనువార్త తెలిసిన రావణుడు పదిచేతులతో ధనుష్టంకారములు చేయుచు కత్తులను పదును పెట్టుచున్నాడు తక్కిన పదిచేతులతో భవిష్యత్తులో సీతాదేవి గుండెలపై మకరికాపత్రములు రచించుటకు కావలసిన నైపుణ్యమును చిత్రఫలకముపై అభ్యసించుచున్నాడు.

సమాసములు :- సువేలస్య కటకః - తస్మిన్. ధనుషాం టంకారాః - తైః. లంకాయాః పతిః - తస్య. వైదేహ్యాః కుచౌ - కుచయోః పత్రవల్లిః - వల్ల్యాః రచనా - రచనాయాం చాతుర్యమ్.

సంధులు :- స + ఆటోపమ్ - సవర్ణదీర్ఘ. ప్ర + ఉంఛన్తి - గుణసంధి తథా + ఏవ - వృద్ధి, పతేః + తత్-సాదేశవిసర్గ.

క్రియ :- ఉఛి ఉంఛే, లట్, పరస్మై. ప్రథమ

ఉంఛతి - ఉంఛతః - ఉంఛన్తి

అసు క్షేపణే (శ్యన్) లట్, పరస్మై. ప్రథమ (అభి)

అభ్యస్యతి - అభ్యస్యతః - అభ్యస్యన్తి

హేతి :- (నిఃశ్వస్య = నిట్టూర్చి) హా ! వత్సా ! రావణా ! కథమ్ = ఎట్లూ ! అద్యాపి = ఇప్పటికిని, సా + ఏవ = అదే, హృదయ పరిస్పందముద్రా = మానసికచేష్టా నిర్ణయమా ! ఇప్పటికిని సీతపట్ల కామదృష్టిని విడువవైతివా అనుట. (శుకంప్రతి = శుకునితో) వత్సా ! అథ = ఇంతకును, గోపుర = ముఖద్వారము నందలి, గౌల్మికబల = సేనాగుల్మముయొక్క, అధ్యక్షేణ = అధిపతియైన, వత్సేన =

మర్యాదా. పరమంగదేన సోఽపి. (ఇత్యర్ధోక్తే సాస్రమధో
ముఖ స్తిష్ఠతి)

మాల్యవాన్ :- హా వత్స, దశగ్రీవనందన, కథమిదం తవ ద్రష్టుమేతా
వంతం కాలమస్మాకమాయుః.

(నేపథ్యే)

భోభో మహాపార్శ్వప్రభృతయః సైనికాః,

వ్యావర్తధ్వముపాధ్వముద్ధుర శరజ్వాలాముఖీం మాతరం
దేవీమస్త్రమయీం ప్లవంగపశవః పశ్యన్తి పృష్ఠాని వః।

---

చిరంజీవి. నరాంతకేన = నరాంతకునిచే. కిమ్ ప్రతిపన్నమ్=ఏమి ఆచరింపబడినది? నరాంతకుడు ఏమి చేసెననుట.

మాతామహేతి :- (నిఃశ్వస్య = నిట్టూర్చి) మాతామహా! కుమారేణ= నరాంతకునిచే, ద్వారమర్యాదా = ద్వారరక్షకునికి ఉచితమగు యుద్ధము. కృతాఏవ = బాగుగనే చేయబడినది. పరమ్ = కానీ, అంగదేన = అంగదునిచే. సః అపి = ఆ నరాంతకుడు కూడ (ఇతి = అని, అర్ధోక్తే = సగము మాటలో ఆపి. సాస్రమ్ = కన్నీటితో అధోముఖః తిష్ఠతి = తలవాల్చి నిల్చును).

వత్సేతి :- హా వత్స=అయ్యో నరాంతకా! దశగ్రీవనందనా! కథమ్= ఎట్టూ! తవ = నీయొక్క. ఇదమ్ = ఈ మరణమును. ద్రష్టుమ్ = చూచుటకేనా. అస్మాకమ్ = మాకు. ఆయుః = ఆయుర్దాయము. ఏతావంతమ్ కాలమ్=ఇంతకాలము!

(నేపథ్యే = తెరలో)

వ్యావర్తధ్వమితి :- భోభోః=ఓయోయీ! మహాపార్శ్వప్రభృతయః= మహాపార్శ్వాదులారా! వ్యావర్తధ్వమ్ = రణరంగమునకు మరలుడీ! ఉద్ధుర=భయంకరమగు, శరజ్వాలాముఖీమ్ = శరజ్వాలలతోకూడిన ముఖము కలదియు, అస్త్రమయీమ్ = అస్త్రస్వరూపము కలదియు, మాతరమ్ = తల్లియునైన, దేవీమ్ = రణాధిదేవతను, ఉపాధ్వమ్ = ఉపాసించుడీ! వః = పారిపోవుచున్న మీయొక్క. పృష్ఠాని= వీపులను, ప్లవంగపశవః = నీచ కపిభటులు, పశ్యన్తి = చూచుచున్నారు. శక్రజితః = ఇంద్రజిత్తుయొక్క. చేతః = మనస్సు. లక్ష్మణవధే=సౌమిత్రిని సంహరించుటయందు.

చేతః శక్రజితోఽపి లక్ష్మణవధే బద్ధోత్సవం మధ్యమః
పౌలస్త్యః స్వయమాయుధం విధృతవానద్యాపి రామాద్భయమ్॥ 18

సారణః :- (శ్రుత్వా సహర్షమ్) ఆర్య. జాతం జాతమవలంబనమ్.

---

బద్ధోత్సవమ్=ఉత్సాహము వహించినది. మధ్యమః పౌలస్త్యః=పులస్త్యుని పుత్రులలో మధ్యముడగు కుంభకర్ణుడు. స్వయమ్ = స్వయముగా. ఆయుధమ్ = ఆయుధమును విధృతవాన్ = ధరించెను - యుద్ధమునకు దిగుచున్నాడనుట. అద్యాపి = ఇంకను. రామాత్ భయమ్ = రామునివలన భయమా ! అని కాకూచ్చారణ. (శార్దూలము).

తాత్పర్యము :- ఓ రాక్షసవీరులారా ! పారిపోవద్దు. పారిపోవద్దు. మరలుడీ ! మరలుడీ ! శరజ్వాలాముఖియగు రణాధిదేవతను ఉపాసించుడీ ! కపివీరులు మీ పృష్ఠములు చూచుచున్నారు. మరలుడీ ! ఇంద్రజిత్తు లక్ష్మణవధకు సన్నద్ధుడైనాడు. కుంభకర్ణుడు ఆయుధమునుబట్టి స్వయముగా రణరంగమునకు దిగుచున్నాడు. ఇంకను రామునివలన భయమా ! మరలుడీ ! మరలుడీ !

సమాసములు :- శరాణాం జ్వాలా - ఉద్ధురా చ సా శరజ్వాలా చ - శరజ్వాలా ముఖే యస్యాః సా - జ్వాలాముఖీ - తామ్. ప్లవంగాః పశవః ఇవ. శక్రస్య జిత్ - తస్య. లక్ష్మణస్య వధః = తస్మిన్. బద్ధః ఉత్సవః యస్య తత్.

సంధులు :- వి + అవర్తధ్వమ్ - యణాదేశ. శక్రజితః + అపి - ఉత్వాదేశవిసర్గ - జితో + అపి - పూర్వరూప. బద్ధ + ఉత్సవమ్ - గుణసంధి. అద్య + అపి - సవర్ణదీర్ఘ.

క్రియ :- వృతుజిర్ వర్తనే. ఆత్మనే. మధ్యమ (వి + అ)
వ్యావర్తస్వ - వ్యావర్తేథామ్ - వ్యావర్తధ్వమ్
ఆసజ్ ఉపవేశనే. లోట్. ఆత్మనే. మధ్యమ (ఉప)
ఉపాస్వ - ఉపాసాథామ్ - ఉపాధ్వమ్
దృశిర్ ప్రేక్షణే. లట్. పరస్మై. ప్రథమ
పశ్యతి - పశ్యతః - పశ్యన్తి

ఆర్యేతి :- (శ్రుత్వా = విని. సహర్షమ్=ఆనందముతో) ఆర్యా ! జాతమ్ జాతమ్ = దొరికినది దొరికినది. అవలంబనమ్ = ఆధారము ! కుమారకుంభకర్ణః =

యదయం ప్రతిబుధ్య కుమారకుంభకర్ణః పురస్కృత్య చ మేఘనాదమభ్యమిత్రీణః సంవృత్తః.

మాల్యవాన్ :- (నిఃశ్వస్య) స్వస్తి విజయేతాం రామలక్ష్మణౌ కుంభకర్ణమేఘనాదౌ.

శుకః :- (సవిషాదమాత్మగతమ్) శాంతమ్ శాంతమ్ కథమవిశిష్టకర్తృకర్మభావముభయత్ర ద్వివచనం ప్రయుక్తమార్యేణ.

మాల్యవాన్ :- (సఖేదమ్) వత్సౌ శుకసారణౌ. అద్య ఖల్వియం రాక్షసలక్ష్మీః సర్వథా కుంభకర్ణమవలంబ్య వర్తతే. ఇదం తు న విద్మః.

---

రాజసహోదరుడగు కుంభకర్ణుడు. ప్రతిబుధ్య = నిద్రలేచి. చ=మరియు, మేఘనాదమ్= ఇంద్రజిత్తును, పురస్కృత్య=ముందునిల్పుకొని. అయమ్=వీడుగో ! అభ్యమిత్రీణః = శత్రువుల కభిముఖుడు. సంవృత్తః = అయ్యెను – శత్రువులపైకి వెడలెననుట.

స్వస్తీతి :- (నిఃశ్వస్య = నిట్టూర్చి) స్వస్తి = శుభమగుగాక ! విజయేతామ్=జయింతురుగాక ! రామలక్ష్మణౌ=రామలక్ష్మణులును, కుంభకర్ణమేఘనాదౌ = కుంభకర్ణమేఘుదులును

శాంతమితి :- (సవిషాదమ్ = దుఃఖముతో, ఆత్మగతమ్ = తనలో) శాంతమ్ శాంతమ్ = శాంతించునుగాక ! అమంగళము శాంతించునుగాక ! కథమ్ = ఎట్లూ ! అవిశిష్ట కర్తృకర్మభావమ్=ఏది కర్తృపదమో ఏది కర్మవాచకమో స్పష్టపడనట్లు, ఉభయత్ర = రెండుచోట్లను, ద్వివచనమ్ = ద్వివచనమే. ఆర్యేణ = మాతామహునిచే, ప్రయుక్తమ్ = ప్రయోగింపబడినది. రామలక్ష్మణౌ కుంభకర్ణమేఘనాదౌ అన్నవి రెండును ద్వివచనరూపములే (విజయేతామ్ అన్న క్రియయునంతే) - వీనిలో ఏది ప్రథమావిభక్తి (కర్త) ఏది ద్వితీయావిభక్తి (కర్మ) అనుట స్పష్టపడుటలేదని భావము.

వత్సావితి :- (సఖేదమ్ = బాధతో) నాయనలారా ! శుకసారణులారా ! అద్య = నేడు, ఇయమ్ = మన ఈ, రాక్షసలక్ష్మీః=రాక్షసరాజసంపద (వంశలక్ష్మి) సర్వదా = అన్నివిధములుగను, కుంభకర్ణమ్ = కుంభకర్ణుని, అవలంబ్య=ఆశ్రయించు

అగ్రజం వా దశగ్రీవమనుజం వా విభీషణం ।
అన్వయవ్యతిరేకాభ్యాం వీరః కమభిషేక్ష్యతి ॥ 19

(నేపథ్యే)

మాభైష్టం కమఠేంద్ర పన్నగపతీ కశ్చిన్న వైశేషికో
భూమేరద్య భరః పతిః పలభుజామజ్ఞాపయత్యేష వామ్ ।

---

కాని. వర్తతే = ఉన్నది. ఇదమ్ తు = ఇదిమాత్రము. న విద్మః = ఎరుగము - ఏవి యనగా చెప్పుచున్నాడు.

అగ్రజమితి :- వీరః = ఈ కుంభకర్ణుడు. అన్వయవ్యతిరేకాభ్యామ్ = జయాపజయములతో, అగ్రజమ్ = అన్నగారైన, దశగ్రీవమ్ వా=రావణునిగాని. అనుజమ్ = తమ్ముడైన, విభీషణమ్ వా = విభీషణునిగాని కమ్ = ఎవరిని, అభిషేక్ష్యతి= అభిషేకించునో - ఇదిమాత్రము తెలియదనుట.

తాత్పర్యము :- కుంభకర్ణుడు తన జయముతో అన్నగారగు రావణుని అభిషేకించునో, తన పరాజయముతో తమ్ముడగు విభీషణుని పట్టాభిషేకించునో తెలియదుసుమా.

సమాసములు :- అగ్రే జాతః - తమ్. అనుజాయత ఇత్యనుజః - తమ్. అన్వయశ్చ వ్యతిరేకశ్చ - అన్వయవ్యతిరేకౌ - తాభ్యామ్.

క్రియ :- షిచ సేచనే, పరస్మై, లృట్, ప్రథమ (అక)
అభిషేక్ష్యతి - అభిషేక్ష్యతః - అభిషేక్ష్యన్తి
(నేపథ్యే = తెరలో)

మేతి :- కమఠేంద్ర పన్నగపతీ ! = ఓ ఆదికూర్మమా ! ఓ ఆదిశేషుడా ! మాభైష్టమ్ = మీ ఇరువురును భయపడవద్దు. అద్య = ఇప్పుడు. భూమేః = భూమికి. వైశేషికః = విశిష్టమైన - అధికమైన, భరః = భారము. కశ్చిత్ న = ఏదియును ఏర్పడలేదు, ఇతి = అని, పలభుజామ్ పతిః = మాంసాశనుల ప్రభువగు రావణుడు. ఏషః = ఇదే, అజ్ఞాపయతి = ఆజ్ఞాపించుచున్నాడు.

శుకః :- (సహర్షమ్) నూనమస్మదీయైర్విశేషేణ. కిమపి విక్రాంతమ్
(మాల్యవానవధత్తే)
(పునర్నేపథ్యే)

దోశ్శైలా హరతా పృథక్పృథగథో మూర్ధానముత్క్షిప్నునా
రామేణాపి లఘూకృతం పతతి యత్తత్కౌంభకర్ణం వపుః ॥ 20

---

నూనమితి :- (సహర్షమ్ = ఆనందముతో) అస్మదీయైః = మనవారిచే, విశేషేణ = అధికముగా, కిమపి విక్రాంతమ్ = ఏదో విక్రమించబడినది - విశేష విక్రమమును చూపియుందురనుట - నూనమ్ = నిశ్చయము.

(మాల్యవాన్ = మాల్యవంతుడు, అవధత్తే = వినుటకసిద్ధుండెను)

(పునః = మరల, నేపథ్యే = తెరలో)

దోరితి :- దోశ్శైలా = శైలములవంటి బాహువులను. పృథక్ = విడి విడిగా, హరతా = ఖండించుచున్నవాడును, అథః=తరువాత మూర్ధానమ్=శిరస్సును, ఉత్క్షిప్నునా = ఎగురగొట్టుచున్నవాడునైన, రామేణ = రామునితో, కౌంభకర్ణమ్ = కుంభకర్ణునియొక్క. వపుః = శరీరము. లఘూకృతమ్ = బరువు తగ్గింపబడినదై, పతతి = నేలకు ఒరుగుచున్నది – ఇట్లు నేలకు శిరోబాహువుల బరువు తగ్గినదనుట. (శార్దూల విక్రీడితము)

తాత్పర్యము :- భూభారమును వహించుచున్న ఓ కమఠమా ! ఓ ఆది శేషుడా ! కుంభకర్ణుని పతనముతో అధికభారము సంభవించునని భయపడవద్దు అని రావణుడిదే మిమ్ము ఆజ్ఞాపించుచున్నాడు. కుంభకర్ణుని బాహువులను ఒక్కటొక్కటిగా ఎగురగొట్టి, అటుపైని శిరస్సును ఎగురగొట్టి రాముడు అతని దేహభారమును తగ్గింపగా మిగిలిన మొండెము నేలకొరిగినది.

సంధులు :- కమఠ + ఇంద్ర - గుణసంధి. కశ్చిత్ + న = అనునాసికా దేశ. వైశేషికః + భూమేః అథః + మూర్ధానమ్-ఉత్వాదేశవిసర్గ. భూమేః + అద్య - రేఫాదేశవిసర్గ. ఆజ్ఞాపయతి + ఏషః - యణాదేశ. ఏషః + వామ్-తదేతద్విసర్గలోప. రామేణ + అపి - సవర్ణదీర్ఘ.

మాల్యవాన్ :- హా వత్స. (ఇతి మూర్ఛితః పతతి).

ఉభౌ :- (సాస్రమ్) ఆర్య సమాశ్వసిహి. సమాశ్వసిహి.

మాల్యవాన్ :- (ఆశ్వస్య) వత్సౌ. జీవతో రామభద్రస్య మైథిలీహరణా దేతదస్మాభిరాంతరేణ చక్షుషా విషయీకృతమేవ. కిమిదానీం సమాశ్వసితవ్యమస్తి.

శుకః :- ధిక్కష్టమ్. "కౌంభకర్ణం వపుః పతతి" ఏతదపి దేవేనాజ్ఞాపయితవ్యమ్.

---

క్రియ :- ఞిభీ భయే. లుఙ్. పరస్మై. మధ్యమ

అభైషీః - అభైష్టామ్ - అభైషుః

అభైషీః - అభైష్టమ్ - అభైష్ట

అభైషమ్ - అభైష్వ - అభైష్మ

జ్ఞా నియోగే (ణిచ్-పుగాగమే) పరస్మై. లట్. ప్రథమ. (అజ్)

ఆజ్ఞాపయతి - ఆజ్ఞాపయతః - ఆజ్ఞాపయన్తి

హేతి :- హా = అయ్యో! వత్స! (ఇతి = అని. మూర్ఛితః = మూర్ఛపోయి. పతతి = పడును).

ఆర్యేతి :- (సాస్రమ్ = కన్నీటితో) ఆర్య! సమాశ్వసిహి = ఊరడిల్లుము.

వత్సావితి :- (ఆశ్వస్య=ఓదార్చి) వత్సౌ=నాయనలారా! జీవతః=జీవించియున్నవాడగు. రామభద్రస్య = రామునియొక్క—రాముడు బ్రతికియుండగానే అనుట. మైథిలీ హరణాత్ = సీతను అపహరించుటవలన. ఏతత్ = ఈ అనర్థము.అస్మాభిః = మాచే. ఆంతరేణ చక్షుషా=జ్ఞాన దృష్టితో-వివేకముతోననుట. విషయీకృతమ్ ఏవ = ఏనాడో తెలిసికొనబడినది — ఈ అనర్థము రానున్నదని అలనాడే గుర్తించితిమనుట. ఇదానీమ్ = ఇక నిప్పుడు. సమాశ్వసితవ్యమ్ = ఊరడిల్లవలసినది. కిమ్ అస్తి = ఏమున్నది-ప్రమాదము ముంచుకొనిరాగా ఇక ఊరడిల్లుట కేమున్నదనుట.

ధిగితి :— ధిక్ కష్టమ్ = ఛీ! ఎంత కష్టము! కౌంభకర్ణమ్ వపుః పతతి =

మాల్యవాన్ :- వత్స, అద్యాపి రావణస్యాజ్ఞా ! నూనమన్యోన్యేషాం
వైహాసికాః కపయో దశకంఠముల్లుంఠయన్తి.

సారణః :- అః క్షుద్రాః.

యద్యస్తి వీర్యమస్త్యేవ తత్కర్మ కథయిష్యతి,
మేఘనాదమజిత్వైవ ధిక్ ప్రహాసవిభీషికామ్ ॥ 21

---

కుంభకర్ణుని శరీరము పడుచున్నది, ఏతదపి = ఈ మాటయును, జేపేన=మహారాజుచే, ఆజ్ఞాపయితవ్యమ్ = ఆజ్ఞాపింపదగినదేనా! ఇది ఎట్లు ఆజ్ఞాపింప గలిగెననుట.

వత్సేతి :- వత్స = నాయనా! శుకా! అద్య + అపి=ఇప్పటికిని, రావణస్య = రావణునియొక్క, ఆజ్ఞా = ఆజ్ఞయా!— అతని మాట ఆజ్ఞగా ఇంకను చెల్లునాయనుట. ఇంకెక్కడి రావణుడు, ఇంకెక్కడి ఆజ్ఞలు అని తాత్పర్యము. ఏలయన - నూనమ్ = నిశ్చయముగా, అన్యోన్యేషామ్ = పరస్పరము, వైహాసికాః = మేలమాడుకొనుచున్న, కపయః = వానరులు, దశకంఠమ్ = రావణుని, ఉల్లుంఠయన్తి = అనుకరించి పరిహసించుచున్నారు-రావణుని అనుకరించుచు కపివీరులొకరు వైరీతిగా ఆజ్ఞను వినిపించెననుట,

యదీతి :-అః క్షుద్రాః=ఓరీ నీచులారా! వీర్యమ్=బలము, యది అస్తి = ఉన్నచో, అస్తి ఏవ = ఉండనీ-ఉన్నది ఉన్నదే. కర్మ = ప్రవర్తన. తత్ = ఆ బలమును, కథయిష్యతి = చాటిచెప్పును. మీ బలమును మీ చర్యలే చెప్పును - లేదా మాకును బలమున్నది దానిని మా చర్యలే చాటి చెప్పును. మేఘనాదమ్ = ఇంద్రజిత్తును, అజిత్వా ఏవ=జయింపకయే, ప్రహాస = పరిహాస పూర్వకముగా. విభీషికామ్= భయపెట్టుట, ధిక్ = నిరసింపదగినది. ఇట్లు భయపెట్టుట ఇట్లు మేల మాడుటలు తగనివనుట. ( పథ్యావక్త్రము ). ధిగ్యోగమున ద్వితీయ.

తాత్పర్యము :- ఓ క్షుద్రవానరులారా ! బలమున్నచో ఉండును. అది చర్యలలో బయల్పడును, ఇంద్రజిత్తును జయింపకయే మీ రిట్లు మమ్ము ఉపహాస్యము చేయుట భయపెట్టుట తగదు, ఛీ ! ఛీ !

సంధులు :- యది + అస్తి + ఏవ - యణాదేశ. అజిత్వా + ఏవ-వృద్ధి

(నేపథ్యే)

భోభో యూథపతయః, విలుంపన్తు భవన్తో లంకాగోపురప్రాకారతోరణాని.

సన్నద్ధేంద్రాయుధమవిరళారంభిగీర్వాణబాణ
శ్రేణీవర్షం తదవజగృహే యేన దుష్టగ్రహేణ ।

మాల్యవాన్ :- (సోద్వేగమ్) అః, కిమనేన శ్రావయితవ్యోఽస్మి. (ఇతి కర్ణౌ పిదధాతి)

(పునర్నేపథ్యే)

---

క్రియ :- అసభువి, పరస్మై. లట్, ప్రథమ

అస్తి-స్తః-సన్తి

కథ వాక్య ప్రబంధే (ణిచ్ స్వార్థే) పరస్మై. లృట్ ప్రథమ

కథయిష్యతి-కథయిష్యతః-కథయిష్యన్తి

భోభోఇతి :- భో భో యూథ పతయః = ఓ సేనాపతులారా। భవన్తః= మీరందరును. లంకా=లంకాపట్టణము యొక్క. గోపుర=గోపురములయొక్క. ప్రాకార తోరణాని = ప్రాకార బహిర్ద్వారములను- గోపుర ప్రాకారాగ్ర భాగములననుట, విలుంపన్తు = దిగిపొండు. (తోరణోఽస్త్రీ బహిర్ద్వారమ్-అమరము).

సన్నద్ధేతి :- సన్నద్ధ = ఎక్కు పెట్టబడిన, ఇంద్రాయుధమ్ = శక్ర చాపము కలసియు, అవిరళ = ఎడతెరపిలేని, ఆరంభ = ఆరంభము కలదియునైన. గీర్వాణ బాణశ్రేణీ వర్షమ్-గీర్వాణ=దేవతలయొక్క. బాణశ్రేణీ = శరపరంపరయను నట్టి. వర్షమ్=వర్షమును, యేన = ఏ. దుష్టగ్రహేణ=దుష్టగ్రహమగు ఇంద్రజిత్తుచే. అవజగృహే = తిరస్కరింపబడినదో-దేవతలు బాణము సంధించుటకేని ఎవనిముందు భయపడిరో అనుట (ఉత్తరార్ధమున్నది).

అఃఇతి :- (సోద్వేగమ్=ఆరాటముతో) అః = అయ్యో। అనేన = ఈ నేపథ్యమునందలి వ్యక్తిచే. కిమ్ = ఏది. శ్రావయితవ్యః=వినవలసిన వాడను. అస్మి= అయితినో । ఏ అశుభవార్త వినవలసి వచ్చునో అనుట. (ఇతి=అని. కర్ణౌ పిదధాతి= చెవులు మూసికొనును) అపిదధాతి-వష్టిభాగురిరల్లోపమవాప్యోరుపసర్గయోః

(పునః నేపథ్యే=మరల తెరలో)

ఇష్ట్వా కాంచిత్ప్రహరణమయీం వీరయాజ్ఞీకమిష్టిం
దిష్ట్యా సోఽయం సముపశమితః శక్రజిల్లక్ష్మణేన ॥ 22

మాల్యవాన్ :- సత్యోఽయమ్ "అతిదుఃఖో నిర్దుఃఖః" ఇతి లోకప్రవాదః,

ఇష్ట్వేతి : ప్రహరణమయీమ్ = శస్త్రమయమును, వీరయాజ్ఞికమ్ = వీరయాజ్ఞికమునగు—వీరులే యాజ్ఞికులుగా నున్నది. కాంచిత్ = ఒకానొక, ఇష్టిమ్ = యజ్ఞమును. ఇష్ట్వా=చేసి. దిష్ట్యా=అదృష్టవశమున. లక్ష్మణేన = సౌమిత్రిచే, సః = ఆ, (దుష్టగ్రహము) శక్రజిత్=ఇంద్రజిత్తు, అయమ్ = వీడుగో. సముపశమితః = సంహరింపబడినాడు.

తాత్పర్యము:- సన్నద్ధమైన శక్రచాపమునుండి నిరంతరముగా కురియుచున్న బాణ వర్షమును సరకుగొనని దుష్ట గ్రహమగు ఇంద్రజిత్తు వీర యజ్ఞము చేసిన లక్ష్మణుని చేతిలో నిహతుడయ్యెను. శక్రచాపము (ఇంద్రధనుస్సు) వర్షము దుష్టగ్రహము. యజ్ఞము చేయుట. ఉపశమనము అను పదముల అనేకార్థతా శక్తి వలన అర్థాంతరము స్ఫురించుచున్నది కావున సమాసోక్తి అలంకారము (శిఖరిణి).

సమాసములు :- ఇంద్రస్య ఆయుధమ్ - సన్నద్ధమింద్రాయుధం యస్మిన్ కర్మణి తత్. బాణానాం శ్రేణీ - శ్రేణ్యాః వర్షమ్. గీర్వాణానాం బాణాః. అవిరళః ఆరంభః యస్యతత్. అవిరళారంభి గీర్వాణ బాణశ్రేణీ వర్షమ్ యస్మిన్ కర్మణి తత్. దుష్టశ్చాసౌ గ్రహశ్చ - తేన.

సంధులు -: సన్నద్ధ + ఇంద్ర - గుణసంధి అవిరళ + ఆరంభి, ఇంద్ర + ఆయుధమ్ - సవర్ణదీర్ఘ. సః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - సో + అయమ్ - పూర్వరూప, శక్రజిత్ + లక్ష్మణేన - లాదేశ.

క్రియ :- గ్రహఞ్ ఉపాదానే. లిట్. ఆత్మనే ప్రథమ (అప)
జగృహే - జగృహాతే - జగృహిరే

సత్యఇతి :- అతిదుఃఖః = అవధిలేని దుఃఖము అనుభవించువాడు, నిర్దుఃఖః = దుఃఖరహితుడు - ఇతి = అనునట్టి. అయమ్ = ఈ, లోకప్రవాదః = లోకోక్తి, సత్యః=సత్యమే, యత్ = ఏలయనగా, సమూలఘాతమ్ = సమూలముగా

యదస్మిన్నపి సమూలఘాతమభిఘ్నతి వ్యతికరే తథైవ శ్వసిమః.

శుకః :- (ఊర్ధ్వమవలోక్య) యథా సమన్తాదంబరచరవిమాన వీథయః కకుభాం ముఖాని పర్యవష్టభ్నన్తి తథా శంకే దుర్వారదారుణక్రోధబడబానల నిపీయమాన శోకసముద్రో దాశరథివిజయాయ సంనహ్యతే దేవః.

సారణః :- (సవిషాదమాత్మగతమ్) కష్టమ్. కథం దాశరథివిజయా యేత్యవిశిష్టోపపత్తిక కర్తృకర్మకారకార్థవిషయం వయస్య వచనమ్.

---

(వంశమును), అభిఘ్నతి = వినాశము చేయుచున్న. అస్మిన్ = ఈ. వ్యతికరేఽపి= సమయమునందును. తథైవ = పూర్వమువలెనే. శ్వసిమః = జీవించుచున్నాము. ఇంకను బ్రతికియున్నామనుట.

యథేతి :- (ఊర్ధ్వమ్ అవలోక్య = పైకిచూచి) సమన్తాత్ = అన్నివైపు లను, అంబరచర విమానవీథయః = ఆకాశమునందెగురు విమాన సమూహములు. కకుభామ్ = దిక్కులయొక్క. ముఖాని = ముఖములను. పర్యవష్టభ్నన్తి = నింపి వేయుచున్నవి. తథా = కావున. దుర్వార = వారింపగాని. దారుణ = భయంకరమైన. క్రోధ = క్రోధమనునట్టి. బడబానల = బాడబవహ్నిచేత. నిపీయమాన = త్రాగివేయ బడుచున్న, శోకసముద్రః = దుఃఖసముద్రముగలవాడై. దేవః= ప్రభువు,- రావణుడు, దాశరథివిజయాయ= రాముని జయించుటకై. సంనహ్యతే = కయలుదేరుచున్నాడని, శంకే = భావించుచున్నాను - దుఃఖమును క్రోధముతో దిగమ్రింగి రణమునకు దిగు చున్నాడనుట.

కష్టమితి:- (సవిషాదమ్ = విషాదముతో, ఆత్మగతమ్=తనలో)కష్టమ్= అయ్యో! కష్టము. కథమ్ = ఎట్లూ! వయస్యవచనమ్ = మిత్రుడగు శుకుని వాక్యము, దాశరథి విజయాయ ఇతి = దాశరథి విజయమునకై - అనునది. అవిశిష్ట = అస్పష్ట ముగానున్న. ఉపపత్తిక=యుక్తియు, కర్తృ కర్మకారకార్థవిషయమ్=కర్తృకారకార్థ

మాల్యవాన్ :- (ఉత్థాయ) తదస్మాభిరపి జరసా దూషితస్యాత్మనః ప్రక్షాళనాయ ప్రాప్తం శస్త్రధారాతీర్థమ్. (ఇతి సశుకసారణో నిష్క్రాంతః)

—: విష్కంభకః :—

---

విషయము, కర్మకారకార్థ విషయము కలదిగా ఉన్నది. దాశరథి యొక్క విజయమనగా దాశరథి కర్తగా సాధించు విజయమని గానీ, దాశరథి కర్మగా రావణుడు కర్తగా లభించు విజయమనిగానీ అన్వయించుటకు వీలగుచున్నది. ఇట్లు వెలువడిన దేమో అని అనర్థాశంక.

తదితి:- (ఉత్థాయ = లేచి) తత్ = రావణుడు యుద్ధమునకు బయలు దేరెను గావున, జరసా=ముసలితనముచేత, దూషితస్య = దూషితమైన, ఆత్మనః = ఆత్మయొక్క, ప్రక్షాళనాయ = పవిత్రీకరణము కొరకు, అస్మాభిరపి = మనచేగూడ, శస్త్రధారాతీర్థమ్=శస్త్రపుటంచు అనునట్టి స్నానపురేవు, ప్రాప్తమ్ = పొందబడినది. మనము రణమునకేగి శస్త్రాఘాతములతో తనువుబాసి ఆత్మదోషములను వదలించు కొందమనుట. (ఇతి=అని, సశుకసారణః = శుకసారణులతో గూడి, నిష్క్రాంతః= నిష్క్రమించెను.)

—: విష్కంభకః = ఇది విష్కంభము :—

(తతః ప్రవిశతి విద్యాధరద్వయమాకాశయానేన)

పీతః :- అహో, బహోః కాలాదనయా గగనవీథ్యా నిరాతంకమివ
సంచరావహే (అధోఽవలోక్య)

దేవేంద్రోపనివేద్యనందనవనస్రక్తోరణశ్లాఘినీ
లంకేయం దశకంఠవిక్రమసఖీ యస్యాం సమంతాదిమాః ।

---

(తతః=అంతట,విద్యాధరద్వయము = విద్యాధరులజంట, ఆకాశయానేన= ఆకాశయాన ములో, ప్రవిశతి = ప్రవేశించును - ఆకాశయానము నభినయించుచు ప్రవేశించుననుట)

అహో ఇతి :- అహో! - బహోః కాలాత్ =చాలకాలము తరువాత, అనయా = ఈ, గగనవీథ్యా=ఆకాశమార్గముతో. నిరాతంకమ్ ఇవ=ఆతంక రహిత ముగా - నిరాఘాటముగా,సంచరావహే = సంచరించుచున్నాము. (అధః అవలోక్య= క్రిందికి చూచి)

దేవేంద్రేతి :- దేవేంద్ర=దేవేంద్రునిచేత. ఉపనివేద్య= (బహుమతిగా) సమర్పింపబడిన. నందనవన స్రక్=నందనవనమందలి పూల దండయే, తోరణ = ద్వారాలంకారముగా కలిగి, శ్లాఘినీ = ప్రశంసార్హమైనదియు, దశకంఠ = రావణుని యొక్క, విక్రమ = పరాక్రమమునకు, సఖీ = నెచ్చెలియైనది, ఇయమ్ = ఈ, లంకా = లంకాపట్టణము, యస్యామ్ = ఏ నగరమునందు - ఈ లంక యందనుట, సమంతాత్ = అన్నివైపులను, యుద్ధ = యుద్ధమును, ఆలోకన = చూచుటయందలి, కౌతుక = ఉత్సుకతతో, ఉన్ముఖ = ఔన్ముఖ్యముగలవైన, వధూ = రాక్షసాంగనలతో, సంకీర్ణ=నిండిన, క్రీడారథాః=క్రీడా రథములు కలవి, ఇమాః= ఈ, రథ్యాః =రాజవీథులు. కిమ్ కథయామి = ఏమి చెప్పను! అమీ = ఇదే- ఇరుగో, వైమానికాః = దేవతలు - విమానములపై సంచరించువారు, వ్యోమ్ని = ఆకాశమునందున,యాన్తి = కదలరైరి. వీరి కదలిక రాక్షసకాంతలకు కోపకారణమగునేమోయని, (శార్దూలము)

తాత్పర్యము :-దేవేంద్రుడు స్వయముగా సమర్పించిన పారిజాతసుమ మాలికలు ద్వార తోరణములుగా విరాజిల్లుచున్న ఈ లంకాపట్టణము,దశకంఠుని విక్రమ సఖి ప్రస్తుత మిచ్చట జరుగుచున్న యుద్ధమును చూచుటకై రాక్షసాంగనలు రథముల

యుద్ధాలోకన కౌతుకోన్ముఖవధూసంకీర్ణ కర్ణీరథా
రథ్యాః కిం కథయామియాన్తి యదమీ న వ్యోమ్ని వైమానికాః॥ 23

(సఖేదాద్భుతమ్) సఖే హేమాంగద.

ఏతాః పశ్య పలాదపత్తనభువః సౌత్రామణీనాం దృశా
మస్రాంభోభిరదేవమాతృక గృహారామాభిరామశ్రియః ।

---

నధిరోహించి రాజవీథులందు పయనించుచున్నారు. దేవతలు ఆకాశమున కదలుట కైనను భయపడుచున్నారు. తమ సంచారము రాక్షసాంగనలకు కోపకారణమగు నేమోయని శంకించుచున్నారు. కర్ణీరథః ప్రవహణం డయనం చ – అమరః

సమాసములు :– దేవానామింద్రః – దేవేంద్రేణ ఉపనివేద్యాః – నందన వనస్య స్రజః – ఉపనివేద్యాశ్చ తాః స్రజశ్చ – స్రజః ఏవ తోరణాని – తోరణైః శ్లాఘినీ. దశకంఠస్య విక్రమసఖీ. యుద్ధస్య ఆలోకనమ్ – ఆలోకనే కౌతుకమ్ – కౌతుకేన ఉన్ముఖాః – ఉన్ముఖాశ్చ తాః వధ్వః – వధూభిః సంకీర్ణాః – సంకీర్ణాః కర్ణీరథాః యాసు తాః

సంధులు :– దేవ + ఇంద్ర + ఉప, లంకా + ఇయమ్, కౌతుక + ఉత్– గుణసంధులు. యుద్ధ + ఆలోక–సవర్ణదీర్ఘ, ఉత్ + ముఖ–అనునాసికాదేశ, కర్ణీరథాః + రథ్యాః – విసర్గలోప.

క్రియ :– కథవాక్య ప్రబంధే (కిచ్) పరస్మై. లట్, ఉత్తమ.
కథయామి – కథయావః – కథయామః.
యా ప్రాపణే (లుక్) పరస్మై. లట్, ప్రథమ
యాతి – యాతః – యాన్తి.

ఏతాఇతి :. (సఖేదాద్భుతమ్ = దుఃఖముతో ఆశ్చర్యముతో) సఖే = మిత్రమా! హేమాంగదుడా! సౌత్రామణీనామ్ = దేవేంద్రునిపైన, దృశామ్ = వేయి కన్నులయొక్క, అస్రాంభోభిః = కన్నీటిధారలచే అదేవ మాతృక = నదీజల సంవర్ధితములైన, గృహారామ = గృహోద్యాన వనములయొక్క, అభిరామశ్రియః = సౌందర్య సంపదలతోకూడిన, ఏతాః = ఈ కనిపించుచున్న, పలాదపత్తన భువః = లంకాపురీ ప్రాంతములను, పశ్య = చూడుము, ఏతాసు = ఈ ఉద్యానవన భూములయందు,

ఏతాసు ప్రతిఘాతివిక్రమకథోపాలంభవైతండికైః
క్లృప్తేంద్రధ్వజినీజయానుకృతిభిర్డింభైరపి క్రీడితమ్ ॥ 24

ద్వితీయః :- సఖే రత్నచూడ, కిముచ్యతే –

ప్రతిఘాతి = శత్రు పక్షముయొక్క. విక్రమకథా = శౌర్యగాథలను, ఉపాలంభ = నిందించుటయందు. వైతండికైః = నేర్పరులైన, డింభైః అపి = రాక్షస బాలురిచే సైతము (వైతండికుడు = పిడివాదముసేయువాడు). క్లృప్త = కృత్రిమముగా సమకూర్చుకొన్న. ఇంద్రధ్వజినీ = దేవేంద్రసైన్యమును. జయ = జయించుటను, అనుకృతిభిః = అనుకరించుటలతో. క్రీడితమ్ = క్రీడింపబడినవి – అవి వారికి బాలక్రీడయైనదనుట,

తాత్పర్యము :- ఈ పట్టణమందలి ఉద్యానవనములు దేవేంద్రుని కన్నీటి ధారలతో పెరిగినవి. ఇచ్చటి బాలురు శత్రుపరాక్రమమును ఉపాలంభించుటయందు వైతండికులు. ఇంద్రసైన్యమును కృత్రిమముగా తయారుచేసి దానిని జయించుట వీరికి బాలక్రీడ. (వాదము జల్పము వితండమునని చర్చ మూడు విధములు. సహేతుకము వాదము. విజిగీషతో సాగునది జల్పము. ఎదిరిమాటను ఖండించుటే స్వమత స్థాపనముగా నడచునది. వితండము)

సమాసములు :- పలపత్త్రీతి – పలాదానాం పత్త్రనమ్-పత్త్రనస్య భువః, అదేవమాతృకాశ్చ తే గృహారామాశ్చ – ఆరామాణామభిరామశ్రియః. ప్రతిఘాతినాం విక్రమకథాః – కథానాముపాలంభః – ఉపాలంభే వైతండికాః, క్లృప్తా చ సా ఇంద్రధ్వజినీ చ – ధ్వజిన్యాః జయః – జయస్య అనుకృతిభిః. దేవః పర్జన్యః మాతా ఇవ యేషామ్ – న తథా భూతాః – అదేవమాతృకాః.

సంధులు :- అస్ర + అంభః. గృహ + ఆరామ + అభిరామ. జయ + అనుకృతి – సవర్ణదీర్ఘ. కథా + ఉపాలంభ. క్లృప్త + ఇంద్ర–గుణసంధి. అంభోభిః + అదేవ, అనుకృతిభిః + డింభైః + అపి–రేఫాదేశ విసర్గ.

రక్షాంసీతి :- సఖే = మిత్రమా! రత్నచూడుడా! కిమ్ ఉచ్యతే = ఏమి ఏమి పల్కుమందు వనుట –రక్షాంసి ఇతి = రాక్షసులని. పురా అపి = పూర్వ కాలము

రక్షాంసీతి పురాపి సంశృణుమహో వీరస్తు కస్తాదృశో
జాగర్తి స్మ జగత్త్రయీ విపదలంకర్మీణదోర్విక్రమః ।
శశ్వత్ద్వారభువి - ప్రశస్తిరచనావర్ణాయమానేక్షణ
శ్రేణీసంభృతగోత్రభిన్మయజయస్తంభో యథా రావణః ॥ 25

---

నందు. సంశృణుమహో=విందుము. తు = కానీ. జగత్త్రయీ = ముల్లోకములకును, విపత్=విపత్తును. అలంకర్మీణ=కల్పింపసమర్థమైన, దోర్విక్రమః=భుజ పరాక్రమము కలవాడును శశ్వత్=ముమ్మాటికిని, ద్వారభువి = గుమ్మమునందు. ప్రశస్తి ..... జయస్తంభః - ప్రశస్తిరచనా = స్తుతిరూప రచనయందు, వర్ణాయమాన = అక్షరముల వంటి వగుచున్న. ఈక్షణ = నేత్రములయొక్క, శ్రేణీ = సమూహమును. సంభృత= వహించునదై. గోత్ర భిన్మయ = ఇంద్రరూపమైన. జయస్తంభః = జయస్తంభము కలవాడును [ - ఇంద్రుడే జయస్తంభమనియు అతని నేత్రములే అక్షరముల నియు] - అయిన. రావణః=దశకంఠుడు. యథా = ఎట్లో. తాదృశః = అటువంటి వాడగు. వీరః = మహావీరుడు. కః = ఎవడు. జాగర్తిస్మ = ఉండెను!. పురాతన రాక్షసులలో కూడ ఇంతటివాడు లేడనుట (శార్దూలము).

తాత్పర్యము :- మిత్రమా! రాక్షసులని పూర్వమును వింటిమి. కానీ వారిలో రావణునికి సాటివచ్చువాడు లేడుసుమా! ఈతడు ముల్లోకములకును విపత్తులు కల్గింప సమర్థుడు. తన భవనద్వార దేశమునందు సహస్రనయనునే జయస్తంభముగా నిల్పుకొన్నాడు. ఆ దేవేంద్రుని వేయి కన్నులును రావణ ప్రశస్తిలోని అక్షరముల వలె సరిపోయినవి.

సమాసములు : జగత్త్రయ్యాః విపత్ - విపదః అలంకర్మీణః దోర్విక్రమః యస్య సః. ద్వారస్య భూః – తస్యామ్. ప్రశస్తిరూపా రచనా - రచనాయాం వర్ణాయమానా - ఈక్షణానాం శ్రేణీ – వర్ణాయమానా చ సా ఈక్షణశ్రేణీ చ- శ్రేణ్యా సంభృతః - సంభృతశ్చాసౌ గోత్రభిన్మయః - గోత్రభిన్మయః జయస్తంభః యస్య సః.

సంధులు :- తాదృశః + జాగర్తి. స్తంభః + యథా- ఉత్వాదేశవిసర్గ - వీరః + తు-కః + తాదృశః –సాదేశ విసర్గ. రక్షాంసి + ఇతి. పురా + అపి-సవర్ణదీర్ఘ గోత్రభిత్ + మయ-అనునాసికాదేశ నిత్యసంధి.

రత్నచూడః :- సఖే హేమాంగద. పశ్యపశ్య. పౌలస్త్యపత్తనప్రతోళీషు దీయమానే సన్నాహపటహే –

దిగ్దంతావళదంతమౌక్తికమయద్వారస్తోరణస్రగ్విణో
గీర్వాణాధిపతిప్రతిష్ఠనిగడోన్మృష్టాన్యబందీశుచః।
వీరశ్రీసహపాంసుకేళిసుహృదో మందోదరీబంధుతా
శౌటీరాసురసుందరీసురభయః క్షుభ్యన్తి రక్షోగృహాః ॥ 20

---

హేమేతి :- సఖే = మిత్రమా! హేమాంగదా! పశ్య పశ్య = చూడు! పౌలస్త్య పత్తన = లంకా నగరము యొక్క, ప్రతోళీషు = మార్గములయందు, సన్నాహపటహే = యుద్ధసన్నాహ సూచకమగు భేరి, దీయమానే = మ్రోగింప బడుచుండగా- సన్నాహపటహము మ్రోగుటలోనే అనుట–

దిగితి :- దిగ్దంతావళ = దిగ్గజములయొక్క, దంత– మౌక్తికమయ = దంతములచేతను కుంభస్థ మౌక్తికములచేతను (ముత్తెములు) నిర్మింపబడిన, ద్వాః + తోరణస్రగ్విణః = ద్వారబంధములను తోరణ మాలికలను కలవియు (ద్వారబంధములు ఏనుగు దంతములతోను తోరణమాలికలు గజకుంభ మౌక్తికములతోను ఏర్పాటు చేయబడినవనుట); గీర్వాణాధిపతి = దేవేంద్రునిచేత, ప్రతిష్ఠ = ఏర్పఱుపబడిన. నిగడ = బంధనములచే. ఉన్మృష్ట = తుడిచి బడిన (పోగొట్టబడిన) అన్య బందీ శుచః = ఇతర బంధితుల దుఃఖము కలవియు (సురలును అప్సరలును లంకలో ఇంటింట బంధింపబడిరి. కానీ రావణునియింట దేవేంద్రుడే బంధింప బడినాడను వర్తమానము వీరి దుఃఖమును తగ్గించినదనుట); వీరశ్రీసహ = వీరలక్ష్మితోనైన. పాంసుకేళి = బాలక్రీడకు, సుహృదః = మిత్రములును (- వీరలక్ష్మిక్రీడకు ఆట స్థలములనుట) ; మందోదరీ బంధుతా = రావణపట్టమహిషితోడి బాంధవ్యమువల్లనైన. శౌటీర = గర్వముతో కూడిన, అసురసుందరీ = రాక్షస కాంతలచే, సురభయః = అందగించుచున్నవియునైన, రక్షోగృహాః = ఈ రాక్షసగృహములు, క్షుభ్యన్తి = సందడించుచున్నవి. (శార్దూలము). (శౌటీరస్తు మతో గర్వే–విశ్వః)

తాత్పర్యము :- మిత్రమా! ఈ రాక్షసావాసములు చూడుము – దిగ్గజముల దంతములతో నిర్మించిన ద్వారములు. దిగ్గజముల కుంభస్థలములు చీల్చి తెచ్చిన ముత్తెములతో కూర్చిన తోరణములు, రావణుని ఇంట దేవేంద్రుడే బంధింపబడుటతో

హేమాంగదః :- (విహస్య) నూనమిదానీమత్ర —

దృష్ట్వా రాఘవమేకరాక్షసవనస్వచ్ఛందదావానలం
జానక్యాం నిజవల్లభస్య పరమం ప్రేమాణమాలోక్య చ ।
కాంక్షన్తీ ముహురాత్మపక్షవిజయం భఙ్గం చ ముగ్ధా ముహు
ర్ధ్యాయన్తీ ధ్రువమన్తరాళపతితా మన్దోదరీ వర్తతే ॥ 27

---

శః యింటింటను బంధింపబడిన దేవతా స్త్రీ పురుషులు తమ దుఃఖమును మరచిపోవు చున్నారు. శః గృహములు వీరలక్ష్మికి క్రీడాస్థలములు. మందోదరి బంధుత్వముతో గర్వించిన రాక్షసస్త్రీలచే ఇంటింట సౌందర్యగర్వము తొణికిసలాడుచున్నది. సన్నాహ పటహము మ్రోగుటతో శః ఇండ్లు కోలాహలముగా నున్నవి.

సంధులు :- స్రగ్విణః + గిర్వాణ. సుహృదః + మందోదరీ, రక్షస్ + గృహాః - ఉత్వాదేశవిసర్గ. గిర్వాణ + అధిపతి, ప్రతి + ఇష్ట. ఉన్మృష్ట + అన్య, శౌటీర + అసుర - సవర్ణదీర్ఘ. ఉత్ + మృష్ట - అనునాసికాదేశ.

క్రియ :- క్షుభ సంచలనే (శ్యన్) పరస్మై. లట్. ప్రథమ
క్షుభ్యతి - క్షుభ్యతః - క్షుభ్యన్తి

దృష్ట్వేతి :- (విహస్య = నవ్వి) నూనమ్ = నిజము. ఇదానీమ్ = ఇప్పుడు. అత్ర = ఇచ్చట — ఏక రాక్షసవన స్వచ్ఛందదావానలమ్ — రాక్షసవన = రాక్షసులనునట్టి అరణ్యమునకు, స్వచ్ఛంద = తనంతటతానై. ఏక దావానలమ్ = అద్వితీయ దావాగ్నివంటివాడైన రాఘవమ్ = రాముని. దృష్ట్వా = చూచి — రాముడు రాక్షసాంతకుడగుటను గ్రహించి అనుట: చ = మరియు. జానక్యామ్ = సీతాదేవిపట్ల. నిజవల్లభస్య = తన భర్తయొక్క. పరమమ్ = ఉత్కృష్టమైన. ప్రేమాణమ్ = ప్రేమను. అవలోక్య = గ్రహించి. ముహుః = మాటిమాటికిని. ఆత్మపక్షవిజయమ్ = స్వపక్షవిజయమును. భంగమ్ చ = వినాశమును, కాంక్షన్తీ = కోరుకొనుచున్నదై ధ్యాయన్తీ = ఆలోచించుచున్నదై, ముగ్ధా = మూఢచిత్తయై. మందోదరీ = మండోదరి, ధ్రువమ్ = నిశ్చయముగా. అంతరాళపతితా వర్తతే = జయాపజయ కాంక్షల నడుమ నలిగిపోవుచున్నది. (శార్దూలము).

రత్నచూడః :- (సకరుణస్మితమ్) వయస్య. విబుధరాజ విజయవిక్రమ క్రీతచేతసా వృద్ధపితామహేన స్వయం పరమేష్ఠినా ప్రతిష్ఠితేంద్రజిన్నామధేయశేషస్య తాదృశస్య తనూజస్య శుచా విచేష్టమానామరాతిగృహిణీమపి నైవముపక్రోష్టుమర్హసి. (పురోఽవలోక్య చ) హస్తదక్షిణేన కథమయం ద్విధా విభజ్యతే మహాజనః. (నిరూప్య చ సమహాకౌతుకమ్) సఖే. పశ్య పశ్య —

---

తాత్పర్యము :- రాక్షసులపాలిట దావాగ్నివలె అవతరించిన రాఘవని చూచి మండోదరి స్వపక్ష విజయమును ఆకాంక్షించుచున్నది. రావణునికి సీతపట్లగల ప్రేమను గమనించి స్వపక్ష వినాశమును కోరుచున్నది. (రాముడు జయించి సీతను కొనిపోయినచో తనకు సవతిపోరు తప్పునని) ఇట్లు అందోళన పడుచున్నది చూచితివా!

సమాసములు :- రాక్షసానామ్ వనమ్ - స్వచ్ఛందశ్చాసౌ దావానలశ్చ - ఏకశ్చాసౌ రాక్షసవన స్వచ్ఛంద దావానల ఇవ — తమ్. నిజస్య వల్లభః - తస్య. ఆత్మపక్షస్య విజయః - తమ్ ఆత్మనః పక్షః.

క్రియ :- వృతుఙ్ వర్తనే. లట్. ఆత్మనే. ప్రథమ
వర్తతే - వర్తేతే - వర్తన్తే

వయస్యేతి:- [సకరుణస్మితమ్ = దయతోకూడిన చిరునవ్వుతో] వయస్య=మిత్రమా! విబుధరాజ విజయ=దేవేంద్రుని జయించిన, విక్రమ=పరాక్రమముతో. క్రీత = వశీకరింపబడిన — అమ్ముడుపోయిన, చేతసా = మనస్సుకలవాడైన వృద్ధపితామహేన = ముదుసలి బ్రహ్మయయిన, పరమేష్ఠినా = చతుర్ముఖునిచే. స్వయమ్ = స్వయముగా, ప్రతిష్ఠిత = సమర్పించబడిన, ఇంద్రజిత్=ఇంద్రజిత్తు అనునట్టి, నామధేయశేషస్య = పేరుమాత్రమే మిగిలియున్నవాడైన — నామమాత్రావశిష్టుడనుట, తాదృశస్య = అంతటివాడగు, తనూజస్య = సుతునియొక్క, శుచా = దుఃఖముతో — పుత్రవియోగ దుఃఖముతోననుట, విచేష్టమానమ్ = కుమిలిపోవుచున్న స్త్రీని అరాతిగృహిణీమ్ అపి = శత్రువు భార్యయే అయినప్పటికిని ఏవమ్ = ఇట్లు. ఉపక్రోష్టుమ్=నిందించుటకు, న అర్హసి=తగవుసుమా! — నిందింపదగదనుట, [ప్రుతః

దర్పోఽయం భవతః సురాసురచమూదోఃకాండ కండూవిష
జ్వాలాజాంగలికేన జంగలభుజాం పత్యాపి న త్యాజితః ।
యేనైంద్రే రథవర్మణీ రఘుశిశోరస్యోపనీతే త్వయా
రాజద్విష్టమిదం విధాయ స కథం శక్రోఽపి వర్తిష్యతే ॥ 55

---

మాంసాశనులగు రాక్షసులకు రాజయిన రావణునిచేగూడ. భవతః = నీయొక్క, అయమ్ = ఈ, దర్పః = అహంకారము నత్యాజితః = పోగొట్టబడలేదు. (జాంగలీ విష విద్యాయామ్ - మేదినీ జంగలం పిశితోఽస్త్రియామ్ - మేదినీ) - రావణుడు నీ అహంకారమునింకను పోగొట్టలేదనుట. యేన = ఏ. త్వయా = నీచేత. ఐంద్రే = ఇంద్రునివైన. రథవర్మణీ = రథము కవచము. అస్య = ఈ. రఘుశిశోః = రామునికి, ఉపనీతే = కొనిరాబడినవి - తెచ్చితివనుట. ఇదమ్ = ఈ. రాజద్విష్టమ్ = రాజద్రోహమును. విధాయ = చేసి. సః శక్రఃఅపి = ఆ దేవేంద్రుడు కూడ, కథమ్ వర్తిష్యతే = ఎట్లు జీవించును। (శార్దూలము)

తాత్పర్యము :- దేవేంద్రుని రథమును కవచమును తెచ్చి రామునికిచ్చి రాజద్రోహము చేసితివి. సురాసురుల భుజబలమునకు విష వైద్యుడైన రావణుడు నిన్ను విడిచి పెద్ద పొరపాటు చేసినాడు. చూచెదను నీవును నీ ప్రభువునెట్లు జీవింతురో।

సమాసములు :- సురాశ్చ అసురాశ్చ - సురాసురాణాం చమూః - చమూనాం దోః కాండాః - దోః కాండానాం కండూః - కండూరేవ విషజ్వాలా - విషజ్వాలాయాః జాంగలికః - తేన. జంగల భుంజతే - తేషామ్. ఇంద్రస్యేద మైంద్రమ్ - తే. రథశ్చ వర్మచ. రాజ్ఞః ద్విష్టమ్.

సంధులు :- దర్పః + అయమ్, శక్రః + అపి - ఉత్వాదేశ విసర్గ. దర్పో + అయమ్, శక్రో + అపి - పూర్వరూప. సుర + అసుర. పత్యా + అపి - సవర్ణదీర్ఘ. యేన + ఐంద్ర - వృద్ధి. శిశోః + అస్య - రేఫాదేశ విసర్గ. అస్య + ఉప - గుణసంధి. సః + కథమ్ - తదేతద్భ్యో సర్గలోప.

క్రియ :- వృతుజీర్ వర్తనే. ల్రుట్, ఆత్మనే, ప్రథమ
వర్తిష్యతే - వర్తిష్యేతే - వర్తిష్యన్తే

యైర్దృష్టా భువనత్రయీవిజయిభిః సర్వేంద్రిపాః సంత్యమీ
తే సంప్రత్యపి మే నయాపనయయోర్నిర్వాహమూలం భుజాః ॥ 56

రత్నచూడః :- (కర్ణం దత్వా విహస్య) కిమాహ రామః —

ఛిత్త్వా మూర్ధ్నః కిమితి స వృతో ధూర్జటిర్యద్యమీషాం
దోః స్తంభానాం త్రిభువనజయశ్రీరియం వాస్తవీ తే।

---

తాత్పర్యము :- నన్నెదిరించిన దేవేంద్రుని పేయి దిస్సులను. క్రోధముతో క్షణకాలము భగ్నమని వెనువెంటనే దిక్కిటితో పల్లారినవి. అట్లోంకరించిన నా ఈ బాహువులు ఇప్పటికిని కుశలముగా నున్నవి. ఇవి ముల్లోకములను జయించినవి. అన్నింటిని ఒడిసిపట్టినవి. నయాపనయముల నిర్వహణకు ఇవి మూలము. ఈ నా బాహువులు ఇప్పటికిని ఉన్నవి సుమా।

సంధులు :- జ్వలితాః + ముహూర్తమ్. దృష్టాః + భువన - విసర్గలోప. స్వైః + ఏవ. క్లిష్టైః + అశ్రుమహోర్మిభిః + ముఖ. యైః + దృష్టాః, నయయోః + నిర్వాహ - రేఫాదేశ విసర్గ. మహా + ఊర్మి - గుణసంధి. సంతి + అమీ - యణాదేశ - సంప్రతి + అమీ - యణాదేశ.

క్రియ :- అస భువి, లట్. పరస్మై. ప్రథమ అస్తి - స్తః - సన్తి

ఛిత్త్వేతి :- (కర్ణమ్ దత్వా = విని, విహస్య = నవ్వి) రామః = రాముడు. కిమ్ ఆహ = ఏమనుచున్నాడు - అమీషామ్ = ఈ. దోః స్తంభానామ్ = బాహుదండములయొక్క. ఇయమ్ = ఈ సీవనుచున్న, త్రిభువన జయశ్రీః = ముల్లోకములను జయించు శోభ. వాస్తవీ యది = సత్యమే అయినచో. తే= నీయొక్క మూర్ధ్నః = శిరస్సులను. ఛిత్త్వా = ఖండించుకొని. సః = ఆ. ధూర్జటిః = శివుడు. కిమితి = ఏమని. వృతః = ప్రార్థింపబడినాడు — శివుని ఏల ప్రార్థించితివనుట. భవతః = నీయొక్క. మూర్ధానః వా = శిరస్సులందమూ. దుర్లభాః = అంతటి దుర్లభములు—నీవు మాత్రమే ఖండించి ఈయవలసినవియు తేనిచో దొరుకనివియు అనుట. న సంభవేయుః ఖలు = కానేరవు కదా? యత్ = ఎలయన, జగతామ్ = జగములకు, శిల్పినః = సృష్టికర్తయగు, దేవస్య = దేవునికి. త్వమ్ అపి = నీవు. ప్రపౌత్రః అపి = మునిమనుమడవు అయ్యుంటివి. బ్రహ్మదేవుని ఒక శిరస్సును శివుడు త్రుంచిన పురాణకథ ఇట అనుసంధించుకొనవలెను. (మందాక్రాంతము).

మూర్ధానో వా న ఖలు భవతో దుర్లభాః సంభవేయు
ర్యద్దేవస్య త్వమసి జగతాం శిల్పినోఽపి ప్రపౌత్రః ॥ 57

యత్పునర్బ్రవీషి "సంప్రత్యపి తే భుజాస్సన్తీ"తి తదధునైవ జ్ఞాస్యసే.

హేమాంగదః :- (కర్ణం దత్త్వా) కిమాహ రావణః—అరేరే రాజన్యడింభ ! భవతః పురాణపితామహేన బహు తావదనరణ్యేనైవ జ్ఞాతమ్. ఇదానీం భవానపి జ్ఞాస్యతి.

---

తాత్పర్యము :- ఓయీ దశకంధరా ! ముల్లోకములను జయించు నీ బాహుస్తంభములకే సత్త్వము ఉన్నచో మరి శిరఃఖండనముతో శివునారాధించితివేల ! శివునికి నీ శిరస్సులు అంతటి దుర్లభములా ! కాదే. బ్రహ్మదేవునికి నీవు ప్రపౌత్రుడవుగదా ! బ్రహ్మ శిరస్సునే ఖండించిన శివునికి నీ శిరస్సులేపాటి. శివుని మెప్పించుటకే శిరస్సులు ఖండించుకొంటివి. ఆ మెప్పు కారణముగా నీకు త్రిలోకజయమబ్బినది. అంతేకాని ఇది నీ బాహుబలము గొప్ప కాదనుట.

సంధులు :- పృథుః + ధూర్జటిః, మూర్ధానః + వా. భవతః + దుర్లభాః - ఉత్వాదేశ విసర్గ. ధూర్జటిః + యది. త్రిః + ఇలుమ్. సంభవేయుః + యత్ – రేఫాదేశ విసర్గ. యది + అమీషామ్ – యణాదేశ. శిల్పినః + అపి – ఉత్వాదేశ విసర్గ – శిల్పినో + అపి – పూర్వరూప.

యదితి :- యత్పునః = మరింక. సంప్రతి అపి = ఇప్పటికిని. తే = నీ. భుజాః = బాహువులు, సన్తీతి = ఉన్నవి అని. బ్రవీషి = పలుకుచున్నావే. తత్ = అది, అధునా ఏవ = ఇప్పుడే. జ్ఞాస్యసే = తెలియబడనున్నది – ఇప్పుడే తేలిపోవుననుట.

కిమితి :- (కర్ణమ్ దత్త్వా = విని) కిమ్ ఆహ రావణః = రావణుడు ఏమనుచున్నాడు – అరేరే = ఓరోరీ ! రాజన్యడింభ = క్షత్రియ శిశూ ! భవతః = నీ యొక్క. పురాణపితామహేన = ప్రాచీనుడగు తాత – నీ తాతలలో ఒకడైన అనుట. అనరణ్యేన ఏవ = అనరణ్యునిచేతనే. బహు = అధికముగా. జ్ఞాతమ్ = తెలిసికొనబడినది – నా బాహుబలము నాతడు బాగుగా నెరుగుననుట. ఇదానీమ్ = ఇప్పుడు. భవాన్ అపి = నీవును. జ్ఞాస్యతి = తెలిసికొందువు.

రత్నచూడః :- (కర్ణం దత్త్వా విహస్య) కిమాహ రామః — అరేరే రాక్షసీ పుత్ర.

న దూయే నః పూర్వం నృపతిమనరణ్యం యదవధీ
ర్జయో వా మృత్యుర్వా యుధి భుజభృతాం కః పరిభవః ।

నేతి :- (కర్ణం దత్త్వా = విని. విహస్య = నవ్వి) కిమాహ రామః = రాముడు ఏమనుచున్నాడు - అరేరే = ఓరోరీ ! రాక్షసీపుత్ర = రాక్షసవంశోద్భవా !- నః = మాయొక్క, పూర్వమ్ = పూర్వీకుడును. నృపతిమ్ = రఘువంశపు రాజునగు. అనరణ్యమ్ = అనరణ్యుడనువానిని, యత్ అవధీః = చంపితివనుట. న దూయే = దుఃఖింపను — అది నాకు దుఃఖకారణము కాదనుట జయః వా = జయమే కానీ, మృత్యుః వా = మరణమే కానీ. యుధి = యుద్ధమునందు, భుజభృతామ్ = మహావీరులకు, కః పరిభవః = అవమానమేమున్నది — ఏదియేనొకటి తప్పదు కనుక అవమానము లేదనుట. తు = కానీ జితమ్ = జితుడవై, హైహయపతేః = కార్తవీర్యార్జునునియొక్క., కారాగృహ వినిహితమ్ = కారాగారమునందు బంధింపబడిన వాడవగు. త్వామ్ = నిన్ను, పులస్త్యః = నీతాతయగు పులస్త్యబ్రహ్మ, కృపణః = దీనుడై. భిక్షామ్ అకృత యత్ = బిచ్చముగాయాచించి పొందెనన్నది, వ్యథయతి = నన్ను బాధించుచున్నది ? (శిఖరిణి)

తాత్పర్యము :- మా తాతగారగు అనరణ్యుడు నీ చేతిలో మడిసెననుట నాకు సంతాపకారణము కాదు. అందు అవమానములేదు, రణరంగమున విజయమో వీరస్వర్గమో లభించుట సహజము. కానీ నీవో జయింపవైతివి, మరణింపవైతివి, కార్తవీర్యునికి ఓడి కారాగారమున బందీవైతివి. ఇది నీ అవమానము కాగా మీ తాత నిన్ను యాచించి తెచ్చెననుట నన్ను మరింతగా బాధపెట్టుచున్నది.

సంధులు :- అవధీః + జయః, మృత్యుః + వా- రేఫాదేశవిసర్గ. జయః + వా. పులస్త్యః + యత్ — ఉత్వాదేశవిసర్గ. కృపణః + తత్ — సాదేశవిసర్గ.

క్రియలు :- హనహింసాగత్యోః. లుఙ్. పరస్మై. మధ్యమ. (హనో వధలిఙి. లుఙిచ)

అవధీః - అవధిష్టమ్ - అవధిష్ట
డుకృఞ్ కరణే. లుఙ్. ఆత్మనే. ప్రథమ

జితం తు త్వాం కారాగృహవినిహితం హైహయపతేః
పులస్త్యో యద్విశ్రామకృత కృపణ స్తత్ వ్యథయతి ॥ 58

హేమాంగదః :- ( కర్ణం దత్త్వా ) కిమాహ రావణః - అః క్షత్రియబటో వాచాట. కథమపూర్వశిల్పీ రజనీచరేంద్రచరితచంద్రేఽపి లక్ష్మ లిఖసి. తదయం న భవసి. (ససంభ్రమమవలోక్య) కథముపక్రాంతమేవ శరవర్షదుర్దినం మందోదరీ దయితేన.

---

అకృత - అకృషాతామ్ - అకృషత
వ్యథ్ భయసంచలనయోః (ఘట్) పరస్మై. లట్. ప్రథమ
వ్యథయతి - వ్యథయతః - వ్యథయన్తి

ఛందస్సు :- శిఖరిణి. రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలాగః శిఖరిణీ

| య | మ | న | స | భ | లగ |
|---|---|---|---|---|---|
| I U U | U U U | I I I | I I U | U I I | I U |
| నమోదే | వఃపూర్వం | నృపతి | మనవ | త్యాంయిన | పధీః |

కిమితి :- (కర్ణమ్ దత్త్వా = చెవియొగ్గి) కిమ్ ఆహ రావణః=రావణుడు ఏమనుచున్నాడు — అః ! క్షత్రియబటో = ఓరీ క్షత్రియకుమారా ! వాచాటా = వదరు బోతా ! కథమ్ = ఎట్లూ ! రజనీ చరేంద్ర = రాక్షసరాజుయొక్క. చరిత = వృత్తాంత మనునట్టి చంద్రేఽపి=చంద్రునియందు గూడ. అపూర్వశిల్పీ=వినూతన శిల్పకారుడవై లక్ష్మ = కళంకమును. లిఖసి = వ్రాయుచున్నావు ! తత్ = అందువలన. అయమ్ = ఇదే న భవసి = నీవు లేనివాడవగుచున్నావు — చచ్చుచున్నావనుట (ససంభ్రమమ్ = సంభ్రమముతో, అవలోక్య=చూచి). కథమ్=ఎట్లూ ! మందోదరీదయితేన=మందోదరి భర్తయగు రావణునిచేత, శరవర్షదుర్దినమ్ = అనేక బాణములతో వర్షింపబడునట్టి (సూర్యుడు కనపించని రోజు దుర్దినము — అట్లు బాణములు క్రమ్మినవనుట). ఉప క్రాంతమేవ = అప్పుడే ప్రారంభింపబడినది—బాణవర్షమును కురిపించుచున్నాడనుట.

కథమితి :- కథమ్ = ఎట్లూ ! మైథిలీవల్లభేన అపి = సీతాపతియగు రామునిచేగూడ. ప్రత్యుపక్రాంతమ్ ఏవ = బదులు ప్రారంభింపబడినది—రాముడును బాణములను మార్కొనుచున్నాడనుట (విహస్య = నవ్వి)

రత్నచూడః :- కథం మైథిలీవల్లభేనాపి ప్రత్యుపక్రాంతమేవ. (విహస్య)

పతంతి రామభద్రేణ ఖండితా రావణేషవః ।
పూర్వార్ధైః ఫలిభిర్వేగాత్పశ్చార్ధైః పక్షిభిశ్చిరాత్ ॥ 59

కించ —

అక్షేషు కేతుదండే చ సారథౌ చ హయేషు చ ।
ఖేలన్తి రాక్షసేంద్రస్య స్యందనే రామపత్త్రిణః ॥ 60

---

పతంతీతి -: రామభద్రేణ=రామునిచేత, ఖండితాః=రెండేసిముక్కలుగా ఖండింపబడిన, రావణేషవః=రావణబాణములు. ఫలిభిః=ఇనుపమొనగల, పూర్వార్ధైః = తొలిభాగములచేత, వేగాత్ = వేగముగను. పక్షిభిః = రెక్కలుగల పశ్చార్ధైః = మలిభాగములచేత, చిరాత్ = మెల్లగను. పతన్తి = పడుచున్నవి.

తాత్పర్యము :- రావణ బాణములను రాముడు రెండు ముక్కలుగా ఖండించుచున్నాడు. వానిలో మొనగల మొదటి ముక్క బరువుతో వేగముగా నేలకు పడుచున్నది. రెక్కలుగల రెండవముక్క నెమ్మదిగా రాలుచున్నది. వేగము పుంజు కొనుటకై బాణములకు రెక్కలు కట్టుట సుప్రసిద్ధము. (పథ్యావక్త్రిము)

సంధులు :- ఖండితాః+రావణ - విసర్గలోప. రావణ+ఇషవః = గుణ. ఫలిభిః + వేగాత్ - రేఫాదేశ విసర్గ. పక్షిభిః + చిరాత్ - శాదేశ విసర్గ. పూర్వ+అర్ధ పశ్చ+అర్ధ - సవర్ణదీర్ఘ.

క్రియ :- పత్ల గతౌ. పరస్మై. లట్. ప్రథమ

పతతి - పతతః - పతన్తి

అక్షేష్వితి :- కించ = మరియు-రాక్షసేంద్రస్య = రావణునియొక్క. స్యందనే = రథమునందు - రథమునకు సంబంధించి అనుట, అక్షేషు = చక్రముల యందును (చక్రే కర్షే పుమానక్షః - మేదినీ) కేతుదండే = జెండా కఱ్ఱయందును, సారథౌ = సూతునియందును, హయేషు = గుఱ్ఱములయందును, రామపత్త్రిణః = రాముని శరములు (రెక్కలు గట్టిన బాణములు), ఖేలన్తి = ఆడుకొనుచున్నవి. (పథ్యావక్త్రిము).

హేమాంగదః :- (సభయమ్) అహహా!

అన్ధకారీకృతవ్యోమా బాణవర్షేణ రావణః ।
రామారూఢం తిరోధత్తే శతాంగం శాతమన్యవమ్ ॥ 61

(చిరం దృష్ట్వా సవిస్మయమ్) సఖే!

నానావిధాని శస్త్రాణి శస్త్రైర్నానావిధైరపి ।
ఇమౌ హి ప్రతికుర్వాతే న కశ్చిదతిరిచ్యతే ॥ 62

---

తాత్పర్యము :- రామబాణములు రావణ రథములు ఆక్రమించుచున్నవి. చక్రములు కేతుదండము సారథి అశ్వములు - అన్నింటిని నిరాటంకముగా కొట్టుచున్నవి.

అన్ధకారేతి :- (సభయమ్ = భయముతో) అహహా! రావణః = దశకంఠుడు. బాణవర్షేణ = శర వర్షముతో. అంధకారీకృత వ్యోమా = ఆకాశమున చీకట్లు నింపినవాడై, రామారూఢమ్ = రామునిచే అధిరోహింపబడిన, శాతమన్యవమ్ శతాంగమ్ = ఇంద్రుని రథమును, తిరోధత్తే = కనిపింపకుండచేయుచున్నాడు. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- రావణుడు తన బాణ వర్షముతో చీకట్లు ముసురుకొనునట్లుచేసి రాముడధిరోహించిన ఇంద్రుని రథమును కనిపింపకుండచేయుచున్నాడు.

సమాసములు :- అంధకారీకృతం వ్యోమ యేన సః. బాణానాం వర్షమ్-తేన, రామేణ ఆరూఢః - తమ్ శతమంగాని యస్య సః - తమ్. శతమన్యోరయమ్ - తమ్.

నానేతి :- (చిరం దృష్ట్వా = చాలసేపు చూచి. సవిస్మయమ్ = ఆశ్చర్యముతో) సఖే = మిత్రమా! నానావిధాని = పలువిధములైన, శస్త్రాణి = ఆయుధములను. నానావిధైః = పలువిధములైన, శస్త్రైః = ఆయుధములతో. ఇమౌ = ఈ ఇరువురును. ప్రతికుర్వాతే = ఎదుర్కొనుచున్నారు. - ప్రతిక్రియ జరుపుచున్నారనుట. కశ్చిత్ = ఏ ఒక్కడును. న అతిరిచ్యతే = పైచేయిగా లేడు - ఇరువురును సమానముగా పోరుచున్నారనుట. (పథ్యావక్త్రము).

రత్నచూడః :- ఏవమేతత్ —

యద్రావణో బహుభిరేష భుజైః కరోతి
తద్రాఘవః ప్రతికరోతి భుజద్వయేన।
కర్మ ద్వయోర్యదపి తుల్యఫలం తథాపి
రక్షోభటాద్దశగుణం నరవీరశిల్పమ్ ॥ 63

---

తాత్పర్యము :- రామరావణులిరువురును ఏ శస్త్రమును ఆ శస్త్రముతో పరస్పరము ఖండించుకొనుచున్నారు. సమానముగా పోరుచున్నారు. ఏ ఒక్కనిదిని పై చేయిగా లేదు.

ప్రక్రియ :- డుకృఇుఁ కరణే. ఆత్మనే. లట్. ప్రథమ
కురుతే - కుర్వాతే - కుర్వతే
రిచ వియోజన సంపర్చనయోః (౧) కర్మణి. ఆత్మనే. లట్. ప్రథమ
అతిరిచ్యతే - అతిరిచ్యేతే - అతిరిచ్యన్తే

యదితి :- ఏవమ్ ఏతత్ = ఇదియట్లు - ఏషః = ఈ. రావణః = దశకంఠుడు. బహుభిః = ఇరువదివరకునున్న. భుజైః = బాహువులతో. యత్ కరోతి = ఏది చేయుచున్నాడో. తత్ = దానిని. రాఘవః = రాముడు. భుజద్వయేన = రెండు చేతులతో. ప్రతికరోతి = బదులు చేయుచున్నాడు - భగ్నము చేయుచున్నాడనుట. ద్వయోః = ఇరువురియొక్క. కర్మ = వ్యాపారము, తుల్యఫలమ్ = తుల్య ఫలముకలదే. తథాపి = అయినప్పటికిని, రక్షోభటాత్ = రావణునికంటె. నరవీర శిల్పమ్ = రాముని శర లాఘవము. దశగుణమ్ = పదిరెట్లు గొప్పది. (వసంతతిలకము)

తాత్పర్యము :- రావణుడు ఇరువది చేతులతో చేయుచున్నదానికి రాముడు రెండుచేతులతోనే సమాధానము చెప్పుచున్నాడు. ఈ రెండింటికిని ఫలము సమానముగానే ఉన్నప్పటికిని రావణునికంటె రామునికి రణచాతుర్యము పదిరెట్లు అధిక ముగా భాసించుచున్నది.

సంధులు :- రావణః + బహు - ఉత్వాదేశ విసర్గ. బహుభిః + ఏషః. ద్వయోః + యది - రేఫాదేశ విసర్గ. ఏషః + భుజైః - తదేతద్విసర్గ లోప. తథా + అపి - సవర్ణదీర్ఘ. రక్షస్ + భట - ఉత్వాదేశ విసర్గ.

హేమాంగద :- (విహస్య) సఖే.

వింశత్యాపి భుజైరేష ద్వౌ భుజావభియోధయన్ ।
అదూషితద్వంద్వయుద్ధమర్యాదో దశకంధరః ॥ 64

(సఖేదభయం చ) కథమయం రావణో మహేంద్రస్యందనాత్
తస్యారిబలభీమస్య ధ్వజదండస్య లాంఛనమ్ ।
దర్పదీప్తః క్షురప్రేణ మాయూరం పింఛమచ్ఛినత్ ॥ 65

---

క్రియ :- డుకృఞ్ కరణే. లట్ ప్రథమ. పరస్మై
కరోతి - కురుతః - కుర్వన్తి.

వింశత్యేతి :- [విహస్య = నవ్వి] సఖే = చెలికాడా ! ఏషః = ఈ దశకంధరః = రావణుడు, వింశత్యా = ఇరువదియైన, భుజైః అపి = బాహువులచే, ద్వౌ భుజౌ = [రాముని] రెండు బాహువులను, అభియోధయన్ = ఎదిరించుచు [యుద్ధము చేయుచు], అదూషిత = నిందింపబడని, ద్వంద్వయుద్ధ మర్యాదః = ద్వంద్వయుద్ధ నియమముకలవాడగుచున్నాడు. [పథ్యావక్త్రము].

తాత్పర్యము :- రావణుడిరువది బాహువులతో రాముని రెండు బాహువులను ఎదిరించుచున్నాడు. ఇది నిజముగను ఏకతులాయుద్ధము కాదు. అయినను ద్వంద్వయుద్ధ మర్యాదకు భంగము కలుగుటలేదు. [రావణుని యుద్ధ సౌరభ్యముపై నిది చిన్న విసురు ]

తస్యేతి :- (సఖేదభయమ్ చ = దుఃఖముతో భయముతో) కథమ్ = ఎట్టూ ! అయమ్ రావణః = ఈ దశకంఠుడు, మహేంద్రస్యందనాత్ = దేవేంద్రుని రథమునుండి - అరిబల భీమస్య = శత్రుసైన్యమునకు భీకరుడైన, తస్య = రాముని యొక్క. ధ్వజదండస్య = రథాగ్రధ్వజముయొక్క, లాంఛనమ్ = జెండాయైన, మాయూరమ్, పింఛమ్ = నెమలి పింఛమును, దర్పదీప్తః = గర్వముతో ప్రజ్వలించిన రావణుడు, క్షురప్రేణ = శస్త్రముతో, అచ్ఛినత్ = ఖండించెను.

తాత్పర్యము :- గర్వముతో అతిశయించుచున్న రావణుడు క్షురప్రముతో ఇంద్రరథాగ్రధ్వజమును ఖండించెను, ఇది మయూర పింఛలాంఛితమగు జెండా.

రత్నచూడః :- (సహర్షమ్) సఖే. పశ్య పశ్య కులిశకేతుకేతనవిమానానా విలక్షక్రుద్ధేన —

దిక్పాలద్విపదర్పదానలహరీసౌరభ్యగర్భానిలైః
పక్షైరేవ సమస్తరాక్షసకథా కల్పాంత కర్ణేజపాః।
దీయన్తే రఘుపుంగవేన కతిచిత్పౌలస్త్యమౌళిష్వమీ
పౌలోమీనయనాంబుశీకరకణావగ్రాహిణో మార్గణాః ॥ 66

---

సఖేఇతి :- (సహర్షమ్ = సంతోషముతో) సఖే = హేమాంగదా। పశ్య పశ్య = చూడుము చూడుము. కులిశకేతు = ఇంద్రుని యొక్క. కేతన = రథాగ్ర ధ్వజమును, విమానన = అవమానించుటవలన కల్గిన, విలక్ష = లజ్జతో. క్రుద్ధేన = కోపించిన రామునిచే—

దిక్పాలేతి :- దిక్పాలద్విప = ఐరావతాది దిగ్గజములయొక్క. దర్పదాన లహరీ = మదజల ప్రవాహమునకు చెందిన, సౌరభ్య = సుగంధమును. గర్భ = గర్భమునందు నిక్షేపించుకొన్న, అనిలైః = వాయువు కలవైన పక్షైః = రెక్కలతో (పుంఖములతో), బాణమునకు వేగమునకై కట్టు రెక్కలనుట. సమస్త... .... కర్ణేజపాం — సమస్త = సమస్తమైన, రాక్షసకథా = రాక్షస వంశ చరిత్రకు, కల్పాంత = యుగాంతమును - సర్వనాశనమునట కర్ణేజపాః = చెవిలో పోరునవియు రాక్షస వంశ వినాశమును సూచించునవనుట, (స్తంభకర్ణయోః రమిజపోః - కర్ణేజపః సూచకః స్యాత్ - అమరః) పౌలోమీ = శచీదే యొక్క, నయనాంబు శీకరకణ = కన్నీటి జడిని, అవగ్రాహిణః = నిలుపునవియు - దుఃఖమును తొలగించునవనుట, అయిన, మార్గణాః = బాణములు, కతిచిత్ = కొన్ని, రఘుపుంగవేన = రాముని చే, పౌలస్త్యమౌళిషు = రావణ శిరస్సులందు, అమీ = ఇవే, దీయన్తే = ప్రయోగింపబడుచున్నవి. (శార్దూలము)

తాత్పర్యము :- దిగ్గజముల మద సౌరభ్యమును విరజిమ్ముచున్న వాయువుతో వేగమును పుంజుకొనుచున్నవియు సమస్త రాక్షస వంశ వినాశమును సూచించుచున్నవియు, శచీదేవి కన్నీటిని తొలగించునవియునైన బాణములను రాముడు రావణుని శిరస్సులందు నిక్షేపించుచున్నాడు.

హేమాంగద :- ( సఖేదాద్భుతమ్ ) కథం కిరీటపరంపరాపరిభవమమృష్య
మాణేన బాణవర్షాద్వైతమాతన్వతా రాక్షసరాజేన
విదేహకన్యాకుచకుంభకోటికఠోరతాసాక్షిణి సాయకోఽయమ్ ।
రామస్య జన్మాంతరమేలకారశ్రీకౌస్తుభే వక్షసి హా నిఖాతః ॥ 67

---

సమాసములు :- దిక్పాల ద్విపానాం దర్పానలహారీ — లహర్యాః సౌరభ్యమ్ గర్వే యేషాం తే అనిలాః - తైః. సమస్తా చ సా రాక్షస కథా చ — కథాయాః కల్పాంతః — కల్పాంతస్య కల్లోలిజపాః. బోలోమ్యాః నయనాంబూని — అంబూనాం శీకరకణాః — కణానామవగ్రాహిణః.

సంధులు :— గర్వ + అనిలైః - కల్ప + అస్త. నయన + అంబు. కణ + అవగ్రాహిణః - సప్తర్షీణ్ణి - షష్ఠః + ఏవ — రేఫాదేశ విసర్గ. మౌళిషు + అమీ - యణాదేశ. గ్రాహిణః + మార్గణాః - ఉత్వాదేశ విసర్గ.

క్రియ :— డుదాఞ్ దానే (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ
దీయతే - దీయేతే - దీయన్తే

కథమితి :- (సఖేదాద్భుతమ్ = ఖేదముతో ఆశ్చర్యముతో) కథమ్ = ఎట్టూ ! కిరీట పరంపరా = పది కిరీటములను జరిగిన, పరిభవమ్ = అవమానమును. అమృష్యమాణేన = సహింపలేనివాడును, బాణవర్షాద్వైతమ్ = నిరంతర బాణ వర్షమును, ఆతన్వతా = కల్పించువాడునైన, రాక్షస రాజేన = దశకంఠరునిచే....

విదేహేతి :— విదేహకన్యా = సీతాదేవియొక్క. కుచకుంభకోటి = కుంభములవంటి కుచముల అగ్రభాగములయొక్క. కఠోరతా = కాఠిన్యమునకు. సాక్షిణి = సాక్షియైనదియు - ఆ కాఠిన్యమునెరిగినదనుట, జన్మాంతర = పూర్వజన్మయందు (విష్ణుమూర్తి) మేలకార = నెచ్చెలియైన, శ్రీకౌస్తుభే = లక్ష్మీదేవి కౌస్తుభమణి కలదియునైన. రామస్య వక్షసి = రాముని వక్షఃస్థలమునందు, అయమ్ = ఇదే. సాయకః = బాణము.-హా = అయ్యో ! నిఖాతః = నాటబడినది. (మేలకారస్సహచరః - మేదినీ) ఉపజాతి.

తాత్పర్యము :- అయ్యో ! సీతాకుచకుంభముల కాఠిన్యమునకుసాక్షియు శ్రీ కౌస్తుభములకు పూర్వజన్మ మిత్రమునైన రాముని వక్షఃస్థలమున రావణ బాణమిదే నాటుకొన్నది.

(సమ్యగవలోక్య) సఖే.

ఏకేనైవ నివాతకంకటభిదా లంకాపతేః పత్త్రిణా
విద్ధోఽయం యది నామ కోఽపి జగతాముల్లాఘనో రాఘవః।
చక్షుర్వర్త్మసహస్రనిస్సరదసృగ్ధారౌఘ ఝాంకారిణా
మాహేంద్రేణ తు వర్మణా వివృణుతే వీరః సహస్రం వ్రణాన్॥ 68

సమాసములు :- విదేహస్య (జనకస్య) కన్యా – కుచౌ కుంభావివ. కన్యాయాః కుచకుంభౌ....కుంభయోః కోటీ – కోట్యోః కఠోరతా – కఠోరతాయాః సాక్షీ – తస్మిన్, అన్యత్ జన్మ – జన్మాంతరే మేలకారౌ – శ్రీశ్చకౌస్తుభశ్చ – మేలకారౌ శ్రీకౌస్తుభౌ యస్మిన్,

ఏకేనేతి :- (సమ్యక్ అవలోక్య = బాగుగా పరికించి) సఖే = రత్న చూడా। నివాత కంకటభిదా = బలిష్ఠమైన వక్షఃకవచమును భేదించునదైన (ఉరశ్ఛదః కంకటకః – అమరము). లంకాపతేః = రావణునియొక్క, ఏకేన పత్త్రిణా ఏవ = ఒకేఒక్క బాణముతో. అయమ్ = ఈః, జగతామ్ ఉల్లాఘనః = ముల్లోకములను ఉల్లాసపరుచునట్టి, రాఘవః = రాముడు, విద్ధఃనామ = గాయపరుపబడినాడు. (ఉల్లాఘనో నిర్గతో గదాత్ – అమరము) యది = అయినను, చక్షుర్వర్త్మ సహస్ర = వేయి కన్నులకైన వేయి రంధ్రములనుండి, నిస్సరత్ = స్రవించుచున్న, అసృగ్ధారౌఘ = రక్తప్రవాహములతో, ఝాంకారిణా = ఝాంకరించుచున్న. మాహేంద్రేణ వర్మణా= ఇంద్ర కవచముతో, వీరః = ఈః రాఘవుడు, సహస్రమ్ వ్రణాన్ = వేయి గాయములను, వివృణుతే = తెలియజూపుచున్నాడు (శార్దూలము).

తాత్పర్యము :- రాముడు ఇంద్రకవచమును ధరించెను. ఆ కవచమున వేయి కన్నులకు వేయి రంధ్రములున్నవి. రావణుని బాణము రాముని వక్షస్థలముపై ఒకేఒక్క గాయమును చేసినది, కానీ రక్తము కవచపు వేయి రంధ్రములనుండియు స్రవించుచున్నది. అది చూపరులకు వేయి గాయములట్లు కన్పించుచున్నది.

సమాసములు :- నివాతశ్చాసౌ కంకటశ్చ – నివాతకంకటస్య భిత్ – తేన. లంకాయాః పతిః – తస్య. వర్మణాం సహస్రమ్ – చక్షుషాం వర్త్మసహస్రమ్. సహస్రాత్ నిస్సరంత్యశ్చతాః అసృగ్ధారాశ్చ – ధారాణామోఘః – ఓఘేన ఝాంకారి- తేన.

రత్నచూడః :- (సహర్షమ్) రాఘవేణాపి
సీతాస్తనస్తబకకుంకుమపంకలోప
సంకల్పపాతకిని వక్షసి రావణస్య ।
న్యస్తః శరో విబుధకుంజరదంతఘాత
రూఢవ్రణార్బుదచతుష్టయమధ్యవర్తీ ॥ 69

---

సంధులు :- ఏకేన + ఏవ. ధారా + ఓఘ - వృద్ధి విద్ధః + అయమ్ - కః + అపి ఉత్వాదేశ విసర్గ. విద్ధో + అయమ్ — పూర్వరూప - కో + అపి. ఉత్ + లాఘవః — లాదేశ. ఉల్లాఘవః + రాఘవః — ఉత్వాదేశ విసర్గ.

క్రియ -, వృఞ్ వరణే [క్ర్యా] ఆత్మనే. లట్. ప్రథమ.

వృణీతే - వృణాతే - వృణ్వతే.

సీతేతి :- [సహర్షమ్ = సంతోషముతో] రాఘవేణ అపి = రామునిచే గూడ - సీతా = సీతాదేవియొక్క, స్తనస్తబక = పుష్పగుచ్ఛములవంటి కుచముల యందలి. కుంకుమపంక = కాశ్మీరమును [పుంస్త్రీ లక్షణము]. లోప = తొలగింప వలెననునట్టి, సంకల్ప = నిశ్చయరూపమైన, పాతకిని = అపరాధముతో గూడినదగు. రావణస్య = దశకంధరుని వక్షసి = ఉరఃస్థలమందు, శరః = బాణము, విబుధ ... మధ్యవర్తీ - విబుధకుంజర = ఐరావతముయొక్క, దంతఘాత = (నాలుగు) దంతాఘాతములతో, రూఢ = ఏర్పడిన. వ్రణార్బుద చతుష్టయ = నాలుగు కాయలకు. మధ్యవర్తీ = నట్టనడుమనుండునదిగా, న్యస్తః = ప్రయోగింపబడినది. [వసంతతిలకము].

తాత్పర్యము :- సీతాదేవి గుండెలపై పుంస్త్రీ లక్షణముగానున్న కుంకుమను వైధవ్యము కల్పించిగాని తొలగించిగాని తొలగింపవలెనన్న మహాపాపమునకు ఒడిగట్టిన రావణాసురుని వక్షఃస్థలమున రామబాణము నాటుకొన్నది. ఐరావతము తన నాలుగు దంతములతో రావణుని గుండెలపై గాయములు చేయుగా నాల్గు కాయలేర్పడినవి. ఆ నాల్గింటి నట్టనడుమ రామబాణము దిగబడినది.

సమాసములు :- స్తనౌ స్తబకావివ - సీతాయాః స్తనస్తబకౌ - స్తబకయోః కుంకుమపంకః — పంకస్య లోపః - లోపరూపః సంకల్పః - సంకల్పరూపః పాతకః యస్మిన్ - తస్మిన్. విబుధానాం కుంజరః — కుంజరస్య దంతఘాతః — ఘాతేన రూఢః — రూఢశ్చాసౌ వ్రణశ్చ — వ్రణస్య అర్బుదమ్ — అర్బుదానాం చతుష్టయమ్ — చతుష్టయస్య మధ్యవర్తీ.

హేమాంగదః :- (కర్ణం దత్త్వా సవిస్మయమ్) ఏకేన సవ్యపాణినా విశిఖముద్ధృత్య కిమాహ రావణః - సాధురే మనుష్యడింభ, సాధు —

త్రైవిక్రమః సకలదానవజీవితవ్య
విద్యాసమాప్తిలిపిరేష సుదర్శనో మే ।
యస్మిన్నిపత్య హృదయే దళితారజాల
జ్యోతిస్తుషారమయమాభరణం బభూవ ॥ 70

---

ఏకేనేతి :- (కర్ణందత్త్వా = విని, సవిస్మయమ్ = ఆశ్చర్యముతో) సవ్యపాణినా ఏకేన = ఒక ఎడమ చేతితో, విశిఖమ్ = రామబాణమును, ఉద్ధృత్య = పెరికివైచి, రావణః = దశకంఠుడు, కిమ్ ఆహ = ఏమనుచున్నాడు ? రే = ఓరీ, మనుష్యడింభ = మానవ శిశువా । సాధుః సాధు = బాగుబాగు ।

త్రైవిక్రమ ఇతి :- సకలదానవ = సమస్త రాక్షసులయొక్క, జీవితవ్య = జీవమనునట్టి, విద్యా = విద్యకు, సమాప్తిలిపిః = చరమాక్షర చిహ్నము వంటిదైన గుండుసున్న వంటిదైన, త్రైవిక్రమః = విష్ణు సంబంధియైన, సుదర్శనః = సుదర్శన చక్రము, యస్మిన్ = ఏ, మే = నాయొక్క, హృదయే = వక్షఃస్థలమునందు, దళిత....మయమ్ - దళిత = ముక్కలైపోయిన, అరజాల = కమ్ములయొక్క, జ్యోతిః = కాంతియే, తుషారమయమ్ = చల్లని వెన్నెలగా కలిగిన, ఆభరణమ్ = అలంకారముగా, బభూవ = అయ్యెనో - తస్మిన్ అని ముందునకు అన్వయము. (వసంత తిలకము)

తాత్పర్యము :- దానవ జీవితములనునట్టి విద్యకు చరమగీతమైన (లిపి వంటిదైన, లేక వర్తులీకరణము - సున్న జుట్టినయనుట) సుదర్శన చక్రము నా వక్షఃస్థలమునకు తాకి కమ్ములు విరిగి వెలుగు వెన్నెలలు విరజిమ్ముచున్న ఆభరణముగా నిలిచిపోయినది.

సమాసములు :- సకలాశ్చ తే దానవాశ్చ - సకల దానవానాం జీవితవ్యమ్ - జీవితవ్యమేవ విద్యా - విద్యాయాః సమాప్తి సూచకః లిపిః దళితమరజాలం యస్య - దళితారజాలస్య జ్యోతిః - జ్యోతిరేవ తుషారమ్ - తస్య వికారః,

తస్మిన్నపి రుధిరదర్శనం కుర్వాణేన భవతా దర్శితేయం సురాసురవీరాతి శాయినీ హస్తవత్తా

రత్నచూడః :- అహహ. విపక్షగిరాముద్గారేణ సర్వగ్రంథిగురుణా దూరం దీప్యమానస్య

సువినిహితచంద్రహాసవ్రణకిణవలయోపహాసిత హారేషు ।
రామస్య మార్గణగణాః పతన్తి దశకంఠకంఠేషు ॥ 71

---

సంధులు :— లిపిః + ఏష - రేఫాదేశ విసర్గ. ఏషః + సుదర్శనః — తదేత ద్విసర్గలోప. సుదర్శనః + మే - ఉత్వాదేశ విసర్గ. దశిత + అంబాల - సవర్ణదీర్ఘ.

తస్మిన్నితి :- తస్మిన్ అపి = అట్టి రిః పక్షఃస్థలమునందును. రుధిర దర్శనమ్ = నెత్తురు క్రమ్ముటను. - ప్రవాహము కట్టలేదు గానీ చిట్లి నెత్తురు కన్పిం చినదనుట - కుర్వాణేన = కల్పించినవాడవగు, భవతా = నీచేత. ఇయమ్ = ఇదే. సురాసుర వీరాతిశాయినీ = దేవదానవ వీరులను అతిశయించునట్టి. హస్తవత్తా = బాహుశాలిత్వము - బాహు పరాక్రమమనుట - దర్శితా = ప్రదర్శింపబడినది - బాగు బాగనుట.

అహహేతి :- అహహ! సర్వగ్రంథి గురుణా = సర్వగ్రంథుల భార ముతో కూడినదియగు. విపక్షగిరామ్ ఉద్గారేణ = శత్రువాక్యోచ్చారణముతో - ప్రాణ శక్తిని కూడదీసికొని రావణుని నోట పై వాక్యము బరువుగా వెలువడినదనుట — దూరమ్ = అత్యంతము. దీప్యమానస్య = ప్రజ్వలించిన రామునియొక్క - అనంతర శ్లోకములోనికి అన్వయము. (స్వరగ్రంథి గురుణా అని పాఠాంతరము - కంఠస్వరము బరువుగా అని అర్థము.)

సువినిహితేతి :- సువినిహిత = శివారాధన సమయమున నేర్పడిన వైన. చంద్రహాస = చంద్రహాసమను (రావణ) ఖడ్గముచేనైన. వ్రణకిణ = కాయల యొక్క (గాయములు కాయలు కాసినవనుట). వలయ = మాలికచే, ఉపహాసిత = పరిహసించబడిన. హారేషు = రత్నహారములు కలిగినవగు. దశకంఠ కంఠేషు = రావ ణుని పది కంఠములయందును. రామస్య = దాశరథియొక్క. మార్గణగణాః = బాణ ముల సమూహములు. పతన్తి = నాటుకొనుచున్నవి. (ఆర్య)

హేమాంగదః :- (సచమత్కారమ్) సఖే పశ్య పశ్య—అనురూపవీరసంవాద ప్రమోదభరద్విగుణితావష్టంభ సంక్షోభిత భువనత్రయస్య నిరంతరప్రహీయమాణ బాణపంజరమధ్యవర్తినా రామభద్రేణ క్రీడాశకుంతకౌతుకం పూర్యతే రాక్షసరాజస్య. నూనమిదానీమ్ —

ఉదంచన్న్యంచద్భూవివృత నిభృతానామనుఫణం
మణీనాం విద్యుద్భిః క్షణముషితపాతాళతిమిరః ।

---

తాత్పర్యము :- రావణుని పది కంఠసులయందును ఖడ్గ ప్రహారములు కాయలు కాసినవి. శివారాధనకు ఖండించుకొనగా నేర్పడిన గాయముల మచ్చలు మాలికలవలెనున్నవి. అవి వీర చిహ్నములై రత్నహారములను పరిహసించుచున్నవి. అట్టి కంఠములయందు రామబాణములు గుంపులుగా నాటుకొనుచున్నవి.

సఖేఇతి :- (సచమత్కారమ్ = చమత్కారముగా) సఖే = రత్నచూడా! పశ్య పశ్య = చూడుము చూడుము. నిరంతర = ఎడతెరిపి లేకుండ. ప్రహీయమాణ = ప్రయోగింపబడుచున్న. బాణ = బాణములతో నేర్పడిన. పంజర = పంజరమునందు. మధ్యవర్తినా = నడుమ చిక్కుపడినవాడగు. రామభద్రేణ = రామునితో. అనురూప ...త్రయస్య. అనురూపవీర = తగిన వీరునితో. సంవాద = సంవాదమేర్పడినదనునట్టి, ప్రమోదభర = ఆనందాతిశయముతో. ద్విగుణిత = రెట్టింపైన. అవష్టంభ = గర్వముతో. సంక్షోభిత = సంచలింపజేయబడిన. భువనత్రయస్య = ముల్లోకములుగల, రాక్షసరాజ్య = రావణునియొక్క. క్రీడాశకుంతకౌతుకమ్ = లీలా శకుంతము (పెంపుడు చిలుక) కావలెనను వినోదము. పూర్యతే = తీర్పబడుచున్నది. — బాణపంజరమున రాముడు రావణునికి క్రీడాశుకమువలె నున్నాడనుట. నూనమ్ ఇదానీమ్ = ఇప్పుడు తప్పక —

ఉదంచదితి :- ఉదంచత్ = పైకి లేచుచున్నదియు, న్యంచత్ = క్రిందికి అణగుచున్నదియునైన భూ = భూగోళముచే. వివృత = ప్రకాశించునవియు నిభృతానామ్ = అణగిపోయినవియునైన. అనుఫణమ్ = శేషుని ప్రతి పడగపైనున్న. మణీనామ్ = వేయి మణులయొక్క. విద్యుద్భిః = కాంతులతో. క్షణముషిత = క్షణ కాలము

భుజక్రీడావల్గద్దశముఖ పదన్యాసగరిమ
ప్రగల్భైర్నిఃశ్వాసై రజని భుజగానామధిపతిః ॥ 72
రత్నచూడః :- (సభయమవలోక్య) సఖే, ఏవమేతత్ —

---

తొలగింపబడిన, పాతాళ తిమిరః = పాతాళ లోకమునందలి చీకటి కలవాడగు, భుజగానామ్ అధిపతిః = ఆదిశేషుడు - భుజ....ప్రగల్భైః - భుజక్రీడా = బాహువుల విలాసముతో, వల్గత్ = సంచరించుచున్న, దశముఖ = రావణునియొక్క, పదన్యాస గరిమ = పాదవిక్షేప భారముతో, ప్రగల్భైః = దీర్ఘీకరింపబడిన, నిఃశ్వాసైః = నిట్టూర్పులతో, అజని = అయ్యెను - నిట్టూర్చుచుండెననుట. (శిఖరిణీ)

తాత్పర్యము :- రావణుడు బారలుచాచి నడుచుచుండగా ఆ బరువునడు ఆదిశేషుడు నిట్టూర్చుచున్నాడు. అంతేకాదు రావణుడు అడుగుతీసి అడుగు వేయునప్పుడు భూగోళము లేచుచు క్రుంగుచున్నది. లేచినప్పుడు ఆదిశేషుని వేయి పడగలపైనున్న మణుల కాంతులు ఎగయుచున్నవి. అది క్రుంగినప్పుడు కప్పువడిపోవుచున్నవి. ఇట్లు క్షణకాలము పాతాళమున చీకట్లు తొలగుచున్నవి. మరల మెలగుచున్నవి.

సమాసములు :- ఉదంచంతీ చ సా న్యంచన్తీ చ — ఉదంచన్న్యంచంతీ చ సా భూశ్చ - వివృతాశ్చ తే నివృతాశ్చ — భువా వివృత నివృతాః - తేషామ్. ఫణే ఫణే - అనుఫణమ్. క్షణం ముషితమ్ - పాతాళస్య తిమిరమ్ — క్షణ ముషితం పాతాళ తిమిరం యేన సః. భుజానాం క్రీడా — క్రీడయా వల్గన్ - వల్గంశ్చాసౌ దశముఖశ్చ — దశముఖస్య పదన్యాసః — న్యాసస్య గరిమా - గరిమ్ణా ప్రగల్భైః.

సంధులు :- ఉదంచత్ + న్యంచత్ - అనునాసికాదేశ. ప్రగల్భైః + నిఃశ్వాసైః + అజని — రేఫాదేశ విసర్గ.

క్రియ :- జనీఙ్ ప్రాదుర్భావే, ఆత్మనే, లుఙ్, ప్రథమ
అజని / అజనిష్ట — అజనిషాతామ్ — అజనిషత

రక్షఇతి :- (సభయమ్ అవలోక్య = భయముతో చూచి) సఖే = హేమాంగదా! ఏవమ్ ఏతత్ = నీవన్నట్లే - రక్షః = రాక్షసులయొక్క, విక్షోభ = సంచారమందలి, వేగ = వేగముచే, ఉచ్ఛలిత = చెల్లాచెదురైన, జలనిధి = సముద్రము

రక్షోవిక్షోభవేగోచ్ఛలితజలనిధివ్యక్తమాతంగచక్ర
క్రుధ్యద్దిఙ్నాగముక్తోద్ధరణగురుభరామద్య నాగాధిరాజః ।
అంగైరంగేషు మగ్నైరవిరళవలినా వామనేనాతిపీన్వా
దేహేనాపహ్నువానః ఫణఫలకపరీణాహముర్వీం బిభర్తి ॥ 73

---

లందు. వ్యక్త = బయటపడిన. మాతంగచక్ర = సముద్రపుఏనుగుల సమూహముచే, (వానిని చూచుటచే). క్రుధ్యత్ = కోపించిన. దిఙ్నాగ = దిగ్గజములచే. ముక్త= విడిచి పెట్టబడిన, ఉద్ధరణ = ఉద్ధరణ వ్యాపారము కలుగుటచే — మోయుటను విడుచుటచే గురుభరామ్ = అధిక భారముకలదైన, ఉర్వీమ్ = భూమిని. అద్య = ప్రస్తుతము. నాగాధిరాజః = ఆదిశేషుడు. అవిరళవలినా = చుట్టలు చుట్టుకొని క్రిక్కిరిసినదియు, వామనేన = ఆ కారణముచేతనే వామనమైనదియు. అతిపీన్వా = మిక్కిలి స్థూలమైనదియు (పీన్వాచ స్థూలపీవరే - అమరః). అయిన. దేహేన = శరీరముతో. ఫలఫలక పరీణాహమ్ = విశాలమైన పడగల విస్తారమును. అపహ్నువానః = దాచుకొనుచున్న వాడై — ఆ శ్రమను కప్పిపుచ్చుకొనుచు. అంగేషు = అవయవములలోనికి, మగ్నైః= తాపడమైపోయిన, అంగైః = శరీరావయవములతో. బిభర్తి = భరించుచున్నాడు. (స్రగ్ధర)

తాత్పర్యము :- రాక్షసుల సంచార వేగముతో సముద్రములు చెల్లాచెదరుకాగా సముద్రపుఏనుగులు బయటపడినవి. వానిని చూచుటతో దిగ్గజములు కోపించి భూగోళమును మోయుట విడిచిపెట్టినవి. దానితో ఆదిశేషుని పడగలపై భారము పెరిగినది. చుట్టలుచుట్టుకొని క్షుప్తముగా బలిష్ఠముగానున్న శరీరముతో పడగలపైనున్న బరువును ఆదిశేషుడు అతికష్టముమీద భరించుచున్నాడు.

సమాసములు :- రక్షసాం విక్షోభః - విక్షోభస్య వేగః — వేగేన ఉచ్ఛలితాః - ఉచ్ఛలితాశ్చ తే జలనిధయశ్చ - జలనిధిషు వ్యక్తమ్ — మాతంగానాం చక్రమ్ — వ్యక్తంచ తత్ మాతంగచక్రంచ — చక్రేణ క్రుధ్యన్తః - క్రుధ్యన్తశ్చతే దిఙ్నాగాశ్చ — దిఙ్నాగైః ముక్తమ్ చ తత్ ఉద్ధరణమ్ చ -ముక్తోద్ధరణేన గురుభరామ్. నాగానామధిరాజః. ఫణాః ఫలకా ఇవ - ఫణఫలకానాం పరీణాహః — తమ్.

(ఊర్ధ్వమవలోక్య) కథమిత స్తతో వైమానికై రపక్రమ్యతే గగనతలాత్ ।

హేమాంగదః :- (సచమత్కారమ్) అహో ! త్రిభువనభయంకరమాయోధనముపక్రాంతం మహావీరాభ్యామ్. తథా హి —

ధ్యాయత్యయం గాధిసుతాదధీతాన్ దివ్యాస్త్రమంత్రాన్మనువంశవీరః ।
బ్రహ్మోపదిష్టామిహ శస్త్రవిద్యామసౌ తదాకాంక్షతి రాక్షసేంద్రః ॥ 74

---

సంధులు :- రథిన్ + వినోద – ఉత్వాదేశ విసర్గ. వేగ + ఉచ్ఛలిత, ముక్త + ఉద్ధరణ - గుణసంధి. ఉత్ + చలిత - శ్చుత్వ. దిక్ + నాగ - అనునాసికాదేశ. నాగ + అధిరాజః, వానసేన + అతిసన్నా. దేహోన + అసహ్యవానః - సవర్ణదీర్ఘ. అంగైః + అంగేషు, మగ్నైః + అవిరళ - రేఫాదేశ విసర్గ.

క్రియ :- డుభృఞ్ ధారణ పోషణయోః (జ్హు) పరస్మై. లట్. ప్రథమ విభక్తి - బిభృతః - బిభ్రతి

కథమితి :- (ఊర్ధ్వమ్ అవలోక్య = పైకిచూచి) కథమ్ = ఎట్లు ! గగనతలాత్ = ఆకాశమునుండి. వైమానికైః = దేవతలచేత (విమానారూఢులై రామరావణ యుద్ధమును చూచుచున్న దేవతలు). ఇత స్తతః = ఇటునటు, అపక్రమ్యతే = తొలగబడుచున్నది - అటునిటు పైకి తొలగుచున్నారనుట.

అహో ఇతి :-(సచమత్కారమ్ = చమత్కారయుక్తముగా) అహో ! త్రిభువన = ముల్లోకములకును. భయంకర = భయముగొల్పునట్టి, ఆయోధనమ్ = యుద్ధము. మహావీరాభ్యామ్ = మహావీరులగు రామరావణులచే, ఉపక్రాంతమ్ = ప్రారంభింపబడినది - ద్వంద్వయుద్ధమును ఉద్ధృతము గావించిరనుట. తథాహి = అంతే కదా !

ధ్యాయతీతి :- అయమ్ = ఈ, మనువంశవీరః = రాముడు, గాధిసుతాత్ = విశ్వామిత్రునినుంచి, అధీతాన్ = అభ్యసించినవగు, దివ్యాస్త్ర మంత్రాన్ = దివ్యాస్త్రముల ప్రయోగ మంత్రములను, ధ్యాయతి = ధ్యానించుచున్నాడు. ఇహ = ఇచ్చట (ఇంతలో). అసౌ = ఈ, రాక్షసేంద్రః = రావణుడు, బ్రహ్మోపదిష్టామ్ = బ్రహ్మచే ఉపదేశింపబడిన, శస్త్రవిద్యామ్ = శస్త్రవిద్యను (బ్రహ్మాస్త్రాదులను). ఆకాంక్షతి = స్మరించుచున్నాడు. (ఉపజాతి)

తదావామప్యపసరావః. (ఇత్యపసృత్యాసాతే)

హేమాంగదః :- (సమంతాదవలోక్య) సఖే. యథా భువనసంక్షోభ స్తథా తర్కయామి - తామిస్రం ధానపీయేన. ధానవీయం రాహవీయేణ, రాహవీయం వైష్ణవీయేన. వైష్ణవీయం పౌష్పకేతవేన. పౌష్పకేతవం చ పాశుపతేనాస్త్ర మస్త్రేణ ప్రతికుర్వాణయోః పులస్త్యకకుత్స్థకులైకవీరయోస్తుములమాయోధనం వర్తతే.

---

తాత్పర్యము :- విశ్వామిత్రుడుపదేశించిన దివ్యాస్త్ర మంత్రములను రాముడు, బ్రహ్మోపదిష్టమగు అస్త్ర విద్యను రావణుడు ధ్యానించుచున్నారు. కావున భీకర సంగ్రామమే జరుగనున్నది.

క్రియ :- కాంక్షి కాంక్షాయామ్. పరస్మై, లట్, ప్రథమ [లఙ్]
ఆకాంక్షతి - కాంక్షతః - కాంక్షన్తి

తదితి :- తత్ = అందుచేత, ఆవామ్ అపి = మనమిరువురముగూడ, అపసరావః = వైదొలగెదము. [ఇతి = అని అపసృత్య = ప్రక్కకు తొలగి, ఆసాతే = ఉందురు]

సఖేఇతి :— [సమంతాత్ అవలోక్య = తేరిపారజూచి] సఖే = చెల్ల చూడా! యథా భువన సంక్షోభః = ముల్లోకములకు సంక్షోభము వచ్చినట్లు, తథా తర్కయామి = భావించుచున్నాను. తామిస్రమ్ = తామిస్రమను నస్త్రమును. ధానవీయేన = ధానవీయమను నస్త్రముతోను, ధానవీయమ్ = ధానవీయమును, రాహవీయేణ = రాహవీయముతోను, రాహవీయమ్ = రాహవీయమును, వైష్ణవీయేన = వైష్ణవీయముతోను, వైష్ణవీయమ్ = వైష్ణవీయమును, పౌష్పకేతవేన = మన్మథుడు అధిదేవతగా కలిగినదానితోను. పౌష్పకేతవమ్ = దానిని, పాశుపతేన = పాశుపతము తోను - ఇట్లు - అస్త్రమ్ = ఒక అస్త్రమును, అస్త్రేణ = అస్త్రముతో. ప్రతి కుర్వాణయోః = విరుగుడు చేసికొనుచున్న, పులస్త్యకకుత్స్థకులైకవీరయోః = రావణ దాశరథులకు, తుములమ్ ఆయోధనమ్ = సంకుల సమరము, వర్తతే = జరుగుచున్నది.

రత్నచూడః :- సఖే. కృతిప్రతికృతీనామవిశేషేఽపి జేతవ్యమితి రామస్య మర్తవ్యమితి రావణస్య నిర్ణయనిర్భరోఽయం సర్వాస్త్రమోక్షః. విశిఖముఖోపస్థాయినీనాం చ పునర్దేవతానామ బలీయా నాటోపః కల్ప్యతే. తథా హి —

యద్దైవతం క్షిపతి పత్త్రిషు రాక్షసేంద్రః
స్నేహేన తద్రఘుపతేర్మృదు సన్నిధత్తే।

---

కృతీతి -: సఖే = హేసూంగదా। కృతప్రతికృతీనామ్ = అస్త్రమును ప్రయోగించుట ప్రత్యస్త్రమును ప్రయోగించుటలకు, అవిశేషే అపి = ఇరువురిలో హెచ్చుతగ్గులు లేకపోయినప్పటికిని. రామస్య = రామునియొక్క. అయమ్ = ఈ. సర్వాస్త్రమోక్షః = సర్వాస్త్ర ప్రయోగము. జేతవ్యమ్ ఇతి = జయింపవలెనని. నిర్ణయ నిర్భరః = నిర్ణయముతో కూడినది. రావణస్య = దశకంధరునియొక్క. అయమ్ = ఈ, సర్వాస్త్రమోక్షః = సర్వాస్త్ర ప్రయోగము, మర్తవ్యమ్ ఇతి = [రాముడు] మరణింపవలెనని, నిర్ణయ నిర్భరః = నిర్ణయముతో కూడినది. పునః = మరియు. విశిఖ = అయా శరముల. ముఖ = అగ్రభాగమునందు, ఉపస్థాయినీనామ్ = వర్తించువారైన. దేవతానామ్ = దేవతలయొక్క. ఆటోపః = గర్వము. అబలీయాన్ = దుర్బలముగా. కల్ప్యతే = కల్పించుచున్నది. తథా హి = ఆశ్లేకదా।—

యదితి :- రాక్షసేంద్రః = రావణుడు, పత్త్రిషు = తన బాణములందు యత్ దైవతమ్ = ఏ అస్త్ర దేవతను. క్షిపతి = ప్రయోగించునో, తత్ = ఆ దైవతము, స్నేహేన = మైత్రితో, రఘుపతేః = రామునికి, మృదు = కోమలముగా, సన్నిధత్తే = తాకుచున్నది చ = మరియు, రామభద్రః = రాముడు, యామ్ దేవతామ్ = ఏ దేవతను, ఉపదధాతి = ఆవాహనచేసి ప్రయోగించునో, అసౌ = ఆ దేవత, త్రాసాత్ = భయమువలన, దశముఖస్య = రావణునికి, శనైః ఉపైతి = మెల్లగా చేరుచున్నది. (వసంతతిలకము)

యాం దేవతాముపదధాతి చ రామభద్ర
స్తాం రావణో దశముఖస్య శనైరుపైతి ॥ 75

(నేపథ్యే)

యద్యత్కృత్తం దశముఖశిరస్తస్య తస్యైవ కాంతౌ
సంక్రామంత్యామతిశయవతీ శేషవక్త్రేషు లక్ష్మీః ।
యో యః కృత్తో దశముఖభుజస్తస్య తస్యైవ వీర్యం
లబ్ధ్వా దృప్యత్యధికమధికం బాహవః శిష్యమాణాః ॥ 76

---

తాత్పర్యము :- రావణుడు ప్రయోగించిన అస్త్రములు మైత్రి వలన రామునికి మృదువులై తాకుచున్నవి. రాముడు ప్రయోగించిన అస్త్రములు భయము వలన రావణునికి మెల్లగా చేరుచున్నవి.

క్రియ :- :- క్షిపఙ్ ప్రేరణే. లట్, పరస్మై. ప్రథమ

క్షిపతి – క్షిపతః – క్షిపన్తి

డుధాఞ్ ధారణ పోషణయోః, లట్. ప్రథమ

ధత్తే – దధాతే – దధతే

దధాతి – ధత్తః – దధతి

ఉప + ఏతి – ఇతః - యన్తి - ఇణ్ గతౌ, పరస్మై. లట్. ప్రథమ

(నేపథ్యే = తెరలో)

యదితి :- యద్యత్ = ఏదే, దశముఖశిరః = రావణ శిరస్సు, కృత్తమ్ = ఖండింపబడినదో, తస్య తస్య = ఆయా ముఖముయొక్క, కాంతౌ = తేజస్సు. సంక్రామంత్యామ్ = తనకు సంక్రమింపగా, శేషవక్త్రేషు = తక్కిన ముఖముల యందు. లక్ష్మీః = శోభ, అతిశయితవతీ = అతిశయించుచున్నది. యః యః = ఏయే దశముఖభుజః = రావణబాహువు, కృత్తః = ఖండింపబడినదో, తస్య తస్య ఏవ = దాని దానియొక్క. వీర్యమ్ = బలమును, శిష్యమాణాః = మిగిలియున్న. బాహవః = బాహువులు, లబ్ధ్వా = తాము పొంది, అధికమ్ అధికమ్ = మిక్కిలి అధికముగా, దృప్యన్తి = మిడిసిపడుచున్నవి. (మందాక్రాంతము)

(నేపథ్యే కలకలః)

ఉభౌ :- (సహర్షరోమాంచమాకర్ణ్య) అయే, శబ్దోపలంభసంపత్తికేన కర్మణా నిర్మితాని త్రిభువనకోశస్య కోఽయమింద్రియాణి ప్రీణయతి.

(పునర్నేపథ్యే కలకలః)

ఉభౌ :- (సభయాద్భుతమ్) అయే, కథమయం కపటకంఠీరవవైకుంఠకంఠ కఠోరకోలాహలకాహళో మహానిర్ఘోషః ప్రజాకోశ

---

తాత్పర్యము :- రావణ శిరస్సులు ఒక్కొక్కటి ఖండింపబడుచుండగా మిగిలిన శిరస్సులు ఆ తేజస్సు సంగ్రహించుచున్నవి. అట్లే ఒక్కొక్క బాహువు ఖండింపబడగా దాని శక్తి తక్కిన బాహువులకు చేరుచున్నది.

క్రియ :- దృప హర్షమోహనయోః (శ్యన్) పరస్మై. లట్, ప్రథమ

దృప్యతి - దృప్యతః - దృప్యన్తి

(నేపథ్యే = తెరలో. కలకలః = కలకలము)

అయే ఇతి :- (సహర్షరోమాంచమ్ = ఆనందపులకాంకురములతో. ఆకర్ణ్య = విని) అయే = ఓహో, శబ్దోపలంభ సంపత్తికేన = వినదగిన శబ్దమును (పొందుట) వినుటయను శక్తిని కల్గించునట్టి, కర్మణా = పురాకృతమగు అదృష్ట విశేషముచేత, త్రిభువనకోశస్య = ముల్లోకములకును, నిర్మితాని = సృష్టింపబడిన ఇంద్రియాణి = శ్రోత్రేంద్రియములను. కః అయమ్ = ఈ శబ్దమేదో, ప్రీణయతి = ఆనందింపజేయుచున్నది.

(పునర్నేపథ్యే కలకలః = మరల తెరలో కలకలము)

కథమితి :- (సభయాద్భుతమ్ = భయముగా ఆశ్చర్యముగా) అయే, కథమ్ = ఎట్లు, కపటకంఠీరవ = మాయాసింహవేషధారియగు (నరసింహావతారము) వైకుంఠ = విష్ణుమూర్తియొక్క, కంఠ = కంఠమునుండి వెల్వడిన, కఠోరకోలాహల కాహళః = భీకరమగు సింహగర్జనల కోలాహలమువలె కటువైన. అయమ్ = ఈ, మహానిర్ఘోషః = పెద్దధ్వని. ప్రజాకోశ = బ్రహ్మాండముయొక్క, భంగమ్ = భంగమును- వినాశమును. అకాలే = అకాలమునందు. ప్రక్రమతే = ప్రారంభించుచున్నది.

భంగమపర్వణి ప్రక్రమతే. నూనం చేదానీం కాలకూటోప
దిగ్ధైరివ కంఠధ్వనిభిరేష మూర్ఛయతో భువనాని భైరవస్య
స్మరతి సభయమద్య పరమేష్ఠీ.

(పునర్నేపథ్యే)

దివ్యాస్త్రైర్భూర్భువఃస్వస్త్రితయడమరణోద్దామమైర్యోధయిత్వా
లూనోత్క్షిప్తైః శిరోభిర్దశభిరభినభో దర్శితైకాదశార్కః।

---

నూనమ్ = నిశ్చయము. కాలకూట + ఉపదిగ్ధైః = కాలకూట విషలిప్తములగు. కంఠ ధ్వనిభిః = కంఠధ్వనులతో. భువనాని = లోకములను. మూర్ఛయతః = మూర్ఛిల్ల జేయునట్టి. భైరవస్య = భైరవుని (యొక్క). పరమేష్ఠీ = బ్రహ్మదేవుడు. అద్య = నేడు. ఇదానీమ్ = ఇప్పుడు, స్మరతి = ధ్యానించుచున్నాడు. సృష్టి వినాశమునకై భైరవ శివుని బ్రహ్మ స్మరించుచున్నాడనుట.

[పునర్నేపథ్యే = మరల తెరలో]

దివ్యేతి :- భూర్భువః స్వస్త్రితయ = భూలోక భువర్లోక స్వర్లోకములు మూడింటిని. డమరణ = మార్మోగించుటయందు. ఉద్దామభైః = సమర్థములైన. దివ్యాస్త్రైః=ఆగ్నేయాది దివ్యాస్త్రములతో, [కాకుత్స్థేన = రామునిచే] యోధ యిత్వా = యుద్ధము చేయించినదై, లూన = ఖండింపబడి. ఉత్క్షిప్తైః = పైకెగుర గొట్టబడిన. దశభిః శిరోభిః = పది శిరస్సులతో, అభినభః = ఆకాశమునందు. దర్శిత= ప్రదర్శింపబడిన. ఏకాదశార్కః = పదునొకండు సూర్యబింబములు కలదై, నిజ = తనయొక్క, పిశిఖశిఖా = బాణాగ్రభాగమునునట్టి. యోగపీఠ = యోగాసనమునకు ఆహూత = ఆహ్వానింపబడిన. బ్రహ్మాస్త్రేణ = బ్రహ్మాస్త్రము కల్గిన. కాకుత్స్థేన = రామునిచే, అవకీర్ణః = నేలకు రాల్చబడినదై. రజనిచరపతేః = రాక్షసరాజగు రావ ణునియొక్క, కబంధః = కళేబరము [కబంధోఽస్త్రీ క్రియాయుక్తమపమూర్ధ కళేబరే- అమరము] వీరశయ్యామ్ = రణరంగమును. అధిశేతే = అలంకరించుచున్నది. [స్రగ్ధరావృత్తము]

కాకుత్స్థేనావకీర్ణో నిజవిశిఖశిఖాయోగపీఠోపహూత
బ్రహ్మాస్త్రేణాధిశేతే రజనిచరపతేర్వీరశయ్యాం కబంధః ॥ 77

ఉభౌ :- (శ్రుత్వా సహర్షసంభ్రమమూర్ధ్వమవలోక్య సవిస్మయమన్యోన్యమ్) పశ్య పశ్య ప్రళయకాల కరాళ కాలానల జ్వాలాపుంజపింజరాణి రావణశిరాంసి. (సత్వరముప

---

తాత్పర్యము :— ముల్లోకములను గడగడలాడించునట్టి దివ్యాస్త్రములతో హోరాహోరీ పోరాడి చివరకు రాముని బ్రహ్మాస్త్రముచే రావణుని పది తలలును ఖండింప బడినవి. పై కెగురగొట్టబడి ఆకాశమునందు పదునొకండు సూర్యబింబములవలె భాసించు చున్నవి. మొండెము రణభూమికి ఒరిగిపోయినది.

సమాసములు :- భూర్భువస్స్వస్త్రితయస్య డమరణమ్ — డమరణే ఉద్దామాస్త్రైః. దర్శితాః ఏకాదశార్కాః యేన సః. నిజస్య విశిఖః — విశిఖస్య శిఖా - నిజవిశిఖశిఖా ఏవ యోగపీఠః - యోగపీఠాయ (పీఠే) ఆహూతమ్ — బ్రహ్మాస్త్రం యేన- తేన. రజని చరాణాం పతిః — తస్య.

సంధులు :- దివ్య + అస్త్రైః. కాకుత్స్థేన + అవకీర్ణః. అస్త్రేణ + అధి సవర్ణదీర్ఘ. అస్త్రైః + భూః + భువః. ఉద్దామాస్త్రైః + యోధయిత్వా. శిరోభిః + దశభిః + అభి. పతేః + వీర - రేఫాదేశ విసర్గ. స్వః + త్రితయ - సాదేశ విసర్గ. డమరణ + ఉద్దామాస్త్రైః, యాన + ఉత్. పీఠ + ఉప - గుణసంధి. నభః + దర్శిత, అవకీర్ణః + నిజ - ఉత్వాదేశ విసర్గ. దర్శిత + ఏకాదశ - వృద్ధి సంధి.

క్రియ :- శీఙ్ స్వప్నే. ఆత్మనే. లట్, ప్రథమ
శేతే - శయాతే - శేరతే

ప్రతిపత్తి :- (శ్రుత్వా = విని. సహర్షసంభ్రమమ్ = ఆనందసంభ్రమము లతో. ఊర్ధ్వమ్ అవలోక్య = పైకి చూచి. సవిస్మయమ్ = ఆశ్చర్యముతో. అన్యోన్యమ్ = ఒండొరులతో) పశ్య పశ్య = చూడుము. చూడుము. ప్రళయకాల = ప్రళయకాలమునందు, కరాళ = భీకరమైన, కాలానల = విలయాగ్నియొక్క, జ్వాలా పుంజ = శిఖా సమూహములవలె, పింజరాణి = పింగళవర్ణయుక్తములైన. రావణ

సృత్య చాధస్తాత్పశ్యతః).

హేమాంగదః :- (సకరుణమ్) హా మహావీరప్రకాండ లంకేశ్వర, పర్యవసితోఽసి.

భిన్నైరైరావణగంధసింధురశిరః సంపాతిభిర్మౌక్తికైః
శశ్వద్విశ్వజయప్రశస్తిరచనావర్ణావళీశిల్పినే ।
నాకాంతఃపురికా కపోల విలసత్కాశ్మీరపత్త్రాంకుర
శ్రీవిన్యాసవిలాసభీషణభుజస్తంభాయ తుభ్యం నమః ॥ 78

---

శిరాంసి = రావణుని శిరస్సులను. పశ్య పశ్య = చూడుమా ! (సత్వరమ్ ఉపసృత్య = వేగముగా సమీపించి. అధస్తాత్ పశ్యతః = క్రిందికి చూచుచున్నవాడై)

హేతి :- (సకరుణమ్ = కరుణతో) హా ! మహావీర ప్రకాండ = మహావీరులయందు అగ్రగణ్యుడా ! లంకేశ్వర = రావణా ! పర్యవసితః అసి = ముగిసితివి.

భిన్నేతి :- భిన్న = చీల్చబడిన, ఐరావణ = ఐరావతమనునట్టి, గంధ సింధుర = మదగజముయొక్క, శిరః = కుంభస్థలమునుండి, సంపాతిభిః = రాలిపడు చున్న, మౌక్తికైః = ముత్తియములతో, శశ్వత్ = ఎల్లప్పుడును, విశ్వజయ = త్రిభువనవిజయరూపమగు, ప్రశస్తి రచనా = ప్రశంసాపత్రమునందలి, వర్ణావళీ = అక్షర పంక్తులకు, శిల్పినే = నిర్మాతవును, (ఆ ముత్తెములు తన ప్రశంసా పత్రమునకు అక్షరములైనవనుట). నాకాంతఃపురికా = స్వర్లోక స్త్రీలయొక్క, కపోల = చెక్కిళులందు, విలసత్ = ప్రకాశించునట్టి, కాశ్మీరపత్త్రాంకుర = కుంకుమ చేనైన మకరికా పత్రప్రరోహములతో (హత్తుకొన్న మకరికా పత్ర ముద్రలు శోభా ధాయకములుగా నున్నవనుట). భీషణ = భయంకరముగానున్న, భుజ స్తంభాయ = స్తంభములవంటి భుజములుకలవాడవునైన. తుభ్యమ్ = నీకై. నమః = ఇదే వందనము

తాత్పర్యము :- ఓ రావణా ! ఐరావత కుంభస్థలమును చీల్చి రాలిపడు చున్న మంచి ముత్తెములతో ప్రశంసా పత్రములు లిఖించుకొంటివి. అప్సరః కాంతల కపోలములపై నున్న మకరికా పత్త్రిముల ముద్రలతో సుందర భీషణములైన బాహు వులు ధరించితివి. మహావీరా ! నీకివే వందనములు.

రత్నచూడః :- సఖే, సర్వమతిశాయి రావణస్య. పురా పిఖలు —

చలతి జగతీజైత్రే యత్ర స్వభోగిచమూభరై
ర్వలయితమహాదేహస్తంభో బిభర్తి భువస్తలమ్।

---

సమాసములు :- పంక్తికంధరస్య కబంధః — సలిలప్రావో పంక్తి కంధర కబంధః — కబంధేన పీడాభరః - తస్మాత్. నిజస్య అవనమనమ్ - క్రమేణ ఉన్నమితాః చక్రవాళాచలాః యస్మిన్ - తమ్. మహ్యాః వలయః - తమ్. కాద్రవేయానామధిపతిః

సంధులు -: భరాత్ + నిజ - అనునాసికాదేశ. నిజ + అవనమన. చక్ర వాళ + అచలమ్. విగ్రహా + ఆధారత. కాద్రవేయ + అధిపతిః - సవర్ణదీర్ఘ. క్రమ + ఉన్నమిత - గుణసంధి. ఉత్ + నమిత - అనునాసికాదేశ. మహిః + వహతి - ఉత్వాదేశ విసర్గ.

క్రియ :- వహాఞ్ ప్రాపణే, పరస్మై, లట్, ప్రథమ
వహతి — వహతః - వహన్తి

చలతీతి :- సఖే = హేమాంగదా। రావణస్య = రావణునియొక్క, సర్వమ్ = సమస్తమును, అతిశాయి = లోకోత్తరమే. పురా + అపిఖలు = పూర్వము కూడా — జగతీజైత్రే = జగజ్జేతయైన రావణుడు. (జైత్రస్తు జేతా—అమర) చలతి = నడుచుచుండగా, స్వభోగిచమూభరైః = తన సర్వ సైనికులతో. వలయిత = చుట్టుకొన బడిన (భయముతోగానీ, నాయకుని దేహమునకు బలము చేకూర్చుసూహతోగానీ)। మహాదేహస్తంభః = స్తంభమువంటి పృథు శరీరముకలవాడై ఆదిశేషుడు. భువః తలమ్ = భూమండలమును. బిభర్తి = భరించును ఆ సమయమున - ప్రచలత్ = రావణపాద విన్యాసమునకు క్రక్కదలిన, అఖిలక్ష్మాభృత్ = సమస్త పర్వతముల యొక్క, మూలోపల = మొదలి పృథుశిలలతో. వ్యతిఘట్టిత = కొట్టబడి—పర్వతములు క్రుంగి అట్టడుగు శిలలు ఆదిశేషుని పడగలకు తగిలినవనుట — ఉల్బణ = రాపిడితో మరింత ప్రజ్వలించిన. మణిశిలా = (పడగలపై నున్న) మణులతో, జల్పాకీభిః = బుసుకొట్టుచున్నవగు, ఫణాభిః = పడగలతో, అహీశ్వరః = ఆదిశేషుడు (సర్పరాజు) భువస్తలమ్ = భూగోళమును. బిభర్తి = మోయుచున్నాడు. (హరిణీ).

హా లంబోదరకుంభమౌక్తికమణిస్తోమైర్మమైకావళీ
శిల్పే వాగధమర్ణికస్య భవతో లంకేంద్ర నిద్రారసః ॥ 81

ఉభౌ :- (సఖేదమ్) ఇదమశక్యానుభవం చక్షుఃశ్రోత్రస్య. ప్రతికృతానాం విద్విషామపి వ్యసనమతిమాత్రం హృదయమర్మాణి ఛిన్దన్తి.

---

తాత్పర్యము :- ఓ లంకేంద్ర ! నీవు భర్తవగుటచే పది ముఖములను చుంబించి ఇరువది బాహువులచే కౌగిలింపబడి నేను పతివ్రతనైతిని. అయ్యో ! వినాయకుని కుంభస్థలమును చీల్చి అందలి మంచిముత్తెముల గుంపులతో నాకు దండ గ్రుచ్చి ఇత్తునని వాగ్దానము చేసితివి. అది చెల్లించుకొనలేక అధమర్ణుడవైతివి. (అప్పు తీర్చని వాడు) ఇంతలో శః దీర్ఘ నిద్రయా !

సమాసములు :- చారిత్రవ్రతస్య దేవతా. లంబోదరస్య కుంభః - కుంభే విద్యమానాః మౌక్తిక మణిస్తోమాః (కుంభస్య) — తైః. ఏకావళ్యాః శిల్పః — తస్మిన్ వాచా అధమర్ణికః - తస్య. లంకాయాః ఇంద్రః. నిద్రాయాం రసః.

సంధులు :- భర్త్రా + మయోఽభిః + అలింగ్యతే. స్తోమైః + మమ — రేఫాదేశవిసర్గ. లంబ + ఉదర, లంకా + ఇంద్ర, మంద + ఉదరీ - గుణసంధి. దేవతా + అపి - సవర్ణదీర్ఘ. మమ + ఏకావళీ - వృద్ధి. అధమ + ఋణ — గుణ. భవతః + లంకేంద్ర - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- చుబి వక్త్రసంయోగే. పరస్మై. లట్. ప్రథమ.

చుంబతి - చుంబతః - చుంబన్తి

లిగి గతౌ (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ (ఆజ్)

ఆలింగ్యతే — ఆలింగ్యేతే — ఆలింగ్యన్తే

ఇదమితి :- (సఖేదమ్ = ఖేదముతో) ఇదమ్ = ఇది చక్షుఃశ్రోత్రస్య= నేత్రములకును చెవులకును — చూచుటకు వినుటకుననుట. అశక్యానుభవమ్=శక్యము గాని అనుభవము. (చక్షుఃశ్రోత్రస్య - ప్రాణ్యంగయవద్వంద్వముకనుక ఏకవచనము) ప్రతికృతానామ్ = పరాజితులైన. విద్విషామ్ = శత్రువులయొక్క. వ్యసనమ్ అపి = దుఃఖమైనను. అతిమాత్రమ్ = మిక్కిలి. హృదయమర్మాణి=హృదయమునందలి నెర

(సవిమర్శమ్) అహహ. న కించిదదుష్కరం నామ కృతాంతస్య.

వందారువృందారకవృందబందీమందారమాలామకరందబిందూన్ ।
మందోదరీయం చరణారవిందరేణూత్కరైః కర్బురితానసైషీత్ ॥82

(నేపథ్యే)

---

కులను. భినత్తి = చీల్చుచున్నది - మిక్కిలి నొప్పించుచున్నదనుట. (సవిమర్శమ్=సాలోచనగా) అహహ ! కృతాంతస్య = యమునికి, అదుష్కరమ్ నామ = దుష్కరమనునది, న కించిత్ = లేదుగదా !

వందార్వితి :- వందారు = నమస్కరించుచున్న. వృందారకవృందబందీ= బందీలుగా కొనిరాబడిన దేవతాంగనలయొక్క (రావణుడు పట్టితెచ్చిన దేవకాంతలు మందోదరికి పాదాభివందనములు చేయుచుండిరనుట). మందారమాలా = (కల్పక కుసుమములు) పారిజాతమాలికలనుండి రాలినటువంటి. మకరందబిందూన్= మకరంద బిందువులను. ఇయమ్ = ఈ. మందోదరీ=మందోదరి. చరణారవిందరేణూత్కరైః - చరణారవింద = తన పాదపద్మములనుండి ఎగసిన. రేణూత్కరైః=ధూళిరేణువులచే (పద్మములనుండి పుప్పొడి యెగసినట్లు). కర్బురితామ్ = కాలుష్యమును (కర్బురః కలనేఽన్యవత్ - మేదినీ). అనైషీత్ = పొందించెను - అంతటి మందోదరికి ఈ దశను కల్పించెనుగదా కృతాంతుడనుట. (ఇంద్రవజ్ర)

తాత్పర్యము :- రావణాసురుడు బందీలుగా పట్టితెచ్చిన దేవకాంతలు మందోదరికి పాదాభివందనములు చేయుచుండగా వారి జడలలోని పారిజాత పుష్పమాలికల నుండి మకరంద బిందువులు జారిపడినవి. ఆ బిందువులను ఈ మందోదరి తన పాదపద్మములనుండి రేగిన ధూళికణములతో గట్టిపరిచెడిది. అంతటి మందోదరికి నేడీ దశ వచ్చినదనుట.

సమాసములు :- వందారవశ్చ తాః బృందారకబృందబంద్యశ్చ - బందీనాం మందారమాలాః - మాలానాం మకరందబిందవః - తాన్. చరణే అరవిందే ఇవ- చరణారవిందయోః రేణూత్కరాః - తైః.

క్రియ :- ణీఞ్ ప్రాపణే, లుఙ్, పరస్మై, ప్రథమ

అనైషీత్ - అనైష్టామ్ - అనైషుః

(నేపథ్యే = తెరలో)

నీయన్తే వనదేవతాభిరమరక్షోణీరుహో నందనం
నీతో వల్లభపాలకేన చ నిజాముచ్చైఃశ్రవా మందురామ్ ।
రక్షోభిశ్చ విభీషణప్రణయిభిః కారాగృహాన్మోచిత
స్వర్వందీవదనావలోకనిబిడవ్రీడో బిడౌజాః కృతః ॥ 83

---

నీయన్త ఇతి :- వనదేవతాభిః = నందనవనాధిదేవతలచేత. అమరక్షోణీరుహాః = దేవతరువులు (రావణుడు కొల్లగొట్టి తెచ్చిన పారిజాతాదులు) నందనమ్ = నందనము నుద్దేశించి. నీయన్తే = కొనిపోబడుచున్నవి వల్లభపాలకేన = దేవేంద్రుని అశ్వపాలకునిచే (యశ్చారకో ముఖ్యఘోటానాం స స్యాద్వల్లభపాలకః - హారావళీ). ఉచ్చైః శ్రవము. నిజామ్ = తనదైన. మందురామ్ = అశ్వశాలను. నీతః = చేర్చబడినది. కారాగృహాత్=రావణకారాగారమునుండి. మోచిత=విముక్తులుగావింపబడిన, స్వర్వందీ= అప్సరోబందీలయొక్క (బందీలైన అప్సరసలయొక్క), వదన = ముఖములను. అవలోకన = చూచుటతో. నిబిడవ్రీడః=మిక్కిలి సిగ్గిలినవాడుగా. బిడౌజాః=దేవేంద్రుడు. విభీషణప్రణయిభిః = విభీషణునికి ఇష్టులైన. రక్షోభిః = రాక్షసులచే. కృతః = చేయబడెను. (శార్దూలము).

తాత్పర్యము :- వనదేవతలు లంకనుండి కల్పవృక్షములను పెకలించి నందనమునకు కొనిపోవుచున్నారు. ఇంద్రాశ్వపాలుడు ఉచ్చైఃశ్రవమును అమరావతికి తోలుకొనిపోవుచున్నాడు - దాని అశ్వశాలకు దానిని చేర్చుచున్నాడు. కారాగారమునందు బందీలై పడియున్న అప్సరసలను విభీషణ మిత్రులు విడిపింపగా ఆ దేవతాంగనల ముఖములను చూచుటకు దేవేంద్రుడు సిగ్గుపడుచున్నాడు. ఇంతకాలము తాను విడిపింపలేకపోయితినే అని ఇంద్రుని సిగ్గు

సమాసములు -: వనస్య దేవతాః - తాభిః. విభీషణస్య ప్రణయినః - తైః. మోచితాశ్చతాః స్వర్వంద్యః - బందీనాం వదనాని - వదనానామ్ అవలోకః - అవలోకేన నిబిడా వ్రీడా యస్య సః.

సంధులు - దేవతాభిః + అమర - రేఫాదేశ విసర్గ. క్షోణీరుహాః + నందనమ్. నీతః + వల్లభ. నిబిడవ్రీడః + బిడౌజాః - ఉత్వాదేశ విసర్గ. ఉచ్చైః

రత్నచూడః :- (సహర్షమ్) సఖే. తదేహి. లంకేశ్వరాధివాస చిరప్రవాస్తవ్యం బంధువర్గం సేవహే. (ఇతి పరిక్రామంతౌ విలోక్య సహర్షమన్యోన్యమ్) సఖే. పశ్య పశ్య. ప్రహారజర్జర వలీముఖాచ్ఛభల్ల గోలాంగూల గ్రామసంవల్గన వల్గిత సుగ్రీవో లక్ష్మణ నిహితధన్వా విభీషణ భుజావలంబీ విజయశ్రియా కిమపి ప్రదీప్త రమణీయో రామభద్రః అయం హి సంప్రతి -

---

శ్రవాః + మందురామ్ – విసర్గలోప. రథోభిః + చ – సంధేశ విసర్గ. గృహాత్ + మోచిత – అనునాసికాదేశ. వదన + అవలోక – సవర్ణదీర్ఘ.

క్రియ :- ణీఞ్ ప్రాపణే (కర్మణి) ఆత్మనే, లట్. ప్రథమ
నీయతే – నీయేతే – నీయన్తే

సఖేఇతి :- (సహర్షమ్ = ఆనందముతో) సఖే – హేమిత్రుడా! తత్ ఏహి = అందుచే ఇట రమ్ము. లంకేశ్వర = రావణునియొక్క. కారాధివాస = కారాగారమునందు. చిరప్రవాస్తవ్యమ్ = చిరకాలము నివసించిన. బంధువర్గమ్ = మన బంధు సమూహములను. సేవావహే = చూతము. (ఇతి = అని. పరిక్రామంతౌ = ముందునకు నడచుచు. విలోక్య = చూచి. సహర్షమ్ = సంతోషముతో. అన్యోన్యమ్ = ఒకరితోనొకరు – పరస్పరము) సఖే = మిత్రమా! ప్రహార = గాయములతో – దెబ్బలతో. జర్జర = అతివ్యధితులైన. వలీముఖ = వానరులయు. అచ్ఛభల్ల = భల్లూకము లయు. గోలాంగూల = కొండముచ్చులయు (వానరులలో నేకరకము) గ్రామ = సమూహముతోనైన. సంవల్గన = సాంత్వనమువలన. వల్గిత = కదలుచున్న. సుగ్రీవః = సుగ్రీవుడు కలవాడును, లక్ష్మణ నిహిత ధన్వా = లక్ష్మణుని చేతికి ఇచ్చిన ధనుస్సు కలవాడును. విభీషణ భుజావలంబీ = విభీషణుని భుజమునాసరాగొన్నవాడును; విజయశ్రియా = జయలక్ష్మితో. కిమపి = వాక్కులకు అందని ఏదో. ప్రదీప్తరమణీయః = కాంతితో అందముగానున్నవాడును అయిన, రామభద్రః = రాముడు – అదిగో పశ్య పశ్య = చూడు చూడు. అయమ్ = ఈ రాముడు. సంప్రతి = ఇప్పుడు –

పౌలస్త్యన్యస్తశక్తి వ్రణకిణకణికాలక్ష్మణో లక్ష్మణోరః
పీఠాన్నిర్ముక్తలజ్జో విబుధపురవధూక్లృప్త పుష్పాభిషేకః ।
సద్యో నప్తారమన్యం రజనిచరపురీభద్రపీఠ ప్రతిష్ఠం
దృష్ట్వా తుష్యత్పులస్త్యో జగతి విజయతే జానకీజానిరేకః ॥ 84

---

పౌలస్త్యేతి :- పౌలస్త్య = రావణునిచేత, న్యస్త = ప్రయోగింపబడిన శక్తి = శక్తి అను ఆయుధముచేతనైన, వ్రణ = గాయముచే నేర్పడిన. కిణకణికా = చారికయే - గాయము మానిన చారిక, లక్ష్మణః = చిహ్నముగా కల్గిన. లక్ష్మణోరః పీఠాత్ = లక్ష్మణుని వక్షఃప్రదేశమునుండి, నిర్ముక్త లజ్జః = తొలగింపబడిన సిగ్గు కలవాడును. విబుధపురవధూ = దేవకాంతలచే, క్లృప్త = సమర్పింపబడిన, పుష్పాభిషేకః = పుష్పాభిషేకము కలవాడును. సద్యః = వెనువెంటనే, అన్యమ్ = మరియొక, నప్తారమ్ = మనుమడు విభీషణుని. రజనిచరపురీ = లంకాపట్టణముయొక్క, భద్ర పీఠ = సింహాసనమునందు [నృపాసనం యత్తత్ భద్రాసనమ్ - అమరః] ప్రతిష్ఠమ్= పట్టాభిషిక్తునిగా. దృష్ట్వా = తిలకించి. తుష్యత్ = ఆనందించుచున్న. పులస్త్యః = పులస్త్య బ్రహ్మకలవాడును అయిన, జానకీజానిః = సీతాపతియగు రాముడు, ఏకః= అద్వితీయుడై, జగతి = ప్రపంచమునందు. విజయతే = విరాజిల్లుచున్నాడు.

తాత్పర్యము :- రావణుడు ప్రయోగించిన శక్తి ఆయుధముచే నేర్పడిన గాయపు మచ్చయే చిహ్నముగా గల్గిన లక్ష్మణుని వక్షఃస్థలమునుండి తొలగింపబడిన లజ్జకలవాడును - రావణ సంహారముతో ఆ అవమానము తొలగిపోయిదనుట. దేవకాంతలచే పుష్పవృష్టిలో ముంచెత్తబడినవాడును. విభీషణ పట్టాభిషేకముతో పులస్త్యబ్రహ్మను ఆనందింపజేసినవాడునుఅగు శ్రీరాముడు అద్వితీయుడై విరాజిల్లు చున్నాడు. [స్రగ్ధరావృత్తము]

సమాసములు :- పౌలస్త్యేన న్యస్తా చ సా శక్తిశ్చ - శక్త్యా వ్రణః వ్రణస్య కిణకణికా - కణికా ఏవ లక్ష్మ యస్య సః - తస్మాత్. లక్ష్మణస్య ఉరః పీఠాత్. నిర్ముక్తా లజ్జా యస్య సః. విబుధపురవధూభిః క్లృప్తః పుష్పాభిషేకః యస్య సః రజనిచరాణాం పురీ - పుర్యాః భద్రపీఠః - పీఠే ప్రతిష్ఠః - తమ్. తుష్యన్ పులస్త్యః యస్య సః. జానకీ జాయా యస్య సః

(ఇతి నిష్క్రాంతౌ)

-: ఇతి దశగ్రీవనిగ్రహో నామ షష్ఠోఽఙ్కః :-

---

సంధులు :- లక్ష్మణః + లక్ష్మణ. లజ్జః + విబుధ. పులస్త్యః + జగతి- ఉత్వాదేశ విసర్గ. లక్ష్మణ + ఉరః - గుణసంధి. పితాత్ + నిర్యుక్త - అనునాసికా దేశ. పుష్ప + అభిషేక - సవర్ణదీర్ఘ. జానకి జానిః + విః - రేఫాదేశ విసర్గ.

క్రియ :- జి జయే [వి పూర్వకాదాత్మనే] లట్. ప్రథమ.

విజయతే - విజయేతే - విజయన్తే

[ఇతి = అని, నిష్క్రాంతౌ = ఇరువురు నిష్క్రమింతురు]

-: ఇది రావణ వధ అను ఆరవ అంకము :-

# అనర్ఘరాఘవమ్

## సప్తమోఽఙ్కః

( నేపథ్యే )

తమిస్రామూర్ఛాల త్రిజగదగదంకారకిరణే
రఘూణాం గోత్రస్య ప్రసవితరి దేవే సవితరి ।
పురఃస్థే దిక్పాలైః సహ పరగృహావాసవచనాత్
ప్రవిష్టా వైదేహీ దహనమథ శుద్ధా చ నిరగాత్ ॥ 1

---

(నేపథ్యే = తెరలో)

తమిస్రేతి :- తమిస్రా = రాత్రివేళ. మూర్ఛాల = మూర్ఛిల్లిన - నిద్రించిన, త్రిజగత్ = ముల్లోకములకును. అగదంకార = మూర్ఛను పోగొట్టు వైద్యులవంటి, కిరణే = వెలుగులు కలవాడును. - నిశ్చేష్టమైన జగత్తును తన కిరణములతో మేల్కొలిపి చైతన్యపరచువాడనుట. రఘూణాం = రాఘవులయొక్క. గోత్రస్య = వంశమునకు. ప్రసవితరి = ప్రవర్తకుడును. దేవే = భగవంతుడైన. సవితరి = సూర్యుడు. దిక్పాలైః సహ = అష్టదిక్పాలకులతోను. పురఃస్థే = సాక్షిగా అగ్రభాగమున నిలిచియుండగా, వైదేహీ = సీతాదేవి: పరగృహవాసవచనాత్ = పరగృహవాసమను మాటపడుట వలన [అది నిందగా ఆరోపింపబడుటచే]. దహనమ్ = అగ్నిని, ప్రవిష్టా = ప్రవేశించినది. అథ = అంతట. శుద్ధా = అగ్నిచే పవిత్రమై. నిరగాత్ చ = వెలువడినదియును. [శిఖరిణి]

తాత్పర్యము :- చీకటియందు మూర్ఛపోయిన ముల్లోకములను మేలుకొల్పు వైద్యుడై రఘువంశ మూలపురుషుడైన సూర్యభగవానుడు అష్టదిక్పాలకులతో సాక్షిగా నిలిచియుండగా సీతాదేవి లంకానివాసమువలననైన నిందను తొలగించుకొనుటకు అగ్నిలో ప్రవేశించినది. పరిపూతయై వెలువడినది.

అయమపి :-

ఏకైకాని శిరాంసి రాక్షసచమూచక్రస్య హుత్వా౽ధునా స్వే
తేజోఽగ్నౌ దశకంఠమూర్ధభిరథ నిర్మాయ పూర్ణాహుతిమ్
అద్య స్వస్త్యయనం సమాప్య జగతో లంకేంద్రబందీకృతాం
సీతామప్యవలోక్య శోకరభసవ్రీడాజడో రాఘవః ॥ 2

---

సమాసములు :- తమిస్రా ఏవ సూర్యాః — తమిస్రాసూర్యాః - తమిస్రాసూర్యాలం చ తత్ జగత్ - జగతః [illegible] - తస్మిన్ దిశః పాలః - తైః. పరిగృహీతాః అవాసాః — పరిగృహీతావాసాః [illegible] - తస్మాత్.

క్రియ :- ఇణ్ గతౌ. లుఙ్. పరస్మై. ప్రథమ. [ఇణో గా లుఙి]

అగాత్ - అగాతామ్ - అగుః

ఏకేతి :- అయమపి = ఈ రాఘవుడును — రాక్షసచమూచక్రస్య=రాక్షససైన్యముయొక్క. శిరాంసి = శిరస్సులను. ఏకైకాని = ఒక్కొక్కటిగా, తేజోఽగ్నౌ = తన ప్రతాపానలమునందు. హుత్వా = హోమముచేసి. అథ = అటుపిమ్మట, దశకంఠ మూర్ధభిః = రావణ శిరస్సులతో. పూర్ణాహుతిమ్ = పూర్ణాహుతిని నిర్మాయ = చేసి. అద్య = ఇప్పుడే. జగతః = ప్రపంచమునకు. స్వస్త్యయనమ్ = మంగళకృత్యమును [స్వస్తివాచనము]. సమాప్య = నిర్వహించి. రాఘవః = శ్రీ రాముడు, లంకేంద్రబందీకృతామ్ = రావణాపహృతయైన సీతామ్ = జానకిని, అవలోక్యఅపి = చూచి. శోక = దుఃఖముతో. రభస = తొందరపాటుతో. వ్రీడా = సిగుతో. జడః = నిశ్చేష్టుడయ్యెను. [శార్దూలము]

తాత్పర్యము :- శ్రీరాముడు తన ప్రతాపాగ్నిని రాక్షస శిరస్సులను ఒక్కొక్కటిగా ఆహుతిచేసి, రావణ శిరస్సులతో పూర్ణాహుతి చేసి, ముల్లోకములకు స్వస్తివాచనము నిర్వహించి ఇప్పుడు సీతాదేవిని చూచి దుఃఖానంద లజ్జా భావములతో నిశ్చేష్టుడయ్యెను. రాక్షసచమూవధతో దుఃఖము, సీతాలాభముతో రభసము, అగ్ని పరీక్షతో సిగ్గు - కలిగినవనుట.

సమాసములు :- రాక్షసానాం చమూః - చమ్వాః చక్రమ్ - తస్య. తేజః ఏవ అగ్నిః - తస్మిన్. దశకంఠస్య మూర్ధభిః. లంకాయాః ఇంద్రః - లంకేంద్రేణ బందీకృతా - తామ్. శోకశ్చ రభసశ్చ వ్రీడాచ — వ్రీడాభిః జడః.

క్రమేణ చ :-

సహైవసుగ్రీవ విభీషణాభ్యాం సౌమిత్రిసీతాపరిపూర్ణపార్శ్వః ।
ఉపైతి వైవస్వతవంశవృత్తమేధ్యామయోధ్యామథ పుష్పకేణ ॥ 3

---

సంధులు :- ఏతి + ఏతాని – వృద్ధి. తేజః + అగ్ని – ఉత్వాదేశవిసర్గ. తేజో + అగ్ని – పూర్వరూపం. మూర్ధ్నః + అథ – రేఫాదేశవిసర్గ. అధః + నిర్మాయ జగతః + లంకా, జనః + రాఘవః – ఉత్వాదేశ విసర్గ. పూర్ణ + ఆహూతిమ్ - సవర్ణదీర్ఘ. స్వస్తి + అయనమ్ – యణాదేశ. లంకా + ఇంద్ర – గుణసంధి.

సహేతి :- క్రమేణ చ = క్రమముగా – సౌమిత్రి సీతా పరిపూర్ణ-పార్శ్వః = లక్ష్మణునితో సీతతో కూడిన ఉభయ పార్శ్వములు కలవాడైన రాముడు రామునికిరుపైపుల లక్ష్మణుడును సీతయునుండిరనుట; సుగ్రీవ విభీషణాభ్యామ్ సహైవ = సుగ్రీవ విభీషణులతో కలిసియే, పుష్పకేణ = పుష్పక విమానముతో. వైవస్వతవంశవృత్త మేధ్యామ్ – వైవస్వతవంశ = సూర్యవంశముయొక్క, వృత్త = చరిత్రతో. మేధ్యామ్ = పవిత్రమైనదగు, అయోధ్యామ్ = అయోధ్యా పట్టణమును, ఉపైతి = చేరుకొనుచున్నాడు. (ఉపజాతి వృత్తము).

తాత్పర్యము -: లక్ష్మణుడును సీతయు నిరుపైపులనుండగా సుగ్రీవ విభీషణులతో కలిసి పుష్పకముపై రాముడు సూర్యవంశజుల చరిత్రతో పావనమైన అయోధ్యా పట్టణమును సమీపించుచున్నాడు. ఏతైతాని, సహైవ అనునీ రెండు శ్లోకములందును ఒకటే కర్త. దీనిని యుగ్మకమందురు. (ఉక్తం ద్వాభిః శ్లోకైః సాకాంక్షైరేక వాక్యతా శ్లోకాభ్యాం యుగ్మకం జ్ఞేయమేకార్థాభ్యాం తు యుగ్మకమ్)

సమాసములు :- సుగ్రీవశ్చ విభీషణశ్చ - తాభ్యామ్. సౌమిత్రిసీతాభ్యాం పరిపూర్ణౌ పార్శ్వౌ యస్య సః. వైవస్వతస్య వంశమ్ - వంశస్య వృత్తమ్ – వృత్తేన మేధ్యా – తామ్.

క్రియ :- ఇణ్ గతౌ. పరస్మై. లట్. ప్రథమ. ఏతి – ఇతః - యన్తి. (తతః = అంతట. విమానయానేన = విమాన ప్రయాణముతో. విజయాభిరామః = విజయాభిరాముడైన, రామః = రాముడు, ప్రవిశతి = ప్రవేశించును. సీతాలక్ష్మణౌ = సీతాలక్ష్మణులు, సుగ్రీవ విభీషణౌ చ = సుగ్రీవ విభీషణులును – (ప్రవేశింతురనుట)

(తతః ప్రవిశతి విమానయానేన విజయాభిరామో రామః సీతా లక్ష్మణౌ సుగ్రీవ విభీషణౌ చ)

సుగ్రీవః :- (రామంప్రతి) దేవ,

కింకుర్వాణపయోధిసేవిత గృహోద్యానాధునాలోక్యతాం
లంకేయం రఘువంశవిక్రమ కథాబీజప్రరోహస్థలీ ॥ 3

---

కిమితి -: (రామంప్రతి = రామునుద్దేశించి) దేవ = మహారాజా ! కింకుర్వాణ = సేవకుడైన. పయోధి = సముద్రునిచేత. సేవిత = పరిపోషింపబడిన. గృహోద్యానా = గృహోపవనములు కలిగిన. ఇయమ్ = ఈ. లంకా = లంకా పట్టణము అధునా = ప్రస్తుతము. రఘువంశ = రాఘవులయొక్క. విక్రమకథా = పరాక్రమ గాధకు సంబంధించిన బీజ = విత్తనములకు. ప్రరోహస్థలీ = ఉత్పత్తి క్షేత్రము. దేవేన = రామునిచే. ఆలోక్యతామ్ = దర్శింపబడుగాక ! అత్ర = ఈ ప్రదేశమునందు. దేవేన = రామునిచేత ఛిన్నైః = ఖండింపబడినవైన. దశాననస్య = రావణునియొక్క. దశభిః శిరోభిః = పది తలలచే. క్రమాత్ = వరుసగా. ఏకైకేన = ఒక్కొక్కదానితో. శతమఖస్య = ఇంద్రునియొక్క దృష్టయః = నేత్రములు. శతమ్ శతమ్ = నూరు నూరుచొప్పున. ఆమోదితాః = ఆనందింపచేయబడినవి. [శార్దూలము]

తాత్పర్యము :- సముద్రుడే సేవకుడుగా ఈ లంకా పట్టణమునందలి ఉద్యానవనములను పెంపొందించెను. రాఘవ పరాక్రమ బీజములకిది నేడు ప్రరోహస్థలము. రావణుని పదితలలను రాముడు ఖండించువేళ ఒక్కొక్క తలకు నూరు నూరు చొప్పున ఇంద్రుని వేయి కన్నులును ఆనందముతో విప్పారినవి.

సమాసములు :- కింకుర్వాణశ్చాసౌ పయోధిశ్చ - పయోధినా సేవితాని గృహోద్యానాని యస్యాం సా. రఘువంశస్య విక్రమః - విక్రమస్య కథా - కథాయాః బీజమ్ - బీజస్య ప్రరోహస్థలీ.

సంధులు -: గృహ + ఉద్యానా. లంకా + ఇయమ్ - గుణసంధులు. ఉద్యానా + అధునా + ఆలోక్యతామ్. దేవేన + అత్ర. దశ + ఆననస్య. శతమఖస్య + ఆమోదితా - సవర్ణదీర్ఘ. దశభిః + ఛిన్నైః - శాదేశ విసర్గ. ఏక + ఏకేన - వృద్ధి. ఆమోదితాః + దృష్టయః - విసర్గలోప.

దేవేనాత్ర దశాననస్య విశిఖైశ్ఛిన్నైః శిరోభిఃక్రమా
ద్వైకైకేన శతం శతం శతముఖస్యామోదితో దృష్టయః ॥ 4

రా॥ సు॥ :- దేవి వైదేహి, దృశ్యతామితో లంకాం పూర్వేణ సువేలం పశ్చిమేన
త్వదర్థీయ క్రవ్యాత్కపికులకబంధవ్యతికరైః
కరాళేయం భూమిర్భువనభియమద్యాపితనుతే।

---

క్రియ :- లోకృఙ్ దర్శనే [కర్మణి] ఆత్మనే, లోట్, ప్రథమ [అఙ్]
ఆలోక్యతామ్ - ఆలోక్యేతామ్ - ఆలోక్యన్తామ్

దేవీతి :- దేవి = దేవీ! వైదేహి = జానకీ! ఇతః = ఇటు, లంకామ్ = లంకా పట్టణమునకు. పూర్వేణ = తూర్పున. సువేలమ్ = సువేలగిరికి పశ్చిమేన = పడమరగా, దృశ్యతామ్ = చూడబడుగాక! - ఇటు చూడుమనుట. (ఏనబన్యతరస్యామదూరేఽపంచమ్యాః - పూర్వేణ పశ్చిమేన — ఏనప్. ఏనపా ద్వితీయా- లంకామ్, సువేలమ్ )

త్వదితి :- త్వదర్థీయ = నీవు ప్రయోజనముగా కలవారైన రావణ దాశరథులకు సంబంధించిన, క్రవ్యాత్ (కుల) = రాక్షస సమూహము యొక్కయు, కపి కుల = వానరులయొక్కయు, కబంధ = మొండెములు, వ్యతికరైః = గుంపులతో. కరాళా = భయంకరమైన, ఇయమ్ = ఈ, భూమిః = రణరంగము, అద్యాపి=ఇప్పుడును, భువన = లోకములకు, భయమ్ = భీతిని, తనుతే = కల్గించుచున్నది. ఇహ = ఈ ప్రదేశమునందే, రుధిరమయ్యః = సైనికుల రక్తములతోనైన, అంభోధేః యువతయః = నదులు (సముద్రునికి నదులు భార్యలనుట). సహస్రమ్ = అనేకము, అభూవన్ = ఏర్పడినవి. త్రిదివయువతీనామ్ = అప్సరసలకు, పతయః = భర్తలు. సాహస్రాః = అనేకులు లేదా వేయిమంది కొక్కడుగానున్న కపినాయకులు, అభూవన్ = అయ్యిరి.

తాత్పర్యము :- సీతా! ఇది రణరంగము. నీకై జరిగిన యుద్ధమున మడిసిన కపిరాక్షసవీరుల కళేబరములతో ఇది ఇప్పటికిని భయంకరముగా నున్నది. ఇక్కడ నెత్తురుటేర్లు వేనవేలు పొంగిపొర్లినవి. అప్సరసలకు వేనవేలు భర్తలు లభిం

అభూపన్నంభోధేరిహ రుధిరమయ్యో యువతయః
సహస్రం సాహస్రాస్త్రిదివయువతీనాం చ పతయః ॥ 5

అపిచ —

ఉద్యమ్య దృష్ట నిజపన్నగరత్నమాత్రా
నస్త్రాణి చందనతరూనుపరి భ్రమన్తః।

---

చిరి. (పోరుచు మడిసిన పోటుమగలు అప్సరసలను పెండ్లియాడిరి విశ్వాసము). శిఖరిణీ వృత్తము. (బలినోయే సహస్రేణ సాహస్రాస్త్రి సహస్రిణః — అని భావము).

సమాసములు :- త్వమ్ ప్రయోజనమ్ (అస్యామ్) యస్య — తయోః. క్రవ్యాదశ్చ కపయశ్చ — క్రవ్యాత్కపీనాం కులమ్ — త్వద్గీయయోః (రావణ దాశరథ్యోః) క్రవ్యాత్కపికులమ్ — కులస్య కబంధాః — కబంధానాం వ్యతికరాః — తైః త్రిదివస్య యువతిః — తాసామ్.

సంధులు :- క్రవ్య + అత్, అద్య + అపి — సవర్ణదీర్ఘ. కరాలా + ఇయమ్ — గుణసంధి. భూమిః + భువన, అంభోధేః + ఇహ — రేఫాదేశవిసర్గ. రుధిరమయ్యః + యువతయః — ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- తనుఞ్ విస్తారే. లట్. ఆత్మనే. ప్రథమ.
తనుతే - తన్వాతే - తన్వతే

ఉద్యమ్యేతి :- అపిచ = మరియు - కపయః = వానరవీరులు. ఉద్యమ్య = విజృంభించి (ప్రయత్నించి). దృష్ట = ప్రకాశించుచున్న. నిజ = తమయొక్క, పన్నగ = సర్పముల పడగలకు చెందిన, రత్నమాత్రాన్ = రత్నకాంతులు మాత్రమే కల్గినవగు — చెట్లకు చుట్టుకొన్న పాముల శిరోమణులు చీకటిలో మిణుకు మిణుకు మనుచున్నవనుట. చందనతరూన్ = గంధపు చెట్లను, అస్త్రాణి = అపేమైన తమ ఆయుధములను, భ్రమన్తః = పెకలించి గిరగిర త్రిప్పుచున్నవారై. మేఘనాద = ఇంద్రజిత్తునియొక్క, మాయా = మాయచే కల్పింపబడిన, తమః = చీకటితో, అపలపితామ్ = కప్పివేయబడిన, ద్యామ్ = ఆకాశమును, జ్యోతిరింగణమయీమ్ = మిణుగురులతో నిండినదానినిగా, ఇహ = ఈ రణరంగమునందు, విశేషః = చేయుచున్నారు. (వసంతతిలకము)

ద్యాం జ్యోతిరింగణమయీమిహ మేఘనాద
మాయాతమోఽపలపితాం కపయో వితేనుః ॥ 6

సీతా :- ఆర్యపుత్ర! అపి ఇహైవ భుజంగపాశ బంధనం సీతయానుభావితాః యూయమ్. (అజ్జఉత్త. అవిఇఘ జ్జేవ భుఅంగపాసబన్ధనం సీదాఏ అణుహావిదా తుమ్హే)

రామః :- అం మైథిలి. అమ్.

---

తాత్పర్యము :- ఇంద్రజిత్తు తన మాయతో రణరంగమున చీకటులు నింపెను. తమకు చుట్టుకొనియున్న సర్పముల మణులు మిణుకుమిణు మనుటతో చెట్లు మాత్రము గుర్తింపబడుచున్నవి. కపివీరులు తమకు ఆయుధములైన ఆ చెట్లను పెల్లగించి ఆకాశమున త్రిప్పుచు పిడుగులు ముసురుకొన్న వినువీధిలో మిణుగురులను నింపుచున్నారు.

సమాసములు :- నిజాశ్చ తే పన్నగాశ్చ — నిజపన్నగానాం రత్నమాత్రాణి . గృష్టాని నిజపన్నగ రత్నమాత్రాణి యేషు తే — తాన్ తరూన్. మాయా కల్పితం తమః — మేఘనాదస్య మాయాతమః — తమసా అపలపితామ్.

సంధులు :- తమః + అపలపితామ్ - ఉత్వాదేశ విసర్గ — తమో + అపలపితామ్ — పూర్వరూపం. కపయః + వితేనుః - ఉత్వాదేశ విసర్గ సంధి.

క్రియ :- తనుఞ్ విస్తారే, లిట్ పరస్మై. ప్రథమ (వి)
తతాన — తేనతుః — తేనుః

ఆర్యపుత్రేతి :- ఆర్యపుత్ర = నాథా ! (ఆర్యపుత్రేతి సంబోధ్యః పతిః పత్న్యా అనేన తు - భరతః). ఇహ ఏవ = ఇచ్చటనేనా, యూయమ్=మీరు, సీతయాః= ఈ సీతయను కారణముతో, భుజంగపాశ బంధనమ్ = నాగపాశ బంధనమును, అపి అనుభావితాః = అనుభవించిరి ? (అపిః ప్రశ్నే సంభావనాయాం వా).

చర్వితేతి :- అమ్ = అవును, మైథిలి = సీతా ! అమ్ = అవును. (అం జ్ఞాతేఽథవా స్వీకారే - భరతః) ఇహ = ఇచ్చటనే. సః = ఆ సుప్రసిద్ధుడగు, విహగేంద్రః = గరుత్మంతుడు, చర్వితపీనాహిగణః — చర్విత = భక్షించిన, పీన + అహిగణః = బలిష్ఠ సర్పసమూహము కలవాడై, అభీక్ష్ణమ్ = మాటిమాటికిని (ప్రతి సర్ప

చర్వితపీనాహిగణష్ఠటితి వినిష్ఠ్యూతఫణిమణిర్దీప్తమ్ ।
ఘనబంధనవైధుర్యం వ్యధునోదివ స ఏష విహగేంద్రః ॥ 7

(విమృశ్య సస్మితమ్) అహో వైషమ్యమస్యా జాతేః

ద్వే తావత్కరణే రసాన్రసయితుం శబ్దాంశ్చ రూపాణి చ
శ్రోతుం ద్రష్టుమథైకమింద్రియమురోగస్యైక నిగూఢం పదమ్ ।

---

భక్షణమునందును). ఠటిత్ ఇతి = ఠట్ అను శబ్దమువచ్చునట్లుగా. వినిష్ఠ్యూత = ఉమిసిన. ఫణిమణిః = నాగమణులవాడునై. సః = మాయొక్క. ఘనబంధనవైధుర్యమ్ = సర్పపాశవిహ్వలత్వమును. వ్యధునోత్ = తొలగించెను. (ఆర్య)

తాత్పర్యము :- గరుత్మంతుడేతెంచి, మాకు చుట్టుకొన్న సర్పములను భక్షించి కొరుకుచున్నవని నాగమణులను ఠటఠటమని ఉమియుచు మమ్ము బంధవిముక్తులను చేసెను.

సమాసములు -: అహీనాం గణః - పీనశ్చాసావహిగణః - చర్వితః పీనాహి గణః యేన సః. వినిష్ఠ్యూతాః ఫణీనాంమణయః యేన సః. ఘనం చ తద్బంధనం చ - ఘనబంధనస్య వైధుర్యమ్. విహగానామ్ ఇంద్రః.

సంధులు :- గణః + ఠటితి — షాదేశవిసర్గ. మణిః + ఉద్గీర్ణమ్ - రేఫాదేశవిసర్గ. సః + విహగ — ఏతదేతద్విసర్గలోప. విహగ + ఇంద్రః — గుణసంధి.

క్రియ :- ధుఞ్ కంపనే. లఙ్. పరస్మై. ప్రథమ (ఏ)

అధునోత్ — అధునుతామ్ — అధున్వన్

అహో ఇతి :- (విమృశ్య = ఆలోచించి సస్మితమ్ = చిరునవ్వుతో) అహో ! అస్యాః = ఈ. జాతేః = సర్పజాతియొక్క. వైషమ్యమ్ = విషమత్వము ! ఎంత వింతయనుట.

ద్వే ఇతి :- రసాన్ = రుచులను, రసయితుమ్ = ఆస్వాదించుటకు, ద్వే కరణే తావత్ = రెండు అవయవములు (సాధనములు) ఉన్నవి. శబ్దాన్ = శబ్దములను, శ్రోతుమ్ = వినుటకు. చ = మరియు, రూపాణి = రూపములను, ద్రష్టుమ్ = చూచుటకు, అథ = ఇంతకును, ఏకమ్ ఇంద్రియమ్ = ఒకే అవయవము. ఉరోగస్య = పొట్టతో ప్రాకుటకై, నిగూఢమ్ = రహస్యముగానున్న. పదమ్ = పాదము(లు): అన్యేషు =

అన్యేష్వప్యశనేషు సత్సు జగతః ప్రాణాః స్వదంతేతరామ్
మాతః కద్రు యది ప్రసౌతి భవతీ భూయః సుతానీదృశాన్ ॥ 8

(సర్వే హసన్తి)

సీతా :- (సస్నేహస్మితం లక్ష్మణమవలోక్య రామంప్రతి) ఆర్యపుత్ర. సౌమిత్రికీర్తికందల్యా ఉత్పత్తిక్షేత్రం కతరః పునః సన్నివేశః. (అజ్జఉత్త. సోమిత్తికిత్తికందలీఏ ఉప్పత్తిఖేత్తం కదరో ఉణ సంణివేసో).

---

ఇతరములైన, అశనేషు = ఆహారపదార్థములు, సత్సు అపి = ఉన్నప్పటికిని, జగతః ప్రాణాః = ప్రపంచమునకు ప్రాణములైన వాయువులు, స్వదన్తేతరామ్ = మిక్కిలి ఇష్టములు. మాతః = తల్లీ ! కద్రు = ఓ నాగమాతా ! భవతీ = నీవు, ఈదృశాన్ = ఇటువంటి, సుతాన్ = తనయులను, భూయః=మరల, యది ప్రసౌతి=ప్రసవింతువా ! (శార్దూలము).

తాత్పర్యము :- రుచులు చూచుటకు నాగజాతికి రెండు నాలుకలు. శబ్దములను వినుటకు రూపములను చూచుటకు ఒకే అవయవము, పొట్టతో ప్రాకుటకు పనిపించని పాదములు. లోకమున ఎన్నో ఆహారపదార్థములున్నను నాగజాతికి వాయువులే - జగత్ప్రాణములు-ఆహారము. తల్లీ ! కద్రూ ! ఇంకను ఇటువంటి సంతానమును ప్రసవింతువా ! పద్దతల్లీ యనుట.

క్రియ :- షుప్రసవైశ్వర్యయోః (లుక్) లట్. పరస్మై. ప్రథమ (ప్ర)
సౌతి — సుతః — సువన్తి

(సర్వే = అందరును, హసన్తి = నవ్వుదురు)

ఆర్యపుత్రేతి :- (సస్నేహస్మితమ్ = మైత్రీపూర్వకమైన నవ్వుతో, లక్ష్మణమ్ అవలోక్య = సౌమిత్రిని చూచి. రామమ్ ప్రతి = రామునుద్దేశించి) ఆర్యపుత్ర = నాథా ! సౌమిత్రికీర్తికందల్యాః = లక్ష్మణుని యశోఽంకురమునకు, ఉత్పత్తిక్షేత్రమ్ = ప్రాదుర్భావ స్థలమైన, సన్నివేశః = సన్నివేశము, కతరః పునః=ఇంతకు నేది ! - లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించిన స్థలమేదియనుట.

రామః :- (సహర్షరోమాంచమ్) దేవి మైథిలి, అయమితో హస్తదక్షిణేన దశరథదశకంధరస్కంధావారైకవీరయోర్లక్ష్మణమేఘనాదయోః ద్వంద్వయుద్ధవ్యతికరసాక్షీ సువేలపాదః.

సీతా :- యత్రైవ (జహిం జేవ్వ)

అనురాగరోమకంటకస్వేదజలైర్నిశాచరీ కాపి ।
ఉద్దీపిత నిర్వాపితదయితచితానలమను ప్రియతే ॥
[అణురాఅ రోమకంటఅ సేఅజలేహిం ణిసాఅరీ కావి ।
ఉద్దీవిఅణివ్వావిఅదఇద చిదాణలమను మరేది ॥] 9

---

దేవీతి :- (సహర్షరోమాంచమ్=ఆనందపులకితత్వముతో) దేవి మైథిలి= ఓ దేవీ ! జానకీ, అయమ్ = ఇదే, ఇతః = ఇటు. హస్తదక్షిణేన = కుడిచేతివైపుగా నున్న. సువేలపాదః = సువేల పర్వతపు ప్రత్యంతస్థలము. దశరథదశకంధర=దశరథ రావణులకు చెందిన. స్కంధావార = సైన్యములయందు. ఏకవీరయోః = అద్వితీయ వీరులైన, లక్ష్మణ మేఘనాదయోః = సౌమిత్రి ఇంద్రజిత్తులయొక్క. ద్వంద్వయుద్ధ వ్యతికరసాక్షీ = ద్వంద్వయుద్ధమునకు సాక్షి.

అనురాగేతి :- యత్రైవ = అయా ప్రదేశమునందు - అనురాగ = ప్రేమతో నేర్పడిన, రోమకంటక = పులకాంకురములు. స్వేదజలైః = ఘర్మ సలిలములతో. కాపి = ఒకానొక, నిశాచరీ = రాక్షసాంగన (సులోచన - ఇంద్రజిత్తు భార్య). ఉద్దీపిత = (పులకాంకురములతో) ప్రజ్వరిల్లినదియు, నిర్వాపిత = (స్వేద జలముతో) చల్లారినదియునైన, దయిత చితానలమ్=భర్తృచితాగ్నిని. అనుమ్రియతే= ప్రవేశించి మరణించుచున్నది - సహగమనము చేయుచున్నదనుట. (ఆర్య)

తాత్పర్యము :- నాథా ! నీవు చూపుచున్న ఈ ప్రదేశమునందు ఒకా నొక రాక్షస భామిని తన భర్తృచితాగ్నిలో ప్రవేశించుచున్నది. అనురాగముచేనైన పులకలతో అగ్ని ప్రజ్వరిల్లుట ఆమె స్వేద జలములతో చల్లారుటయు నిప్పుడుచున్నవి.

సమాసములు -: రోమకంటకాశ్చ స్వేదజలాని చ - అనురాగాత్ రోమ కంటక స్వేదజలాని - తైః. దయితస్య చితానలః - ఉద్దీపితశ్చాసౌ నిర్వాపితశ్చ - ఉద్దీపిత నిర్వాపితశ్చ అసౌ దయితచితానలశ్చ - తమ్.

రామః :- అం జానకి. అమ్. ఇదమేవ తల్లక్ష్మణవీరలక్ష్మీస్వయంవర
కౌతుకాగారమ్. ఇహ హి —

ఆనీతద్రోణశైలేన సౌమిత్రేః శల్యహారిణా ।
అక్రియన్త జగన్త్యేవ నిఃశల్యాని హనూమతా ॥ 10

సీతా :- (స్మృతిమభినీయ సానురాగమ్) అర్యపుత్ర. కిష్కింధేశ్వర
స్కంధావారధురంధరో రఘుకులకుటుంబవిధురబంధుః స కుత్ర
హనూమాన్. (అజ్జఉత్త. కిక్కింధేసరకంధావారధురంధరో రహు

---

క్రియ :- మృఙ్ ప్రాణత్యాగే. ఆత్మనే. లట్. ప్రథమ
మ్రియతే — మ్రియేతే — మ్రియన్తే (మ్రియతేర్లుజ్లిఙోశ్చ)

అమితి :— అమ్ = అవును. జానకీ । అమ్ = అవును. ఇదమ్ ఏవ =
ఇదే. తత్ = ఆ. లక్ష్మణ = మన సౌమిత్రియొక్క, వీరలక్ష్మీ స్వయంవర = వీర
లక్ష్మీ స్వయంవరము జరిగిన. కౌతుకాగారమ్ = వివాహవేదిక - ఇచ్చటనే సౌమిత్రిని
వీరలక్ష్మి వరించినదనుట. ఇహ హి = ఇచ్చటే సుమా —

ఆనీతేతి :— ఆనీత = తేబడిన. ద్రోణశైలేన = సంజీవపర్వతముగల
వాడును. సౌమిత్రేః = లక్ష్మణునియొక్క. శల్యహారిణా = శల్యములు తొలగించిన
వాడునైన. హనూమతా = ఆంజనేయునిచేత. జగన్తిఏవ = జగములే. నిఃశల్యాని =
శల్యము తొలగింపబడినవిగా, అక్రియన్త = చేయబడినవి. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- సంజీవ పర్వతమును తెచ్చి లక్ష్మణుని శల్యములను
హనుమంతుడు తొలగించినది ఇచ్చటనే సుమా । అపుడు ముల్లోకములు ఆనందించినవి

సమాసములు :- ఆనీతః ద్రోణశైలః యేన సః - తేన. శల్యం.
హరతి - తేన.

క్రియ —: డుకృఞ్ కరణే (కర్మణి), ఆత్మనే. లఙ్. ప్రథమ
అక్రియత - అక్రియేతామ్ — అక్రియన్త

అర్యపుత్రేతి :— (స్మృతిమ్ అభినీయ = స్మృతిని అభినయించి, సాను
రాగమ్ = ప్రేమతో) అర్యపుత్రా । కిష్కింధేశ్వర = సుగ్రీవునియొక్క. స్కంధా
వార = సైన్యమునందు, ధురంధరః = అగ్రగణ్యుడును, రఘుకుల కుటుంబ =

లక్ష్మీర్యదస్య హి యాదః కృష్ణోరఃస్థాఽపి సుభటభుజవసతిః ।
ఇందురస్య చ మృడచూడామణిరపి జగతామలంకారః ॥ 12

(సవిమర్శం చ)

స్యాదేవ తోయమమృతప్రకృతిర్యది స్యా
న్నైకాంతమద్భుతమిదం పునరద్భుతం నః ।

---

లక్ష్మీరితి :- కృష్ణ = విష్ణుమూర్తియొక్క, ఉరఃస్థా అపి = వక్షఃస్థల వాసినియైనను, సుభట = మహావీరులయొక్క, భుజ = బాహువులే, వసతిః = ఆవాసముగాకలదైన, లక్ష్మీః = లక్ష్మీదేవియు; మృడ = శివునియొక్క, చూడామణిఃఅపి= శిరోఽలంకారమైనను, జగతామ్ = లోకములకు, అలంకారః = భూషణమైన, ఇందుః = చంద్రుడును; అస్య = ఈ సముద్రునియొక్క. యాదః = జల జంతువు. (ఆర్య)

తాత్పర్యము :- శ్రీకృష్ణుని వక్షఃపీఠమునలంకరించియు సైనిక వీరుల బాహువులందు నివసించు లక్ష్మీదేవి ఈ సముద్రసంభవయే. శివుని శిరస్సీమనలంకరించియు లోకములనాహ్లాదపరచు చంద్రుడునూ సముద్రమునుండియే జన్మించెను.

సంధులు -: లక్ష్మీః + అస్య. మణిః + అపి - రేఫాదేశ విసర్గ. కృష్ణ + ఉరః - గుణ. ఉరఃస్థా + అపి - సవర్ణదీర్ఘ.

స్యాదితి :- (సవిమర్శం చ = సాలోచనగా) తోయమ్ = జలము, అమృత ప్రకృతిః = అమృతముతో గుణ సామ్యము కలది, అమృత స్వభావము కలది లేదా అమృతోత్పత్తికి కారణభూతమైనది (ప్రకృతిర్గుణసామ్యే స్యాత్ స్వభావే కారణేఽపి చ - విశ్వః) యది స్యాత్ = అగునేని, స్యాదేవ = అగుగాక ; యుక్తమే. ఇదమ్ = ఇది, ఏకాంతమ్ = అత్యంతము, అద్భుతమ్ న = ఆశ్చర్యము కాదు. పునః = కానీ, లక్ష్మీ....ధన్వంతరి ప్రభృతయః = లక్ష్మీదేవి, తుషారకర= చంద్రుడు, కౌస్తుభ = కౌస్తుభమణి, పారిజాత = కల్పవృక్షము, ధన్వంతరి ప్రభృతయః = ఆయుర్వేద ప్రవర్తకుడైన ధన్వంతరి మొదలైనవి, అపామ్ = జలముల యొక్క, వివర్తఃయత్ = పరిణామమనుట, నః = మాకు, అద్భుతమ్ = ఆశ్చర్యము కల్గించుచున్నది. (వసంత తిలకము)

లక్ష్మీతుషారకర కౌస్తుభపారిజాత
ధన్వంతరిప్రభృతయో యదపాం విపర్తః ॥ 13

అపి చ దేవి.

ఆకంఠదృష్టశిరసాప్యవిభావ్యపృష్ఠ
పార్శ్వోదరేణ చిరమృగ్భిరుపాస్యమానః ।

---

తాత్పర్యము :— అమృతము జలప్రకృతికమనుటలో ఆశ్చర్యము లేదు. కాని లక్ష్మి చంద్రుడు కౌస్తుభము కల్పవృక్షము ధన్వంతరి మున్నగు వస్తుజాతమంతయు జల ప్రకృతికమే అగుట మాకు వింతగా నున్నది.

సంధులు :- ప్రకృతిః + యది — రేఫాదేశ విసర్గ. స్యాత్ + న - అనునాసికాదేశ. న + ఏకాంత — వృద్ధి. ప్రభృతయః + యత్ - ఉత్వాదేశ విసర్గ

క్రియ :- అసధువి. విధిలిఙ్. పరస్మై. ప్రథమ
స్యాత్ — స్యాతామ్ — స్యుః

ఆకంఠేతి :- దేవి = జానకీ ! అపిచ = మరియు - ఆకంఠ = కంఠ భాగము వఱకును, దృష్ట = కనబడుచున్న, శిరసా = శిరస్సు కలవాడును. అవిభావ్య = స్పష్టముగా కనిపించని, పృష్ఠపార్శ్వోదరేణ=వీపు. ప్రక్కలు. పొట్టయు కలవాడును- తలయొక్కటే కన్పించుచున్నది. తక్కిన శరీరము విష్ణుమూర్తికి కన్పించుటలేదనుట: నాభీసరోరుహజుషా = నాభి కమలము నధిష్ఠించినవాడునైన. విధినా సేన=బ్రహ్మచే. చిరమ్ = చాలాకాలముగా, ఋగ్భిః = వేదవాక్కులతో. ఉపాస్యమానః = స్తుతింపబడుచున్నవాడై , భగవాన్ = భగవంతుడగు. అరవిందనాభః = పద్మనాభుడు. అత్ర = ఈ సముద్రమునందు. శేతే కిల = శయనించునుగదా । (వసంతతిలకము)

తాత్పర్యము :- దేవీ ! శ్రీమన్నారాయణుడు ఈ సముద్రమున శయనించును. అతని నాభీసరోరుహమున చతుర్ముఖుడుండును. ఆ చతుర్ముఖుని శిరస్సు ఒక్కటే కంఠము వరకు మాత్రమే విష్ణుమూర్తికి కనిపించును. పృష్ఠభాగముగాని పార్శ్వభాగములుగాని ఉదరముగాని (పద్మదళములు అడ్డుగానుండుటచే) విష్ణునికి కనిపించవు ఆ చతుర్ముఖుడు ఋక్కులతో విష్ణుమూర్తిని చిరముగా ఉపాసించుచున్నాడు.

నాభీసరోరుహజుషా చతురాననేన
శేతే శిలాత్ర భగవానరవిందనాభః ॥ 14

(సీతా వందతే)

లక్ష్మణః :- యత్సత్యముత్సర్పిణీ ధర్మోత్తరాణాం సిద్ధిః
జరయతు జగత్కల్పోచ్ఛిత్తౌ పిపర్తు పయోధరాన్
వహతు బడబావక్త్రజ్యోతిర్దధాతు సుధాభుజః ।

---

సమాసములు -: అసమంతాత్కంఠః - ఆకంఠం దృష్టమ్ - ఆకంఠ దృష్టం శిరః యస్య సః - తేన. పృష్ఠంచ పార్శ్వౌచ ఉదరశ్చ - అవిభావ్యాః పృష్ఠ పార్శ్వోదరా యస్య సః - తేన. (ప్రాణ్యంగవాచక ద్వంద్వమగుటచే అవిభావ్యం పృష్ఠపార్శ్వోదరం యస్య - అనియేని) అరవిందం నాభౌయస్య. నాభ్యాస్సరోరుహమ్- నాభీసరోరుహమ్. చత్వారి ఆననాని యస్య - తేన.

క్రియ :- శీఙ్ స్వప్నే. ఆత్మనే లట్. ప్రథమ
శేతే - శయాతే - శేరతే

(సీతా = జానకీదేవి, వందతే = సముద్రునికి నమస్కరించును)

జరయత్విత్తి -: ధర్మోత్తరాణామ్ = ధర్మనిష్ఠ కలవారికి. సిద్ధిః = సిద్ధి - కర్మఫలము. ఉత్సర్పిణీ = వృద్ధినొందునదనుట. సత్యమ్ = నిజమే - అయమ్ = ఈ. అపామ్ నిధిః = జలనిధి. కల్పోచ్ఛిత్తౌ = సృష్ట్యవసానకాలమునందు (ప్రళయకాలమునందు). జగత్ = భువనమును. జరయతు = జీర్ణము చేయునుగాక । (జనయతు అని పాఠాంతరము. కల్పావసానమున పునస్సృష్టిని కల్గించుగాక అని యర్థము. నూతనసృష్టి నీటితో ప్రారంభమగునని విష్ణుపురాణము - అప ఏవ ససర్జాదౌ తాసు వీర్యమవాసృజత్): పయోధరాన్ = మేఘములను, పిపర్తు = నీటితో నింపునుగాక ।, బడబావక్త్రజ్యోతిః = బాడబాగ్నిని (అశ్వముఖమునుండు అగ్నియనుట). వహతు = వహించును గాక । సుధాభుజః = అమృతాంధసులగు దేవతలను. దధాతు = పోషించునుగాక ।. వపుషా = ఆకారముతో. యావాన్ తావాన్ భవతు=ఎంతటివాడో అంతటివాడు అగుగాక । - ఎంత

భవతు వపుషా యావాంస్తావానగస్త్యరుషా పున
ర్నిధిరయమపామీషత్పానస్తపాంసి నమోఽస్తు వః ॥ 15

రామః :- (సబహుమానమ్) వత్స, కిముచ్యతే —

---

పెద్ద ఆకారము కలవాడైనను అగుగాక, పునః = కాని, అగస్త్యరుషా = అగస్త్యుని కోపముతో, ఈషత్పానః = తేలికగా త్రాగదగినవాడయ్యెను. తపాంసి = ఓ తపస్సులారా, వః = మీకు, నమః అస్తు = నమస్కారము (హరిణి).

తాత్పర్యము :- సముద్రుడెంత గొప్పవాడైన నగుగాక। కల్పాంతమున సృష్టిని ముంచువాడు, మేఘములను నీటితో నించువాడు, బడబాగ్నిని వహించువాడు, దేవతలను పోషించువాడు, శరీరముతో అంతము లేదనిపించువాడు నగుగాక। కాని అగస్త్యుని మూడు పుడిసిళ్ళకు చాలడాయె. అహో తపస్సులారా। మీకు వందనములు.

క్రియ :- జృ వయోహానౌ (జిచ్) లోట్, పరస్మై, ప్రథమ
జరయతు/జరయతాత్ - జరయతామ్ - జరయన్తు
పౄ పాలన పూరణయోః, పరస్మై, లోట్, ప్రథమ
పిపర్తు/పిపూర్తాత్ - పిపూర్తామ్ - పిపురతు
వహ్ ప్రాపణే, లోట్, పరస్మై, ప్రథమ
వహతు/వహతాత్ - వహతామ్ - వహన్తు
డుధాఞ్ ధారణపోషణయోః, పరస్మై, లోట్, ప్రథమ
దధాతు/ధత్తాత్ - ధత్తామ్ - దధతు
భూ సత్తాయామ్, పరస్మై, లోట్, ప్రథమ
భవతు/భవతాత్ - భవతామ్ - భవన్తు
అస భువి, పరస్మై, లోట్, ప్రథమ
అస్తు/స్తాత్ - స్తామ్ - సన్తు

మునేరితి :- (సబహుమానమ్ = ఆదరముతో) వత్స = అనుజా! కిముచ్యతే = చెప్పునదేమి। కలశజన్మనః = కుంభసంభవుడగు, మునేః = అగస్త్య మహర్షియొక్క, కాపి = అనిర్వాచ్యమగు, గంభీరతా = లోతు, జయతి = వర్ధిల్లుగాక। యయా = ఏ గంభీరతతో, అంభసామ్ నిధిః అపి = జలనిధికూడ, చుళకమ్ = పుడిసెడుగా.

మునేః కలశజన్మనో జయతి కాపి గంభీరతా
యయా చుళకమంభసామపి నిధిః సముత్పద్యతే ।
అముష్య పునరీశ్మహే న వివరీతుముత్తుంగతాం
యయా భవతి నోచ్చకై రహహ సోఽపి వింధ్యాచలః ॥ 16

అపి చ వత్స. దురవగాహా గంభీరస్వభావాని మహతాం చరితాని. తథాహి-

---

సముత్పద్యతే = మారిపోవుచున్నది - ఇది ఇచ్చట ప్రత్యక్షముగా నున్న నీపన్న విషయము. పునః = మరియు. అముష్య = ఈ అగస్త్యునియొక్క. ఉత్తుంగతామ్ = ఉన్నతత్వమును (ఎత్తు). వివరీతుమ్=వివరించుటకు. న ఈశ్మహే=మనము చాలము. యయా = ఏ ఉన్నతితో సః = ఆ ప్రసిద్ధమగు. వింధ్యాచలః అపి=వింధ్యపర్వతము కూడ, అహహ=ఓహోహో !, ఉచ్చకైః న భవతి=ఉన్నతము కాలేకున్నది - ఆతని ఉన్నతిముందు ఇది తలవంచినదనుట (పృథ్వీవృత్తము).

తాత్పర్యము :- అగస్త్యుని గాంభీర్యముముందు సముద్రుడు పుడిసెడైనాడు. కుంభసంభవుని ఉన్నతత్వము ముందు వింధ్యాద్రి తలవంచినది. ఆ గాంభీర్యమునుగానీ ఈ ఔన్నత్యమునుగానీ వివరించుటకు మనము చాలము సోదరా ! చాలము.

సంధులు :- జన్మనః + జయతి - ఉత్వాదేశవిసర్గ. కా + అపి. వింధ్య + అచలః - సవర్ణదీర్ఘ. న + ఉచ్చకైః - గుణసంధి. ఉచ్చకైః + అహహ - రేఫాదేశ విసర్గ. సః + అపి - ఉత్వాదేశవిసర్గ. సో + అపి - పూర్వరూప.

క్రియ :- పదద్ గతౌ (శ్యన్) ఆత్మనే. లట్. ప్రథమ (ఉత్)
ఉత్పద్యతే - ఉత్పద్యేతే - ఉత్పద్యన్తే
ఈశద్ ఐశ్వర్యే (లుక్) ఆత్మనే. లట్. ప్రథమ
ఈశే - ఈశ్వహే - ఈశ్మహే

జగదితి :- అపిచ = మరియు, వత్స = తమ్ముడా ! మహతామ్ = మహానుభావుల. చరితాని = వృత్తాంతములు, దురవగాహ గంభీరస్వభావాని = అంతు

జగద్విగమఘస్ర ఘస్మరసహస్రభానుప్రభా
పరిక్వథిత పిండితో లవణకూటమేవార్ణవః ।
అయం క్షణమభూదథ జ్వలతి కాలరుద్రానలే
చటచ్చటదితి స్ఫుటన్న భవతి స్మ యావత్క్షణాత్ ॥ 17

---

చిక్కని గాంభీర్యములవి. తథాహి = అంతేగదా । - జగత్ = ప్రపంచముయొక్క. విగమ=ఉపసంహారము జరుగునట్టి, ఘస్ర=దినమునందు - ప్రళయకాలపు దివసమునందనుట - (ఘస్రో దినాహనీ - అమరః). ఘస్మర = సర్వభక్షణశీలుడైన (వినాశకుడు). సహస్రభాను = సూర్యునియొక్క. ప్రభా = కాంతితో. పరిక్వథిత = పరిపక్వము గావింపబడినవాడును - ఇల్లింకినవాడనుట. పిండితః = ముద్దగావింపబడినవాడునై, అయమ్ అర్ణవః ఏవ = ఈ సముద్రుడే. క్షణమ్ = క్షణములో. లవణకూటమ్ = ఉప్పుకుప్పగా. అభూత్ = అయ్యెను (పుంజరాశీత్వుత్కరః కూటమస్త్రియామ్ - అమరః) అథ = అటుపైని, కాలరుద్ర = ప్రళయకాలరుద్రునియొక్క. అనలే = అగ్ని - ప్రళయభీకరాగ్ని. జ్వలతి సతి = ప్రజ్వలింపగా, అయమ్ = ఈ సముద్రుడే. చటచ్చటత్ ఇతి = చటచటమని. స్ఫుటన్ = ప్రేలుచు. యావత్క్షణాత్ = అదే క్షణములో. న భవతి స్మ = అదృశ్యుడగును (పృథ్వీవృత్తము).

తాత్పర్యము :- ఈ సముద్రుడు ప్రళయసూర్యాగ్నికి ఇల్లింకి ఉప్పుకుప్పయై ప్రళయరుద్రాగ్నికి చిటపటమని ప్రేలుచు అదృశ్యుడగును.

సమాసములు :- జగతః విగమః - జగద్విగమస్య ఘస్రమ్ - ఘస్మరశ్చ అసౌ సహస్రభానుశ్చ - జగద్విగమఘస్రే ఘస్మరసహస్రభానుః - భానోః ప్రభా - ప్రభయా పరిక్వథితశ్చాసౌ పిండితశ్చ. లవణస్య కూటమ్. కాలరుద్రస్య అనలః - రుద్రశ్చా సావనలశ్చ - కాలే రుద్రానలః.

క్రియ :- భూ సత్తాయామ్, పరస్మై. లుఙ్, ప్రథమ

అభూత్ - అభూతామ్ - అభూవన్

సీతా :- ఆర్యపుత్ర, జలనిధిమధ్యవర్తినో లంకాపోతస్య జంబూద్వీపోప సంయమనశృంఖలేవ క ఏష ప్రతిభాసతే. (అజ్జఉత్త జలణిహి మజ్ఝవట్టిణో లంకాపోదఅస్స జంబూదీవోవసంజమణసింఖలేవ్వ క్కో ఏసో పడిహాసదే.)

రామః :- దేవి, మేదినీనందిని, పతితపౌలస్త్యజగద్విజయకేతుదండానుకారీ కకుత్స్థకుటుంబదుఃఖసంవిభాగదాయాదస్య వానరపతేః కీర్తనమయో అయం మహాసేతుః.

సీతా :- (సహర్షమ్) దిష్ట్యా ఆర్యపుత్రదర్శనప్రత్యాశాయా బంధప్రరోహణ మహౌషధం సేతుబంధో దృశ్యతే. (అంజలిం బద్ధ్వా)

---

ఆర్యపుత్రేతి :- ఆర్యపుత్ర = నాథా ! జలనిధిమధ్యవర్తినః = సముద్ర మధ్యమున నున్న. లంకాపోతస్య = లంకయనునట్టి నావకు, జంబూద్వీప = భరత వర్షముతో, ఉపసంయమన = బంధించునట్టి, శృంఖలా ఇవ = (ఇనుప) గొలుసువలె. ప్రతిభాసతే = భాసించుచున్నది. ఏషః కః = ఇది యేమి ?

దేవీతి :- దేవి ! మేదినీ నందిని = భూపుత్రీ ! పతిత = నేలకు ఒరిగి పోయిన, పౌలస్త్య జగద్విజయకేతుదండానుకారీ - పౌలస్త్య = రావణునియొక్క, జగద్విజయ = త్రిలోకవిజయమునకు సంకేతమైన. కేతుదండ = జెండాకఱ్ఱను, అనుకారీ = అనుకరించునదియు, కకుత్స్థకుటుంబ = రఘువంశజుల, దుఃఖ = దుఃఖము యొక్క, సంవిభాగ = తుల్యవిభాగమునందు. దాయాదస్య = పాలు పంచుకొనువాడైన, వానరపతేః = సుగ్రీవునియొక్క, కీర్తనమయః = కీర్తిస్వరూపమువంటిదియును, అయమ్ = ఈ, మహాసేతుః = మహాసేతువు - రావణుని జెండాకఱ్ఱ, సుగ్రీవుని కీర్తిరేఖ.

దిష్ట్యేతి :- (సహర్షమ్ = ఆనందముతో) దిష్ట్యా = అదృష్టవశమున, ఆర్యపుత్ర = సీయొక్క, దర్శన = దర్శనమనునట్టి, ప్రత్యాశాయాః = గాఢవాంఛకు, బంధప్రరోహణ = ఆధారబంధము నభివృద్ధి పరచునట్టి, మహౌషధమ్ = దివ్యౌషధ మైన, సేతుబంధః = సేతుబంధనము, దృశ్యతే - చూడబడుచున్నది. సేతునిర్మాణ

భగవన్ నమస్తే. (దిట్ఠి అ అజ్జఉత్తసంబంధ పవ్వాసావి బంధ
ప్పరోహణమహూసహం సేదుబంధో దీసఇ. భఅవం. ణమో దే.)

రామః :- దేవి. విశ్వంభరాసంభవే. పశ్య పశ్య---

యథా దూరాపాతి త్రిదివయువతీనేత్రసులభా
మపాం భర్తా హారావళివలయలక్ష్మీం వితనుతే ।
తథాయం మాణిక్యస్ఫటిక కనక గ్రావశిఖరై
రనూన్యాత్మా సేతుః ప్రభవతి మహానాయక ఇవ ॥ 18

---

వార్త సీతకు రాము సందర్శనాశను ప్రతీకించినదనుట. (అంజలిమ్ బద్ధ్వా=చేతులు జోడించి) భగవన్ = మహాత్మా ! ఓ సేతూ !, తే నమః = నీకు అభివందనము.

యథేతి :- దేవి = దేవీ ! విశ్వంభరా సంభవే = సీతాదేవీ ! పశ్య పశ్య = చూడు చూడు ! - దూరాపాతి = సుదూరమునుండి ప్రసరించుచున్న - ఆకాశమునుండి నేలకు సాగుచున్నయనుట. త్రిదివయువతీ = అప్సరః కాంతలయొక్క. నేత్ర = చూపులకు. సులభామ్ = తేలికగా స్ఫురించునదైన. హారావళి వలయలక్ష్మీమ్ = (భూదేవి) మెడను ధరించు దండలశోభను. అపామ్ భర్తా = ఈ సముద్రుడు. యథా = ఎప్పుడు. వితనుతే = వహించునో. తథా = అప్పుడు. అయమ్ = ఈ. సేతుః = సేతువు. మాణిక్య = మాణిక్యములు. స్ఫటిక = స్ఫాటికశిలలు. కనకగ్రావశిఖరైః = సువర్ణఖండములయొక్క అగ్రభాగములతో - మేరుపర్వత శిఖరఖండములతో ననిగానీ, అనూన్యాత్మా = నిండిన స్వరూపముకలదై. మహానాయకః ఇవ = పెద్ద నాయకమణి వలె. ప్రభవతి = భాసించును (నాయకో నేతరి శ్రేష్ఠే హారమధ్యమణావపి - అనేకార్థ ధ్వనిమంజరీ). శిఖరిణి.

తాత్పర్యము :- ఆకాశములో సుదూరప్రాంతమునుండి చూచుచున్న అప్సరసలకు ఈ సముద్రుడు భూదేవి కంఠహారమువలె తేలికగా స్ఫురించును. అప్పుడు సేతువిది మెరుపులీనుచున్న మణిమయశిలాఖండములతో ఆ హారములోని నాయకమణివలె భాసించును.

అపిచాస్మిన్ బధ్యమానే—

శైలప్రవేశాత్ప్రచలీభవద్భిః కల్లోలకూటైరధితాడితానామ్ ।
ఆసీన్నివృత్త్యాచలగామినీనామంభోధిరేవ ప్రభవో నదీనామ్ ॥ 19

---

సమాసములు :- దూరాదాపతంతీతి దూరాపాతీని - త్రిదివయువతీనాం నేత్రాణి - దూరాపాతీని చ తాని నేత్రాణి - నేత్రాణాం సులభా - తామ్. హారావళీనాం వలయః - వలయస్య లక్ష్మీః తామ్. మాణిక్యాని చ స్ఫాటికాశ్చ కనకగ్రావాణశ్చ - గ్రావాణాం శిఖరాః - శైః, అనాన్యమ్ ఆత్మా యస్య సః.

క్రియ :- తనుఞ్ః విస్తారే, ఆత్మనే. లట్, ప్రథమ
తనుతే - తన్వాతే - తన్వతే

శైలేతి :- అపిచ = మరియు, అస్మిన్ = ఈ సేతువు, బధ్యమానే = నిర్మింపబడుచుండగా - శైలప్రవేశాత్ = సేతునిర్మాణమునకై తెచ్చి కపివీరులు విసరిన పర్వతములయొక్క ప్రవేశమువలన, ప్రచలీభవద్భిః = ఉవ్వెత్తున లేచుచున్న, కల్లోల కూటైః = తరంగ సమూహ ములతో, అధితాడితానామ్=ఎగదన్నబడినవై, నివృత్త్య = వెనుదిరిగి, అచలగామినీనామ్ = (తమకు ప్రభవస్థానమగు) పర్వతములను చేరుచున్న, నదీనామ్ = నదులకు, అంభోధిః ఏవ = సముద్రమే. ప్రభవః = జన్మస్థానము, ఆసీత్ = అయ్యెను.

తాత్పర్యము :- కపివీరులు పెకలించి తెచ్చి విసరుచున్న పర్వతశిఖరములతో ఈ సముద్రమున కల్లోలములెగసి నదులలోనికి నీరు ఎదురెక్కినది. అప్పుడు ఆ నదులు తాము పుట్టిన పర్వతములపైవు ఎగబ్రాకినవి. ఇది చూడగా నదులకు జన్మస్థానము పర్వతములు కాదు ఈ సముద్రమే యనిపించినది.

సమాసములు :- శైలానాం ప్రవేశః - తస్మాత్. కల్లోలానాం కూటః - కైః. అచలం గచ్ఛన్తి తచ్ఛీలమస్యాః - అచలగామినీ - తాసామ్ (ఇంద్రవజ్ర).

సంధులు :- కూటైః + అధి. అంభోధిః + ఏవ - రేఫాదేశవిసర్గ. ప్రభవః + నదీనామ్ - ఉత్వాదేశవిసర్గ. ఆసీత్ + నివృత్త్య - అనునాసికాదేశ. నివృత్త్య + అచల - సవర్ణదీర్ఘ.

(సుగ్రీవంప్రతి) సఖే—

తథా సేతుశ్రద్ధోత్కలితకపి నిక్షిప్తశిఖరి
ప్రతిష్ఠాపర్ధిష్ణుః క్షణమథ నదీః ప్రతివహన్ ।

---

క్రియ :- అస భువి, పరస్మై, లట్ - ప్రథమ
అనిట్ — మధ్యమ — అసి

తథేతి :- (సుగ్రీవం ప్రతి = సుగ్రీవుని గూర్చి) సఖే = మిత్రమా ! తథా = అప్పుడు ఆ విధముగా, సేతుశ్రద్ధా = సేతువును నిర్మించవలెనను శ్రద్ధలతో, ఉత్కలిత = ఉత్సాహితులైన, కపి = వానర వీరులచే, నిక్షిప్త = ఉంచబడిన, శిఖరి = పర్వతములయొక్క, ప్రతిష్ఠా = ఉనికిచే - అట్టి పర్వతములు తనయందు పడుటచే ననుట, పర్ధిష్ణుః = ఉప్పొంగినవాడై, అథ క్షణమ్ = క్షణకాలము దాక నదులు క్షణము, నదీః = నదులతో, ప్రతివహన్ = ఎదురెక్కి ప్రవహించుచున్నవాడై, అంభోనిధిః = సముద్రుడు, సముత్ఖాత = ఆ పెకలింపబడిన, క్షోణీధర = పర్వతములయొక్క, కుహర = గుంటలయొక్క (పర్వతములు పెకలింపగా ఏర్పడిన గోతులు). (కుహరం సుషిరం బిలమ్ - అమరః) పూర్తి = నింపుట యనునట్టి, వ్యతికర = సంబంధముతో - ఆ గోతులను నింపు పనితో, ప్రమృష్ట = తొలగింపబడిన, అహంకారః = గర్వము కలవాడై, తదవస్థః = తిరిగి తొలుతటి అవస్థను పొందినవాడు, స్మరసి = సుగ్రీవా ! ఆ సన్నివేశమును తలచుచున్నావా । (శిఖరిణి).

తాత్పర్యము :- వానరవీరులు తెచ్చి విసిరిన పర్వతములతో ఉప్పొంగిన సముద్రుడు క్షణకాలము నదులకు ఎదురెక్కి ప్రవహించి, పర్వతోత్పాటనతో ఏర్పడిన పెనుగోతులను నింపి అహంకారము కోల్పోయి యథా పూర్వస్థితిని పొందిన సన్నివేశము గుర్తున్నదా సుగ్రీవా ।

సమాసములు :- సేతవే శ్రద్ధా - శ్రద్ధయా ఉత్కలితాః చ తే కపయశ్చ - కపిభిః నిక్షిప్తాశ్చతే శిఖరిణశ్చ - శిఖరిణాం ప్రతిష్ఠా - ప్రతిష్ఠయా పర్ధిష్ణుః. సముత్ఖాతాశ్చతే క్షోణీధరాశ్చ - క్షోణీధరాణాం కుహరాణి - కుహరాణాం పూర్తిః - పూర్తేః వ్యతికరః - వ్యతికరేణ ప్రమృష్టః అహంకారః యస్య సః.

సముత్థాతక్షోణీధరరుహరపూర్తి వ్యతికర
ప్రమృష్టాహంకారః స్మరసి తదవస్థో నిధిరపామ్ ॥ 20

సుగ్రీవః :- దేవ, భవచ్చరితచిత్రశాలికాయామస్మాకం చేతసి కిం కిం న లిఖితమస్తి. అపి చ—

సేతూద్యోగే సపది లవణాదన్యమంతస్తిమిభ్యః
కాలేనాహం మధురమపి హి స్వాదముద్భేదయన్త్యః।

---

సంధులు :- శ్రద్ధా + ఉత్కలిత - గుణసంధి. ప్రమృష్ట + అహంకారః- సవర్ణదీర్ఘ. తదవస్థః + నిధిః - ఉత్వాదేశ విసర్గ.

క్రియ :- స్మృ ఆధ్యానే చింతాయామ్. లట్, పరస్మై. మధ్యమ
స్మరసి — స్మరథః — స్మరథ.

దేవేతి :- దేవ = మహారాజా। భవత్ = నీయొక్క. చరిత = వృత్తాంతమునకు. చిత్రశాలికాయామ్ = చిత్రశాలయైన. అస్మాకమ్ = మాయొక్క. చేతసి = హృదయమునందు - నీ ఇతివృత్తమునందలి సంఘటనలన్నియు నా హృదయమున బహుధా చిత్రితములైనవనుట. కిమ్ కిమ్ నలిఖితమ్ అస్తి నామ = చిత్రింపబడకున్నది ఏమున్నది। — అన్నియు చిత్రింపబడినవనుట. అపిచ = మరియు—

సేత్విత్ :- సేతూద్యోగే=సేతు నిర్మాణమునకు పూనుకొనగానే. సపది= వెంటనే. శైల = పర్వతములయొక్క. క్షేప = పతనమువలన. ఉచ్ఛలిత = ఎగురగొట్టబడిన. సలిలప్లూహ = జలసమూహముతో. తుచ్ఛే = అల్పరూపతను పొందిన. వారాం పత్యౌ = సముద్రునియందు. నిమ్నగాః = నదులు, కాలేన = సమయానురూపముగా, అంతస్తిమిభ్యః = సముద్రగర్భమునందున్న తిమింగలముల కొఱకు. లవణాత్ అన్యమ్=లవణభిన్నమైన. మధురమ్ స్వాదమ్=తియ్యదనపు రుచిని. ఉద్భేదయన్త్యః= తెలియజేయుచున్నవై. పటుతరరయమ్ = మిక్కిలి వేగముగా. సన్నిపేతుః = దుమికి వచ్చినవి లేదా వచ్చిపడినవి. (శార్దూలము).

శైలక్షేపోచ్ఛలిత సలిలవ్యూహతుచ్ఛే సమస్తా
ద్వారాం పత్యౌ పటుతరరయం నిమ్నగాః సన్నిపేతుః ॥ 21

విభీషణః :- దేవ మనువంశమౌక్తికమణే.

సద్యః పీత్వా దరీభిర్జలధిమథ చిరాద్దృష్టమైనాకబంధు
ప్రీతిప్రౌఢాశ్రుపూర ద్విగుణమహిమభిర్నిర్ఝరైః పూరయన్తః ।

---

తాత్పర్యము :— సేతు నిర్మాణ సమయమునందు విసిరిన శైలముతో సముద్ర జలము ఎగురగొట్టబడినది. సముద్రుడు అల్పావశిష్టుడయ్యెను. వెనువెంటనే నదీమతల్లులు దుమికి పడినవి (పెనిమిటి గౌరవమును కాపాడినవి). అంతదనుక ఉప్పు నీటి రుచినే ఎరిగిన తిమింగలములు క్రొత్తనీటి మాధుర్యమును చవిచూచినవి.

సమాసములు :- సేతోరుద్యోగః - తస్మిన్. అంతర్గతా స్తిమయః - తేభ్యః. శైలానాం క్షేపః - క్షేపేన ఉచ్ఛలితః - సదాసి సలిలవ్యూహః - వ్యూహేన తుచ్ఛః - తస్మిన్.

క్రియ :- పతగతౌ. లిట్. పరస్మై. ప్రథమ
పపాత - పేతతుః - పేతుః

సద్య ఇతి :- దేవ = మహారాజా ! మనువంశ మౌక్తికమణే = మను వంశ ముక్తామణీ ! సేతుశైలాః = సేతు నిర్మాణమునకు ఉపయోగింపబడిన పర్వత ములు. యే = ఏవి. పురస్తాత్ = మునుముందుగా, విన్యస్తాః = సముద్రమున వేయ బడినవో, తే = ఆ పర్వతములు. దరీభిః = తమ పెనుగుహాలతో. సద్యః = వెను వెంటనే. పీత్వా=సముద్రజలమును త్రాగి. అథ=అటుపైని (బరువుతో క్రిందికి మునిగిన పిదప). చిరాత్ = చాలకాలము తరువాత. దృష్ట = చూడబడిన. మైనాక = మైనాకుని వల్లనైన. బంధుప్రీతి=బాంధవస్నేహముతో. ప్రౌఢ + అశ్రుపూర = అతిశయించిన బాష్పధారతో. ద్విగుణ = రెట్టించిన. మహిమభిః = జలసంపదకలవైన. నిర్ఝరైః = సెలయేరులతో. జలధిమ్ = సముద్రమును. పూరయన్తః = నింపుచున్నవై. నిశి నిశి= ప్రతి రాత్రియు. జ్వలద్భిః = తమపై ప్రకాశించుచున్న. ఓషధీనామ్ నివహైః = ఓషధీ లతలతో. తే = ఆ పర్వతములు. తదాత్వ = సేతుబంధకాలములో. ఉషిత = తమపై మజిలీచేసిన. కపి శిబిర = వానర సేనా శిబిరమును. స్మారిణః=గుర్తు చేయుచున్నవిగా. దృశ్యన్తే = కనబడుచున్నవి (స్రగ్ధరావృత్తము).

యే విన్యస్తాః పురస్తాన్నిశి నిశి నివహైరోషధీనాం జ్వలద్భి
స్తే దృశ్యన్తే తదాత్వోషితకపిశిబిరస్మారిణః సేతుశైలాః ॥ 22

సీతా :- (సస్మితమ్) ఆర్యపుత్ర. గౌరీగురోర్గిరీంద్రస్య యువరాజో జలనిధి గర్భవసతిర్మైనాకో. జానామి పక్షచ్ఛేదమపి వినా స్థాపరీభూతః. (అజ్జఉత్త. గోరీగురుణో గిరిందస్స జువరాఓ

---

తాత్పర్యము :- సేతు నిర్మితికై పెనుగిరులు సముద్రమున విసరబడినవి. వాని గుహాలు సముద్ర జలములను త్రాగివేసినవి. పర్వతములు బరువెక్కి లోతునకు మునిగినవి. అప్పుడు అ[illegible] పర్వతమును చూచినవి. బంధు దర్శన ప్రీతితో ఆనందబాష్పములు ధా[illegible]ట్టి ఆ పర్వతములపై నున్న సెలయేరులు ఉప్పొంగినవి. సముద్ర జలములు తిరిగి అభివృద్ధి నందినవి. ఆ పర్వతములపై ఓషధీతలలు ఇప్పటికిని రాత్రులందు ప్రకాశించుచున్నవి. అలనాటి కపిసేనాశిబిరములను స్ఫురింపజేయుచున్నవి. దివిటీలతో శిబిరములు ప్రకాశించు దృశ్యము కన్పించుచున్నదనుట.

సమాసములు :- చిరాత్ దృష్టశ్చాసౌ మైనాకశ్చ - మైనాకాత్ బంధు ప్రీతిః - ప్రీత్యా ప్రౌఢాశ్రుపూరః (ప్రౌఢశ్చాసౌ అశ్రుపూరశ్చ) - అశ్రుపూరేణ ద్విగుణమ్ - ద్విగుణం మహిమ యస్య సః - శైః తదాత్వే ఉషితాశ్చ తే కపయః - కపీనాం శిబిరాణి - శిబిరాణాం స్మారిణః, సేతవే శైలాః.

సంధులు :- దరీభిః + జలధిమ్, మహిమభిః + నిర్మగ్నైః, నివహైః + ఓషధీనామ్ - రేఫాదేశ విసర్గ. ప్రౌఢ + అశ్రు - సవర్ణదీర్ఘ. పురస్తాత్ + నిశి-అనునాసికాదేశ. జ్వలద్భిః + తే - సాదేశ విసర్గ, తదాత్వ + ఉషిత - గుణ.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే కర్మణి ఆత్మనే. లట్. ప్రథమ
దృశ్యతే - దృశ్యేతే - దృశ్యన్తే

ఆర్యపుత్రేతి :- (సస్మితమ్ = చిఱునవ్వుతో) ఆర్యపుత్ర = నాథా! గౌరీగురోః = పార్వతీదేవికి తండ్రియైన, గిరీంద్రస్య = హిమవంతునికి, యువరాజః = జ్యేష్ఠపుత్రుడై, జలనిధి గర్భవసతిః=సముద్రగర్భమునే నివాసముగా చేసికొన్నవాడగు.

జలణిహిగబ్భపసదీమేణాఏ జాణామి పక్ఖచ్ఛేదం పి విణా థావరీభూదో).

రామః :- (విహస్య) అం జానకి. అమ్.

క్రౌంచం విముచ్య పుత్రం చ పితరం చ హిమాలయమ్ ।
ప్రవిశ్య జలధిం పక్షౌ రక్షితావనేన కిం కృతమ్ ॥ 23

సీతా :- (హసన్తీ పుష్పకంప్రతి) విమానరాజ, గగనమార్గసంక్రమణకౌతూహలోల్లసితమానసాస్మి. తదున్నమ తావత్. (విమాణరాఅ, గఅణమగ్గసంకమణకోదూహలుల్లసిదమాణసాహ్మి. తా ఉణ్ణమేహి దావ.)

---

మైనాకః = మైనాకుడు, పక్షచ్ఛేదమ్ వినా అపి = ఇంద్రకృతమగు పక్షవిచ్ఛేదనము లేకపోయినను, స్థావరీ భూతః = చలనరహితుడయ్యెనని. జానామి = ఎరుగుదును — భయపడి దాగి బిఱ్ఱబిగిసెననుట.

క్రౌంచమితి :- (విహస్య = నవ్వి) జానకి ! అమ్ అమ్ = అవునవును — పుత్రమ్ = తన పుత్రుడగు, క్రౌంచమ్ = క్రౌంచ పర్వతమును, చ = మరియు, పితరమ్ = తండ్రియగు, హిమాలయమ్ = హిమవంతుని, విముచ్య = విడిచి-వారిని రక్షించు బాధ్యతను విడిచియనుట. జలధిమ్=సముద్రమును, ప్రవిశ్య= ప్రవేశించి, పక్షౌ = తన రెండు రెక్కలను, రక్షితౌ = కాపాడుకొన్నవాడైన అనేన= ఈ మైనాకునిచే, కింకృతమ్=కుత్సితమాచరింపబడినది — అట్టి స్వార్థము [illegible] గౌరవహేతువు కాదనుట (పథ్యావక్త్రమ్)

విమానేతి :- (హసన్తీ = నవ్వుచున్నదై, పుష్పకం ప్రతి=పుష్పకము నుద్దేశించి) విమానరాజ = శ్రేష్ఠమగు పుష్పక విమానమా ! గగనమార్గ = ఆకాశవీధి యందు, సంక్రమణ = సంచరించుటయను, కౌతూహల=కుతూహలముతో, ఉల్లసిత= ఉరకలు పెట్టుచున్న, మనసా = మనస్సుకలదానను, అస్మి = అగుచుంటిని, తత్ = అందుచేత, ఉన్నమ తావత్ = దయచేసి పైకి లెమ్ము.

రామః :- (సకౌతుకస్మితమ్) దేవి రత్నగర్భాగర్భరత్నశలాకే. పశ్య
పశ్య ——

యథా యథా పరం వ్యోమ విమానమధిరోహతి,
తథా తథాపసర్పన్తి పరతః పరితో దిశః ॥ 24

కించ ——

ఆసన్నతపనాశ్యానత్వచః పుష్పకపీడితాః।
గగనార్ణవయాదాంసి స్తిమ్యన్తి స్తనయిత్నవః ॥ 25

---

దేవీతి :- రత్నగర్భా = భూదేవియొక్క. గర్భ = గర్భము నుండి ప్రభవించిన. రత్నశలాకే = రత్నపు తునకా! దేవి = ఓ జానకీ! పశ్య పశ్య = చూడు చూడు! విమానమ్ = ఈ పుష్పకవిమానము, పరమ్ వ్యోమ = ఆకాశమున పైపై ప్రదేశములను యథా యథా అధిరోహతి = అధిరోహించుచుండగా, తథా తథా = ఆ అధిరోహణ సమయమున. పరితః = చుట్టునున్న, దిశః = దిక్కులు, పరతః = దూర దూరముగా, అపసర్పన్తి = జరిగిపోవుచున్నవి. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- సీతా! విమానము పైపై ఎగురుచున్నకొలది దశదిశలను దూరదూరముగా విస్తరించుచున్నవి.

ప్రక్రియ :- సృప్ల గతౌ, లట్, పరస్మై. ప్రథమ
సర్పతి — సర్పతః — సర్పన్తి

ఆసన్నేతి :- కించ = మరియు — ఆసన్న=సమీపమునందున్న తపన= సూర్యునిచే. ఆశ్యాన = ఎండింపబడిన, త్వచః = తోళులవంటివియు, గగన = ఆకాశమనునట్టి, అర్ణవ = సముద్రమునందు. యాదాంసి = సీళులవంటివియునైన. స్తనయిత్నవః = మేఘములు. పుష్పకపీడితాః = పుష్పక విమానముచే రారాపులువడినవై- అది యొరసికొనియనుట, స్తిమ్యన్తి = ధ్వని చేయుచున్నవి. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- ఎండిన తోళ్ళవలె, గగనార్ణవమున సీళ్ళవలెనున్న ఈ మేఘములు పుష్పక విమానపు టొరిపిడితో గలగలలాడుచున్నవి.

సమాసములు -: ఆసన్నశ్చాసౌ తపనశ్చ — తపనేన ఆశ్యానాః త్వచః ఇవ. పుష్పకేన పీడితాః. గగనమర్ణవమివ — గగనార్ణవే విద్యమానాని యాదాంసీవ.

అపిచ—

అమీ తే గంభీరస్తనితరవరౌద్రా నయనయో
రనాయుష్యం పుష్యంత్యవతమసముచ్చైర్జలముచః ।
విసర్పద్భిర్యేషాముపరి పరమిందోః పరిమళై
రసంబాధజ్యోత్స్నాతిమిరచయచిత్రం వియదభూత్ ॥ 26

---

క్రియ :- ష్టిమ ఆర్ద్రీభావే (శ్యన్) లట్, పరస్మై. ప్రథమ
స్తిమ్యతి - స్తిమ్యతః - స్తిమ్యన్తి

అమీతి :- అపిచ = మరియు - గంభీర = ధీరమైన. స్తనితరవ = గర్జాధ్వనితో. రౌద్రాః = భీషణమైనవియు. ఉచ్చైః = విశాలములునైన. అమీ = ఈ. జలముచః = మేఘములు. తే = నీ యొక్క. నయనయోః = నేత్రములకు (చూపులకు). అనాయుష్యమ్ = అవరోధకముగు, అవతమసమ్ = క్షీణాంధకారమును, పుష్యన్తి = వ్యాపింపజేయుచున్నవి. (క్షీణేఽవతమసం తమః - అమరః. అవసమంధేభ్యస్తమసః - అచ్). ఇందోః = చంద్రునికి. ఉపరి = పైభాగమునందును. పరమ్ = అధోభాగమునందును, విసర్పద్భిః = వ్యాపించుచున్న, యేషామ్ = ఏ యీ మేఘముల యొక్క. పరిమళైః = సమ్మర్దములతో (స్యాత్పరిమళో౽తిమర్దే మనోహారగంధయోశ్చాపి - మేదినీ), వియత్ = ఆకాశము. అసంబాధ = నిస్సంకటమైన (సంబాధ స్సంకటే క్షేపే - ఇతి విశ్వః), జ్యోత్స్నా = వెన్నెలతో. తిమిరచయ = చీకటితో. చిత్రమ్ = చిత్రవిచిత్రముగా. అభూత్ = మారెను (శిఖరిణీవృత్తము).

తాత్పర్యము :- ఈ గంభీరములు అతి విశాలములునైన మేఘములు చూపులను అడ్డగించుచున్నవి. వెన్నెలపర్వి కొన్నిచోట్ల, చీకట్లుపర్వి కొన్నిచోట్ల గగనమంతయు చిత్రవిచిత్రముగా కనిపించుచున్నది.

సమాసములు :- గంభీరశ్చాసౌ స్తనితరవశ్చ — రవేణ రౌద్రాః అసంబాధా చ సా జ్యోత్స్నా చ - జ్యోత్స్నా చ అసౌ తిమిరచయశ్చ - తిమిరచయేన చిత్రమ్.

సుగ్రీవః :- (అధోఽవలోక్య సకౌతుకం రామం ప్రతి) దేవ, దూరాదవాగ
వలోకయ తావత్.

నిహ్నుతోన్నతనతప్రవిభక్తిః స్వస్వవర్ణవినివిష్టపదార్థా ।
అంబురాశిపరివేషవతీ భూశ్చిత్రకుట్టిమమివ ప్రతిభాతి ॥ 27

---

సంధులు :- రౌద్రాః + నయన - విసర్గలోప. నయనయోః + అనా యుష్యమ్, ఉచ్చైః + జలముచః, విసర్పద్భిః + యేషామ్, పరిమళైః + అసంబాధ - రేఫాదేశ విసర్గ.

క్రియ :- పుష పుష్టౌ (శ్యన) లట్, పరస్మై, ప్రథమ
పుష్యతి - పుష్యతః - పుష్యన్తి
భూ సత్తాయామ్ పరస్మై, లుఙ్, ప్రథమ
అభూత్ - అభూతామ్ - అభూవన్

దేవేతి :- (అధః అవలోక్య=క్రిందికి చూచి, సకౌతుకమ్ = కౌతుకముతో రామంప్రతి = రాముసుద్దేశించి) దేవ = మహారాజా!, దూరాత్ అవాక్ అవలోకయ తావత్ = దూరముగా క్రిందికి చూడుము__

నిహ్నుతేతి :- నిహ్నుత=కప్పివేయబడిన, ఉన్నత - నత ప్రవిభక్తిః= ఎత్తు పల్లముల విభాగము కలదియు - ఎత్తుపల్లముల విభాగము కనుమరుగై అంతయు సమతలముగా కన్పించుచున్నదనుట; స్వస్వవర్ణ = తమ తమ రంగులతో మాత్రమే, వినివిష్ట = నిలిచిన, పదార్థా = వస్తువులు కలదియు - వస్తువుల రూపములు అంతరించి రంగులుమాత్రము భాసించుచున్నవనుట. అంబురాశి = సముద్రమే, పరివేషవతీ = పరివేష మండలముగా కలదియు - సముద్ర పరివేష్టితయనుట, అయిన, భూః=భూమి, చిత్రకుట్టిమమ్ ఇవ = రంగురంగుల చప్టావలె, ప్రతిభాతి = భాసించుచున్నది (ఛందస్సు = స్వాగతము).

తాత్పర్యము :- మహారాజా! భూమిపై ఎత్తుపల్లములు మాయమైనవి, వస్తువులు కన్పించుటలేదు, రంగులు మాత్రము భాసించుచున్నది. సముద్రము పరివేష మండలమువలె నున్నది. మొత్తము భూమి చిత్రమణికుట్టిమమువలె కన్పించుచున్నది.

అపి చ దేవ.

అయమనేన మహోదధిభోగినా వలయితో వసుధాఫణమండలః।
జగదనర్ఘమవాప్య భవాదృశం కిమపి రత్నమహంకురుతేతరామ్ ॥ 28

సీతా :- (పురో దర్శయన్తీ) క ఏష కల్పానలజ్వాలాకలాపకవళ్యమాన జలనిధి లవణస్తబక నిర్మలాభ్రంలిహ శిఖరసహస్రమధురో మహీధరః ప్రలోక్యతే. (కో ఏసో కప్పాణలజ్జాలాకలాబకవళిజ్జమాణజలణిహి లవణత్థబకణిమ్మల అబ్భంలిహ సిహర సహస్స మహురో మహీహరో పలోఇజ్జది.)

---

సమాసములు :- ఉన్నతనతయోః ప్రవిభక్తిః - విభాగః ఉన్నతనత ప్రవిభక్తిః యస్యాం సా. స్వస్వవర్ణైః వినివిష్టాశ్చ తే పదార్థాః యస్యాం సా అంబురాశిః పరివేషణవ - నః అస్యాః అస్తీతి.—

అయమితి :- అపిచ = మరియు. దేవ = మహారాజా ! అనేన = ఈ, మహోదధిభోగినా = సముద్రమనునట్టి సర్ప శరీరముతో, వలయితః = చుట్టబడిన, అయమ్ = ఈ, వసుధా ఫణమండలః = భూమియనునట్టి పడగ, జగదనర్ఘమ్=ప్రపంచమునందే అమూల్యమైన, కిమపి రత్నమ్ = ఒకానొక రత్నమును, భవాదృశమ్ = నీవంటి వ్యక్తిని, అవాప్య - పొంది, అహంకురుతేతరామ్ = మిక్కిలి గర్వించుచున్నది (ద్రుతవిలంబితము)

తాత్పర్యము :- భూమండలము పడగవలె సముద్రము సర్పశరీరమువలె భాసించుచున్నవి. ఆ పడగపై నీవొక అనర్ఘ రత్నమవు. కావుననే భూమి మిక్కిలి గర్వించుచున్నది.

క ఇతి :- (పురః = ముందునకు, దర్శయన్తీ = చూపుచున్నదై) కల్పానల = ప్రళయాగ్నియొక్క, జ్వాలాకలాప = జ్వాలికా సమూహముచే, కవళ్యమాన= ఇగిరింపబడిన, జలనిధి=సముద్రముయొక్క, లవణస్తబక = ఉప్పుదిప్పవలె, నిర్మల= స్వచ్ఛమై, అభ్రంలిహ = ఆకాశమునంటుచున్న, శిఖరసహస్ర = వేయి శిఖరములతో, మధురః = సుందరమై, మహీధరః = ఒక పర్వతము, ప్రలోక్యతే = కన్పించుచున్నది, ఏషః కః = ఇది ఏ పర్వతము ?

విభీషణః :- దేవి.

పురః ప్రాలేయశైలోఽయం యస్మిన్మకరకేతవే।

మృతసంజీవనీ దుర్గా మహౌషధిరజాయత॥ 29

సీతా :- (సకౌతుకమ్) అపి ఇహైవ చంద్రశేఖరనయనానలే ఆహుతీ భూతో భగవాన్మన్మథః. (అవి ఇధ జ్జేవ చందసేహరణఅణాణలే ఆహుదీభూదో భఅవం మమ్మహో)

విభీషణః :- అం దేవి. అమ్. ఇయముత్తరేణ దేవదారువనలేఖా విషమశర దురంతసాక్షిణీ.

---

పుర ఇతి :- దేవి = మహారాజ్ఞీ। పురః = ఎట్టఎదుట. అయమ్ = ఈ కన్పించుచున్నది. ప్రాలేయశైలః = హిమవత్పర్వతము. యస్మిన్ = ఏ యీ గిరి యందు. మకరకేతవే = మన్మథునిపాలిటి. మృతసంజీవనీ = మృతసంజీవని యను నట్టి. మహౌషధిః = గొప్ప ఓషధీలతయై. దుర్గా = గౌరి. అజాయత = జన్మించెను. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- మహారాజ్ఞీ। ఈ కన్పించుచున్నది హిమవత్పర్వతము. ఇందే పార్వతీదేవి జన్మించినది. హరినయనాగ్నిదగ్ధుడగు మకరకేతనుని పునరుజ్జీ వితుని జేయుంచిన ఓషధీలత ఆ పార్వతి. ఈ పర్వతమందే ప్రభవించినది. (అభేద రూపకము)

సంధులు :- శైలః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - శైలో + అయమ్- పూర్వరూప. మహా + ఓషధిః - వృద్ధి. ఓషధిః + అజాయత - రేఫాదేశ,

క్రియ :- జనీఙ్ ప్రాదుర్భావే. లఙ్. ఆత్మనే: ప్రథమ.

అజాయత - అజాయేతామ్ - అజాయన్త.

అపీతి :- అపిఇతఏవ = ఇచ్చటేనా. చంద్రశేఖర = శివుని యొక్క. నయనానలే = నేత్రవహ్నియందు, భగవాన్ మన్మథః = మహానుభావుడు మదనుడు. ఆహుతీభూతః = ఆహుతియైనాడు।

అమితి :- అమ్ = అవును. దేవి = మహారాజ్ఞీ। అమ్ = అవును, ఉత్తరేణ = ఉత్తర భాగమున కన్పించుచున్న, ఇయమ్ = ఈ, దేవదారువనలేఖా =

పురా పురాం భేత్తురిహ త్రినేత్రీశృంగాటకే తుల్యరుషి స్థితేఽపి।
ధగద్ధగిత్యజ్వలదేకమన్యే తద్ధూమపీడామపి నాసహేతామ్॥ 30

రామః :- కిముచ్యతే—

నీలలోహితలలాటలాంఛనే లోచనే జయతి కోపపావకః।

---

దేవదారువృక్షశ్రేణి. విషమశర = మన్మథుని యొక్క. సువింతే = బలవన్మృతికి. సాక్షిణీ = సాక్షి.

పురేతి :- పురా = పూర్వకాలమందు. పురాం భేత్తుః = త్రిపురారియగు శివునియొక్క. త్రినేత్రీశృంగాటకే = మూడుకన్నుల కూడలి ప్రదేశము. తుల్యరుషి = సమాన కోపముకలదై. స్థితే అపి = ఉన్నప్పటికిని - కోపము మూడు కన్నులకును సమానముగానే వ్యాపించియున్నప్పటికిని. ఏకమ్ = ఒక్కటే. ధగ్ ధగ్ ధగితి=ధగ్ధగ్గు మని. అజ్వలత్ = మండెను. అన్యే = తక్కినవి రెండును. తత్ = ఆయగ్నినుండి వచ్చిన. ధూమ=పొగతోనైన. పీడామ్ అపి = బాధనైనను. న అసహేతామ్=సహింప లేక పోయినవి - అవి ధ్యానముద్రతో మూతపడియున్నవనుట. (ఉపజాతి).

తాత్పర్యము :- మన్మథ దహన సందర్భమున శివుని మూడు కన్నులకును కోపము సమానముగనే వ్యాపించియున్నను అందు ఒక్కకన్ను మాత్రమే అగ్నులు వెదజల్లినది. కానీ తక్కిన రెండును అప్పటి పొగను ఓర్చుకొనలేని రీతిగా మూతవడియే యుండెను.

సంధులు :- భేత్తుః + ఇహ - రేఫాదేశ విసర్గ. స్థితే + అపి-పూర్వరూప. న + అసహేతామ్ - సవర్ణదీర్ఘ.

క్రియ :- షహజ్ మర్షణే. లఙ్, ఆత్మనే. ప్రథమ
అసహత - అసహేతామ్ - అసహన్త

నీలేతి :- కిముచ్యతే = ఏమి చెప్పుమందువు। నీలలోహిత = శివుని యొక్క. లలాటలాంఛనే = ఫాలభూషణమైన. లోచనే = నేత్రమునందు. కోపపావకః = కోపవహ్ని. జయతి = విరాజిల్లుగాక। జగదన్త హేతవే=జగద్వినాశనమునకై -

రక్షితస్య జగదంతహేతవే యస్య సంజ్వలనమాత్మభూరభూత్ ॥ 31

సీతా :- (రామం ప్రతి) ఆర్యపుత్ర, తథా నిరనుక్రోశః కథం పునః ప్రతినివృత్తో మహాదేవో దేవ్యై. (అజ్జఉత్త. తథా ణిరణుక్కోసో కధం ఉణ పడిణివుత్తో మహాదేవో దేవీఏ).

రామః :- స్మరపరిభవనిస్సహాయదీర్ఘైరథ సుభగంకరణై రియం తపోభిః।
తనుస్వృతి యదసౌ నిజేఽపి దేహే జయతి జగత్పతిరాత్మనా ద్వితీయః ॥ 32

---

సృష్టిని ఉపసంహరించుటకై, రక్షితస్య = రక్షింపబడిన, యస్య = ఏయీవహ్నికి, ఆత్మభూః = మన్మథుడు. సంజ్వలనమ్ = మండించు సమిధగా, అభూత్=అయ్యెను. (రథోద్ధతము రాన్నరావిహ రథోద్ధతా లగౌ)

తాత్పర్యము :- శివుని నేత్రాగ్నికి జయమగుగాక ! జగదుపసంహారము నకై అది సంరక్షింపబడినది. అది చల్లారిపోకుండ నడుమనొకతూరి ప్రజ్వలింపజేయ నెంచి శివుడు మన్మథుని ఒక సమిధగా నొనర్చెను.

సమాసములు :- సీలలోహితస్య లలాటమ్ - లలాటస్య లాంఛనమ్ - తస్మిన్. కోప ఏవ పావకః. జగదంతస్య హేతుః = తస్మై. ఆత్మని భవతీతి.

క్రియ :- జి జయే. లట్. పరస్మై. ప్రథమ
జయతి - జయతః - జయన్తి
భూ సత్తాయామ్. లజ్, పరస్మై. ప్రథమ
అభూత్ - అభూతామ్ - అభూవన్

ఆర్యపుత్రేతి :- (రామం ప్రతి=రాముసుద్దేశించి) ఆర్యపుత్రా ! తథా = అట్లు, నిరనుక్రోశః = నిర్దయుడై, పునః = మరల, కథమ్ = ఎట్లు, మహాదేవః = శివుడు. దేవ్యై = పార్వతికొఱకు. ప్రతినివృత్తః = తిరిగివచ్చెను ?

స్మరేతి :- స్మర = మన్మథునికి జరిగిన, పరిభవ = అవమానముతో, నిస్సహాయ = సహాయక రహితములును, దీర్ఘైః = సుదీర్ఘములునైనవియు, సుభగంకరణైః = సౌందర్యమును పెంపొందించునవియునైన, తపోభిః = తపస్సులతో.

విభీషణః :- (సపరిహాసమ్)

చిరమనయా తపసిత్వా కపాలవిషవిషధరైకచిత్తస్య ।
చక్రే హరస్య మూర్తిః ఫలమర్ధం ఫలదమర్ధం చ ॥ 33

---

ఇయమ్ = ఈ గౌరి. అకృత = (శివుని) సాధించెను. అసౌ = ఈ. జగత్పతిః = పరమేశ్వరుడు. నిజే దేహే అపి = తన శరీరమునందే. ఆత్మనా - ద్వితీయః=తనతో రెండవవాడై. జయతి = వర్ధిల్లుగాక । అర్ధనారీశ్వరత్వము. (పుష్పితాగ్రావృత్తము)

తాత్పర్యము :- మన్మథుని భస్మమునకుగా పార్వతి తపస్సులు నిస్పహాయములైనవి. కానీ సౌందర్యమును పెంపొందించినవి. ఆ తపస్సులెంత గొప్పవనగా శివునంతటివానిని తన శరీరమునందు తానే రెండవవాడగునట్లు చేసినవి. శివుడు మెచ్చి అర్ధాంగి నొనర్చెనట.

సమాసములు :- స్మరస్య పరిభవః - పరిభవేన నిస్పహాయాని చ తాని దీర్ఘాణి చ - తైః. అసుభగః సుభగః క్రియతే యైః - తాని. జగతః పతిః.

సంధులు :- దీర్ఘైః + అథ. చరుతైః + ఇయమ్. పతిః + ఆత్మనా - రేఫాదేశవిసర్గ. నిజే + అపి - పూర్వరూప.

చిరమితి :- (సపరిహాసమ్ = పరిహాసపూర్వకముగా) కపాల = పుర్రె. విష = కాలకూటము. విషధర = సర్పము - ఈ మూడింటియందు. ఏక చిత్తస్య = సమానానురాగము కలవాడగు. హరస్య = శివునియొక్క. మూర్తిః=శరీరము (కర్త). అనయా = ఈ గౌరిచేత. చిరమ్ = చాల కాలము. తపసిత్వా = తపస్సును చేయించి (కర్మణో రోమంథ తపోభ్యాం వర్తిచరోః - క్యఙ్). అర్ధమ్ = తనలోని సగ భాగమును, ఫలమ్ = ఆ తపస్సునకు ఫలముగాను. అర్ధమ్ = మిగిలిన సగభాగమును, ఫలదమ్ =ఫలప్రదాతగాను. చక్రే = ఒనర్చెను. (ఆర్య)

తాత్పర్యము :- శివుని శరీరము పార్వతితో తపస్సు చేయించి తనలోని సగభాగమును ఆ తపస్సునకు ఫలముగా సమర్పించినది. మిగిలిన సగభాగమును ఫల దాతగా నిల్పినది. (అర్ధనారీశ్వరుడు)

క్రియ :- డుకృఞ్ కరణే, ఆత్మనే, లిట్, ప్రథమ

చక్రే ,, చక్రాతే - చక్రిరే

సీతా :- (విహస్య తం ప్రతి సకౌతుకమ్) కతరస్మిన్పునః సన్నివేశే భగవత్యాః సర్వమంగళాయాః పాణిగ్రహణమంగళమాసీత్ ? (కదరస్సిం ఉణ సండివేసే భఅవదీఏ సవ్వమంగలాఏ పాణిగ్గహణమంగలం ఆసీ).

విభీషణః :- ఇదం పురస్తాదోషధిప్రస్థం నామ నగరాజనగరమ్. అత్ర హి —

సంప్రదాతరి మహౌషధీమయే భూధరే సుఖమువాహ పార్వతీమ్ ।
మూఢకంకణఫణీంద్ర నిర్భయాం తారకేశ్వరకిశోరశేఖరః ॥ 34

---

కతరస్మిన్నితి :- (విహస్య = నవ్వి. సకౌతుకమ్ = కుతుకత్వముతో, తం ప్రతి = విభీషణునుద్దేశించి) భగవత్యాః = భగవంతురాలగు. సర్వమంగళాయాః = పార్వతీదేవికి, పాణిగ్రహణమంగళమ్ = వివాహ మహోత్సవము. కతరస్మిన్ పునః — సన్నివేశే = ఏ ప్రదేశమునందు, ఆసీత్ = అయ్యెను ?

ఇదమితి :- ఇదమ్ = ఇదే. పురస్తాత్ = ఎట్టయెదుట. ఓషధిప్రస్థమ్ నామ = ఓషధిప్రస్థమనునట్టి. నగరాజ + నగరమ్ = హిమవంతుని రాజధాని. అత్రహి = ఇచ్చట గదా !

సమితి :- మహౌషధీమయే = గొప్పగొప్ప ఓషధీలతలతో నిండిన. భూధరే = హిమవంతుడు. సంప్రదాతరి = కన్యాదాతకాగా. తారకేశ్వరకిశోరశేఖరః = నెలవంకతాల్పు - శివుడు. మూఢ .... నిర్భయామ్ - మూఢ = అమాయకమైన. కంకణ ఫణీంద్ర = కంకణముగా నలంకరించిన సర్పమువలన, నిర్భయామ్ = భయరహితయైన. పార్వతీమ్ = గౌరిని. సుఖమ్ = అలజడి లేకుండ. ఉవాహ = చెట్టపట్టెను. (ముగ్ధకంకణ, గూఢకంకణ - అని పాఠాంతరములు) రథోద్ధతము.

తాత్పర్యము :- ఓషధీనిలయుడగు హిమాలయుడు కన్యాదాతగా సమీపమున నుండుటచే శివుని హస్తభూషణమగు సర్పము ఓషధుల గాలిసోకి బుసు కొట్టుట మాని చప్పబడినది. పార్వతీదేవి నిర్భయముగా చేయి అందించినది. శివుడు సుఖముగా పాణిగ్రహణము చేసెను.

రామః :- అం దేవి, ఇహైవ

పితరి నిజతుహినసంపత్కల్పితహేమంతవిభ్రమే గౌరీ।
నిర్మదభుజంగభూషణమభీషణం ప్రియకరం భేజే ॥ 35

---

సమాసములు :- కంకణరూపః ఫణీంద్రః — మూఢశ్చాసౌ ఫణీంద్రశ్చ- ఫణీంద్రాత్ నిష్ప్రియా - తామ్. తారకాణామీశ్వరః - తారకేశ్వరశ్చాసౌ కిశోరశ్చ — కిశోరః శేఖరః యస్య సః

క్రియ :- వహాఞ్ ప్రాపణే, లిట్. పరస్మై. ప్రథమ

ఉవాహ - ఊహతుః — ఊహుః

పితరీతి :- అమ్ = అవును. దేవి!, ఇహ ఏవ = ఇచ్చటనే — నిజ = తనయొక్క, తుహినసంపత్ = హిమసంపదచే, కల్పిత = కల్పింపబడిన, హేమంత విభ్రమే = హేమంత ఋతువిలాసము కలవాడగు, పితరి = తన తండ్రి హిమవంతుడు సమీపముననుండగా, గౌరీ = పార్వతీదేవి, నిర్మద = చలిచే మదము కోల్పోయిన (నిశ్చైతన్యముగానున్న), భుజంగ = సర్పమే, భూషణమ్ = కంకణముగా కలదియు, అభీషణమ్ = అందుచే భయముగొల్పనిదియునగు, ప్రియకరమ్ = శివుని చేతిని, భేజే = స్వీకరించెను - పాణిగ్రహణము చేసెననుట. (ఆర్యావృత్తము).

తాత్పర్యము :- తన హిమసమూహముతో నిత్యహేమంతమును కల్పించువాడైన హిమవంతుడు కన్యాదాతయై చెంగట నిలువగా గౌరీదేవి శివుని చెట్ట పట్టినది. చలికి బిగిసినపై శివుని సర్పభూషణములు గౌరీదేవిని భయపెట్టలేదు.

సమాసములు :- నిజ తుహిన సంపదా కల్పితః హేమంత విభ్రమః యస్య సః - తస్మిన్. హేమంతస్య విభ్రమః. నిర్మదశ్చాసౌ భుజంగశ్చ - భుజంగ ఏవ భూషణమ్ యస్య - తమ్. ప్రియస్య కరః - తమ్.

క్రియ :- భజఞ్ సేవాయామ్. ఆత్మనే. లిట్, ప్రథమ.

భేజే — భేజాతే — భేజిరే.

సీతా :- (సస్మితమ్) ఆర్యపుత్ర, అప్యేతస్మిన్నేవ మదనతను దహన వ్యతికర నిరాత్మీయః స్ఫుటమవిశ్వసన్త్యా గౌర్యా చంద్రచూడః సంఘటితో నిజశరీరేణ. (అజ్జఉత్త, అవిఏదస్సిం జేవ్వ మఅణ తణుడహణ వఇఅరణిరప్పణో ఫుడమవిస్ససన్తీఏ గోరీఏ చంద చూడో సంఘడిదో ణిఅసరీరేణ).

రామః :- (విహస్య) అం దేవి,

ఏతస్యాం హి తుషారభూధరశిరస్యేస్మిన్ప్రియార్థేన చ
స్వేనార్థేన చ తాదృశే పశుపతౌ వృత్తేఽర్ధనారీశ్వరే।

---

ఆర్యపుత్రేతి :- మదనతను = మన్మథ శరీరముయొక్క. దహన = దహన మనునట్టి. వ్యతికర = పనితో, నిరాత్మీయః = నిర్మముడైన. చంద్రచూడః= శివుడు - (విరసురాగుడు. విరసుడునసుట). స్ఫుటమ్ = స్పష్టముగా, అవిశ్వసంత్యా = విశ్వసింపనిదైన. గౌర్యా = పార్వతిచేతచే. నిజశరీరేణ = తన శరీరముతో (సగభాగ ముగా). సంఘటితః = సంఘటింపబడినవాడైనది, అపి ఏతస్మిన్ ఏవ = ఈ ప్రదేశము నందేనా ; అంత విరసుని తన శరీరమునను సంఘటించుట వింత యనుట.

ఏతస్యామితి :- (విహస్య=నవ్వి) అమ్ దేవి = అవును దేవీ ! ఏతస్యామ్ = ఈ, తుషారభూధర = హిమవత్పర్వతముయొక్క, శిరస్యేస్మిన్ = శిరోగ్ర భాగమునందు, పశుపతౌ = శివుడు, ప్రియార్థేన = ప్రియురాలగు పార్వతియొక్క శరీరపు సగభాగముతో, చ = మరియు, స్వేన = తన శరీరముయొక్క. అర్ధేన = సగ భాగముతోను, అర్ధనారీశ్వరే = అర్ధనారీశ్వరుడుగా, వృత్తే=ఏర్పడగా, తదా=అప్పుడు, గౌరీసఖీభిః = పార్వతి చెలికత్తెలచే, సప్రహాసనమ్ = వేళాకోళముగా (అంతటి ఘోర తపస్వి కాంతాదాసుడైనాడని), శేషేణ = మిగిలియున్న, అర్ధయుగేన=(రెండు సగము లతో) సగభాగముల జంటతో, దక్షిణవామయోః=కుడి ఎడమలయొక్క, వినిమయాత్= వినిమయమువలన (కుడిని ఎడమకు, ఎడమను కుడికి మార్చుటవలన), అన్యః = మరియొక, అర్ధనారీశ్వరః = అర్ధనారీశ్వరుడు, చక్రే = చేయబడెను. (శార్దూలము)

శేషేణార్ధయుగేన సప్రహసనం గౌరీసఖీభిస్తదా
చక్రే దక్షిణవామయోర్వినిమయాదన్యోऽర్ధనారీశ్వరః ॥ 36

అపిచ —

సంభోగానతిరిచ్యమానవిభవో యద్విప్రలంభో రస
స్తద్దివ్యం మిథునం పరస్పరపరిష్వ్యాతం నమస్కుర్మహే ।

---

తాత్పర్యము :- శి॥ హిమగిరిస్థుడై శివుడు పార్వతితో అర్ధనారీశ్వరుడైనాడు. పార్వతి చెలికత్తెలు విస్తుపోయిరి. మిగిలియున్న ఆ దంపతుల శేషార్ధభాగములను అటు నిటు మార్చి పరిహాసమునకై మరొక అర్ధనారీశ్వర రూపమును చేసిరి. పార్వతి ఎడమ భాగము - శివుని కుడి భాగము మొదటి అర్ధనారీశ్వరుడు కాగా దానికి ప్రతిబింబమునలె పార్వతి కుడిభాగము-శివుని ఎడమ భాగములు అటు నిటు మారి కలిసి మరొక అర్ధనారీశ్వరుడు ఏర్పడెను. దాంపత్యమునకు రెండు ప్రతిబింబభావము ఈ సృష్టియనుట.

సమాసములు -: తుషారమయః భూధరః — భూధరస్య శిరః — శిరసః సీమ — తస్మిన్. ధరతీతి ధరః — భువః ధరః — భూధరః. ప్రియాయాః అర్ధః — తేన. పశూనాం పతిః—తస్మిన్ అర్ధం నార్యాః—అర్ధనారీ ఈశ్వరో యస్య సః—అర్ధనారీశ్వరః—తస్మిన్. అర్ధానాం యుగమ్ - తేన. ప్రహసనేన సహితం యథా భవతి తథా — స ప్రహసనమ్. గౌర్యాః సఖ్యః — తాభిః దక్షిణశ్చ వామశ్చ — తయోః.

సంధులు :- ప్రియా + అర్ధేన, స్వేన + అర్ధేన. అర్ధనారీ + ఈశ్వరే, శేషేణ + అర్ధ — సవర్ణదీర్ఘ. వృత్తే + అర్ధ — పూర్వరూప. సఖీభిః + తదా — సాదేశ విసర్గ. వామయోః + వినిమయాత్ — రేఫాదేశవిసర్గ. అన్యః + అర్ధ — ఉత్వాదేశవిసర్గ. అన్యో + అర్ధ — పూర్వరూప.

క్రియ :- డుకృఞ్ కరణే. ఆత్మనే. లిట్. ప్రథమ
చక్రే - చక్రాతే - చక్రిరే

సంభోగేతి :- అపిచ = మరియు - యత్ = ఏ జంటయొక్క, విప్రలంభః రసః = విప్రలంభ శృంగారరసము. సంభోగ = సంభోగ. శృంగారముకంటె. అనతిరిచ్యమాన విభవః = అతిశయింపని విభవముకలదియగునో - అర్ధనారీశ్వరరూపమున పార్వతి

ఏకస్యాః ప్రతిబింబసంభృతవిపర్యాసే ముహుర్దర్పణే
సవ్యాంగస్థితికౌతుకం శమయతి స్వామీ స యత్రాపరః ॥ 37

---

పరమేశ్వరుల విప్రలంభము సంభోగ స్థితికంటె భిన్నముకాదు - ఎడబాటు అసంభవము గనుక; తత్ = ఆ. పరస్పర పరిస్యూతమ్=ఒండొంటితో గుదిగ్రుచ్చబడిన. దివ్యమ్= దివ్యమైన. మిథునమ్ = జంటను. నమస్కుర్మహే = నమస్కరింతుము. యత్ర = ఏ మిథునరూపమునందు, ఏకస్యాః = సగభాగమైన స్త్రీయొక్క (పార్వతియొక్క)' సవ్యాంగస్థితికౌతుకమ్ - సవ్యాంగ = దక్షిణభాగమునందు. స్థితి = నివసించుట యను, కౌతుకమ్ = కుతూహలమును — ఎల్లప్పుడును అప్రధానమగు శః ఎడమవైపున నుండుటేనా కుడిభాగము నేలకారాదని పార్వతి కుతూహలము; అపరః = మరియొక సగభాగమైన, సః = ఆ పురుషుడగు. స్వామీ = శంకరుడు. ప్రతిబింబ సంభృత విపర్యాసే - ప్రతిబింబ = ప్రతిబింబమునందు. సంభృత = వహింపబడిన. విపర్యాసే= తారుమారుస్థితి కలదైన. దర్పణే = అద్దమునందు. ముహుః = మాటిమాటికిని (అట్లలిగి నప్పుడెల్ల అద్దముచూపి యనుట) శమయతి = కౌతుకమును చల్లార్చుచున్నాడు — అట్టి దివ్యం మిథునం నమస్కుర్మహే అని అన్వయము. (శార్దూలము)

తాత్పర్యము :- ఓ జానకీ! అర్ధనారీశ్వరులు విప్రలంభమెరుగని దివ్య మిథునము. వారి విప్రలంభము సంభోగభిన్నము కానేరదు. కానీ పార్వతీదేవి - నేనెల్లప్పుడీ వామభాగమున నుండుటేనా కుడివైపునకు మారుటకు నోచనా - అని అప్పుడప్పుడు అలుగుచుండును. అప్పుడు శివుడు (శివభాగము) అద్దము నొద్దకు గొంపోయి చూపును. దర్పణమునందలి ప్రతిబింబమునందు తాను కుడిభాగముగా నుండుట చూచి పార్వతి శాంతించును.

సమాసములు :- సంభోగాత్ అనతిరిచ్యమానః విభవః యస్యసః. ప్రతిబింబే సంభృతః - సంభృతో విపర్యాసో యస్మిన్ - తస్మిన్. సవ్యాంగే స్థితిః - స్థితౌ కౌతుకమ్.

సంధులు :- విభవః + యత్. విప్రలంభః + రసః - ఉత్వాదేశవిసర్గ. రసః + తత్ - సాదేశవిసర్గ. ముహుః + దర్పణే - రేఫాదేశ విసర్గ. సః + యత్ర— తదేతద్విసర్గలోప.

విభీషణః :- దేవ,

స్వచ్ఛందైకస్తనశ్రీరుభయమతమిళన్మౌళిచంద్రః ఫణీంద్ర
ప్రాచీనావీతవాహీ సుఖయతు భగవానర్ధనారీశ్వరో వః ।

---

క్రియ :- డుకృఞ్ కరణే. ఆత్మనే. లట్. ఉత్తమ
కుర్వే — కుర్వహే — కుర్మహే
శము ఉపశమే (ణిచ్) పరస్మై. లట్. ప్రథమ
శమయతి — శమయతః — శమయన్తి.

స్వచ్ఛందేతి :- దేవ = మహారాజా । యస్య = ఏ అర్ధనారీశ్వర దేహము యొక్క, అర్ధే = ఒక సగభాగమునందు. విశ్వ = ప్రపంచమును. దాహ = భస్మము చేయుటన్న. వ్యసన = ఆసక్తితో. విస్మమర = ప్రసరించు స్వభావము గల. జ్వాలః = వెలుగుకలదైన. చక్షుః = నేత్రము (విద్యతే = ఒప్పుచున్నదో): అర్ధే = మరియొక సగభాగమునందు (పార్వతి). కృపా = కరుణతో. ఉద్యత్ = పెల్లుబుకుచున్న, బాష్పమ్ = కన్నీరుకలదైన. చక్షుః విద్యతే = నేత్రమున్నదో. అన్యోన్యతః = రెండు నేత్రముల యొక్క, వేగ = వేగముచేసైన. ప్రహతి = తాకిడితో (రాపిడితోనని గాని). సిమసిమా కారి = సిమ సిమ ధ్వని చేయుచున్న. తృతీయమ్ = మూడవదియగు. చక్షుః = నేత్రము. విద్యతే = విరాజిల్లుచున్నదో; అటువంటి అర్ధనారీస్వరూపము. చ = మరియు. స్వచ్ఛంద = స్వతంత్రమై. ఏక = అద్వితీయమైన, స్తన = వక్షోజముయొక్క. శ్రీః = శోభతో కూడినవాడును, ఉభయమత = ఉభయ భాగములకు సమ్మతమై (ఉభయదిశ అని పాఠాంతరము. రెండు భాగములకు నని యర్థము). మిళత్ = కలిసియొప్పుచున్న, మౌళిచంద్రః = మౌళిభాగచంద్రరేఖ కలవాడును, ఫణీంద్ర = సర్పరాజమే, ప్రాచీనావీత = దక్షిణభాగ యజ్ఞోపవీతముగా, వాహీ = వహించువాడును; (ఉపవీతం యజ్ఞసూత్రం ప్రోద్ధృతే దక్షిణే కరే. ప్రాచీనావీతమన్యస్మిన్. నివీతం కంఠలంబితమ్ — అమరః), అయిన, భగవాన్ = భగవంతుడగు. అర్ధనారీశ్వరః = అర్ధనారీశ్వరుడు. వః = మిమ్ము. సుఖయతు = ఆనందింపజేయుగాక । (స్రగ్ధర)

తాత్పర్యము :- ఒకే వక్షోజముతోను ఉభయభాగములకు సమ్మతమైన చంద్రరేఖతోను సర్పయజ్ఞోపవీతముతోను విరాజిల్లు అర్ధనారీశ్వరుడు మిమ్ము ఆనందింప

యస్యార్ధే విశ్వదాహవ్యసనవిసృమరజ్యోతిరర్ధే కృపోద్య
ద్బాష్పం చాన్యోన్యవేగప్రహతిసిమసిమాకారి చక్షుస్తృతీయమ్ ॥ 38

అపిచ—

స్వేదార్ద్రవామకుచమండల పత్త్రభంగ
సంశోషిదక్షిణకరాంగుళిభస్మరేణుః ।

---

జేయునుగాక। శివభాగమునందలి నేత్రము విశ్వదహనమునకు త్వరపడుచుండగా శివా భాగమునందలి నేత్రము కృపతో చెమర్చుచుండగా రెండింటి తాకిడితో ఫాలభాగము నందలి వహ్నిమయనేత్రము సిమ సిమ లాడుచున్నది.

సమాసములు :- ఏకశ్చాసౌ స్తనశ్చ శ్రీః - స్వచ్ఛందా ఏకస్తనశ్రీః యస్యాః. ఉభయోరపి శశాంకశకలచంద్రః యస్యసః. ఫణీంద్ర ఏవ ప్రాచీనావీతమ్ - తద్వహతి శీలమస్యేతి. విశ్వస్య దాహః-దాహే వ్యసనమ్-వ్యసనేన విసృమరమ్-జ్యోతిర్యస్మిన్ తత్. కృపయా ఉద్యద్బాష్పం యస్మిన్ తత్. అన్యోన్యస్య వేగః - వేగయోః ప్రహతిః - ప్రహతినా సిమ సిమాకారం యస్య తత్.

సంధులు :- స్వచ్ఛంద + ఏక - వృద్ధి. శ్రీః + ఉభయ. జ్యోతిః + అర్ధే - రేఫాదేశ విసర్గ. ఈశ్వరః + వః - సత్వాదేశవిసర్గ. చక్షుః + తృతీయమ్ - సాదేశవిసర్గ.

స్వేదేతి :- అపిచ = మరియు. స్వేద = సాత్త్వికస్వేదముచే. ఆర్ద్ర = చెమ్మగిల్లిన. వామకుచమండల = వామభాగపు వక్షోజముపైనున్న. పత్త్రభంగ = మకరికాపత్రవల్లీరచనను (విశేషరచనను). సంశోషి = ఆర్ద్రతారహితమొనర్చు. దక్షిణ కరాంగుళిభస్మరేణుః - దక్షిణకర = కుడిచేతియొక్క. అంగుళి = వ్రేళులనుండి జారి పడుచున్న (అంగుళులకు చెందిన). భస్మరేణుః = విభూతిధూళి కలదియు - పత్త్రభంగ ముల ఆర్ద్రతను విభూతిధూళి తొలగించుచున్నదనుట. స్త్రీపుం నపుంసకపద = మూడు లింగములను. వ్యతిలంఘిసి = అతిక్రమించునదియు - ఈ మూడింటిలో ఏదియు కానిదనుట. చతుర్థ = నాల్గవదియగు. ప్రకృతిః = లింగమునైన - ఇది నాల్గవ లింగ మనుట. (ప్రకృతిర్యోనిలింగయోః - విశ్వః) శంభోః వపుః = అర్ధనారీశ్వరుడగు శివుని స్వరూపము. వః = మిమ్ము సుఖయతు = ఆనందింపజేయుగాక। (వసంత తిలకము వృత్తము).

అధారీకృతకూర్మపృష్ఠకషణప్రక్షీణమూలోఽధునా
జానీమః పరతః పయోధిమథనాదుచ్చైస్తరోఽయం గిరిః ॥ 40

రామః :- (సిర్వర్ణ్య సస్మితమ్)
తత్తాదృక్ఫణిరాజరజ్జుకషణం సంబాధపక్షచ్ఛిదా
ఘాతాదింతుదమప్యహో కథమయం మంథాచలః సోఢవాన్ ।

---

తాత్పర్యము :- సముద్రమథన సమయమున మందరాచలమును విష్ణుమూర్తి తన భుజములపై మోసెనందురు. అప్పుడాతని కేయూర వజ్రములు ఒరిసికొని మందరాద్రిపై గీటులు పడినవి. అవి కొండపై త్రివళులవలె నున్నవి. అదే సమయమున అది కూర్మము వీపుపై ఒరిసికొని మందర పర్వత మూలభాగము తరిగిపోయినది. క్షీర సముద్ర మథనమునకు పూర్వకాలమున ఈ పర్వతము ఇంతకంటె ఎత్తుగా నుండెడిదని ఇప్పుడు గ్రహించుచున్నాము.

సమాసములు :- దనోః సూనుః - సూనూనాం సూదనః - సూదనస్య భుజౌ-భుజయోః కేయూరాణి-కేయూరాణాం వజ్రాంకురాః-అంకురాణాం వ్యూహః-వ్యూహేన వ్యూహస్య వా ఉల్లేఖః - ఉల్లేఖస్య పదావళీ - పదావళ్యః ఏవ వళయః - తస్మిన్ మైః. ఆధారీకృతశ్చ అసౌ కూర్మపృష్ఠశ్చ - పృష్ఠస్య పృష్ఠే వా కషణమ్ - కషణాత్ ప్రక్షీణం మూలం యస్య సః.

సంధులు :- ఉత్ + లేఖ „ లాదేశ. మధ్యైః + అంగైః + ముదమ్ - లేఖాదేశవిసర్గ. మూలః + అధునా - ఉత్వాదేశవిసర్గ - మూలో + అధునా - పూర్వరూప. తరః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - తరో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః ఆత్మనే. లట్. ప్రథమ
ధత్తే - దధాతే - దధతే
జ్ఞా అవబోధనే. లట్. పరస్మై. ఉత్తమ
జానామి - జానీవః - జానీమః

తద్ధాదృక్పగితి :- అయమ్ = ఈ. మంథాచలః=మందరాద్రి. తత్తాదృక్= అంతటిదగు (అటువంటిది - చెప్పనలవికానిదనుట). ఫణిరాజరజ్జు కషణమ్ - ఫణిరాజ = వాసుకి అనుసట్టి, రజ్జు = త్రాడు యొక్క. కషణమ్ = ఒరిపిడిని,

ఏతేనైవ దురాత్మనా జలనిధేరుత్థాప్య పాపామిమాం
లక్ష్మీమీశ్వరదుర్గతవ్యవహృతివ్యస్తం జగన్నిర్మితమ్ ॥ 41

సీతా :- (సోద్వేగమ్) అనేనైవ మన్థశేషీకృతదుగ్ధసాగరేణ చంద్ర
ముద్ధృత్య ప్రోషితభర్తృకస్య స్త్రీజనస్యోపరి క్షారహాలీ విస్తీర్ణా.

---

సంరూఢ = మానిపోయిన. పక్షచ్ఛిదాఘాత=రెక్కలు విరిగిన గాయములు. అరుంతుదమ్ అపి = మిక్కిలి వ్యధను కలిగించునదే అయినప్పటికిని, కథమ్ సోఢవాన్=ఎట్లు ఓర్చుకొనినాడో ! రెక్కలు ఖండింపబడినవి. ఆ గాయములు మానుపట్టినవి. అయినను ఆ మచ్చలపై ఒరిపిడి మరింత బాధగానుండును. దానినిసైతం ఓర్చుకొన్నాడని ఆశ్చర్యము. ఏతేన = ఈ. దురాత్మనా ఏవ = దుర్మార్గునిచేతనే. జలనిధేః = సముద్రమునుండి. ఇమామ్ = ఈ. పాపామ్ = పాపాత్మురాలగు. లక్ష్మీమ్ = లక్ష్మీదేవిని. ఉత్థాప్య = పైకి తీసి. జగత్ = ఈ ప్రపంచము. ఈశ్వర ... వ్యస్తమ్. ఈశ్వర = ధనవంతుడు. దుర్గత=దరిద్రుడు అనునట్టి. వ్యవహృతి=వ్యవహారముతో. వ్యస్తమ్= అస్తవ్యస్తముగా. నిర్మితమ్ = తయారు చేయబడినది. (శార్దూలము).

తాత్పర్యము :- క్రొత్త తోలుపట్టి అప్పుడప్పుడే మానిన గాయములు అధికబాధను కల్పించుచున్నను ఈ మంథాచలుడు విస్తృతమగు ఒరిపిడిని (వాసుకి) ఎట్లు ఓర్చుకొన్నాడో కదా !. సముద్రము నుండి లక్ష్మీదేవిని పైకి తీసి మొత్తము జగత్తును ఉన్నవాడు లేనివాడు అను భేదములతో అస్తవ్యస్తమొనర్చిన దుర్మార్గుడు నీతడే.

సమాసములు :- ఫణిరాజ ఏవ రజ్జుః – రజ్జోః కషణమ్. సంరూఢాశ్చతే పక్షచ్ఛిదాఘాతాశ్చ – ఆఘాతానా మరుంతుదమ్. ఈశ్వరాశ్చ దుర్గతాశ్చ – ఈశ్వర దుర్గతా ఇతి వ్యవహృతిః – వ్యవహృత్యా వ్యస్తమ్.

సంధులు :- అపి + అహో – యణాదేశ. ఏతేన + ఏవ = వృద్ధి. నిధేః + ఉత్థాప్య – రేఫాదేశవిసర్గ. జగత్ + నిర్మితమ్ – అనునాసికాదేశ.

అనేనేతి :- (సోద్వేగమ్=ఉద్వేగముతో) మన్థశేషీకృతదుగ్ధ సాగరేణ= క్షీర సముద్రమును నిస్సారమొనర్చినవాడగు. అనేన ఏవ = ఈ మందర పర్వతము చేతనే, చంద్రమ్ ఉద్ధృత్య = చంద్రుని (సముద్రమునుండి) పైకి తీసి, ప్రోషిత

(ఇమిణా క్ఖీరస్స మత్థుసేసీకిదదుద్ధసాఅరేణ చందముద్ధరిఅ
పఉసిదభత్తిఆ ఇత్థిఆజణస్స ఉవరి చారహాలీ విత్థిణ్ణా).

(సర్వే హసన్తి)

విభీషణః :- (తదేవ రామసూక్తం భావయన్) అహహ ।

ప్రక్షేప్తుముదధౌ లక్ష్మీం భూయోఽపి వలతే మనః ।

---

భర్తృకస్య స్త్రీజనస్య ఉపరి = భర్త దూర ప్రాంతములో నుండుటచే విరహిణులగు స్త్రీలపై. చారహాలీ = పౌరుషము. విస్తీర్ణా = విస్తరింపబడినది. (మస్తు అనగా వెన్న చిలుకగా మిగిలిన మజ్జిగనీళ్ళు. మండం దధిభవం మస్తు - అమరము. చారహాలీ అనునది పౌరుషపర్యాయమగు దేశ్యపదమని వ్యాఖ్యాతలు. సీతను ప్రోషితభర్తృక యనుటకు - రామదాసస్మృతి కాదని - సంశయించినవారు తొమ్మిదవ నాయికాభేదముగా పరిగణించిరి. కాని సీతను భర్తకు దూరముగా నున్న కాంత ప్రోషిత భర్తృక అని భావించుడు - నానాకార్యవశాద్యస్యాః పతిర్దేశాంతరం గతః దత్త్వావధిం భృశార్తా సా భవేత్ ప్రోషితభర్తృకా).

(సర్వే = అందరును, హసన్తి = నవ్వుదురు)

ప్రక్షేప్తుమితి :- (తదేవ = అదే, రామసూక్తమ్ = రామవచనమును. భావయన్ = ఆలోచించుచు) లక్ష్మీమ్ = ఉన్నవాడు లేనివాడు అని భేదభావమునకు కారణమైన లక్ష్మీదేవిని, భూయః = తిరిగి, ఉదధౌ = సముద్రమునందు, ప్రక్షేప్తుమ్ = విసిరివేయుటకు. మనః = మనస్సు. వలతే = ఉన్ముఖమగుచున్నది. కిన్తు = కానీ, అయమ్ = లక్ష్మీదేవికి తోబుట్టువయిన ఈ, చంద్రమాః = చంద్రుడు. ప్రక్షిప్తః ఏవ = సముద్రమునందు విసిరివేయబడినవాడే అయినను. పునః ఆయాతి = తిరిగి ఉదయించుచున్నాడు. (పశ్చాత్తాపము)

తాత్పర్యము :— ఉన్నవాడు లేనివాడు అను భేదభావమునకు కారణమైన ఈ లక్ష్మీదేవిని తిరిగి సముద్రములోనికి విసిరివేయవలెనని నా మనస్సు ఉబలాట పడుచున్నది. కాని సముద్రములోనికి విసిరివేయబడిన చంద్రుడు తిరిగి ఉదయించుచున్నట్లే ఈమెయు మరల పెంచేయునని విరమించుచున్నాను.

కిన్తు ప్రక్షిప్త ఏవాయం పునరాయాతి చన్ద్రమాః ॥ 42

(విమృశ్య ఆకాశే)

కస్మైచిత్కపటాయ కైటభరిపోరఃపీఠదీర్ఘాలయాం
దేవి త్వామభివాద్య కుప్యసి న చేత్తత్కించిదాచక్ష్మహే ।
యత్తే మందిరమంబుజన్మ కిమిదం విద్యాగృహం యుచ్యతే
నీచాన్నీచతరోపసర్పణమపామేతత్కిమాచార్యకమ్ ॥ 43

---

సంధులు :- యాయః + అపి - ఉత్వాదేశసంధి. యాయో + అపి - పూర్వరూప. ఏవ + అయమ్ - సవర్ణదీర్ఘ. ప్రక్షిప్తః + ఏవ - విసర్గలోప.

క్రియ :- వలజ్ సంవరణే సంచలనే చ. లట్. ఆత్మనే. ప్రథమ.
వలతే - వలేతే - వలన్తే

(విమృశ్య = మరికొంత ఆలోచించి, ఆకాశే = ఆకాశమునందు దృష్టినిల్పి)

కస్మై ఇతి :- దేవి = ఓ లక్ష్మీ! కస్మైచిత్ = ఏదో ఒక. కపటాయ = మోసమునకై. కైటభరిపు = విష్ణుమూర్తియొక్క. వక్షఃపీఠ = వక్షఃస్థలమునే. దీర్ఘ + ఆలయామ్ = చిరనివాసముగా స్వీకరించినదానవగు. త్వామ్ = నిన్ను. అభివాద్య = నమస్కరించి. నకుప్యసిచేత్ = కోపింపనందువేని. కించిత్ = ఒక్కింత. ఆచక్ష్మహే = భాషింతుము: తే = నీయొక్క. మందిరమ్ = గృహముగు. అంబుజన్మ = జలజము (కమలము). ఇదమ్ = ఇదే. విద్యాగృహమ్ కిమ్ = నీ పాఠశాలయునా! చ = మరియు. నీచాత్ నీచతర + ఉపసర్పణమ్ = నీచమునుండి (పల్లము) మరింత నీచమునకు ప్రవహించు లక్షణము. ఏతత్ = ఇది. అపామ్ = (నీ జన్మహేతువులగు) జలములయొక్క. ఆచార్యకమ్ = ఆచార్యత్వమా! నీకు గురువులై నేర్పెనా అనుట (శాస్త్రాలను)

తాత్పర్యము :- ఓ లక్ష్మీ! విష్ణుమూర్తి వక్షఃస్థలమునందు నీవు చాల కాలముగా నివసించుచున్నావు. ఇది నీ చంచల స్వభావమునకు విరుద్ధము. మరి ఏ మోసమునకై ఇట్లు నివసించుచున్నావో! ఇంతకును నీవు కోపింపనందువేని ఒక్క మాట - నీ నివాసమగు పద్మమే నీకు విద్యాగృహమునా! (రహస్యవిలటకములందును) నీచమునుండి మరింత నీచమునకు పోవు నీ లక్షణమును జలమునుండి నేర్చు కొంటివా! పుట్టింటివారు నేర్పిరా అనుట.

లక్ష్మణః :- (సహాసమ్) హన్త. సురాసురమల్లఘటీతూర్యతాళనరక్తీ. సకలరాజకులధిక్కారకణ్డూలా. సాహసికజనసహస్రశస్త్రాన్ధకారఖేలనఖద్యోతీ. మధుమథనజీమూతవిలాసవిద్యుల్లతా కిమేవముపాలభ్యతే. ఇయం హి —

గుణవద్భిస్సహ సంగమముచ్చైః పదమాప్తుముత్సుకా లక్ష్మీః ।

---

సంధులు :- రిపు + ఉరః. దీర్ఘ + అలయామ్ - సవర్ణదీర్ఘ. యత్ + చ - శ్చుత్వసంధి. సిదాత్ + సిద - అనునాసికాదేశ. నీచతర + ఉపసర్పణమ్ - గుణసంధి.

ప్రక్రియ :- కుప క్రోధే (శ్యన్). లట్. పరస్మై. మధ్యమ
కుప్యసి - కుప్యథః - కుప్యథ
చక్షిఙ్ వ్యక్తాయాం వాచి. లట్. ఆత్మనే. ఉత్తమ (ఆఙ్)
ఆచక్షే - ఆచక్ష్వహే - ఆచక్ష్మహే

హన్తేతి :- (సహాసమ్=నవ్వుచు) హన్త=అయ్యో । సురాసురమల్ల = దేవదానవ వీరులచే నైన, ఘటీతూర్య = (రణరంగమున ప్రయోగించు) వాద్య విశేషము యొక్క. తాళ = తాళనమునకు, రక్తీ = నట్టువరాలును, సకలరాజకుల = సమస్త రాజసమూహమునకు. ధిక్కార = మోసగించుట యనునట్టి, కణ్డూలా = కండూతి కలదియు, సాహసిక = సాహసమే జీవనముగా గల్గిన, జనసహస్ర = వీర సమూహముయొక్క. శస్త్ర = ఆయుధములచే కల్పింపబడిన, అంధకార = చీకటియందు. ఖేలన=విలాసముగా ఎగురునట్టి. ఖద్యోతీ = మిణుగురువంటిదియు, మధుమథన = మధుసూదనుడనునట్టి. జీమూత = మేఘమునకు విలాస=శోభాకరమగు, విద్యుల్లతా=మెఱుపుతీగవంటిదియు (విష్ణువను మేఘమునందు విలాస విద్యుల్లతయనుట) అయిన లక్ష్మీదేవి, కిమ్ ఏవమ్ ఉపాలభ్యతే = ఇట్లు నిందింపబడుచున్నదేమి । ఇయమ్ హి = ఈమె కదా । —

గుణవదితి :- వీర = మహావీరులయొక్క. కరవాల = ఖడ్గమే, వసతిః = నివాసముగా కల. లక్ష్మీః = ఈ లక్ష్మీదేవి, గుణవద్భిః సహ = గుణవంతులతో. సంగమమ్ = కలియుటయే, ఉచ్చైః పదమ్ = ఉన్నత పదముగా, ఆప్తుమ్ =

వీరకరవాలవసతిర్ధ్రువమసిధారావ్రతం చరతి ॥ 44

సీతా :- ( సాభ్యసూయమివ ) నిజదైవదుర్విలాసవిచారాలసో లోకో లక్ష్మీదేవ్యా దుర్యశోవచనాని గాయతి. (పురో దర్శయన్తీ) క ఏష దృశ్యతే దివసకూటీకృతజ్యోత్స్నావివర్తప్రతిరూపో గిరిః. (ణిఅ దేవ్వ దువ్విలాస విఆరాలసో లోఓ లచ్ఛీదేవిఏ దుజ్జస వఅణాఇం గాఏది. కో ఏసో దీసది దిఅసకూడీకిద జోణ్హావివట్ట పడిరూవో గిరీ).

విభీషణః :- దేవి.

---

పొందుటకు. ఉత్సుకా = కోరిక కలదై - ఆ ఉన్నతస్థానమును పొందగోరియనుట. అసిధారావ్రతమ్ = అసిధారావ్రతమును (వీరకరవాలాగ్ర నివాసమునను.ట). చరతి = ఆచరించుచున్నది. ధ్రువమ్ = ఇది నిశ్చయము. (ఆర్యావృత్తము).

తాత్పర్యము :- గుణవంతులను చేరుటయే ఉన్నతపదముగా భావించి ఈ లక్ష్మీదేవి వీరుల ఖడ్గాగ్రములయందు తన నివాసమును అసిధారావ్రతముగా కొనసాగించుచున్నది.

క్రియ :- చర గతిభక్షణయోః. లట్. పరస్మై. ప్రథమ
చరతి - చరతః - చరన్తి

నిజేతి :- (సాభ్యసూయమ్ ఇవ = అసూయతోవలె) లోకః = ప్రజ. నిజ=తనయొక్క. దైవ దుర్విలాస=దైవ దుర్విపాకమునకు సంబంధించిన. విచార= ఆలోచనపట్ల. అలసః = అసమర్థమై తన దుర్విధిని గుర్తింపనిదై అనుట. లక్ష్మీ దేవ్యాః = లక్ష్మీదేవికి, దుర్యశోవచనాని=అపకీర్తికరములగు వాక్కులను. గాయతి= ఉచ్చైః స్వరముతో పలుకుచున్నది. (పురః = ముందునకు. దర్శయన్తీ = చూపుచు) దివసకూటీకృత = దివసములు రాసిపోసినట్లున్న. జ్యోత్స్నా వివర్త = వెన్నెల సమూహముయొక్క. ప్రతిరూపః = ప్రతిబింబమై. దృశ్యతే = కనబడుచున్నది. ఏషః గిరిః కః = ఈ పర్వతమేమి?

సోఽయమితి :- దేవి=మహారాజ్ఞీ! సః అయమ్=ఈ కన్పించుచున్నది, కైలాసశైలః=కైలాస పర్వతము, యత్ర = ఏ యీ కైలాసమునందు. పాద

సోఽయం కైలాసశైలః స్ఫటికమణిభువామంశుజాలైర్జ్వలద్భి
శ్ఛాయా పీతాపి యత్ర ప్రతికృతిభిరుపస్థాప్యతే పాదపానామ్ ।
యత్రోపాంతోపసర్పత్తపనకరధృతస్యాపి పద్మస్య ముద్రా
ముద్రామానో దిశన్తి త్రిపురహరశిరశ్చంద్రలేఖామయూఖాః ॥ 45

---

పానామ్ = వృక్షములయొక్క. ఛాయా = నీడ. స్ఫటిక మణిభువామ్ = స్ఫాటిక శిలల యొక్క, జ్వలద్భిః = ప్రకాశించుచున్న. అంశుజాలైః = కాంతిపుంజములతో. పీతా అపి = [illegible]. ప్రతికృతిభిః = ప్రతిబింబములతో, ఉపస్థాప్యతే = ప్రతిబింబించబడుచున్నవి. యత్ర = ఏ పర్వతమునందు. ఉపాంత = సమీపమున. ఉప సర్పత్ = [illegible]. తపన = సూర్యునియొక్క. కర = కిరణములచే, ధృతస్య అపి = [illegible] (పోషింపబడిన దనుట). పద్మస్య=పద్మమునకు. త్రిపురహర = శివునియొక్క. శిరః = శిరస్సునందున్న. చంద్రలేఖా మయూఖాః = చంద్రుని కిరణములు. ఉద్దామానః = అతిశయించినవై-అతి స్వచ్ఛములై, ముద్రామ్= ముకుళితావమును (ముడుచుకొనిపోవుట). దిశన్తి=కల్గించుచున్నవి. (స్రగ్ధరావృత్తము)

తాత్పర్యము :- ఈ కనిపించుచున్నది కైలాసపర్వతము. దీనిపై నున్న చెట్లనీడలు స్ఫటికమణికాంతులలో అదృశ్యమైపోవుచున్నవి. కానీ చెట్ల ప్రతిబింబములు మాత్ర మేర్పడుచున్నవి. ఈ గిరిపై నున్న పద్మములు సూర్యకిరణములకు వికసించియు, శివుని తలపై నున్న చంద్రరేఖయొక్క వెన్నెలలు సోకి ముకుళించుకొనుచున్నవి.

సమాసములు :- కైలాసాఖ్యః శైలః. స్ఫటికమణిభ్యః భవన్తి - తేషామ్. అంశూనాం జాలః - తైః. ఉపాంతాదుపసర్పతి (ఉపాంతేవా) ఉపసర్పంశ్చాసౌ తపనశ్చ - తపనస్య కరాః - కరైః ధృతమ్ - తస్య. త్రిపురాణాం హరః - హరస్య శిరః - శిరసి విద్యమానా (చంద్రస్యలేఖా) చంద్రలేఖా - లేఖాయాః మయూఖాః.

సంధులు :- సః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ. సో + అయమ్ - పూర్వరూప. జాలైః + జ్వలద్భిః - రేఫాదేశవిసర్గ. జ్వలద్భిః + ఛాయా - శాదేశవిసర్గ. యత్ర + ఉపాన్త + ఉపసర్పత్ - గుణసంధి. ధృతస్య + అపి - సవర్ణదీర్ఘ. ఉద్దామానః + దిశన్తి - ఉత్వాదేశవిసర్గ. శిరః + చంద్ర - శాదేశవిసర్గ.

రామః :- హన్త. శతధా దృశ్యమానోఽపి న చక్షుషః కౌతుకం కరోతి.

గిరిః కైలాసోఽయం దశవదనకేయూరవిలస
న్మణిశ్రేణీ పత్త్రాఙ్కురమకరముద్రాఙ్కితశిలః ।

---

క్రియ :- ష్ఠా గతి నివృత్తౌ (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ
స్థాప్యతే - స్థాప్యేతే - స్థాప్యన్తే
దిశఀ అతిసర్జనే, లట్. పరస్మై. ప్రథమ
దిశతి - దిశతః - దిశన్తి

హన్తేతి :- హన్త = ఆశ్చర్యము । శతధా = నూరుమార్లు. దృశ్యమానః అపి = చూడబడినదయ్యు. చక్షుఃకౌతుకమ్ = నేత్రములకు కౌతుకి సంతృప్తిని. న కరోతి = కల్పింపకున్నది - ఎన్నిపర్యాయములు చూచినను కన్నులు తృప్తి పడవనుట.

గిరిరితి :- అయమ్ = ఈ కన్పించుచున్న. కైలాసః = కైలాసమనునట్టి. గిరిః=పర్వతము. దశవదన = రావణునియొక్క. కేయూర=బాహుభూషణములయొక్క (అంగదములు). విలసత్ = ప్రకాశించుచున్న. మణిశ్రేణీ = మణిసమూహముచేనైన. పత్త్రాంకురమకరముద్రా = మకరికాపత్రాకారముద్రలతో (మణులు ఒరిసికొని మకరికా పత్రములవలె గుర్తు లేర్పడిన వనుట). అంకిత = గుర్తులు పొందిన. శిలః = శిలలు కలదైనది. స్ఫటికమయ = స్ఫటికమయమైన. సర్వాంగ=సర్వభాగములతో. విమలే= మలినరహితమైన. అముష్మిన్ = ఈ పర్వతమునందు. ఆరుహ్య = అధిరోహించి. యక్షాః = యక్షులు. ఫణిపతిపురస్య అపి = నాగలోకముయొక్కయు. చరితమ్ = వృత్తాంతమును. నిరీక్షన్తే = తిలకించుచున్నారు. (శిఖరిణి)

తాత్పర్యము :- ఒకప్పుడు ఈ కైలాసమును రావణుడు తన భుజములపై కెత్తుకొన్నాడు. అప్పు డాతవి భుజాభూషణముల మణులు ఒరిసికొని మకరికాపత్రముల వంటి ముద్రలు దీని శిలలపై నేర్పడినవి. స్ఫటికములతో స్వచ్ఛమైన ఈ గిరినెక్కి యక్షులు నాగలోకమును గూడ తిలకింతురు. అధోలోకము దీని స్ఫటికమణులలో ప్రతిబింబించుననుట.

అముష్మిన్నారుహ్య స్ఫటికమయ సర్వాంగ విమలే
పరీక్షన్తే యక్షాః ఫణిపతిపురస్యాపి చరితమ్ ॥ 46

అపిచ....

దశముఖభుజదండమండలీనాం
దృఢపరిపీడన పీతమేఖలో౽యమ్।

---

సమాసములు :- దశముఖస్య కేయూరాణి - కేయూరేషు విలసన్తి చ తా మణిశ్రేణయః - శ్రేణిభిః పత్రాంకురమకరముద్రాః - ముద్రాభిః అంకితాః - అంకితాశ్చ తే శిలాః యస్మిన్ సః. స్ఫటికమయాని చ తాని సర్వాంగాణి - సర్వాంగైః విమలమ్ - తస్మిన్. ఫణీనాం పతిః - పతేః పురమ్ - తస్య.

సంధులు :- కైలాసః + అయమ్-ఉత్వాదేశవిసర్గ కైలాసో + అయమ్-పూర్వరూపం. విలసత్ + మణి-అనునాసికాదేశ. పత్ర + అంకుర, ముద్రా + అంకిత, సర్వ + అంగ, పురస్య + అపి - సవర్ణదీర్ఘ. అముష్మిన్ + ఆరుహ్య - అనునాసిక ద్విత్వం.

క్రియ :- ఈక్షిఙ్ దర్శనే. లట్. ఆత్మనే. ప్రథమ.
ఈక్షతే - ఈక్షేతే - ఈక్షన్తే

దశముఖేతి :- అపిచ = మరియు - దశముఖ = రావణుని యొక్క - భుజదండ = దండాకార భుజములచేనైన, మండలీనామ్ = సమూహముల యొక్క - ఇరువది బాహువులనుట. దృఢ = గాఢమైన. పరిపీడన = పట్టుచే - బిగియ పట్టుటచేననుట. పీత = దుర్బలము గావింపబడిన. మేఖలః = మధ్యభాగము గలదైన, అయమ్ = ఈ. స్ఫటికగిరిః = కైలాసపర్వతము. గిరిశస్య = మహేశ్వరునికి. జలః.... సుఖాని - జలగృహాంక = సలిలగృహమునందలి. వితర్దికా = తిన్నెలపై కూర్చున్న. సుఖాని = సుఖములను. నిర్మిమీతే = కల్పించుచున్నది. (పుష్పితాగ్రము - అయుజి నయుగరేఫతో యకారో యుజి చ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా). స్యాద్వితర్దిస్తు వేదికా- అమరః.

జలగృహక వితర్దికాసుఖాని
స్ఫటికగిరిర్గిరిశస్య సత్క్రమిమీతే ॥ 47

విభీషణః :- (సీతాంప్రతి) దేవి. దృశ్యన్తామమీ
కైలాసాద్రితటీషు ధూర్జటిజటాలంకారచంద్రాంకుర
జ్యోత్స్నాకందళితాభి రిందుదృషదామద్భి ర్నదీమాతృకాః ।

---

తాత్పర్యము :- రావణాసురుడు తన వింశతి బాహువులతో ఈ కైలాస గిరి మధ్యభాగమును పట్టి యూపినప్పుడు పెలమేరులు వెల్లివిరిసి శివునికి జలగృహ వాస సుఖమును కల్పించినట్లయినది చిన్నదిగా పట్టులాకారముగా నున్న ఇంటి కప్పు చూరులనుండి అన్నివైపులకు నీరు సన్నగా కారుచుండును. నడుమ శయ్యావితర్ది కాదులుండును. దీనిని జలగృహమందురు. ఇది మహారాజుల కేళీవనములలో నుండు ననియు విరహతాపోపశాంతికి వినియోగింతురనియు కవుల వర్ణనము.

సమాసములు :- భుజః దండ ఇవ - దశముఖస్య భుజదండాః - దండానాం మండలీ - తాసామ్. దృఢం చ తత్ పరిపీడనం చ - పీడనేన పీతా మేఖలా యస్య సః - గిరిః. జలగృహమేవ జలగృహకమ్ - అల్పార్థే కన్ - గృహకస్య వితర్దికా- వితర్దికాయాం (యాః) సుఖాని.

సంధులు :- మేఖలః + అయమ్ - ఉత్వాదేశము - మేఖలో + అయమ్- పూర్వరూప. గిరిః + గిరిశస్య - రేఫాదేశవిసర్గ.

క్రియ :- మాఙ్ మానే శబ్దే చ (జుః) - ఆత్మనే - లట్. ప్రథమ
మిమీతే - మిమాతే - మిమతే

కైలాసేతి :- (సీతాంప్రతి=సీతనుద్దేశించి) దేవి = మహారాజ్ఞీ! అమీ= ఈ కన్పించుచున్నవి, దృశ్యన్తామ్ = చూడబడుగాక ! - ఇటువైపు చెల్లను చూడుమనుట - కైలాసాద్రి = కైలాస పర్వతము యొక్క, తటీషు = సానువులయందు. ధూర్జటి = శివునియొక్క, జటా=శిరోగ్రభాగమున, అలంకార = అలంకారమైన, చంద్రాంకుర = చంద్రకళయొక్క. జ్యోత్స్నా = వెన్నెలచే. కందళితాభిః = ప్రకటించినవగు, ఇందుదృషదామ్ అద్భిః - ఇందుదృషదామ్ = చంద్రకాంతమణులయొక్క.. అద్భిః = జలములచే - ఆ వెన్నెలకు చంద్రకాంతమణులు స్రవించి ప్రవాహము కట్టినదనుట.

గౌరీహస్తగుణప్రవృద్ధవపుషః పుష్యన్తి ధాత్రేయక
భ్రాతృస్నేహ సహోత్థ షణ్ముఖ శిశుక్రీడాసుఖాః శాఖినః ॥ 48
అపిచాస్య నిత్యమధిత్యకావాసీ పరమేశ్వరః.

---

నదీ మాతృకాః = అట్టి ప్రవాహమే తల్లిగా కలవియు - ఆ ప్రవాహము కారణముగా ఈ చెట్లు మొలకెత్తినవనుట. గౌరీ = పార్వతీదేవియొక్క. హస్తగుణ = చేవాసిచేత. ప్రవృద్ధవపుషః = ఎదిగిన శరీరము కలవియు - ఆమె కరస్పర్శతో ఇవి వృద్ధిపొందిన వనుట. ధాత్రేయక భ్రాతృస్నేహ = సవతి సోదర ప్రేమతో. సహోత్థ = లభించిన. షణ్ముఖ = కార్తికేయునియొక్క. శిశు క్రీడాసుఖాః = బాల్య క్రీడారూపమగు ఆనందమునకు నిలయములు నైన. అమీ = ఈ. శాఖినః=కైలాస వృక్షములు. పుష్యన్తి= పుష్పించుచున్నవి. (శార్దూలము).

తాత్పర్యము :— ఓ సీతాదేవీ! ఈ కైలాసముపై పుష్పించుచున్న వృక్షములను చూడుము. శివుని జటాజూటమునందలి చంద్రుని వెన్నెలలు సోకి ఈ కైలాసమున చంద్రకాంతమణులు స్రవింపగా ఏర్పడిన నదీ ప్రవాహములే ఈ తరువులకు కన్నతల్లులు పార్వతీదేవి "హస్తవాసితో" ఇవి పెరిగినవి. షణ్ముఖుడు ఈ చెట్లకు సవతి తమ్ముడు. అతని బాల్య క్రీడలతో ఇవి ఆనందించి పుష్పించుచున్నవి-చూచితివా!

సమాసములు :- కైలాసాఖ్యః అద్రిః - అద్రేః తటీ - తాసు. ధూర్జటేః జటా - జటాయా అలంకారః - అలంకారశ్చాసౌ చంద్రాంకురశ్చ - అంకురస్య జ్యోత్స్నా - జ్యోత్స్నయా కందళితా - తాభిః. నదీఏవ మాతా యేషాం తే. హస్తస్య గుణః - గౌర్యాః హస్తగుణః - గుణేన ప్రవృద్ధమ్ - ప్రవృద్ధం వపుర్యేషాం తే. ధాత్రేయకశ్చ అసౌ భ్రాతా చ - భ్రాతుః స్నేహః - స్నేహేన సహోత్థమ్ - షణ్ముఖస్య శిశుక్రీడా - క్రీడయా సుఖమ్ - స్నేహసహోత్థం క్రీడాసుఖం యైః తే.

క్రియ :- పుష్ప వికసనే (శ్యన్) లట్. పరస్మై. ప్రథమ
పుష్ప్యతి - పుష్ప్యతః - పుష్యన్తి

అపిచేతి :- అపిచ=మరియు, అస్య = ఈ కైలాసమునకు. నిత్యమ్= ఎప్పుడును. పరమేశ్వరః = శివుడు, అధిత్యకావాసీ = శిఖర నివాసి. (ఉపత్యకాద్రేరాసన్నా భూమిరూర్ధ్వమధిత్యకా - అమరః)

సహస్రాక్షైరంగైర్నమసితరి నీలోత్పలమయీ
మివాత్మానం మాలాముపనయతి పత్యౌ మఖభుజామ్ ।
జిఘృక్షౌ చ క్రీడారభసిని కుమారే సహ గణై
ర్హసన్వో భద్రాణి ప్రథయతు మృడానీపరివృఢః ॥ 49

---

సహస్రేతి :— మఖభుజామ్=పురోడాశమును భుజించు దేవతలయొక్క, పత్యౌ= భర్తయగు దేవేంద్రుడు. సహస్రాక్షైః = వేయికన్నులతో నిండినవగు, అంగైః = శరీరావయవములతో. నమసితరి=నమస్కరించుచున్నవాడుకాగా. నీలోత్పలమయీమ్= (వేయి) నల్లకలువలతో గూర్చిన, మాలామ్ ఇవ = దండనువలె, ఆత్మానమ్=తనను తాను. ఉపనయతి (సతి) = సమర్పించుకొనుచుండగా. క్రీడారభసిని=ఖేలనప్రియుడగు, కుమారే = షణ్ముఖుడు. జిఘృక్షౌ = పట్టుకొనదలచినవాడుకాగా. గణైః సహ =ప్రమథగణములతో కూడి. హసన్ = నవ్వుచున్న, మృడానీపరివృఢః = పార్వతీవల్లభుడు. (ప్రభౌ పరివృఢః) వః = మీకు (మీ దంపతులకు — మీ ప్రజలకునునుటు) భద్రాణి= శుభములను. ప్రథయతు = దృఢపరచుగాక — శాశ్వతీకరించుగాక । (శిఖరిణీవృత్తము).

తాత్పర్యము :- శివునికి దేవేంద్రుడు నమస్కరించుచున్నాడు. అతని శరీరము వేయి కన్నులతో నల్లకలువల దండవలె శివ చరణ సన్నిధిని వ్రాలినది. క్రీడాప్రియుడగు బాల కుమారస్వామి ఆ మాలికను అందుకో నుంకించెను. దీనికి శివుడు సపరివారముగా నవ్వెను. అట్టి శంకరుడు మీకు భద్రములను శాశ్వతముగా కల్గించుగాక ।

సమాసములు :- సహస్రమక్షీణి యేషు తైః. మఖం భుఞ్జతే తేషామ్ జిఘృక్షా అస్య అస్తీతి - జిఘృక్షుః - తస్మిన్ (సనాశంసభిక్ష ఉః). నమసితరి - నమో వరివ .... ఇతి క్యచ్ - యస్య హలః ఇతి యలోపః. క్రీడారభసమస్యాస్తీతి - క్రీడారభసిన్ - తస్మిన్. మృడాన్యాః పరివృఢః. మృడస్య స్త్రీ మృడానీ (ఇంద్రవరుణే త్యాదినా ఆనుక్) మృడుని భార్యకు భర్త - అనునిట్టి ప్రయోగములను చేయుట అర్థిక దోషమని ఆలంకారికులు.

సంధులు :- అక్షైః + అంగైః + నమసితరి. గణైః + హసన్ - రేఫాదేశవిసర్గ. వః + భద్రాణి — ఉత్త్వాదేశవిసర్గ. నీల + ఉత్పల — గుణ. ఇవ + ఆత్మానమ్ — సవర్ణదీర్ఘ.

కించ —

యన్నాట్యభ్రమిఘూర్ణమానవసుధాచక్రాధిరూఢే భృశం
మేరౌ పార్శ్వనివిష్టవాసరనిశాచక్రే పరిభ్రామ్యతి ।
తైజస్యస్తడితో భవన్తి శతశో దృష్టా హి జాతాః కథం
తామస్యోఽపి స వః పునాతు జగతామన్త్యేష్టియజ్వా విభుః ॥ 50

---

క్రియ :— పృథ (వ్యాఖ్) లోట్. పరస్మై. ప్రథమ (?)
ప్రథయతు/ప్రథయతాత్ - ప్రథయతామ్ - ప్రథయన్తు

ప్రతిపదార్థం :- కించ = మరియు. యత్=ఏ పరమేశ్వరునియొక్క. నాట్య= తాండవమునందలి. భ్రమి = సుడిగుండమునందు-నాట్య భ్రమణమునందని కానీ. ఘూర్ణమాన = తిరుగుచున్న. వసుధాచక్రి = భూచక్రము. అధిరూఢే = అధివసించియున్న. మేరౌ = మేరుపర్వతము. పార్శ్వ = తనదు ఇరుప్రక్కలను. నివిష్ట = నిలిచియున్న వాసరనిశాచక్రే = పగలు రాత్రి అను పరుసలు కలదియై. భృశమ్ = (భూమితోపాటు) మిక్కిలి వేగముగా. పరిభ్రామ్యతి = గిరగిర తిరుగుచుండగా. తైజస్యః = కాంతి మయములగు. తడితః = మెరుపులు. శతశః = నూర్లకొలది. దృష్టాఃభవన్తి=కన్పించుచున్నవి. హి = కాని. కథమ్ = ఆశ్చర్యము. తామస్యః = తమోమయములగు, తడితః అపి = మెరుపులు కూడా, జాతాః భవన్తి = సంభవించుచున్నవి - పగటిపూటలు కాంతిమయములగు మెరుపులవలెను, రాత్రిపూటలు తమోమయములగు మెరుపులవలెను భాసించుచున్నవి. కాంతిమయములగు మెరుపులుండుట సహజమే కానీ తమోమయములగా మెరుపులు ఉండుట ఆశ్చర్యము. జగతామ్=లోకములకు, అంత్యేష్టియజ్వా= అంత్యేష్టిచేయు యాజకుడను — లోక దాహకుడనుట, విభుః = సర్వవ్యాపియునైన, సః=ఆ మహానటుడు, వః=మిమ్ము. పునాతు=పావనులను చేయుగాక । (శార్దూలము)

తాత్పర్యము :— శివుని తాండవ భ్రమణమునందు భూగోళము పరిభ్రమించుచున్నది. దానితోపాటు దానిపైనున్న మేరువుకూడా గిరగిర తిరుగుచున్నది. మేరువు నాశ్రయించుకొనియుండు పగలు రేయియు మేరువుతోపాటు తిరుగుచున్నవి. ఇట్లవి వేగముగా తిరుగుటతో చూపరులకు పగటిపూటలు కాంతిమయములగు మెరుపుల వలెను, రాత్రిపూటలు తమోమయములగు మెరుపులవలెను భాసించుచున్నవి. చీకటి మెరుపులే ఆశ్చర్యము. అట్టి నటధూర్జటి మిమ్ము రక్షించుగాక ।

లక్ష్మణః :- జయతి పరిముషితలక్ష్మా భయాదనుపసర్పతేవ హరిణేన।
ఇహ కేసరికరజాంకురకుటిలా హరమౌళివిధులేఖా ॥ 51।

---

సమాసములు :- యస్య నాట్యమ్ - నాట్యే ప్రసృతః తతో ఘూర్ణమానం చ తత్ వసుధాచక్రం చ - చక్రమధిరూఢః - తస్మిన్. వాసరాణి చ నిశాశ్చ - వాసర నిశానాం చక్రమ్ - పార్శ్వే నివిష్టం వాసరనిశాచక్రం యస్య సః - తస్మిన్. అంత్యేష్టిః యజ్వా.

సంధులు :- యత్ + నాట్య - అనునాసికాదేశ. ప్రసృతః + తదితః - సాదేశవిసర్గ. తదితః + భవన్తు. శతశః + దృష్టాః - ఉత్వాదేశవిసర్గ - తాసుగోః + అపి - పూర్వరూప. అంత్య + ఇష్టి - గుణసంధి. సః + పః - ఏతత్తదోర్విసర్గలోప.

క్రియ :- పూఞ్ పవనే (క్ర్యా.)

పునాతు/పునీతాత్ - పునీతామ్ - పునన్తు

జయతీతి :- ఇహ = శ్రీ కైలాసపర్వతమునందు. కేసరి .... కుటిలా - కేసరి = సింహముయొక్క, కరజాంకుర = నఖాంకురమువలె, కుటిలా = వక్రమైన హరమౌళి విధులేఖా - హర = శివునియొక్క, మౌళి = శిరస్సునందలి, విధులేఖా = చంద్రరేఖ (చంద్రకళ). భయాత్ = సింహభయమువలన అనుపసర్పతా=దరిదాపులకు రానట్టి, హరిణేన ఇవ=లేడితోవలె - చిహ్నమగు లేడి భయపడి సమీపింపక పోవుటచే నని. పరిముషితలక్ష్మా = తొలగింపబడిన కళంకము కలదై - రేఖారూపమున నుండుటచే కళంక రహితమై అనుట. జయతి = విరాజిల్లుచున్నది. (ఆర్యావృత్తము).

తాత్పర్యము :- శ్రీ కైలాస పర్వతమునందు శివుని శిరస్సుపై జాబిల్లి రేఖామాత్రముగా నున్నది. అది సింహనఖాంకురముగా భాసించుటతో భయపడి లేడి సమీపించలేదన్నట్లు కళంక రహితముగా (హరిణచిహ్న రహితమగు రేఖాకృతితో) విరాజిల్లుచున్నది.

సమాసములు :- పరిముషితం లక్ష్మ యస్యాః సా. న ఉపసర్పన్ - తేన. కేసరిణః కరజః - కరజస్య అంకురమ్ - అంకురమివ కుటిలా.

క్రియ :- జి జయే. లట్. పరస్మై. ప్రథమ.

జయతి - జయతః - జయన్తి

సీతా :- (సపరిహాసమ్) ఏతస్య దందశూక నర కరోటిముండమాలా మండనస్య శ్మశానవాసినో భూషణత్తైవ రోహిణీవల్లభస్య కలంకః, కిం తపస్వినా కురంగకేణ (ఏదస్స దందసూఅ ణర కరోడిముండ మాలామండణస్స మసాణవాసిణో భూసణత్తా జ్జేవ్వ రోహిణీ వల్లహస్స కలంకో, కిం తవస్సిణా కురంగ ఏణ.)

విభీషణః :- (విహస్య) శంకే. భగవానపి న మృగాంకమలంకారకామః కలయతి. తథా హి—

సహచరపిశాచపరిషత్ప్రసత్తయే కామచారతో రజనీమ్।
కారయితుమివ కపాలీ శిరసి నిశాకరమయం వహతి॥ 52

---

ఏతస్యేతి :- దందశూక = సర్పములు, నరకరోటిముండమాలా=మానవ కపాలాస్థికలు, మండనస్య=భూషణములుగా కలవాడును, శ్మశానవాసినః=శ్మశానము నందు నివసించువాడునైన, ఏతస్య = ఈ శివునికి, భూషణతా ఏవ = అలంకారము కానగుటయే, రోహిణీవల్లభస్య=చంద్రునికి, కళంకః=కళంకము; తపస్వినా=తపశ్శాలి యగు, కురంగకేణ = లేడిపిల్లతో, కిమ్ = ఏమిపని ; అది లేకున్నను చంద్రుడు కళంకితుడై నట్లే అనుట.

శంకేఇతి :- (విహస్య = నవ్వి) భగవాన్ అపి = పరమేశ్వరుడును, మృగాంకమ్ = చంద్రరేఖను, అలంకారకామః = భూషణప్రియుడై, న కలయతి = ధరించుటలేదని, శంకే = భావించుచున్నాను. తథాహి = చంద్రరేఖా ధారణమునకు వేరొక ప్రయోజనమున్నది - ఏదనగా —

సహచరేతి :- అయమ్ = ఈ, కపాలీ = కపాలధారియగు శివుడు, సహచర = తన అనుచరులగు, పిశాచ = రాక్షసుల, పరిషత్ = సమూహముయొక్క, ప్రసత్తయే = ప్రసన్నత కొఱకు, కామచారతః = ఇచ్ఛానుసారము (కోరినప్పుడెల్ల), రజనీమ్ = రాత్రిని, కారయితుమ్ ఇవ = కల్పించుటకన్నట్లు, నిశాకరమ్ = నిశాకరుని (చంద్రుని), శిరసి = శిరస్సునందు, వహతి = ధరించుచున్నాడు. (ఆర్య).

(సర్వే హసన్తి)

రామః :- (సబహుమానమ్)

శ్రీకంఠస్య కపర్దబంధన పరిశ్రాంతోరగగ్రామణీ
సందష్టాం ముకుటావతంసకలికాం వందే కళామైందవీమ్ ।

---

తాత్పర్యము :- శివుడు తన సహచరులగు రాక్షసులకు కోరినప్పుడెల్ల రాత్రిని కల్పించుటకు వీలుగా శిరస్సుపై నిశాకరుని వహించుచున్నాడు. నిశాకరుడనగా రాత్రిని కల్పించువాడనుట. ఇది సార్థకమగు విశేష్యముగుటచే పరికరాంకురమలంకారము. అది హేతూత్ప్రేక్షకు అంగమైనది.

సమాసములు -: సహచరాశ్చ తే పిశాచాశ్చ — పిశాచానాం పరిషత్ — పరిషదః ప్రసత్తిః — తస్యై. కరోతీతి కరః — నిశాయాః కరః — తమ్

క్రియ :- వహశ్ ప్రాపణే. లట్. పరస్మై. ప్రథమ

వహతి — వహతః — వహన్తి

(సర్వే = అందరును. హసన్తి = నవ్వుదురు)

శ్రీకంఠేతి :- (సబహుమానమ్ = గౌరవముతో) శ్రీకంఠస్య = శివుని యొక్క. కపర్ద = జటాభారమును. బంధన = కట్టియుంచుటయందు. పరిశ్రాంత = అలిసిపోయిన. ఉరగగ్రామణీ = సర్పోత్తమముచే. సందష్టామ్ = కొరుకుకొనబడినదియు, ముకుట = కిరీటమునకు. అవతంస = అలంకారమైన. కలికామ్ = మొగ్గవంటిదియు నైన. ఐందవీమ్ కళామ్ = చంద్రకళను. వందే = నమస్కరింతును. యా = ఏ చంద్రకళ ఎట్లున్నదనగా — పరితః = అన్నివైపులను. విప్లుత్య = సాగగొట్టి. బింబప్రతిపూరణాయ = పూర్తి బింబమును తయారుచేయుటకై. సందంశకాయంత్రేణ = పట్టుకారుతో. లలాటలోచన = శివఫాలనయనమునందలి. శిఖిజ్వాలాభిః = అగ్నిజ్వాలలతో. అవర్త్యతేఇవ = వంచబడుచున్నదో ! - కరిగింపబడుచున్నదో అనుట. (శార్దూలము)
(కపర్దోఽస్య జటాజూటః - అమరః)

తాత్పర్యము :- శివుని శిరస్సునందు చంద్రరేఖ యున్నది. జటాబంధనముగా సర్పమున్నది. ఫాలభాగమున అగ్నినేత్రమున్నది. చంద్రకళను ఫాలనయనాగ్నియందు-అన్నివైపులను సాగగొట్టి పరిపూర్ణబింబమును తయారుచేయుటకని సర్పమను పట్టుకారుతో కాల్చి కరిగింతురో యన్నట్లున్నది.

యా బింబప్రతిపూరణాయ పరితో నిక్షిప్య సందంశికా
యంత్రేణేవ లలాటలోచన శిఖిజ్వాలాభిరావర్త్యతే ॥ 53

(పుష్పకంప్రతి) విమానరాజ. మనాగున్నమ్యతామ్. ఆలోకయతు మైథిలీ సుమేరు శిఖరాణి.

విభీషణః :- (సీతాంప్రతి) దేవి. పశ్య పశ్య—
మేరోర్మూర్ధని యాన్తి సమ్మదమధస్సంపాతిభిర్జ్యోతిషా
మాటోపైర్విటపోపరిస్థిత తరుచ్ఛాయాభృతోఽధిత్యకాః ।

---

సమాసములు :- కబర్యాః బంధనమ్ — బంధనే పరిశ్రాన్తః — పరిశ్రాన్తశ్చాసౌ ఉరగగ్రామణీశ్చ — గ్రామణినా సందష్టా — తామ్. అవతంసార్థం కలితా — ముకుటస్య అవతంస కలితా — తామ్. బింబస్య ప్రతిపూరణమ్ — తస్మై. సందంశికేతి యన్త్రః — తేన. లలాటే విద్యమానమ్ లోచనమ్ — లోచనస్య శిఖీ — శిఖినః జ్వాలాః — తాభిః.

క్రియ :- వదిఙ్ అభివాదన స్తుత్యోః. లట్. ఆత్మనే. ఉత్తమ.
వందే — వందావహే — వందామహే
వృతుఃవర్తనే ఆవర్త్యతే - ఆవర్త్యేతే - ఆవర్త్యన్తే
(కర్మణి) ఆత్మనే, ప్రథమ. లట్.

విమానరాజేతి :- (పుష్పకంప్రతి = పుష్పక విమానము నుద్దేశించి) విమానరాజ = ఓ ఉత్తమ విమానమా! మనాక్ = కొంచెము ఎత్తునకు ఎగురు చుము. మైథిలీ = సీతాదేవి. సుమేరు శిఖరాణి = మేరుపర్వత శిఖరములను, ఆలోకయతు = చూచునుగాక! సీతాదేవికి మేరుశిఖరములు కన్పించునంత ఎత్తునకు విమాన మెగరవలెనని.

మేరోరితి :- (సీతాంప్రతి = సీతనుద్దేశించి) దేవి = ఓ మహారాజ్ఞి! పశ్య పశ్య = చూడుము చూడుము! — మేరోః = మేరుపర్వతముయొక్క. అధిత్యకాః = శిఖరాగ్ర భాగములు. అధస్సంపాతిభిః = తమ క్రిందిభాగమున ప్రసరించుచున్న. జ్యోతిషామ్ = సూర్యకాంతులయొక్క. ఆటోపైః = సమూహములతో. విటప = కొమ్మలకు ఉపరిస్థిత = పైని వ్యాపించిన. తరుచ్ఛాయాభృతః = చెట్లనీడలను వహించుచున్నవై —

నిష్ఠ్యూతాసు చ మాసి మాసి విబుధై రిందోః కలాసు క్రమా
దుద్దామప్లవమానలాంఛనమృగచ్ఛిన్నాగ్రదర్భాంకురాః ॥ 54

క్రిందినుండి కాంతిసోకుటతో నీడలు పైకి వ్యాపించినవనుట. చ = మరియు. మాసి మాసి = ప్రతి మాసమునందును క్రమముగా. విబుధైః = దేవతలతో. ఇందోః = చంద్రునియొక్క. కలాసు = కళలు. నిష్ఠ్యూతాసు = త్రాగివేయబడినవికాగా. ఉద్దామ = విశృంఖలమై. ప్లవమాన = గెంతుచున్న. లాంఛనమృగ = చంద్రుని యందలి లేడిచేత (చంద్రకళంకమును హరిణమనుట కవి సమయము - మృగాంకుడని పేరు). ఛిన్న= కొరికివేయబడిన. అగ్ర=కొసలుకల్గిన. దర్భాంకురాః=కుశప్రరోహములు కలవియునై. సమ్మదమ్ = ఆనందమును, మేదరయన్తి = వృద్ధిపొందించుచున్నవి. (సంపదమ్ అని పాఠాంతరము. మేరుపర్వత శోభను పెంపొందించుచున్నవని అర్థము) శార్దూలము.

తాత్పర్యము :- ఈ మేరుశిఖరములు ఆనందదాయకములుగా నున్నవి. తమకన్న క్రిందుగా ప్రసరించుచున్న సూర్యకిరణములతో ఈ శిఖరములపై నున్న చెట్లనీడలు పైపైకి వ్యాపించుచున్నవి. చంద్రకళలను దేవతలు త్రాగివేయుటతో చంద్రలాంఛనమగు హరిణము బయటపడి స్వేచ్ఛగా ఈ శిఖరములపై దర్భాంకురములను మేయుచున్నది.

సమాసములు :- తరూణాం ఛాయా - తరుచ్ఛాయా. విటపానామ్ ఉపరి స్థితా చ సా తరుచ్ఛాయా చ-ఛాయాయాః భృతః-ఛాయాం బిభ్రతీతివా. ఉద్దామశ్చాసౌ లాంఛనమృగశ్చ - మృగేణ ఛిన్నాగ్రాః దర్భాంకురాః యాసు తాః.

సంధులు :- మేరోః + మేదురయన్తి. సంపాతిభిః + జ్యోతిషామ్. ఆటోపైః + విటప. విబుధైః + ఇందోః-రేఫాదేశవిసర్గ. విటప + ఉపరి - గుణసంధి. భృతః + అధిత్యకాః - ఉత్వాదేశ - భృతో + అధిత్యకాః - పూర్వరూప. ఛిన్న + అగ్ర. దర్భ + అంకుర - సవర్ణదీర్ఘ. తరు + ఛాయా. మృగ + ఛిన్న - తుగాగమ.

క్రియ :- మేదుర (కణ్వాదిః) లట్. పరస్మై. ప్రథమ
మేదురయతి - మేదురయతః - మేదురయన్తి

లక్ష్మణః :- (సీతాం ప్రతి)

ఏతాసు పర్వతనితంబతటీషు పశ్య
మధ్యందినేఽపి హరిచందనవాటికేయమ్।
పక్షస్థితద్యుమణిబింబతయాతిదీర్ఘ
చ్ఛాయావితానమధురా ముదమాదధాతి ॥ 55

---

ఏతాస్వితి :- (సీతాంప్రతి = సీతనుద్దేశించి) ఏతాసు = ఈ, పర్వత = మేరుపర్వతముయొక్క. నితంబతటీషు = చెఱియలందు (కటకోఽస్త్రీ నితంబోఽద్రేః— అమరః). ఇయమ్ = ఈ. హరిచందనవాటికా = గంధపుచెట్ల గుంపు. పక్ష=పార్శ్వ భాగమునందు. స్థిత = విరాజిల్లుచున్న. ద్యుమణిబింబతయా = సూర్యబింబము కల్గియుండుటచే, మధ్యందినే అపి = మిట్టమధ్యాహ్నమునందు సైతము. అతిదీర్ఘ = మిక్కిలి పొడవుగా వ్యాపించిన. ఛాయావితాన = ఛాయా సమూహముచే. మధురా = అందమైనదై. ముదమ్ = సంతోషమును. ఆదధాతి = కల్గించుచున్నది. పశ్య = చూడుము (వసంతతిలకము)

తాత్పర్యము :- మహారాజ్ఞీ! మేరుపర్వత కటక భూములయందు ఈ హరిచందన వృక్షశ్రేణిని చూడుము. సూర్యబింబము తమకు పార్శ్వభాగమున నుండుటచే ఈ మధ్యాహ్న సమయమునందుగూడ నీడలు అతిదీర్ఘములై వ్యాపించి మనోహరముగా భాసించుచున్నది.

సమాసములు :- పర్వతస్య నితంబతట్యః — తాసు. హరిచందనానాం వాటికా. పక్షే స్థితః—పక్షస్థితః ద్యుమణిబింబః యస్యాః సా — పక్షస్థితద్యుమణిబింబా— తస్యాః భావః — బింబతా — తయా. అతిదీర్ఘాశ్చ తాః ఛాయాశ్చ—ఛాయానాం వితానేన మధురా.

క్రియ :- దృశిర్ ప్రేక్షణే. పరస్మై. లోట్. మధ్యమ.
పశ్య/పశ్యతాత్ — పశ్యతమ్ — పశ్యత
డుధాఞ్ ధారణపోషణయోః. లట్. పరస్మై. ప్రథమ
దధాతి — ధత్తః — దధతి

అపిచ—

భూమేః స్వర్ణతయా ఫలోత్తరతరుస్వైరస్య మేరోస్తటీ
సీమన్తోఽయమనూరుసారథిరథప్రస్థానఘంటాపథః ।
అస్మిన్నుద్ధ్రియతే కథంచన హయైరుద్దామదండాతప
జ్వాలాజాలవిలీనకాంచనశిలాజంబాలమగ్నః ప్రధిః ॥ 56

---

భూమేరితి :- అపిచ = మరియు - భూమేః = ఈ పర్వతభూమియొక్క, స్వర్ణతయా = సువర్ణత్వముచే-బంగారు నేలయగుటచే. ఫలోత్తర = ఫలపూర్ణములైన. తరు = వృక్షములయొక్క. స్వైరస్య = వికాసముతో కూడినదైన. మేరోః = ఈ మేరుపర్వతముయొక్క. అయమ్ = ఈ: తటీసీమంతః = కటకదేశము (చెరియలపరుస). అనూరుసారథి = అనూరుడు సారథిగా కల్గిన. రథః=సూర్యరథముయొక్క. ప్రస్థాన= ప్రయాణమునకు. ఘంటాపథః = రాజమార్గము. (ఘంటాపథో రాజమార్గః - అమరః) అస్మిన్ = ఈ మార్గమునందు. ఉద్దామ = మిక్కిలి. దండ = ప్రచండమైన. ఆతప జ్వాలాజాల = సూర్యకిరణ సమూహముచే. విలీన = కరిగిన. కాంచనశిలా = బంగారు శిలలతో నేర్పడిన, జంబాల = బురదయందు. మగ్నః = దిగబడిన. ప్రధిః = రథనేమి. (నేమిః స్త్రీ స్యాత్ ప్రధిః పుమాన్ - అమరః) హయైః = సూర్యరథాశ్వములచే. కథంచన = ఎట్లో. ఉద్ధ్రియతే = పైకి లాగబడుచున్నది. (శార్దూలము).

తాత్పర్యము :- ఈ పర్వతమున నేల బంగారమగుటచే వృక్షములు ఫల పూర్ణములుగా నున్నవి ఈ మేరు కటకమే సూర్యరథమునకు ప్రయాణ మార్గము (రాచబాట). సూర్యకాంతికి బంగారు శిలలు కరిగి సూర్యరథచక్రము దిగబారిపోగా రథాశ్వములు అతి కష్టముమీద పైకి లాగుచున్నవి.

సమాసములు :- ఫలోత్తరాశ్చ తే తరవశ్చ - తరూణాం స్వైరః యస్యసః - తస్య. తట్యాః సీమన్తః. అనూరుః సారథిర్యస్య - అనూరుసారథిః సచాసౌ రథశ్చ -రథస్య ప్రస్థానమ్ - ప్రస్థానాయ ఘంటాపథః. ఉద్దామదండశ్చాసౌ ఆతపశ్చ ఆతపస్య జ్వాలాః - జ్వాలానాం జాలః - జాలే విలీనాశ్చ తాః కాంచనశిలాశ్చ - శిలాభిః జంబాలః (శిలా ఏవ జంబాల ఇతివా) జంబాలే మగ్నః.

(నిరూప్య చ సహర్ష స్మితమ్) కథముపర్యుపరి పుష్కరావర్తకానభ్రము వల్లభః — (విమృశ్య)

అద్యాయం విబుధేంద్రబాంధవవధూ సంభుక్తసంతానక
స్రగ్దామ్నీమమరావతీం విహరతే నిర్వైరమైరావణః ।

---

సంధులు :- ఫల + ఉత్థాపి — గుణసంధి మేరోః + తటీ-సాదేశవిసర్గ సీమంతః + అయమ్-ఉత్వాదేశవిసర్గ - సీమంతో + అయమ్ - పూర్వరూప. అస్మిన్ + ఉత్ - అనునాసిక ద్విత్వ. బాహ్వైః + ఉద్దామ - రేఫాదేశవిసర్గ, చండ + ఆతప - సవర్ణదీర్ఘ ఉత్ + హ్రియతే — అంత్యోష్మసంధి.

క్రియ -: హృఞ్ హరణే (కర్మణి) ఆత్మనే లట్. ప్రథమ(ఉత్)
హ్రియతే — హ్రియేతే - హ్రియన్తే

కథమితి :- (నిరూప్య = చూచి. సహర్ష స్మితమ్ చ = ఆనందముతో చిరునవ్వుతో) కథమ్ = ఎట్లూ ; అభ్రమువల్లభః = ఐరావతము, పుష్కరావర్తకాన్ = పుష్కరావర్తక మేఘములను, ఉపర్యుపరి = పైగా - వానినంటే ఎత్తుగాననుట. (ఉపర్యుపరిబుద్ధీనాం-ఇత్యాదినా ద్వితీయా) (పుష్కరావర్తకా మేఘాః పుణ్యవారిప్రవర్షిణః అని కోశకారోక్తము) (విమృశ్య=ఆలోచించి)

అద్యేతి :- యుధి = యుద్ధమునందు. రావణః = రావణాసురుడు, దోర్మాత్ర పరిచ్ఛదః = బాహువులుమాత్రమే ఆయుధములుగా కలవాడై, ముదా = ఆనందముతో ఏది అనాయాసముగా, యమ్=ఏ ఐరావతమును, ముహుః = పలుమార్లు ఉత్క్షిప్య = పైకెగురవేసి, ప్రతీచ్ఛన్ = క్రిందికి పడువరకును వేచి పట్టుకొనుచు, విభైః=తనపైని, పతితైః=పడినట్టి, ముఖైః=ముఖములతో. సాంరావిణమ్=బొలికేకను సంతేనే = విస్తరింపజేసెనో (సంరావో బహుభిః కృతః-అమరః) అయమ్=అట్టి ఈ ఐరావణః = ఐరావతము. అద్య = ప్రస్తుతము (రావణుడు సంహరింపబడుటతో). విబుధేంద్ర=దేవేంద్రునియొక్క. బాంధవవధూ=బంధువులగు అప్సరసలచే (బాంధవుల భార్యలచే). సంభుక్త = ఉపయోగింపబడిన. సంతానకస్రక్ దామ్నీమ్ = కల్పకుసుమ మాలికాసమూహముతో కూడిన. అమరావతీమ్ = అమరావతిని (ఇంద్రరాజధాని).

పృథ్వ్యై క్షే నివసన్తి తే భుజభృతః కస్మై నిగృహ్ణీమహే
పిఙ్గ్రామియం పునర్వసుమతీ పౌలస్త్యమాబిభ్రతీ ।
వాలీ త్వాహ్వాయమానమేనమపి యచ్చక్రే కృతే చక్షుషీ
పశ్యామః శ్రవసీ కృతే చ శృణుమస్తద్వక్తుమల్పే వయమ్ ॥ 58

---

ఏనమ్ అపి = ఇంతటివానిని గూడ. వాలీ తు = వాలియేమో. యత్ చక్రే=ఏమిచేసెనో.
చక్షుషీ = రెండు నేత్రములు. కృతే = సృష్టింపబడినవి కనుక. పశ్యామః=చూచితిమి.
శ్రవసీ = రెండుచెవులు. కృతే = సృష్టింపబడినవి కనుక. శృణుమః = వింటిమి. చ=
కాని. తత్ = దానిని. వక్తుమ్ = చెప్పుటకు. వయమ్ = మేము. అల్పే = అల్పులము -
ఒకే నోరుండుటచే చెప్పజాలకున్నామనుట. (శార్దూల విక్రీడితము)

తాత్పర్యము :- ఈ భూమిపై అద్వితీయులగు మహావీరులు ఎందరో ఉన్నారు వారిలో ఏ ఒక్కరినేని నిందించుటకు కాకున్నను ఈ భూమి రావణుని వల్లనే పిరిభూమి అయినది. అంతటి రావణుని వాలి ఏమి చేసెనో నేత్రములు రెండున్నవి కనుక చూడగల్గితిమి. చెవులు రెండున్నవి కనుక ఆలకింపగల్గితిమి. నోరు మాత్రము ఒక్కటే ఉండుటచే వర్ణించుటకు చాలకున్నాము.

సంధులు :- పిరి + ఏకే - వృద్ధి. తు + ఆహ్వాయమానమ్ - యణాదేశ
యత్ + చక్రే - శ్చుత్వ. శృణుమః + తత్ - సాదేశవిసర్గ.

క్రియ :- గ్రహజ్ ఉపాదానే, (శ్నా) ఆత్మనే. లట్. ఉత్తమ
గృహ్ణే - గృహ్ణీవహే - గృహ్ణీమహే
డుకృఞ్ కరణే, లిట్, ఆత్మనే. ప్రథమ
చక్రే - చక్రాతే - చక్రిరే
వసనివాసే, లట్, పరస్మై. ప్రథమ (ని)
నివసతి - నివసతః - నివసన్తి
దృశిర్ ప్రేక్షణే. లట్. ఉత్తమ. పరస్మై
పశ్యామి - పశ్యావః - పశ్యామః
శ్రు శ్రవణే, లట్, పరస్మై. ఉత్తమ
శృణోమి - శృణువః / శృణ్వః - శృణుమః / శృణ్మః

సీతా :- (రామంప్రతి) ఆర్యపుత్ర. కిం పునరేతద్దళితకర్పూర శలాకాఖండ గౌరం గగనాంగణే దృశ్యతే. (అజ్జఉత్త. కిం ఉణ ఏదం దలిద కప్పూరసలాఆఖండగోరఅం గఅణంగణే దీసఇ).

విభీషణః :- (సీతాంప్రతి) దేవి. చంద్రలోకోపకంఠమధిరూఢో విమాన రాజః. దృశ్యతాం చ భగవానయమ్.

యః ప్రాక్ప్రత్యగవాగుదంచి కకుభాం నామాని సంబిభ్రతం
జ్యోత్స్నాజాలమిషాల్లతాభిరభితో లుంపంతమంధం తమః ।

---

క్రియ :- భూ సత్తాయామ్. లుఙ్. పరస్మై. ప్రథమ
అభూత్ – అభూతామ్ – అభూవన్
అసభువి. లఙ్. పరస్మై. ప్రథమ
ఆసీత్ – ఆస్తామ్ – ఆసన్

దేవీతి :- (సీతాంప్రతి = సీతనుద్దేశించి) దేవి = మహారాజ్ఞీ ! విమాన రాజః = ఈ ఉత్తమ విమానము. చంద్రలోక + ఉపకంఠమ్ = చంద్రలోక సమీప మును అధిరూఢః = అధిరోహించినది. దృశ్యతామ్ = చూడబడుగాక ! అయమ్ = ఈ. భగవాన్ = ఈ చంద్రభగవానుడు –

యమితి :- ప్రాక్ప్రత్యగవాగుదంచి = తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము అనునట్టి, నామాని = నామములను, కకుభామ్ = దిక్కులకు. సంబిభ్రతమ్ = (తన గమనముతో) కల్పించువాడును. జ్యోత్స్నాజాల = కౌముదీసమూహమనునట్టి. ఉల్లతాభిః = అఘాతములతో (స్యాద్దామ్నాప్యలే ఉల్లతా – హారావళీ). అభితః = అన్నివైపులనుండియు, అంధమ్ తమః = గాఢాంధకారమును. లుంపంతమ్ = తొలగించు చున్నవాడును. త్రిజగతామ్ = ముల్లోకములకును. ఆలోకబీజాత్ = దృష్టిహేతువై (వస్తు దర్శనమునకు అవసరమైన వెలుగు ఆ పర్వతమునుండియే ఉదయించునుకనుక) ప్రాచీనాత్ = తూర్పుదిక్కున నున్నదైన. ఇతః అచలాత్ = ఈ మేరుపర్వతము నుండి, అంకురమ్ ఇవ = మొలకవలె. నిర్యాన్తమ్ = వెలువడుచున్న. (బీజమునుండి అంకురము మొలకెత్తినట్లు). హరిణాంకమ్ = చంద్రుని. ద్రష్టుమ్ = చూచుటకు. జనః = జనము, జీవతి = బ్రతికియున్నది. (ఆలోకో దర్శనోద్యోతౌ – అమరః. దక్షిణస్యామవాచ్యేవ – విశ్వప్రకాశకోశః) శార్దూలము.

ప్రాచీనాచలాదితప్త్రిజగతామాలోకబీజాద్విధే-

ర్నిర్యాతం హరిణాంకమంకురమివ ద్రష్టుం జనో జీవతి ॥ 60

అపి చ —

స శ్రీకంఠకిరీటకుట్టిమ పరిష్కారప్రదీపాంకురో

దేవః కైరవబంధురంధతమస ప్రాగ్భారకుక్షింభరిః ।

---

తాత్పర్యము :— ఏ దిక్కులకు తూర్పు పడమర దక్షిణము ఉత్తరము అను పేర్లు వచ్చుటకు కారణమైన గమనము కలవాడును, జ్యోత్స్నా పాతములతో గాఢాంధకారమును అంతరింపజేయువాడును, ముల్లోకములకును దృష్టికారణమైన ఏ పురాతన మేరుపర్వతమునుండి అంకురమువలె మొలకెత్తునాడునైన చంద్రుని చూచుటకే విశ్వము జీవించియున్నది. చంద్రదర్శనము జీవిత సాఫల్యహేతువు ఆనందదాయకము ననుట. ఆయుర్వర్ధక మనియు.

సమాసములు :- ప్రాక్చ ప్రత్యక్చ అవాక్చ ఉదక్చేతి. జ్యోత్స్నాజాల మేవ ఝలజ్ఝలా — తాభిః. ఆలోకస్య బీజమ్ — తస్మాత్.

సందులు :- ఝలాభిః + అభితః. విధేః + నిర్యాతమ్ — రేఫాదేశవిసర్గ. అభితః + లుంపంతమ్. జనః + జీవతి — ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- జీవ ప్రాణధారణే. లట్. పరస్మై. ప్రథమ

జీవతి — జీవతః — జీవన్తి

స ఇతి :- అపి చ = మరియు — శ్రీకంఠ = శివునియొక్క. కిరీట = కిరీటమనునట్టి (జటాకలాపమే కిరీటము). కుట్టిమ = జేపాకి (గదిలోపలిభాగము). పరిష్కార = అలంకారమైన — లేక — ప్రకాశకమగు. ప్రదీపాంకురః = చిన్న దీపము వంటి వాడును; కైరవ = కలువలకు, బంధుః = హితుడును (వికసింపజేయువాడు); అంధతమస = గాఢాంధకారముయొక్క. ప్రాగ్భార = రాశితో. కుక్షింభరిః = పొట్టనింపుకొనువాడును; నిజ = తనయొక్క. కాంతి = వెలుగు అనునట్టి. మౌక్తిక మణి శ్రేణీభిః = ముత్యాలదండలతో. ఏణీదృశామ్ = వనితలకు. సంస్కర్తా = అలంకారమైన వాడును (వెన్నెల స్త్రీలకు సౌందర్యవర్ధకమగు అలంకారమనుట); గీర్వాణాది

సంస్కర్తా నిజకాంతిమౌక్తిక మణిశ్రేణీభిరేణీదృశాం
గీర్వాణాధిపతేః సుధారసవతీ పౌరోగవః ప్రోదగాత్ ॥ 61

అపి చ —

ప్రాణాయామోపదేష్టా సరసిరుహవనే యౌవనోన్మాదలీలా
గోష్ఠీనాం పీఠమర్దస్త్రిభువనవనితానేత్రయోః ప్రాతరాశః ।

---

పతేః = దేవేంద్రునికి. సుధారసవతీ = అమృతాన్నశాలయొక్క (వంటశాల). పౌరోగవః = పాచకాధ్యక్షుఁడును (దేవతలు ఇతని అమృతమును భుజింతురనుట): అయిన. సః = సుప్రసిద్ధుఁడగు. దేవః = చంద్రభగవానుడు. ప్రోదగాత్ = ఉదయించెను. (శాద్దూలము) (రసవతీపాకస్థానమ్ - పౌరోగవస్తదధ్యక్షః - అమరః)

తాత్పర్యము :- శివుని శిరోదేశానికి దీపాంకురమై, కటికచీకటికి భోక్తయై తన వెన్నెలయను ముత్యాల దండలతో సొగసుకత్తెలను సంతోషపెట్టువాడై దేవేంద్రుని మహానసమునకు పాచకాగ్రణియై ప్రసిద్ధికెక్కిన కువలయహితుడు చంద్రుడు ఉదయించుచున్నాడు.

సమాసములు :- శ్రీకంఠస్య కిరీటమేవ కుట్టిమః - కుట్టిమస్య పరిష్కారః - పరిష్కారే పరిష్కారాయ వా ప్రదీపాంకురః. కైరవాణాం బంధుః. అంధతమసాం ప్రాగ్భారః - ప్రాగ్భారేణ కుక్షింభరిః - కుక్షిం బిభర్తి. మౌక్తిక మణీనాం శ్రేణీ - నిజస్య కాంతిరేవ మౌక్తిక మణిశ్రేణీ - తాభిః. ఏణీనాం దృశః ఇవ దృశః యాసాం తాః — తాసామ్, గీర్వాణానామధిపతిః - తస్య. సుధారసవత్యాః పౌరోగవః

సంధులు :- సః + శ్రీకంఠ — తదేతద్విసర్గలోప. అంకురః + దేవః — ఉత్వాదేశవిసర్గ. బంధుః + అంధ, శ్రేణీభిః + ఏణీ - రేఫాదేశవిసర్గ. దీప + అంకుర. గీర్వాణ + అధిపతేః - సవర్ణదీర్ఘ. ప్ర + ఉదగాత్ - గుణ.

క్రియ :— ఇణ్ గతౌ, పరస్మై, లుఙ్, ప్రథమ (ఉత్) ఇణోగాలుఙి
ఉదగాత్ - అగాతామ్ . అగుః

ప్రాణాయామేతి -: అపిచ = మరియు-సరసిరుహవనే=పద్మసమూహమందు. ప్రాణాయామోపదేష్టా=ప్రాణాయామమును ఉపదేశించువాడును. (నిమీలితదృక్ మౌనీ ప్రాణాయామం సమాచరేత్ - అని నియమము) పద్మములను ముకుళింప

కామాయుష్టోమయజ్వా శమితకుముదినీమౌనముద్రానురాగః
శృంగారాద్వైతవాదీ విభవతి భగవానేష పీయూషభానుః ॥ 62

---

చేయువాడని: యౌవనోన్మాద = యౌవన తీవ్రపరవశత్వము యొక్కయు, లీలా = విలాసములయొక్కయు, గోష్ఠీనామ్ = సమావేశములకును. పీఠమర్దః = (నాటకీయ) నాయకుని సహాయుడును. యౌవనమందలి స్త్రీపురుషుల కలయికలు కూర్చువాడనుట: త్రిభువన = ముల్లోకముల యందలి వనితా = స్త్రీలయొక్క. నేత్రయోః = కన్నులకు. ప్రాతరాశః = ప్రాతఃకాల భోజనము (ఉపాహారము) వంటివాడును. (ప్రాతరాశః కల్యవర్తః ప్రాతర్భోజనమిత్యపి. హారావళి) కామ = మన్మథునికి, ఆయుష్టోమ = ఆయుర్వృద్ధినిచ్చు యజ్ఞమునకు. యజ్వా = యాజకుడును – మన్మథాయుష్టోమమును చేయించువాడనుట: శమిత = ఉపశమింపజేయబడిన, కుముదినీ = కలువలయొక్క. మౌనముద్రానురాగః = మౌనవ్రతప్రీతి కలవాడును – కలువల మౌనవ్రతదీక్షను విడిపించినవాడనుట (కలువలను వికసింపజేయువాడు): శృంగారాద్వైతవాదీ = శృంగారమొక్కటే రసము అని సమర్థించువాడును అయిన, ఏషః = ఈ, భగవాన్ = భగవంతుడగు. పీయూషభానుః = అమృతకిరణుడగు చంద్రుడు, విభవతి = వైభవమును ప్రకటించుచున్నాడు. (స్రగ్ధర).

తాత్పర్యము :- పద్మములను ముకుళింపజేయువాడును. యువతీ యువకులను కలుపువాడును, ముల్లోకములందను వనితల నేత్రములకు ఆనందదాయకుడును, కామాయుష్టోమమును నిర్వహించు యాజ్ఞికుడును, కలువల మౌనవ్రత దీక్షను విరమింపజేయువాడును. శృంగారమొక్కటే రసమని ప్రతిపాదించువాడును. అయిన చంద్రుడు విభాసించుచున్నాడు. (పీఠమర్దో విటశ్చైవ విదూషక ఇతి త్రయః శృంగారే నర్మసచివా నాయకస్యానునాయకాః – భరతుడు)

సమాసములు :- ప్రాణాయామస్య ఉపదేష్టా. సరసిరుహాణాం వనమ్ – తస్మిన్. యౌవనస్య ఉన్మాదః – లీలా చ గోష్ఠీ చ – ఉన్మాదో లీలాగోష్ఠ్యః – తాసామ్. త్రిభువనస్య వనితాః – వనితానాం నేత్రే – తయోః. కామాయుష్టోమస్య యజ్వా. కుముదినీనాం మౌనముద్రా – ముద్రాయామనురాగః – శమితః కుముదినీ మౌనముద్రానురాగః యేన సః. శృంగారాద్వైతం వాదయతీతి. పీయూషమయా భానవో యస్య సః.

లక్ష్మణః (విలోక్య సకౌతుకమ్)

కర్ణోత్తంసయవాంకురం కరతలే కృత్వా హసిత్వా మిథః
సంహూతః పురుహూతపౌరయువతీవర్గేణ కౌతూహలాత్ ।
గ్రాసార్తి క్షుభితోఽయమంకహరిణః కుర్వీత కిం కిం కళా
కంథా మిందుమయీ మజస్రఘటనోద్ఘాటశ్లథావస్థితామ్ ॥ 63

---

సంధులు :- [illegible] + త్రిభువన - సాదేశవిసర్గ. వాదః + విభవతి - ఉత్వ[illegible]. ఏషః + [illegible] - తదేతద్విసర్గలోప.

క్రియ :- భూ సత్తాయామ్. పరస్మై. లట్. ప్రథమ (వి)
భవతి - భవతః - భవన్తి

వ్యుత్పత్తి :- (విలోక్య = చూచి, సకౌతుకమ్ = ఉత్సుకతతో) కర్ణోత్తంస = చెవికి అలంకారముగా ధరించిన, యవాంకురమ్ = గడ్డిపరకను, కరతలే కృత్వా = చేత బట్టి, మిథః = పరస్పరము. హసిత్వా = నవ్వుకొని, పురుహూత పౌరయువతీవర్గేణ = దేవకాంతా సమూహముచేత, కౌతూహలాత్ = ఉత్సుకతవలన, సంహూతః = [దా ! దా ! ! అని] పిలువబడినదై, అయమ్ = ఈ, అంకహరిణః = చంద్రునిలోని హరిణము, గ్రాసార్త్యా = ఆకలితో, క్షుభితః = కలతజెందినదై - ఆకలిగొన్న తన గెంతులతో - ఇందుమయీమ్ = చంద్రరూపమున నున్నదియు, అజస్ర = ఎల్లప్పుడును, ఘటనోద్ఘాట = చుట్టుట విప్పుటలతో, శ్లథావస్థితామ్=శిథిలావస్థను పొందినదియునగు, కళాకంథామ్ = వెన్నెల బొంతను [చంద్రకళయను బొంత], కిమ్ కిమ్ కుర్వీత = ఏమి చేసినదో - తన గెంతులతో మరింత పాడుచేసినదేమో అనుట. [శార్దూలము]

తాత్పర్యము :— కర్ణాభరణములుగా ధరించిన గడ్డిపరకలను తీసి చేత బట్టుకొని పరస్పరము పలుకరించుకొనుచు నవ్వుకొనుచు దేవకాంతలు కుతూహలము కొలది చంద్ర హరిణమును రారమ్మని పిలుచుచున్నారు. ఆకొన్న ఈ హరిణము చిందులు త్రొక్కుచు అసలే శిథిలావస్థకు వచ్చిన [నెలనెల చుట్టుట విప్పుటలు కారణముగా] వెన్నెల బొంతను ఇంకెంతగా పాడుచేయునో।

మా ఖాంక్షీదనుమాసనవ్య ఘటనానిస్పంధిబంధం వపుః
శీతాంశోః క్షపితస్తు కల్యపదయం దుఃఖాయ వర్తిష్యతే ॥ 64

అపిచ —

ఏతస్య కళామేకామమృతమయూఖస్య పార్వతీరమణః ।
వర్ణావళిమివ వహతి ప్రతిమాసం ఘట్యమానస్య ॥ 65

---

సమాసములు :- రోమంథేన ప్రచలమోష్ఠపుటం యథా స్యాత్తథా. సుఖమాసీనః. మాసే మాసే - అనుమాసం యన్నవ్యఘటనా—ఘటనయా నిస్పందిబంధమ్.

సంధులు :- ప్రచ = ఓష్ఠ - వృద్ధి. ఆసీనః + చిరమ్ — శాదేశవిసర్గ. వధూభిః + అంక, తాభ్యైః + అతి - రేఫాదేశవిసర్గ హారిణః + తాభ్యైః. క్షపితః + తు - సాదేశవిసర్గ. అతి + ఉత్ — గుణసంధి.

క్రియ :- కాంక్షి ఆమర్దనే. [క్షమ్] లుఙ్. పరస్మై. ప్రథమ
అకాంక్షీత్ - అకాంక్షిష్టామ్ - అకాంక్షిషుః
వృతుఙ్ వర్తనే. లృట్. ఆత్మనే. ప్రథమ
వర్తిష్యతే - వర్తిష్యేతే - వర్తిష్యన్తే

ప్రతిపదార్థము :- అపిచ = మరియు. ప్రతిమాసమ్ = ఏనెలకానెల. ఘట్యమానస్య = క్రొత్తరూపును ధరించువాడైన. ఏతస్య = ఈ. అమృత మయూఖస్య = చంద్రునియొక్క. ఏకామ్ = ఒకానొక, కళామ్ = రేఖను [కళను]. వర్ణావళిమ్ ఇవ = పర్యాయ సంఖ్యను తెలుపు అక్షర మాలికవలె, పార్వతీరమణః = శివుడు. వహతి = ధరించుచున్నాడు.

తాత్పర్యము :- ఏనెలకానెల క్రొత్తరూపు ధరించు ఈ చంద్రుని ఒక కళను పర్యాయ సంఖ్యాసూచకమగు అక్షరపంక్తివలె శివుడు ధరించును.

సమాసములు :- అమృతమయాః మయూఖాః యస్య సః — తస్య. పార్వత్యాః రమణః. వర్ణానామావళిః - తామ్. మాసే మాసే - ప్రతిమాసమ్.

క్రియ :- వహ ప్రాపణే. లట్. పరస్మై. ప్రథమ.
వహతి - వహతః - వహన్తి

రామః :- (సాదరం ప్రణమ్య)

త్వం గీర్వాణగణాయ నిత్యమమృతశ్రాద్ధం భవద్దీధితిః
ధాత్రీకర్మ చ వీరుధాం విదధతీ ధత్తే జగజ్జీవితమ్ ।
సోమ త్వామనిధాయ మూర్ధని భవేత్కః కాలకూటం గిలన్
కంఠే తచ్ఛలకాలపాశవలయాలీఢోఽపి మృత్యుంజయః ॥ 66

---

త్వమితి :- [సాదరమ్ = ఆదరముతో, ప్రణమ్య = నమస్కరించి] సోమ = ఓ చంద్రుడా! త్వమ్ = నీవు, గీర్వాణగణాయ = దేవ సమూహమునకు, నిత్యమ్ = ఎల్లప్పుడును, అమృతశ్రాద్ధమ్ = అమృతరూపమగు హవ్యమవు [శ్రద్ధతో ఇచ్చుహవ్యము హవ్యే కవ్యే భవేచ్ఛ్రాద్ధమ్ - విశ్వః]. భవత్ = నీయొక్క. దీధితిః = కాంతికిరణము, వీరుధామ్ = ఓషధీలతలకు. ధాత్రీకర్మ = దాదిచేయు పనిని - పోషణాదికమును, విదధతీ = చేయునదై. జగజ్జీవితమ్ = జగత్తుయొక్క ప్రాణమును ధత్తే = నిలబెట్టుచున్నది. సోమ = ఓ చంద్రుడా! త్వామ్ = నిన్ను, మూర్ధని = శిరస్సునందు, అనిధాయ = ధరింపవేని. కః = ఎవడు. కాలకూటమ్ = కాలకూటమును. గిలన్ = మ్రింగినవాడై, కంఠే = గళమునందు. తత్ + ఛల = ఆ కాలకూట మిషతో ఏర్పడిన, కాలపాశవలయ = యమపాశబంధముతో. ఆలీఢః అపి = ఆలింగింపబడియు, మృత్యుంజయః భవేత్ = మృత్యుంజయుడగును! [శార్దూలము]

తాత్పర్యము :- ఓ చంద్రుడా! నీవు దేవతలకు అమృతాహారమవు. నీ కాంతికిరణము ఓషధీలతలను పెంచి జగజ్జీవితమును కాపాడుచున్నది. నిన్ను శిరస్సుపై ధరించెను గావున శివుడు పాశమువంటి కాలకూటమును గొంతున బిగించుకొనియు మృత్యుంజయుడైనాడు.

సమాసములు :- గీర్వాణాం గణః - షష్ఠీ. అమృతమయం శ్రాద్ధమ్. ధాత్ర్యాః కర్మ. జగతః జీవితమ్. తచ్ఛలశ్చాసౌ కాలకూటవలయశ్చ - వలయేన ఆలీఢః.

సంధులు :- జగత్ + జీవితమ్. తత్ + ఛల - శ్చుత్వ. వలయ + ఆలీఢః - సవర్ణదీర్ఘ. ఆలీఢః + అపి - ఉత్వాదేశవిసర్గ - ఆలీఢో + అపి = పూర్వరూప.

(సీతాంప్రతి)

నేత్రాణాం మధుపర్కసత్త్రముదధేః సర్వాంగమేదస్కరః
శృంగారస్య రసాయనం మఖభుజాం పీయూషగండాపతిః।
దేవః కిం స్తుమహే మహేశ్వరశిరోనేపథ్యరత్నాంకురః
క్షీరోదార్ణవశుక్తిమౌక్తికమయం దాక్షాయణీనాయకః ॥ 67

---

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః, లట్. ఆత్మనే. ప్రథమ
ధత్తే - దధాతే - దధతే
భూ సత్తాయామ్, విధిలిఙ్. పరస్మై. ప్రథమ
భవేత్ - భవేతామ్ - భవేయుః

నేత్రాణామితి :- [సీతాంప్రతి = సీతనుద్దేశించి] అయమ్ = ఈ, దేవః = పూజ్యుడగు, దాక్షాయణీనాయకః = తారాపతి, [దాక్షాయణి మున్నగు నక్షత్రములకు నాయకుడగు. దాక్షాయణ్యోఽశ్వినీత్యాదితారాః - అమరః] నేత్రాణామ్ = జనుల నేత్రములకు మధుపర్కసత్త్రమ్ = మధుపర్కములు పంచు సత్రము [దధిఘృత మధువులతో చేసిన తీయని పదార్థము మధుపర్కము] ఉదధేః = సముద్రమునకు, సర్వాంగమేదస్కరః = సర్వావయవ పరిపుష్టికరుడు [పున్నమినాడు కడలి పొంగును]. శృంగారస్య = శృంగార రసమునకు. రసాయనమ్ = పుష్టికరమగు మందు - లేక - ఔషధాది రసాయనము. మఖభుజామ్ = దేవతలకు, పీయూష గండాపతిః పీయూష = అమృతమనునట్టి. గండా = మద్యశాలకు. పతిః = అధిపతి. [గండా తు మదిరాగృహమ్ - అమరః గండాఖనౌ సురాగేహే - మేదినీ] మహేశ్వర = శివునియొక్క. శిరః = శిరస్సుయొక్క. నేపథ్య = అలంకారమునకైన, రత్నాంకురః = రత్నపు మొలక. [ఆకల్పవేషౌ నేపథ్యమ్ - అమరః] క్షీరోదార్ణవ = క్షీరసముద్రమనునట్టి. శుక్తి = ముత్తెపు చిప్పకు. మౌక్తికమ్ = ముత్తెము. కిమ్ స్తుమహే = ఏమి స్తుతింతుము ! - స్తుతింపలేమనుట. [శార్దూలము].

సమాసములు :— సర్వాణి చ తాని అంగాని చ - సర్వాంగాణాం మేదస్కరః. మఖం భుంక్తే తేషామ్. పీయూషస్య గండా - గండాయాః పతిః. మహేశ్వరస్య శిరః - శిరసః నేపథ్యమ్ - నేపథ్యాయ రత్నాంకురః - రత్నస్య అంకురః. క్షీరోదార్ణవః ఏవ శుక్తిః - శుక్తేః మౌక్తికమ్. దాక్షాయణీనాం నాయకః.

సీతా : (హసన్తీ) ఆర్యపుత్ర. సమానకులశీలరూపయౌవనానామపి సపత్నీనాం శీర్షే దత్తో ధన్యయా దక్షగోత్రధవళయా రోహిణ్యా చరణః. యేన రోహిణీరమణ ఏవ భగవాంశ్చంద్రః శ్రూయతే. (అజ్జఉత్త సమాణకులసీలరూవజోవ్వణాణం వి సవత్తీణం సీసే దిణ్ణో ధణ్ణాఏ దక్ఖగోత్తధవలాఏ రోహిణీఏ చలణో. జేణ రోహిణీరమణోజ్జేవ భఅవం చందో సుణీఅది).

రామః :- (విహస్య) అం జానకి,

ప్రియోపభోగ తుల్యేఽపి తారాణాం సప్తవింశతేః ।
ధత్తే కిమపి సౌభాగ్యమంజరీమిహ రోహిణీ ॥ 68

---

క్రియ :- ష్టుఞ్ స్తుతౌ, ఆత్మనే, లట్. ఉత్తమ
స్తువే - స్తువహే - స్తుమహే

ఆర్యపుత్రేతి :- [హసన్తీ = నవ్వుచు] ఆర్యపుత్రా ! సమాన కులశీల రూప యౌవనానామ్ = సమానమైన కులము, శీలము, రూపము, యౌవనము కల వారైన, సపత్నీనామ్ = సవతుల యొక్క, శీర్షే = శిరస్సునందు, ధన్యయా = ధన్యురాలును, దక్షగోత్ర = దక్షప్రజాపతి వంశముయొక్క, ధవళయా = స్వచ్ఛ కాంతియునైన, [ధవళస్సుందరేఽమలే - విశ్వః] రోహిణ్యా = రోహిణిచే, చరణః = పాదము దత్తః = ఉంచబడినది - సవతులను తలదన్నినదనుట. యేన = ఎందుచేతననగా. భగవాన్ = మహానుభావుడగు, చంద్రః=చంద్రుడు, రోహిణీరమణః ఏవ శ్రూయతే= రోహిణీరమణుడు అనియే పేర్కొనబడుచున్నాడు — చంద్రుడు రోహిణీ పతిగానే ప్రసిద్ధికెక్కెను గావున సవతులు తిరస్కృతలైరనుట.

ప్రియేతి :- [విహస్య = నవ్వి] అమ్, జానకి = అగును, సీతా !. సప్తవింశతేః = ఇరువదియేడైన, తారాణామ్ అపి = తారలకును [వింశత్యాద్యాః సదైకత్వే సంఖ్యాః సంఖ్యేయ సంఖ్యయోః] ప్రియోపభోగతుల్యే = భర్తృసుఖము సమానముగా నున్నను, రోహిణీ = రోహిణి మాత్రము, కిమపి=ఏదో అనిర్వాచ్యమగు, సౌభాగ్య మంజరీమ్ = సౌభాగ్య ఖ్యాతిని. ధత్తే = వహించుచున్నది. [సౌఖ్య మంజరీమ్ అని పాఠాంతరము] అనుష్టుప్పు.

(స్పర్శం చ రూపయన్)

దళిత కుముద కోశోదంచదూష్మోపచార
క్షణశమిత చకోరీ చంద్రికాపాన జాడ్యాః ।
అభిసృతిషు మృగాక్షీ మూక దూత్యః స్వదన్తే
శశిమణిమకరన్దోత్కన్దలాశ్చన్ద్రభాసః ॥ 60

---

తాత్పర్యము :- సవతులందరికిని [27 తారలు] భర్తృసౌఖ్యము సమానముగానే లభించుచున్నను రోహిణికి మాత్రము ఏదో సౌభాగ్యాతిశయమున్నట్లున్నది- చంద్రుడు ఆమెపేర రోహిణీరమణు డయినాడు.

(స్పర్శమ్ = జ్యోత్స్నా స్పర్శను. రూపయన్ = అనుభవించుచు)

దళితేతి :- దళిత = వికసించిన. కుముద = కలువలయొక్క. కోశ = గర్భభాగమునుండి. ఉదంచత్ = పైకెగయుచున్న. ఊష్మ = వెచ్చందనముయొక్క. ఉపచార = సేవనముచే. క్షణ = క్షణకాలము. శమిత = ఉపశమించిన. చకోరీ = చకోరాంగనలయొక్క (వెన్నెల పిట్టలు). చంద్రికాపాన = (వెన్నెల త్రాపుటవల్లనైన) జ్యోత్స్నాపానముచేనైన. జాడ్యాః = జడత్వము కలవియును - ఆ పిట్టల జడత్వము క్షణము ఉపశమించినదనుట. అభిసృతిషు = అభిసారికలైన. మృగాక్షీ = చంచలనేత్రలకు. మూకదూత్యః = మౌన దూతికలును. శశిమణి = చంద్రకాంత మణులయొక్క. మకరన్ద = మకరందమునుండి పొటమరించిన, ఉత్కన్దళాః = మొలకలును - అయిన- చంద్రభాసః = చంద్రకిరణములు. స్వదన్తే = ప్రీతిని కల్గించుచున్నవి. (మాలినీ వృత్తము).

తాత్పర్యము :- వికసించిన కలువలనుండి వెలువడుచున్న వెచ్చదనముతో చంద్రికాపానమత్తలైన చకోరాంగనల జాడ్యము క్షణకాల ముపశమించుచున్నది. కలువలను వికసింపజేసి ఉపశమనమును కల్గించుచున్నవి చంద్రకాంతులు. ఇవి అభిసారికలకు మౌనదూతికలు. చంద్రకాంతమణులనుండి స్రవించుచున్న మకరందము నుండి పొటమరించుచున్న మొలకలు ఇవి.

అపి చ —

తైస్సర్వక్షీభవ దభిసృతానేత్ర సిద్ధాంజనై ర్వా
నీరంధ్రైర్వా త్రిభువనదృశా మంధపట్టై స్తమోభిః।
వ్యాప్తం పృథ్వీవలయమఖిలం క్షాళయన్నుచ్ఛలద్భి
ర్జ్యోత్స్నాజాలై రయముదయతే శర్వరీసార్వభౌమః ॥ 70

---

సమాసములు :- దళితశ్చాసౌ కుముదశ్చ - కుముదస్య కోశః - కోశాదు దంచచ్చ తదూష్మ చ - ఊష్మణః ఉపచారః - ఉపచారేణ క్షణ శమితమ్. చకోరీణాం చంద్రికాపానమ్ - పానేన జాడ్యమ్ - క్షణశమితం జాడ్యం యాభిః - తాః (భాసః). అభిసృమరాశ్చ తా మృగాక్ష్యశ్చ-మృగాక్షీణాం మూకదూత్యః. శశిమణీనాం మకరందః- మకరందాత్ ఉత్కందలాః చంద్రస్య భాసః.

క్రియ :- ష్వదఙ్ ఆస్వాదనే. లట్. ఆత్మనే. ప్రథమ.
స్వదతే — స్వదేతే — స్వదన్తే

తై రితి :- అపిచ = మరియు — సర్వక్షీభవత్ = అతిచతురమైన. అభిసృతా = అభిసారికలయొక్క, నేత్ర = నయనములకు. సిద్ధాంజనైః=సిద్ధాంజనములను (తమోఽభిసారికలకు చీకటులు సిద్ధాంజనములనుట). త్రిభువన దృశామ్=ముల్లోకముల వారినేత్రములకును, అంధపట్టైః=అంధత్వమును కల్పించు పట్టములునైన. నీరంధ్రైః= దట్టముగా అలముకొన్న, తమోభిః = చీకటులతో. వ్యాప్తమ్ = నిండిన. అఖిలమ్ = సమస్తమైన. పృథ్వీవలయమ్ = భూమండలమును. క్షాలయన్ = ప్రక్షాళించుచు. ఉచ్ఛలద్భిః = వికసించుచున్న, తైః = స్తుత్యములగు. జ్యోత్స్నాజాలైః = చంద్రికా సమూహములతో. అయమ్ = ఇతడే. శర్వరీసార్వభౌమః = నిశావల్లభుడు చంద్రుడు. ఉదయతే = ఉదయించుచున్నాడు — లేక — వృద్ధిపొందుచున్నాడు. (మందాక్రాంతము)

తాత్పర్యము :- నెరజాణలైన తమోఽభిసారికలకు సిద్ధాంజనములును, త్రిలోకముల యందును జనుల నేత్రములకు అంధపట్టములును అయిన చీకట్లతో నిండిపోయిన భూమండలమును తన వెన్నెల వాకంతో ప్రక్షాళితము గావించుచు శర్వరీ సార్వభౌముడు చంద్రుడు ఇదే ఉదయించుచున్నాడు.

అపి చ జగతా మనుగ్రహాయ

ఉదయతి కలమన్ద్రైః కంఠతాళై రళీనాం

కుముదముకుళకేషు వ్యంజయన్నంగహారాన్ ।

---

సమాసములు :- స్వాక్షీవ స్త్యశ్చ తాః అభిసృతాశ్చ - అభిసృతానాం నేత్రాణి - నేత్రాణాం సిద్ధాంజనాని - తైః. త్రయాణాం భువనానాం సమాహారః - త్రిభువనస్య దృశః - తాసామ్. పృథ్వ్యాః వలయః - తమ్. జ్యోత్స్నానాం జాలః - తైః. శర్వర్యాః సార్వభౌమః.

సంధులు :- అంజనైః + వా సింధ్రైః + వా. ఉచ్ఛలద్భిః + జ్యోత్స్నా. జాలైః + అయమ్ - రేఫాదేశవిసర్గ. తైః + సర్వ. సద్యః + తమోభిః - సాదేశవిసర్గ. ఘటయన్ + ఉచ్ఛలద్భిః = అనునాసికద్విత్వ.

క్రియ :- అయజ్ గతౌ. లట్. ఆత్మనే. ప్రథమ (ఉత్)

ఉదయతే - ఉదయేతే - ఉదయన్తే

ఉదయతీతి :- అపిచ = మరియు. జగతామ్ = లోకములకు, అనుగ్రహాయ = అనుగ్రహము కొరకై - లోకములను అనుగ్రహించుటకు ఉదయించుచున్నాడని అన్వయము (ఇది కొన్ని ప్రతులలో లేదు) మద = మదముచే, ముఖర = వాచాలములైన. చకోరీ = వెన్నెల పులుగులకు, తోష = ఆనందము కల్గించునట్టి. కర్మాంతికః = కామందుడును (కర్మాధ్యక్షుడు). తుహిన=మంచుతో (వలె), రుచిర= ప్రకాశించు, ధామా = కాంతికలవాడును. దక్షిణమ్ = ప్రీతిప్రదమైన. లోకచక్షుః= లోకనేత్రమునైన చంద్రుడు. అయమ్ = ఇదిగో. అళీనామ్ = తుమ్మెదలయొక్క. కలమన్ద్రైః = మధుర గంభీరములైన. కంఠతాళైః = కంఠధ్వనితో కూర్చు తాళములతో. కుముదముకుళకేషు = కలువ మొగ్గలయందు. అంగహారాన్ = అంగవిక్షేపములను. (అంగహారోఽంగవిక్షేపః - అమరః). వ్యంజయన్ = ప్రకటపరచుచు. ఉదయతి = ఉదయించుచున్నాడు. తుమ్మెదల నోటి పాటమునకు కలువల కదలికలు నృత్తమనుట. తాం త త్తహి తహి ఇత్యాదిగా భాషారహితముగా తాళలయానుకూలముగా పాడుటను సంగీతవిదులు పాటమందురు. (మాలిని).

మదముఖర చకోరీ తోష కర్మాంతికోఽయం
తుహిన రుచిరధామా దృశ్యతాం లోకచక్షుః ॥ 71

ఇదం చాస్య —

ప్రాచీనాచలచుంబి చంద్రమణిభిర్నిర్వ్యూఢపాద్యం స్వకై-
ర్నిర్యాసైరుడుభిర్నిజేన వపుషా దత్తార్ఘ లాజాంజలి ।

---

తాత్పర్యము :- లోకానుగ్రహ బుద్ధితో జగత్ప్రియుడగు చంద్రుడు ఉదయించుచున్నాడు. తుమ్మెదల కంఠతాళములతో కలువ కన్నెలు నృత్తము చేయుచున్నవి. చకోరాంగనలను సంతోషపెట్టు పెద్దకాపుండు ఈ చంద్రుడు. మంచుతో తెల్లనైన కిరణములు కలవాడిదే ఉదయించుచున్నాడు.

సమాసములు :- కలాశ్చ తే మంద్రాశ్చ — తైః. కంఠేన తాలాః — తైః. కుముదానాం ముకులకాః — తేషు. మదేన ముఖరాః — మదముఖరాశ్చ తాశ్చకోర్యః — చకోరీణాం తోషః — తోషే (తోషస్య వా) కర్మాంతికః. తుహినేన రుచిరం ధామ యస్య సః. లోకస్య చక్షుః.

సంధులు :- తాలైః + అలీనామ్ - రేఫాదేశవిసర్గ. వ్యంజయన్ + అంగ అనునాసికద్విత్వ. కర్మాంతికః + అయమ్ — ఉత్వాదేశవిసర్గ — కర్మాంతికో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- "అయ" గతౌ (భ్వాది). పరస్మై. లట్. ప్రథమపు (ఏక్)
అయతి — అయతః — అయన్తి

ప్రాచీనేతి :- ఇదమ్ చ = ఇదియు. అస్య = ఈ చంద్రునియొక్క (వెన్నెల వ్యాపించుచున్నదని అన్వయము) . ప్రాచీనాచల = ఉదయ పర్వతమును. చుంబి = ఆశ్రయించియున్న. చంద్రమణిభిః = చంద్రకాంత మణులతో. స్వకైః = తమవైన. నిర్యాసైః = జలస్రవణములతో. నిర్వ్యూఢ = నిర్వహింపబడిన. పాద్యమ్ = పాదోదకము కలదియు; ఉడుభిః = నక్షత్రములచే. నిజేన = తమదైన. వపుషా = రూపముతో. దత్త = సమర్పింపబడిన, అర్ఘ = విలువైన, లాజాంజలి = లాజాంజలి కలదియు . పూజాద్రవ్యముగా పేలాలు సమర్పింతురు. నక్షత్రములు అట్లున్నవనుట: అంతః = బింబ మధ్యభాగమునందలి. ప్రౌఢ = సాంద్రమైన. కళంక = కళంకముతో

అంతః ప్రాంశి కళంకతుచ్ఛమఖిలః సాంద్రం పరిస్తీర్యతే
బింబాదంకుర భగ్నశైశితమస్సందోహ మిందోర్మహః ॥ 72

ఏనం చ —

మృగరాజకరజభంగురకింశుక కళికావతంసికాః సుదృశః ।

---

తుచ్ఛమ్ = విరహితమును - బింబములోనున్న కళంకము వెన్నెలలో లేదనుట; అంకుర = అంకురావస్థయందే. భగ్న = వినాశము గావింపబడిన, శైశితమస్సందోహమ్ = రాత్రి చీకటిగుంపు కలదియు - చీకటిని ప్రారంభదశయందే భగ్నము గావించె ననుట: అయిన — ఇందోః = చంద్రునియొక్క, మహః = తేజస్సు (వెలుగు), బింబాత్ = బింబమునుండి, అఖిలః = అన్నిపై పులకును, సాంద్రమ్ = దట్టముగా, పరిస్తీర్యతే = వ్యాపించుచున్నది. (శార్దూలము).

తాత్పర్యము :- తూర్పుకొండపై చంద్రకాంతమణులు తమకు తాము స్రవించి చంద్రునికి పాద్యమిచ్చుచున్నవి. నక్షత్రములు తమ రూపములతో లాజాంజలి సమర్పించుచున్నవి. బింబములో కళంకమున్నను వెన్నెల నిష్కళంకముగా నున్నది. చీకటులను అంకురావస్థలోనే త్రుంచివేసిన ఈ వెన్నెల చంద్రబింబమునుండి దట్టముగా అన్నిపై పులకును వ్యాపించుచున్నది.

సమాసములు :- ప్రాచీనశ్చాసౌ అచలశ్చ - అచలం చుంబన్తీతి - చుంబినశ్చ తే చంద్రమణయశ్చ - తైః. దత్తః అర్ఘలాజాంజలిః యస్మై తత్. అంతర్గతశ్చ ప్రాంశుశ్చాసౌ కళంకశ్చ - కళంకేన తుచ్ఛమ్. అంకురే భగ్నః శైశిక తమసాం సందోహః యేన తత్.

సంధులు :- మణిభిః + నిర్వ్యూఢ. నిశైః + నిర్యాస్తైః + ఉడుభిః + నివేన, ఇందోః + మహః - రేఫాదేశవిసర్గ వి + ఊఢ - యణాదేశ.

క్రియ :- స్తృఞ్ ఆచ్ఛాదనే. (కర్మణి) లట్. ఆత్మనే. ప్రథమ.
స్తీర్యతే — స్తీర్యేతే — స్తీర్యన్తే

మృగరాజేతి :— ఏనమ్ చ = ఈ చంద్రుని (చూచుచున్నారని అన్వయము) సుదృశః = అందమైన కన్నులుగల స్త్రీలు. మృగరాజ = సింహముయొక్క, కరజ = గోరువలె, భంగుర = వక్రమైన, కింశుక కళికా = మోదుగు మొగ్గ, అవతం

భయసంకుచదంకహరిణ బహళోజ్జ్వల మిందు మీక్షన్తే ॥ 73

విభీషణః :- ఇందోరేకకళాయా రుద్రేణోద్ధృత్య మూర్ధని ధృతాయాః ।
స్థానమివ తుచ్ఛమేతత్కళంకరూపేణ పరిణమతే ॥ 74

---

సికాః = కర్ణాభరణముగా కలిగినవారై. భయ = భీతితో. సంకుచత్ = కుంచించుకు పోవుచున్న (ముడుచుకుపోవుచున్న). అంకహరిణ = లాంఛన మృగమువలన (చంద్ర లాంఛనమగు హరిణము ముడుచుకుపోవుటచే). బహుళ = మిక్కిలి, ఉజ్జ్వలమ్ = ప్రకాశించుచున్నవాడగు. ఇందుమ్ = చంద్రుని. ఈక్షన్తే=తిలకించుచున్నారు (అర్థ)

తాత్పర్యము :- చెవులలో మోదుగుమొగ్గలు అలంకరించుకొని స్త్రీలు చంద్రుని తిలకించుచుండగా. లాంఛన హరిణము సింహనఖములవంటి ఆ మోదుగు మొగ్గలకు భయపడి ముడుచుకొనిపోగా వెన్నెల అతిశయించినది (బహుళచంద్ర జ్యోత్స్న ఎ).

సమాసములు :- మృగాణాం రాజా-మృగరాజస్య కరజః-కరజ ఇవ భంగురః - కింశుకస్య కళికా- భంగురా చ సా కళికా చ - కళికా అవతంసః యాసాం తాః. శోభనం దృగ్యాసాం తాః. భయేన సంకుచన్ -సంకుచంశ్చాసౌ అంకహరిణశ్చ-హరిణేన బహళమ్ ఉజ్జ్వలః - తమ్.

క్రియ :- ఈక్షట్ దర్శనే. లట్, ఆత్మనే, ప్రథమ.

ఈక్షేతే - ఈక్షేతే - ఈక్షన్తే

ఇందోరితి :- రుద్రేణ=శివునిచేత. ఉద్ధృత్య = త్రుంచబడి. మూర్ధని= శిరస్సునందు. ధృతాయాః = ధరింపబడిన. ఇందోః = చంద్రునియొక్క. ఏకకళాయాః ఒక కళయొక్క, తుచ్ఛమ్ స్థానమ్ = రహిత స్థానము-శూన్యప్రదేశము. ఏతత్ = ఈ. కళంక రూపేణ=లాంఛన రూపముగా. పరిణమతే=భావింపబడుచున్నది.

తాత్పర్యము :- చంద్రకళలలో ఒకదానిని శివుడు త్రుంచి స్వీకరించి శిరస్సున అలంకరించుకొనెను అట్లు ఏర్పడిన వెలితియే కళంకముగా భావింపబడు చున్నది. (అర్థ)

క్రియ -: ణమ ప్రహ్వత్వే శబ్దేచ - కర్మవ్యతిహారే ఆత్మనే. లట్. ప్రథమ, పరిణమతే - పరిణమేతే - పరిణమన్తే (పరి)

(విహస్య రామంప్రతి)

రోదసీకూపమండూకః కియద్దేష ప్రకాశతే।
చంద్రమా యదయం దేవ త్వత్కీర్తేః ప్రతిగర్జతి ॥ 75

సీతా :— (సస్మితమ్) జానామ్యార్యపుత్రస్య కీర్తికాన్తిభిః ప్రతిస్పర్ధాం కృత్వా పరాజితేన సంప్రతి భగవతా హరిణాంకేన కళంకసంహతి రర్జితా (జాణామి అజ్జఉత్తస్స కిత్తికంతీహిం పడిస్పద్ధం కదుఅ పరాజిదేణ సంపది భవఅదా హరిణంకేణ కళంక సంఘదీ విఢత్తా)
(సర్వే హసన్తి. రామః స్మయతే)

---

రోదసీతి :- (విహస్య=నవ్వి. రామంప్రతి=రామునుద్దేశించి) రోదసీ=భూనభోంతరాళమనునట్టి. కూప = నూతియందలి, మండూకః = కప్పవంటి వాడైన. ఏషః = ఈ, చంద్రమా = చంద్రుడు. కియత్ ప్రకాశతే = ఏపాటి ప్రకాశము కల వాడు. దేవ = మహాప్రభూ। అయమ్=ఈ చంద్రుడు. త్వత్కీర్తేః = నీ కీర్తికి. ప్రతి గర్జతి = పోటీ పడుచున్నాడు. (అనుష్టుప్పు).

తాత్పర్యము : రామభద్రా। రోదసీకూపస్థ మండూకమగు ఈ చందమామ తన ప్రకాశము ఏ పాటిదని నీ కీర్తితో స్పర్ధించుచున్నాడు।

సమాసములు :- రోదసీ ఏవ కూపః - కూపస్య (కూపేవా) మండూకః ఇవ. తవ కీర్తిః - తస్యాః

క్రియ :- గర్జ శబ్దే. లట్. పరస్మై. ప్రథమ.
గర్జతి - గర్జతః - గర్జన్తి
కాశృఙ్ దీప్తౌ. లట్. ఆత్మనే. ప్రథమ (ప్ర)
ప్రకాశతే - ప్రకాశేతే - ప్రకాశన్తే

జానామీతి :- ( సస్మితమ్ = చిరునవ్వుతో ) ఆర్యపుత్రస్య = ప్రభువు యొక్క. కీర్తి కాంతిభిః = యశః కాంతులతో, ప్రతిస్పర్ధాం కృత్వా = పోటీపడి. పరాజితేన = ఓడిపోయిన భగవతా = భగవంతుడగు. హరిణాంకేన = చంద్రునితో, సంప్రతి=ప్రస్తుతము. కళంక సంహతిః = దట్టమైన కళంకము. అర్జితా=సంపాదింప

(రామం ప్రతి)

ప్రారంభం శ్రీవత్సలాంఛన భుజాపర్యస్తమంథాచల
క్షోభోచ్ఛలిత దుగ్ధసింధు లహరీ గర్భచ్ఛవిసదృశమ్।
కో గాయతి న తే రఘూణాం ప్రభో౽ంధకార పక్షాంతరా
సంతృట్యన్మృగాంక మండల ఖండోద్దామగౌరం యశః॥ 76

---

బడినది - అని - జానామి=ఎఱుగుదును. (సర్వే=అందరును. హసన్తి = నవ్వుదురు. రామః = రాముడు. స్మయతే = చిన్నగా నవ్వును).

ప్రారంభమితి :- (రామంప్రతి=రామునుద్దేశించి) ప్రారంభమ్=మొదట నుండియు. శ్రీవత్సలాంఛన = విష్ణుమూర్తి యొక్క. భుజా = బాహువులచేత. పర్యస్త=సంచాలితమైన. మంథాచల = మంథర పర్వతము వలననైన క్షోభ = అవలోడనముతో. ఉచ్ఛలిత=పైకెగసిన. దుగ్ధ సింధులహరీ = పాలకడలి తరంగముల యొక్క. గర్భ = మధ్యభాగమునందలి, ఛవి = కాంతితో. సదృశమ్=సాటివచ్చునదియు అంధకార పక్ష+అంతరా=కృష్ణ పక్ష మధ్యకాలమున. సంతృట్యత్ = కృశించిన. మృగాంక మండలఖండ=చంద్ర (బింబ) రేఖవలె. ఉద్దామ = మిక్కిలి. గౌరమ్ = తెల్లనిదియునైన. రఘూణామ్ ప్రభో = రఘువంశ విభుడవగు. తే = నీ యొక్క. యశః=కీర్తిని. కః = ఎవడు. న గాయతి = స్తుతింపడు॥ ఎల్లరును స్తుతింతురనుట. (ప్రాకృతమూలము శార్దూలము, ఇది దాని సంస్కృతచ్ఛాయ)

తాత్పర్యము :- రఘు ప్రభూ! అలనాడు శ్రీ మహావిష్ణునిచే కదల్పబడిన మంథరాచలమువలన కలత చెందిన క్షీరసముద్రము యొక్క తరంగ గర్భకాంతితో సమానమైనదియు, కృష్ణపక్ష మధ్యకాలమున కృశించి నిష్కళంకముగానున్న చంద్ర రేఖ వలె మిక్కిలి తెల్లనైనదియు అగు నీ యశస్సును ఎవడు కీర్తింపడు ప్రభూ!।

సమాసములు :- శ్రీ వత్సలాంఛనస్య భుజాభ్యాం పర్యస్తః- పర్యస్తశ్చాసౌ మంథాచలశ్చ- మంథాచలస్య (అచలాద్వా) క్షోభః- క్షోభేన ఉచ్ఛలిత - దుగ్ధ సింధోః లహరీ- ఉచ్ఛలితా చసా లహరీ చ - లహర్యాః గర్భచ్ఛవిః - ఛవినా సదృశమ్. అంధకార పక్షస్య అంతరా-మృగాంకస్య మండలమ్-మండలస్య ఖండః- సంతృట్యంశ్చాసౌ ఖండశ్చ - ఖండ ఇవ ఉద్దామగౌరమ్.

[సౌరంభం సిరిపచ్చలంభణఘుల పజ్జత్తమంథాఅల
క్షోభోచ్ఛలిదవిముక్తసింధులహరీగబ్భచ్ఛ ఈనచ్ఛఅమ్ ।
కో గాయేది ఇ దే రపాఆణం పహుణో అంధారపక్ఖస్తరా
సంతుట్ఠస్త మిఅంక మండల మలక్కుద్దామగోరం జసమ్ ॥]

రామః :- (సహర్షస్మితమ్) అయిప్రియే ప్రియవాదిని.

చంద్రలోకాదపి పరం పదమారోపయన్తి మామ్ ।
అమూరమృతబిందూనామనుప్రాసాస్తవోక్తయః ॥ 77

---

సంధులు :- గచ్ఛ + ఛవి – తుగాగమ, ప్రభోః + అంధకార_రేఫాదేశ విసర్గ. సంతృప్యన్ + మృగ–అనునాసికాదేశ. ఖండ + ఉద్దామ_గుణ

క్రియ :- గై శబ్దే, పరస్మై. లట్, ప్రథమ.
గాయతి – గాయతః – గాయన్తి

చంద్రేతి :- (సహర్ష స్మితమ్ = సంతోషముతో చిరునవ్వుతో) అయి ప్రియే = ఓ ప్రియా, ప్రియ వాదిని = ప్రియము పల్కు సీతా ! అమృత బిందూనామ్ = సుధా బిందువులకు, అనుప్రాసాః = అను రూపములగు, తవ = నీ యొక్క అమూః = ఈ, ఉక్తయః = పలుకులు, మామ్ = నన్ను, చంద్రలోకాత్ అపి = చంద్రలోకము కంటె, పరమ్ = పైదయిన, పదమ్ = స్థానమును, ఆరోపయన్తి = పొందించుచున్నవి.

తాత్పర్యము :- ఓ ప్రియా ! అమృత బిందువులవంటి నీ వాక్కులు నన్ను చంద్రలోకముకంటె ఉన్నతస్థితికి కొనిపోవుచున్నవి.

సంధులు :- అమూః + అమృత_రేఫాదేశ విసర్గ. అనుప్రాసాః + తవ = సాదేశ విసర్గ. తవ + ఉక్తయః – గుణ సంధి.

క్రియ :- ఆరోప (ణిచ్) పరస్మై, లట్, ప్రథమ.
ఆరోపయతి – ఆరోపయతః – ఆరోపయన్తి

విభీషణః :- (సానురాగమ్)

అద్యోర్వీతల మూలఘర్షణ వశాదున్మృష్ట చూడామణి
శ్రేణిశ్రీ పరిపీతపీవర తమః పూరే పురే భోగినామ్ ।
కర్ణాభావ నిరస్తకుండల రసవ్యాసంగ మాధున్వతా
మూర్ధ్నః పన్నగ పుంగవేన సుభగం త్వత్కీర్తిరాకర్ణ్యతే ॥ 78

---

అద్యేతి :- (సానురాగమ్ = ప్రేమతో) ఉర్వీతల = భూమియొక్క. మూల = అట్టడుగు ప్రదేశముయొక్క. ఘర్షణవశాత్ = రాపిడివలన. ఉన్మృష్ట = ప్రకాశితము గావింపబడిన, చూడామణిశ్రేణీ = శిరోఽగ్రభాగమందలి మణిసమూహముచేత పరిపీత = నాశనము గావింపబడిన (త్రాగివేయబడిన). పీవర = విశాలమగు. తమః పూరే = అంధకార రాశితోకూడిన. భోగినామ్ పురే = నాగలోకమునందు. కర్ణ + అభావ = చెవులు లేకపోవుటచేత, నిరస్త = తొలగింపబడిన. కుండలరస వ్యాసంగమ్ = కుండల ధ్వనిసంసక్తి కలుగునట్లుగా - అభ్యంతరకరమగు కుండలధ్వని లేదనుట; మూర్ధ్నః = శిరస్సులను. ఆధున్వతా = ఊపుచున్న. పన్నగపుంగవేన = ఆదిశేషుని చేత. త్వత్కీర్తిః = నీ యశస్సు. సుభగమ్ = సుఖముగా (నిరాతంకముగా) అద్య = నేడు. ఆకర్ణ్యతే = ఆకర్ణింపబడుచున్నది. (శార్దూలము)

తాత్పర్యము :- ఓ ప్రభూ! భూమి ఒరిసికొని ఆదిశేషుని శిరోమణులు మరింత తళతళలాడుచు పాతాళలోకమున చీకట్లను తొలగించుచున్నవి. అట్టుల నీ కీర్తి గానమును ఆదిశేషుడు సుఖముగా వినుచున్నాడు. అతనికి చెవులే లేకపోవుటతో కుండలములు లేవు. అభ్యంతరకరమగు కుండలధ్వనియు లేదు. వేయి శిరస్సులను స్వేచ్ఛగా ఊపుచు హాయిగా వినుచున్నాడు.

సమాసములు :- ఉర్వీతలస్య మూలమ్ - మూలస్య ఘర్షణమ్ - ఘర్షణస్య వశః - తస్మాత్. ఉన్మృష్టాశ్చ తే చూడామణయశ్చ - మణీనాం శ్రేణిః - శ్రేణేః శ్రీః - శ్రియా పరిపీతమ్ - పీవరం చ తత్ తమశ్చ - పరిపీతం చ తత్ పీవరతమః - తమసాం పూరః యస్మిన్ - తస్మిన్. కర్ణానామభావః. కుండలానాం రవః - రవస్య వ్యాసంగః - కర్ణాభావాత్ నిరస్తః కుండల రవవ్యాసంగః యస్మిన్ కర్మణి తత్ తథా. పన్నగానాం పుంగవః - తేన.

(విహస్య)

భోగీంద్రః ప్రమదోత్తరంగమురగీసంగీతగోష్ఠీషు తే
కీర్తిం దేవ శృణోతు వింశతిశతీ యచ్చక్షుషాం వర్తతే ।
రక్తాభిస్సురసుందరీభిరభితో గీతాం తు కర్ణద్వయీ
నష్టః శ్రోష్యతి నామ కిం స హి సహస్రాక్షో న చక్షుఃశ్రవాః ॥ 79

---

క్రియ :- కర్ణ భేదనే. (చుర్యాది) ఆత్మనే. ప్రథమ (లట్)
అకర్ణ్యతే - అకర్ణ్యేతే - అకర్ణ్యన్తే

భోగీతి :- (విహస్య = నవ్వి) భోగీంద్రః = ఆదిశేషుడు. ఉరగీసంగీతగోష్ఠీషు — ఉరగీ = నాగాంగనలయొక్క. సంగీతగోష్ఠీషు = సంగీత సభలయందు. తే = నీయొక్క. కీర్తిమ్ = యశస్సును. ప్రమదోత్తరంగమ్ = ఆనంద మతిశయించునట్లు. శృణోతు = వినునుగాక। యత్ = ఏలయన, చక్షుషామ్ = నేత్రములయొక్క. వింశతిశతీ = సహస్రద్వయము. వర్తతే = అతనికున్నది కనుక. తు = కాని. దేవ= మహారాజా! రక్తాభిః = అనురక్తలైన, సురసుందరీభిః = దేవ కాంతలచేత. అభితః = సమగ్రముగా, గీతామ్ = గానముచేయబడిన నీ కీర్తిని. సహస్రాక్షః=దేవేంద్రుడు, కర్ణద్వయీ నష్టః = చెవులు రెండే కల్గియుండుట అను దురవస్థను పొందినవాడై. కిమ్ నామ శ్రోష్యతి = ఏమి వినగలడు। సః హి=అతడేమో. సహస్రాక్షః= వేయికన్నులవాడే తప్ప. చక్షుః శ్రవాః న=చూపు చెవులవాడు కాడాయె। (శార్దూలము)

తాత్పర్యము :- నాగాంగనలు నీ కీర్తిని గానముచేయగా ఆదిశేషుడు రెండువేల చూపు చెవులతో ఆలకించి ఆనందించుచున్నాడు. దేవాంగనలు నీ కీర్తిని గానము చేయగా దేవేంద్రుడు రెండు చెవులే కలిగిన దురవస్థతో ఏమి వినగలడు। అతడు సహస్రాక్షుడే కాని చూపు చెవులవాడు కాడాయె। (సభా సంలాపయోర్గోష్ఠీ — మేదినీకరః)

సమాసములు :- భోగినామింద్రః. ప్రమదేన ఉత్తరంగం యథా భవతి తథా. సంగీతస్య గోష్ఠీ - ఉరగీనాం సంగీతగోష్ఠీ - తాసు. కర్ణస్య ద్వయీ-ద్వయ్యా నష్టః. సహస్రమ్ అక్షీణి యస్య సః. చక్షురేవ శ్రవః యస్య సః.

రామః :- (విలక్షస్మితేన విభీషణసూక్తమనుగృహ్య చంద్రం సీతాముఖం చ క్షణమాలోక్య స్వగతమ్)

ఆరబ్ధే దయితాముఖప్రతిసమే నిర్మాతుమస్మిన్నపి
వ్యక్తం జన్మ సమానకాలముషితామంశుచ్ఛటాం వర్షతి ।
ఆత్మద్రోహిణి రోహిణీపరివృఢే పర్యంకపంకేరుహః
సంకోచాదతిదుఃస్థితస్య న విధేస్తచ్ఛిల్ప మున్మీలితమ్ ॥ 80

---

క్రియ :- శ్రు శ్రవణే, లోట్. పరస్మై. ప్రథమ
శృణోతు/శృణుతాత్ – శృణుతామ్ – శృణ్వన్తు
శ్రు శ్రవణే. లృట్. పరస్మై. ప్రథమ
శ్రోష్యతి – శ్రోష్యతః – శ్రోష్యన్తి

అరబ్ధఇతి :- [విలక్షస్మితేన = సిగ్గుతోకూడిన చిరునవ్వుతో. విభీషణసూక్తమ్ = విభీషణుని సాలంకారవాక్యమును. అనుగృహ్య = స్వీకరించి. చంద్రమ్ = చందమామను. సీతాముఖం చ = జానకీ వదనమును. క్షణమ్ = క్షణకాలము. ఆలోక్య = చూచి. స్వగతమ్ = తనలో] దయితా = ప్రియురాలియొక్క. ముఖ = ముఖముతో. ప్రతిసమే = సాటివచ్చువానిగా. నిర్మాతుమ్ = చంద్రుని నిర్మించుటకొరకు. ఆరబ్ధే = బ్రహ్మదేవుడు పూనుకొనగా, జన్మసమాన కాలముషితామ్ = జన్మించిన క్షణమునందే లభించిన. అంశుచ్ఛటామ్ = కాంతిసమూహమును. వ్యక్తమ్ = స్పష్టముగా. అస్మిన్ = ఈ. రోహిణీ పరివృఢే = చంద్రుడు. ఆత్మద్రోహిణి = స్వసృష్టికర్తకే ద్రోహము చేయువాడై. వర్షతి = కురియుచుండగా [వెన్నెలను వర్షించుచుండగా అనుట]. పర్యంకపంకేరుహః = బ్రహ్మకు పర్యంకమైన పద్మముయొక్క. సంకోచాత్ = ముడుచుకొనుటవలన. అతి దుఃస్థితస్య = మిక్కిలి దుఃఖితుడైన. విధేః = బ్రహ్మయొక్క. తచ్ఛిల్పమ్ = సీతా ముఖముతో సాటివచ్చునట్లు చంద్రబింబమును తీర్చు ఆ శిల్పము. న ఉన్మీలితమ్ = పూర్తిగా ఆవిష్కరింపబడలేదు. కావున చంద్రుడు సీతా ముఖముతో సరిపోలువాడు కాలేకపోయెను. [శార్దూలము]

తాత్పర్యము :- సీతాముఖముతో సాటివచ్చునట్లుగా బ్రహ్మదేవుడు చంద్రబింబమును నిర్మింప నారంభించెను. కానీ ఆ చంద్రుడు తాను పుట్టిన క్షణము

(సీతాం ప్రతి)

అనేన రంభోరు భవన్ముఖేన తుషారభానోస్తులయా ధృతస్య ।
ఊనస్య నూనం పరిపూరణాయ తారాః స్ఫురన్తి ప్రతిమానఖండాః ॥ 81

---

నుండియు బ్రహ్మను ప్రోహియుచున్నను ఆతని నివాసపద్మమును ఈతడు ముకుళింప చేసెను. దానితో సంకుచితమైన బ్రహ్మ ఇంటి చంద్రబింబమును తీర్చు కార్యక్రమము నుండి విరమించెను. కావున సీతాముఖమునకు చంద్రుడు సాటిరాలేడు.

సమాసములు :- దయితాయాః ముఖమ్ - ముఖస్య ప్రతిసమమ్ - తస్మిన్. అస్మినః సమానాః - కాలే మిళితా - తామ్. అంశూనాం ఛటా - తామ్. ఆత్మనో ప్రోషీ - తస్మిన్. ప్రోషిత్యాః పరివృఢః - తస్మిన్. పర్యంకరూపం పంకేరుహ - తస్య.

సంధులు :- అస్మిన్ + అపి - అనునాసికద్విత్వ. అంశు + ఛటామ్ - తుగాగమసంధి విధేః + తత్ - సాదేశవిసర్గ. తత్ + శిల్పమ్ - ఛాదేశ

అనేనేతి :- [సీతాంప్రతి = సీతనుద్దేశించి] రంభోరు = ఓ జానకీ! అనేన = ఈ, భవన్ముఖేన = నీ వదనముతో. తులయా = త్రాసుతో. ధృతస్య = ధరింపబడిన - నీ ముఖముతో సరితూచుటకై త్రాసునందు ఉంచబడిన అనుట; తుషారభానోః = చంద్రునికి, ఊనస్య = లోటుయొక్క - తగ్గిన బరువుయొక్క. పూరణాయ = పూరణము కొరకైన. ప్రతిమానఖండాః = పడికట్టురాళ్ళుగు. తారాః = నక్షత్రములు. స్ఫురన్తి = ప్రకాశించుచున్నవి. [ఉపజాతివృత్తము].

తాత్పర్యము :- ఓ సీతా! నీ ముఖముతో చంద్రుడు సరితూచబడువేళ అతని తరుగును పూరించుటకైన పడికట్టురాళ్ళు ఈ తారకలు ప్రకాశించుచున్నవి.

సమాసములు :- రంభే ఇవ ఊరూ యస్యాః సా - తత్సంబుద్ధౌ. భవత్యాః ముఖమ్ - తేన. [సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావో వక్తవ్యః]. తుషారమయాః భానవః యస్య సః - తస్య.

క్రియ :- స్ఫుర స్ఫురణే సంచలనే చ, లట్. పరస్మై. ప్రథమ
స్ఫురతి - స్ఫురతః - స్ఫురన్తి

కించాన్యదపి

గాత్రే సాక్షాదజని భగవానేష యత్పద్మయోనిః
శయ్యోత్థాయం యదఖిలమహః ప్రీణయన్తి ద్విరేఫాన్ ।
ఏకాగ్రాం యద్దధతి భగవత్యుష్ణభానౌ చ భక్తిం
తత్ప్రాపుస్తే సుతను వదనౌపమ్యమంభోరుహాణి ॥ 82

---

గాత్రేఇతి :- కించ = మరియు. అన్యదపి = మరియొకటి. సుతను = ఓ సుగాత్రీ ! జనకపుత్రీ ! భగవాన్ = భగవంతుడైన ఏషః = ఈ ప్రసిద్ధుడైన, పద్మయోనిః = బ్రహ్మదేవుడు యత్ = ఏ పద్మములయొక్క. గాత్రే = వంశమునందు, సాక్షాత్ = సాక్షాత్తుగా, అజని = జన్మించెనో: శయ్యోత్థాయమ్ = నిద్ర లేచినది మొదలు అఖిలమ్ అహః = రోజు రోజంతయు, యత్ = ఏ పద్మములు, ద్విరేఫాన్ = తుమ్మెదలను, ప్రీణయన్తి = ఆనందపరచుచున్నవో: భగవతి = పూజ్యుడైన, ఉష్ణభానౌ = సూర్యునియందు, ఏకాగ్రామ్ = నిశ్చలమైన, భక్తిమ్ = భక్తిని, యత్ = ఏ పద్మములు, దధతి = వహించుచున్నవో: తత్ = ఆ కారణములచేత, అంభోరుహాణి = పద్మములు తే = నీయొక్క, వదనౌపమ్యమ్ = ముఖముతో పోలికను, ప్రాపుః = పొందుచున్నవి. (శార్దూలము) శయ్యాయాః ఉత్థాయ - అపాదానే పరీప్సాయామ్ - ణముల్.

తాత్పర్యము :- బ్రహ్మదేవునికి పుట్టింటి వంశస్థులగుట. నిద్రలేచినది మొదలు రోజంతయు తుమ్మెదలను ఆనందపరచుట. సూర్యునియందు నిశ్చలభక్తి కలిగియుండుట అను ఈ కారణములచే పద్మములు నీ ముఖముతో సాటిరాగలుగుచున్నవి.

సంధులు :- ఏషః + యత్ - తదేతద్విసర్గలోప. శయ్యా + ఉత్థాయ - గుణ. భగవతి + ఉష్ణ - యణాదేశ. ప్రాపుః + తే - సోదేశవిసర్గ. వదన + ఔపమ్యమ్ - వృద్ధిసంధి.

క్రియ :- జనీఙ్ ప్రాదుర్భావే. ఆత్మనే. లుఙ్. ప్రథమ
అజని / అజనిష్ట - అజనిషాతామ్ .. అజనిషత
ప్రీఞ్ తర్పణే (ణిచ్). పరస్మై. లట్. ప్రథమ
ప్రీణయతి - ప్రీణయతః - ప్రీణయన్తి

చక్రే గోష్పదవద్విలంఘితవతోఽప్యంతర్భయం మారుతేః।
పూర్ణత్వాదతిరిచ్యతే హి మహతస్తుచ్ఛస్య దుర్లంఘ్యతా॥ 84

---

గర్వమునట్టి. దరీ=గుహాముఖము. గంభీరిమా=గంభీరత్వము గలవాడైన. సాగరః = సముద్రుడు, గోష్పదవత్ = గోవు పాదము యొక్క గుంటవలె మిక్కిలి సులభముగా. విలంఘిత వతః = దాటినవాడైన. మారుతేః అపి = హనుమంతునికి కూడా. అంతర్భయమ్ చక్రే = లోపల భయమును కల్గించెను. మహతః = గొప్పవారియొక్క. దుర్లంఘ్యతా = అవిలంఘ్యత్వము — వారిని జనులు జవదాటరానివారు యనునది, పూర్ణత్వాత్ = పూర్ణత్వదశకంటే, తుచ్ఛస్య = హీనదశకు, అతిరిచ్యతే హి = అధికముగా ఉండుచున్నదికదా। పూర్ణదశయందుండగా వారిమాటను జవదాటవలెనన్నచో జవదాటుట తేలిక. వారే హీనదశయందున్నప్పుడు వారి మాటను కాదనుట మిక్కిలి కష్టమనుట. (…లము).

**తాత్పర్యము** :— హనుమంతుడు సింహళసముద్రమును గోష్పదమువలె దాటి వచ్చినాడు. సేతుబంధనమైన పిదప లోకువయైన సముద్రమును దాటుటకు ఆ హనుమంతుడే భయపడినాడు. (అప్పటికి లోతు తెలిసి భయము పట్టుకొన్నదనుట). గొప్పవారి మాటను జవదాటుట యన్నది వారు పూర్ణదశయందున్నప్పటికంటె హీన దశయం దున్నప్పుడే కష్టము సుమా।

**సమాసములు** :- సేతోరుపక్రమః - ఉపక్రమస్య సంభ్రమః - సంభ్రమాత్ అకృతాః - అకృతాశ్చతే గిరయశ్చ — గిరీణాం ప్రక్షేపః — ప్రక్షేపస్య వేగః— వేగేన ఉచ్ఛలన్తి చ తాని నిశ్శేషాంబూని చ - అంబుభిః పరిస్ఫుటశ్చాసౌ స్ఫుటదరశ్చ-ఉదర ఏవ దరీ — దర్యాః గంభీరిమా యస్య సః.

**సంధులు** :- సేతు + ఉపక్రమ, సంభ్రమ + అకృత. నిశ్శేష + అంబు సవర్ణదీర్ఘ. వేగ + ఉత్, స్ఫుట + ఉదర - గుణసంధి. ఉచ్ఛలత్ + నిశ్శేష - అనునాసికాదేశ. విలంఘితవతః + అపి - ఉత్వాదేశవిసర్గ — వతో + అపి — పూర్వరూప. అపి + అంతర్ - యణాదేశ. మహతః + తుచ్ఛస్య - సాదేశవిసర్గ.

**క్రియ** —: డుకృఞ్ కరణే, లిట్, ఆత్మనే, ప్రథమ

చక్రే - చక్రాతే - చక్రిరే

(నేపథ్యే)

దేవ, త్వర్యతాం త్వర్యతామ్. సన్నిధత్తేఖలు భగవద్వసిష్ఠగృహీతో మంగళాభిషేక ముహూర్తః.

రామః :- (ఆకర్ణ్య) కథమయోధ్యాయాః ప్రత్యావృత్తో మారుతిరస్మాన్ త్వరయతి ।

సీతా :- (సహర్షమ్) ఆర్యపుత్ర, కథమంజనానందన స్త్వరయతి, తద్భగవన్, పుష్పక, అవనమ. మేదినీసన్నిహితగమన మార్గేణ గచ్ఛామః. (అజ్జఉత్త, కధం అంజణాణందణో తువరావేది. తా భఅవం పుప్పఅ అవణమ. మేఇణీసంణిహిదగమణమగ్గేణ గచ్ఛహ్మ.)

---

రిచ వియోజన సంపర్చనయోః (రిచ్మతి) ఆత్మనే. లట్. ప్రథమ, అతిరిచ్యతే - అతిరిచ్యేతే - అతిరిచ్యన్తే.

(నేపథ్య = తెరలో)

దేవేతి :- దేవ = మహారాజా । త్వర్యతామ్ త్వర్యతామ్ = త్వరపడుగాక । త్వరపడుగాక । - ఇతి త్వరపడుమనుట. భగవత్ = మహానుభావుడైన, వసిష్ఠ= వసిష్ఠునిచేత, గృహీతః = నిర్ణయింపబడిన. మంగళాభిషేక ముహూర్తః = పట్టాభిషేక ముహూర్తము. సన్నిధత్తే ఖలు = సమీపించుచున్నది సుమా ।

కథమితి :- (ఆకర్ణ్య = విని) కథమ్ = ఎట్లు । అయోధ్యాయాః = అయోధ్యనుండి. ప్రత్యావృత్తః = తిరిగివచ్చిన వాడగు, మారుతిః = హనుమంతుడు, త్వరయతి = మమ్ము త్వరపెట్టుచున్నాడా । ।

ఆర్యపుత్రేతి :- (సహర్షమ్ = ఆనందముతో) ఆర్యపుత్ర = నాథా । కథమ్ = ఎట్లు । అంజనానందనః = హనుమంతుడు, త్వరయతి = త్వరపెట్టుచున్నాడా । తత్ = అయినచో. భగవన్ పుష్పక = ఓ మహాత్మా । పుష్పకమా । అవనమ = క్రిందికి దిగుము. మేదినీ సన్నిహిత = భూమికి చేరువయైన, గమనమార్గేణ= గమనమార్గముతో. గచ్ఛామః = పోవుదము. (అధః అవలోక్య = క్రిందికిచూచి,

(అథో౽వలోక్య రామం ప్రతి) ఆర్యపుత్ర, కింపునరేతత్ తరుణజీమూత శ్యామలే మహీవలయే మధుమథనవక్షఃస్థలే కౌస్తుభ కిరణస్తబక ఇవ జ్వలల్లక్ష్యతే. (అజ్జఉత్త. కిం ణు ఏదం తరుణజీమూద సామలే మహీవలఏ మహుమహణ వచ్ఛత్థలే కోత్థుహకిరణ త్థవఅం విఅ జలన్తం లక్ఖీఅది).

రామః :- (దృష్ట్వా విభీషణం ప్రతి)

తర్క్ష్యటంకలిఖితార్కమండల ప్రోచ్ఛలత్కణకదంబభాసురమ్ ।
శిల్పశాలమివవిశ్వకర్మణః కిం విభాతి మృగతృష్ణికామయమ్॥ 85

---

రామం ప్రతి = రాముసుద్దేశించి) ఆర్యపుత్ర = నాథా। తరుణజీమూత = క్రొక్కారు మేఘమువలె, శ్యామలే = నల్లనైన. మహీవలయే = భూమండలమందు. మధుమథన = విష్ణువుయొక్క. వక్షఃస్థలే = వక్షఃస్థలమునందు, కౌస్తుభకిరణ = కౌస్తుభమణి కిరణముల యొక్క, స్తబకః ఇవ = సమూహమువలె. ఏతత్ కిమ్ = ఇది ఏమి. జ్వలత్ = ప్రకాశించుచు, లక్ష్యతే = కనపడుచున్నది।

తర్క్ష్యవతి :- (దృష్ట్వా = చూచి. విభీషణం ప్రతి = విభీషణునితో) తర్క్ష్య టంక = ఉలియొక్క అగ్రభాగముచే. లిఖిత = చెక్కబడిన. అర్క మండల = సూర్య మండలముయొక్క, ప్రోచ్ఛలత్ = పైకెగయుచున్న. కణకదంబ = నణుసుల గుంపుతో భాసురమ్ = ప్రకాశించునదగు. విశ్వకర్మణః = విశ్వకర్మయొక్క. శిల్పశాలమ్ ఇవ = శిల్పగృహమువలె. మృగతృష్ణికామయమ్ = ఎండమావులతో నిండి. విభాతి = ఒప్పారుచున్నది. కిమ్ = ఏమిది? (రథోద్ధతము).

తాత్పర్యము :- విభీషణా! ఇది ఏమి? ఎండమావుల గుంపువలె నున్నది. ఎగిసిపడుచున్న సూర్యకణముల రాపిడితో విశ్వకర్మ శిల్పశాలవలె నున్నది! ఏమిది?

సమాసములు :- తర్క్ష్యః టంకః-టంకేన లిఖితం చ తదర్కమండలం చ — మండలాత్ ప్రోచ్ఛలన్ - కణానాం కదంబః-కదంబేన భాసురమ్. శిల్పస్య శాలా - (విభాషా సేనేత్యాదినా నపుంసకత్వమ్).

విభీషణః :— దేవ, స ఏషః —

జ్యేష్ఠామూలీయయాత్రాసరభసకరభీకామ్యకాంతారవర్త్మా
దూరేఽపి త్వక్ష్ణోర్జ్యోతిరవలపతి మరుర్జ్వలజ్జాంగలశ్రీః ।
విశ్వద్రీచీభిరస్మిన్నధికముడుపతేః కాంతిభిః ప్రస్నువానాః
ఫేనాయంతే నిజాశ్మక్వథనపరిణమద్బుద్బుదం చంద్రకాంతాః ॥ 86

---

క్రియ :- అవలపతి. పరస్మై. లట్. ప్రథమ.
అవలపతి - అవలపతః - అవలపంతి.

జ్యేష్ఠామూలీయేతి :- దేవ = మహారాజా! సః ఏషః = ఇయ్యది — జ్యేష్ఠామూలీయ = జ్యేష్ఠమాసమునందలి. యాత్రా = ప్రయాణమునకు. సరభస = త్వరపడుచున్న. కరభీ = ఆడు ఒంటెలకు. కామ్య = ఇష్టమైన (కోరుచున్న). కాంతారవర్త్మా = వనమార్గము కలదియగు (ఒంటెలు జ్యేష్ఠమాసములో ఎదురువచ్చి అరిష్టబోధకమని కొందరు, గ్రామ్యజనులకు ఆశపడి పయనించునని కొందరు) మరుః = ఎడారి. జ్వలత్ = ప్రకాశించుచున్న. జాంగలశ్రీః = అటవిక సౌందర్యము కలదియై. దూరే అపి = దూరమున నుండియు, అక్ష్ణోః = చూపుల యొక్క. జ్యోతిః = తేజస్సును - శక్తిని, అవలపతి = నిరోధించుచున్నది. విశ్వద్రీచీభిః = అన్నివైపులకును ప్రసరించుచున్న. ఉడుపతేః = చంద్రుని యొక్క. కాంతిభిః = కిరణములతో. అస్మిన్ = ఈ మరుభూమి యందు; అధికమ్ = అధికముగా. ప్రస్నువానాః = స్రవించుచున్న. చంద్రకాంతాః = చంద్రకాంతమణులు, నిజ = తమయొక్క అశ్మ = వేదిమీద. క్వథన = ఉడుకుటవలన, పరిణమత్ = ఏర్పడుచున్న. బుద్బుదమ్ = బుడగలు కలుగునట్లు (అన్నము ఉడుకునప్పుడు బుడగలు లేచునట్లు). ఫేనాయంతే = నురుగులు గ్రక్కుచున్నవి.

తాత్పర్యము :- రామా! జ్యేష్ఠమాసములో ఒంటెలకు ప్రీతిపాత్రమైన ఎడారి ఇది. దూరముగా నుండియు ఇది మన చూపులను అడ్డగించుచున్నది. వెన్నెలకు చంద్రకాంత మణులు స్రవించుచు ఉడుకుచున్నట్లు బుడగలతో నురుగులు కట్టుచున్నవి. (స్రగ్ధరావృత్తము).

రామః :- (స్మిత్వా) అయి మైథిలి అమ్. ఇహైవ రోహణగిరేరుపత్యకాయాం
ద్వితీయమాయతనం మునేర్లోపాముద్రావల్లభస్య. స తత్రభవాన్
బృహత్పాత్రప్రాప్త్యా వితతజల మంభోధిముదరే
దధావీషద్గ్రాహ్యం కిల కలశజన్మా కులపతిః ।
యమారాధ్యన్వింధ్యాచల శిఖర శోథైకభిషజం
వివస్వానాశ్వీనం గగనమవిరోధాత్కలయతి ॥ 88

---

అయమితి :- (స్మిత్వా = నవ్వి) అయి = అవును, మైథిలి = జానకీ!, అమ్ = అవును । రోహణగిరేః = ఈ రోహణపర్వతము యొక్క, ఉపత్యకాయామ్= సమీపమునందు. ఇహ ఏవ = ఇచ్చటనే, మునేః = మునియగు, లోపాముద్రావల్లభస్య = అగస్త్యుని యొక్క. ద్వితీయమ్ = రెండవదగు, ఆయతనమ్ = గృహము. సః = ఆ, తత్రభవాన్ = గొప్పవాడగు అగస్త్యుడు,

బృహదితి :- కలశజన్మా = కుంభసంభవుడగు, కులపతిః = కులపతి అగస్త్యుడు, ఈషద్గ్రాహ్యమ్ = పుడిసిలితో స్వీకరింపదగిన (స్వీకరించునప్పుడు అల్పాల్పమనుట). అంభోధిమ్ = సముద్రమును, ఉదరే = తన కుక్షియందు, బృహత్పాత్రప్రాప్త్యా = పెద్దపాత్ర లభించుటతో. వితతజలమ్ = విస్తరించిన జలము కలదానినిగా, దధౌ కిల = ధరించెను సుమా । వింధ్యాచల శిఖర = వింధ్య శిఖరము యొక్క, శోథ = శోథ అను పేరుగలిగిన రోగమునకు (అకస్మాత్తుగా శరీరము పెరుగు రోగమునకు శోథ అని పేరు). ఏకభిషజమ్=అద్వితీయ వైద్యుడగు. యమ్= ఏ అగస్త్యుని, ఆరాధ్యన్ = సేవించుచు, వివస్వాన్ = సూర్యుడు, ఆశ్వీనమ్ = గుఱ్ఱముపై ఒకరోజులో ప్రయాణము చేయదగిన, గగనమ్ = ఆకాశమును. అవిరోధాత్ = నిరాటంకముగా. కలయతి = పర్యటించుచున్నాడు. (శిఖరిణి).

తాత్పర్యము :- సముద్రమును పుడిసెన్మాత్రముగా త్రాగి విశాలపాత్ర వంటి ఉదరమునందు విస్తరింపజేసినవాడును, వింధ్యాద్రికి వచ్చిన శోథనామకరోగమునకు ఏకైక చికిత్సకుడును అగు అగస్త్యునకు మ్రొక్కుకొనుచు సూర్యుడు గగనమున నిరాటంకముగా రథముపై సాగిపోవుచున్నాడు.

అపిచ —

యువతికుచభోగసంస్కారోదూఢైః శుక్తిసంపుటధృతాని ।
దధతీహ తామ్రపర్ణ్యాః స్థిరకఠినభావమంభాంసి ॥ 92

సీతా :- ఆర్యపుత్ర, జ్యేష్ఠేతి దాక్షిణ్యమాత్రకేణ భగవతః సాగరస్య భాగీరథీపక్షపాతః. ప్రేమసర్వస్వనిష్యందః పునః సహజ సర్వాంగ సౌ[illegible]కాధిక్య రమణీయాయాస్తామ్రపర్ణ్యా లక్ష్యతే. [అజ్జఉత్త, జేట్ఠేత్తి దక్ఖిణ్ణమత్తకేణ భఅవదో సాఅరస్స భాఈరహీపక్ఖవాదో.

---

యువతీతి :- అపిచ = మరియు - ఇహ = ఇట, తామ్రపర్ణ్యాః = తామ్రపర్ణి నదియొక్క. అంభాంసి = జలములు, ఉదూఢైః = పూర్వజన్మ కృతములైన, యువతికుచభోగసంస్కారైః = తరుణీమణుల కుచముల నలంకరించుట యను సుకృతవిశేషములచే, శుక్తిసంపుటధృతాని = ముత్తెపు చిప్పలయందు ధరింపబడినవై, స్థిరకఠినభావమ్ = గట్టి పడిగట్టి రూపమును, దధతి = వహించుచున్నవి. [వర్ణోప లస్త్రు [illegible] - ఆర్యా].

తాత్పర్యము :- ఈ తామ్రపర్ణిలో జలములు ముత్తెపు చిప్పలలోపడి ఘనీభవించుచున్నవి. పూర్వజన్మలో ఇవి యే యువతుల కుచములనో అలంకరించి యుండును. ఆ సుకృత విశేషమున నిప్పుడివి మరల ముత్యము లగుచున్నవి.

సమాసములు :- యువతీనాం కుచాః - కుచేషు భోగకర్మాణి - తైః - కర్మభిః, శుక్తీనాం సంపుటాని - సంపుటైః [సంపుటేషు] ధృతాని, స్థిరంచ తత్కఠిన భావం చ.

క్రియ :- డుధాఞ్ ధారణపోషణయోః, పరస్మై. లట్, ప్రథమ
దధాతి - దధతః - దధతి.

ఆర్యపుత్రేతి :- ఆర్యపుత్ర = నాథా ! భగవతః = మహాత్ముడైన, సాగరస్య = సముద్రునకు, భాగీరథీపక్షపాతః = గంగపై అభిమానము, జ్యేష్ఠా ఇతి = పెద్దభార్య అని [అభిపన్న], దాక్షిణ్యమాత్రకేణ = దయామాత్రముచేతనే - తన దక్షిణ నాయకత్వమును నిరూపించు కొనుటకు మాత్రమే సాగరుడు భాగీరథిని

పేమ్మసవ్వస్సణ్ణీసందో ఉణసహాజసవ్వంగమో_త్తిఅహారణ రమణీ
అవి తమ్మపణ్ణీఏ లక్ఖీఅది.)

రామః ;- (విహస్యాన్యతో దర్శయన్)

రమయతి మలయాచలో౽య మస్మాదుపనమతా పవనేన మానినీనామ్ ।
దయిత వినయకూటసాక్షిణీభి: స ఖలు సఖీభిరదుష్కరః ప్రబోధః ॥ 93

---

మన్నించుచున్నాడనుట. పునః = కానీ. ప్రేమ సర్వస్వ నిష్యందః = సాగరుని అను రాగ ప్రవాహము మాత్రము. సర్వాంగ = సర్వావయవములందును నిస్పట్టు, మౌక్తికా భరణ = ముత్యాల హారములతో. రమణీయాయాః = రమణీయముగానున్న. తామ్ర పర్ణ్యాః = తామ్రపర్ణి కే, లక్ష్యతే = భాసించుచున్నది.

రమయతీతి :— [విహస్య = నవ్వి, అన్యతః దర్శయన్ = మరొక వైపునకు చూచుచు] అయమ్ = ఈ. మలయాచలః = మలయపర్వతము. రమయతి= ఆనందింపజేయుచున్నది. దయిత = నాయకునియొక్క. వినయ = సత్ప్రవర్తనకు. కూటసాక్షిణీభిః=దొంగసాక్షులైన, సఖీభిః = చెలికత్తెలచేత. అస్మాత్ = ఈ మలయ పర్వతమునుండి. ఉపనమతా = వెల్వడుచున్న. పవనేన = వాయువుతో. మానినీనామ్= కోపనలైన నాయికలయొక్క. సః = ఆ. ప్రబోధః = కోపాపనోదనము. అదుష్కరః ఖలు = తేలికయగుచున్నది సుమా । [పుష్పితాగ్రము].

తాత్పర్యము :- ఈ మలయాద్రి ఆనందదాయకముగా నున్నది. అలిగిన నాయికను ఊరడించుటకు చెలికత్తెలు ప్రయత్నించుచున్నారు. నాయకుని సత్ప్రవర్తనకు కూటసాక్షులై పల్కుచున్నారు. వారికి ఈ మలయపవనుడు సహకరించుటతో నాయికల కోపము తేలికగా తొలగిపోవుచున్నది.

సంధులు :- అచలః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - అచలో + అయమ్ - పూర్వరూప. సః + ఖలు - తదేతద్విసర్గలోప. సఖీభిః + అదుష్కరః - రేఫాదేశవిసర్గ.

క్రియ :— రముజ్ క్రీడాయాం [ణిచ్] పరస్మై, లట్. ప్రథమ
రమయతి - రమయతః - రమయన్తి.

లక్ష్మణః — (అగ్రే దర్శయన్)

స్వపాణిప్రాగ్భారప్రబల వితతోత్తానసలిల
స్వయందృష్ట క్రీడత్తిమినివహాలగ్నామివ ఘృణామ్ ।
దధానస్యాపీతోజ్ఝిత జలనిధేరేతదపరం
పురో లోపాముద్రా సహచరమునేరాశ్రమపదమ్ ॥ 94

---

స్వపాణీతి :- [అగ్రే = ముందుభాగమున దర్శయన్ = చూపుచు] స్వపాణి = తన చేతులయొక్క. ప్రాగ్భార = విస్తృతియందు. ప్రబల = మిక్కిలి. వితత = విస్తృతమై. ఉత్తాన = లోతుతగ్గిన. సలిల=సముద్రజలమునందు, స్వయం దృష్ట = తమంతతాము కనబడి. క్రీడత్ = క్రీడించుచున్న. తిమినివహ = తిమింగల సమూహమునందు [జలప్రాణులు]. లగ్నామ్ = సంలగ్నమైన. ఘృణామ్ = దయను, దధానస్య = వహించువాడును ,, అందుచే - అపీత = త్రాగిపేయబడియు, ఉజ్ఝిత = విడువబడిన. జలనిధేః = సముద్రము కలవాడును అయిన. లోపాముద్రా సహచర మునేః = అగస్త్యుని యొక్క. ఏతత్ = ఇది. అపరమ్=మరియొక, ఆశ్రమపదమ్= ఆశ్రమస్థానము. పురః = ఎట్టయెదుట = కనిపించుచున్నదనుట.

తాత్పర్యము :— తన విశాలమైన పుడిసిలియందు లోతు తగ్గిన సముద్ర జలములలో క్రీడించుచు తమకుతాముగా కన్పించుచున్న తిమితిమింగలాదులయందు దయగలిగి, త్రాగిన నీటిని మరల విడిచిపెట్టిన అగస్త్యులవారి ఆశ్రమము మరియొకటి అదిగో.

సమాసములు :- స్వపాణ్యోః ప్రాగ్భారః — ప్రాగ్భారేణ ప్రబలం చ తద్వితతం చ — వితతేనోత్తానం చ తత్సలిలం చ — సలిలే స్వయందృష్టాశ్చతే క్రీడన్తశ్చ తిమినివహాః — నివహేషు. లగ్నా — తామ్. అపీతశ్చాసౌ ఉజ్ఝితశ్చ — ఉజ్ఝితః జలనిధిః యేన సః — తస్య. లోపాముద్రాయాస్సహచరః — సహచరశ్చాసౌ, మునిశ్చ - తస్య. ఆశ్రమస్య పదమ్.

సంధులు:- నిధేః + ఏతత్, మునేః=ఆశ్రమ - రేఫాదేశవిసర్గ. పురః + లోపాముద్రా - ఉత్వాదేశవిసర్గ. వితత + ఉత్తాన; అపీత + ఉజ్ఝిత - గుణసంధి. దధానస్య + అపీత - సవర్ణదీర్ఘ.

అపిచాస్మిన్ —

చతురబ్ధిపానచేష్టాదృష్టపిపాసే మునావుదయమానే ।

పాయయితుమివాత్మానం విశుద్ధ్య సజ్జీభవన్త్యాపః ॥ 95

సుగ్రీవః :— (సస్మితమ్)

ధ్రువమిహ చతురమ్భోనిధిరచితాపోశానకర్మణి మునీన్ద్రే ।

---

చతురబ్ధీతి :- అపిచ = మరియు, అస్మిన్ = ఈ అగస్త్యుడు. చతురబ్ధి = చతుస్సముద్రములను, పాన = త్రాగుట యనునట్టి. చేష్టా = పనిచే. దృష్ట= తెలియవచ్చిన పిపాసే = దాహము గలవాడగు. మునౌ = ఈ (ముని) అగస్త్యుడు. ఉదయమానే = ఉదయించుచుండగా - అగస్త్యనక్షత్రోదయము కాగా. ఆపః = నదీతటాకోదకములు. ఆత్మానమ్ = తమను తాము. విశుద్ధ్య=తేటపడుటచే (కలతదేరి). పాయయితుమ్ ఇవ = త్రాగించుటకో యన్నట్లు - తమను తాము సమర్పించుకొనుటకు. సజ్జీభవన్తి = సన్నద్ధమగుచున్నవి. [ఆర్య]

తాత్పర్యము :- నాలుగు సముద్రముల నీటిని త్రాగివేయుటతో అగస్త్యుని పిపాస తెలియవచ్చినది. అందుచే నాతడుదయించునపుడు నదీనదతటాకోదకము లన్నియు కలతదేరి తమను తాము దాహముగా సమర్పించుటకు సన్నద్ధములగుచున్నవి.

సమాసములు :- చతుర్ణామబ్ధీనాం సమాహారః - చతురబ్ధిః పానచేష్టా - చేష్టయా దృష్టా — దృష్టా పిపాసా యస్య - తస్మిన్.

సంధులు :- మునౌ + ఉదయమానే — అయవాదేశః . ఇవ + ఆత్మానమ్- సవర్ణదీర్ఘః. భవన్తి + ఆపః — యణాదేశః.

క్రియ :- భూ సత్తాయాం, పరస్మై. లట్. ప్రథమ

భవతి - భవతః - భవన్తి.

ధ్రువమితి :- [సస్మితమ్=చిరునవ్వుతో] ఇహ=ఇచ్చట. మునీన్ద్రే= అగస్త్యుడు. చతురమ్భోనిధి = చతుస్సముద్రములచేత. రచిత = నెరవేర్పబడిన. ఆపోశానకర్మణి = ఆపోశనము గలవాడగుచుండగా [అమృతోపస్తరణాదివిధిని ముగించి భోజనమునకు ప్రారంభించుట ఆచారము]. సప్తభువనాని = ఏడు లోకము

భక్ష్యంమన్యాని కిమపి చకంపిరే సప్తభువనాని ॥ 96

(సర్వతో౽వలోక్య సహర్షాద్భుతమ్) అహో చిరేణాద్య చతుర్దశ లోకైకవిశాంపతౌ ధర్మాసనాధికారిణి రామదేవే దండకారణ్య గృహమేధినాం తపోవనానామృద్ధయః ।

రామః :- (సలజ్జస్మితం విమానవేగనాటితకేనాధో౽వలోక్య) కథం హిరణ్యాహారిణవిహారకాంతారస్థలీనాముపరి ప్రతిష్ఠామహే.

---

లను. భక్ష్యంమన్యాని = తమను తాము అగస్త్యునికి భక్ష్యములుగా భావించుకొనును. కిమపి = ఏదో । ధ్రువమ్ = నిశ్చయముగా, చకంపిరే = వణకిపోయినవి.

[ఆర్య].

తాత్పర్యము :- చతుస్సముద్రములను అగస్త్యుడు కేశవాయ స్వాహాగా స్వీకరించినప్పుడు ఏడు లోకములును తమను తాము తదుపరి భక్ష్యములుగా ఊహించుకొని భయముతో వణకిపోయినవి.

సమాసములు :- చతుర్ణామంభోనిధీనాం సమాహారః_చతురంభోనిధి, చతురంభోనిధినా ఆచమనకేళిః యస్య - తస్మిన్. మునీనామింద్రః - తస్మిన్. భక్ష్యమాత్మానం మన్యతే ఇతి - భక్ష్యంమన్యః [ఆత్మమానే ఖశ్చ] సప్త చ తాని భువనాని చ.

క్రియ :- కపిఙ్ చలనే. లిట్, ఆత్మనే, ప్రథమ

చకంపే - చకంపాతే - చకంపిరే.

అహో ఇతి :- [సర్వతః = అన్నివైపులకును. అవలోక్య = చూచి. సహర్షాద్భుతమ్ = ఆనందాశ్చర్యములతో] చతుర్దశలోక = పదునాలుగు లోకములకును ఏక = అద్వితీయుడగు విశాంపతౌ = శాసకుడుగా. రామదేవే = రామప్రభువు. ధర్మాసనాధికారిణి = సింహాసనాధికారి అగుచుండగా. చిరేణ = చాలకాలమునకు. అద్య = ఇప్పుడు. దండకారణ్య గృహమేధినామ్ = దండకారణ్య గృహస్థుల యొక్క. తపోవనానామ్ = ఆశ్రమముల యొక్క. ఋద్ధయః = అతిశయములు. అహో = ఆశ్చర్యజనకములు ॥. ఆశ్రమములు ఎంతో అందముగా విరాజిల్లుచున్నవనుట.

కథమితి :- [సలజ్జస్మితమ్ = సిగ్గుతో చిరునవ్వుతో, విమానవేగ నాటితకేన = విమానవేగము నటించుచుటచే. అధః అవలోక్య = క్రిందికి చూచి] కథమ్=

సుగ్రీవః :— (సోపహాసమ్) ఇయం సా మారీచశరీరోపహారరక్షితాత్మనో దశకంఠస్య కపటభిక్షువేషవిడంబనాడంబరైకసాక్షిణీ పంచవటీ.

(సాదరం చ)

విశ్వామిత్రమఖద్విషే చ వపుషా చిత్రేణ పత్యుర్ముఖా
దప్యాకృష్టవిదేహరాజతనయానేత్రారవిందాయ చ ।
మారీచాయ నమో నమః కిమపరం యస్మై కులే రక్షసాం
ద్వౌ వారౌ విభునాపి దాశరథినా చక్రే తిరశ్చ్యం ధనుః ॥ 97

---

వ్యా : హిరణ్యహరిణ = బంగారులేడికి. విహార = విహారమైన. కాంతారస్థలీనామ్ ఉపరి = అటవికప్రదేశముల పైని. ప్రతిష్ఠామహే = ఎగురుచున్నాము ।

ఇయమితి :— [సోపహాసమ్=వేళాకోళముగా] ఇయమ్ = ఇది. మారీచ= మారీచునియొక్క. శరీర = శరీరమును. ఉపహార = బలిగా సమర్పించుటతో, రక్షిత + ఆత్మనః = తనను కాపాడుకొన్నవాడగు, దశకంఠస్య = రావణునియొక్క. కపట భిక్షువేష = మాయాభిక్షు రూపముచేసైన. విడంబనా = మోసముయొక్క. ఆడంబర = అతిశయమునకు. ఏకసాక్షిణీ = ఏకైక సాక్షియగు. సా = ఆ. పంచవటీ = పంచవటి. మారీచు డాత్మసమర్పణతో రాముని కొనిపోకున్నచో రావణాగమన సమయమునకు రాముడు పంచవటిలోనే ఉండి అప్పుడే సంహరించి యుండెడివాడనుట. [సాదరం చ = ఆదరముతోను].

విశ్వామిత్రేతి :— విశ్వామిత్ర = విశ్వామిత్రుని యొక్క. మఖద్విషే = యజ్ఞవైరియు. చ = మరియు. చిత్రేణ = తన అందమైన. వపుషా = శరీరముతో, పత్యుః = రామునియొక్క. ముఖాత్ అపి = ముఖమునుండియు. ఆకృష్ట = తన వైపున కాకర్షింపబడిన. విదేహరాజతనయా నేత్రారవిందాయ - విదేహరాజతనయా = సీతయొక్క. నేత్ర = కన్నులనుసట్టి అరవిందాయ = పద్మములు కలవాడును అయిన, మారీచాయ = మారీచుని కొఱకు. నమోనమః = నమస్కారము. రక్షసామ్ = రాక్షసులయొక్క. కులే = సమూహమునందు. యస్మై = ఏ మారీచుని కొఱకు. విభునా = ప్రభువగు. దాశరథినా అపి = రామునిచేతను సైతము. ధనుః =

యత్రాకృష్టరుచాంశుకే మయి రుషా వస్త్రాయ పత్త్రాణి తే
చిన్వత్స్వార్యే వనదేవతాస్తరులతాముచ్చైర్వ్యధుః కౌతుకాత్ ॥ 98

సీతా :- (స్మయమానా కపోతహస్తం కృత్వా) భగవత్యో జనస్థాన దేవతాః, ఏషా వః పరిచారికా జానకీ ప్రణమతి. (భఅవదీఓ జణట్ఠాణ దేవదాఓ. ఏసా వో పరిఆరిఆ జాణఈ పణమది)

---

లతను. కౌతుకాత్ = కుతుకముతో. ఉచ్చైః వ్యధుః = ఎత్తుగా పెట్టివేసిరి-అందకుండ చేసిరనుట. శార్దూలము. [ద్రోణకాకస్తు కాకోలః. శ్వేతకిరిస్తు వాయసః. కౌశికోలూక పేచకాః — సర్వత్రామరః).

తాత్పర్యము :- సీతా! ఈ పర్వతముపై రాత్రిపూట రత్నకాంతులతో వేగురురంగులోనికి మారిన ద్రోణకాకములు చేయు కోలాహలమునకు బెదిరిపోయి గుడ్లగూబలు గుహలలోనికి పారిపోయెడివి. నీ స్తనాంశుకమును నేను లాగివేయగా నీవు అలిగి ఆకులుకోసి వస్త్రముగా ధరించుటకు యత్నించితివి. అప్పుడు వనదేవతలు కుతూహలపడి తరులతలను నీకు అందనంత ఎత్తునకు ఎగురగొట్టిరి — గుర్తున్నదా!

క్రియ :- స్మృ ఆధ్యానే చింతాయామ్ [కర్మణి] ఆత్మనే. లట్. ప్రథమ
స్మర్యతే - స్మర్యేతే - స్మర్యన్తే
డుధాఞ్ ధారణపోషణయోః. లుఙ్, పరస్మై. ప్రథమ [వి]
అధాత్ - అధాతామ్ - అధుః [వ్యధుః]

భగవత్య ఇతి :- (స్మయమానా = నవ్వుచు, కపోతహస్తమ్ కృత్వా = నమస్కరించి — పార్శ్వద్వయ సమాశ్లేషాత్కపోతస్పర్శకీర్తకే వినయోపగమే శీతే భయే సంభాషణే గురోః వక్షఃస్థలగతో హ్యేష కల్పితస్తు కపోతవత్ — సంగీత సర్వస్వమ్) భగవత్యః = మహానుభావలారా! జనస్థానదేవతాః = జనస్థానమునందలి దేవతలారా! ఏషా = ఇదే. వః = మీయొక్క. పరిచారికా = సేవకురాలు. జానకీ = సీత. ప్రణమతి = నమస్కరించుచున్నది.

రామః :- (అన్యతో దర్శయన్) దేవి, వందస్వ భగవతీమితో గోదావరీమ్.

(జనాంతికమ్)

ఏతస్యాః పులినోపకంఠఫలినీకుంజోదరేషు స్రజం

కృత్వా కింశుక కోరకై రకరజక్రీడా సహిష్ణు స్తనే।

---

దేవీతి :- (అన్యతః దర్శయన్ = మరొకవైపునకు చూపుచు) దేవి = ఓ సీతా! ఇతః = ఇటువైపున. గోదావరీమ్ భగవతీమ్ = మహానుభావ యగు గోదావరిని వందస్వ = నమస్కరింపుము. (జనాంతికమ్ = జనాంతికముగా – రంగముపై నున్న వారికి వినబడకుండ)

ఏతస్యా ఇతి :- ఏతస్యాః = ఈ గోదావరియొక్క, పులిన = ఇసుకతిన్నెలకు, ఉపకంఠ = సమీపమునందున్న, ఫలినీకుంజ = ప్రియంగు లతానికుంజము యొక్క, ఉదరేషు = మధ్యభాగములందు, కింశుక కోరకైః = మోదుగుమొగ్గలతో (నఖక్షతములవలె నుండునవి), స్రజమ్ = దండను, కృత్వా = తయారుచేసి, అకరజక్రీడా సహిష్ణుస్తనే = నఖక్షతములనోర్వలేని సుకుమార స్తనములుగల, తే = నీయొక్క, వక్షసి = వక్షఃస్థలమునందు, దత్త్వా = ఉంచి, ప్రౌఢాపరాధే = అట్టి గొప్ప అపరాధము చేసిన, మయి = నేను, ప్రహాసిని (సతి) = కిలకిలా నవ్వుచుండగా, తదా = అపుడు. కౌమారవ్రత = (అరణ్యవాసమున పాటించుటకు స్వీకరించిన) కన్యావ్రతముయొక్క, భంగ = భంగముచే, రోషితమ్ = కోపించినదైన. తవ = నీయొక్క, ముఖమ్ = వదనము. స్మేరమ్ ఆసీత్ = చిరునవ్వును పొందెను. (శార్దూలము) [తోయోత్థితం తత్పులినమ్. ప్రియంగుః ఫలినీ ఫలీ. పలాశే కింశుకః పర్ణమ్. కలికా కోరకః పుమాన్. ఉపకంఠాంతికాభ్యర్ణాభ్యగ్రా అప్యభితో౽వ్యయమ్ – అంటటను అమరము].

తాత్పర్యము :- ఈ గోదావరి తిన్నెలపై నున్న ప్రియంగులతా కుంజములలో నేను మోదుగుమొగ్గలు దండగ్రుచ్చి, నఖక్షతముల నోర్వలేని స్తనములుగల నీ వక్షఃస్థలమున అలంకరించి కిలకిలా నవ్వితిని. ఇది గొప్ప అపరాధమైనది. అరణ్యవాసమున దీక్షగా స్వీకరించిన నీ కన్యావ్రతము భంగపడినది. (మోదుగుమొగ్గలు నఖక్షతములవలె నుండునుగావున). దీనికి నీవు కోపించియు కిలకిలా నవ్వితివి. (నిజముగా వ్రతము భంగముకాలేదు కనుక).

కించ —

బిభ్రతీం కైశికీం వృత్తిం సౌరభోద్గారిణీం గిరః ।
దూరాధ్వానో౽పి కవయో యస్య రీతిముపాసతే ॥ 102

విభీషణః :- (దక్షిణతో దర్శయన్) దేవ. ప్రణమ్యతామయమాంధ్రవిషయ

---

తాత్పర్యము :- అనన్యసాధారణ సౌందర్యముగల ఈ మలయానిలుడు ఉపస్పృష్టల స్వేదాంబుకణములను ఆర్పివేసి ప్రియుని కౌగిలింతలో వారి అవయవములకు పులకింతలు పెట్టింప జేయుచున్నాడు.

క్రియ :- తను విస్తారే. లట్. ఆత్మనే. ప్రథమ
తనుతే - తన్వాతే - తన్వతే

ప్రతిపదార్థము :- కించ = మరియు - గిరః = వాక్కులకు : సౌరభోద్గారిణీమ్ = సుగంధము నావిష్కరించునట్టి. కైశికీమ్ వృత్తిమ్ = కైశికీ వృత్తిని. బిభ్రతీమ్ = వహించుచున్నదియు. యస్య = ఏ మహారాష్ట్ర మండలమునకు సంబంధించిన. రీతిమ్ = వైదర్భీరీతిని. దూరాధ్వానః = దూరదేశములకు చెందిన, కవయః అపి = కవులు కూడ. ఉపాసతే = ఆరాధించుచున్నారో ఆ విదర్భ మండలమిది (అనుష్టుప్పు)

తాత్పర్యము :- వాక్కులకు సౌరభమునిచ్చు కైశికీవృత్తిని ఆశ్రయించి నదియు, దూరదేశ కవులచే గూడ ఉపాసింపబడునదియునగు వైదర్భీరీతికి ఈ మహారాష్ట్ర మండలమే పుట్టిల్లు.

విశేషములు :- "అస్పృష్టా దోషమాత్రాభిః సమగ్ర గుణ గుంఫితా విపంచీస్వర సౌభాగ్యా వైదర్భీరీతిరిష్యతే". సుకుమారార్థసందర్భా కైశికీ తాసు కథ్యతే- సరస్వతీకంఠాభరణమందు వైదర్భీరీతికి, కైశికీవృత్తికి లక్షణములు.

క్రియ :- ఆసఙ్ ఉపవేశనే. ఆత్మనే. లట్. (అదాది) ప్రథమ (ఉప)
ఉపాస్తే - ఉపాసాతే = ఉపాసతే

దేవేతి :- (దక్షిణతః = కుడివైపునకు, దర్శయన్ = చూపుచు) దేవ = మహారాజా ! ఆంధ్రవిషయలక్ష్మ్యాః = ఆంధ్రదేశలక్ష్మికిని. సప్త గోదావర = ఏడు పాయలుగా చీలిన గోదావరి అనునట్టి. హారకలాప = ఏడు పేటల హారమునకు. ఏక

లక్ష్మ్యాః స ప్రగోదాపరహేరకలాస్పైకనాయకో భగవాన్పరమేశ్వరః
అయం హి —

తత్కాలారభటీవిజృంభణపరిత్రాసోదిత ప్రశ్లథా
వామార్ధేన తదేకశేషచరణం బిభ్రద్వపుర్భైరవమ్ ।

---

నాయకః = ఒకే ఒక నాయకుడును. నాయకుడుయైన, భగవాన్ = మహాత్ముడు, పరమేశ్వరః=పరమేశ్వరుడు. అయమ్=ఇతడే. ప్రణమ్యతామ్ = నమస్కరింపబడుగాక ।
అయమ్ హి = ఇతడు — — ।

తత్కాలేతి :- తత్కాల = నృత్యారంభ సమయమునందలి. ఆరభటీ = సంరంభముతో. విజృంభణ = వృద్ధిపొందుటవలని, పరిత్రాసేత్ ఇవ ... భయముతోవలె, ప్రశ్లథా = జారిపోవుచున్న. వామార్ధేన = ఎడమ సగ భాగముతో — వామభాగస్థయైన పార్వతి భయపడి జారిపోగా: ఏకశేషచరణమ్ = ఒంటరిగా మిగిలిన పాదముగల్గి, భైరవమ్ = భీకరమైన, వపుః = సగము శరీరమును, బిభ్రత్ = ధరించుచున్నవాడును; భోగీంద్ర = వాసుకియొక్క, కంకాళైః తుల్యమ్ = అస్థికలతో పాటు (వాసుకియు భయపడి ప్రాణములు విడిచెననుట. కంకాళోఽస్థి శరీరస్య - అమరము). అస్థి = (పుర్రెలతోను) ఎముకలతోను. భుజంగ = సర్పములతో నున్నైన. భూషణమ్ = అలంకారమును. బిభ్రాణః=ధరించువాడునై, అసౌ = ఈ. కల్పాంతకర్మాంతికః=యుగాంతమును కల్పించుట అను పనిని చేయువాడగు. పరమేశ్వరః = శివుడు. విజయతే = అతిశయించుచున్నాడు. (శార్దూలము)

తాత్పర్యము :- నృత్యారంభ సమయమున శివుడు ఆరభటీవృత్తి నాశ్రయింపగా ఆ వేగోద్ధతికి భయపడినదానివలె పార్వతీదేవి అర్ధశరీరమునుండి జారుకొన్నది. ఏకపాదశేషముగా భీకరమైన శరీరపు సగభాగముతో శివుడొక్కడే తాండవము గావించుచున్నాడనుట. వాసుకి కంకాళములతోపాటు మరికొన్ని ఎముకలను పాములను అలంకరించుకొను పరమేశ్వరుడు, ఈ సృష్టిని లయింపజేయువాడు, సర్వోత్కృష్టముగా విరాజిల్లుచున్నాడు.

తుల్యం దృష్టిపథం గతః భూషణమసౌ భోగీంద్రకంకాలకైః
శ్రీకాంతః పరమేశ్వరో విజయతే కల్పాంతకర్మాంతికః ॥ 103

రామః :- (కృతాంజలిః)

నృత్యారంభ పరిత్రసద్గిరిసుతారిక్తార్ధ సంపూర్తయే
నిర్వ్యాఘాత భ్రమి విభ్రమాయ జగతామీశాయ తుభ్యం నమః ।

---

విశేషములు :- నాట్యమునందు ఆరభటీవృత్తిని గూర్చి సంగీత సర్వస్వము - నియుద్ధయుద్ధ సంస్ఫోట విద్రవాదిభిరన్వితా విజ్ఞేయారభటీవృత్తి రుద్ధతైః పురుషైః కృతా రిపటాన్వితదంభేషు వంచనాస్కందయోస్తథా సముత్పాతేంద్రజాలాదౌ సదా యోజ్యేయమార్యకైః.

క్రియ :- జి జయే (విపూర్వకాత్ ఆత్మనే) లట్, ప్రథమ
విజయతే - విజయేతే - విజయన్తే

వ్యాఖ్యతి :- (కృతాంజలిః = నమస్కరించుచు) నృత్యారంభ = నాట్యారంభమున, పరిత్రసత్ = భయపడిన, గిరిసుతా = పార్వతీదేవిచే, రిక్త=విరహితమైన. అర్ధ = సగము శరీరము యొక్క, సంపూర్తయే = పరిపూర్తికై, నిర్వ్యాఘత=విరమింపబడిన, భ్రమివిభ్రమాయ = భ్రమణవిలాసము కలవాడవును (నాట్యవిశేషముగా గిరగిర తిరుగుటను ఆపివేసినవాడనుట). జగతామ్ = సమస్తలోకములకును, ఈశాయ = అధిపతివగు, తుభ్యమ్ = నీ కొఱకు. నమః = నమస్కారము. తాదృక్ = అట్లు గిరగిర తిరుగుచున్నప్పుడు. భ్రమన్తీః = అట్లే గిరగిర తిరుగుచున్న, దిశః = దిక్కులను. భ్రమఘూర్ణమానయనైః - భ్రమ = తిరుగుటతోపాటు, ఘూర్ణమాన=తిరుగుచున్న. నయనైః = నేత్రములతో, పశ్యద్భిః=తిలకించుచున్నవారగు, చూడాభుజగేశ్వర ప్రభృతిభిః = వాసుకి మున్నగువారిచే, శాంతః అపి = నృత్యమునాపివేసినవాడయ్యును. ఇపుడు, న శ్రద్ధధే = విశ్వసింపబడలేదు. వారికింకను తిరుగుచున్న భ్రాంతి తొలగలేదనుట. (శార్దూలము)

యశ్చూడాభుజగేశ్వరప్రభృతిభిస్తాదృగ్భ్రమంతీర్దిశః
పశ్యద్భిర్భ్రమఘూర్ణమాననయనైః శాంతోఽపి న శ్రద్దధే ॥ 104

అపి చ —

క్రీడానటస్య ప్రళయాంధకారైః కంఠే నిపీతే తవ నీలకంఠ ।

---

తాత్పర్యము :- శివుడు నాట్యాంగముగా గిరగిర తిరుగుటకు ఆరంభించెను. పార్వతి భయపడి జారిపోయెను. ఆ లోటును పూరించుకొనుటకై శివుడు తన తాండవమునాపెను. అట్టి ఆ పరమేశ్వరునికి నమస్కారము. కాని అప్పటివరకు గిరగిర తిరుగుచున్న నేత్రములతో గిరగిర తిరుగుచున్న దిక్కులను చూచుచున్న వాసుకి ప్రభృతులకు మాత్రము శివుడు తాండవము నాపినట్లు నమ్మకము కుదురకున్నది. వారికింకను కన్నులును దిక్కులును తిరుగుచున్నట్లే యున్నదనుట.

సమాసములు :- నృత్యస్యారంభః - ఆరంభే పరిత్రస్యన్తీ చ సా గిరిసుతా చ - గిరిసుతాయాః రిక్తః అర్ధః - రిక్తార్ధస్య సంపూర్తిః - తస్యై—నివృత్తః భ్రమివిభ్రమః యేన సః — తస్మై. భ్రమేణ ఘూర్ణమానాని చ తాని నయనాని-తైః.

సంధులు :- నృత్య + ఆరంభ. రిక్త + అర్ధ — సవర్ణదీర్ఘ. ని + ఊఢ = వ్యూఢ — యణాదేశ సంధి. యః + చూడా — శాదేశవిసర్గ. భుజగ + ఈశ్వర — గుణ. ప్రభృతిభిః + తాదృక్ — సాదేశవిసర్గ. భ్రమంతీః + దిశః. పశ్యద్భిః + భ్రమ — రేఫాదేశ విసర్గ. శాంతః + అపి - ఉత్వాదేశవిసర్గ శాంతో + అపి — పూర్వరూప.

క్రియ :- శ్రధ ప్రయత్నే [?] ఆత్మనే. లిట్. ప్రథమ
శ్రద్దధే - శ్రద్దధాతే - శ్రద్దధిరే

క్రీడేతి :- అపిచ = మరియు; క్రీడానటస్య = క్రీడకొఱకు నటుడవైన, నీలకంఠ = ఓ నల్లని కంఠము కలవాడా ; తవ = నీయొక్క, కంఠే = నల్లని. కంఠము, ప్రళయాంధకారైః = ప్రళయకాలపు చీకట్లతో, నిపీతే = కప్పివేయబడగా కాళరాత్రిః = ఆ ప్రళయరాత్రి [భైరవి], నృత్యద్భయాత్ = చిందులు త్రొక్కుచున్న భయమువలన, కబంధమ్ పృథక్=శరీరము విడిగాను, ఉత్తమాంగమ్ పృథక్=

పృథక్కబంధం పృథగుత్తమాంగం నృత్యద్భయాద్వైక్షత కాళరాత్రిః 105

(సర్వే నమన్తి)

రామః :- (అన్యతో దర్శయన్) దేవి, ద్రవిడమండల మౌళిమండన మణిస్తబకమిదం కాంచీనామధేయ మాయతనం మీనకేతనస్య (సీతాముపవార్య) ఇహ హి —

---

శిరస్సు విడిగాను [ఉత్తమాంగం శిరశ్శీర్షమ్ - అమరము]. ఐక్షత = దర్శించెను. నృత్యత్=నటించుచున్న, కబంధమ్ = మొండెమును. పృథక్=విడిగాను. నృత్యత్ = నటించుచున్న, ఉత్తమాంగమ్ = శిరస్సును. పృథక్ = విడిగాను. కాళరాత్రిః = భైరవి. భయాత్ = సభయముగా. ఐక్షత = చూచెను - అనియు కొందరు అన్వయించిరి. [ఉపజాతి వృత్తము].

తాత్పర్యము :- ఓ నీలకంఠా ! ఓ క్రీడానటా ! యుగాంతవేళ నీవు తాండవమాడుచుండగా ఆ గాఢాంధకారముచే నీ నల్లని కంఠము కప్పివేయబడినది. దానితో నీ శిరస్సు వేరుగను, నీ మొండెము వేరుగను తాండవమాడుచున్నట్లు కన్పించి ఆ కాళరాత్రినే భయపెట్టినవి. [శివునిది తెల్లని శరీరము, నల్లని కంఠము, తెల్లని శిరస్సు లేదా రాగిజుట్టుతో ఎర్రని శిరస్సు].

సమాసములు :- క్రీడార్థం నటః — తస్య. ప్రళయే [ప్రళయస్య వా] అంధకారః - తైః. నీలః కంఠో యస్య సః — తత్సంబుద్ధౌ. కాళశ్చ సా రాత్రిశ్చ.

క్రియ :- ఈక్షజ్ దర్శనే, ఆత్మనే, లఙ్, ప్రథమ

ఐక్షత — ఐక్షేతామ్ - ఐక్షన్త

[సర్వే = అందరును, నమన్తి = నమస్కరింతురు]

దేవీతి :- [అన్యతః దర్శయన్ = మరియొక పైపునకు చూపుచు] దేవి= సీతా !, ద్రవిడమండల = ద్రవిడదేశమునకు, మౌళిమండన = శిరోభూషణమైన. మాణిక్యమణిస్తబకమ్ = మాణిక్యకదంబమైన, ఇదమ్ = ఈ. కాంచీనామధేయమ్ = కాంచి అను పేరుగల్గినది. మీనకేతనస్య = మన్మథునికి. ఆయతనమ్ = నిలయము. [సీతామ్ అపవార్య = సీతకు మాత్రమే వినిపించునట్లు] ఇహ హి = ఇచ్చటేమో ! —

స్వేదజలపిచ్ఛిలాభి_స్తనుభిర్యూనాం చ శిథిలమాశ్లేషమ్ ।
విపులం పులకకలాపపటలం ఝడితి ప్రతికరోతి ॥ 106

అపి చ —

అభిముఖపతయాళుభిర్లలాటశ్రమ సలిలై రవధూత పత్త్రలేఖః ।
కథయతి పురుషాయితం వధూనాం మృదితహిమద్యుతి నిర్మలః
కపోలః ॥ 107

---

స్వేదేతి :- స్వేదజల = ఘర్మసలిలముచే పిచ్ఛిలాభిః = ముద్దయి పోయిన. తనుభిః = శరీరములతో. యూనామ్ = యువతి - యువలయొక్క. ఆశ్లేషమ్ = కౌగిలింత. శిథిలమ్=అంతగా బిగియనిది [బిగియఁబోదనుట], కాని-విపులమ్ = అధికముగా నేర్పడిన, పులకకలాపపటలమ్ = పులకాంకురముల సమూహము. ఝడితి = వెంటనే. ప్రతికరోతి = ప్రతిక్రియను చేయుచున్నది - శిథిలత్వమునకు వ్యతిరేకము చేయుచున్నదనుట - కౌగిలింతలు స్థిరబిగియుచున్నవని [ఆర్య]

తాత్పర్యము :- : చెమట చిత్తడిచే యువతీయువకుల కౌగిలింతలు వదులు వదులుగా నున్నవి. కాని పులకాంకురములు ఆ కౌగిలింతలను బిగ్గబిగియఁజేయు చున్నవి.

ప్రక్రియ :- డుకృఞ్ కరణే పరస్మై. లట్. ప్రథమ
కరోతి - కురుతః - కుర్వన్తి

అభిముఖేతి :- అపిచ = మరియు — అభిముఖపతయాళుభిః = ఎదురు జారుచున్న, లలాటశ్రమసలిలైః = ఫాలభాగ స్వేదజలములచేత అవధూత = కడిగి వేయబడిన, పత్త్రలేఖః = మకరికా పత్రలేఖలు కలదియు, మృదిత = నుగ్గిగావింప బడిన, హిమద్యుతి నిర్మలః = చంద్రునివలె మలినరహితమైన, కపోలః = కపో లము, వధూనామ్ = కాంచీపురాంగనలయొక్క, పురుషాయితమ్ = పురుషాయితమును, కథయతి = చెప్పుచున్నది.

తాత్పర్యము :- ఎదురు కురియుచున్న స్వేదజలములతో కడిగివేయఁబడిన మకరికాపత్త్రములు కలదియు, చంద్రబింబమువలె స్వచ్ఛమైనదియునైన చెక్కిలి కాంచీపురస్త్రీల పురుషాయితమును చాటిచెప్పుచున్నది. [పుష్పితాగ్రావృత్తము]

సుగ్రీవః :- (వామతో దర్శయన్) ఇయమితః శృంగారదేవతా గర్భగృహ
మవన్తివిషయ సీమన్తమౌక్తికముజ్జయినీనామ రాజధానీ ఇహ హి-
కముతురభిసృత్వరీణాం గౌరాంగీణామిహేందుగౌరీషు ।
ఉత్పతయమానానామివ రజనిషు పరమీక్ష్యతే ఛాయా ॥ 108

---

సమాసములు :- ముఖం ప్రతి - అభిముఖం పతయాళవః - తైః, లలాటస్య సలిలమ్-తైః. అపఘాతాః పత్త్రిలేఖాః యస్మిన్ సః. మృదితశ్చాసౌ హిమ ద్యుతిశ్చ - హిమద్యుతిరివ నిర్మలః.

క్రియ :- కథ వాక్యప్రబంధే. లట్. పరస్మై. ప్రథమ
కథయతి - కథయతః - కథయన్తి

ఇయమితి :- [వామతః = ఎడమవైపు, దర్శయన్ = చూపుచు] ఇతః = ఇటువైపున, ఇయమ్ = ఇదే. శృంగారదేవతా = మన్మథుని యొక్క, గర్భగృహమ్ = అంతఃపుర మనదగినదియు. అవన్తివిషయ = అవన్తిదేశమునకు, సీమన్తమౌక్తికమ్ = సీమంతమందలి ముత్తెము వంటిదియునైన. ఉజ్జయినీనామ = ఉజ్జయిని అను పేరుగల. రాజధానీ = రాజధానీ నగరము. ఇహ హి = ఇచ్చట.

కముతురితి :- ఇందుగౌరీషు = చంద్రస్వచ్ఛములైన, రజనిషు = రాత్రులయందు. కముతుః = కాముకునికి అభిసృత్వరీణామ్ = అభిసారికలై పోవు చున్న. గౌరాంగీణామ్ = చంద్రజ్యోత్స్నాంగనలయొక్క, ఛాయా పరమ్ = కేవలము నీడమాత్రమే. ఉత్పతయమానానామ్ = ఎగురుచున్న పక్షులయొక్క. ఛాయా ఇవ = నీడవలె, ఈక్ష్యతే = కన్పడుచున్నది. [ఆర్య]

తాత్పర్యము :- ఈ పండువెన్నెలలో పోవుచున్న జ్యోత్స్నాభిసారికల ఆకృతులు మాత్రము ఎగురుచున్న పక్షుల నీడలవలె కన్పించుచున్నవి. శరీరములు కన్పించుటలేదు.

క్రియ :- ఈక్షజ్ దర్శనే [కర్మణి) ఆత్మనే. లట్, ప్రథమ
ఈక్ష్యతే - ఈక్ష్యేతే - ఈక్ష్యన్తే

అపిచ —

అధస్తాత్సౌధానామిహ హి చరతామిందుకిరణాన్
ఘనోదంచచ్చంచూపుట నిహితనేత్రా యువతయః ।
చకోరాణాం జ్యోత్స్నారసకుతుప కౌతూహలకృతా
ముదీక్షన్తే నశ్యత్తిమిర విశదాభోగముదరమ్ ॥ 109

---

అధస్తాదితి :- అపిచ = మరియు; సౌధానామ్ = సౌధముల యొక్క, అధస్తాత్ = క్రిందిభాగమున, ఇందుకిరణాన్ = చంద్రకిరణములను, చరతామ్ = భుజించుచున్నవియు, జ్యోత్స్నారస = వెన్నెలయను ద్రవమునకు, కుతుప = తిత్తి యగుట యనునట్టి, కౌతూహలకృతామ్ = ఉత్సుకత కలవియునైన, చకోరాణామ్ = వెన్నెలపిట్టల యొక్క, నశ్యత్ = జ్యోత్స్నాపానముచే అంతరించుచున్న, తిమిర = చీకటితో, విశద = స్పష్టపడుచున్న, ఆభోగమ్ = మధ్యభాగము కల్గిన [గర్భాంతరాళము], ఉదరమ్ = పొట్ట[ల]ను, ఘన = మిక్కిలిగా, ఉదంచత్ = తెరుచుకొనుచున్న, చంచూపుట = ముక్కుపుటములయందు, నిహిత = ఉంచబడిన, నేత్రాః = దృష్టికలవారగు, యువతయః = జవ్వనులు, ఉదీక్షన్తే = [వింతగా] చూచుచున్నారు. [శిఖరిణీవృత్తము] కుతూః కృత్తేః స్నేహపాత్రం సైవాల్పా కుతుపః పుమాన్ - అమరః.

తాత్పర్యము :- చకోరములు వెన్నెలను త్రాగుచున్నవి. ద్రవమును లోగొనుచున్న తిత్తులవలె నున్నవి. ఆ వెన్నెల ప్రవహించుటతో పొట్టలోని అంధకారము నశించుచున్నది. మాటిమాటికిని విస్తారముగా తెరుచుకొనుచున్న చంచూపుటములనుండి ఈ వింత దృశ్యము కన్పించుచున్నది. దీనిని అంతఃపురకాంతలు సౌధాగ్రభాగములనుండి తిలకించుచున్నారు. (సౌధముల ఎత్తు వ్యంగ్యము).

సమాసములు :- ఇందోః కిరణాః - తాన్. ఘనముదంచన్ చంచ్వోః పుటః - పుటే నిహితాని నేత్రాణి యాభిః తాః. జ్యోత్స్నారసస్య కుతుపః - కుతుపస్య కౌతూహల కృతః - తేషామ్. నశ్యచ్చ తత్తిమిరం చ - తిమిరేణ విశదమాభోగం యస్య తత్.

అపి చ —

ఇహ యువతివదనకాంతిభిరాప్యాయితతుందపరిమృజః శేతే ।
భుక్తాపభుక్తహిమరుచిమరీచిరంతఃపురచకోరః ॥ 110

విభీషణః :- ఇహైవాయమలకాయాః శాఖానగరగౌరవభాజి త్రిపుర దహనాధిష్ఠానప్రతిష్ఠో భగవాన్మహాకాలనాథః. అయంహి

---

క్రియ :— ఈక్షిజ్ దర్శనే, ఆత్మనే, లట్, ప్రథమ
ఈక్షతే - ఈక్షేతే - ఈక్షన్తే.

ఇహేతి :- అపిచ = మరియు, ఇహ = ఇచ్చట, అంతఃపురచకోరః = అంతఃపురమందలి వెన్నెలపిట్ట, భుక్త + అపభుక్త = భుజించి వెక్కసమై విడిచి పెట్టిన, హిమరుచిమరీచిః = వెన్నెలకలదై, యువతి=అంతఃపుర కాంతల యొక్క, వదనకాంతిభిః = ముఖజ్యోత్స్నలతో, ఆప్యాయిత = సంతృప్తి చెందినదియు, తుంద పరిమృజః = బొజ్జ నిమురుకొనుచున్నదియునై, శేతే = పడుకొన్నది. [ఆర్య]

తాత్పర్యము :- తినగలిగినంత వెన్నెలను తిని, వెక్కసమై తక్కినది విడిచిపెట్టిన అంతఃపురచకోరము-కాంతాముఖచంద్రజ్యోత్స్నలతో మరింతభుక్తాయాసము ననుభవించుచు బొజ్జ నిమురుకొనుచు పడుకొన్నది.

సమాసములు :- వదనస్య కాంతిః - యువతీనాం వదనకాంతిభిః. ఆప్యాయితశ్చాసౌ తుందపరిమృజశ్చ. భుక్తశ్చాపభుక్తశ్చ - హిమరుచేః మరీచయః - భుక్తాపభుక్తాః హిమరుచిమరీచయః యేన సః, అంతఃపురస్య చకోరః.

క్రియ :— శీఙ్ స్వప్నే. ఆత్మనే. లట్. ప్రథమ
శేతే - శయాతే - శేరతే

ఇహేతి :- అలకాయాః=అలకాపట్టణమునకు, శాఖానగర గౌరవభాజి = శాఖానగరమను గౌరవమును పొందినదగు, ఇహ ఏవ = ఈ ఉజ్జయినియందే, త్రిపుర దహన = శివునికి, అధిష్ఠాన = నివాసమగుటతో, ప్రతిష్ఠః = కీర్తికలవాడును, భగవాన్ = భగవంతుడునైన, మహాకాలనాథః = మహాకాలనాథుడను పేరుగల శివుడు ఉన్నాడనుట. అయమ్ హి = ఇతడేమో —

ఉద్దామభ్రమివేగ వి స్తృతజటావల్లి ప్రణాళీపత
త్స్వర్గంగాజలదండికావలయితం నిర్మాయ తత్పంజరమ్ ।
సంభ్రామ్యద్భుజదండపక్షపటల ద్వంద్వేన హంసాయిత
స్త్రైలోక్యవ్యయనాటికానయనటః స్వామీ జగత్త్రాయతామ్ ॥ 111

---

ఉద్దామేతి :- ఉద్దామ = భీషణమైన, భ్రమి = నాట్యభ్రమణము నందలి వేగ = వేగముతో, వి స్తృత = వ్యాప్తినొందిన, జటావల్లీ = జటావల్లికలు అనునట్టి ప్రణాళీ = గొట్టములనుండి [ప్ర + నాళీ]. పతత్ = జారుచున్న, స్వర్గంగాజల = దివ్యగంగాజలము అనునట్టి, దండికా = ఊచలతో, వలయితమ్ = చుట్టబడినదగు, తత్పంజరమ్=ఒకక్రొత్త పంజరమును, నిర్మాయ=తయారుచేసికొని; సంభ్రామ్యత్= కదలుచున్న, భుజదండ = బాహుదండములనునట్టి, పక్షపటలద్వంద్వేన = రెక్కల జంటతో, హంసాయితః = హంసయైనవాడును, త్రైలోక్యవ్యయ = ముల్లోకము లను వినాశము గావించుట యనునట్టి, నాటికా = నాటికయొక్క, నయ = అభినయ మునందు, నటః = నటుడునైన, స్వామీ = శివుడు, జగత్ = ప్రపంచమును, త్రాయతామ్ = రక్షించుగాక । [శార్దూలము]

తాత్పర్యము :- తాండవములో భాగముగా శివుడు గిరిగిర తిరుగుచున్న ప్పుడు జడలు పొడవులై వి స్తరిల్లినవి. వానినుండి గంగాజలములు ధారలు గట్టుచున్నవి. అవి ఊచలవలె అదియొక వజ్రపంజరమైనది. కదలాడుచున్న బాహువులే రెక్కలుగా శివుడు ఆ పంజరమునందు హంసయైనాడు. ప్రళయనాటక మహానటుడు ఈ లోకమును కాపాడుగాక ।

సమాసములు :- ఉద్దామశ్చాసౌ భ్రమివేగశ్చ. వేగేన వి స్తృతా చ సాజ టావల్లీ చ, సైవ ప్రణాళీ - ప్రణాళీభిః పతచ్చ తత్ స్వర్గంగా జలం చ - స్వర్గంగాయాః జలమ్ - జలమేవ దండికా - దండికాభిః వలయితమ్. సంభ్రామ్యన్తౌ చ తౌ భుజ దండౌ చ - దండావేవ పక్షపటల ద్వంద్వమ్ - తేన. హంస ఇవాచరతీతి. త్రైలో క్యస్య వ్యయః - వ్యయస్య నాటికా - నాటికాయాః నయే నటః.

క్రియ :- త్రైఙ్ పాలనే. ఆత్మనే. లోట్. ప్రథమ
త్రాయతామ్ - త్రాయేతామ్ - త్రాయన్తామ్

కామే తు సమ్మోహన శస్త్రహస్తే
స్వాహామనుధ్యాయ చిరం జడోఽభూత్ ॥ 113

(సర్వే నమన్తి)

---

మూడు). నయనాత్ = కంటినుండి. కృశానుః = అగ్ని. వేగాత్ = అతివేగముగా. అగాత్ = వెల్వడి మన్మథుని వెంటను వెళ్ళెను. కిన్తు = కాని. కామే = ఆ మన్మథుడు. సమ్మోహన శస్త్రహస్తే = సమ్మోహన నామకాస్త్రమును గ్రహించినవాడు కాగా [సః = ఆ అగ్ని]. స్వాహామ్ = తన పత్నియగు స్వాహాదేవిని. [స్వాహా తు హుతభుక్ప్రియా - అమరః]. అనుధ్యాయ = ధ్యానించి. చిరమ్ = చాలసేపు. జడః = చైతన్యరహితుడు. అభూత్ = అయ్యెను. [ఇంద్రవజ్రావృత్తము].

తాత్పర్యము :- ఓ మునిశ్రేష్ఠుడా! శివుని కంటినుండి అగ్ని అతి వేగముగా వెల్వడి మన్మథుని సమీపించెను. కాని అతడు సమ్మోహనాస్త్రధరుడై యుండుటచే అగ్ని తన భార్య స్వాహాదేవిని ధ్యానించుచు కొంత తడవు జడత్వమును వహించెను సుమా!

సమాసములు :- త్రీణి నేత్రాణి యస్య సః - త్ర్యంబకః, యుగ్మాత్ ఇతరమ్ - తస్మాత్. సమ్మోహనం నామ శస్త్రం హస్తే యస్య సః - తస్మిన్నితి సతి సప్తమీ.

సంధులు :- ఇతరస్మాత్ + నయనాత్ - అనునాసికాదేశః. జడః + అభూత్ - ఉత్వాదేశవిసర్గ. జడో + అభూత్ - పూర్వరూపం.

క్రియ :- ఇణ్ గతౌ, పరస్మై, లుఙ్. ప్రథమ [ఇణో గా లుఙి]
అగాత్ - అగాతామ్ - అగుః
భూ సత్తాయామ్, లుఙ్, పరస్మై, ప్రథమ
అభూత్ - అభూతామ్ - అభూవన్.

[సర్వే = అందరును. నమన్తి = నమస్కరింతురు]

సీతా :- (విహస్య) అహో త్రిభువనపతేః శశధరశేఖరస్య కబళితచతుర్దశభువనస్యాపి న పలాయితా అక్షిబుభుక్షా యేన భగవాన్మదనోఽపి వికాలికగ్రాసీకృతః. (అహో తిహువణవఇణో ససహరసేహరస్స కవలిదచఉద్దహభువణస్స వి ణ పలాఇదా అక్ఖిబుభుక్ఖా జేణ భఅవం మఅణో వి విఆలిఅగ్గాసీకిదో)

(సర్వే హసన్తి)

రామః :- (సవిమర్శమ్) అస్య హి భగవతః

బాణీభూతపురాణపూరుషధృతి ప్రత్యాశయా ధావితే
విద్రాతి స్ఫురదాశుశుక్షణికణ గ్లాన్తే శకుంతీశ్వరే ।

---

అహో ఇతి :- [విహస్య=నవ్వి] అహో = ఆశ్చర్యము । కబళిత= భోజనముగా స్వీకరింపబడిన. చతుర్దశభువనస్య అపి = పదునాల్గు లోకములు కలవాడైనను, త్రిభువనపతేః = పూజ్యుడగు శశధర శేఖరస్య = శివునియొక్క. అక్షి బుభుక్షా = వింటి ఆకలి. న పలాయితా = తొలగలేదు - తీరలేదనుట - ఏలయనగా, భగవాన్ = భగవంతుడగు మదనః అపి = మన్మథుడుకూడ. వికాలికగ్రాసీకృతః = అకాలమునందలి భోజనము (ఉపాహారము) గావింపబడినాడు.

[సర్వే = అందరును. హసన్తి = నవ్వుదురు]

బాణీభూతేతి :- బాణీభూత = త్రిపురసంహార సమయమున శివధనుస్సునకు బాణముగా మారిన. పురాణపూరుష = విష్ణుమూర్తియొక్క. ధృతి = ధారణము నందలి, ప్రత్యాశయా = కోరికతో - వీపున మోయవలెనను కోరికతో, ధావితే = శివుని సమీపించినవాడును. స్ఫురత్ = మండుచున్న, ఆశు శుక్షణి = ముక్కంటి అగ్నియొక్క [వహ్నిః శిఖావా నాశుశుక్షణిః - అమరః]. కణ = కణములచే, గ్లాంతే = మర్దింపబడినవాడై, శకుంతేశ్వరే = గరుత్మంతుడు. విద్రాతి = దూరము జరిగినవాడును కాగా. నమ్ర = గరుత్మంతుడు సమీపించినపుడు భయముతో వంగి, ఉన్నమ్ర = అతడు దూరము జరిగినప్పుడు ధైర్యముతో నిలిచిన, భుజంగపుంగవ = వాసుకి రూపముగు, గుణ = వింటినారిచే, వ్యాకృష్ట = ఎక్కుపెట్టబడిన. బాణాసన =

నమ్రోన్నమ్రముఖభుజంగపుంగవగుణవ్యాకృష్టబాణాసన
క్షిప్తాస్త్రస్య పురద్రుహో విజయతే సంధానసీమాశ్రమః ॥ 114

(అన్యతో దర్శయన్) ఇయం సా కలచురికుల నరేంద్రసాధారణాగ్రమహిషీ మాహిష్మతీ నామ చేదిమండలముండమాలానగరీ ఇహ హి —

---

ధనుస్సునుండి, క్షిప్త = జారిపోవుచున్న. అస్త్రస్య = బాణములు గలవాడగు, పురద్రుహః = త్రిపురసంహారకుడగు శివునియొక్క. సంధానసీమాశ్రమః - సంధాన = బాణమును సంధించుటయే, సీమా = అవధిగాగల, శ్రమః = ప్రయాసము, విజయతే = జయించునుగాక ! [శార్దూలము]

తాత్పర్యము :- త్రిపురసంహార సమయమున విష్ణుమూర్తి శివధనుస్సునకు బాణమైనాడు. వాసుకి వింటినారి యైనాడు. బాణరూపమున నున్న విష్ణుమూర్తిని వహించుటకు గరుడుడు సమీపించుచు శివనేత్రాగ్నికి తాళలేక దూరము జరుగుచు నుండగా వాసుకి భయపడి వంగుట [గరుత్మంతుడు సమీపించినపుడు] స్థైర్యముగా నిలుచుట [అతడు దూరము జరిగినపుడు] చేయుచున్నాడు. దీనితో శివుడు సంధింప వలసిన బాణములు జారిపోవుచున్నవి. ఇట్లు బాణసంధానమునకు అనాడు శివుడు పడిన శ్రమకు జయమగుగాక !

సంధులు :- ప్రతి + ఆశయా, వి + ఆకృష్ట - యణాదేశ. శ్రీకంఠ + ఈశ్వరే, నమ్ర + ఉన్నమ్ర - గుణసంధులు. ఉత్ + నమ్ర - అనునాసికాదేశ. క్షిప్త + అస్త్రస్య - సవర్ణదీర్ఘ. పురద్రుహః + విజయతే - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- జిజయే. లట్ [విపూర్వకాత్] ఆత్మనే. ప్రథమ
విజయతే - విజయేతే - విజయన్తే.

ఇయమితి :- [అన్యతః = మరొకవైపునకు, దర్శయన్ = చూపుచు]. ఇయమ్ = ఇదే, కలచురికుల = కార్తవీర్యార్జున వంశమునకు చెందిన, నరేంద్ర = రాజులకు, సాధారణ = సాధారణమైన, అగ్రమహిషీ=పట్టమహిషియు. మాహిష్మతీ

ఆశ్లేషచుంబన రతోత్సవ కౌతుకాది
క్రీడాదురోదరపణ ప్రతిభూరనంగః ।
భోగస్తు యద్యపి జయే చ పరాజయే చ
యూనోర్మనస్తదపి వాంఛతి జేతుమేవ ॥ 115

---

నామ = మాహిష్మతి అను పేరుగలదియు, చేదిమండల = చేదిసామ్రాజ్యమునకు ముండమాలా = శిరోభూషణము వంటిదియునగు, నగరీ = పట్టణము, ఇహ హి = ఇప్పుడేమో —

ఆశ్లేషేతి :- ఆశ్లేష = కౌగిలింత, చుంబన = ముద్దు, రతోత్సవకౌతుకాది = సంభోగకుతుకము మున్నగునట్టి, క్రీడాదురోదర = క్రీడాద్యూతమునందలి, పణ = పందెములకు, ప్రతిభూః = మధ్యవర్తి, అనంగః = మన్మథుడే - క్రీడాదురోదరమునందు ఓడిన వ్యక్తులచే ఆయాపందెములను ఇప్పించువాడనుట, యద్యపి = నిజమునకు, జయే = జయమునందును, పరాజయే = ఓటమియందును, భోగః = [ఉభయులకు] ఆనందమే, తదపి = అయినప్పటికిని, యూనోః = కోడెకాండ్రయొక్క, మనః = మనస్సు, జేతుమ్ ఏవ = జయించుటకే, వాంఛతి = కోరుకొనుచున్నది. [భోగస్తు యద్యపి జయేఽపజయే చ తుల్యః - అని పాఠాంతరము], జయే = జయమునందును, అపజయే చ = ఓటమియందును, భోగః = అనుభవము, తుల్యః = [వధూవరులకు] సమానము. (వసంతతిలక)

తాత్పర్యము :— ఈ మాహిష్మతీ పట్టణమునందు యువదంపతులు ఆశ్లేష చుంబనరతాదులను పందెములుగాపెట్టి క్రీడాద్యూతము ఆడుచుండిరి, ఆ పందెములకు మధ్యవర్తి మన్మథుడే, ఓడినను గెలిచినను ఆనందమే, అయినను యువవరులు గెలుపునే కోరుచున్నారు.

సంధులు :- రత + ఉత్సవ - గుణసంధి. ప్రతిభూః + అనంగః, యూనోః + మనః - రేఫాదేశవిసర్గ, భోగః + తు, మనః + తత్ - సాదేశవిసర్గ, యది + అపి - యణాదేశ.

క్రియ :- వాఛి ఇచ్ఛాయామ్, లట్, పరస్మై, ప్రథమ
వాంఛతి - వాంఛతః - వాంఛన్తి.

(విమానవేగం రూపయిత్వా) దేవి.

దేవ్యా భూమేర్మృగమదమషీమండనం సిద్ధసింధోః
సధ్రీచీయం జయతి యమునా యా తటైకాగ్రవృత్తీన్ ।
ప్రేమోత్కర్షాదివ పితృపతేర్భ్రాతురాచ్ఛిద్య హస్తా-
దస్తాబాధం గమయతి పితుర్మండలం చండభానోః ॥ 116

---

దేవ్యేతి :- [విమానవేగమ్ = విమానవేగమును. రూపయిత్వా = నటించుచు]. దేవి = సీతా ! భూమేః దేవ్యాః=భూదేవికి. మృగమదమషీ. మండనమ్ - మృగమద = కస్తూరియనునట్టి [మృగనాభిర్మృగమదః - అమరః]. మషీ = నల్లని కాటుకతో చేసిన. మండనమ్ = అలంకారమును: సిద్ధసింధోః = గంగానదికి. సధ్రీచీ= సహోదరియు అయిన. ఇయమ్ = ఈ యమునా = యమునానది. జయతి = జయించు గాక ! (విరాజిల్లుననుట). తట=తన గట్లుపైని (సమీప తీర్థములందనుట). ఏకాగ్ర వృత్తీన్ = ఏకాగ్రతతో (తపస్సమాధితో ననుట) వర్తించుజనులను. ప్రేమోత్కర్షాత్ ఇవ = అనురాగాతిశయముతోవలె. భ్రాతుః = తన సోదరుడైన. పితృపతేః = యమునియొక్క., హస్తాత్ = చేతినుండి. ఆచ్ఛిద్య = లాగివేసి - యమలోకమునుండి తప్పించియనుట. అస్తాబాధమ్=నిర్విఘ్నముగా (సుఖముగా - అస్తా ఆబాధా యస్మిన్ తాదృశమ్). పితుః = తన తండ్రియైన. చండభానోః = సూర్యునియొక్క., మండలమ్ = బింబమును, యా = ఏ యమునానది. గమయతి = పొందించుచున్నదో, సా = ఆ యమున, జయతి అని అన్వయము. (పితృపతిః సమవర్తీ పరేతరాట్ - అమరః) (మందాక్రాంతము).

తాత్పర్యము :- ఈ యమునానది భూదేవికి నొసట కస్తూరి రేఖవలెనున్నది. ఈమె గంగానదికి సైదోడు. కావుననే తన తటములందలి తపస్వులను యమలోకము నకు పోనీక సూర్యలోకమునకు పంపుచున్నది. యమునయు, యముడును సూర్య సంతానమని పురాణగాథ.

సమాసములు :- మృగమద ఏవ మషీ - మషీకృతం మండనమ్ ఏకాగ్రా వృత్తిర్యేషామ్ - తటే విద్యమానాః ఏకాగ్రవృత్తయః - తాన్. ప్రేమ్ణః ఉత్కర్షాత్. అస్తా ఆబాధా (పీడా) యత్ర తాదృశమ్. చండాః భానవః యస్య - తస్య.

లక్ష్మణః :- (వారిమంగుళ్యా దర్శయన్)

త్రిపురహర కిరీటక్రీడితైః క్రీడయద్భి
ర్భువనమమృతభానోర్బాలమిత్రైః పయోభిః ।
సగరసుతచితాయాః పావనీ తోయరాశే
రియమియ మఘమగ్రే జాహ్నవీ నిహ్నుతే నః ॥ 117

---

సంధులు :- భూమేః + మృగ, పతేః + భ్రాతుః + అభ్యుదయ. పితుః + మండలమ్ - రేఫాదేశ విసర్గ. ప్రేమ + ఉత్కర్షాత్ - గుణసంధి.

క్రీడయ :- క్రీడ విహారే. పరస్మై. ప్రథమ.
జయతి - జయతః - జయన్తి
గమ్లృ గతౌ (ణిచ్) పరస్మై. లట్. ప్రథమ.
గమయతి - గమయతః - గమయన్తి

త్రిపురేతి :- (వారిమ్ = [illegible], అంగుళ్యా = వ్రేలితో.గంగను. దర్శయన్ = చూపుచు). త్రిపురహర = శివునియొక్క. కిరీట = శిరోఽగ్రభాగమే. క్రీడితైః = ఆటపట్టుగా కలిగియుం. భువనమ్=ప్రపంచమును, క్రీడయద్భిః=ఆనందింప చేయుచున్నవియు, అమృతభానోః = చంద్రునికి. బాలమిత్రైః = చిననాటి నెచ్చెలులు ఐన. పయోభిః = ఉదకములతో. సగరసుతచితాయాః = సగరసుతుల చితారాశియగు. తోయరాశేః = సముద్రునికి. పావనీ = పవిత్రకారకమునైన. జాహ్నవీ = గంగానది (జహ్నుతనయ). ఇయమ్ ఇయమ్=ఇదే ఇదే. అగ్రే=ఎట్టఎదుట. నః = మనయొక్క. అఘమ్ = పాపమును (కలుషం వృజినైనోఽఘమ్ - అమరః). నిహ్నుతే = తొలగించుచున్నది - మటుమాయము చేయుచున్నది. (మాలిని)

తాత్పర్యము :- శివ జటాజూటమున నివసించునదియు కావుననే విశ్వము నానందింపజేయునదియు జటాశశికి బాల్యమిత్రమునైన గంగానది సగరపుత్రుల చితా రాశివంటిదైన సముద్రమును పవిత్రీకరించునదై ఇదే మన పాపములను తొలగించు చున్నది.

రామః :- (సహర్షమ్)

గౌరీవిభజ్యమానార్ధ సంకీర్ణహరమూర్ధని ।
అంబ ! ద్విగుణగంభీరే ! భాగీరథి ! నమోఽస్తు తే ॥ 118

(సీతాంప్రతి) దేవి, వందస్వ.

దేవస్యాంబుజసంభవస్య భవనాదంభోధి మాగాముకా
సేయం మౌళివిభూషణం భగవతో భర్గస్య భాగీరథీ ।

---

సమాసములు :- త్రిపురహరస్య కిరీటమేవ క్రీడితం యేషాం తాని — తైః. బాలా ఏవ మిత్రాణి. బాల్యాత్ మిత్రాణి — ఇతి భావప్రధానో నిర్దేశః - తైః. సగరసుతానాం చితా (చితా చిత్యా చితిః స్త్రియామ్—అమరః) తోయానాం రాశిః_తస్య.

క్రియ :- హ్నుఙ్ అపనయనే. లట్. ఆత్మనే (అదాది) ప్రథమ (ని)
హ్నుతే — హ్నువాతే - హ్నువతే

గౌరీతి :- (సహర్షమ్ = ఆనందముతో) గౌరీ=పార్వతిచే, విభజ్యమాన= పాలుపంచుకొనబడిన, అర్ధ = సగభాగము కల్గుటచే_సగభాగమును గౌరి స్వీకరించుటచే నని. సంకీర్ణ = సన్నబడిన (వెడల్పు తగ్గిన), హరమూర్ధని = శివుని శిరస్సునందు. ద్విగుణ = రెట్టింపైన, గంభీరే = లోతుగలదానా । - వెడల్పు సగము తగ్గుటతో లోతు రెట్టింపు పెరిగినదనుట, అంబ = తల్లీ ! భాగీరథీ = గంగా ! తే = నీకై ఇదే, నమః అస్తు = నమస్కారము. (పథ్యావక్త్రము).

దేవస్యేతి :- (సీతామ్‌ప్రతి = సీతనుద్దేశించి) దేవి= జానకీ । వందస్వ = నమస్కరింపుము. దేవస్య = భగవానుడగు. అంబుజ సంభవస్య = బ్రహ్మయొక్క, భవనాత్ = నివాసమునుండి (బ్రహ్మ కమండలువునుండి) అంభోధిమ్=సముద్రమును, ఆగాముకా = చేరవచ్చుచున్నదై , భగవతః = భగవంతుడగు, భర్గస్య = శివునికి, మౌళి విభూషణమ్ = శిరోభూషణమైనది, ఇయమ్ = ఈ, సా = సుప్రసిద్ధురాలగు, భాగీరథీ=గంగమ్మ. ఇహ = ఇచ్చట, విగ్రహమ్ = శరీరమును, అపహాయ = విడిచి, ఉద్యాతాన్ = పైకిపోవుచున్నవారను, స్రోతః ప్రతీపాన్ = ప్రవాహమునకు ఎదురీదుచున్నవారునైన, జనాన్ = జనులను, స్రోతస్తీవ్రతర త్వరా = ప్రవాహము

ఉద్ఘాతానపహాయ విగ్రహమిహ స్రోతఃప్రతీపానపి
స్రోతస్త్రప్రతిరత్వరా గమయతి ద్రాగ్బ్రహ్మలోకం జనాన్ ॥ 119

సీతా :- (కృతాంజలిః) ఏషా నిజ స్రోతః శృంఖలా సందానితత్రిభువనా. హేమందాకిని వంద్యసే. (ఏసా ణిఅ సోతసింఖలా సందాణిద తిహుఅణా. మందాఇణీ. వన్దిఅసి.)

(సర్వే నమన్తి)

లక్ష్మణః :- (అన్యతో దర్శయన్)

---

కన్న అధిక తీవ్రమైన వేగముగల ఈ గంగమ్మ. ద్రాక్ = క్షణకాలములో. (ద్రాక్ ఝటిత్యంజసాహ్నాయ - అమరః). బ్రహ్మలోకమ్=బ్రహ్మలోకమును. గమయతి= పొందించుచున్నది. గంగ అధోగామిని. జీవాత్మలు ఊర్ధ్వగాములు-ఇది విరోధాభాసము- ముక్తిప్రదయనుట. (శార్దూల విక్రీడితము)

తాత్పర్యము :- బ్రహ్మలోకమునుండి క్రిందికి దిగుచున్న ఈ భాగీరథి నట్టనడుమ శివజటాజూటభూషితమైనది. ఇచట దేహమును విడిచి ఊర్ధ్వలోకములకు పోవు వారిని ఈ గంగ తన ప్రవాహమునకు ఎదురీదు బ్రహ్మలోకమును చేర్చుచున్నది. గంగాతీరమున వసియించువారికి పునర్జన్మరహితమగు బ్రహ్మలోకవాసము లభించునని

క్రియ :- గమ్లృగతౌ (ణిచ్) పరస్మై. లట్. ప్రథమ

గమయతి - గమయతః - గమయన్తి

ఏషేతి :- (కృతాంజలిః = నమస్కరించినదై) ఏషా = గంగానది, నిజ = తనయొక్క. స్రోతః = ప్రవాహమనెడి. శృంఖలా = గొలుసుతో. సందానిత = దండ గ్రుచ్చబడిన. త్రిభువనా = ముల్లోకములు కలది. హేమందాకిని = గంగానదీ ! వంద్యసే = నమస్కరింపబడుచున్నావు. (బద్ధే సందానితం మూతమ్ — అమరః).

[సర్వే = అందరును, నమన్తి = నమస్కరింతురు.]

ధనేతి :- (అన్యతః దర్శయన్ - మరొకవైపునకు చూపుచు) ధనాధి నాథ = కుబేరుని యందలి. ప్రణయ = ప్రేమచేనైన. అనురోధాత్ = అనురోధము

ధనాధినాథప్రణయానురోధా దభగ్నకైలాస నికేతనస్య ।
దేవస్య కల్పాంత కపాల పాణే ర్వారాణసీ నామ పురీ పురస్తాత్ ॥ 120

రామః :- (సహర్షమవలోక్య)

ప్లవమానై రపారోఽయం జనైః సంసారసాగరః ।
ద్వీపే వారాణసీనామ్ని విశ్రాంతై రిహ తీర్యతే ॥ 121

---

వలన (ప్రణయః ప్రేమ్ణి విశ్వాసే యాచ్ఞాప్రసంభయోరపి) - కుబేరునిపైనున్న ప్రేమకారణముగాననుట. అభగ్నకైలాసనికేతనస్య- అభగ్న = విడిచిపెట్టని, కైలాస = కైలాసమే. నికేతనస్య = గృహముగా గలవాడును - కైలాసనివాసమును విడువనివాడనుట, కల్పాంత = కల్పాంతమునందు. కపాలపాణేః = పుఱ్ఱె చేతబట్టి భిక్షాటనము చేయువాడును. [ప్రళయకాలమునందు శివుడు కపాలపాణియై సంచరించుననుట] - అయిన, దేవస్య = శివునియొక్క, పురీ = పట్టణము. వారాణసీనామ = వారణాసి అను పేరుగలది. పురస్తాత్ = అల్లదే ఎదుట కన్పించుచున్నది. [ఉపజాతి]

తాత్పర్యము :- కుబేరునిపై అనురాగముతో కైలాసమును విడకున్నను, కపాలపాణికి సొంతమగు వారణాసి అదిగో।

సమాసములు :- ధనాధినాథస్య ప్రణయః - ప్రణయస్య (ప్రణయేన) అనురోధః - తస్మాత్. అభగ్నం కైలాసనికేతనం యేన - తస్య కపాలం పాణౌ యస్య సః.

ప్లవమానైరితి :- (సహర్షమవలోక్య = సంతోషముగాచూచి) ప్లవమానైః = ఎగురుచున్నవారైన - దాటుటకు ప్రయత్నించుచున్నవారనుట. జనైః = జనులచేత, అపారః = దాట శక్యముకానిదైన, అయమ్ = ఈ, సంసారసాగరః = సంసారసముద్రము (భవసాగరము), వారాణసీనామ్ని = వారణాసి అనుపేరుగల, ద్వీపే = ద్వీపమునందు. ఇహ = ఇచ్చట. విశ్రాంతైః = విశ్రమించినవారిచే. తీర్యతే = సులభముగా దాటబడుచున్నది. (పథ్యావక్త్రము).

తాత్పర్యము :- ఎన్నో జన్మలుగా ఎంత ప్రయత్నించినను సంసారసాగరమును దాటలేనివారు వారణాసీ ద్వీపమున రవ్వంత విశ్రాంతులై సులభముగా తరించుచున్నారు. అపునర్భవముగా ముక్తి బొందుచున్నారనుట. (ద్వీపోఽస్త్రియామంతరీపం యదంతర్వారిణ స్తటమ్ - అమరః).

అపిచైనాం నిత్యమధ్యాస్తే భగవాన్

కంఠచ్ఛాయావిలీనపన్నగ ఫణారత్నౌఘమాత్రస్థితే
హారే నిర్భయపార్వతీ భుజలతా బంధోల్లసత్కంధరః ।
తత్సర్వాంగ విరామవామనతమైరేవ స్వరైః సామగం
బిభ్రద్బ్రహ్మశిరః శివాయ జగతామేణాంకచూడామణిః ॥ 122

---

సంధులు :- ప్లవమానైః + అపారః. విశ్రాంతైః + ఇహ - రేఫాదేశ విసర్గ. అపారః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - అపారో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- తౄ ప్లవనసంతరణయోః (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ
తీర్యతే - తీర్యేతే - తీర్యన్తే

ప్రతిపత్తి :- అపిచ = మరియు, ఏనామ్ = ఈ పట్టణమును, భగవాన్ = శివుడు, నిత్యమ్ = ఎల్లప్పుడును, అధ్యాస్తే = అధివసించును. కంఠచ్ఛాయ=గళనీలిమ చేత, విలీన = కప్పివేయబడిన, పన్నగ = వాసుకియొక్క, ఫణా = పడగయందలి, రత్నౌఘమాత్రస్థితే = మణిసమూహ రూపమాత్రస్థితి కల, హారే = సర్పహారమునందు - సర్పహారము కంఠచ్ఛాయలో మునిగిపోయినదనుట - కావున పార్వతి నిర్భయ యైనది. నిర్భయ = భయము పోయినదైన, పార్వతీ = గౌరియొక్క, భుజలతాబంధ = కౌగిలింతతో, ఉల్లసత్కంధరః = ఆనందించుచున్న కంఠభాగము కలవాడును — శివుని కంఠమును పార్వతి నిర్భయముగా కౌగిలించినదనుట. తత్ = ప్రసిద్ధమైన, సర్వాంగ= సమస్త శరీరముయొక్క, విరామ=వియోగముతో (తక్కిన శరీరమునుండి విడిపోయిన శిరస్సు). వామనతమైః = మిక్కిలి చిన్నబడిన, స్వరైః ఏవ = స్వరములతోనే, సామగమ్ = సామవేదము పఠించుచున్న, బ్రహ్మశిరః = బ్రహ్మశిరస్సును, బిభ్రత్=ధరించుచున్నవాడును అగు, ఏణాంకచూడామణిః=చంద్రశేఖరుడు, జగతామ్ = ప్రపంచములకు, శివాయ = శుభముకొఱకు - అగుగాక అని అన్వయము. (ఛాయా సూర్యప్రియా కాంతిః ప్రతిబింబమనాతపః - నానార్థనిఘంటువు) శార్దూలము.

తాత్పర్యము :- శివుని కంఠమునందలి నాగహారము పార్వతిని భయపెట్టుచున్నది. కాని అది ఇప్పుడు శివుని కంఠనీలిమలో మునిగిపోయినది. పడగమీద మణిఒక్కటే కన్పించుచున్నది. పార్వతికి భయము పోయినది. శివుని కౌగిలించినది.

(అన్యతో దర్శయన్, సీతాంప్రతి) దేవి. దృశ్యతామితః

నవోన్మీలన్మౌర్వీ కిణనికరకార్కశ్యసదయ
ప్రవృత్తస్త్వత్పాణౌ కిమపి నిబిడం పీడయతి మే ।
కృతార్థోఽయం యస్యాం సమజని కరః సైవ పురతః
పురీ పూర్వేషాం తే నయన మియమాలానయతి నః ॥ 123

---

అట్లు ఆనందించుచున్న శివుడు శుభప్రదుడగుగాక ! ఒకప్పుడు శివుడు బ్రహ్మశిరస్సు నొకదానిని త్రుంచివేసెనని పురాణకథ. ఆ శిరస్సు శరీరరహితమయ్యు హీనస్వరముగ సామలు గానము చేయుచున్నది. అట్టి బ్రహ్మశిరస్సును ధరించిన శశాంకచూడుడు జగత్కల్యాణకరుడగుగాక !

నవేతి :- (అన్యతః దర్శయన్ = మరొకవైపు చూపుచు. సీతాంప్రతి = సీతనుద్దేశించి) దేవి = జానకీ ! ఇతః = ఇటు. దృశ్యతామ్ = చూడబడుగాక - ఇటు చూడుమనుట. నవ = క్రొత్తగా. ఉన్మీలత్ = బయల్పడుచున్న. మౌర్వీకిణనికర - మౌర్వీ = వింటినారియొక్క దెబ్బలచేనేర్పడిన, కిణ నికర = కాయల సమూహము వల్లనైన, కార్కశ్య = కాఠిన్యముతో - శివధనుర్భంగమువలన నేర్పడిన కాయలనుబట్టి; సదయప్రవృత్తః = సుతిమెత్తగా ప్రవర్తించినదైన, అయమ్ = ఈ. మే = నాయొక్క. కరః = చేయి, త్వత్పాణౌ = నీ హస్తము. కిమపి = ఏదో అనురాగ విశేషము వలన, నిబిడమ్ = గాఢముగా. పీడయతి = పీడించుమండగా - సీతయొక్క రాముని చేతిని గట్టిగా పట్టుకొన్నదనుట - పాణిపీడనమనగా వివాహము (తథా పరిణయోద్వాహోప యామాః పాణిపీడనమ్ - అమరః): యస్యామ్ = ఏ పట్టణమునందు (మిథిల) కృతార్థః సమజని = కృతార్థమైనదో, సా = అదే. తే = నీయొక్క. పూర్వేషామ్ = పూర్వీకులయొక్క, పురీ = పట్టణము. ఇయమ్ = ఇదే మిథిల. నః = మాయొక్క. నయనమ్ = చూపును. ఆలానయతి = బంధించుచున్నది - ఆకట్టుకొనుచున్నదనుట. (శిఖరిణీవృత్తము).

తాత్పర్యము :- ఓ మైథిలీ ! మన పాణిగ్రహణ సమయమున వికర్కశమైన నా చేయి మృదువుగా ప్రవర్తించినను నీ చేయిమాత్రము ఏదో అనురాగ విశేషముతో గాఢముగా ప్రవర్తించి నా చేతిని కఠినముగా పట్టుకొన్నది. అట్టి ఈ నా హస్తము

సీతా :- (సస్మితానురాగం సాచీకృతాక్షీ రామం పశ్యన్తీ పురీంప్రతి) అంబ మిథిలే. వన్ద్యసే. గురుజనేఽపి వందనం మే విజ్ఞాపయిష్యసి.
(అంబ. మిహిలే.వన్దిజ్జసి, గురుఅణే వి వన్దణం మే విణ్ణవేసి)

రామః :— (సుగ్రీవవిభీషణౌ ప్రతి) వయస్యౌ. ఇయం సా జానకీం ప్రజాయమానాయా భగవత్యా భూమేరరిష్టమందిరం మిథిలా.

సుగ్రీవ :- విభీషణౌ (సకౌతుకస్మితమ్) యత్ర భగవతః పార్వతీజీవితేశ్వ

---

ఏ పట్టణమున వ్యక్తమైనదో ఆ పట్టణము మిథిల - నీ పూర్వీకుల నగరము - ఇదే - చూడుము - నా చూపులను ఆకట్టుకొనుచున్నది.

క్రియ :— జనీ ప్రాదుర్భావే లుఙ్. ఆత్మనే. ప్రథమ
అజని/అజనిష్ట — అజనిషాతామ్ — అజనిషత
అలాన (క్యఙ్) లట్ పరస్మై. ప్రథమ
అలానయతి — అలానయతః — అలానయన్తి

అంబేతి :- (సస్మితానురాగమ్ = చిరునవ్వుతో, అనురాగముతో. సాచీకృతాక్షీ = వక్రీకృతనేత్రయై [తిర్యగర్థే సాచి తిరః - అమరః]. రామమ్ = రాముని. పశ్యన్తీ = చూచుచున్నదై. పురీంప్రతి = మిథిల నుద్దేశించి). అంబ = అమ్మా! మిథిలే = ఓ. మిథిలానగరమా! వంద్యసే = నమస్కరింపబడుచున్నావు. గురుజనే అపి = నా గురుజనులపట్లను, మే = నాయొక్క. వందనమ్ = నమస్కారమును. విజ్ఞాపయిష్యసి = దయచేసి విన్నవింతువుగాక!

వయస్యావితి :- (సుగ్రీవ విభీషణుల నుద్దేశించి) వయస్యౌ = మిత్రులారా! ఇయమ్ = ఈ. సా = ప్రసిద్ధమైన, మిథిలా = మిథిలానగరి. జానకీమ్ = సీతను. ప్రజాయమానాయాః = ప్రసవించుచున్న. భగవత్యాః = భగవతియగు. భూమేః = భూదేవికి. అరిష్టమందిరమ్ = ప్రసవమందిరము — (అరిష్టం సూతికాగృహమ్ - అమరః) పురిటి గది.

యత్రేతి :- (సకౌతుకస్మితమ్ = కౌతుకముతో చిరునవ్వుతో) భగవతః = భగవంతుడైన, పార్వతీజీవితేశ్వరస్య = శివునియొక్క. ధనుః + ధనురంతేవాసినౌ =

హిమాలయోత్సంగ సదాధివాసతో
జాతేవ పాండుః ప్రతిభాతి జాహ్నవీ ।
నిదాఘభానోః పితురంకలాలనాత్
కృతేవ కాళీ యమునా చ దృశ్యతే ॥ 125

(విభావ్య చ)

బలిద్విషః పాదనఖాంశురాజిభిః
స్మరారిమౌళీందు మరీచి వీచిభిః ।
హిమాద్రి నిఃష్యందరసైః పదే పదే
వివర్ధతే వైబుధసైంధవీ రుచిః ॥ 126

---

రన్నట్లు. సంగచ్ఛేతే = ఒకదానితో ఒకటి కలియుచున్నవి. నల్లని యమునానది గంగకు కృష్ణాగురులేపమును పులుముచున్నట్లుండగా, తెల్లని గంగ యమునకు గంధపు పూత పెట్టుచున్నట్లున్నదనుట.

హిమాలయేతి :- హిమాలయ = హిమవంతునియొక్క. ఉత్సంగ = ఒడిలో, సదా = ఎల్లప్పుడు, అధివాసతః = నివసించుటవలన, జాహ్నవీ=గంగానది. పాండుః జాతా ఇవ = తెల్లగానైనట్లు, ప్రతిభాతి = భాసించుచున్నది. యమునా = యమునానది. పితుః = తండ్రియైన. నిదాఘభానోః = గ్రీష్మసూర్యుని యొక్క. అంకలాలనాత్ = ఒడియందలి లాలనమువలన, కాళీ కృతా ఇవ = నల్లగానైనట్లు. దృశ్యతే = కన్పించుచున్నది.

తాత్పర్యము :- హిమాలయోత్సంగ లాలనమున గంగ తెల్లగాను, గ్రీష్మసూర్యోత్సంగ లాలనమున యమున నల్లగాను అయినట్లున్నవి.

బలీతి :- (విభావ్య చ = ఆలోచించి) బలిద్విషః=(వామన) విష్ణుమూర్తి యొక్క. పాదనఖాంశురాజిభిః = కాలిగోటికాంతి సమూహములచేతను, స్మరారి = శివునియొక్క. మౌళీందు = చూడాచంద్రునియొక్క. మరీచి వీచిభిః = కిరణ తరంగములచేతను. హిమాద్రి=హిమవంతునియొక్క. నిఃష్యందరసైః = ప్రస్రుతజలముల తోను. పదేపదే = ఇట్లు ప్రతిస్థానమునందును, వైబుధసైంధవీ = గంగానదికి సంబంధించిన [విబుధ సింధు = దేవతలనది]. రుచిః = కాంతి. వివర్ధతే = అభివృద్ధి చెందుచున్నది.

అపిచ —

ప్రయాగః సర్వతీర్థేభ్యస్తీర్థముచ్చైస్తరామయమ్ ।
సంసారాబ్ధేః పరం పారమిహస్థైరవలోక్యతే ॥ 127

---

తాత్పర్యము :- గంగానది మొట్టమొదట విష్ణుపాదనఖ కాంతులతో తెలుపెక్కినది. రెండవ మెట్టులో శివుని జటా చంద్రుని వెలుగులతో మరింత తెలుపెక్కినది. మూడవ మెట్టులో హిమవంతుని మంచునీటితో మూడింతలు తెలుపెక్కినది. ఇట్లు గంగమ్మ ప్రతిష్ఠానమునందును కాంతిపెంచుకొనినది.

క్రియ :- వృధుఙ్ వృద్ధౌ, ఆత్మనే. లట్. ప్రథమ
వర్ధతే — వర్ధేతే — వర్ధన్తే.

ప్రయాగ ఇతి :- అపిచ = మరియు. అయమ్ = ఈ. ప్రయాగః = ప్రయాగ. సర్వతీర్థేభ్యః = అన్ని తీర్థములకంటె. ఉచ్చైస్తరామ్ = మిక్కిలి ఉత్తమమైన. తీర్థమ్ = తీర్థము. ఇహస్థైః = ఇచ్చట నున్నవారిచే. సంసారాబ్ధేః = సంసార సముద్రముయొక్క. పరమ్ పారమ్ = అవలి ఒడ్డు. అవలోక్యతే = చూడబడుచున్నది.

తాత్పర్యము :- సర్వతీర్థములందును ఉత్తమోత్తమము ఈ ప్రయాగ తీర్థము. ఇచటివారు సంసారసాగరముయొక్క అవలి తీరమును చూడగలరు. (పథ్యావక్త్రము).

సమాసములు :- సర్వాణి చ తాని తీర్థాని చ — తేభ్యః, సంసార మేవ అబ్ధిః - తస్య.

సంధులు :- తీర్థేభ్యః + తీర్థమ్ - సాదేశవిసర్గ, ఇహస్థైః + అవలోక్యతే - రేఫాదేశవిసర్గ సంసార + అబ్ధేః - సవర్ణదీర్ఘ.

క్రియ :- లోకృఙ్ దర్శనే [కర్మణి] ఆత్మనే. లట్. ప్రథమ [అవ]
లోక్యతే - లోక్యేతే - లోక్యన్తే.

రామః :- (సాదరమ్) కిముచ్యతే.

సత్యమేవ ప్రయాగోఽయం మోక్షద్వారముదీర్యతే।
దేవ్యౌ యస్యాభితో గంగాయమునే వహతః శ్రియమ్॥ 128

(సీతాంప్రతి) దేవి, ప్రణమ్యతామితః —

శ్యామో నామ వటః సోఽయమేతస్యాద్భుతకర్మణః।

---

సత్యమితి :- (సాదరమ్ = ఆదరముతో) కిముచ్యతే=ఏమిచెప్పబడును. ఇక చెప్పవలసినదేమున్నదనుట. అయమ్ = ఈ. ప్రయాగః = ప్రయాగ. సత్యమేవ= నిజముగనే. మోక్షద్వారమ్ = మోక్షద్వారముగ. ఉదీర్యతే= చెప్పబడుచున్నది. యస్య= ఏ ప్రయాగకు, అభితః = ఇరుపైపుల, దేవ్యౌ = దేవతలైన. గంగాయమునే = గంగాయమునలు, శ్రియమ్ = శోభను - మోక్షలక్ష్మిశోభననుట, వహతః = వహించు చున్నవో ఆ యీ ప్రయాగ మోక్షద్వారమనుట సత్యమని అన్వయము. (పథ్యావక్త్రము)

తాత్పర్యము :- గంగాయమునలు ఇరుపైపుల శోభను కూర్చుచుండగా ఈ ప్రయాగ నిజముగా మోక్షద్వారమే.

సంధులు :- ప్రయాగః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ-ప్రయాగో + అయమ్ - పూర్వరూప. యస్య + అభితః - సవర్ణదీర్ఘ. అభితః + గంగా - ఉత్వా దేశవిసర్గ.

క్రియ :- వహఞ్ ప్రాపణే, లట్. పరస్మై. ప్రథమ
వహతి - వహతః - వహన్తి
ఈర క్షేపే గతౌ చ, (కర్మణి) ఆత్మనే. లట్. ప్రథమ
ఈర్యతే - ఈర్యేతే - ఈర్యన్తే

శ్యామ ఇతి :- [సీతాంప్రతి = సీతనుద్దేశించి] దేవి = జానకీ। ఇతః= ఇటు, ప్రణమ్యతామ్ = నమస్కరింపబడుగాక। - ఇటువైపు నమస్కరించుమనుట. శ్యామః నామ = శ్యామము అను పేరుగల. వటః = వటవృక్షము. సః అయమ్ = ఇదే. అద్భుత కర్మణః = ఆశ్చర్యకరమగు, ఏతస్య = దీనియొక్క, ఛాయామ్ = నీడను. అధివాస్తవ్యైః అపి = అధివసించినవారిచే, పరంజ్యోతిః = బ్రహ్మ, నిషే వ్యతే = పొందబడుచున్నది.

ఛాయామప్యధివాస్తవ్యాః పరం జ్యోతిర్నిషేవ్యతే ॥ 129

(సర్వే ప్రణమన్తి)

రామః :- (విమానవేగనాటితకేన సహర్షమ్)

యూపాంకురప్రకరదంతురతీరలేఖా

సంఖ్యాయమానమనుసంతతిసత్రతంతుః ।

---

తాత్పర్యము :- ఇది శ్యామనామక వటవృక్షము. దీని నీడను చేరినవారి. పరంజ్యోతి దర్శించును. బ్రహ్మసాక్షాత్కార మగుననుట.

సంధులు :- శ్యామః + నామ - ఉత్వాదేశవిసర్గ. సః + అయమ్-ఉత్వాదేశవిసర్గ — సో + అయమ్ - పూర్వరూప. ఏతస్య + అద్భుత-సవర్ణదీర్ఘ. అపి + అధి - యణాదేశ. జ్యోతిః + నిషేవ్యతే - రేఫాదేశవిసర్గ.

క్రియ :- షేవృఙ్ సేవనే [కర్మణి] ఆత్మనే. లట్. ప్రథమ [ని]
సేవ్యతే - సేవ్యేతే - సేవ్యన్తే

[సర్వే = అందరును. ప్రణమన్తి = నమస్కరింతురు]

యూపేతి :- [విమానవేగనాటితకేన = విమానవేగమును నటించుటతో. సహర్షమ్ = ఆనందముగా]. యూప = యజ్ఞ [యూప] స్తంభములనునట్టి. అంకుర ప్రకర = ప్రరోహసమూహముతో. దంతుర = ఎత్తుపల్లములుగల, తీరలేఖా = తీర ప్రాంతములతో, సంఖ్యాయమాన = పరిగణింపబడుచున్న. మనుసంతతి = మనువంశ రాజులయొక్క, సత్రతంతుః = యజ్ఞములు కలదియు, భువః దేవ్యాః = భూదేవికి. ఇక్ష్వాకు = ఇక్ష్వాకు వంశము నందలి, రాజమహిషీపద = పట్టమహిషీపదమునకైన. పట్టలక్ష్మీః = పట్టపత్రపు శోభయును: భూదేవికిది పట్టమహిషులు ధరించు పట్ట పత్రమువలె భాసించుచున్నదనుట. నః = మనయొక్క. భగవతీ = దేవత. సరయూః = సరయూనది. ఇయమ్ = ఇదే. [వసంతతిలక]

తాత్పర్యము :- సీతా! ఇదిగో మన సరయూనది. దీని గట్టులపైనున్న అసంఖ్యాక యూపస్తంభములు మనుసంతతి చేసిన యాగముల లెక్కకన్నట్లున్నవి. ఈ నది భూదేవికి ఇక్ష్వాకురాజమహిషుల పట్టశోభను కల్గించుచున్నది.

ఇక్ష్వాకురాజమహిషీపదపట్టలక్ష్మీ
ర్దేవ్యా భువో భగవతీ సరయూరియం నః ॥ 130

ఇయం చ భగవత్యయోధ్యా.

గగనగతాస్మదుదీక్షణకుతూహలోత్తానపృథులనిఃష్యన్దైః ।
ఉన్నాళస్థలకువలయవనమివ జనలోచనైః క్రియతే ॥ 131

---

సమాసములు : యూపానాం అంకురాః — అంకురాణాం ప్రకరాః — ప్రకరైః దంతురా చ సా లేఖా చ - లేఖాభిః సంఖ్యాయమానాః - మనోస్సంతతిః - మనుసంతతేః స ప్తతంతవః „ సంఖ్యాయమానాః మనుసంతతిస ప్తతంతవః యయా సా ఇక్ష్వాకూణాం రాజమహిషీ - మహిష్యాః పదమ్ - పదస్య పట్టమ్ — పట్టస్య లక్ష్మీః.

సంధులు :- యూప + అంకుర - సవర్ణదీర్ఘ, లక్ష్మీః + దేవ్యా - రేఫాదేశవిసర్గ. దేవ్యాః + భువః - విసర్గలోప. భువః + భగవతీ - ఉత్వాదేశవిసర్గ, సరయూః + ఇయమ్ = రేఫాదేశవిసర్గ.

గగనేతి :- ఇయంచ = ఇది. భగవతీ అయోధ్యా = పూజ్యురాలగు అయోధ్య. గగనగత = ఆకాశమునందున్న, అస్మత్ = మనలను. ఉదీక్షణ = చూచుట యందలి. కుతూహల = ఉత్సాహముతో. ఉత్తాన = విప్పారి. పృథుల = విశాలములై నిష్యన్దైః = రెప్పపాటు లేక నిశ్చలములైన. జనలోచనైః = ప్రజల నేత్రములతో. ఉన్నాళ=కాడలులేనట్టి. స్థలకువలయవనమ్ ఇవ=మెట్టతామరల వనమువలె. క్రియతే = చేయబడుచున్నది. (ఆర్య)

తాత్పర్యము :— ఆకాశమునుండి దిగుచున్న మనలను చూచుటకై విప్పారి రెప్పవాలని ఈ ప్రజల నేత్రములతో అయోధ్య చూడుము పద్మవనమువలెనున్నది. కాగా ఈ పద్మములకు కాడలు లేవు.

సమాసములు :- గగనం గతానామస్మాకముదీక్షణమ్ — ఉదీక్షణే కుతూహలః — కుతూహలేన ఉత్తానాని చ తాని పృథులాని చ తాని నిష్యందాని చ — తైః లోచనైః. ఉన్నాళాని చ తాని స్థలకువలయాని చ — కువలయానాం వనమ్. జనానాం లోచనాని — తైః

(సర్వే నమస్యన్తి)

సుగ్రీవ విభీషణౌ :- (సహర్షమ్)

వృన్తైరివ క్రతుసహస్రభువాం ఫలానా
మాలోక్య యూపనికరైర్మధురామయోధ్యామ్ ।
రాజ్ఞామిహ ప్రవసతాం చ విచిన్త్య సిద్ధిం
దేవః శచీసహచరోఽపి న రోచతే నః ॥ 132

---

క్రియతే :- డుకృఞ్ కరణే, ఆత్మనే. లట్. ప్రథమ
క్రియతే - క్రియేతే - క్రియన్తే

(సర్వే = అందరును. నమస్యన్తి = నమస్కరింతురు)

వృన్తైరితి :- (నిర్వర్ణ్య = చూచి) క్రతుసహస్రభువామ్ = వేలకొలది యజ్ఞములవలన లభించిన. ఫలానామ్ = ఫలములయొక్క. వృన్తైః ఇవ = తొడిమల (వ) వలెనున్న. యూపనికరైః = యజ్ఞస్తంభములతో. మధురామ్ = మనోహరముగా నున్న. అయోధ్యామ్ = అయోధ్యను. ఆలోక్య = చూచి. ఇహ = ఈ పట్టణమున. ప్రవసతామ్ = నివసించువారగు. రాజ్ఞామ్ = ఇక్ష్వాకు రాజులయొక్క. సిద్ధిమ్ = యజ్ఞఫల సిద్ధిని. విచిన్త్య చ = ఊహించియు. నః = మాకు. దేవః = మహానుభావుడగు. శచీ సహచరః అపి = ఇంద్రుడుకూడ. న రోచతే = నచ్చుటలేదు. (వసంతతిలక)

తాత్పర్యము :- యజ్ఞఫలములను కోసికొనగా మిగిలిన తొడిమలవలె అయోధ్య పరిసరములందు యూపస్తంభములు వేలసంఖ్యలో కన్పించుచున్నవి. ఇవి చూచినపిదప, ఈ నగరమునేలు రాజుల సిద్ధిని ఊహించినపిదప మాకు ఇక ఇంద్రుడును నచ్చుటలేదు. (వసిష్ఠ ప్రవేశసూచనకు ఇది భూమిక).

సమాసములు :- క్రతూనాం సహస్రమ్ - క్రతుసహస్రాత్ భవన్తి - తేషామ్. యూపానాం నికరాః - తైః. శచ్యాః సహచరః.

సంధులు :- వృన్తైః + ఇవ, నికరైః + మధురామ్ - రేఫాదేశవిసర్గ. సహచరః + అపి - ఉత్వాదేశవిసర్గ - సహచరో + అపి - పూర్వరూప.

రామః :- (తౌ ప్రతి) వయస్యౌ!

ఈదృశాః ప్రాగజాయన్త రాజానో యదిహాన్వయే ।
తద్వసిష్ఠచరోరైన్ద్రాబార్హస్పత్యస్య వైభవమ్ ॥ 133

(పురోఽవలోక్య సహర్షోల్లాసమ్) కథం స ఏవాయం భగవాన్ ప్రకల్పితా

---

క్రియ :- రుచ దీప్తావభిప్రీతౌ చ — ఆత్మనే. లట్. ప్రథమ
రోచతే — రోచేతే — రోచన్తే

ఈదృశా ఇతి :- (తౌ ప్రతి = ఆ ఇరువురినుద్దేశించి) వయస్యౌ=మిత్రులారా! ఇహ = ఈ. అన్వయే = ఇక్ష్వాకువంశమునందు. ఈదృశాః=మీరింతవరకుముందు వర్ణించినంతటి మహానుభావులు. ప్రాక్ అజాయన్త ఇతియత్ = పూర్వము జన్మించి రన్నది. ఐన్ద్రాబార్హస్పత్యస్య = ఇంద్రుడును బృహస్పతియు దేవతలుగా గల యజ్ఞమునకు సంబంధించిన. వసిష్ఠచరోః = వసిష్ఠకృతమగు హవ్యపాకముయొక్క. వైభవమ్ = ప్రభావము. (హవ్యపాకే చరుః పుమాన్ — అమరః) పథ్యావక్త్రము.

తాత్పర్యము :- ఈ వంశమునందు అంతటి మహానుభావులు జన్మించిరనగా అది కేవలము వసిష్ఠులవారు చేసిన యజ్ఞముల ఫలమే.

సమాసములు :- వసిష్ఠస్య చరుః - తస్య. ఇంద్రశ్చ బృహస్పతిశ్చ - దేవతా ద్వంద్వే చ అనఙ్ — ఇంద్రాబృహస్పతీ దేవతే యస్య యజ్ఞస్య - ఐన్ద్రాబార్హస్పత్యమ్ - తస్య - దేవతాద్వంద్వేచేతి ఉభయపదవృద్ధిః.

క్రియ :- జనీఙ్ ప్రాదుర్భావే. ఆత్మనే. లఙ్. ప్రథమ
అజాయత - అజాయేతామ్ — అజాయన్త.

కథమితి :- [పురః అవలోక్య = ముందునకు చూచి, సహర్షోల్లాసమ్= ఆనందోత్సాహములతో] కథమ్ = ఎట్లూ. సః ఏవ = అతడే-అడే. అయమ్ = ఈ. భగవాన్ = మహానుభావుడు, వసిష్ఠః = వసిష్ఠుడు. ప్రకల్పిత = సన్నద్ధముగాచేయు

స్మదభిషేకసంభారో భరతశత్రుఘ్నాభ్యాం సహ వసిష్ఠో మాం ప్రతీక్షమాణ స్తిష్ఠతి. (పుష్పకంప్రతి) విమానరాజ. సమవతీర్యతామస్యాం కకుత్స్థ కులోపకారికాయామ్.

(సర్వే విమానావతరణం నాటయన్తి)

(తతః ప్రవిశతి వసిష్ఠో భరతశత్రుఘ్నౌ చ)

వసిష్ఠః :- చక్రే లంకేశ్వర పరిభవచ్ఛేద నిష్ణాతదోష్ణా

యద్వత్సేన త్రిజగదభయం తన్న చిత్రీయతే నః ।

---

బడిన. అస్మత్ = నాకొఱకైన. అభిషేకసంభారః=అభిషేకద్రవ్యములు కలవాడును. భరత శత్రుఘ్నాభ్యామ్ సహ=భరతశత్రుఘ్నులతో కలిసి. మామ్ = నన్ను. ప్రతీక్ష మాణః = ఎదురుచూచుచున్నవాడునునై. తిష్ఠతి = ఉన్నాడు. [పుష్పకంప్రతి = పుష్ప కము నుద్దేశించి] విమానరాజా ! అస్యామ్ = ఈ కన్పించుచున్న. కకుత్స్థకుల + ఉప కారికాయామ్ = కకుత్స్థరాజుల నివాసస్థలమునందు [రాజసదనముపకారికోపకార్యా - అమరః]. సమవతీర్యతామ్ = దిగుటయగుగాక ; దిగుమనుట. [సర్వే = అందరును, విమానావతరణమ్ = విమానము క్రిందికి దిగుటను. నాటయన్తి = అభినయింతురు.]

(తతః = అంతట. భరతశత్రుఘ్నౌ = భరతుడును శత్రుఘ్నుడును. వసిష్ఠశ్చ= వసిష్ఠుడును. పటాక్షేపేణ = పటాక్షేపముతో. ప్రవిశతి[న్తి]=ప్రవేశిం[తురు]చును.)

చక్రే ఇతి :- లంకేశ్వర = రావణాసురుని యొక్క. పరిభవ = ఓడిం చుట, ఛేద = ఖండించుటలయందు, నిష్ణాత = చతురములైన, దోష్ణా = బాహువులు కలవాడగు. వత్సేన = రామునిచే. త్రిజగత్ + అభయమ్ = ముల్లోకములకు అభ యము. యత్ చక్రే = ఏది చేయబడినదో, తత్ = అది. నః = మమ్ము, న చిత్రీ యతే = ఆశ్చర్యపరచుటలేదు, రాముడు రావణుని వధించుట గొప్ప ఘనకార్యము కాదనుట. బాలేన = ఈ బాలరామునిచేత, ఆజౌ = యుద్ధమునందు, జామదగ్న్యః = జమదగ్ని సంతతియగు, సః = ఆ ప్రసిద్ధుడగు, మునిః = ముని - పరశురాముడు. విగళితవతః = గట్టిగా పిండివేయబడిన, వీర్యనిర్యాసరాశేః = సారసమూహముగల

బాలేనాఽఽ త్తౌ విగళితపతో వీర్యనిర్యాసరాశే
ర్యత్పిణ్యాకః స మునిరమునా నిర్మితో జామదగ్న్యః ॥ 134

(రామమవలోక్య సహర్షమ్)

భల్లావలూన దశకంధర కంఠపీఠ
సీమాసమాప్తభుజవిక్రమకర్మకాండః ।

---

వస్తువుయొక్క, పిణ్యాకః = పిప్పిగా-నూనె ఒడిసిన తెలకపిండిగా, యత్ నిర్మితః = చేయబడుట ఏదికలదో, తత్ = అదిమాత్రమే, నః = మమ్ము. చిత్రీయతే = ఆశ్చర్య పరచుచున్నది. [మందాక్రాంత]

తాత్పర్యము :- రాముడు రావణుని సంహరించుటలో ఆశ్చర్యము లేదు, పరశురాము డంతటివానిని ఈ బాలుడు పిండి పిప్పి చేయుటయే ఆశ్చర్యము.

సంధులు :- లంకా + ఈశ్వర-గుణసంధి, పరిభవ + ఛేది - తుగాగమ తత్ + న - అనునాసికాదేశ, బాలేన + ఆత్తౌ - సవర్ణదీర్ఘ, విగళితపతః + వీర్య - ఉత్వాదేశవిసర్గ, రాశేః + యత్ - మునిః + అమునా, రేఫాదేశవిసర్గ. సః + ముని - తదేతద్విసర్గలోప, నిర్మితః + జామదగ్న్యః - ఉత్వాదేశవిసర్గ.

క్రియ :- డుకృఞ్ కరణే, ఆత్మనే, లిట్, ప్రథమ
చక్రే - చక్రాతే - చక్రిరే.
చిత్ర - నమోవరివశ్చిత్రఙః క్యచ్ - ఆత్మనే, లట్, ప్రథమ
చిత్రీయతే - చిత్రీయేతే - చిత్రీయన్తే.

భల్లేతి :- (రామమ్ అవలోక్య = రాముని చూచి, సహర్షమ్ = ఆనందముగా) భల్ల = భల్లమను ఆయుధముతో [బాణముతో], అవలూన = ఖండింపబడిన- దశకంధరకంఠపీఠ - దశకంధర = రావణునియొక్క, కంఠపీఠ = కంఠప్రదేశమను నట్టి, సీమా = అవధియందు, సమాప్త = ముగింపబడిన, భుజవిక్రమ కర్మకాండః - భుజవిక్రమ = బాహుపరాక్రమముచేనైన, కర్మకాండః = కార్యసమూహము కలవాడగు - ఇక జయింపవలసిన శత్రువు లేకపోవుటతో పరాక్రమ సాధ్యములగు కార్యములు ముగిసినవనుట. రామచంద్రః = రామచంద్రుడు, సః అయమ్ = ఇతడే, దిష్ట్యా =

దిష్ట్యా జగద్విజయ మాంగళికై ర్యశోభి ః
సోఽయం పునర్నయనవర్త్మని రామచంద్రః ॥ 135

రామః - (ససంభ్రమముపసృత్య వసిష్ఠపాదావుపగృహ్య చ)
రఘుబ్రహ్మక్రియాచార్యం పురాణబ్రహ్మవాదినమ్ ।
బ్రహ్మర్షిం బ్రహ్మజన్మాన మేష రామోఽభివాదయే ॥ 136

---

అదృష్టవిశేషముచే - ఆనందము వల్లననికాని - [దిష్ట్యా సముపజోషం చేత్యానందే - అమరః]. జగద్విజయమాంగళికైః — జగద్విజయ = విశ్వవిజయమునందు, మాంగళికైః = శుభప్రదములైన. యశోభిః = యశస్సులతో, పునః=మరల [ఇంతకాలము నకు] నయనవర్త్మని = వీక్షాపథమునందు, వర్తతే = భాసించుచున్నాడు — ఇంత కాలమునకు మరల కన్పించినాడనుట. [వసంతతిలకము]

తాత్పర్యము :- దశకంఠ సంహారముతో బాహుపరాక్రమకథకు స్వస్తి పల్కి, జగద్విజయకారణములైన యశస్సులు కలిగి నా రామచంద్రుడు అదృష్టవశ మున మరల కన్పించినాడు.

రఘ్విత్తి :- [ససంభ్రమముగా సమీపించి, వసిష్ఠపాదౌ ఉపగృహ్య చ= వసిష్ఠుని పాదములను నమస్కరించి] రఘు = రఘువంశజుల యొక్క, బ్రహ్మ క్రియా = వేదాధ్యయనమునకు, ఆచార్యమ్ = గురువైన వానిని, పురాణ=వృద్ధుడైన, బ్రహ్మవాదినమ్ = వేదాధ్యాపకుడును, బ్రహ్మర్షిమ్ = బ్రహ్మర్షియును, బ్రహ్మజన్మా నమ్ = బ్రహ్మనుండి జన్మకలవాడును - వసిష్ఠుడు బ్రహ్మపుత్రుడు — అయిన వసిష్ఠ మహర్షిని, ఏషః = ఇతడే, రామః (అహమ్) = రాముడను, అభివాదయే = నమస్క రించుచున్నాను. (వేదస్తత్త్వం తపోబ్రహ్మ బ్రహ్మా విప్రః ప్రజాపతిః — అమరః) పథ్యావక్త్రము ఛందస్సు.

తాత్పర్యము :- ఇక్ష్వాకులకు వేదగురువు, వయోవృద్ధుడైన వేదపండి తుడు, బ్రహ్మర్షి, బ్రహ్మసుతుడైన వసిష్ఠునికి ఈ రాముడిదే నమస్కరించుచున్నాడు.

సమాసములు :- రఘూణాం బ్రహ్మక్రియా - క్రియాయాః ఆచార్యః- తమ్. పురాణశ్చాసౌ — బ్రహ్మవాదీ చ - తమ్, బ్రహ్మ చాసౌ ఋషిశ్చ — తమ్- బ్రహ్మణః జన్మ యస్య — తమ్.

వసిష్ఠః - (సాదరమాలింగ్య) వత్స రామభద్ర, కా తుభ్యమాశీః ।

ఆదాయప్రతిపక్షకీర్తినివహాన్ బ్రహ్మాండమూషాంతరే
నిర్విఘ్నం ధమతా నితాంతముదితైః స్వైరేవ తేజోఽగ్నిభిః ।
తత్తాదృక్పుటపాకశోధితమివ ప్రాప్తం గుణోత్కర్షిణా
పిండస్థం చ మహత్తరం చ భవతా నిఃసారతారం యశః ॥ 137

---

సంధులు :- క్రియా + ఆచార్యమ్ - సవర్ణదీర్ఘ. బ్రహ్మ + ఋషిమ్ - గుణ. ఏషః + రామః - తదేతద్విసర్గలోప. రామః + అభి - ఉత్వాదేశవిసర్గ - రామో + అభి - పూర్వరూప.

క్రియ :- వదణ్ సందేశవచనే (ణిచ్) ఆత్మనే. లట్. ఉత్తమ [అభి]
అభివాదయే - అభివాదయావహే - అభివాదయామహే.

ఆదాయేతి :- (సాదరమ్ = ఆదరముతో. ఆలింగ్య = కౌగిలించి) వత్స = నాయనా! రామభద్రా! తుభ్యమ్ = నీకై, కా ఆశీః = ఏ ఆశీస్సు ఇవ్వగలను. ప్రతిపక్ష = శత్రువులయొక్క. కీర్తినివహాన్ = యశస్సమూహములను, బ్రహ్మాండ = బ్రహ్మాండమనునట్టి, మూషాన్తరే = మూసలోనికి (తైజసావర్తనీ మూషా - అమర:) ఆదాయ = తెచ్చి. నితాంతమ్ = మిక్కిలి. ఉదితైః = ప్రజ్వరిల్లిన. స్వైః ఏవ = స్వీయములే అయిన. తేజోఽగ్నిభిః = ప్రతాపాగ్నులతో, నిర్విఘ్నమ్ = విఘ్నరహితముగా - నిరాటంకముగా, ధమతా = ఊదుచున్న లేక కరిగించుచున్న, గుణోత్కర్షిణా = గుణవిస్తారకుడవైన, భవతా = నీచేత, తత్తాదృక్ = అటువంటి, పుటపాకశోధితమ్ ఇవ = పుటపాకమువలన శుద్ధి గావింపబడిన లోహాది ద్రవ్యమువలె, పిండస్థమ్ = ముద్దయైనదియు - సాంద్రముగా ఘనీభవించినదనుట, మహత్తరమ్ = విలువైనదియు, నిఃసారతారమ్ = నిర్దుష్టము నుత్కృష్టమునైనదియు, యశః = యశస్సు-ప్రతిష్ఠ, ప్రాప్తమ్ = పొందబడినది - మరింక ఏమి ఆశీర్వదింతుననుట. శార్దూలము.

తాత్పర్యము :- రామా! శత్రువుల కీర్తులను పట్టితెచ్చి బ్రహ్మాండమను మూసలో పోసి స్వప్రతాపాగ్నులతో కరిగించి పుటపాకముతో శుద్ధి చేసి నిర్దుష్టము ఉత్కృష్టము మహత్తరమునైన యశస్సును ముద్దగా సంపాదించితివి.

అపిచ —

త్రిజగదంగణలంఘనే జాంఘికైస్తవ యశోభిరతీవ పవిత్రితాః ।
ప్రథమపార్థివపుంగవకీర్తయో విబుధసింధుజలైరివ సింధవః ॥ 138

తథాపీదమస్తు,

జగదాలోకధౌరేయౌ సూర్యాచంద్రమసావివ ।

---

త్రిజగదితి :- అపిచ = మరియు, త్రిజగత్ అంగణ = త్రిలోక ప్రాంగణములను, లంఘనే = అతిక్రమించుటయందు, జాంఘికైః = పిక్కబలము కలవియైన - సమర్థములైన అనుట. తవ = నీయొక్క, యశోభిః = యశస్సులచేత. ప్రథమపార్థివపుంగవకీర్తయః — ప్రథమ = పూర్వులగు, పార్థివపుంగవ = రాజశ్రేష్ఠులయొక్క. కీర్తయః = కీర్తులు. విబుధసింధుజలైః=గంగాజలములతో, సింధవః ఇవ = సముద్రములవలె (దేశే నదవిశేషేఽబ్ధౌ సింధుర్నా సరితి స్త్రియామ్ — అమరః), అతీవ = మిక్కిలి. పవిత్రితాః = పావనము గావింపబడినవి. (ద్రుతవిలంబితము).

తాత్పర్యము :- ఓ రామా ! నీ యశస్సులను గంగాజలములచే పురాతన రాజవర్యుల కీర్తి సముద్రములు పావనములైనవి.

సమాసములు :- త్రయాణాం జగతాం సమాహారః - త్రిజగదేవ అంగనమ్ - అంగనస్య లంఘనమ్ - లంఘనే జాంఘికాః - తైః. ప్రథమే చ తే పార్థివాశ్చ — పార్థివపుంగవానాం కీర్తయః, విబుధానాం సింధుః — సింధోః జలాని-తైః.

సంధులు :- జాంఘికైః + తవ — సాదేశవిసర్గ. యశోభిః + అతీవ. జలైః + ఇవ - రేఫాదేశవిసర్గ. కీర్తయః + విబుధ - ఉత్వాదేశవిసర్గ.

జగదితి :- తథాపి = అయినను, ఇదమ్ = ఇది, అస్తు = అగుగాక । సూర్యాచంద్రమసౌ ఇవ = సూర్యచంద్రులవలె జగత్ = ప్రపంచమునకు, ఆలోక = వెలుగునిచ్చుటయందు, ధౌరేయౌ = సమర్థులును, స్వభుజౌ ఇవ = నీ బాహువులవలె, గోత్రస్య = వంశమునకు, గోప్తారౌ = సంరక్షకులునగు, పుత్రౌ = ఇరువురు పుత్రులను, జనయ = పొందుము. ఉత్పాదింపుమనుట. (పథ్యావక్త్రము)

పుత్రౌ గోత్రస్య గోప్తారౌ జనయ స్వభుజావివ ॥ 139

(సీతా మునిం వందతే)

వసిష్ఠ :- వత్సే. జనకవంశ సువాసిని. యువయోః సాధారణీమేవ రామస్య వయమాశిషమవోచామ.

సీతా :- (సహర్షమాత్మగతమ్) అమ్మో. నిస్సాపత్న్యం మే ఆర్యపుత్రస్య గృహిణీత్వం భవిష్యతి. (అమ్మో. ణిస్సావత్తం మే అజ్జఉత్తస్స ఘరణిత్తణం హువిస్సది)

---

తాత్పర్యము :- రామా! సూర్యచంద్రులవలె ప్రపంచమునకు వెలుగులు పంచువారును, నీ భుజములవలె వంశరక్షకులునైన ఇరువురు పుత్రులను పొందుము. (ధూర్వహే ధుర్యధౌరేయధురీణాః సధురంధరాః - అమ:).

సమాసములు :- జగతామాలోకః - ఆలోకే భావేఘఞ్. సూర్యశ్చ చంద్రమాశ్చ - దేవతాద్వంద్వే చేత్యానఙ్.

సంధులు :- చంద్రమసౌ + ఇవ. భుజౌ + ఇవ - అయవాదేశసంధి.

క్రియ :- జనీ ప్రాదుర్భావే (ణిచ్) లోట్. పరస్మై. మధ్యమ.
జనయ / జనయతాత్ - జనయతమ్ - జనయత

(సీతా = సీతాదేవి, మునిమ్ = వసిష్ఠుని, వందతే = మ్రొక్కును)

వత్సే ఇతి :- వత్సే=తనయా! జనకవంశ సువాసిని=జనకవంశమునందు జన్మించిన ముత్తైదువా! (చిరంటీ తు సువాసినీ - అమరః). యువయోః = మీ దంపతులకిరువురికిని. సాధారణీమ్ = సమానముగా వర్తించునదైన. ఆశిషమ్ ఏవ = ఆశీస్సునే. వయమ్ = మేము. రామస్య = రామునికి. అవోచామ = పలికితిమి.

అమ్మో ఇతి :- (సహర్షమ్ = ఆనందముతో, ఆత్మగతమ్ = తనలో) అమ్మో = హమ్మయ్యా! ఆర్యపుత్రస్య = రామునికి చెందిన, మే = నాయొక్క, గృహిణీత్వమ్ = భార్యాత్వము - నా రామపత్నీత్వము; నిస్సాపత్న్యమ్ = సపత్నీ త్వము లేనిది, భవిష్యతి = అగుచున్నది. (రామునికి పుత్రులు కలుగుట నా వలననే అనుట దృఢపడి సీత సంబరము).

లక్ష్మణః :- సగరగోత్రగురో ! మైత్రావరుణే, సౌమిత్రిరభివాదయతే.

వసిష్ఠః :- వత్స లక్ష్మణ, ఆశిషాం విషయమతిక్రమ్య వర్తసే.

వీరమింద్రజితం జిత్వా దిష్ట్యా వర్ధయతే జగత్ ।
అభయే దక్షిణీయస్తే గీర్వాణగ్రామణీరపి 140

తథాపి యూయం సర్వేఽపి ద్వౌ ద్వౌ జనయతాత్మజౌ ।

---

సగరేతి :- సగరగోత్రగురో! = సగర వంశ్యులకు కులగురువా! మైత్రావరుణే = వసిష్ఠా! సౌమిత్రిః = సుమిత్రానందనుడు. అభివాదయతే = ఇదే నమస్కరించుచున్నాడు.

వీరమితి :- వత్స = నాయనా! లక్ష్మణా! ఆశిషామ్ విషయమ్ = ఆశీస్సుల స్థానమును, అతిక్రమ్య = దాటి, వర్తసే = విరాజిల్లుచున్నావు - నిజమునకు నీకు ఇంకిక ఆశీస్సులు అవసరము లేదనుట. వీరమ్=మహావీరుడగు, ఇంద్రజితమ్=ఇంద్రజిత్తును, జిత్వా = జయించి, దిష్ట్యా = భాగ్యవశమున, జగత్ = ప్రపంచమును, వర్ధయతే = వృద్ధిపొందింపఁజేసిన, తే = నీకు, గీర్వాణగ్రామణీః అపి = దేవనాయకుడగు ఇంద్రుడుకూడ, అభయే = అభయవిషయమున, దక్షిణీయః = దక్షిణార్హుడు. (పథ్యావక్త్రము) (దక్షిణీయో దక్షిణార్హ స్తత్ర దక్షిణ్య ఇత్యపి - అమరః)

తాత్పర్యము :- లక్ష్మణా! ఇంద్రజిత్తును చంపి ప్రపంచమునకు అభయమిచ్చితివి. ఈ విషయమున దేవేంద్రుడు కూడా నీ అభయ దక్షిణకు అర్హుడే, అతనికి కూడ ఈ దక్షిణనిచ్చితివనుట. (గ్రామణీర్నాపితే పుంసి శ్రేష్ఠే గ్రామాధిపే త్రిషు- అమరః).

తథాపి ఇతి :- తథాపి = అయినను యూయమ్ = మీరు, సర్వేఅపి = అందరును ద్వౌ ద్వౌ ఆత్మజౌ = ఇద్దరిద్దరు పుత్రులను, జనయత = పొందుదురుగాక ! యైః = ఏ పుత్రులతో, ఆదిరాజవంశః = మనువంశము, అయమ్ = ఇది, అష్టశాఖః = ఎనిమిది శాఖలు కలదిగా, ప్రరోహతి = వృద్ధిపొందునో ! అట్టి పుత్రులను జనయత = ఉత్పాదింతురుగాక అని అన్వయము. (పథ్యావక్త్రము)

తైరాదిరాజవంశోఽయమపుష్టశాఖః ప్రరోహతి ॥ 141

రామః — (సహర్షం కృతాంజలిః) భగవన్ పరమనుగృహీతమిక్ష్వాకుకులమ్.

భరతః — (రామం ప్రతి) ఆర్య సౌవ్యభవనప్రకోష్ఠైకపదాతిర్భరతః ప్రణమతి.

రామః — (సహర్షమాలింగ్య) వత్స భరత.

ఆత్మానమిందుకరమేదుర చంద్రకాంత
స్తంభోజ్జ్వలం వితర మే హృది నిర్వృణోమి ।

---

తాత్పర్యము :- ఓ దాశరథులారా! మీరందరు ఒక్కొక్క రిద్దరేసి పుత్రులను పొందుడీ. ఈ మనువంశము అష్టశాఖలుగా వర్ధిల్లుగాక!

సంధులు :- సర్వే + అపి - పూర్వరూప. జనయత + ఆత్మజాన్ - సవర్ణదీర్ఘ. తైః + అదిరాజ - రేఫాదేశవిసర్గ. వంశః + అయమ్ - ఉత్వాదేశవిసర్గ - వంశో + అయమ్ - పూర్వరూప.

క్రియ :- జనీ ప్రాదుర్భావే (ణిచ్) పరస్మై. లోట్. మధ్యమ.
జనయ / జనయతాత్ - జనయతమ్ - జనయత
రుహ బీజజన్మని ప్రాదుర్భావే చ. లట్. పరస్మై. ప్రథమ (ప్ర)
ప్రరోహతి - రోహతః - రోహన్తి

భగవన్నితి :- (సహర్షమ్=ఆనందముతో, కృతాంజలిః=నమస్కరించి). భగవన్=మహాత్మా! ఇక్ష్వాకు కులమ్=ఈ ఇక్ష్వాకువంశము. పరమ్ అనుగృహీతమ్=మిక్కిలి అనుగ్రహింపబడినది.

ఆర్యేతి :- (రామం ప్రతి=రామునుద్దేశించి) ఆర్య=అన్నగారా!, సౌవ్య = సేవచేసెనట్టి భవన = రాజభవనము యొక్క. ప్రకోష్ఠ = ముంగిలికి. ఏక = అద్వితీయుడగు, రక్షపదాతిః = రక్షకభటుడు. భరతః = ఈ భరతుడు. ప్రణమతి = నమస్కరించుచున్నాడు.

ఆత్మానమితి :- (సహర్షమ్ = ఆనందముతో, ఆలింగ్య = కౌగిలించుకొని) వత్స = తమ్ముడా! భరతా! ఇందుకర = చంద్రకిరణములచే. మేదుర=స్నిగ్ధమైన (స్రవించిన) (సాంద్రస్నిగ్ధస్తు మేదురః—అమరః). చంద్రకాంత స్తంభ=చంద్ర

న భ్రాతృసంగమ సుఖాసికయా జహాతి
విష్ణోః సకౌస్తుభమురశ్చపలాపి లక్ష్మీః ॥ 142

భరతః :- (సీతాం ప్రతి) దేవి, ప్రణమామి.

సీతా :- వత్స భరత. ఉష్ణకర కిరణనికురంబ చుంబిత కమల ఖండమివ

---

కాంత శిలా స్తంభమువలె. ఉజ్జ్వలమ్ = భాసురమైన. ఆత్మానమ్ = నిన్నునీవు. మే = నాయొక్క. హృది = వక్షఃస్థలమునందు. వితర = అర్పింపుము. నిర్వృణోమి = నేను సుఖింతును. లక్ష్మీః = శ్రీదేవి. చపలా అపి = ఎంత చంచలయైనను. భ్రాతృసంగమ సుఖాసికయా — భ్రాతృ = సహోదరుడైన కౌస్తుభమణితో, సంగమ = కలిసి యుండుట యనునదే. సుఖ = సుఖమునకు. ఆసికయా = నిలయమగుటచే — సుఖాసిక అగుట కారణముగా. విష్ణోః = విష్ణుమూర్తియొక్క, సకౌస్తుభమ్ = కౌస్తుభముతో కూడిన. ఉరః = వక్షఃస్థలమును. న జహాతి = విడువదు. సోదరసహ వాస సౌఖ్యము అంటిపెట్టుట. [illegible]

తాత్పర్యము :- ద్రవించుచున్న చంద్రకాంతశిలా స్తంభమువంటి నీ దేహముతో నా గుండెలను కౌగిలించుకొనుము. సోదరసహవాస సుఖముగోరి లక్ష్మీదేవియు తన చంచలత్వమును వీడి కౌస్తుభమణితోనున్న విష్ణుమూర్తి వక్షఃస్థలమును విడువకున్నది. పాల సముద్రమునుండి పుట్టినవగుట లక్ష్మీకౌస్తుభముల సోదరత్వము.

క్రియ :- తౄ ప్లవనతరణయోః, పరస్మై, లోట్, మధ్యమ (వి)
తర / తరతాత్ - తరతమ్ - తరత
వృఞ్ వరణే (శ్న) పరస్మై, లట్, ఉత్తమ
వృణోమి - వృణువః / వృణ్వః - వృణుమః / వృణ్మః
ఓహాక్ త్యాగే, లట్, పరస్మై, ప్రథమ
జహాతి - జహితః - జహతి

దేవీతి :- (సీతాంప్రతి=సీతనుద్దేశించి) దేవి=మహారాజ్ఞీ! ప్రణమామి, నమస్కరించుచున్నాను.

వత్సేతి :- వత్స=నాయనా! భరత! ఉష్ణకర = సూర్యునియొక్క. కిరణ నికురంబ = కిరణ సముదాయముచేత. చుంబిత = వికసింపజేయబడిన. కమల

చిరం మే నయనమానందయ. (పద్మ భరతః. ఉత్థాపర కిరణ జేడిరంబ చుంబి అరమలఖంచం వి చిరం మే లాలితం అశ్వీహి)

(లక్ష్మణో భరతం వందతే)

భరతః :- వత్స లక్ష్మణ సోత్కంఠం చిరాత్పరిరభస్వ మామ్ ।
శ్రద్ధాలు భ్రాతురంగాని చందనేష్వప్యరోచకి ॥ 143

(నిర్భరం పరిరభ్య) హా తాత రఘువంశయశస్తటాక యూపదండేన

---

...మ్ ఇవ = పద్మవనమువలె. చిరమ్ = చాలసేపు. మే = నాయొక్క. నయనమ్ = చూపును. ఆనందయ = ఆనందింపజేయుము. చిరకాలము జీవింపుమనుట.

(లక్ష్మణః = సౌమిత్రి. భరతమ్ వందతే = భరతుని మ్రొక్కును)

వత్సేతి :- వత్స = తమ్ముడా !. లక్ష్మణ = సౌమిత్రీ ! చిరాత్ = చాలకాలమునుండి. సోత్కంఠమ్ = ఉత్కంఠతోకూడిన. మామ్ = నన్ను. పరిరభస్వ = కౌగిలించుకొనుము. భ్రాతుః = సోదరునియొక్క. అంగాని = శరీరమును. శ్రద్ధాలుః = సాదరముగా కౌగిలించినవాడు, చందనేషు అపి = చందనాది సుగంధాలేపములయందు గూడ, అరోచకీ = ఆస్థ లేనివాడగును. అవియు నాతనికి రుచింపవు. చందనాదులకన్న సోదరాలింగనము ఆనందదాయకమనియు. (పథ్యావక్త్రము).

తాత్పర్యము :- చాలకాలమునుండి ఉత్కంఠతో ఎదురుచూచుచున్న నన్ను గాఢముగా కౌగిలించుకొనుము. లక్ష్మణా ! సోదరాలింగనమున శ్రద్ధకలవానికి చందనాదులు రుచింపవు సుమా !

సంధులు :- స + ఉత్కంఠ — గుణసంధి. శ్రద్ధాలుః + భ్రాతుః + అంగాని — రేఫాదేశ విసర్గ. చందనేషు + అపి + అరోచకీ — యణాదేశసంధులు.

క్రియ :- రభష్ రాభస్యే. ఆత్మనే. లోట్, మధ్యమ (పరి)
పరిరభస్వ — రభేథామ్ — రభధ్వమ్

హా తాతేతి :- (నిర్భరమ్ = గాఢముగా. పరిరభ్య = కౌగిలించుకొని) హా తాత = హా తండ్రీ ! రఘువంశ = రఘువంశము యొక్క. యశస్తటాక = కీర్తి సరోవరమునందలి, యూపదండేన = యూపస్తంభమువంటివాడైన. లక్ష్మణబాహునా = సౌమిత్రి

ఏతత్త్వదేవ ముఖమక్షతచంద్రబింబ
సంవాదదూకమవలోకయ లక్ష్మణస్య ।
గీర్వాణవారణకరార్గళకర్కశౌ మాం
తావేవ లక్ష్మణభుజౌ ను పరిష్వజేతే ॥ 145

---

ఏతదితి :- ఏతత్ = ఈ. ముఖమ్ = శత్రుఘ్నుని ముఖము. లక్ష్మణస్య = సౌమిత్రియొక్క. తత్ ముఖమ్ ఏవ = ఆ ముఖమే. అక్షత చంద్రబింబ = పూర్ణబింబముతో. వావదూకమ్ = వాదులాడునట్టిది - సరిపోలునదనుట. [వావదూకోఽతి వక్తరి - అమరః] అవలోకయ = సీతా! చూడుము. గీర్వాణవారణ = ఐరావతము యొక్క, కర = తొండమువలె, అర్గళ = గడియవలె, కర్కశౌ = కఠినములైన. తౌ + ఏవ = అవే. లక్ష్మణభుజౌ = సౌమిత్రి భుజములే, మామ్ = నన్ను. పరిష్వజేతే ను = కౌగిలించుకొనుచున్నవి సుమా! (వసంతతిలక).

తాత్పర్యము :- ఓ వైదేహీ! చూచితివా. ఈ శత్రుఘ్నుని ముఖము - పూర్ణచంద్రునితో వాదులాడు లక్ష్మణ ముఖమే. ఇతని బాహువులు ఐరావతము తొండముపలెను లోహార్గళమువలెను కర్కశములై లక్ష్మణ బాహువులనే స్ఫురింప జేయుచు నన్ను కౌగిలించుకొనుచున్నవి. (రామ భరతులు ఒక పోలిక, లక్ష్మణ శత్రుఘ్నులు ఒక పోలిక యని వర్ణనలు. పైగా ఈ ఇరువురు నొక తల్లిబిడ్డలు)

సమాసములు :- అక్షతశ్చాసౌ చంద్రబింబశ్చ-బింబేన సంవావదూకమ్. యజజపదశాం యఙః అను సూత్రమునందు వదధాతువును చేర్చుకొని ఊక ప్రత్యయమును పొంది "వావదూక" చేసికొనవలెనని క్షీరస్వామి. యఙిజపి దశి వదామూకః అని కలాప సర్వానందుడు - ఇది పంచికా వ్యాఖ్య. గీర్వాణానాం వారణః - వారణస్య కరః - కరశ్చ అర్గళశ్చ - కరార్గళౌ ఇవ కర్కశౌ. లక్ష్మణస్య భుజౌ.

క్రియ :- లోకృఙ్ దర్శనే (ణిచ్) పరస్మై. లోట్. మధ్యమ (అవ)
అవలోకయ/అవలోకయతాత్-అవలోకయతమ్-అవలోకయత.
ష్వఞ్జ్ పరిష్వంగే, ఆత్మనే. లట్. ప్రథమ (పరి)
పరిష్వజతే - పరిష్వజేతే - పరిష్వజన్తే.

(శత్రుఘ్నః సీతాం ప్రణమతి)

సీతా :- త్రైలోక్యశల్యోద్ధరణగౌరవితైశ్చరితైర్లక్ష్మణసదృశో భవ. వత్స శత్రుఘ్న శ్వశ్రూజనః కుత్ర! (తెల్లోక్కసల్లుద్ధరణ గోరవిదేహిం చరిదేహిం లక్ఖణ సరిసో హోహి. వచ్ఛ సత్తుహణ అత్తాజణో కహిం).

శత్రుఘ్నః :- కృతమంగలోపచారో మధ్యమాంబాభవనే భవతీం ప్రతీక్షతే.

(ఉపసృత్య లక్ష్మణం ప్రణమతి)

లక్ష్మణః :- (సహర్షమాలింగ్య) వత్స, దిష్ట్యా దీర్ఘాయుషి త్వయి దీప్యమానే న వయమేకాకినమార్యభరతం పరిత్యజ్య గతాః.

---

(శత్రుఘ్నుడు, సీతామ్ = సీతను, ప్రణమతి = నమస్కరించును).

త్రైలోక్యేతి :- త్రైలోక్య=ముల్లోకములకును, శల్య = శల్యమును (బాధను). ఉద్ధరణ = తొలగించుటవలన. గౌరవితైః = గౌరవింపబడిన, చరితైః = పనులతో. లక్ష్మణసదృశః = సౌమిత్రిసదృశుడవు. భవ = కమ్ము. వత్స = నాయనా! శత్రుఘ్న! శ్వశ్రూజనః కుత్ర = శ్వశ్రూజనము (అత్తగార్లు) ఎక్కడ? (తారకాదిభ్య ఇతచ్ – గౌరవితమ్).

కృతేతి :- కృత = ఆచరింపబడిన, మంగళోపచారః = మంగళోపచారములు కలదై, మధ్యమాంబాభవనే = సుమిత్రామందిరమునందు, భవతీమ్ = నిన్ను. (శ్వశ్రూజనః = శ్వశ్రూజనము) ప్రతీక్షతే = ఎదురుచూచుచున్నది.

(ఉపసృత్య=సమీపించి. లక్ష్మణం ప్రణమతి=శత్రుఘ్నుడు సౌమిత్రిని మ్రొక్కును)

వత్సేతి :- వత్స = తమ్ముడా! దిష్ట్యా = అదృష్టవశమున. దీర్ఘాయుషి = చిరంజీవివైన. త్వయి = నీవు, దీప్యమానే = విరాజిల్లుచుండగా – నీవు తోడుండుట కారణముగా, వయమ్ = మేము (రామలక్ష్మణులు) ఆర్య భరతమ్ = అన్నగారగు భరతుని. ఏకాకినమ్ = ఒంటరివానిగా. పరిత్యజ్య = విడిచి, గతాః = వెళ్ళినవారము. న = కాకపోయితిమి. నీవు లేకున్నచో ఈ దోషము మాకు సంక్రమించెడి దనుట.

రామః :- (మునింప్రతి) భగవన్. ఏతౌ లంకాకిష్కింధయోరధిపతీ విభీషణ సుగ్రీవౌ భగవంతం ప్రణమతః.

వసిష్ఠః :— వికర్తన పులస్త్యకుల కీర్తితోరణమాలావలంబన స్తంభా విమౌ చిరస్య భూయాస్తామ్.

రామః :- (భరతంప్రతి) వత్స. వందస్వ మహాత్మానావేతౌ పౌలస్త్యసావిత్రౌ.

(భరతశత్రుఘ్నవిభీషణసుగ్రీవా మిథో యథోచిత మాచరన్తి)

వసిష్ఠః :— (సహర్షమ్) దిష్ట్యా చతుర్దశభిః పరివత్సరైః పునస్సముదయమానం దశరథకుటుంబ మీక్షామహే. (సవిమర్శస్మితమ్)

---

భగవన్నితి :- (మునింప్రతి = వశిష్ఠునుద్దేశించి) భగవన్ = మహాత్మా! ఏతౌ = వీరిరువురును, లంకాకిష్కింధయోః = లంకాకిష్కింధలకు, అధిపతీ = అధిపతులు, విభీషణ సుగ్రీవౌ = విభీషణ సుగ్రీవులు, భవంతమ్ = నిన్ను. ప్రణమతః = నమస్కరించుచున్నారు.

వికర్తనేతి :- వికర్తన పులస్త్యకుల = సూర్యవంశ - పులస్త్యవంశములయొక్క. కీర్తితోరణమాలా = యశస్సు అనునట్టి తోరణమాలను. అవలంబన = వహించునట్టి. స్తంభౌ = స్తంభములవంటివారై. ఇమౌ = ఈ ఇరువురును, చిరస్య భూయాస్తామ్ = చిరకాలము జీవింతురుగాక!

వత్సేతి :- (భరతంప్రతి = భరతునుద్దేశించి) వత్స = సోదరా! మహాత్మానౌ = మహానుభావులగు, ఏతౌ = ఈ, పౌలస్త్యసావిత్రౌ = పులస్త్యవంశజుడగు విభీషణుని, సవితృపుత్రుడగు సుగ్రీవుని - ఇరువురిని, వందస్వ = నమస్కరింపుము.

(భరతశత్రుఘ్న విభీషణ సుగ్రీవులు, మిథః = పరస్పరము, యథోచితమ్ = యథోచితముగా ఎవరెవరికి మ్రొక్కవలెనో ఆ రీతిగా, ఆచరన్తి = ఆచరింతురు).

దిష్ట్యేతి :- (సహర్షమ్ = ఆనందముతో) దిష్ట్యా = అదృష్టవశమున. చతుర్దశభిః పరివత్సరైః = పదునాలుగు వత్సరములతో—ఇంతకాలము తరువాత అనుట.

జేతారం దశకంధరస్య జితవానేవార్జునం భార్గవ
స్తం రామో యది కాకపక్షధర స్తత్పూరితేయం కథా ।
ఊర్ధ్వం కల్పయితుస్తు బాలచరితాత్ ప్రక్రియాగౌరవా
దన్యేయం కవితా తథాపి జగతస్తోషాయ వర్తిష్యతే ॥ 146

---

పునః = మరల. సముదయమానమ్ = అభివృద్ధి చెందుచున్న — కళకళలాడుచున్న. దాశరథికుటుంబమ్ = దశరథుని కుటుంబమును. ఈక్షామహే = చూచుచున్నాము.

(సనిమర్మస్మితమ్ = ఆలోచనతో కూడిన చిరునవ్వుతో)

జేతారమ్ :- దశకంధరస్య = రావణునియొక్క జేతారమ్=విజేతయగు, అర్జునమ్ = కార్తవీర్యార్జునుని, భార్గవః = పరశురాముడు, జితవాన్ ఏవ = జయింపనే జయించెను. తమ్ = ఆ భార్గవరాముని, రామః = ఈ దశరథరాముడు. కాకపక్షధరః = కాకపక్షములవంటి శిఖ ధరించిన వయస్సులోనే — బాల్యమునందే అనుట [వివాహ సందర్భమున]. జితవాన్ = జయించెను, తత్ = అందుచే అప్పుడే, ఇయమ్ = ఈ, కథా = ఇతివృత్తము. పూరితా = పూర్తియైపోయినది - భార్గవుని జయించెననగా దశకంధరుని జయించినట్లే కావున వివాహముతో కథ పూర్తియైపోయినది. తు = కానీ, బాలచరితాత్ = రాముని బాలచరితమునుండి, ఊర్ధ్వమ్ = పై భాగమును — తదుపరికథ ననుట. ప్రక్రియాగౌరవాత్ = కల్పనాగౌరవమువలన, కల్పయతః = కల్పించువాడైన కవియొక్క. ఇయమ్ కవితా = ఈ అనంతరకథారూపమగు కవిత అంతయు, అన్యా= వేరొకటి — రాముని గొప్పదనమును చెప్పుటకు ఇది అవసరము లేదనుట. తథాపి = అయినను, జగతః = లోకముయొక్క, తోషాయ = ఆనందముకొఱకు, వర్తిష్యతే = శాశ్వతమై నిలుచునుగాక। [శార్దూలము]

తాత్పర్యము :- రావణుని కార్తవీర్యుడు జయించెను. ఆ కార్తవీర్యుని భార్గవుడు జయించెను. ఆ భార్గవుని బాలరాముడు సీతాకల్యాణ సమనంతరము జయించెననగా రాముడు రావణుని జయించినట్లే. ఇంతటితో కథ పూర్తిఅయినది. సముద్రలంఘనాది ప్రకరణముల కల్పనతో సాగిన అనంతరకథ కవి కల్పితమగు కవిత మాత్రమే. అయినను లోకుల ఆనందమునకై అది శాశ్వతమగు స్థితిని పొందుగాక।
[బాలానాం తు శిఖా ప్రోక్తా కాకపక్షః శిఖండకః — అమరః]

(రామంప్రతి) వత్స. మాంగళికలగ్నమతిక్రామతి.

తదిదం రఘుసింహానాం సింహాసనమలంకురు ।

రాజన్వన్తః ప్రతన్వన్తు ముదముత్తరకోశలాః ॥ 147

(రామస్తథా కరోతి. వసిష్ఠ ఐంద్రేణ మహాభిషేకేణ మంత్రపూర్వక

---

క్రియ :- వృతుజిర్ వర్తనే. లృట్. ఆత్మనే. ప్రథమ

వర్తిష్యతే - వర్తిష్యేతే - వర్తిష్యన్తే

తదిదమితి :— [రామంప్రతి = రామునుద్దేశించి] వత్స = నాయనా! మాంగళికలగ్నమ్ = మంగళప్రదమగు అభిషేకముహూర్తము, అతిక్రామతి = అతిక్రమించుచున్నది. రఘుసింహానామ్ = రఘుశ్రేష్ఠులయొక్క [స్యురుత్తరపదే వ్యాఘ్రపుంగవర్షభకుంజరాః సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః - అమరః], తదిదమ్ = సుప్రసిద్ధమైన ఈ, సింహాసనమ్ = స్వర్ణభద్రాసనమును [నృపాసనం యత్తద్భద్రాసనం తు తత్ హైమమ్ - అమరః], అలంకురు = అలంకరించుము - ఆసీనుడవుకమ్మనుట. ఉత్తరకోశలాః = ఈ ఉత్తర కోశలదేశములు, రాజన్వన్తః = ప్రశస్తరాజయుక్తములై, ముదమ్ = ఆనందమును, ప్రతన్వన్తు = పంచునుగాక! [పథ్యావక్త్రము]

తాత్పర్యము :- రామా! రఘువీరులధిష్ఠించిన ఈ సింహాసనమును అలంకరించుము. నీవు రాజుగా ఈ ఉత్తర కోసలదేశములు ఆనందించునుగాక! నీ వలన ఇవి ప్రశస్త రాజయుక్తము లగుగాక!

క్రియ :- డుకృఞ్ కరణే. లోట్. పరస్మై. మధ్యమ

కురు/కురుతాత్ - కురుతమ్ - కురుత

తనుఞ్ విస్తారే. లోట్. పరస్మై. ప్రథమ

తనోతు/తనుతాత్ - తనుతామ్ - తన్వన్తు

[రామః = రాముడు, తథాకరోతి = సింహాసనమధిష్ఠించును. వశిష్ఠః=వసిష్ఠుడు, ఐంద్రేణ మహాభిషేకేణ = ఇంద్రాభిషేక సంబంధియగు అభిషేకముతో. మంత్రపూర్వకమ్ = సమంత్రకముగా, అభిషించతి = అభిషేకించును. అన్యే = తక్కినవారు

మభిషించతి. అన్యే తూచ్ఛ్వాపచమభిషేకం నాటయిత్వా పంచాంగచుంబిత భూమయః ప్రణమన్తి. నేపథ్యే మంగళగీతిర్నాందీ వాద్యాని చ)

వసిష్ఠః -: (సహర్షమ్) వత్స రామభద్ర. సంప్రతి —

ఉదయదుదయద్ధర్మస్కంధే ధురం త్వయి బిభ్రతి
క్వ ను పరిభవా దృష్టాదృష్టాః ప్రజాః పరిచిన్వతే ।
అపి ఖలు యథా జీవాత్మానః ప్రభోః పరమాత్మనో
దిశి దిశి దిశామష్టౌ నాథాస్తవైవ విభీషికాః॥ 148

---

ఉచ్ఛ్వాపచమ్ = యుపోచితరీతిని, అభిషేకం నాటయిత్వా=అభిషేకించుటను అభినయించి. పంచాంగచుంబితభూమయః = నేలకు పంచాంగములు తాకునట్లు. ప్రణమన్తి = సాగిల పడుచున్నారు. నేపథ్యే=తెరయందు. మంగళగీతిః=మంగళగేయములు. నాందీవాద్యాని చ = మంగళ తూర్యములును - మారుమ్రోగుననుట].

ఉదయదితి -: [సహర్షమ్ = సానందముగా] వత్స = నాయనా । రామభద్రా । సంప్రతి = ఇప్పుడు-ఉదయదుదయద్ధర్మస్కంధే-ఉదయదుదయత్ = అత్యంతము వృద్ధిపొందు — నిత్యమునెదుగునట్టి, ధర్మస్కంధే = ధర్మమే స్కంధముగా కలవాడవైన, త్వయి = నీవు. ధురమ్ = రాజ్యభారమును. బిభ్రతి [సతి] = వహించుచుండగా, దృష్టాదృష్టాః = కనిపించునవియు [శత్రురాజకృతములు]. కనిపించనివియు [కరువుకాటకములు] నై. పరిభవా = కష్టములను. ప్రజాః = లోకులు. క్వను పరిచిన్వతే = ఎట్లు ఎరుగుదురు । ధర్మపరుడవగు నీ ఏల్బడిలో అట్టి బాధలు ప్రజల అనుభవమునకు రావనుట. [అదృష్టం వహ్నితోయాది దృష్టం స్వపరచక్రజమ్ - అమరః]. అపిచ = మరియు, ప్రభోః = ప్రభువగు, పరమాత్మనః = పరమాత్మకు, జీవాత్మనః యథా = జీవాత్మలెట్లో అట్లు, దిశిదిశి = అన్ని దిక్కులందును, అష్టౌ = ఎనిమిదిమంది యగు, దిశామ్ నాథాః = దిక్పాలకులు, తవ = నీయొక్క, విభీషికాః ఏవ = మాయారూపములే. తవైవ విభూతయః అని పాఠాంతరము. నీయొక్క విభూతయః ఏవ = అంశలే అని అర్థము. (హరిణీవృత్తము).

(రామో లజ్జతే)

విభీషణః :- (కృతాంజలిర్జానుభ్యాం ప్రణిపత్య) దేవ.

లంకా చ పుష్పకమిదం చ విమానమార్యా
ద్యక్షేశ్వరాదపహృతం దశకంధరేణ ।
ఏకాం భవానదిత మహ్యమథేదమన్య
దాజ్ఞాపయ ద్రుతముపైతు పతిం నిధీనామ్॥ 149

---

తాత్పర్యము :- ధర్మస్కంధుడవైన నీ పరిపాలనలో ప్రజలకు కరువు కాటకములు గాని శత్రుపరిభవములు గాని ఉండవు. నీవు పరమాత్మవు కాగా అష్టదిక్పాలకులు జీవాత్మలవలె దిక్కులందు నీ అంశలై నిల్తురు.

క్రియ :- చిఞ్ చయనే (శ్ను) లట్. ఆత్మనే. ప్రథమ
చినుతే — చిన్వాతే — చిన్వతే

(రామః = రాముడు. లజ్జతే = సిగ్గుపడును)

లంకేతి :— (కృతాంజలిః=అంజలి బంధముతో. జానుభ్యామ్ ప్రణిపత్య= మోకాళులపై నేలకు ఆని) దేవ = మహారాజా ! ఆర్యాత్ = మాకు పెద్ద అన్నగారైన. యక్షేశ్వరాత్ = కుబేరుని నుండి. దశకంధరేణ = రావణునిచే. లంకా = లంకా సామ్రాజ్యము, చ = మరియు. ఇదమ్ = ఈ. పుష్పకమ్ విమానమ్ = పుష్పక విమానమును. అపహృతమ్ = బలాత్కారముగా అపహరింపబడినది. [ప్రతేక్యకా న్వయము) ఏకామ్=వీనిలోనొకటియగు లంకను, భవాన్ = నీవు. మహ్యమ్ = నా కొఱకు. అదిత = ఇచ్చితివి. అథ = ఇంకనిప్పుడు. ఇదమ్ = ఈ. అన్యత్=రెండవ దగు పుష్పకము. నిధీనామ్ పతిమ్ = నిధీశ్వరుడగు కుబేరుని. ద్రుతమ్ = వెంటనే. ఉపైతు = పొందుగాక అని ఆజ్ఞాపయ = ఆజ్ఞాపించుము. (వసంతతిలక)

తాత్పర్యము:- మహారాజా! లంకాపట్టణమొకటి ఈ పుష్పకమొకటి కుబేరునినుండి రావణుడు బలాత్కారముగా స్వీకరించినవి. వీనిలో లంకను నీవు నాకు ధారవోసితివి. ఈ పుష్పకము కుబేరుని చేరుటకు ఆజ్ఞాపింపుము.

రామః -: (వసిష్ఠేనానుజ్ఞాతః పుష్పకం ప్రతి) విమానరాజ, ప్రథమస్వామినం ప్రథమ పౌలస్త్యముపతిష్ఠస్వ.

వసిష్ఠః -: (సహర్షప్రసాదమ్) రామభద్ర. కింతే భూయః ప్రియం కరోమి?

రామః -: భగవన్, కిమతః పరమపి ప్రియమస్తి. భగవత్ప్రసాదాత్ —

తాతాజ్ఞామధిమౌళి మౌక్తికమణిం కృత్వా మహాపోత్రిణో
దంష్ట్రా విన్ధ్యవిలాస పత్త్రిశబరీ దృష్టా భృశం మేదినీ ।

---

క్రియ :- ఇట్ గతౌ. లోట్. పరస్మై. ప్రథమ.
ఏతు/ఇతాత్—ఇతామ్—యన్తు
డుదాఞ్ దానే. లుఙ్. ఆత్మనే. ప్రథమ
అదిత—అదిషాతామ్—అదిషత

విమానేతి :- (వసిష్ఠేన = వసిష్ఠునిచేత, అనుజ్ఞాతః = అనుమతింపబడినవాడై. పుష్పకం ప్రతి = పుష్పకమునుద్దేశించి, విమానరాజ = ఓ విమానశ్రేష్ఠమా! పుష్పకవిమానమా ప్రథమస్వామినమ్ = నీ తొట్టతొలి ప్రభువగు, ప్రథమపౌలస్త్యమ్ = మొట్టమొదటి పౌలస్త్యుని. ఉపతిష్ఠస్వ = పొందుము (పులస్త్యునికి జ్యేష్ఠ పౌత్రుడు కుబేరుడు).

రామేతి :- (సహర్షప్రసాదమ్ = ఆనందముతో అనుగ్రహముతో) రామ భద్రా! తే = నీకు, భూయః = ఇంకను, కిమ్ ప్రియమ్ = ఏ ప్రియమును, కరోమి = చేయుదును ; ఇంకేమి ప్రియము చేయువలెనో కోరుకొనుమనుట.

భగవన్నితి :- భగవన్ = మహాత్మా! అతః పరమ్ అపి = ఇంతకు మించినదియు. ప్రియమ్ = ప్రియము, కిమస్తి = ఏమున్నది. భగవత్ప్రసాదాత్ = భగవంతుని (నీయొక్క) అనుగ్రహము వలన —

తాతేతి :- తాత = తండ్రియొక్క. ఆజ్ఞామ్ = ఆనతిని, అధిమౌళి = మౌళిపై. మౌక్తికమణిమ్ కృత్వా = ముక్తామణిని చేసి. శిరసావహించియనుట; మహాపోత్రిణః = ఆదివరాహముయొక్క. దంష్ట్రా = కోరవంటిదైన. విన్ధ్య = విన్ధ్యపర్వతమే. విలాసపత్త్రి= కర్ణాభరణమైన పత్త్రిముగా ధరించిన, శబరీ = బోయెత

సేతుర్దక్షిణ పశ్చిమౌ జలనిధీ సీమంతయన్నర్పితః
కల్పాంతం చ కృతం చ విశ్వమదశగ్రీవోపసర్గం జగత్ ॥ 150

తథాపీదమస్తు—
సమున్మీలత్సూక్తస్తబకమకరందైః శ్రవణయో
రవిశ్రమ్యద్ధారా సవనముపచిన్వస్తు కవయః ।

---

(చెంచెత) అన్నట్లు, మేదినీ = భూదేవి (రాజ్యలక్ష్మి) త్యక్తా = విడ్వబడి, దృష్టా = చూడబడినది. తండ్రి మాటపై బోయెతనువలె రాజ్యలక్ష్మిని ఉపేక్షించితినసుట. దక్షిణ పశ్చిమౌ = దక్షిణ పశ్చిమములగు, జలనిధీ=సముద్రములను, సీమంతయన్= విభజించుచు, సేతుః = సేతువు, అర్పితః = దక్షిణ సముద్రమునకు సమర్పింపబడినది. విశ్వమ్ = సమస్తమైన, జగత్ = ప్రపంచము, కల్పాంతమ్ = కల్పాంతము వరకును. అదశగ్రీవోపసర్గమ్ = దశగ్రీవుడనునట్టి వ్యాధి తొలగినదిగా, కృతమ్ = చేయబడినది. (శార్దూల విక్రీడితము)

తాత్పర్యము :- తండ్రి ఆజ్ఞను శిరసావహించి రాజ్యమును చెంచెతవలె పరిత్యజించితిని. దక్షిణ సముద్రముపై సేతువు నిర్మించితిని. కల్పాంతమువరకును జగత్తునకు రావణరూపమగు వ్యాధి సోకకుండ తొలగించితిని.

సంధులు :- తాత + ఆజ్ఞామ్, కల్ప + అంతమ్-సవర్ణదీర్ఘ. వీ(త్రిణః + దంష్ట్రా - ఉత్వాదేశవిసర్గ. సేతుః + దక్షిణ — రేఫాదేశవిసర్గ. సీమంతయన్ + అర్పితః - అనునాసికద్విత్వ. గ్రీవ + ఉపసర్గమ్ — గుణసంధి

విశేషములు :- దేవతలతోగాని ఋషులతోగాని నాటకమును ముగించవలెనని భరతుడు. దేవతాదర్శనాంతం తు కర్తవ్యం నాటకం బుధైః రాజర్షిదర్శనాంతం వా తేఽపి దేవైస్సమాః స్మృతాః. కావున వసిష్ఠదర్శనము. ముగింపు వరప్రదానముతో జరుగవలెననియు భరతుని సూచన. వరప్రదానసంప్రాప్తిః కావ్యసంహార ఉచ్యతే. కావున వసిష్ఠుడు వరమడుగుమనుట.

సమున్మీలదితి :- తథాపి = అయినప్పటికిని, ఇదమ్‌అస్తు = ఇదియగుగాక ; సమున్మీలత్ = వికసించుచున్న, సూక్తస్తబక = చతురోక్తి గుచ్ఛములయొక్క (అలంకారిక వచస్సుమములయొక్క అనుట). మకరందైః = మకరందములతో,

న చ శబ్దబ్రహ్మోత్థం పరిమళమనాఘ్రాయ చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు ॥ 151

అపిచ —

దేవస్యాత్మభువః కమండలుజలస్రోతాంసి మందాకినీ
గంగాభోగవతీమయాని పునతే యావత్త్రిలోకీమిమామ్ ।

---

శ్రవణయోః = జనుల చెవులకు. కవయః = కవులు. అవిశ్రమ్యత్ = ఎడతెరిపిలేని. ధారా = ధారలతో. స్నపనమ్ = స్నానమును. ఉపచిన్వన్తు = కల్పింతురుగాక ! చ = మరియు, జనః = లోకము. శబ్దబ్రహ్మోత్థమ్ = శబ్దబ్రహ్మనుండి ఆవిర్భవించిన. పరిమళమ్ = సుగంధమును. అనాఘ్రాయ = ఆస్వాదింపక - శబ్దశాస్త్రమును పఠింపక యనుట. కవీనామ్ = కవులయొక్క. గంభీరే=గంభీరమైన. వచసి = వాక్కునందు- కావ్యమునందనుట. గుణదోషౌ = గుణదోషములను. న రచయతు = కల్పింపకు గాక ! (శిఖరిణీవృత్తము)

తాత్పర్యము :- కవులు తమ వచస్సుమములనుండి స్రవించు మరంద ధారలతో జనుల చెవులను నిరంతరము షేకింతురుగాక !. శబ్దబ్రహ్మము నుపాసించని లోకులు కవుల రచనలలో గుణ దోషములను ఎంచుటకు పూనుకొనకుందురుగాక !

క్రియ :- చిఞ్ చయనే (శ్ను) లోట్. పరస్మై. ప్రథమ
చినోతు/చినుతాత్ — చినుతామ్ — చిన్వన్తు
రచ ప్రతియత్నే, లోట్. పరస్మై. ప్రథమ
రచయతు/రచయతాత్ — రచయతామ్ — రచయన్తు

దేవస్యేతి : అపిచ = మరియు: దేవస్య ఆత్మభువస్య = బ్రహ్మదేవుని యొక్క. కమండలు జలస్రోతాంసి = కమండలూదక ప్రవాహములు, మందాకినీ గంగా భోగవతీమయాని = స్వర్లోకమున మందాకిని, భూలోకమున గంగ, పాతాళమున భోగవతి అను పేర్లుకలవై, ఇమామ్ = ఈ, త్రిలోకీమ్ = లోకత్రయమును. యావత్ పునతే తావత్ = ఎంతకాలము పవిత్రీకరింపునో అంత కాలమును. కవీనామ్ = కవుల యొక్క, అయమ్ = ఈ; పీరయశోరసాయనమధుస్యందః — వీరయశః = వీరయశస్సునట్టి,

తావద్వీరయశోరసాయన మధుస్యన్దః కవీనామయం
జాగర్తు శ్రుతిశష్కులీ వలయిత వ్యోమావగాహీ గుణః ॥ 152

(ఇతి నిష్క్రాంతాస్సర్వే)

ఇతి నాయకానందో నామ సప్తమోఙ్కః.

ఇతి మహాకవిశ్రీమురారివిరచితమనర్ఘరాఘవం నామనాటకం సమాప్తమ్.

---

రసాయన=ఔషధము వల్లనైన. మధుస్యందః=మాధురీ నిష్యందము. శ్రుతిశష్కులీ = శ్రోత్ర వివరములో. వలయిత = చుట్టలు చుట్టుకొనియున్న. వ్యోమ = ఆకాశమును. అవగాహీ = స్పృశించునట్టి. గుణః = స్వభావము. జాగర్తు = ప్రకాశించుగాక! (శార్దూలము)

తాత్పర్యము :- ముల్లోకములలో గంగానది ప్రవహించునంతకాలమును వీరయశోరసాయనములైన కవివాక్కులకు శ్రోతల చెవులలోని ఆకాశమును స్పృశించు నట్టి గుణము ప్రకాశించుగాక ! శబ్దగుణక మాకాశమనుట.

క్రియ :- పూఙ్ పవనే. ఆత్మనే. లట్. ప్రథమ (ప్వాదీనాం హ్రస్వః)

పునీతే - పునాతే - పునతే

జాగృ నిద్రాక్షయే లోట్. పరస్మై. ప్రథమ

జాగర్తు/జాగృతాత్ - జాగృతామ్ - జాగ్రతు.

(ఇతి = అని. సర్వే = అందరును. నిష్క్రాంతాః = నిష్క్రమింతురు.)

ఇతి = ఇది. నాయకానందః నామ = నాయకానందము అను పేరు గల సప్తమః అంకః = ఏడవ అంకము.

ఇతి = ఇది. మహాకవి=మహాకవియగు. శ్రీ మురారి విరచితమ్=శ్రీ మురారి విరచితము. అనర్ఘరాఘవమ్ నామ = అనర్ఘరాఘవ మనునట్టి. నాటకమ్ = నాటకము. సమాప్తమ్ = సమాప్తమైనది.

"చూడామణి" వ్యాఖ్యానము. సీడితమతులార ! చూచిరే కద ! యిఁకనో
నాడక తెల్పుడి - మఱి మా, రాడక సరిచేసికొందు - నయ్యయి దోసఁగుల్.

# నాటక పరిభాష

స్వగతము :- అశ్రావ్యం ఖలు యద్వస్తు తదిహ స్వగతం మతమ్.

ప్రకాశము :- సర్వశ్రావ్యం ప్రకాశం స్యాత్.

అపవారితము :- తద్భవేదపవారితమ్.

రహస్యం తు యదన్యస్య పరావృత్యప్రకాశ్యతే ।
త్రిపతాకాకరేణాన్యా నపవార్యాంతరా కథామ్ ॥

జనాంతికము :- అన్యోన్యామంత్రణం యత్స్యాజ్జనాంతే తజ్జనాంతికమ్.

నేపథ్యము :- నటానాం వేషపరిగ్రహస్థానమ్.

నాటకము :- వీరశృంగారయోరేకః ప్రధానం యత్ర వర్ణ్యతే ।
ప్రఖ్యాతనాయకోపేతం నాటకం తదుదాహృతమ్ ॥

అంకము :- ప్రత్యక్షనేతృచరితో రసభావసముజ్జ్వలః ।
భవేదగూఢశబ్దార్థః క్షుద్రచూర్ణకసంయుతః ॥
నానేకదిననిర్వర్త్య కథయా సంప్రయోజితః ।
ఆవశ్యకానాం కార్యాణామవిరోధా ద్వినిర్మితః ।
ప్రత్యక్ష చిత్ర చరితైర్యుక్తో భావరసోద్భవైః ॥
అంతనిష్క్రాంతనిఖిలపాత్రోఽంక ఇతి కీర్తితః ॥

నాంది :- ఆశీర్వచనసంయుక్తా స్తుతిర్యస్మాత్ప్రయుజ్యతే ।
దేవద్విజనృపాదీనాం తస్మాన్నాందీతి సంజ్ఞితా ॥
మాంగల్యశంఖ చంద్రాబ్జకోకకైరవశంసినీ ।
పదైర్యుక్తా ద్వాదశభిరష్టాభిర్వా పదైరుత ॥

సూత్రధారుడు :- నాట్యోపకరణాదీని సూత్రమిత్యభిధీయతే ।
సూత్రం ధారయతే యస్తు సూత్రధారః స ఉచ్యతే ॥

ప్రస్తావన :- నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా ।
సూత్రధారేణ సహితాః సంలాపం యత్ర కుర్వతే ॥
చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైః ప్రస్తుతాక్షేపిభిర్మిథః ।
ఆముఖం తత్తు విజ్ఞేయం నామ్నా ప్రస్తావనాపి సా ॥

విష్కంభకము :- వృత్తవర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః ।
సంక్షిప్తార్థస్తు విష్కంభ ఆదావంకస్య దర్శితః ॥

ప్రవేశకము :- ప్రవేశకోఽనుదాత్తోక్త్యా నీచపాత్ర ప్రయోజితః ।
అంకద్వయాంతర్విజ్ఞేయః శేషం విష్కంభకే యథా ॥

నాయకుడు :- త్యాగీ కృతీ కులీనః సుశ్రీకో రూపయౌవనోత్సాహీ ।
దక్షోఽనురక్తలోకస్తేజో వైదగ్ధ్యశీలవాన్నేతా ॥

ప్రస్తావనలు :- ఉద్ఘాత్యకః కథోద్ఘాతః ప్రయోగాతిశయస్తథా ।
ప్రవర్తకావలగితే పంచ ప్రస్తావనాభిదః ॥

బీజము :- అల్పమాత్రం సముద్దిష్టం బహుధా యద్విసర్పతి ।
ఫలస్య ప్రథమో హేతు ర్బీజమిత్యభిధీయతే ॥

బిందువు :- అవాంతరార్థవిచ్ఛేదే బిందురచ్ఛేదకారణమ్ ।

కార్యము :- అపేక్షితం తు యత్సాధ్యమారంభో యన్నిబంధనః ।
సమాపనం తు యత్సిద్ధ్యై తత్కార్యమితి సమ్మతమ్ ॥

సంధి :- అంతరైకార్థసంబంధః సంధిరేకాన్వయే సతి ।

పంచసంధులు : ముఖం ప్రతిముఖం గర్భో విమర్శ ఉపసంహృతిః ।
ఇతి పంచాస్య భేదాః స్యుః — — ॥

ముఖసంధి :- యత్ర బీజసముత్పత్తి ర్నానార్థరససంభవా ।
ప్రారంభేణ సమాయుక్తా తన్ముఖం పరికీర్తితమ్ ॥

ప్రతిముఖసంధి :- ఫలప్రధానోపాయస్య ముఖసంధినివేశినః ।
లక్ష్యాలక్ష్య ఇవోద్భేదో యత్ర ప్రతిముఖం చ తత్ ॥

గర్భసంధి :- ఫలప్రధానోపాయస్య ప్రాగుద్భిన్నస్య కించన ।
గర్భో యత్ర సముద్భేదో హ్రాసాన్వేషణవాన్ముహుః ॥

విమర్శసంధి : యత్ర ముఖ్యఫలోపాయ ఉద్భిన్నో గర్భతోఽధికః ।
శాపాద్యైః సాంతరాయశ్చ స విమర్శ ఇతి స్మృతః ॥

నిర్వహణసంధి :- బీజవంతో ముఖాద్యర్థా విప్రకీర్ణా యథాయథమ్ ।
ఏకార్థముపనీయంతే యత్ర నిర్వహణం హి తత్ ॥

---

# నిర్దేశపరిభాష

నాటకమునందు సంభాషణలలో పేరుపెట్టి పిలుచుటకు వీలులేని వ్యక్తులను సంబోధించుటకు ఒక సంప్రదాయమున్నది దానినే నిర్దేశ పరిభాష అందురు. అది ఆయా పాత్రల వయోగుణాదికమునుబట్టి మూడు విధములు. పూజ్య నిర్దేశము, సదృశ (సమాన) నిర్దేశము. కనిష్ఠ నిర్దేశము.

పూజ్యనిర్దేశము :- దేవతలు, మునులు యోగులు (లింగినః) పండితులు-స్త్రీలుగాని పురుషులుగాని- "భగవత్" శబ్దముతో (భగవన్. భగవతి) పిలువ దగినవారు. వీరు పూజ్యులు.

ఆర్యేతి బ్రాహ్మణో వాచ్యో వృద్ధ స్తాతేతి భాష్యతే।
ఉపాధ్యాయేతి చాచార్యో గణికా త్వజ్జుకాఖ్యయా ॥

బ్రాహ్మణుని ఆర్యుడా అని, వృద్ధుని తాత అని. గురువును ఉపాధ్యాయుడా అని. వేశ్యను అజ్జుకా అని పిలువవలెను.

మహారాజేతి భూపాలో విద్వాన్ భావ ఇతీర్యతే।
ఛందతో నామభిర్వాచ్యా బ్రాహ్మణైస్తు నరాధిపాః ॥

భూపాలుని మహారాజా అని. విద్వాంసుని భావ అని పిలువవలెను. బ్రాహ్మణులు మాత్రము మహారాజులనుకూడ స్వేచ్ఛగా పేరు పెట్టి పిలువవచ్చును.

దేవేతి నృపతి ర్వాచ్యో భృత్యైః ప్రకృతిభి స్తథా
సార్వభౌమః పరిజనై ర్భట్టభట్టారకేతి చ।
వాచ్యో రాజేతి మునిభి రపత్యప్రత్యయేన వా
విదూషకేణ తు ప్రాయః సఖే రాజన్నితీచ్ఛయా ।

రాజోద్యోగులుగాని ప్రజలుగాని మహారాజును దేవా అని పిలువవలెను. పరిజనులు సార్వభౌమా అని గాని. భట్ట అని కాని, భట్టారకా అనికాని పిలువవచ్చును.

మునులు మాత్రము రాజా అనిగాని. అపత్యప్రత్యయాంతముతోగాని పిలువవచ్చును. కౌరవా! పౌరవా! సౌమిత్రా! రాఘవా! దాశరథీ!- ఇత్యాదులు అపత్య ప్రత్యయాంతములు. రాజా అనిగాని మిత్రమా! వెర్రీ! సఖుడా! - ఇత్యాదిగా గాని విదూషకుడు పిలువవచ్చును.

బ్రాహ్మణై స్సచివో వాచ్యో హ్యమాత్య సచివేతి చ
శేషై రార్యేత్యథాయుష్మ న్నితి సారథినా రథీ ॥

మంత్రిగారిని బ్రాహ్మణులు అమాత్యుడా అనిగాని, సచివుడా అనిగాని పిలువవచ్చును. తక్కినవాళ్లు ఆర్యా అనియే పిలువవలెను. ఇంక రథము నధిరోహించినవాడెంతటి మహానుభావుడైనను అతనిని సారథి "ఆయుష్మంతుడా" అనియే పిలువవలెను.

తపస్వి సాధు శబ్దాభ్యాం ప్రశాంతః పరిభాష్యతే
స్వామీతి యువరాజస్తు కుమారో భర్తృదారకః ॥

ప్రశాంతచిత్తులైన మునులను ఋషులను తపస్వీ! సాధూ! స్వామీ! అని పిలువవలెను. కుమారా! అనిగాని, భర్తృదారకా! అనిగాని యువరాజును పిలువవలెను.

ఆవుత్తేతి స్వసుర్భర్తా స్యాలేతి పృతనాపతిః—సోదరీభర్తను ఆవుత్తా! అనియు సేనాభర్తను స్యాలా! అనియు పిలువవలెను.

భట్టినీ స్వామినీ దేవీ తథా భట్టారికేతి చ
పరిచారజనై ర్వాచ్యా యోషితో రాజవల్లభాః ॥

రాజుగారి భార్యలను భట్టిని, స్వామిని, దేవీ, భట్టారిక అని పరిజనులు పిలువవలెను.

రాజ్ఞా తు మహిషీ వాచ్యా దేవీ త్వన్యాః ప్రియా ఇతి—రాజుగారు మాత్రము తన పట్టమహిషిని దేవీ! అని, తక్కిన భార్యలను ప్రియులారా! అని పిలువవలెను.

సర్వేణ పత్నీ త్వార్యేతి పితుర్నామ్నా సుతస్య వా
తాతపాదా ఇతి పితా మాతాంబేతి సుతేన తు
జ్యేష్ఠా స్త్వార్యా ఇతి భ్రాత్రా తథా స్యు ర్మాతులాదయః

ఏ పాత్రమైనను తన భార్యను ఆర్యరాలా! అని పలువవలెను. లేదా ఆమె తండ్రి పేరుతోగాని తనయుని పేరుతోగాని కలిపి పిలువవచ్చును. పరమశివుడు పార్వతీ దేవిని పిలువవలసినచో హిమగిరితనయా అనికాని, గణాస్యజననీ! అనికాని పిలువవచ్చు ననుట. తనయుడు తన తండ్రిని తాతపాదుడా! అని తల్లిని అంబా! అని పిలువవలెను. అట్లే తన అన్నగారిని ఆర్యుడా! అని సంబోధింపవలెను. మేనమామ మొదలగువారిని కూడ ఇట్లే ఆర్య! అని పిలువవలెను.

## II. సదృశ నిర్దేశము :-

> సదృశః సదృశా వాచ్యో వయస్యే త్యాహ్వయేన వా
> హలేతి సఖ్యా తు సఖీ కథనీయా సఖీతి వా

సమవయస్కులు పరస్పరము వయస్యా! అని కాని పేరుతోగాని పిలుచుకొన వలెను. స్నేహితురాండ్రయినచో హలా! -సఖీ! అని పిలుచుకొనవలెను.

## III. కనిష్ఠ నిర్దేశము :-

> సుతశిష్యకనీయాంసో వాచ్యా గురుజనేన హి
> వత్స పుత్రక దీర్ఘాయు స్తాత జాతేతి సంజ్ఞయా॥
> అన్యః కనీయా నార్యేణ జనేన పరిభాష్యతే
> శిల్పాధికారనామభ్యాం భద్ర భద్రముఖేతి వా॥

సుతులను శిష్యులను చిన్నవారిని పలుకరించినప్పుడు పెద్దలు వత్స!, పుత్రక!, దీర్ఘాయుష్మంతుడా!, తాత!, జాత! అని సంబోధింపవలెను. స్థాయినిబట్టి తనకన్న తక్కువవారిని పిలుచునప్పుడు అతని ఉద్యోగము పేరుతోగాని (దౌవారికా! వేత్రహస్తా!) లేక భద్రుడా! భద్రముఖుడా! అనికాని వ్యవహరింపవలెను.

వాచ్యే నీచాతినీచే తు హండే హంజే ఇతి క్రమాత్ - నీచురాలిని సంబో ధింపవలయుచో హండే అని, అతినీచురాలిని హంజే అని పిలువవలెను. ఇవి మైత్రియందుం గలవు. (వాచ్యే నీచాతినీచే - ప్ర.ద్వి.)

# నామపరిభాష

నాటకమునందలి ఇతివృత్తము ప్రఖ్యాతమైనచో ప్రధాన పాత్రలకు నాటకకర్త నామకరణము చేయవలసిన అవసరముండదు. ద్వారపాలకాదులను అవసరార్థము కల్పించును కావున ఆ పాత్రలకే పేర్లు పెట్టవలసివచ్చును. ఇక కథ ఉత్పాద్యమే అయినచో మొత్తము అన్ని పాత్రలకును పేరులు నిర్ణయింప వలసినదే. ఈ నామకరణ మహోత్సవమునకు మార్గదర్శకముగా నేర్పరచిన సూత్రములే నామపరిభాష. నాటకకర్తకు రసమునకు ఉపయోగించు విధముగా స్పష్టమైన పేరును ప్రతిపాత్రకు ఉంచవలెను. ఇందు అనుసరింపబడు సంప్రదాయముల క్రోడీకరణ మిది —

వినయంధర బాభ్రవ్య జయంధర జనార్దనాః
కార్యం కంచుకినాం నామ ప్రాయో విశ్వాససూచకమ్॥

వినయంధరుడు, బాభ్రవ్యుడు, జయంధరుడు, జనార్దనుడు - వంటి నామములు విశ్వాససూచకములై కంచుకికి తగియుండును. రాణివాస కావలి అంతఃపురవాసులందు విశ్వాసపాత్రుడును వయోవృద్ధుడునైన అంగరక్షకుడు గదా।

లతాలంకారపుష్పాదివస్తూనాం లలితాత్మనామ్
నామభి ర్గుణసిద్ధైర్వా చేటీనాం నామ కల్పయేత్॥

లతలు పువ్వులు ఆభరణములు మొదలైన సుకుమార వస్తువుల పేర్లతో చేటికలు వ్యవహరింపబడుట ఉచితము. లేదా వారి గుణములకు అనుగుణముగా నామకరణము చేయదగును. బుద్ధిమతిక (ద్రౌపదికి చెలి). తరళిక. మదనిక (కామమతికి చెలికత్తెలు) ఇవి వేణీసంహారమునందు చేటికానామములు. ప్రియంవదానసూయలు శాకుంతలమునందు ఇట్టివి గుణసిద్ధములు.

కరభః కలహంసశ్చేత్యాది నామానుజీవినామ్
కర్పూరచండకాంపిల్యాదికం నామ వందినామ్॥

రాజుగారికి నమ్మినబంటులై నీడవలె అనుసరించు భృత్యులుందురు. రాజు కదలిన కదలుదురు ఆగిన ఆగుదురు. కూర్చున్నచో నిరువంకల నిల్చుందురు. ఇట్టి పాత్రలకు కరభ-కలహంసాది నామములు సుప్రసిద్ధములు. స్తుతిపాఠకులకు

(పంపిసాగరులు) చెప్పినందున—కాంపిల్యాదినామములు సముచితము. బాలరామాయణమున చెప్పబడినది. ప్రతాపరుద్రీయమున (విద్యానాథుడు) కాంపిల్యుడు పేర్కొనబడెను.

సుబుద్ధిసుమత్యాది మంత్రిణాం నామకల్పయేత్
దేవరాతః సోమరాత ఇతి నామ పురోధసః॥
శ్రీవత్సో గౌతమః కౌత్సో గార్గ్యో మౌద్గల్య ఇత్యపి
వసంతకః కాపిలేయ ఇత్యాఖ్యేయో విదూషకః ॥

సుబుద్ధి, సుమతి మొదలగునవి మంత్రులకు, దేవరాతుడు సోమరాతుడు ఇత్యాదులు పురోహితులకు తగినపేర్లు. ఇంక విదూషకునికి శ్రీవత్సుడు, గౌతముడు, కౌత్సుడు, గార్గ్యుడు, మౌద్గల్యుడు, వసంతకుడు, కాపిలేయుడు మొదలగునవి తగిన పేర్లు.

ప్రతాపవీరవిజయమానవిక్రమసాహసైః
వసంతభూషణోత్తంసశేఖరాంకపదోత్తరైః
ధీరోత్తరాణాం నేతృణాం నామ కుర్వీత కోవిదః ॥

ప్రతాప—వీర—విజయ—మాన—విక్రమ—సాహస పదములతో కూడిన పిమ్మట, వసంత—భూషణ—ఉత్తంస—శేఖర—అంక పదము లుత్తర పదములుగా కలపియున్నైన (వీరవసంత, విజయభూషణ, విక్రమాంక) పేరులు ధీరోదాత్త నాయకులకు తగినవి.

చంద్రాపీడః కామపాల ఇత్యాద్యం లలితాత్మనామ్
ఉగ్రవర్మా చండసేన ఇత్యాద్యుద్ధతచేతసామ్॥

ధీరలలితునికి చంద్రాపీడుడు కామపాలుడు మొదలగునవియు, ధీరోద్ధతునికి ఉగ్రవర్మ, చండసేనుడు ఇత్యాదులును అర్హములు.

దత్తసేనాంతనామాని వైశ్యానాం కల్పయేత్సుధీః. దత్త, సేన పదములు అంతమందుగల నామములు (చారుదత్తుడు-ప్రసేనుడు మొ॥వి) ధనికునికి (వైశ్యునికి) తగినవి.

కర్పూరమంజరీ చంద్రలేఖా రాగతరంగికా
పద్మావతీతి ప్రాయేణ నామ్నా వాచ్యా నాయికా॥

కర్పూరమంజరి, చంద్రలేఖ, రాగతరంగిణి, పద్మావతి ఇత్యాదినామములు సాధారణముగా నాయికకు తగును.

దేవ్యస్తు ధారిణీ లక్ష్మీ ర్వసుమత్యాదినామభిః
భోగవతీ కాంతిమతీ కమలా కమలవల్లరీ
ఇరావతీ హంసపదీత్యాదినామ్నా తు భోగినీ

పట్టమహిషిని ధారిణీదేవి, లక్ష్మీదేవి, వసుమతీదేవి - ఇత్యాదిగను భోగ స్త్రీని (ఉంపుడుగత్తె) భోగవతి, కాంతిమతి, కమల, కమలవల్లరి, ఇరావతి, హంసపది (క) మొదలైన పేర్లతోను వ్యవహరించుట చెల్లును.

విప్రక్షత్రవిశః శర్మవర్మదత్తాంతనామభిః—వరుసగా విప్రులు శర్మాంత పదములతోను (నిగమశర్మాదులు), క్షత్రియులు వర్మాంతములతోను, (నాగవర్మ, కృతవర్మేత్యాది). వైశ్యులు దత్తాంతపదములతోను (చారుదత్తాదులు) వ్యవహరింప బడుదురు.

శిఖండాంగదచూడాంతనామ్నా విద్యాధరాధిపాః
యోగసుందరికా వంశప్రభా వికటముద్రికా ॥
శంఖకేయూరికేత్యాదినామ్నా కాపాలికస్త్రియః
కుండలానందఘంటాంతనామ్నా కాపాలికా జనాః ॥

శిఖండ - అంగద - చూడ పదములు అంతమున వచ్చునట్లు విద్యాధర పాత్రలకు పేర్లుపెట్టవలెను. యోగసుందరిక - వంశప్రభ - వికటముద్రిక - శంఖ

కేయూరిక — ఇత్యాది నామములతో కాపాలికాంగనలు వ్యవహరింపబడు టుచితము. కుండల - ఆనంద — ఘంటా - పదములంతమందుగల పేర్లు కాపాలికులకు తగును.

ఆనందినీ సిద్ధిమతీ శ్రీమతీ సర్వమంగళా
యశోవతీ పుత్రవతీత్యాదినామ్నా సువాసినీ ॥

ఆనందిని, సిద్ధిమతి, శ్రీమతి, సర్వమంగళ, యశోవతి, పుత్రవతి - ఇత్యాది నామధేయములు పుణ్యస్త్రీలకు యోగ్యములు.

ఇత్యాది సర్వమాలోచ్య లక్షణం కృతబుద్ధినా
కవినా నిర్మితం కావ్య మాచంద్రార్కం ప్రకాశతే ॥

ఈ విధమైన సంప్రదాయము నుపలక్షించి, ఔచిత్యము నాలోచించి లోక రీతిని పరిశీలించి కవిచే నిర్మింపబడిన కావ్యము సూర్యచంద్రులున్నంతవరకు జీవించియుండును.

(రసార్ణవసుధాకరము, తృతీయవిలాసము, 314-347)

— 0 —

# సంధి సూత్రానుక్రమణిక

**సరళహల్లులు** :- వర్గలలోని చివరి మూడక్షరములు, య-ర-ల-వ-హాలు వీనిని సరళహల్లులు అందురు. (SOFT CONSONANTS)

**పరుషహల్లులు** :- వర్గలలోని తొలి రెండక్షరములు, శ-ష-సలు వీనిని పరుష హల్లులు అందురు. (క-ఖ, చ-ఛ, ట-ఠ, త-థ, ప-ఫ, శ, ష, స) (Hard-Consonants). తెనుగులో పరుష, సరళ సంజ్ఞలకును వీనికిని సంబంధము లేదు.

**గుణము** :- ఇ ఈలు - ఏగా, ఉ ఊలు - ఓగా, ఋ ౠలు - అర్‌గా ఌ ౡలు అల్‌గా మారుట గుణము.

**వృద్ధి** :- అ ఆలు-ఆగా, ఇ ఈ ఏలు-ఐగా, ఉ ఊ ఓలు-ఔగా, ఋ ౠలు-ఆర్‌గా, ఌ ౡలు-ఆల్‌గా మారుట - వృద్ధి.

**ఏకాదేశము** :- పూర్వ పరస్వరములు రెండును పోయి రెంటికిని బదులు ఒక్కటి ఆదేశమగుట (ఏకః పూర్వపరయోః)

## స్వరసంధులు

**ప్రకృతి భావ సంధి** :- ద్వివచనములోనున్న పదము (నామ-క్రియా) చివరి ఈ-ఊ-ఏ లకు ఏయచ్చుపరమైనను సంధి జరుగదు. సంధి జరుగక యథాతథముగ ఉండుటకే ప్రకృతి భావమని పేరు. తే గిరీ + ఆరోహన్తి = తే గిరీ ఆరోహన్తి. (వారు రెండు పర్వతములను ఎక్కుచున్నారు.)

**గుణసంధి** :- అ ఆలకు ఇ-ఉ-ఋ-ఌలు (హ్రస్వ, దీర్ఘములు) పరమగునప్పుడు వరుసగా ఏ-ఓ-అర్-అల్‌లు ఏకాదేశమగును. రామస్య + ఇదమ్-రామస్యేదమ్.

**వృద్ధిసంధి** :- అ ఆలకు ఏ ఐ లు పరమగునప్పుడు ఐకారమును, ఓ ఔలు పరమగునప్పుడు ఔకారమును ఏకాదేశమగును. కృష్ణస్య + ఔదార్యమ్-కృష్ణస్యౌదార్యమ్.

**సవర్ణదీర్ఘసంధి** :- అ-ఇ-ఉ-ఋ-ఌలకు (హ్రస్వ, దీర్ఘములు) వరుసగా సవర్ణమే పరమగునప్పుడు వాని దీర్ఘములు ఏకాదేశమగును. రామ + ఆదయః = రామాదయః.

యణాదేశసంధి :- ఇ-ఉ-ఋ-ఌలకు అసవర్ణమైన అచ్చుపరమగునప్పుడు వరుసగా య్-వ్-ర్-ల్ లు ఆదేశమగును. (ఇది పూర్వ స్వరమునకు ఆదేశమే తప్ప ఏకాదేశము కాదు.)

సు + ఆగతమ్ = స్వాగతమ్. (సు + ఆగతమ్. స్వ్ + ఆగతమ్).

పూర్వరూపసంధి :- పదాంతమందలి ఏ-ఓ లకు అత్తుపరమగునప్పుడు (హ్రస్వమైన అకారము) పూర్వరూపమేకాదేశమగును. పూర్వమందున్న ఏత్వముకాని, ఓత్వముకాని నిలిచి పరమందున్న అత్త్వము మాయమగుననుట.

సూర్యే + అస్తంగతే = సూర్యేఽస్తంగతే. ఇట్టిచోట్ల అవగ్రహము లేక అకార ప్రశ్లేషము (ఽ) ఉండును.

పరరూపసంధి :- పూర్వపద స్వరంబులకు పరస్వరంబేకాదేశ మగుట.

పేచ + అండః = పేచండః (ఏనుగు). పిబ + అన్తి = పిబన్తి. పపా + ఉః = పపుః (మనస్ + ఈషా = మనీషాదులందు విశేషము).

అయవాదేశసంధి :- అచ్చుపరమగునప్పుడు శబ్దాంతమందలి (పదము, ప్రాతిపదిక, ధాతువు) ఏ-ఓలు అయ్, అవ్‌లుగాను, ఐ,ఔలు ఆయ్-ఆవ్‌లుగాను మారును.

ఊపౌ + అయమ్ = భూపావయమ్, నై + అకః = నాయకః. భో + అ + తి = భవ్ + అ + తి = భవతి. (పూర్వరూపసంధి జరుగని తావులందే ఈ సంధి జరుగునని గుర్తింపవలెను.)

యవలోపసంధి :- ఏ ఓ ఐ ఔలు అయవాదేశ సంధిని పొందిన పిమ్మట నేర్పడిన య్-వ్ లు వికల్పముగా లోపించును. ఇట్లు లోపించిన తరువాత అచ్చునకు అచ్చుపరమగా నున్నప్పటికిని మరింకే స్వరసంధియు జరుగదు.

మన్యతే + ఆత్మానమ్ = మన్యతయ్ + ఆత్మానమ్ = మన్యతఆత్మానమ్. మన్యతయాత్మానమ్.

## హల్సంధులు

చర్త్వసంధి (పరుషాదేశసంధి) :- పరుష హల్లు పరమగునపుడు పూర్వమందున్న సరళహల్లు (అనునాసికము తప్ప) తాను తన వర్గ ప్రథమాక్షరముగా మారును.

కకుభ్ + ప్రాంత = కకుప్ప్రాంత, దృశద్ + పతతి = దృశత్పతతి.

జశ్త్వసంధి (సరళాదేశసంధి) :- అచ్చుగాని, సరళ హల్లుగాని పరమగు నప్పుడు (అనునాసికముతప్ప) పూర్వమందున్న పరుషహల్లు తాను తన వర్గ తృతీయాక్షరముగా మారును

వాక్ + ఈశః = వాగీశః, సదత్ + గోదావరీ = సదద్గోదావరీ.

అనునాసికాదేశసంధి :- అనునాసికము పరమగునపుడు శబ్దాంతమందలి వర్గ హల్లు తాను తనవర్గ పంచమాక్షముగా మారును. ఇది వికల్పసంధి. కావున నిది జరుగ నప్పుడు జశ్త్వసంధి ప్రవర్తించును. పరమైన అనునాసికము ప్రత్యయ సంబంధి అయినచో ఈ సంధి నిత్యముగా జరుగును.

హసత్ + నారీ = హసన్నారీ, హసద్నారీ, వాక్ + మయమ్=వాఙ్మయమ్.

శ్చుత్వసంధి :- శకార చవర్గీయాక్షరములు (శ్చు) పరమగునప్పుడు పూర్వమందున్న సకార తవర్గీయాక్షరములు (స్తు) తాము క్రమమున శకార చవర్గీయాక్షరములుగా (శ్చు) మారును.

మనస్ + శాంతిః=మనశ్శాంతిః, ఏతత్ + చిత్రమ్=ఏతచ్చిత్రమ్.సత్ + జనః (సద్ + జనః-సరళాదేశ) = సజ్జనః. అరీన్ + జయతి = అరీఞ్జయతి.

ష్టుత్వసంధి :- షకార టవర్గీయాక్షరములు పరమగునపుడు (ష్టు) పూర్వమందలి సకార తవర్గీయాక్షరములు (స్తు) తాము క్రమమున షకార టవర్గీయాక్షరములుగా (ష్టు) మారును.

చతుస్ + షష్టిః = చతుష్షష్టిః, రటత్ + డమరుః = (రటద్ + డమరుః) = రటడ్డమరుః.

లాదేశసంధి :- లకారము పరమగునప్పుడు పూర్వమందలి తవర్గీయాక్షరము తాను లకారముగా మారును.

భగవత్ + లీలా=భగవల్లీలా.

నకారము అనునాసికలకారముగా_అస్మిన్ + లోకే = అస్మిꣳల్లోకే—మారును.

అనునాసిక ద్విత్వసంధి (ఙముడాగమసంధి) :- హ్రస్వాచ్చు పూర్వమందుగల అనునాసికము (ఙ-ణ-న=ఙమ్) అచ్చుపరమగునప్పుడు ద్విత్వమును పొందును.

పతన్ + అంబరాత్ = పతన్నంబరాత్.
హే గుణిన్ + ఏహి = హే గుణిన్నేహి. [ఙ, ణ, నలకే ఈ సంధి]

కుత్వసంధి :- పరుషహల్లు పరమగునప్పుడు పూర్వమందలి చకారము కకారముగా మారును.

ముచ్ + త = ముక్తః = విడువబడినవాడు.

తుగాగమసంధి :- అచ్చునకు పరమైన ఛకారము "చ్ఛ"కారముగా మారును అనగా తకారము [తుక్] ఆగమమై అది చకారముగా మారినదనుట.

వృక్ష + ఛాయా = వృక్ష + త్ + ఛాయా = వృక్షచ్ఛాయా. దీర్ఘాచ్చుపై ఈ మార్పు వికల్పము, లక్ష్మీ + ఛాయా = లక్ష్మీచ్ఛాయా, లక్ష్మీఛాయా. కాని ఆ – మా లపై [ఆఙ్ మాఙ్ – ఇవి దీర్ఘములే అయినను] ఈ మార్పు నిత్యము.

ఆ + ఛాదితమ్ = ఆచ్ఛాదితమ్, : మా – ఛేత్తుమర్హసి = మాచ్ఛేత్తుమర్హసి.

తాంస్తాన్ సంధి :- చఛ, తథ, [ట, ఠ]లు పరమగునప్పుడు పూర్వపదాంతమందలి నకారము అనుస్వార సకారములుగా మారును.

తాన్ + తాన్ = తాంస్తాన్. మక్షికాన్ + చాలయసి = మక్షికాంస్ + చాలయసి – శషసాదేశసంధి = మక్షికాంశ్చాలయసి. [ఈగలను తోలుకొనుచున్నావు]. సకారము శకారముగా మారుట శషసాదేశసంధివలన.

అనుస్వారసంధి :- శబ్దాంతమందలి మకారము హల్లు పరమగునప్పుడు అనుస్వారమగుచుండును. కొన్నిచోట్ల పరసవర్ణమునగును. గురుమ్ + వందే = గురుం వందే. అచ్చు పరమగునప్పుడు దానితో కలిసిపోవును. వాక్యాంతమునందు మారదు.

గురుమ్ + అభివంద్య = గురుమభివంద్య. వందే మాతరమ్.

ఢ్రలోపదీర్ఘసంధి :- ఢకారమునకు ఢకారము పరమైనప్పుడును, రకారమునకు రకారము పరమైనప్పుడును మొదటి ఢకార - రకారములు లోపించి వానికి ముందున్న అ-ఇ-ఉ లకు దీర్ఘము వచ్చును. లిఢ్ + ఢః = లీఢః.

స్వర్ + రాజ్యమ్ = స్వారాజ్యమ్. ధూర్జటిర్ + రక్షతి = ధూర్జటీరక్షతి. చక్షుర్ + రాజీవయుగమ్=చక్షూరాజీవయుగమ్. ధనుర్ + రావః = ధనూరావః. [ఇట రేఫాదేశ విసర్గసంధి జరిగిన పిదప ఈ సంధి జరిగినది..]

ఛాదేశసంధి :- శబ్దాంతమందలి వర్గహల్లునకు [అనునాసికము తప్ప] పరమైన శకారము ఛకారముగా మారును. ఇట్టియెడల ఈ శకారము అచ్చుతోగాని, అనునాసికముతోగాని, యరవలతోగాని కలిసియుండవలెను.

విద్యుత్ + శక్తిః = విద్యుత్ + ఛక్తిః - ఇప్పుడు శ్చుత్వసంధితో తకారము చకారమగును. విద్యుచ్ఛక్తిః. తత్ + శాంతిః = తచ్ఛాంతిః.

అంత్యోష్మసంధి (ఝయాదేశసంధి) :- వర్గహల్లునకు [అనునాసికముతప్ప] పరమైన హకారము అదే వర్గకు చెందిన చతుర్థాక్షరముగా మారును. ఇది వికల్పసంధి.

వాక్ + హంసః - జశ్త్వాదేశసంధి - వాగ్ + హంసః = వాగ్ + ఘంసః, వాగ్ఘంసః. వాగ్హంసః. కకుప్ + హస్తీ = కకుబ్ + హస్తీ = కకుబ్ + భస్తీ = కకుబ్భస్తీ, కకుబ్హస్తీ. [దిగ్గజము] శ ష స హ అను ఊష్మాక్షరము లలో చివరిదైన హకారమునకు జరుగుచున్నది కావున ఇది అంత్యోష్మసంధి.

## విసర్గ సంధులు

[సకారము విసర్గమగుట, విసర్గము సకారమగుట సర్వసాధారణము. కావున ఈ ప్రకరణమున ఆ రెండింటికి అభేదము]

ఉత్వాదేశ విసర్గసంధి -: హ్రస్వమైన అకారము పూర్వమందుగల విసర్గము మరల హ్రస్వమైన అకారమేగాని, వరళహల్లుగాని పరమగునప్పుడు తాను ఉత్వముగా మారి తనముందున్న అత్వముతో గుణసంధిని పొందును,

వృక్షః + అయమ్ = వృక్ష + ఉ + అయమ్ = గుణసంధి = వృక్షో + అయమ్ - పూర్వరూపసంధి - వృక్షోఽయమ్. శివోఽగ్రమ్.

నృపః + జయతి = నృప + ఉ + జయతి = గుణసంధి = నృపో + జయతి = నృపోజయతి.

మనస్ + ధైర్యమ్ = మన + ఉ + ధైర్యమ్ = గుణసంధి = మనోధైర్యమ్.

**విసర్గలోపసంధి :-** 1] హ్రస్వమైన అకారము పూర్వమందుగల విసర్గము హ్రస్వమైన అకారముకంటె భిన్నమైన [వేఱైన] ఏ అచ్చు పరమగుచున్నను లోపించును.

బుధః + ఇచ్ఛతి = బుధ ఇచ్ఛతి.

2] దీర్ఘమైన అకారము పూర్వమందుగల విసర్గము అచ్చుగాని, సరళ హల్లుగాని పరమగునప్పుడు లోపించును.

వృక్షాః + అత్ర = వృక్షా అత్ర.

ఘటాః + గచ్ఛంతి = ఘటా గచ్ఛంతి.

**రేఫాదేశ విసర్గసంధి :-** అ ఆ ల కంటె భిన్నమైన అచ్చు పూర్వమందుగల విసర్గము [సకారము] అచ్చుగాని. సరళ హల్లుగాని పరమగుచున్నప్పుడు రేఫముగా మారును.

ధనుస్ + అగ్రమ్ = ధనురగ్రమ్: ఆశీః + వాదః = ఆశీర్వాదః: శ్లోకైః + దత్తః శ్లోకైర్దత్తః.

**శషసాదేశసంధి :-** చ ఛ లు పరమగునపుడు శకారముగను. ట ఠ లు పరమగునపుడు షకారముగను, త థ లు పరమగునపుడు సకారముగను విసర్గము మారును.

శిరః + చాలనమ్ = శిరశ్చాలనమ్; ధనుస్ + టంకారః = ధనుష్టంకారః; మనః + తాపః = మనస్తాపః.

శ ష స లే పరమగునపుడు విసర్గము శ ష స లుగా మారుటో లేక విసర్గముగానే ఉండుటో జరుగును.

మనః + శాంతిః = మనశ్శాంతిః, మనఃశాంతిః, సర్పిః + షండః = సర్పిష్షండః, సర్పిఃషండః, ఉరస్ + సంఘపః = ఉరస్సంఘపః, ఉరః సంఘపః.

తదేతద్విసర్గసంధి :- హల్లు పరముగునున్నప్పుడు వాక్యమునందు సః ఏషః అనువాని విసర్గము లోపించును.

సః + పురుషః = స పురుషః, ఏషః + రాజా = ఏష రాజా. ఇట్లే సంబోధనార్థకమగు భోస్ అను దానియందును, భోస్ + భోస్ + యోధాః = భో భో యోధాః।

సూచన :- ఇవి దిక్ప్రదర్శకములు, విస్తరము పాణినీయమువలన గ్రహింపునది.

—0—

# శ్లోకానుక్రమణిక

## శ

| శ్లోకము | పుట | తరంగము | సంఖ్య |
|---|---|---|---|
| నేతూపక్రమ సంభ్రమా | 721 | 7 | 84 |
| నేతూద్యోగే సపది | 651 | 7 | 21 |
| సోఽయం కైలాస శైలః | 677 | 7 | 45 |
| స్తోకోన్నిద్రనిదాఘ | 313 | 4 | 1 |
| స్త్రీషు ప్రవీరజననీ | 367 | 4 | 33 |
| స్థానేషు శిష్య | 129 | 2 | 9 |
| స్ఫురతి పురతో | 201 | 2 | 69 |
| స్మరన్తి లోకార్థమమీ | 252 | 3 | 17 |
| స్మరపరిభవ | 661 | 7 | 32 |
| స్మేరా దిశః కుముద | 218 | 2 | 83 |
| స్యాతాం నామ కపీంద్ర | 284 | 3 | 39 |
| స్యాదేవతోయ మమృత | 641 | 7 | 13 |
| స్వచ్ఛందైక స్తన | 668 | 7 | 38 |
| స్వతనురుచిభిః | 587 | 6 | 35 |
| స్వపాణిప్రాగ్భార | 733 | 7 | 94 |
| స్వర్విష్ణు ప్రసరేణ | 502 | 5 | 49 |
| స్వవపుషి నఖలక్ష్మ | 464 | 5 | 23 |
| స్వేదజలపిచ్ఛిలా | 748 | 7 | 106 |
| స్వేదార్ద్రవామకుచ | 663 | 7 | 39 |
| స్వేషూత్కృత్యహతేషు | 577 | 6 | 43 |
| హస్తే కరిష్యతి | 241 | 3 | 8 |
| హిమాలయోత్సంగ | 768 | 7 | 125 |
| హుతమిష్టం చ తపం చ | 33 | 1 | 17 |

